ఈ శతాబ్దం ఆరంభంలో సాహిత్య పునరుజ్జీవన యుగ వైతాళికులుగా మహాకవి త్రయం ఆవిర్భవించడంతో మలయాళ సాహిత్య చేతనలో అపూర్వమైన నూతన వికాసం గోచరించింది. ఆ మహా కవి త్రయం : కుమారన్ అశాన్, వళ్ళత్తోళ్ నారాయణ మేనోన్, ఉళ్లూర్ పరమేశ్వర అయ్యర్. ఉపాధ్యాయుడుగా మొదట జీవితం ఆరంభించిన ఉళ్ళూర్ అధికారిక పదవీ నిశ్రేణిక మెట్లు ఎక్కి ఎక్కి, చివరికి తిరువాన్కూరు ప్రభుత్వంలో సర్వోచ్చ పదవి అధిరోహించారు. 1937 లో తిరువాన్కూరు మహారాజా ఆయనకు 'మహాకవి' బిరుద ప్రదానం చేశారు. ఆధునిక భారతీయ మహాకవుల్లో ఒకరుగా ఎన్నదగిన ఉళ్ళూర్ సాంప్రదాయిక కవితలోని గాంభీర్యానికీ, కాల్పనిక కవితలోని వైవిధ్యానికి చక్కని సమన్వయం సాధించారు. తన గద్య, పద్య రచనల ద్వారా కేరళ ప్రజల అంతశ్చేతనను ఆయన కేరళ దేశ ప్రాచీన చరిత్ర తోనూ, భారత దేశ ప్రాచీన చరిత్రతోనూ ఏకీకరించ గలిగారు.

కాలికట్ యూనివర్సిటీకి కొంత కాలం పాటు ప్రో-వైస్-చాన్సలర్‌గా ఉండి ప్రస్తుతం మలయాళం ప్రొఫెసర్‌గా పని చేస్తున్న ప్రొ. సుకుమార్ అళీకోడ్ ఉళ్ళూర్ మీది ఈ చిన్న పుస్తకంలో వ్యక్తిగత మైన ఆయన మహత్త్వం పూర్వ రంగంగా బహుముఖ మైన ఆయన సాహితీ సేవను సింహావలోకనం చేశారు.

ముఖ పత్ర రచన : సత్యజిత్ రాయ్

వెల : SAHITYA AKADEMI
REVISED PRICE Rs 10-00

# ఆచార్య సూక్తి ముక్తావళి

రచన :
శ్రీమాన్ నంబూరి కేశవాచార్యులు

ప్రకటన :
పండిత శ్రీ జములినవ్యాశాఖవారు

ప్రస్తుత ముద్రణ : స్వస్తిశ్రీ పరీధావి సంవత్సర
చైత్ర శుద్ధ ౧ గురువారము. (16-3-72)

ప్రతులు : 2000



*Present Edition*: 1972—2000 Copies


## కృతజ్ఞతలు

ఈ గ్రంథ ముద్రణకు
ద్రవ్యసహాయ మొనర్చిన
పారమార్థిక మహాజనులకు
ధర్మ సంస్థలకు—వారి సభ్యులకు
అనేకవిధముల వాక్సహాయ మొనర్చిన
మిత్రశేఖరులకు
సలహాలనిచ్చిన పెద్దలకు
ముఖచిత్రము గీసియిచ్చిన
దాసరి నాగవర్ధనరావు (గుంటూరు) గారికి
మా కృతజ్ఞతాపూర్వక
వందనములు.

Printed at Anuradha Acchagam, 146, T. H. Road, Madras-21.

# ముద్రణకు సహాయులు

**మద్రాసు :**

| | | రు. |
|---|---|---|
| 1. | ధర్మమూర్తి రా॥ బ॥ కలవల కన్నన్‌శ్రేష్ఠి చారిటీస్ | 1001_00 |
| 2 | కలిమిడి నంబెరుమాళ్లుశెట్టి చారిటీస్ | 1001_00 |
| 3. | ఉప్పుటూరి ఆళ్వార్ శెట్టి చారిటీస్ | 500_00 |
| 4. | లింగంశెట్టి యతీంద్రులశెట్టి చారిటీస్ | 1000_00 |
| 5. | పప్పిశెట్టి రాఘవశెట్టి చారిటీస్ | 500_00 |
| 6. | ఆర్. పద్మనాభంశెట్టిచారిటీస్‌గారు | 116_00 |
| 7. | కాకుమాను ఆదికేశవులుశెట్టి చారిటీస్ | 500_00 |
| 8. | మొగిలి రాధాకృష్ణశెట్టి చారిటీస్ | 116_00 |
| 9. | బైసాని మాధవశెట్టి ట్రస్టు ఫండు | 500_00 |
| 10. | ముక్కాల వెంకట కన్నయ్యశెట్టి చారిటీస్ | 251_00 |
| 11. | కర్జన్ కంపెనీ శేషాచలం చిమటా ఫౌండేషన్ | 101_00 |
| 12 | గంధవడి శ్రీరాములుశెట్టి అండ్ సన్సు | 100_00 |
| 13. | పెరుమాళ్ అండ్ కంపెనీ | 200-00 |
| 14. | శ్రీ కన్యకాపరమేశ్వరీ దేవస్థానం చారిటీస్ | 200-00 |
| 15. | కోటతేవప్పెరుమాళ్ళయ్యచారిటీస్ | 250-00 |
| 16. | శ్రీ వెంకటేశ్వర సుప్రభాతగోష్ఠి | 250-00 |
| 17. | గుగ్గిలం ఆదినారాయణగుప్త చారిటీస్ | 150-00 |

**గుంటూరు :**

| | | |
|---|---|---|
| 1. | కర్పూరపు వెంకటనారాయణగారు (కీర్తిశేషః) | 200_00 |
| 2. | శ్రీరామా వైశ్య సత్ర సంఘము | 250_00 |
| 3. | కమర్షియల్ కార్పొరేషన్ | 250_00 |
| 4. | పోలిశెట్టి సోమసుందరం ట్రస్టు | 500_00 |
| 5. | నిత్యానందాశ్రమము–చేబ్రోలు | 116_00 |

| తెనాలి : | రు. |
|---|---|
| 1. శ్రీ కన్యకాపరమేశ్వరీ దేవస్థానము సత్రం కమిటీ | |
| 2. శ్రీ కన్యకాపరమేశ్వరీ వైశ్య విద్యానిధి | 500_00 |
| 3. శ్రీ కన్యకాపరమేశ్వరీ గ్రంథాలయ సంఘము | |

**సికింద్రాబాదు :**

| | |
|---|---|
| 1. దండు ట్రస్టు | 500_00 |
| 2. అకుల రాజయ్యగుప్తగారు | 116_00 |
| 3. ఒక అభిమానిగారు | 116_00 |
| 4 ఉప్పు లింగయ్యగారు | 251_00 |
| 5 గోలి ఈశ్వరయ్యగారు | 251_00 |
| 6. సంబూరు కృష్ణమూర్తిగారు | 116_00 |
| 7. బాశెట్టి విశ్వనాథంగుప్తగారు | 116_00 |
| 8. బూరుగు మహదేవ్‌గారు | 116_00 |

**హైదరాబాదు :**

| | |
|---|---|
| 1. ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ | 116_00 |

**విజయవాడ :**

| | |
|---|---|
| 1. విజయవాడ ఐరన్ అండ్ హార్డువేర్ మర్చంట్సు అసోసియేషన్ | 116_00 |
| 2. తాడికొండ వెంకటసుబ్బారావు | 116_00 |
| 3. కూరపాటి రామారావు | 116-00 |
| 4. మైసూరుఫర్టిలైజర్సు | 116-00 |

**చీరాల :**

| | |
|---|---|
| 1. వి. జే. రంగనాయకులు చారిటీస్ | 250_00 |
| 2. చీరాల విజ్ఞాన నిధి | 400_00 |
| 3 శ్రీ కన్యకాపరమేశ్వరీ దేవస్థానము | 116_00 |

ఏలూరు :

1. సిద్ధాంతి శిరోమణి పండిత దోగుపర్తి స్వామిగుప్తగారు 116-00

తిరువన్నామల :

1. యం. శ్రీరాములు శెట్టిగారు 116.00

నర్సరావుపేట :

1. ఆర్యవైశ్యసంఘము 250.00
2. మద్ది వెంకటగోపాలంగారు 116.00
3. కొత్తూరు వెంకటేశ్వర్లు & వంకాయల మల్లయ్యగారు 116.00

31–10–72

# ఆచార్య సూక్తి ముక్తావళి

## విషయసూచిక


పూర్వభాగము - ప్రథమోల్లాసము :

1 పొయ్‌గై పూదప్పేయాళ్వారుల వైభవము .... 3
2. తిరుమళిశై యాళ్వారుల వైభవము .... 5
3. కులశేఖరాళ్వారుల వైభవము .... 16

ద్వితీయోల్లాసము :

4 పెరియాళ్వార్ల వైభవము .... 21
5. చూడికుడుత్తనాచ్చియారు వైభవము .... 25
6. తొండరడిప్పొడి యాళ్వారుల వైభవము .... 29

తృతీయోల్లాసము :

7. ధర్మవర్మ్మడను రాజు కొమార్తె వైభవము .... 49
8. తిరుప్పాణియాళ్వారుల వైభవము .. 51
9. తిరుమంగై యాళ్వారుల వైభవము .. 53

చతుర్థోల్లాసము :

10. నమ్మాళ్వార్ల వైభవము .... 71
11. శ్రీమన్నాథమునుల వైభవము .... 79
12. పుండరీకాక్షుల (ఉయ్యక్కొండారు) వైభవము ... 91
13 ఆళవందారుల వైభవము .... 93

పంచమోల్లాసము :

14. శ్రీ రామానుజాచార్య (ఉడైయవరుల) వైభవము .... 107

షష్ఠోల్లాసము :

15. శ్రీ వైష్ణవుల లక్షణము .... 109
16. కూరేశ దాశరథులకు జరమోపదేశము ... 140
17. జలజంతు మోక్ష ప్రదానము . 141
18. అత్తుళాయమ్మ వైభవము .... 151
19. గోష్ఠీ పరిపూర్ణ పత్నీ పుత్రీ వైభవము .... 154

మధ్యమ భాగము :

ప్రథమోల్లాసము (ఉడైయవరుల వైభవము) .... 157
ద్వితీయోల్లాసము .. .. 163

తృతీయోల్లాసము (ఉడైయవరుల వైభవము) .... 172
చతుర్థోల్లాసము .. .... 197
పంచమోల్లాసము .. .... 212
షష్ఠోల్లాసము .. .... 231
సప్తమోల్లాసము .. .... 247
అష్టమోల్లాసము .. .... 260
నవమోల్లాసము .. .... 272
20. ఢిల్లీ విజయము .. ....
దశమోల్లాసము .. .... 293
ఏకాదశోల్లాసము .. .... 312
ద్వాదశోల్లాసము .. .... 328

ఉత్తర భాగము - ప్రథమోల్లాసము :

21. శ్రీ భట్టరువారి వైభవము .... 356

ద్వితీయోల్లాసము :

22. నంజియ్యాయుగారి వైభవము .... 383

తృతీయోల్లాసము :

23 పెరియ వాచ్చాంబిళ్ళగారి వైభవము .... 415
24 అళగియ మణవాళ ప్పెరుమాళ్ వైభవము .... 421
25. పిళ్ళలోకాచార్యుల వైభవము .... 425

చతుర్థోల్లాసము :

26. మణవాళ మహామునుల వైభవము .... 435

పంచమోల్లాసము :

27. ఆళ్వారాదుల జన్మస్థల వంశ ప్రబంధాదులు .... 545

షష్ఠోల్లాసము :

28. వేదాంతదేశికుల వైభవము .... 563
29 నయనారుదేశికుల (వరదాచార్యుల) వైభవము .... 592
30. ప్రతివాది భయంకరం అణ్ణంగారి వైభవము .... 597
31 ఏకాదశీ నిర్ణయము ... 607
32. ఆచార్య జన్మనక్షత్ర నిర్ణయము .... 614
33. ధనుర్మాస హరిపూజా విధానము .... 614
34. గ్రంథకర్తృ (నంబూరు కేశవాచార్యుల) వృత్తాంతము .... 621

శ్రీమతే రామానుజాయ నమః



# ఆ చా ర్య సూ క్తి ము క్తా వ ళి

## పూ ర్వ భా గ ము

---

### ప్ర థ మో ల్లా స ము

శ్రీమద్భూతపురీశ! కేశవ నివే • శీభూత హృత్పద్మ! ని
ష్కామావేశ! పరాశరాదిక మునీ • శశ్రేష్ఠవాగ్వంశ ని
స్సీమ ప్రాభవ రంగరాజ పదను • స్థేమప్రకాశా! యతీ
శా! మాణిక్యమయత్రిదండకరదే • శా! కేశవార్యాత్మజా! 1

వ. అవధరింపుము, 2

సీ. శ్రీదేవి యురమునఁ • జెన్నొంద భూ నీళ, లిరుగెలంకులఁ దన • కింపు సలుప
నహమన్నమహమన్న • మనుచుసూరులుగొల్వఁ, బరమపదమునందుఁ • బరమగురుఁడు
నారాయణుఁడుముందు • పేరోలగంబుండి, మంత్రరత్నం బగ్ర • మహిషి కొసఁగె
ద్వయ మది సిరియు వి • ష్వక్సేనులకు నిచ్చె, నమ్మంత్ర మతఁడు శ • ఠారి కొసఁగె

తే. నమ్మహాత్మునిచరితామృ • తాబ్ధియందుఁ, జిత్తమా నీవు నోలాడి • చెంది సుఖము
పదుగురార్యులఁ దలఁపు మీ • భక్తి ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర. 3

వ. శ్రీదేవీనాయకుండును శ్రీవైకుంఠనికేతనుండును శ్రీమదనంతగరుడవిష్వక్సేనాది నిత్యసూరిపరిషన్నిషేవ్యమానుండును నవాప్తసమస్తకాముండును ననంతకల్యాణగుణపరిపూర్ణుండును నగు సర్వేశ్వరుండు సకలజగద్ధితానుశాసనప్రవృత్తంబులగు నిఖిలనిగమాంతసహస్రంబులచేఁ బ్రతిపాదితంబయి యత్యర్కానలదీప్తంబయి స్వయంప్రకాశం బై దేవదానవాది సర్వప్రాణి దుష్ప్రేక్షం బయి నానావిధోద్యానసహస్రసంపన్నం బయి నిర్మలోదక పద్మినీశతసహస్రవిభ్రాజితంబయి నిరయప్రాయస్వేతర సమస్తలోకోత్కృష్టం బయి కాలపరిపాకదూరం బయి సావరణానంతబ్రహ్మాండకోశబహిర్భూతం బై పరవ్యోమశబ్దాభిధేయం బై త్రిపా

ద్విభూతిసంజ్ఞితం బై యపునరావృత్తిలక్షణం బగుపరమపదంబునందు దివ్యరత్నమయ ప్రప్రాకారగోపుర సౌధప్రాసాదవిమాన శతసహస్రవిరాజితం బయి మణితోరణవిచిత్రధ్వజపతాకాంచితం బయి వైశ్వానరకోటివిరాజమాన గృహపఙ్క్తివిరాజితంబగు నిత్యనిరవద్యనిరతిశయ శ్రీవైకుంఠపురంబునందు దివ్యరత్నమయస్తంభసాహస్రగుంభితం బయి హిరణ్మయంబగు తిరుమామణిమంటపంబునందుఁ గోటిసూర్య ప్రతీకాశప్రభామండలమండితులును బూర్ణచంద్రాయుతాది ప్రసన్నదివ్యమంగళ విగ్రహవిశిష్టులును సంసారబంధవిముక్తులు నగు ననంతాసంఖ్యాత ముక్తపురుషులచే విరాజమానం బగు సభామండలమధ్యంబునందు శేషఫణాసహస్రదివ్యరత్నవిరాజమాన కిరీటాదినూపురాంత సమస్తదివ్యభూషణ భూషిత దివ్యమంగళ విగ్రహవిశిష్టుండై యనంతభోగి దివ్యసింహాసనాసీనుండై శ్రీభూనీళాదిదేవీసహస్రపరివృతుండయి యస్థానరక్షావ్యసనశంఖచక్రగదా శార్ఙ్గనందకాదిదివ్యాయుధశతసహస్ర పరిషేవ్యమానుండైన నారాయణుండనంతగరుడవిష్వక్సేనాదులట్లు సంసారముక్తులచందంబున సంసారిచేతనులు నన్ననుభవించి యనుభవ జనితప్రీతికారితాశేషావస్థోచితా శేషశేషతైకరతిరూప నిత్యనిరవద్యనిరతిశయానందరూపమత్కైంకర్యమహాసంపద లభించి సుఖించుటకుం బ్రాప్తి గలిగియుండనిమ్మహాసంపద్విరహితు లయి యుండిరి గదాయని మిగులవ్యాకులితాంతఃకరణుం డై స్వకైంకర్యోపయుక్తంబుగా వారలకుం గరణకళేబరప్రదానం బొనర్చిన వారును నదీతరణార్థం బొసంగినప్లవంబుఁ గైకొనియద్దరింజెందలేక ప్రవాహవేగంబున సముద్రంబునం బడినజడులగతి నక్కరణకళేబరంబులు విషయప్రవణంబులుగా నొనర్చి కర్మప్రవాహరయంబున జన్మజలధింబడి చెడి తన్నుం జెందలేక యున్నంత శాసనాచ్ఛాస్త్ర మ్మనెడుక్రమంబున వేదరూపశాస్త్రం బొసంగిన నం దప్రతిపత్తి విప్రతిపత్త్యన్యథాప్రతిపత్తిరూపాజ్ఞానపరీతచిత్తులై ప్రామాణ్యం బంగీకరింపక సమర్థుండను స్రక్చందనవనితాది సకలభోగంబులు గలవాఁడను కృతకృత్యుండను బలవంతుండను సకలసుఖంబులు గలవాఁడ నాఢ్యుండ నాభిజాత్యంబు గలవాఁడ నాతో సమానుండెవ్వండు గలఁడని స్వస్వాతంత్ర్యరూపాత్మాపహార మహాపాపం బొనర్చి యనాదికర్మవాసనాదోషదూషితాంతఃకరణులయి యవిధేయప్రవృత్తులై యుండం జూచి పరమకారుణికుం డగు భగవంతుం డుర్వియందు రామకృష్ణాద్యవతారంబు లొనర్ప నాసంసారిచేతను లాసురభావంబునఁ బ్రతిపత్తి సలుప కధోగతి కభిముఖు లయి యుండం గనుంగొని నారాయణుండు శ్రీవత్సకౌస్తుభ వైజయంతీవనమాలా పంచాయుధానంత గరుడ

విష్వక్సేనాది నిత్యసూరులం జూచి మీర లేఁగి భూమండలంబున ద్రవిడభూభాగం బునఁ గావేరీతీరంబునఁ దామ్రపర్ణీతటంబున వేగవతీకూలంబున బాహుదాన మీపంబునం దభిమతవర్షంబులం దవతరించి సర్వచేతనోద్ధారణంబుఁ జేయుం డని నియోగింప వార లేతెంచి భగవదాజ్ఞ శిరసావహించి సరోభూతమహదా హ్వయాదిదివ్యనామంబుల నాళ్వారు లయి యవతరించి సర్వాధికారంబుగా ద్రవిడవేదంబుల సాంగోపాంగంబులుగా సర్వలోకోపకారార్థంబుగా వార లొన ర్చిరి. ఆక్రమంబెట్టి దనిన వివరించెద నని యానతిచ్చి మఱియు వాదిభీకరగురుం డి ట్లనియె. 4

## పొయ్గై పూదప్పేయాళ్వారుల ప్రభావము

పొయ్గై-త—శ్లో॥ కాఞ్చ్యాం సరసి హేమాబ్జే జాతం కాసారయోగినమ్।
కలయే య శ్శ్రియఃపతుఃరరవిన్ద మకల్పయత్॥

పూద-త—శ్లో॥ మల్లాపురవరాధీశం మాధవీకుసుమోద్భవమ్।
భూతం నమామి యో విష్ణో ర్జ్ఞానదీప మకల్పయత్॥

పేయా-త—శ్లో॥ తులాశతభిషగ్జాతం మయూరపురి కైరవాత్।
మహాన్తం మహదాఖ్యాతం వన్దే శ్రీనన్దకాంశకమ్॥
పద్మారమణపాదాబ్జప్రేమభ్రాన్త్యా మనోజ్ఞయా।
భ్రాన్తయోగీతివిఖ్యాతం మునిం వన్దే గుణామ్బుధిమ్॥

సీ. ముందువేల్పులపెద్ద • మొదమొప్పనెవ్వోట, హయిమేధమొనరించి • హరినిఁగాంచె
సత్యవ్రతక్షేత్ర • సంజ్ఞనేపురి చెంది, సకలపాపము లెందు • సమసిచనునా
యట్టికాంచీపురి • నతిపావనం బైన, యొకసరోవరమున • వికచహేమ
సరసిజమునఁ బొంచ • జన్యాంశమునఁ దులా, శ్రవణమునందుఁ గా•సారయోగి

తే. యవతరించెను జ్ఞానభ•క్త్యాదిజలధి, తనకు దాస్యము సల్పుచే•తనుల కెల్లఁ
బరమహితము లొనర్చు నీ•ధరణి ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర. 5

సీ. ముం దబ్ధితీరము • నందుఁ దులాశ్రవి, ష్ఠాదాశయం దతి • వారుమల్ల
పురియందు మాధవీ • పుష్పమువలనను, గౌమోదకీమూర్తి • ఘనుఁడు భూత

యోగీంద్రుఁ డుదయించె ♦ నుర్వి న ట్లానెల, శతభిషగాఖ్యన ♦ క్షత్రమందు
నలమయూరపురంబు ♦ నం దొక్క సరసిలో, పరకైరవప్రస ♦ వంబువలన

తే. నతులనందకమూర్తియై ♦ యవతరించి, భ్రాంతుఁడని తన్నుజనులనఁ♦బరమభక్తి
దివ్యమహదాఖ్యయోగి ప ♦ ర్థిల్లె ననుచు, వాదిభీకరగురుఁ డనె ♦ మోదమలర. 6

సీ. ఇట్లయోనిజులుగా ♦ నిలఁ బుష్పములయందు, దివ్యాంశములఁ బుట్టి ♦ తేజరిలిరి
భగవదనుగ్రహ ♦ ప్రాప్తదివ్యజ్ఞాన, భక్తివైరాగ్యసం ♦ పత్తి గలిగి
స్వస్వరూపజ్ఞాన ♦ సంపన్నులై యొక్క, రొకరి నెఱుంగక ♦ యుర్వియందుఁ
బవలున్నచోటను ♦ బహువాసరము లుండ, రా దని గ్రామైక ♦ రాత్రు లగుచు

తే. సంచరించుచు ముప్వురా ♦ సత్త్వనిధులు, కూడి రొకరాతిరిని దిరు♦క్కోవలూరఁ
జిన్నదై నట్టియొకపంచ ♦ తిన్నె ననుచు, వాదిభీకరగురుఁ డనె ♦ మోదమలర. 7

సీ. మొదట సరోయోగి♦ముదమొప్పఁ జనుదెంచి, యాతిన్నెపై నున్న♦యంత భూత
యోగీంద్రుఁ డేతెంచి ♦ యొంటి నీరేయి మీ, రిచ్చోటఁ బండితి ♦ రెవ్వ రనిన
హరిసేవకులము మే♦మయ్య మీరెవ్వరో, యని సరోయోగీంద్రుఁ ♦ డతనికనిన
హరిదాసదాసుఁడ ♦ నని సరోయోగికిఁ, బుడమిఁ జాఁగిలిమ్రొక్కి ♦ భూతయోగి

తే. మ్రొక్కిదాసోస్మియనిసరో♦మునియుమగిడి, దాస్యధర్మమున్నిడి♦తమ్ముఁదెలుపు
కొనిరివారూరుపేరేమి ♦ గొనక యనుచు, వాదిభీకరగురుఁ డనె♦మోదమలర. 8

సీ. ఇచ్చట నీదాసు ♦ కించుక గల్గునా, చో టని శ్రీభూత ♦ సూరి యడుగ
నొకరికి శయనింప♦నుచిత మిర్వురకుఁ గూ, ర్చుండఁ జోటిక్కడ♦నుండుననుచు
నాసరోముని పల్కి ♦ యతనితోఁ గూర్చుండ, వచ్చె మహాయోగి♦వరుఁ డచటికి
నంత మీరెవరని ♦ యడుగ వారి కతఁడు, విష్ణుదాసుఁడ నని ♦ విన్నవింప

తే. వారు సేవించి రాబ్రహ్మ♦వాది నతఁడు, మగిడి సేవించె వారి నా ♦ మాడ్కిఁగలిసి
యరుఁగుపైనిల్చియుండిర♦య్యార్యులనుచు, వాదిభీకరగురుఁడనె♦మోదమలర. 9

సీ. ఆతిరుక్కోవలూ ♦ రాయనా రాశ్రిత, వత్సలుం డేతెంచి ♦ వారినడుమఁ
జొచ్చి కన్పడక త♦త్సురుచిరాంగములతో, నొరపిడి పడుచుండ ♦ నెఱిఁగి వార
లుంటిమి ముప్వుర ♦ మొరు లెవ్వ రిచటలే, రీవింత యెమొకో ♦ యెఱుఁగ నేర
మని తలంచిన వారి ♦ కప్రాకృతాద్భుత, దివ్యమంగళమూర్తి ♦ దేవదేవుఁ

తే. దక్షిపదగోచరుండై నంతనిఁజూచి, ప్రణతు లొనరించి యామహా • భాగవతులు
భూరివేదాంతసూక్తులఁ • బొగడి రనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. ఇట్లు సన్నుతించి లోకోపకారార్థంబుగా 'వయ్యందగళియా' అనియు 'అన్బేద గళియా' అనియు 'తిరుక్కండేన్ పొన్మేని కండేన్' అనియు నుపక్రమించి సర్వాధికారంబు లగు మూఁడుప్రబంధంబు లానతిచ్చి ముమ్వు రమ్మహాత్మ లిట్లు లోకానుగ్రహం బొనరించి రంత. 11

భక్తిసారులనంబడు తిరుమళిశైయాళ్వార్ల ప్రభావము

తిరుమళిశై.త.-శ్లో॥ పఞ్చశక్తిమయదివ్యవిగ్రహం భక్తిమత్సుజనభూర్యనుగ్రహమ్।
పాపచేతనమనోతిదుర్గ్రహం భక్తిసారమునిమాశ్రయేన్వహమ్॥
మఖాయాం మకరే జాతం చక్రాంశం భార్గవోద్భవమ్।
మహీసారపురాధీశం భక్తిసార మహం భజే॥

సీ. పాలవెల్లిని దొల్లి • ఫణిరాజతల్పము, విడనాడి యేతెంచి • విష్ణుఁ డుర్వి
మధురలో వసుదేవ•మహిషియం దుదయించి, బృందావనమునందు • నందసతికి
నందనుఁడై కృష్ణ • నామధేయముఁ దాల్చి, సకలజనప్రీతి • సల్పినట్లు
చక్రరా జొకమున • సతికి మహీసార,పురమునం దుదయించి • మఱియునొక్క

తే. భాగ్యవతి పెంప వర్ధిల్లి • భక్తిసార, దివ్యనామము ధరియించి • తేజరిల్లి
సకలచేతనసంరక్ష • సలిపె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర. 12

సీ. సప్తర్షు లేతెంచి • సరసిజాసనుఁ గాంచి, సన్నుతు లొనరించి • సంస్తుతించి
భూమండలమునందు • భూరిపుణ్యక్షేత్ర, మస్మన్నివాసార్హ • మానతిమ్మ
యనుచుఁ దన్నడిగిన • నబ్జయోని విదేహ, వన మొకచెంతను • వసుధ యంత
నొకచెంతఁ దక్కెడ • నుంచి తూపించిన, వసుధకంటె విదేహ • వనము హెచ్చ

తే. నాఁటనుండి విదేహచ • నంబు ధాత్రి, శ్రీమహీసారపురసంజ్ఞఁ • జెందె నంత
నచట నుండిరి సప్తమ • హర్షులనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 13

సీ. సప్తర్షు లామహీ • సారమహాక్షేత్ర, వాసులై తపమొంద • వారియందు
భార్గవముని ధర్మ • పత్నితో నచ్చట, శౌరి కర్పితముగ • సత్రయాగ

మనుదీర్ఘసత్రము • నతిభక్తి నెఱవేర్పఁ, దద్ధర్మపత్ని సౌ • దర్శనాంశ
కలితగర్భముఁదాల్చి • నెలలేఁగఁబదునొండు,మఖతారకను బుష్య • మాసమునను.

**తే.** బిండ ముల్బావృతము గని • బెదరి వగచి, ప్రేఁపపొదరింటినడుమను • బెట్టివచ్చి
భర్తృశుశ్రూషణముఁ జేసె • భక్తి ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

**సీ.** పుడమి బాలునకును • బూలపాన్పట్లగు, సిరి దారకునిఁ దల్లి • కరణిఁ బ్రోచు
నమ్మహీసారపు • రాధీశుఁ డగుహరి, వచ్చి బాలునిఁ జూచి • మెచ్చి కృపను
దనకటాక్షామృత • ధారలచేఁ దన్పి, క్షుత్పిపాసల మాన్పి • శుద్ధసత్త్వ
దివ్యమంగళమూర్తి • భవ్యాపహతపాప్మ, తాదిసద్గుణభూష • ణాయుధాదు

**తే.** లన్నియునుజూపఁ గనుఁగొని•యర్భకుండు, సాంద్రతరనిర్మలజ్ఞాన•జలధి యయ్యె
నంత నంతర్హితుం డయ్యె•హరియు ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

**సీ.** శ్రీహరివలనివి • శ్లేష మోర్వఁగలేక, కటకట శిశు వేడ్వఁ • గాననమున
నంతటఁ దిరువాళ • నసుధీరుఁడొకఁడు కా, నను బ్రేఁపడువ్వల • నఱకుచుండి
యారోదనము విని • యాప్తులతో వచ్చి, పొదరింటిలోపలఁ • బొరలుచున్న
పంచశక్తిమయాంగుఁ • బరమదయాపాంగు, సుఖసంగు నబ్బాలుఁ • జూచిపొంగి

**తే.** యెత్తుకొని వేగఁ దనయింటి • కేఁగి యతనిఁ, బంకజప్చొల్లియారను • భార్యకీయ
నంచితంబుగ నాసాధ్వి • పెంచె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

**సీ.** మత్పుత్త్రుఁ డని యభి • మానించినంత నా, సతికి వంధ్యకుఁ బాలు • చనులనూరె
నాపాలు గుడువక • యసియాడ కేడ్వక, హరిసద్గుణామృతం • బనుభవించి
ప్రతిపదింపునిభంగిఁ • బ్రబలునాబాలునిఁ, బ్రవయశ్చతుర్థదం • పతులు చూచి
గోక్షీరములు తాఁచి • కొనివచ్చి ప్రార్థింప, నర్భకుం డవి గొని • యారగించెఁ

**తే.** గొన్నిదినములు పాలట్లు • గ్రోలియంత, క్షీరదాతల కొకమేలు • సేయఁదలఁచి
బాలకుఁడు వారి కిట్లని • పలికె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

**సీ.** భక్తి మె కిట్లు మా • పాలఁ గల్గుటఁజేసి, మేము పానముసేయ • మిగిలినట్టి
పా లివిగొనిపోయి • భక్తితోఁ ద్రావినఁ, గొడుకు మీకగునని • గురుఁడు వల్కి
నావృద్ధదంపతు • లట్లొనర్చెద మని, పలి కింటి కేఁగి యా • పాలఁ గ్రోలి
యభినవయౌవను • లతిసుందరాకృతు, లతిసుకుమారులై • రతులఁ దేలఁ

తే. క్రమముగా నాలతాంగికి • గర్భమయ్యె, నెలలు నిండారఁ గనియె నా • నెలఁతసుతుని
జ్ఞానభక్తివిరక్త్యాది • జలధి ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 18

వ. అంత నక్కుమారునకుఁ బంద్రెండవదినంబునందుఁ దల్లిదండ్రులు కణిక్కణ్ణి రని తిరునామంబు గావించి వర్ధమానచంద్రునిం బోలి దినక్రమంబుగా వర్ధిల్లుచున్న యబ్బాలకునకు సకలవిద్య లధికరింపం జేసి సుఖించుచుండి రంత భార్గవాన్వయ సంభూతుం డగుభక్తిసారగురుండు పాలకపితృగృహంబున నిర్నిబంధ ననిరవధిక భగవద్దయామృతాస్వాదపరిబృంహితసకలావయవుండై యన్నపానాద్యపేక్ష లేక వర్ధిల్లుచు సప్తహాయనంబులు గడపి యామీఁద ఋషిపుత్త్రుండు గావున భగవదనుభవప్రాప్తయమనియమాసన ప్రాణాయామప్రత్యాహారధ్యానధారణ సమాధిరూపాష్టాంగయోగసంపన్నుండై యయ్యోగంబునకు జగజ్జన్మాది కారణత్వ లక్షణలక్షితం బగుపరబ్రహ్మంబునకుఁ బ్రతిపాదకంబులుగా భ్రాంతచిత్తులకుఁ దోఁపంబడు శాక్యోలూకాక్షపాదక్షపణకపిలపతంజలిసమ్మతంబు లగు బాహ్యసమయంబులందును శైవమాయావాదన్యాయవైశేషికభాట్టప్రాభాకరాది కుదృష్టి సమయంబులందును బ్రవేశించి యరసి చూచి వానియం దొకసారంబు గానక రోసి యాశింపక యప్లేడునూఱులసంవత్సరంబులు గడపి యంత శ్రీవైష్ణవుండై పరమవైదిక సిద్ధాంతనిష్ఠాగరిష్ఠుండై యున్నంత భక్తత్రాణ పరాయణుం డగు నారాయణుండు స్వకీయం బగు దివ్యాత్మస్వరూపంబును దదాశ్రయంబు లగు జ్ఞానశక్త్యాదికళ్యాణగుణంబులును దదుభయప్రకాశకంబగు దివ్యమంగళ విగ్రహంబును దదాధారం బగుకిరీటాదినూపురాంతదివ్యాభరణసముదయంబును నబ్భూషణంబులవంచంబునం బ్రకాశించుచున్న శంఖచక్రాది దివ్యాయుధవర్గంబును నట్టి భోగంబునకు వర్ధకం బగుభోగవిభూతి యగు పరమపదంబును సాక్షాత్కరింపం జేసి మఱియుం బ్రకృతిపురుషకాలాత్మిక యగులీలావిభూతియు నవ్విభూతియందు సద్వారకాద్వారకం బగుసృష్టిస్థిత్యాది ప్రపంచంబు సవిశేషంబుగాఁ దెలియంజేసి యుభయవిభూతినాయకుం డగు హరి యమ్మహాత్మున కిట్లనుగ్రహింప నతండు సర్వజ్ఞుండై 'నాన్మగనై నారాయణ≡ పడైత్తా≡' ఇత్యాది ప్రబంధంబులచే సర్వాంతర్యామియును సర్వశక్తి సంపన్నుండును సర్వజగత్కారణభూతుండును మహాయోగీశ్వరేశ్వరుండును నగు శ్రీమన్నారాయణుండు పరమతత్త్వం బని నిస్సంశయంబుగా నిశ్చయించి యమ్మహాత్ముని ధారణాయోగంబున ధ్యానించుచుఁ గైరవిణీతీరంబున సప్తశతహాయనంబులు భగవదనుభవపరుండై యుండె నంత. 19

సీ. వామదేవుఁడు నంది•వాహనారూఢుఁ డై, దేవితో లోకముల్•దిరిగివచ్చి
కైరవిణీతటా•గారుని రుక్మిణీ, రమణునిఁ బార్థసా•రథిని గాంచి
వినుతించి పీడ్కొని•వినువీధిఁ జనుచుండ, నతనినీడకుఁ దొల్గి•యవనిఁ గంధ
గూర్చుచున్నట్టియా • గురుశేఖరునిఁ జూచి, యంబిక వీ రెవ్వ•రనుచుఁ బ్రియుని

తే. నడుగ హరిభక్తుఁ డతఁ డని•హరుఁడు పల్కె
మన మతనిఁ జూత మని యార్య•మగని కనిన
భార్య కిట్లని పలికె నా•భర్గుఁ డనుచు
వాధిభీకరగురుఁ డనె• మోద మలర. 20

సీ. నారాయణునిఁదక్క•వేఱొక్క వేల్పును, గలనైనఁ దలఁపరు•గరుడకేత
నాశ్రితు లది గాన • నాతనికడ కేఁగ, మనల నుపేక్షించు• మాన్యుఁడనుచు
రుద్రుఁడు వలుక నా•రుద్రాణి మనకు వా,రిప్రియుఁ గని యాద•రించి చనుట
తగు నన్న విని వృష•ధ్వజుఁ డమ్మహాత్ముని,కనుమ్రోల కేతెంచి•కానఁబడినఁ.

తే. గంధఁ గూర్చుచుగురువరుఁ•డంధకారిఁ, జూచిమాడకయున్నఁ ద్రి•శూలపాణి
భార్గవాన్వయునకు నిట్లు•పలికె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర. 21

సీ మ మ్ముపేక్షించుట•మంచిదా నీ కని,శంభుఁడు పల్క నా•శాంతుఁ డనియె
యభవ నీతోడ మా•కణుమాత్ర మైనను, బని లేదు గాన నీ•పగిది నుంటి
ననిన మద్దర్శన•మఫలము గాదు నీ, యభిమత మిచ్చెద•మడుగుమనుచు
శూలి పల్క నతండు•సూదిలో దారము, చనునటు వరమిచ్చి•జరగు మనిన.

తే. నపహసించితి వని రుద్రుఁ•డతని కలిగి, కంటిమంటలఁ గాముని•కరణి నేఁడు
భస్మ మొనరింతు ని న్నని•పలికె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర

సీ. పలికి రుద్రుం డట్టి•ఫాలనేత్రాగ్నిని, బైల్పుచ్చ నదియును • బ్రళయకాల
ఝంఝూనిలోజ్జ్వల•జ్వాలావళీకృతా, భీలానలాతిక•రాళ మగుచు
దెప్పరంబుగ మిన్ను•గప్పిమండుచునుండఁ, గనుఁగొని భార్గవ•మునివరుండు
దరహాస మొనరించి • తనవలపలికాలుఁ, దమ్మిని నంగుష్ఠ • తలమునందు

తే. మన్నమొకకన్ను దెఱచిన • నుగ్రవిలయ, భానుపావకకోటిప్ర • భాసమాన
మొక్కప్రబలాగ్ని మింటిపై • కుబికెననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. అమ్మునికృతవహ్ని • యం దాత్మనేత్రాగి, ఖద్యోతమ ట్లుండఁ • గనలి హరుఁడు
పుష్కలావర్తకా • ద్భుతమేఘములఁ బంప, నవియు వర్షించి యా • యగ్నినణఁప
నమ్మహావృష్టియం • దద్రిరాజముగతి, నిశ్చలుం డై యోగ • నిరతుఁ డైన
యమ్మునిఁ గని రుద్రుఁ • డక్కజపడి ప్రీతి, నతనికి భక్తిసా • రాఖ్య నొసఁగి

తే. విష్ణుభక్తులవిభవము • విస్తరించి, దేవి కెఱిఁగించుచును జని • ధిష్ణ్య మొందె
నట్లతని కయ్యె భక్తిసా • రాఖ్యయనుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర. 24

సీ. భార్గవాన్వయసుధా • పాథోధిచంద్రుండు, భక్తిసారాఖ్యుఁ డ • ప్పరమయోగి
యోగసాక్షాత్కార • యుక్తుఁడై యున్నంత, నచటికి వ్యాఘ్రివా • హనమునెక్కి
శక్తిహారుం డను • సురవర్త్మచరుఁ డొకం, డరుగుదెంచిన వాని • వ్యాఘ్రి మతని
పై మింటఁ జనకున్నఁ • బరమవిస్మయమొంది, వాఁడుర్వినమ్ముని • వరుమహాత్మ

తే. ముచితదేశోల్లసత్ఫాల • శోర్ధ్వపుండ్ర, మహితతులసీనలినబీజ • మాలికాఢ్యుఁ
గాంచి వైష్ణవుఁ డని నిశ్చ • యించె ననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. బుధవర బొంతఁ గ • ప్పుట చాలు నీకు నే, నీదివ్యపటనిర్మి • తేద్ధకవచ
మర్పింతు నని శక్తి • హారుండు గనిపింప, నది చూచి నగి ముని • యతనికాత్మ
సంకల్పవిరచిత • స్వర్ణనిర్మలవజ్ర, కవచముఁ దనమేనఁ • గానిపింప
నది చూచి వాడు కం • రాసక్తదివ్యమౌ, క్తికహార మియ్యంగఁ • గేలఁ బూన

తే. మౌని తులసీనలినబీజ • మాలికలను, జూప నవరత్నమౌక్తిక • జుష్టదివ్య
హారములభంగిఁ గనియెన • య్యమరుఁడనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ అమ్మహాత్మునిపూర్తి • కక్కజపడి శక్తి, హారుఁడు వినుతించి • యరిగె మగిడి
యంతఁ గొంకణసిద్ధుఁ • డనురసవాదియే, తెంచియమ్మునివరుఁ • గాంచి మ్రొక్కి
కానికిఁ గోటిరూ • కలహేమ మగురస, గుళిక యొక్కటి దెచ్చి • గుమున కియ్య
మాకేల యని యది • మగుడ వాని కొసంగి, తనతప్తకాంచన • తనువు నలఁచి

తే. గురుఁడు మన్నింత తనచెవి • గులిమికొంతఁ, దీసియవి రెండునొకయుంట • చేసిదాని
వాసి వానికిఁ జెప్పె నీ • వరుస ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 27

సీ. కొంకణసిద్ధ యీ • గుళికకానికి నూఱు, కోట్లహేమ మొనర్చుఁ • గొదువ లేక
యని పల్కి గురుఁడీయ • నది గొని వాఁడేఁగి, తగఁబరీక్షయొనర్చి • మగిడివచ్చి

యమ్మునిఁ గని మ్రొక్కి హర్షించి వలగొని, కొనియాడి వీడ్కొని చనియె నంత
భక్తిసారగురుండు పర్వతగుహఁ జొచ్చి, యోగానుభవరతి నున్న యంత

తే. నఖిలచేతనరక్షకై యవనిఁ దిరిగి, ముప్వురాదిమసూరు లాదవ్వులకును
వచ్చుచుండిరి సుజనులు మెచ్చ ననుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర. 28

సీ. ఆసరోభూతమహానామయోగీంద్రు, లుదయభాస్కరసహస్రోజ్జ్వలముగ
దివ్యతరం బైన తేజ మొక్కటి యోగ, దృష్టిచే దూరప్రదేశమునను
గాంచి దవ్వుల కేఁగి కని భక్తిసారునిఁ, బ్రణమిల్లి కుశలసంప్రశ్న మొదవ
నమ్మహాముని వారి కభివాదన మొనర్చి, యర్ఘ్యపాద్యాసనాద్యర్చ సలిపి

తే. నంతఁ గొన్నాళ్ళు వారంద ఱచట యోగ, ధారణాసక్తిచే నుండి తరలి వచ్చి
శ్రీమయూరపురీంద్రముఁ జెంది రనుచు, వాదిభీకరగురుఁ డనె మోద మలర.

సీ. మహదాఖ్యయోగిజన్మస్థానకైరవ, తీర్థముకడఁ గొన్ని దినము లుండి
ముప్వు రాదిమసూరిముఖ్యులు శ్రీభక్తి, సారుని వీడ్కొని జరిగి ధరణిఁ
దీర్ఘయాత్రారతిఁ దిరుగుచునున్నంత, భక్తిసారాహ్వయపరమయోగి
స్వజనికారణమహీసారపురంబున, కరిగి యచ్చటఁ గొన్ని యహములుండి

తే. శ్వేతమృత్తిక లేకున్న శ్రీధరుండు, కలను గనఁబడి చూపినఁ గని పెకల్చి
చూచె సితమృత్తు భార్గవసూరి యనుచు, వాదిభీకరగురుఁడనె మోద మలర.

వ. అంత నబ్భార్గవకులాబ్ధిచంద్రుం డగుభక్తిసారయోగీంద్రుండు దానిఁ గనుంగొని
కై కొన్న యాశ్వేతమృత్తికచేత లలాటాదిద్వాదశాంగంబులయందు శ్రీకేశవాది
దివ్యనామోచ్చారణపూర్వకంబులుగా నంగుళద్వయాంతరాళోల్లసితంబులును
నంగుళమాత్రపార్శ్వభాగంబులును భగవత్పదాకారంబులును దప్తచామీకర
ప్రభాభాసమానశ్రీచూర్ణరేఖావిలసితాంతరాళంబులును నగుద్వాదశోర్ధ్వపుం
డ్రంబులు ధరియించి నిజకరతలక్షాళనోదకంబు శ్రీవాసుదేవదివ్యనామంబుచ్చ
రించుచు స్వశిరంబునం జల్లుకొని సకలలోకోత్తారకం బైన శ్రీమహీసారక్షేత్రం
బునందు నిత్యసాన్నిధ్యంబొనర్చి భగవంతు నారాధించుచుఁ గొన్ని దినంబులు
నివసించి సంతసించుచు నొక్కనాఁ డాత్మమానసంబున, పొయ్‌గై యాళ్వారవ
తరించినస్థలంబుఁ గనుంగొనఁ దలంచి యచటినుండి కదలి సర్వక్షేత్రోత్తమంబు
ను సమస్తపాపహరంబును సత్యవ్రతక్షేత్రాపరనామధేయంబునునగు కాంచీపు

రంబునకుం జనుదెంచి శరదుదితరాకాచంద్రకోటిప్రభాసమానంబును ఫణారత్న సహస్రాంశునవాస్తరణవిస్తృతంబు నగుశేషతల్పంబుపై నీలజీమూతసంకాశుండును దక్షిణోన్మీలితపుండరీకదళాయతాక్షుండును శ్రీభూనీళాది దివ్యసీమంతినీపరిచరితచరణారవిందుండును నగునారాయణుని సేవించితత్సమీపవర్తి యగు పొయ్గైయాళ్వారవతరించిన దివ్యకాసారంబుఁ బొడగాంచి తత్తీరంబున నొక రహస్యస్థానంబున నేడునూఱులహాయనంబులు యోగానుభవతత్పరుఁడై యున్న సమయంబున నిజానుగ్రహోత్పాదిత పరమశాంతుం డగు కణికణ్ణరనియెడు మహానుభావుంతు శ్రీమహీసారక్షేత్రంబునందుండి యచటికేతెంచి యమ్మహాత్మునిఁ గని సాష్టాంగప్రణామపూర్వకంబుగా నాశ్రయించిన నాసత్యనిధికి నాభక్తిసారమునీంద్రుం డఖిలహితంబుల నుపదేశించెనంత. 31

సీ. అప్పురిముదుసలి, యవ్వ యొక్కతె వచ్చి, యమ్మహాయోగీంద్రు, నచటఁ జూచి
సద్భక్తి నప్పర్ణ, శాల సమ్మార్జన, లేపనరంగవ, ల్లిక లొనర్చి
కమలనీలోత్పల, కాంచనపుష్పమా, ల్యముల నయ్యుటజ మ, లంకరించి
కాలత్రయమునందుఁ, గడుభక్తిఁ జేమోడ్చి, చనుచుండ నబ్భక్తిసారయోగి

తే. యున్మనీభావదశయోగ, యుక్తుఁడయ్యుఁ, గన్నులొకనాఁడుదెఱచియా, గరితసలుపు
పనిఁగటాక్షించిమెచ్చియి, ట్లనియెననుచు, వాదిభీకరగురుఁడనె, మోదమలర.

సీ. నేఁ బ్రసన్నుఁడ నైతి, నీయిష్ట మిచ్చెద, నడుగుమా యని ముని, యబల కనిన
నామి యీదాసికి, సకలచింతాస్పద, మగుముదిమి యుడిగి, యౌవనంబు
గలుగునట్లు వరమ్ముఁ, గరుణతోనిమ్మని, యాముదుసలియవ్వ, యడిగె నంత
నట్లగుఁ గాక నీ, కని పల్కె యమ్ముని, యోగానుభవసుఖ, యుక్తుఁ డయ్యె

తే. నంత ముసలింతి జరఁబాసి, యమరహృద్య, దివ్యసుందరసుకుమార, దేహమొంది
మెరఁగి గురునకుఁదనయింటి, కరిగెననుచు, వాదిభీకరగురుఁ డనె, మోదమలర.

సీ. అంత వల్లవరాయఁ, డనియెడిదేశాధి, పతి విని వచ్చి య, ప్పడఁతిఁ జూచి
స్మరశరవిహ్వల, స్వాంతుఁడై యర్థించి, ప్రీతి నాయువతిని, బెండ్లియాడి
మహి నవ్విలాసిని, మణితో నమానుష, సుఖ మందుచుండ నా, క్షోణిపతికి
జర యల్లనల్లన, జన్మించె మేనియం, దాలేపులావణ్య, మతిశయించె

తే. నంతఁదనజర నాయింతి, యౌవనంబుఁ, జూచి విస్మయమొంది యా, క్షోణిభర్త
యతివ యీవింత యేమని, యడిగెననుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర.

వ. అంత నాసీమంతినీరత్న మబ్భూకాంతున కిట్లనియె. 35

సీ. ఈనిత్యయౌవన • మిటిసౌందర్యంబు. మద్గురుకృపవల్ల • మాకుఁ గల్గె
నమ్మహాత్మునియంఘ్రు•లాశ్రయించితివేని. నిత్యయౌవన మట్లు•నీకుఁ గల్గు
నని యవ్వధూమణి•యాత్మభర్తకుఁ దెల్ప. నతఁడెట్లు గన్పడు • ననుచు నృపతి
యనినఁ గణిక్కన్న • రనుసూరి శ్రీభక్తి• సారులశిష్యుండు • సద్గుణాఢ్యుఁ

తే. డాతఁ డక్షయపాత్రార్థ • మరుగుదెంచు. నిత్య మిచ్చటికాతని • నీవె యడుగఁ
దగుననుచుఁ బల్కెనాసతి•ధవున కనుచు. వాదిభీకరగురుఁడనె•మోద మలర.

సీ. అంతఁ గణిక్కణ్ణ • రచటి కుపాదాన. మడుగంగ నేతేర • నతనిఁ జూచి
యారాజు మ్రొక్కిడి • యతని కిట్లని పల్కె. భవదీయగురుని శ్రీ•భక్తిసారుఁ
గనుఁగొను వేడుక•గలదు మా కతనిని. రప్పింపు మనుచు నా•రాజు నుడువ
రాజులఁ గనుఁగొన • రాఁడస్మదార్యుండు. మందిరంబులఁ దమ•సుందరులకు

తే. నిత్యఖరగోశ్వమార్జాల•భృత్యులగుచు•నున్న యధములఁ జూడఁడా•యుచితవేత్త
యనుచు భార్గవమునిశిష్యుఁ•డనియెననుచు•వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

వ అంత నవ్వల్లవరాయఁ డను మహీపాలుం డమ్మహాత్ముని పల్కు లాలించి యస్మద్విషయంబుగాఁ గవిత్వంబు చెప్పుమని యపేక్షింప నబ్భక్తిసారచ్ఛాత్రోత్తముండును భగవద్భాగవతాచార్యవిషయస్తోత్రంబులు దక్క నరస్తుతి సలుప మదీయవాణి యుత్సహింపదని కణిక్కణ్ణ రానతీయ నబ్భూపాలుం డలిగి రాజు భగవదంశసంభూతుండు కాని నరమాత్రుండుగాఁ డట్టి మమ్మిట్లు ధిక్కరించి పలికితివిగావున మద్రాజ్యంబు వెడలిపొమ్మనిన దశగ్రీవావమానితుం డగు విభీషణుం డతిరయంబున శ్రీరామసాన్నిధ్యంబుఁ జెందు గతి నతిశీఘ్రుంబుఁ గణిక్కణ్ణ రాచార్యసన్నిధి కేతెంచి సాష్టాంగంబుగా దండప్రణామంబు చేసి కరకమలంబులు ముకుళించి తద్వృత్తాంతంబంతయు విన్నవించి స్థలాంతరం బుద్దేశించి చనుట కడియేనికి నాజ్ఞ యిమ్మని ప్రార్థింప భార్గవాన్వయకలశాబ్ధి చంద్రుం డగు నాభక్తిసారయోగీంద్రుం డిట్లనియె వత్సా నీవు దేశాంతరంబునకు వెడలిన నిన్ను విశ్లేషించి నేనిచ్చట నుండనొల్లనని యమ్మహాత్ముం డద్దివ్యదేశాధీశుం డగు నారాయణునిఁగూర్చి యి ట్లనియె మహాత్మా దుర్వినీతుండగు నీ పల్లవ నృపతిరాజ్యంబున నేనుండనొల్ల మఱియొకదేశంబున కేఁగెదఁ గావున మీర లీ యనంతతల్ప మహాకటంబుఁ జుట్టుకొని యోగనిద్రాసక్తి చాలించి మీపరిజనంబుతోఁగూడ విచ్చేయవలయునని విన్నవించి యక్కణిక్కణ్ణ రనుశిష్యతిలకంబు

తోఁగూడఁ ఁనుదెంచుచుండ నతం డానతిచ్చినసూక్తి విన నవధరించి నారాయ
ణుండు శ్రీభూనీళాదిదివ్యసీమంతినీసమేతుం డయి యనంగతరుడవిష్వక్సేనాది
నిత్యసూరివర్గంబులతో సభ్భక్తిసారమునీంద్రునివెనువెంటఁ జనుచుండ నంత
నావరణ రక్షకులగు బ్రహ్మాదిదేవత లద్దేవుని పిమ్మటఁ జనుమండి రట్లా సత్య
వ్రతక్షేత్ర నివాసులగు మహర్షులు వారివెంటం జనుచున్న సమయంబున
నద్దేశమధ్యంబున నున్న సకల దేవాలయంబులయందు దేవితావిగ్రహంబు
లదృశ్యంబులయ్యె ముం దయోధ్యానగరంబునఁ గోసలరాజ్యంబునం దంతట
శ్రీరామవిశ్లేషం బోర్వఁజాలక తరుగుల్మలతాదులన్నియు నీరసంబులైన
తెఱంగున సత్యవ్రత క్షేత్రంబునం దంతటఁ దృణగుల్మలతాదులన్నియు వాడి
శుష్కించె నంత సూర్యచంద్రాదిగ్రహంబులు నిజప్రభామండలంబు దొలంగె
నాక్షేత్రం బంతయు మహాంధకారపరిపూర్ణం బయ్యె నంత వల్లవక్ష్మాపాలుం డకాల
ప్రళయం బుదయించె నని మిగుల దుఃఖించి మంత్రివర్గంబుతో నాలోచించి
సామాత్యుం డై చని కణిక్కణ్ణ రనుమహాత్మునిఁ గనుంగొని సాష్టాంగ
ప్రణామంబు లాచరించి ఫలపుష్పాద్యుపహారంబులం బూజించి మహాత్మా పాప
రాధచేతనుల మగుమమ్ము రక్షింపందగునని ప్రార్థింప నా సాత్త్వికపుంగవుం
డును దయావిధేయుం డై యట్లొనర్చెద నని పలికి స్వాచార్యుం డగు భక్తి
సార మహామునీంద్రుని బ్రార్థింప నమ్మహాత్ముం డాశ్రితవాత్సల్యవివశుండు
గావున సుప్రసన్నుండయి నిజశిష్యప్రార్థనం జేసి స్వారాధనీయుం డయి నపరి
వారుండైన నారాయణునితో మగిడి కాంచీపురంబుఁ జేరి సరోయోగీంద్రున
కవతారస్థానం బగు దివ్యకాసారంబు చెంతఁ బూర్వప్రకారంబుగా ననంత భోగ
తల్పంబుపైఁ బవ్వళించి యోగనిద్రాసక్తి సుఖం బుండుమని ప్రార్థింప సభ్భక్తి
సారమునీంద్ర ప్రార్థితుం డయి శ్రీమన్నారాయణుం డట్లొనర్చెం గావున నాఁట
నుండియు నా శ్రీహరికి 'శొన్నవణ్ణం శెయ్‌ద పెరుమా' ళ్లనియును
'యథోక్తకారుం' డనియు దివ్యంబు లగునామధేయంబు లమరె నంత నా సత్య
వ్రతక్షేత్రంబునందు దేవాలయంబులం దత్తద్దైవత విగ్రహంబులు సకలజననయ
నగోచరంబులయ్యె. మఱియు సర్వాపగాపుష్కరిణీకాసారవాపీకూపతటాకంబు
లును బ్రసన్నోదకంబులయ్యె సమస్తవృక్షంబులు పల్లవితంబు లై కోరకితం
బులై పుష్పితంబులై ఫలితములై లలితంబులై యొప్పె సర్వదిగ్వలయంబు
సంప్రసన్న సూర్యచంద్రాది గ్రహతారకా ప్రభామండలమండితంబై సొంపారె
స్వవర్ణాశ్రమోచితకర్మాసక్తంబయి చాతుర్వర్ణ్యం బంతట సుఖం బుండె నంత 38

సీ. అచటఁ గొన్నాళ్లుండి, యంతరాత్మకు హరి, నతులయోగాసక్తి, ననుభవించి
క్షణమైన నేచటవా, సముఁజేసినరుఁడు దోషము లెడఁబాసిమో, క్షములభించు
నక్కుంభకోణది, వ్యక్షేత్రమున కేఁగ, సమకట్టి శ్రీభక్తి, సారగురుఁడు
శ్రీఁమేశు యథోక్త, వారు వీడ్కొని చని, చేరి పెరుంబులి, యూరియందు

తే నొక్కయెడఁ బంచతిన్నెపై, నున్నయంత, వేద మచ్చటఁ జెప్పుచు, విప్రులతనిఁ
గాంచి విప్రతిపత్తి ల, ఘించి రనుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర. 39

సీ బ్రహ్మతేజస్ఫూర్తి, బ్రాహ్మణుఁ డనియును, దల్లింగములు లేమి, ధరణీసురుఁడు
గాఁ డనియును మదిఁ, గలఁగి యాబ్రాహ్మణు, ల్వేదప్రవచనము, ల్విడిచి రంత
నిజయోగ విజ్ఞాత, నిఖిలేంగితుఁడు గాన, భార్గవసులజుఁ డౌ, భక్తిసార
యోగీంద్రుఁ డచ్చట, నుండి లేచినవారు, వాక్యములందలి, వరుస మఱచి

తే. తడఁబడుచు నుండ వరిపై, ఁయ నతండు, వరనఖంబుల నల్లని, వడ్లఁగంజ
వారలందఱుఁ గనుఁగొనిఁ, జీరె ననుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర.

వ. అంత సాంగసశిరస్కవేదవిత్తము లగు నావిప్రసత్తము లబ్భార్గవమునీంద్రుఁడు నఖంబులచేఁ గృష్ణవ్రీహిచ్ఛేదనంబుచేసి సూచింపంజేయ విస్మృతంబగు 'కృష్ణానాం వ్రీహీనాం నఖనిర్భిన్న'మ్మనియెడు వాక్యం బుపస్థితివిషయంబయినమిగుల సంతసించిరి. భగవద్భక్తు లగువారు శూద్రులు గారనియు వారలే విప్రసత్తము లనియు సకలవర్ణంబులయందు భగవద్భక్తి లేనివారలే శూద్రు లనియుఁ బంచమ వేదం బగు శ్రీమహాభారతంబునందుఁ జెప్పంబడెం గావున నిమ్మహాత్ముండు భాగవతోత్తముండు బ్రహ్మవిత్పూజ్యుండని యత్యంత భక్తియుక్తమానసులై ప్రత్యుత్థానాభివందన ప్రక్రమాదు లాచరించి యపరాధక్షమాపణంబు చేసికొని రంత నబ్భక్తిసారయోగీంద్రుం డుపాదానార్థంబు చనుచుండ నాగ్రామంబునం దర్చితుం డగుభగవంతుండు ప్రతివీధియందు నమ్మహాత్మునకు భిముఖంబుగాఁ దిరుగుచుండె నాలయాంతరాళంబునం దట్లు దిరుగుచున్న భగవద్విగ్రహంబుఁ గనుంగొని యర్చకులు పరమాశ్చర్యంబు నొంది బ్రాహ్మణులం గొంపోబ రావించి యా హరివిగ్రహంబు దిరుగుటఁ జూపం జూచి యద్ధరణీసురోత్తములు పరమవిస్మితులయి యప్పెరుంబులియూ రనుగ్రామంబునకు సమీపస్థం బగు బాహ్యోద్యానంబునందు యాగంబు సలుపు బ్రాహ్మణోత్తముల కెఱింగింప వారును బరమాశ్చర్యదోధూయమానమానసులై పరమానంద పరిపూర్ణ మనస్కులై యమ్మహాత్ముని దర్శనం బపేక్షింప నంత దీక్షితుండు చక్షుష్మంతులకు సద్దర్శన

సదృశంబగు ఫలంబు వేఱు లేదని తలంచి కౌతూహలాయమాన నిజస్వాంతుండై యమ్మహా భాగవతోత్తముం డున్నయెడ కేతెంచి యమ్మహాత్ముని పంచశక్తిమయ దివ్యవిగ్రహంబుఁ గనుంగొని సాష్టాంగప్రణామం బాచరించి యర్చించి యిట్లనియె, మహాత్మా నీవు మహాప్రభావసంపన్నుండవు భగవంతుఁ డగు నారాయణుండు భవద్విధభాగవతవిగ్రహంబుఁ గైకొని సకలచేతన సంరక్షణార్థంబు మధ్యమ లోకంబునం దిరుగుచుండుం గావున భవదీయపాదారవిందరజఃకణంబులచే మదీయయజ్ఞవాటంబు పవిత్రంబుచేసి మమ్ముం గృతార్థుల జేయవలయు నని ప్రార్థించి యొడంబఱచి తోడ్కొని చని యాగశాలాప్రవిష్టుం డగునమ్మని శ్రేష్ఠుని నర్ఘ్యపాద్యాసనాదివిధుల నగ్రపూజ యొనర్చినం జూచి యోర్వంజాలక యధ్వర్యుప్రభృతిఋత్విగ్గణం బలిగి యాగంబునకు మహత్తైన విఘ్నంబు సంభవించెనని యతిక్షోభంబుఁ జెంది రాజసూయమహాధ్వరంబున యుధిష్ఠిరుచే నగ్రపూజితుం డగు కృష్ణునిం జూచి యలిగిన శిశుపాలుండు దుర్వాచ్యంబులగు పరుషవాక్యంబులు పలుకుచందంబున భార్గవకులాలంకారభూతుం డగు నాభక్తిసారమునీంద్రునిం దిరస్కరించి మిగులనధిక్షేపోక్తులం బలుక విని యా దీక్షితుండును వ్యాకులితాంతఃకరణుం డై భక్తిసారమునీంద్రుని ముఖారవిందం బవలోకించి మహాత్మా వీరలిట్లు మిమ్ముం బరుషభాషణంబులు పలుక విని సహింపఁ జాల నని విన్నవింప నబ్భార్గవమునీంద్రుండును నింక నస్మత్స్వరూపంబు ప్రకటితంబుగాఁ జేయకున్న సాధువిధేయుం డైన యీ దీక్షితుండు చిన్నఁబోవు నని తలంచి యష్టాంగయోగసాక్షాత్కృతుండును భక్తత్రాణపరాయణుండు నగు నారాయణునిం బ్రార్థించినం బ్రపన్నరక్షకుండైన యప్పుండరీకాక్షుం డబ్భక్తిసారమునీంద్రునకుం బ్రసన్నుం డై నిజసారూప్యం బొసంగిన నబ్భార్గవమునీంద్రుండును నీలమేఘశ్యామసుందర సుకుమార దివ్యమంగళవిగ్రహుండును శంఖచక్రశార్ఙ్గాసిధరుండును శ్రీవత్స కౌస్తుభ వైజయంతీ వనమాలాలంకృత లక్ష్మీ సంలక్షిత వక్షఃస్థలుండును దప్తచామీకర ప్రభాభాసమాన దివ్యపీతాంబరధరుండును దివ్యతరనవరత్నఖచిత శుభ్రసువర్ణ కిరీటమకరకుండల గ్రైవేయహారకేయూరాంగద కటకోర్మికాకటిసూత్రశింజానమంజు మంజీరాద్యపరిమిత దివ్యభూషణ భూషితుండునై కనిపించిన నాసభాసదు లందఱుంజూచి యమ్మహాముని ప్రభావంబున కతివిస్మయం బంది రంతఁ బూర్వాపరాధులైన యధ్వర్యు ప్రభృతి యాజకులు నాదీక్షితుండును దక్కిన జను లందఱు బ్రదక్షిణప్రణామంబు లాచరించి యనేక విధంబుల సంస్తుతించి బ్రహ్మరథంబుఁ బట్టి పంచమహావాద్య

భేరీమృదంగపటహకాహళ వేణువీణాదిమంగళవాద్యఘోషంబులతోడ స్వస్తివాచ నంబులు సేయుచుఁ బ్రతివీధియందును మహోత్సవంబు సలిపి మగిడి యజ్ఞ వాటంబునం బ్రవేశింపంజేసిన నమ్మహాయోగి సత్తముం డాబ్రాహ్మణోత్తములకు నిర్మలం బగు తత్త్వజ్ఞానం బుపదేశింప వా రెల్లం గృతార్థులైరి యంతట వారలం గరుణాకటాక్షవీక్షణంబుల నిరీక్షించి నమ్రులగువారల వీడ్కొల్పి యచటినుండి కుంభినీ నాయికాతిలకం బగునక్కుంభకోణం బను దివ్యక్షేత్రంబు నకుం జనియె నంత 41

సీ. ఆకుంభకోణమ•హాక్షేత్రరత్నము,నం దపర్యాప్తామృ•తాభిధాను
హరినిఁ గన్గొని మ్రొక్కి•యలనాన్మగంతిరు, వందాదియును దిరు•చ్చందవృత్త
మనియెడు రెండుది•వ్యప్రబంధంబులఁ, జేసి వైష్ణవులకుఁ•జెప్పి యచట
విలసితంబుగ రెండు•వేలమున్నూఱేండ్లు, క్షీరనీరాహార•సేవి యగుచు

తే. నుండె శ్రీభక్తిసారాఖ్య•యోగివరుఁడు,ధారణాయోగసాక్షాత్కృ•తస్వహృదయ
పుండరీకస్థ పురుషాను•భూతి యనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర. 42

సీ. శ్రీకవేరకుమారి•సేమంబునకు నిందుఁ, బవ్వళించితిగాని • భక్తజనులఁ
గని లేచి మాటాడఁ•గా లేవొ యన హరి, లేవ నుద్యోగింప • భావ మలరి
భక్తిసారుం డట్లు • పవళింపు మన నేఁటి, కైన నుత్తానశ•యత్వ మొంది
హరి యుండె నమ్ముని•వరుఁ డంత మూఁడువే,లేడునూఱేఁడు లీ•యిల వసించి

తే. పరమసాత్త్వికులయిన ప్ర•పన్నులకును,దాను జేసినగ్రంథముల్•దగ నొసంగి
శ్రీసుదర్శనభావముఁ•జెందె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర. 43

## కులశేఖరాళ్వారుల వైభవము

కులశేఖర.త—శ్లో॥ కుమ్భే పునర్వసూజాతం కేరళే చోళపట్టణే।
కౌస్తుభాంశం ధరాధీశం కులశేఖర మాశ్రయే॥

సీ. శ్రీరంగరాజని•స్సీమకృపోదిత,జ్ఞానభక్తివిరక్తి•జలధి యెవ్వఁ
డనిశము శ్రీరంగ•యాత్ర యెవ్వనిప్రోలఁ, జాటింపఁబడును ని•స్సంశయముగ
మాఘపునర్వసు • మహిఁగొల్లినగరియం, దవతరించినకౌస్తు•భాంశుఁ డెవ్వఁ
డలకేరకులకల•శాబ్ధిచంద్రుం డుగ్ర, చతురంగవాహినీ•శాలి యెవ్వఁ

తే. దఖిలభాగవతాబ్జబా•లార్కుఁ డెవ్వఁ, డమ్మహాత్మునిఁ గులశేఖ•రార్యు దలఁచి
పలికెదను దచ్చరిత్రము•భక్తి ననుచు, వాదిభీకరగురుఁడనె•మోద మలర.

సీ. సరసవేంకటగిరి•స్థావరజంగమా,న్యతరజన్మం బెవ్వఁ • డాశపడియె
సకలపురాణైక•సారముకుందమా, లికఁ జేసి చదువు నే • సకలవేత్త
యితిహాసరత్న మౌ•వితతరామాయణ, మనిశ మాలించు నే•యార్యవరుఁడు
సకల వైష్ణవులతో • సద్గోష్ఠి సల్పుచుఁ, గాలమేపుణ్యుండు•గడపుచుండు

తే. స్వామి యేధీరునకుఁ జూపె • స్వస్వరూప,రూపగుణభూతిచేష్టిత•దీపములను
నట్టి కులశేఖరుఁ దలంతు • నాత్మ ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ కులశేఖరుఁడు రాజ•కులశేఖరుం డొక,నాఁడు శ్రీరామాయ•ణంబు వినుచు
జానకి రక్షింప • సౌమిత్రి నొకగుహ,కడ నుంచి యెదిరించి • కడిఁది మించి
ఖరదూషణాదిర•క్షశ్చతుర్దశసహ,స్రములతోఁ బోరాడఁ • జనియె రాముఁ
డన విని ప్రేమవి•హ్వలితమనస్కుఁడై, చతురంగబలముతో•సాహ్య మొదవ

తే, వేగ చనుచుండ శ్రీరామ•విజయలేఖ,సుమతులెదురుగఁదెచ్చి యీఁ•జూచి మెచ్చి
మగిడి తనపురి కేఁగె న•మ్మాన్యుఁ డనుచు, వాదిభీకరగురు డనె • మోదమలర.

సీ. రామాయణంబు పౌ•రాణికుఁ డొకనాఁడు, చెప్పుచు నక్కుల•శేఖరునకు
మాయ శ్రీరామల•క్ష్మణులను వచించి, యసురేంద్రుఁ డాసీత•నపహరించె
ననుచు వక్కాణింప•విని కులశేఖరుం, డారావణునిఁ ద్రుంచి•యవనిసుతను
దెచ్చెదనని పల్కి • దివ్యాసిపాణి యై, దివ్యాశ్వమును నెక్కి • భవ్యగతులఁ

తే. గడలిపై వేగఁ జనుచుండఁ • బుడమిసుతను, జూపి శ్రీరామలక్ష్మణ•రూపి శౌరి
మగుడఁ దోడ్కొనివచ్చెన•మ్మాన్యుననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. శ్రీవైష్ణవులతోడఁ • జేసినమైత్రిచే, మనభూపుఁ డీమాడ్కి•మందుఁ డయ్యె
వీరితోఁ జెలి మింక • విడిపింపవలె నని, మంత్ర మొనర్చి య•మాత్యు లతని
పెరుమాళ్ళపెట్టెలో•వరదివ్యరత్నమౌ,క్తికహార మొక్కటి • తీసి దాఁచి
మనస్వామిహారము • గనిపింపలే దని, వింటి మాయింటిలో • వింతవారు

తే. చనరు భవదంతరంగవై•ష్ణవులు దక్క, వారెయిచ్చెదరాస్వామి•హార మనుచు
శేరకులశేఖరున కిట్లు • చెప్పిరనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర. 18

సీ. క్షోణి శ్రీవైష్ణవ • లోచ్చరులు గా రని, కృష్ణసర్పమువాతఁ • గేలు దూర్చి
యెత్తిన నారాజ•సత్తము శుభగుణ,మాన్యునిఁ జూచి వి•స్మయముఁ జెంది
తాము చేసినయకృ•త్యముఁ దెల్పి భయభక్తు,లమరఁ బ్రణామము•లాచరించి
ఘనరత్నకలితము•క్తాహార మారాజ,సన్నిధి నర్పించి • సచివు లరుగ

తే. నమ్మహామహుఁ డాదివ్య,హార మంత,మగిడితనస్వామికర్పించి•మహితరాజ్య
కలితసుఖములు విడనాడఁ•దలఁచె ననుచు,వాదిభీకర గురుఁడనె•మోదమలర

సీ. విష్ణుచింతానిత్య•విముఖులం గనుఁగొను, కడిఁదిఱంపపుఁగోఁతఁ•బడుటకంటె
వర మగ్ని దారుణ•జ్వాలావలీపంజ,రాంతర్వ్యవస్థితి • యరసి చూడఁ
గావున నీకలి,కలుషమంత్రులమైత్రి, చాలు మా కని రోసి • సద్గుణాఢ్యు
నాత్మజు నంత రా,జ్యాభిషిక్తునిఁ జేసి, వివిధవైభవముల,విడిచిపెట్టి

తే. సాత్త్వికాగ్రణు లైనవై,ష్ణవులఁ గూడి, శేరకులశేఖరుఁడు సూరి,శేఖరుండు
వచ్చి శ్రీరంగధామముఁ • జొచ్చె ననుచు, వాదిభీకరగురుఁ డనె,మోద మలర.

సీ. గంగపైఁ గాళిందిగతి శేషశయ్యపై, రంజిల్లు శ్రీరంగ,రాజమూర్తిఁ
గనుఁగొని పెన్నిధిఁ • గన్న దరిద్రుని,పగిది సంతోషించి • పరమభక్తి
భగవత్స్వరూపరూ,పగుణవిభూత్యుప, పాదకదివ్యప్ర,బంధములను
జేసి యాశ్రితులకుఁ • జెప్పి యందఱ నిట్లు, సుఖియింపఁ జేసె నే,సూరివర్యుఁ

తే. డట్టికులశేఖరాళ్వారి,యంఘ్రికమల, యుగళమే ప్రొద్దుచింతించు,యుక్తమతులఁ
దలఁచువారు కృతార్థులు • తథ్య మనుచు, వాదిభీకరగురుఁ డనె,మోదమలర.

శా. శ్రీమద్వ్యాసపరాశరప్రియమహా,సిద్ధాన్తసంస్థాపనా
కామక్రోధమదాదిదూర సుకవి•గ్రామప్రియాధానని
స్సీమాపాంగరథాంగపాణిగుణరాశిప్రేమ కర్మందిసు
త్రామా రంగవిమానమండపమహో,ద్యద్ధామా రామానుజా. 52

క. కాసారభూతమహితమ, హాసంయమిభక్తిసార,హరిపరభక్తి
శ్రీసంయుతకులశేఖర, వాసహృదబ్జా యతీంద్ర • వరగుణసాంద్రా. 53

మాలినీవృత్తము. ధరణిసుకవిగేయా ! దర్శితానంతకాయా
పరిహృతభవబాధా • భవ్యవేదాంతబోధా
గురుకృతపరిచర్యా • ముష్టమంత్రప్రచర్యా
**దురితతిమిర**చంద్రా • దూరతంద్రా యతీంద్రా.

గద్యము. ఇది శ్రీభగవద్రామానుజ కరుణాకటాక్షకలిత కవితావైభవపరవాదిభయంకరాచార్యాభిమతచ్ఛాత్రాపస్తంబసూత్ర కణ్వసగోత్ర పవిత్రోయకభవిమిత్ర వేంకటకృష్ణార్య పుత్రవిబుధ వైష్ణవవిధేయ కేశవనామధేయ ప్రణీతంబైన యాచార్యసూక్తిముక్తావళి యను మహాప్రబంధంబునం బూర్వభాగంబునందు శ్రీవైకుంఠవర్ణనంబును, ఆదిసూరిత్రితయజన్మక్రమంబును, తత్ప్రభావంబును, తిరుక్కోవలూరియం దన్యోన్యసంగతు లయినవారికి భగవంతుండు ప్రసన్నుండైన నతని వారు వినుతించుటయు, మహీసారక్షేత్రమాహాత్మ్యంబును, ఆ క్షేత్రంబునందు సప్తర్షికృతసత్రయాగప్రశంసయు, అనంతరంబ భార్గవమునికిందద్ధర్మపత్నియందు శ్రీసుదర్శనాంశంబున భక్తిసారయోగీంద్రుం డవతరించుటయు, కణిక్కణ్ణ రనుమహాత్ముని జన్మప్రశంసయు శ్రీమన్నారాయణుం డబ్భార్గవమునీంద్రునకుఁ బ్రసన్నుండై నిజస్వరూపగుణవిభూతివిస్తారం బగపఱిచి సకలహితంబు లుపదేశించుటయు, అమ్మహాత్ముండు కైరవిణీతీరంబునందు రుద్రునిం గనియతనితో సంవాదంబు సలిపి నిజప్రభావం బతనికిం దెలియంజేసి యతనిచే భక్తిసారనామధేయంబు లభించుటయు, మఱియు నమ్మునీంద్రుండు శుక్తిహారుండను ఖేచరునకుఁ దనప్రభావం బగపఱుచుటయు, నంతఁ గొంకణసిద్ధుండనువానికిఁ దన సామర్థ్యం బెఱింగించుటయు, అచటనుండి యేఁగి యతిరహస్యం బగునొకగుహాంతరాళంబునందు యోగారూఢుండై యుండి యాదిమసూరులం గనుంగొని వారితో నచటఁ గొంతకాలంబు గడపి యచ్చటినుండి మయూరపురికేతెంచుటయు, అచ్చటినుండి యాదిమసూరులు మువ్వురు భూసంచారంబునకు విచ్చేయుటయు, అంతట నబ్భక్తిసారమునీంద్రుండు మహీసారపురంబున కేతెంచి యచటఁ గొన్నిదినంబు లుండుటయు, అంత నద్దివ్యదేశంబు విడిచి సత్యవ్రతక్షేత్రంబుఁ జెంది యందు పొయిగసరస్తీరంబున నున్మనీభావావస్థాపన్నయోగధారణాపరుండై యుండుటయు, వృద్ధశుశ్రూషాప్రసన్నుండై యమ్ముదుసలికివరం బొసంగుటయు, కణిక్కణ రనుసాత్త్వికపుంగవుండరుగుదెంచి యాభక్తిసారు నాశ్రయింప నతనికి సకలహితంబు లుపదేశింమటయు, రాజ్యమవాధుండగువల్లవరాయఁ డనుతద్దేశాధిపతియవివేకంబునంజేసి యబ్భక్తిసార మునీంద్రుడలిగి చనిన నకాలప్రళయంబుదయించుటయు, మరల నమ్మహీపాలుని ప్రార్థనంబుచే నద్దేశంబు పూర్వప్రకారంబున సుఖంబుఁ జెందియుండుటయు, అమ్మహామునీంద్రుం డచటినుండి తిరుక్కొడందె కరుగుదెంచుచు, మార్గమధ్యంబునఁ బెరుంబులియూరను మహాగ్రామంబునం దన ప్రభావం బచటి బ్రాహ్మణులకుం దేట

పఱిచి వారికిఁ దత్త్వోపదేశంబు చేయుటయు, అచటనుండి శ్రీకుంభకోణక్షేత్రమునకు విచ్చేసి యచటఁ గొన్ని సంవత్సరంబు లాహారంబు వర్జించి యోగారూఢుండై యుండి యంతం గొన్ని దివ్యప్రబంధంబులు రచించి యాశ్రితులకు నుపదేశించి శ్రీసుదర్శనస్వరూపంబుఁ జెందుటయు, కులశేఖరసూరిసత్తముని తిరువవతారక్రమంబును, అమ్మహాత్ముం డేకాకి యగుచక్రవర్తికుమారునితోఁ బ్రసక్తంబగుఖరదూషణాదిచతుర్దశసహస్రరాక్షసులయుద్ధంబు విన నవధరించి చతురంగబలంబుతో నక్కోసలేశ్వరుండగురఘువీరునకు సహాయంబుగాఁ జనుచుండ మంత్రులుపాయంబు చేసి మరల్చుటయు, మఱియొకకాలంబునం దాసూరిసత్తముండు రావణకృతం బగుసీతాపహరణంబు విని వికోశఖడ్గపాణియైసముద్రమధ్యంబునం జనుచుండ భగవంతుం డగునారాయణుండు శ్రీరామలక్ష్మణరూపంబునం గానిపించి సీతాదేవినిం జూపి యమ్మహాత్ముని మరల్చుటయు, ఆ శ్రీవైష్ణవ సమృద్ధి యోర్వక మంత్రులు గృహారాధితుం డగుస్వామియాభరణం బొకటి మఱుఁగుపఱిచి శ్రీవైష్ణవులయందుఁ జౌర్యం బాపాదింప నక్కులశేఖరుండు కృష్ణసర్పంబు వాతఁ దనశ్రీహస్తం బుంచి శ్రీవైష్ణవులు చోరులు గా రని ప్రమాణంబు సేయుటయు మంత్రు లపరాధక్షమాపణంబు చేసికొనుటయు, అట్టి యమాత్యులసహవాసంబుఁ జాలించి నిజపుత్రునకుం బట్టాభిషేకంబు గావించి, యచటినుండి శ్రీవైష్ణవులం గూడి శ్రీరంగంబునకుం జనుదెంచి శ్రీరంగనాథునింగనుంగొని పొగడి స్వనిర్మితంబు లయినప్రబంధంబులాశ్రితులకుం జెప్పి యక్కులశేఖరుండు శ్రీకౌస్తుభస్వరూపంబుఁ జెందె నన్నది ప్రథమోల్లాసము.

— o —



పెరియాళ్వారులు

శ్రీమతే రామానుజాయ నమః



# ఆచార్యసూక్తిముక్తావళి

## పూర్వభాగము

---

## ద్వితీయోల్లాసము

### పెరియాళ్వార్ల వైభవము.

పెరియాళ్వార్లత. శ్లో॥ మిథునే స్వాతిజం విష్ణోః రథాంశం ధన్వినఃపురే।
ప్రపద్యే శ్వశురం విష్ణో ర్విష్ణుచిత్తం పురశ్శిఖమ్॥

క. ఆముక్తమాల్యదాగ్రజ, భూమహితతదీయకామ • పూరణకరణా
వామకుదృష్టివిరామా, ప్రామాణికితమ యతీంద్ర • భక్తారామా. 1

వ. అవధరింపుము. 2

సీ. శ్రీమదంగోపాంగ • శిక్షాన్వితామ్నాయ, విద్విప్రసాహస్ర • విలసితంబు
కమనీయరత్నసం • కలితకాంచనసౌధ, మందిరప్రాసాద • సుందరంబు
పటహకాహళశంఖ • భవ్యభేరీవేణు, వీణామృదంగని • స్వానరవము
ఫలపుష్పపల్లవ • భరనమ్రతరుసక్త, కలకంఠశారికా • కలరవంబు

తే. రమ్యపుష్కరిణిగల • రాజహంస, మతిమనోహరపతిదేవ • తాంగనాఢ్య
మలరుధన్విపురీరత్న • మనని ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మరల. 3

సీ. ఆపట్టణమునందు • శ్రీపతితుల్యుండుఁ, బరమవైదికుఁడు నౌ • బ్రాహ్మణునకు
మహనీయ మగుజ్యేష్ఠ • మాసమునందున, స్వాతితారకయందు • సకలవేద
మయుఁ డైన శ్రీగరు • త్మంతునియంశము, చేఁ బుట్టె నేవిష్ణు • చిత్తసూరి
యమ్మహామహుఁడు ప్ర • హ్లాదునిపోలిక, జన్మవైష్ణవుఁ డయ్యె • శౌరికృపను

తే. నట్టిశ్రీభట్టనాథుండు • హరి కిశేష, శేషతాకృత్యములయందు • శ్రేష్ఠ మైన
దాస్య మెయ్యది యనిమదిఁ • దలఁచెననుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర.

వ. అంతఁ బూర్వోక్తక్రమంబుగా నిర్హేతుక భగవదనుగ్రహంబుచే సహజదాస్యైకరతుండగు శ్రీవిష్ణుచిత్తుండు 'నాకించిత్కుర్వతశ్శేషత్వ' మ్మనియెడున్యాయంబున భగవంతుం డగునారాయణున కభిమతకైంకర్యం బొనర్పం దలంచి భగవదవతారంబు లన్నియు నరసిచూడ క్షీరార్ణవనికేతనుం డగునారాయణుండు శేషతల్పంబు విడిచి శ్రీమధురానగరంబునందు నందయశోదానందవర్ధనుండై పెరుఁగుచు దుష్టనిగ్రహశిష్టప్రతిపాలనంబుచే ధర్మసంస్థాపనంబు సేయం దలంచి బలభద్రసహాయుండై కంసవధార్థంబుగా మధురాపురంబున కేతెంచి శ్రీమాలాకారగృహంబుఁజొచ్చి యమ్మహాత్ముండు సుగంధపుష్పమాల్యంబులు సమర్పించి పూజింపం బ్రసన్నుండై యమ్మాలాకారు ననుగ్రహించెంగావున నట్లు వడపెరుంగోయిలుడయా ననుశ్రీహరికిం బుష్పమాల్యాదికైంకర్యం బొనర్పంబూని యంతఁ ద్రియోజనాయామవిస్తారం బగుతిరునందవనం బొనర్చి నిరంతరంబును శ్రీతులసీపుష్పమాల్యాదిసమర్పణంబు సేయుచున్నసమయంబునఁ బాండ్య దేశంబునందు మధురాభిధాననగరంబునందు పల్లవదేవరాయం డనురాజసత్తముం డతిధార్మికుండు గావున న్యాయమార్గంబునం బ్రజాపరిపాలనంబుసేయుచు నొక్కనాఁ డర్ధరాత్రసమయంబున నగరీశోధనార్థంబుగాఁ దా నేతెంచుచు నొక్కవీధి ద్వారవేదికయందు నిద్రించుచున్న యొకవిప్రునింగాంచి మేలుకొలిపి మీ రెవ్వ రని యడుగ నతం డిట్లనియె. నే నొకబ్రాహ్మణుండను. గంగా స్నానంబు చేసి వచ్చితి నన్న నీకుపస్థితం బగుశ్లోకం బొక్కటిచదువు మనిరా జడిగిన నవ్విప్రసత్తముండు శ్లో॥ వర్షార్థ మష్టౌ ప్రయతేత మాసాన్ నిశార్థ మర్ధం దివసం యతేత। వార్ధక్యహేతోర్వయసానవేన పరత్రహేతోరిహజన్మనాచ॥ అనుశ్లోకంబుఁ బఠింప విని యా నృపాలశేఖరుండు తనమనంబున నిట్లని చింతించె దృష్టఫలంబులం చొకగోరంత మాకుఁగానఁబడ దింక నదృష్టఫలంబు సిద్ధించుట కుపాయం బెద్ది యని వ్యాకులితాంతః కరణుండై తనకుం బురోహితుం డగుశెల్వనంబి యనుమతిమంతునిం బిలిపించి యాలోచింప నతం డిట్లనియె 'ధర్మజ్ఞసమయః ప్రమాణం వేదాశ్చ' అనియెడున్యాయంబున వేదవేదాంగ వేదాంతవిత్తము లగుబ్రాహ్మణోత్తములం బిలిపించి యడిగిన వారలు పరతత్త్వ నిర్ణయం బొనర్చెదరు. ఆ ప్రకారంబుగాఁ బరతత్త్వనిర్ణయం బెఱింగినఁ 'దత్త్వజ్ఞానాన్మోక్షః' అనియెడున్యాయంబునఁ దత్త్వజ్ఞానంబుచేఁ బరమపురుషార్థలక్షణమోక్షంబు సిద్ధించు నని తెలిపిన నారాజన్యసత్తముండును స్వపురోహితోక్తులువిని మిగుల నానందించి బహుద్రవ్యంబు విద్యాశుల్కంబుగా ముల్లె గట్టి యొక తోరణ స్తంభంబునంగట్టించి విద్వాంసులం

బిలిపించె నా సమయంబున వడపెరుంగోయిలుడయా నను భగవంతుండు శ్రీవిష్ణు చిత్తసూరీంద్రునకు స్వప్నంబునందుఁ దన్నుఁ బొడసూపి యిట్లనియె. మహాత్మా నీవు మధురాపురంబునకుం జని వల్లభదేవరాయనిం గాంచి యమ్మహీపతివిద్వత్స భయందుఁ బరపక్షవిక్షేపణపూర్వకంబు గా సర్వవేదాంతప్రతిపాద్యం బగుపర తత్త్వంబు నిర్ణయించి స్వపక్షంబు స్థాపించి విద్యాశుల్కం బగునర్థనంబు దెచ్చు కొమ్మనిన నాహరికి విష్ణుచిత్తుం డిట్లనియె సర్వవేదాంత ప్రతిపాద్యవేదశాస్త్రా ధ్యయనాదిజనితజ్ఞానవాసనాహీనుండ నగునేను విద్యాశుల్కంబైన యర్థనంబుఁ బుష్పవనఖననజనితస్వపాణితల కిణగణంబుఁ జూపి తేవలయుఁగానివేఱొకయధి కారంబునంగొన లేననిన సర్వవాగీశ్వరేశ్వరుం డగుభగవంతుండు సర్వనిర్వాహ కుండ నైన నేను భవన్మానసపద్మంబునం గనంబడుచుండ నీకొకకొఱఁత సంభ వింపదు గావున మద్వాక్యంబులు విశ్వసింపం దగు నని యానతిచ్చి సర్వేశ్వరుం డంతర్హితుండయ్యె. అంత భాగవతోత్తముం డగుశ్రీవిష్ణుచిత్తుండు బ్రాహ్మ్య ముహూర్తంబునందు మేల్కాంచి భగదాజ్ఞారూపంబు లగు కాలోచితకృత్యంబు లొనర్చి స్వప్న దృష్టభగవద్విగ్రహం బనుక్షణంబుస్మరియించుచు విస్మయావిష్ట మనస్కుండై యాహరిసూక్తులు విశ్వసించి పాండ్యదేశాధీశ్వరుం డగువల్లవ దేవరాయని విద్వద్గోష్ఠికడ కేతెంచినం జూచి యమ్మహీపతియుఁ దత్పురోహితుఁ డగు శెల్వనంబియును బ్రత్యుత్థానప్రణామాదిపూర్వకంబుగా ద్విజతిలకుం డగునా విష్ణుచిత్తునిం బూజించి మిగుల నాదరింపఁ గనుంగొని యచటివిద్వాంసు లట్లి రాజసత్తమా యీతండు వేదాభ్యాసంబు సేయలేదు దురవగాహంబు లగుశాస్త్రం బులత్రోవ వించుకయైనను నెఱుంగఁ డిట్టివాఁ డెట్లుపరతత్త్వనిర్ణయం బొనర్చు నని పూజించితి వని యప్పాండ్యనృపాలుని నధిక్షేపించి పలుక నంత నభిజ్ఞుం డగుశెల్వనంబి సాష్టాంగప్రణామం బొనర్చి వేదాంతప్రతిపాద్యంబగుపరతత్త్వంబు నిర్ణయింపు మని శ్రీవిష్ణుచిత్తునకు విజ్ఞాపనం బొనర్చు సమయంబున భగవంతుం డగు శ్రీవాల్మీకి మునీంద్రుండు పితామహప్రసాదలబ్ధదివ్యదృష్టిచే యథావస్థితహాసిత భాషితగతిచేష్టితాదిసర్వార్థంబులు సాక్షాత్కరించినట్లు, నుత్తానపాదతనయుం డగు ధ్రువుండు శ్రీపాంచజన్యసంస్పర్శనంబుచే సర్వజ్ఞుం డైనతెఱంగునను. శ్రీధన్వి పురీనిత్యనివాసుం డగుశ్రీనివాసునియనుగ్రహంబుచేత సాంగోపాంగసశిరస్కసర్వ వేదార్థాభిజ్ఞుండైన శ్రీవిష్ణుచిత్తుండు 'యతోవా ఇమా' నిత్యాదిశ్రుత్యుక్తక్రమంబునఁ బరబ్రహ్మంబు జగజ్జన్మాదికారణత్వలక్షణలక్షితంబు గా నిర్ణయించి యాబ్రహ్మంబు 'ఏకోహవై నారాయణ ఆసీత్' ఇత్యాదివిశేషోపనిషద్వాక్యంబులచే శ్రీమంతుం

డగు నారాయణుం డనియునతం డకారవాచ్యుం డనియు ననేక శ్రుతి స్మృతీతిహాస పురాణరూపబలవత్ప్రమాణ సహస్రంబులచే సిద్ధాంతం బొనర్చినఁదోరణ స్తంభంబునం గౌశేయకాండపటబద్ధం బగునమ్మహాధనం బీశ్వరప్రేరితం బై యమ్మహాత్ముని శ్రీపాదసమీపంబునం బడిన సంతుష్టాంతరంగుం డయి యతం డది పరిగ్రహించె నంత. 5

సీ. ఆమహాత్మునియందు • హరియనుగ్రహమట్లు, ప్రసరింపఁ గనిముందు • పరిభవించు
పండితు లాపాండ్య • మండలేశ్వరుఁడును, శెల్వనంబియు నిర్వి • శేషముగను
గడుభక్తిఁ బ్రణతులు • గావించి రారాజు, కనకభూషితభద్ర • గజముపైని
గేలూఁతయిచ్చియె • క్కించియగ్గురునకు, భట్టనాథుం డని • భవ్యనామ

తే. మాచరించెను బండితు • లాతపత్ర, విమలచామరతాళవృం • తములఁబూని
భట్టనాథునిఁగొలిచిరి • భక్తినసుచు, వాదిభీకరుగురుఁడనె • మోద మలర.

సీ. రాజవల్లభదేవ • రాయఁ డమాత్యాది, పరిజనసహితు డై • బయలుదేరి
భద్రగజస్థుఁ డౌ • భట్టనాథార్యుని, వెనువెంటఁ జనుచుండ • వేశ్యలాడఁ
బంచమహావాద్య • పటహకాహళశంఖ, భేరీమృదంగాది • భూరిరవము
వేణువీణాగత • వేదఘోషములును, వందిమాగధసూత • బృందరవము

తే. లన్ని గుమిగూడి బ్రహ్మాండ•మంత నిండి, భట్టనాథజయోత్సవ • ప్రాభవంబు
స్థిరచరప్రాణులకు నెల్లఁ • దెల్పె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. తనయుఁడుబ్రహ్మర • థం బెక్కఁగను జూచు, తల్లిదండ్రులగతి•నుల్ల మలరఁ
బరమభక్తుం డగు • భట్టనాథునిఁ గన, శ్రీవాసుదేవుఁడు • సిరిని గూడి
వేల్పులు గొనియాడ • వినువీథిఁ గనిపింపఁ, గనకాద్రిపై నీల • ఘనముఁబోలె
గరుడవాహారూఢుఁ • గఱివేల్పు నీక్షించి, పరమభక్తుం డగు • భట్టనాథ

తే. గురుఁడు గజఘంటికాతాళ • కుశలపాణి, పల్లవధ్వని సొంపార • భక్తి హరికి
బహువిధంబులఁ బల్లాండు • పాడె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. వీడ్కొల్పి రాజులు • విల్లిపుత్తూరికి, మగిడి యేతెంచి య • మ్మధుహరునకుఁ
జేమోడ్చి విజయోక్తిఁ•జెప్పికన్నోమ్రిలను, సాధన మర్పించి • యతనియాజ్ఞ
మరలఁ గైకొని చని • మనికిపట్టునఁ దదీ, యారాధనము నిత్య • మాచరించు
చును దొంటిక్రమమున • సురభినానాపుష్ప, మాల్యములొసఁగుచు • మాధవునకుఁ



శూడికొడుత్తనాచ్చియారులు

తే. బంవశతగాథఁవ్యప్ర • బంధ మలరఁ, జేసి శ్రీవైష్ణవుల కెల్లఁ • జెప్పి యిట్లు
సేమ మొనరించె శ్రీవిష్ణుచిత్తుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

## శూడిక్కొడుత్తనాచ్చియారు వైభవము

శూడిక్కొడుత్తనాచ్చి-త. శ్లో॥ కర్కటే పూర్వఫల్గున్యాం తులసీకాననోద్భవామ్।
పాణ్డ్యేవిశ్వమ్భరాం గోదాం వన్దేశ్రీరఙ్గనాయకీమ్॥

సీ. జనకరా జధ్వర • స్థలము దున్నించిన, సమకూడునాఁగటి • చాలునందు
శ్రీదేవి తానె సీ • తాదేవి యై పుట్ట, బిడ్డగా జనకుఁడు • పెంచినట్లు
కేల ఖనిత్రముఁ • గీలించి శ్రీభట్ట, నాథుండు తులసీవ • నంబుఁ ద్రవ్వ
నందుఁ గర్కటకము • నందుఁ బూర్వాపల్గు, నీశుభర్క్షమునందు • నిరుపమాన

తే కాంతిసౌందర్యశిరోమణి • గానఁబడిన, విస్మయముఁజెందియాబ్రహ్మ • వేత్తపొంగి
యంచితంబుగ సుత యని • పెంచెననుచు, వాదిభీక గురుఁడనె • మోద మలర.

సీ. జనకునింటను బొల్చి • జానకిపగిదిని, విష్ణుచిత్తునియింట • విమలపక్ష
చంద్రరేఖయుఁబోలె • సంతతపరివర్ధ, మానదివ్యాంగియై • మధురవాణి
భువనైకసుందరి • భూస్వరూపిణి యైన, భట్టనాథునిముద్దు • పట్టి నంత
మునుపటివిద్యలు • మూర్తులు గొనివచ్చి, కలిమికొమ్మను దేవ • కాంతలట్లు

తే. కొలువు సలుపుచునుండ న • కువలయాక్షి, దల్లి చంద్రులయుల్లము • ల్లసిల్ల
విల్లిపుత్తూరియందు రంజిల్లె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. వరధన్విపురియందు • వటపత్రశాయికై, విష్ణుచిత్తగురుండు • విమలసరులఁ
గట్టియుంచినఁజూచి • కన్నియ మఱుఁగుగాఁ, బుష్పమాలికలను • బొసఁగఁదాల్చి
యాదర్శ మీక్షించి • హర్షించి యెప్పటియట్లుంపఁ గని తండ్రి • యలిగి హరికి
నర్పింప కున్నంత • నారాత్రి కలలోన, హరి గనంబడి యిట్టు • లనియె నతని

తే. కార్యమియాపేశ మాల్యము • లందవయ్యె, నేమితాఁ ఱమిదిమాకు • నెఱుఁగఁబలుకు
మనిన హరికిట్టు లనియెన • య్యార్యుఁడనుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర,

సీ. మత్పుత్రి మెఱుఁగక • మాల్యములిపి దాల్చె, నవి మీ కొసంగ రా • దని తలంచి
యర్పింపనైతినే • నపరాధ మోర్పుమా, యని యగ్గురుం డన • హరియుఁబలికె
ధన్యుఁడ వీవు నీ • తనయ దాల్చినపుష్ప, మాల్యము లన్నియు • మా కతిప్రి
యము లతిభోగ్యము • లతిసౌరభము లగుఁ, గాన మాకవియిమ్ము • గిణ్యాసుగుణ

తే. యనుచు ధన్విపురీశ్వరుఁ • డానతిచ్చె, గోచరుఁడు గాక పోయిన • గురువరుండు
తాను మేల్కాంచిమదినిట్లు• దలఁచె ననుచు, వాదిభీకరగురుఁ డనె• మోద మలర.

సీ. నీళయో భూమియో • నీరధికన్యయో, పుట్టెఁగాఁబోలు మ • త్పుత్రి యగుచు
నట్లుగా కున్న నీ • యస్మత్తనూజకు, మాధవుఁ డిట్లేల • మరులుకొనును
దా ధరించినపుష్ప • దామము లీహరి, ప్రీతికై యొసఁగె నీ • పిన్న దనుచు
గురుఁ డాత్మజకు శూడి • కొడుతను పే రిడె, నాఁటనుండియు భట్ట • నాథపుత్రి

తే. కాశుభాఖ్యనిరూపక • మై చెలంగె, సిరి వహించును వైష్ణవ• స్త్రీల కెల్ల
నై పుణినొనర్ప నాదివ్య • నామ మనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఈచూడికుడుత తా • నేడేండ్లబాల యై, హరియవతారము • లరసి చూచి
కృష్ణోదయము సన్ని • కృష్టము గావునఁ, జిత్త మాహరియెడఁ • జేర్చి యతని
సంశ్లేష మబ్బక • శౌరిని గోపిక, లట్లు తా వారల • ననుకరించి
చేసెఁ దిరుప్పావు • వాసిగా నాచ్చారు, తిరుమొళి యనురెండు • దివ్యకృతుల

తే. నవ్వులకు నై నసహచరు•ల్నరుఁడె భర్త, నీకనుచుఁ బల్కవినిమూర్ఛ•నివ్వటిల్ల
సుఖముఁజెందక యక్కన్య•సొలయు ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. సరసిజాక్షికిఁ బతి • సంయోగసులభమౌ, యౌవనమీక్షించి • యర్హతముని
వరునిఁ గానక తండ్రి • వగచుచు నున్నంత, గురుని కిట్లనిశూడి • కొడుత పలికె
కలుములజవరాలు • కాంక్షించెనెవ్వాని, వాఁడె యల్లుఁడు నీకు • వరగుణ యన
నర్చాస్వరూపియై • హరినూటయెనిమిది, దివ్యదేశములందు • దృఢత నుండె

తే. వారియం దిష్టతముఁ డైన • వరుని నీవె, కోరికొమ్మని పుత్రికి•గురుఁడు పలుకఁ
దండ్రి కిట్లని పలికెన • త్తరుణి యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. సర్వజ్ఞదివ్యదే • శము లన్నియును దత్ప్రి•భావమంతయుఁ దెల్పు • భావమలర
వినినయెచ్చోటు నా • వీనుల కింపగు, నచ్చోటిహరియె నీ • కల్లుఁ డగును
అని కూఁతు రనిన న•య్యార్యుఁడు విని నూట, యెనిమిదితిరుపతు•లనుపమాన
మగుతత్ప్రభావ మ • య్యాత్మజ కెఱిఁగింప, నద్దేవి వంగథా • మాతిశయము

తే. విని యనంతశయానుఁడు • వివిధదివ్య, సూరివినుతుండు శ్రీరంగ • శౌరి తనకు
భర్త యని తండ్రి కట లేక• పలికెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. అని యిప్పగిది నప్పెదలి నిజాభిప్రాయం బెఱింగించిన నమ్మహాత్ముండు తన
మనంబున. 18

సీ. మత్పుత్రి కిష్ట మే • మాడ్కని సమకూడు, నని తండ్రి చింతింప • నతనికలను
గనఁబడి హరి పల్కె • వినవయ్య నీపుత్రి, మత్ప్రాణతుల్య యౌ • మహిషిమాకుఁ
గానఁ జింతింప న • క్కఱ లే దనుచుఁ బల్కి, సన్నిధివారి కా • శౌరి పలికె
శతశలాక చ్ఛత్ర • చామరతాళవృం, తపతాకభవ్యవా • ద్యములతోడ

తే. మీరు చని భట్టనాథాఖ్య • సూరిసుతను, నంచితస్వర్ణశిబిక యం • దుంచి యిటకుఁ
దోడితెం డనె హరి వారి • తోడ ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. శ్రీరంగ రాజాజ్ఞ • శిరమున ధరియించి, తత్పరిచారకుల్ • ధన్వినగరి
కరిగి శ్రీభట్టనా • ధార్యున కెఱిఁగింప, నానందభరితుఁ డై • యతఁడు సుతను
నందలం బెక్కించి • యానంబుపై సూక్ష్మ, కనకచేలముఁ గప్పి • కదలి యచట
నృత్యగీతరవంబు • నిఖిలవాద్యధ్వనుల్, దిగ్మండలంబుల • పౌగ రడంప

తే. వచ్చి శ్రీరంగధామముఁ • జొచ్చె నంత, వాడవాడలవనితలు • వచ్చి చూచి
భవ్యమతి నిట్లు తమలోనఁ • బలికి రనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఈపిన్న పాపచే • యిల భట్టనాథుండు, తులసీవనముఁ ద్రవ్వ • వెలసియుండె
నీముద్దుగుమ్మచే • యిట సూరివరులకుఁ, బదుగురికిని ముద్దు • పట్టి యయ్యె
నీమందయానచే • తాముందుగాఁ దాల్చి, విరులదండలు హరి • కొఱకొసంగె
నీముద్దరాలచే • యిచ్చచేఁ దాగొల్ల, పడఁతి యై కృష్ణాను • భావ మొందెఁ

తే దగును శ్రీరంగభర్త యీ • తరుణి కతని. కీశుభాంగియుఁదగు నని • యింతులనఁగ
భావ మలరంగ వినియె న • ద్దేవి యనుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర.

సీ. బ్రహ్మవేత్తలతోడ • భట్టనాథగురుండు, వెనువెంటఁ జనుదేర • వేడ్కమీఱ
భవ్యవాద్యములతోఁ • బ్రణవవిమానము, ప్రక్రమం బొనరించి • భక్తి మించి
తప్తచామీకర • స్తంభగుంభితమహా, మణికుట్టిమాస్థాన • మంటపమునఁ
బల్లకీ దిగి మంచి • పసిఁడిపుట్టము పైని, గప్పి యల్లల్లనఁ • గదలి వచ్చి

తే. యాంతరాళికదివ్యాల • యంబుఁ జొచ్చి, విష్ణుచిత్తార్యపుత్రిక • విభవ మలర
రంగధామునిఁ జూచియు • ప్పొంగె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ శ్రీలలనాకాము • నీలమేఘశ్యాము, రమ్యగుణస్తోము • రంగధాముఁ
గనుఁగొని కడువేడ్కఁ • గరపద్మములు మోడ్చి, శేషతల్పంబెక్కి • చింతఁ దక్కి
మగని శ్రీపాదప • ద్మములు లాలించుచు, నద్దేవి గనఁబడ • దాయె నంతఁ
బుత్రిని గానక • బోరన నేడ్చిన, భట్టనాథుని కిట్లు • పలికె శౌరి

తే. మామ వైతివి దుగ్ధాబ్ధి • మాడ్కి మాకు, నీదుసుతతోడ నేను గ • న్నింతునీకుఁ
జింత వల దని మఱియును • జెప్పె ననుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర.

సీ. శ్రీవిల్లిపుత్తూరిఁ • జేరి యెప్పటియట్ల, సతతము వటపత్ర • శాయికచటఁ
బుష్పకైంకర్యము • పొలు పార సలుపుచుఁ, గలిగినకాలముఁ • గడుపు మనుచుఁ
బలికి రంగేశుఁడు • బహుమతు లొనరించి, పంచిన నేతెంచి • భట్టనాథ
గురుఁడు ధన్విపురంబు • హరికి సుగంధిప్ర, సూనదామములను • సొబగు మీఱఁ

తే. గట్టి యర్పించుచునె యున్న • కాల మంతఁ, గడపె లోకము వెల్లను • ఖంబుఁ జెందఁ
ననుచుఁ బెద్దలు చెప్పి రీ • యర్థ మనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

## తొండరడిప్పొడియాళ్వారుల వైభవము

తొండరడిప్పొడి-త. శ్లో॥ కోదణ్డే జ్యేష్ఠనక్షత్రే మణ్డంగుడిపురోద్భవమ్ ।
చోళోర్వ్యాం వనమాలాంశం భక్తపద్రేణు మాశ్రయే ॥

సీ. భువిని మండంగుడి • పురిమతల్లి కయందు, శ్రేష్ఠమౌ శ్రీధను • ర్జ్యేష్ఠయందు
దేవేశువై జయం • తీవనమాలికాం, శంబుచే విప్రవం • శమునఁ బుట్టి
శౌరికటాక్షవీ • క్షాలబ్ధసాత్త్విక, తాస్తికతాద్యఖి • లాత్మగుణుఁడు
విష్ణుకృపాప్రాప్త • వివిధసాంగోపాంగ, సశిరస్కవేదవి • జ్ఞానఘనుఁడు

తే. విప్రనారాయణుం డన • వెలసి విరతిఁ, దనరి పెండ్లాడకయ కౌన్ని • దినము లవట
నుండి యంతట శ్రీరంగ • మొందె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. కలితమరుద్వృధా • గర్భసంభృతమణి, ప్రాకారసప్తక • పరివృతంబు
మహనీయమణిమయ • మండపగోపుర, ప్రాసాదసౌధాది • పంక్తియుతము
విపణిప్రసారిత • వివిధరత్నవితాన, విక్రయక్రయశోభి • వివిధజనము
సకలసాంగోపాంగ • సశిరస్కవేదశా, స్త్రవిచారభాసుర • బ్రహ్మకులము

తే. చంద్రపుష్కరిణీతీర • చారునగము, రమ్యరమణీసముల్లస • ద్రంగపదము
విప్రనారాయణుఁడు చూచె • వేడ్క ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. కలధౌతగిరిమీఁదఁ • గాలమేఘముఁ బోలె, శేషతల్పస్థితిఁ • జెందువానిఁ
గరుణాకటాక్షవీ • క్షాసుధావృష్టిచే, దాససస్యములను • దనుపువాని
శంఖచక్రగదాసి • శార్ఙ్గాయుధాకల్ప, ఘనబాహుశాఖలు • గలుగువాని
సిరి యురస్థలి నంఘ్రి • చెంత భూనీళలు, పొలుపారఁ జూచి యు • ప్పొంగువానిఁ



తొండరడిప్పొడియాళ్వారులు

తే. గనక మణిభూషణంబుల • కలిమివాని, రంగభర్తను జూచి యు•ప్పొంగి(మ్రొక్కి
విప్రనారాయణుఁడు చేసె•వినుతు లనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. అనంతరంబ. 28

సీ ముందు మాలాకార • ముఖ్యులు పుష్పదా, మము లమ్యతున కిచ్చి • మంచిఁగనిరి
కావున నే నట్ల • కస్తూరిఁ౦గని, కింపుగాఁ బూఁదోట • యేర్పరించి
యనిశము కైంకర్య • మాచరించెద నని, పూనియొక్కెడ మంచి • భూమి చూచి
దున్నించి యచ్చటఁ • దులసీవనంబులు, మల్లికామాలతీ • మండపములు

తే. సన్నగన్నేరులును విర • జాదిలతలుఁ, దెల్ల చేమంతులును బొందు•మల్లెపొదలు
వేసి పెంచెను నాబ్రహ్మ • వేత్త యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. పాటలీపున్నాగ • పారిజాతాశోక, కేతకీచాంపేయ • కేసరములు
కర్ణికారకదంబ • కాశ్మీరకురవక, చందనాగురుహరి • చందనములు
నారికేళంబులు • నాగవల్లీవృత, పూగీవనంబులు • భూరిపనస
ఖర్జూరసహకార • కదళీవనంబులు, జాంబవామలకోరు • జంభలములు

తే. సురభిపుష్పఫలాశేష • తరువు లిట్లు, నాటి నద్దైన లామడ • తోఁటఁ జేసి
వాసి కెక్కెను నావిప్ర • వర్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. పద్మాకరములందు • బకకోకకలహంస, కారండవక్రౌంచ • ఘనరవములు
అచటికాసారము • లంభోజమధుపాన, మత్తభ్రమరగీత • మంగళములు
అచ్ఛోదదీర్ఘిక • లబ్జనీలోత్పల, కైరవకల్హార • గంధవతులు
అమృతోదకంబులు • హ్రదము లచ్చటియేటి, కాల్వలు విలసిల్లు • గణన మాని

తే, యట్లు స్థలజలమణీయ•తాభిరామ, మైనపువ్వులతోఁటఁ దా • నాచరించి
వృద్ధిఁ బొందించెనాసర్వ • వేత్త యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. రమ్యనందనచైత్ర • రథముఖ్యసురవన, దివ్యవృక్షములను • ధిక్కరించి
విలసిల్లుచును నిజ • విరచితారామవృ, క్షము లన్ని యభివృద్ధిఁ • గాంచ నతఁడు
సూచి సంతోషించి • సురభిపుష్పంబులుఁ, దులసీదళంబులుఁ • దునిమి తెచ్చి
తనపర్ణశాలవి • తర్దికయం దుంచి, రచియించి మాల్యముల్ • రంగభర్త

తే. కని సమర్పించుచుండ న • య్యార్యవరుని, రంగనాయకియును రంగ • రాజశౌరి
గాంచి యానంద మొందిరి • కరుణ ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. మంతనంబునఁ దన • మహిషి కిట్లని రంగ, రాజానతిచ్చెను • రంగు మీఱ
దేవి మల్లీలావి • ధేయునిఁగా విప్ర, నారాయణునిఁ గొన్ని • నాళ్లొనర్చి
మఱల నెప్పటియట్ల • మామకభక్తాగ్ర, గణ్యునిఁగాఁ జేసి • గారవింతుఁ
గరుణచేఁ బ్రారబ్ధ • కర్మానుభవ మిట్లు, గావింతు నతనికిఁ • గమలనేత్ర

తే యనుచు సర్వస్వతంత్రుఁ డౌ • నమ్మురారి, పలుక విని వేళగా దని • పాలవెల్లి
పట్టియేమియు ననదాయె • భర్తకనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. సురభినానాపుష్ప • సుందరతులసీవి, శాంచితనవ్యమా • ల్యములఁ దెచ్చి
భట్టనాథుఁడు ధన్వి • పట్టణవాసికి, శార్ఙ్గికి నిత్య మొ • సంగినట్లు
నానాసుగంధిప్ర • సూనదామంబులు, నవతులసీదళ • సద్ధమాల్య
ములు రంగపతికి స • మ్మోదంబునను నిత్య, మర్పించుచును నిజో • ద్యానవనముఁ

తే. జక్కఁజేయుచుఁ దనపర్ణ • శాలయందు, విప్రనారాయణుఁడు బ్రహ్మ • విత్తముండు
పుండరీకాక్షచిత్తుఁ డై • యుండె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. ఆసమయంబునఁ దిరుక్కరంబనూ రనుగ్రామంబునందు దివ్యాంగనాంశజాతయు సర్వావయవసౌందర్యవతియు నయినదేవదేవి యనునొక్కవారవిలాసిని మధుకరవేణి యగుమధురవాణి యనుసహోదరిం గూడికొని నిజపరివారంబుతో నిచుళాపురంబునకుం జని యందుఁ జోళభూపాలునిం గాంచి సరససంగీతనాట్యకేళికళావిలాసాతిశయంబులచే నమ్మహీపాలునిచిత్తంబురంజిల్లంజేసియారాజుచే బహుమతిఁ గాంచి నిజసహచరీగణంబుతో మగిడియేతెంచుచు మార్గశ్రమవ్యపనోదనార్థంబుగా శ్రీవిప్రనారాయణసంవర్ధితపుష్పోద్యానవనంబునందొక్క వృక్షచ్ఛాయనుండిపనససహకారపాటలీపున్నాగనారికేళనారంగజంబీరవికచకదళీకురవకవకుళాశోక పూగీప్రభృతివృక్షషండవిటపారూఢశుకపికశారికాదిపక్షిసంఘమధురకూజితనిరంతరవసంత కాంతం బయి నానావిధసుగంధిపుష్ప సందోహానవరతస్యందమానమకరందపానమత్తనిజ కీర్తిగాథాకథకవందిబృందాయమానేందిందిరబృందమధురగీతభరితంబును గేతకీమాధవీమాలతీమల్లికారవిందకల్హారేందీవరచంపక చందనాగురుప్రముఖబంధురసుగంధామందమందమారుతసుందరంబును నిరంతరనిఖిలర్తునిషేవ్యమాణంబును సకలజగజ్జననయనమనోభిరామంబునైన యయ్యారామంబుంగాంచి యద్దేవదేవి యక్కా యివ్వనంబు నందనచైత్రరథాదిదేవోద్యానంబుల మించి యంచితంబై యున్నయదియన నద్దేవదేవి కగ్రజ యిట్లనియె స్వకీయ

సురభిపుష్పప్రకర్షంబుచే దేవాదిదేవుం డగుశ్రీరంగనాధునియుత్తమాంగం బలంకరించుచునమ్మహాత్ముని మృగయావిహారజనితశ్రమాప నోదనం బొనర్చు నిమ్మహోపవనం బనవరతతదీయదాస్యరతల మైనయస్మదాదులకు మార్గశ్రమాపనోదనం బాచరించుట వింత కాదని పరస్పరప్రియసల్లాపంబు లాడుచు వారిరువురు నారామలక్ష్మీ నిరీక్షణంబు సేయు చుండి రంత. 35

సీ. దీర్ఘశిరోరుహ • దృఢబంధవిలసిత, శీర్షుని శ్మశ్రులాం • ఛితముఖాబ్జు
రోమశాఖిలగాత్రు • రుచిరపక్ష్మలనేత్రు, ధౌతవస్త్రునిఁ బాణి • తలఖనిత్రు
ద్వాదశస్థలధృత • దవళోర్ధ్వపుండ్రునిఁ, దులసీనలినబీజ • వలయధరుని
విమలోపవీతుని • సుమకుంజతరులతా, జలసేచనావాల • కలనశీలు

తే. విప్రనారాయణునిఁ జూచి • దీప్రరత్న, దివ్యభూషణయద్దేవ • దేవిదాసి
విలసితంబొప్పఁగనుమ్రోల • నిలిచెననుచు, వాదిభీక-గురుఁడనె • మోద మలర.

సీ. స్వకపుష్పకైంకర్య • సక్తచేతస్కుఁడై, కన్నెత్తిచూడఁ డ • క్కాంత నాతఁ
డంత నాయింతి ని • జాగ్రజ కిట్లని, పలికెను భగిని యీ • బ్రాహ్మణుండు
కనుమ్రోలలనున్నను • గన్నెత్తిమూడఁడు, షండుఁడో భ్రాంతుఁడో • సఖియెఱుంగ
నని పల్కుచెలియలి • కక్కయిట్లనియెను, భగవదత్రియ • భక్తుఁ డాతఁ

తే. డతనిసర్వేంద్రియంబులు • హరిపదములు,గానివెంగలియనునూబ • గాఁడతండు
భవ్యుఁ డని చెల్లెలికిఁ బల్కె • భగినియనుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర.

వ. అంత నద్దేవదేవి యమ్మాట లాలించి నిజాగ్రజ కిట్లనియె. 38

సీ. కణ్వమహాముని • కాన బల్తప మొంచి, మోహించెఁ గాదెప్ల • మోచఁ జూచి
మత్స్యగంధినిగాంచి • మదనకేళియొనర్చె, సాత్త్వికాగ్రణిపరా • శరుఁడుముందు
శ్రీవ్యాసముని ఘృతా • చినిజూచి మోహించి, శుకునిబుట్టింపఁడే • సురలుమెచ్చఁ
గౌశికముని మేన•కను గూడి పదియేండ్లు, దిన మొక్కటిగ నెంచె • వనమునందు

తే. సులభులైరాదిమునులిట్లుసుందరులకు, మనకితఁడువశ్యుఁడౌ టెంతమాత్రమనుచుఁ
బలికె నద్దేవదేవియా • భగిని కనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 39

సీ. ఇట్టిబాఁపలు మన • యింటివాకిటఁ బడి, గాపులు పడియుండ్రు • మాపటంత
నని చెల్లె లనవిని•యక్కయిట్లనియెను, గూర్మి నీకితఁ డను•కూలుఁ డాయె
నేని నీయింట నీ • కే నాఋమాసము, లూడిగ మొనరింతు • నుర్వి మెచ్చ
నీ విమ్మహాత్ముని • నీవశవర్తిఁగాఁ, జేయకుండితివేని • తోయజాక్షి

తే నీవు నాయింటఁ బను లాఱు • నెలలు సేయు, మనుచు నద్దేవదేవికి•నక్క పలికెఁ బంత మిట్లాడె రిప్పుణ్య • భామ లనుమ, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సి. అక్క రోయితని నే • నాఱుమాసములకు, సుమశరసమరాతి • కూరునిఁగను జేయలే నైతినా • చేసెద నీయింట, నఖిలదాసీకృత్య • మాఱునెలలు నీవు పో మ్మనుచును • నిజపూర్వజను దన, దాసీవ్రజముఁ బంపి • తగినచోటఁ దనవేష మంత నం • తర్ధాన మొనరించి, సాత్త్వికవేషయై • ఛద్మదవృత్తి

తే. మగిడియేతెంచివేశ్యయా • మాన్యతముని, విప్రనారాయణునిఁజూచి•వినయమలర మ్రొక్కి నిలఁబడె నతని! • మ్రోలననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

వ. ఇత్తెఱంగున నయ్యంగన యోగుపుంగవుముంగల నిలిచినం గని 42

సీ. తరుణి నీవెవ్వరి ॥ దాన విచ్చటి కేల, వచ్చితి వని గురు ॥ వరుఁడు పలుక స్వామి మామకపూర్వ ॥ జన్మపాపములచే, వేశ్యనై జనియించి ॥ విటులఁ గూడి మగిడి దుష్కృతములే ॥ మాటిమాటికిఁ జేసి, హరికృపచే నవి ॥ యన్ని రోసి విడిచిన నన్నుఁ జూచి ॥ విత్తార్జనాపేక్ష, మాతల్లి వెల్కొ నీ ॥ మాప్కొ నన్ను

తే. వేశ్య నిజకులధర్మము ॥ విడిచెనేని, వాసి చెడి సుఖ మెఱుఁగక ॥ గాసిఁ జెందు నని జననిచెప్పెననియెన ॥ య్యబల యనుచు, వాదిభీకరగురుఁడనె మోదమలర.

సీ. అమాతృవాక్యము ॥ లాలింపకయ వచ్చి, యాశ్రయించితి నీప ॥ దాబ్జములను శక్తివంచన లేక ॥ సంతత మీపూలతోఁటలో నీలోడఁ ॥ బా టొనర్తుఁ బూలదండలు గూర్చి ॥ పుటికల నిడుకొని, రంగభర్తకు మీరొ ॥ సంగఁ జనిన మఱియు మాన్యులయిండ్ల ॥ మాధుకరంబెత్త, సామిమీ రేఁగిన ॥ సమయమునను

తే. బుష్పవనరక్షఁజేసెదఁ॥బొసఁగననుమఁ, గుహకశుశ్రూషణముఁజేయఁ ॥ గోరినట్లు విప్రనారాయణుని కనె•వేశ్య యనుచు, వాది భీకరగురుఁ డనె•మోద మలర.

వ. అని యివ్విధంబున నక్కన్నె విన్నవించిన. 45

సీ. మును ఋశ్యశృంగాఖ్య•మునివేశ్యలను జూచి, తాపసోత్తము లని•తలఁచినట్లు కుహనావిరక్త్యాది•గుణి యగుగణికను, గొత్తెమసానిఁగా•గురుఁడు దలఁచి తోఁటలో బని కవ్వ•ధూటిని గైకొని, మాధుకరముఁ దెచ్చి•మధువిరోధి కారగిం బొనరించి•యది తాను భుజియించి, తనభుక్త శేష మా•దాసి కొసఁగి

తే. రంగధాముని కిరుప్రొద్దు•రమ్యమాల్య•ములుసమర్పించుచుండెన•మ్మోదమాన మానసాంబుజుఁ డాజగ•న్మాన్యుఁ డనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. గుఱుఁడు కాల్వలు ద్రవ్వఁ • గొత్తెమసానియుఁ, గట్ట లమర్చు నా • కాల్వలకును
దులసీవనంబు లా• దోషజ్ఞశి ద్రవ్వ, గఱికవే ళ్ళాయింతి • వెఱికివైచు
నావాలములు చెట్ల • కమ్మహాత్ముఁడు ద్రవ్వఁ, గట్ట, లమర్చున • క్కమలనేత్ర
వృక్షమూలములందు • వేదులార్యుఁ డొనర్ప, నవియల్కి-ముగ్గిడు • నాలతాంగి
తే. మఱియుఁదులసికిఁ దెల్లచే • మంతులకును, మల్లికామాధవీజాతి • మండపముల
కింపుగా నీళ్లు గట్టుదు • రిరువు రనుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర.

సీ. శౌర్యనుగ్రహముచే సకలర్తుధర్మము, లాపుష్పవనమునం • దలరుఁ గాన
సర్వవృక్షములు పు • ష్పప్రవాళఫలాది, వృద్ధి నెల్లప్పుడు • విడువ వందుఁ
గేతకీచాంపేయ • కేసరపాటలీ, పుష్కరేందీవర • పుష్పతతులు
మరువము దవనముఁ • గురువేరు జాజులు, మల్లెపుష్పములుఁ జే• మంతివిరులుఁ
తే. జారుతులసీదళంబు లా • సత్త్వజలధి, దెచ్చి యుంచినఁ జూచి య • ద్దేవ దేవి
గురునియనుమతి దండలు • గూర్చుననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర

సీ. నారంగఖర్జూర • నారికేళరసాల, మన్మథసహకార • మాతులుంగ
ద్రాక్షాపనసజంబు • దాడిమజంబీర, బదరీఫలామ్రరం • భాఫలములు
హరికి సమర్పించి • యఖిలభాగవతుల, కతిభక్తి నిచ్చు న • య్యార్యవరుఁడు
తులసీదళామోద • కలితసుగంధిప్ర, సూనమాలిక లతి • సుందరునకు
తే. రంగభర్తకు నిత్య మొ • సంగు చుండె, నంతఁ బ్రోషితభర్తృకా • హర్షకరము
వర్షకాలము క్రమముగా • వచ్చెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.
వ. అంత.　50

సీ. అక్కటా నేఁటితో • నాఱుమాసములకు, రెండుఁమూడుదినంబు,లుండెఁగొఱఁత
నన్నొకనాఁడైనఁ • గన్నెత్తి చూడఁడు, భావోక్తియొకటైనఁ • బలుకఁ డెపుడుఁ
గనికరపడఁ డెంత • పని సేసినను నన్నుఁ, దలఁపఁ డీబాఁపన • దాసరయ్య
కరతలపానము • తరుతలశయనమే, కాని వేఱొకమేలు • గాన నైతి
తే. రంగనాయక యితని న • నంగశరవి, ధేయునిఁగఁ జేయు కృప నని • దేవదేవి
శరణు పొందెను శ్రీరంగ • శౌరిననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. అంతట మఱునాఁ డ • హస్కరమండల, మస్తమించెడువేళ • నార్యవరుఁడు
దేవదేవియుఁ దుల • సీవనంబులయందు, జలసేచనము సేయు • సమయమునను

హరితిరుమేనిచా • యలు గీలుకొనిబలుఁ, మేఘ మొక్కటి పొల్చి • మింట నెఱపి
చుట్టుకైదువుమాడ్కి • బెట్టుగామెఱయుచుఁ, గఱివేల్పువలమురి • కరణి నుఱిమి

తే. శార్ఙ్గసముదితబాణవ • ర్షంబుపగిది, దేవదేవి ప్రపత్తి సి • ద్ధించె ననఁగ
హరికృపను దొడ్డవర్షము • గురిసెననుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర.

వ. అప్పు డాప్రాజ్ఞుం డవసరోచితభగవదాజ్ఞారూపానుష్ఠానంబుఁ గావించి స్వకీయపర్ణ శాలయందుఁ బ్రవేశించి యున్నంత నద్దేవదేవి యమ్మహావర్షంబు ప్రహర్షంబు నకయి స్వప్రపత్తిప్రసన్న భగవత్ప్రేరితంబని యెఱుంగక యతిశీతలవర్షవాతా హతిచే నతిభీత యై తొంటిపగిదివృక్షగుల్మాది మూలస్థలంబులయందుండఁజాలక వడవడ వడంకుచు నమ్మహాత్ముని పర్ణ శాలాద్వారవేదికయందు నిచ్చలం బగు క్రొక్కాఱు మెఱుంగు తెఱంగునఁ దోఁచె నంత. 53

సీ. వలిగొని కనుమోల • వడఁకులేమనుఁజూచి, కరుణార్ద్రచిత్తుఁడై • గురుఁడు పలికె
వెలదిఁ యీవర్షము • వెలసినదనుక నీ, యుటజములో నుండు • మొక్కచోట
నని సూరివరుఁ డన్న • విని దేవదేవియు, నిలుచొచ్చియార్యుని • యెదుటనిలువఁ
దడిచీర వల దని • తనధౌతవస్త్రము, దయ నతఁ డిడఁగొని • తరుణిదాల్చి

తే. పాణిపద్మములను మోడ్చి • భక్తి నతని, యడుగుఁగెందామరలసేవ • కానపడిన
గురుఁడుసమకూర్చెనాయింతి •కోర్కినను‌చు, వాదిభీకరగురుఁ డనె• మోదమలర.

సీ. జగదేకగురునిశ్రీ • చరణపల్లవములు, తనక రాబ్జములచేఁ • దరుణి యొత్త
స్మరుఁ డింతకంపెను • సమయము లే దని, తలచి యాలీఢపా • దముల నిలిచి
తనవాఁడితూపుల • ధాటి చూపఁగను స, ద్ధైర్యమువిడిచి సం • తాప మొంది
యనలముకడ నున్న • యాజ్యకుంభముగతిఁ, గాంతాగ్నిశిఖ సోఁకి•కరఁగి తనదు

తే. దృష్టిమధుకరవిఙ్కులు • దేవదేవి, సరసముఖపద్మకుచగుళు • చ్ఛములయందు
నిలిపి గురువరుఁ డాలేమ • వలచె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర

సీ. సకల కళాశాస్త్ర • చతుర గాన తడింగి, తం బెఱింగి దరస్మి • తం బొనర్చి
తనవాలుఁగనుదోయి • తళుకులు గురునకు, మరునిపూఁదూపులై • మదిఁగలంపఁ
గులుకుమిటారిగు • బ్బలరీవి యగ్గురు, వరునకు నేత్రోత్స • వంబు సలుపఁ
దనజవ్వనముఁ జక్కఁ • దనము విలాసము, నయ్యార్యునకు రతి•హర్ష మొదవఁ

తే గేలుఁదమ్ములఁ ముకుళించి • లీలఁ మ్రొక్కి, సామి దాసికిఁదగుమేలు•సలుపుమనుచుఁ
గలికి చవి గుల్క నతనికిఁ • బలికె ననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. శృంగారనిధి దివ్య • మంగళమూర్తి యౌ, కటివేల్పు మును రాధఁ • గలిసినట్టు
లప్రమేయగుణుండు • విప్రనారాయణ, ధీరశిఖామణి • దేవదేవి
పాణిపద్మముఁ దన • పాణిపల్లవముచే, గీలించి యాపర్ణ • శాలయందుఁ
జేల కృష్ణాజిన • శిశుకుశోత్తరశయ్య, నుంచి మృదూక్తుల • నూఱడించి

తే. మంచి కెమ్మోవిచవు లాని•మించి కౌఁగి, లించి యామందయాన సు•ఖించిమదన
సంగరక్రీడ లారాత్రి • సలిపె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అవతార మాదిగా • నంగనావిషయాన, భిజ్ఞు నభిజ్ఞుని • నజ్ఞుఁ జేసి
యారాత్రి గడపి య • హర్మ్యఖంబున లేచి, తీర్ణప్రతిజ్ఞయై • దేవదేవి
తనయింటి కేతెంచి • తనకృత్య మక్కఁ, జెలుల కందటికిని • దెలియఁ బలికి
యభ్యంజనస్నాన • మార్చి ధూపితకేశ, పాశ యైయర్ధేందు • పటలనిటల

తే. ఘటితకస్తూరితిలక యై • కన్నుదోయి, తెలివి గులుకంగఁ గాటుకఁ • దీర్చిపెట్టి
మంచుజిగి మించుచీర ధ • రించె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. నవరత్నఖచితనా • నాభూషణాంచిత, సుకుమారగాత్ర యా • సుదతి మరలి
విప్రనారాయణు • వీక్షింపఁ జన దానిఁ, జూచి ఖేచరు లెల్లఁ • జోద్యపడిరి
భువి లేమలీక్షించి • పుంస్త్వ మొందిరిమదిఁ, బురుషులుగనిమూర్ఛఁ•బొందిరట్లు
సర్వాంగసుందరి • చని యమ్మహాత్ముని, కనుమ్రోలఁ దనసొంపుఁ • గావిపింపఁ

తే. జంద్రరేఖను జూచిన•జలధికొలఁదిఁ, బృథివిఁ బెన్నిధిఁ గనుఁగొన్న•పేదపగిదిఁ
జూచి హర్షించె నద్దివ్య•సూరి యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. నీలజీమూతాళి • నిభ మగువేనలి, యమృతాంశుబింబ మా • యతివమోము
స్మరశరంబు లనంగఁ • జాలువాల్గన్నులు, కుసుమబాణునివింటి • కొనలుబొమలు
అద్దములను గేరు • నిద్దంపుఁజెక్కుళ్ళు, చవుల కెల్లను దీవి • చానమోవి
కంతునిబంతు లా • యింతికుచంబులు, సుందరావర్త మా • సుదతినాభి

తే. కనకరంభాసమంబు లా • కాంతతొడలు, అట్టిసౌందర్యవతి తన • కబ్బె ననుచుఁ
జూచి హర్షించె నద్దివ్య • సూరి యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. బాహుశాఖలఁ జూచి • పజ్జకు రావించి, యాత్మాంకమున నుంచి • యనునయించి
కుటిలాలకంబులఁ • గొనగోట సవరించి, కెమ్మోవిచవిఁగాంచి • సమ్మతించి

తిరుమేనితాపము • దీఱ నద్దేవిని, జిగిబిగికౌఁగిటఁ • జేర్చి సురభి
మల్లికామాధవీ • మాలతీవల్లికా, సంవృతపుష్పకుం • జములయందు

తే. నంగనను గూడి రంగద•నంగసంగ, రోత్సవముసల్పి శ్రమదీఱ•యోగివరుఁడు
దేవితోఁబుష్పవనమునఁ • దిరిగెననుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర.

సీ. అన్యోన్య మొకనిమే•షార్ధమైనను గురు. దేవేంద్రుఁ డద్దేవ • దేవి యిరువు
రెడఁబాయకయ విలా • సేక్షాదరస్మి తా, లింగనమృదుచుంబ • నాంగహార
పరసనల్లాపము • ల్సలుపుకాలములందుఁ, దనసోయగముఁజూపి • తరుణి యతని
స్వవశునిఁగాఁ జేసి • స్వామి మాయింటికి, రమ్మనిపిలువ నా • రమణితోడ

తే. విప్రనారాయణుఁడు తన్ని • వేశమొందఁ, జూచితజ్జ్యేష్ఠభగినియుఁ • జోద్యమంది
చెల్లెలింటను దగుపని • చేసెననుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర.

సీ. శారదాభ్రమునందు • శంపాలతికభంగిఁ, గనిపింతురెందు శ్రృం • గారవతులు
ఘనతరప్రాకార • కలిత మేభవనము, గంధర్వనగరము • కరణి మెఱయు
గాంధారకగ్రామ • ఘనమూర్ఛనలఁ జెంది, మధురగీతరవంబు • మాన దెందు
నటవిటనర్తకీ • నాట్యకేళీవిలా, సము లెందు విలసిల్లు • సంతతంబు

తే. రాజకీరమయూరాది • రమ్యపక్షి, రావ మెందొప్పు నద్దేవ • దేవిగృహము
విప్రనారాయణుఁడుచూచె • వేడ్కననుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర.

సీ. ఘనసుధాలేపనం • ఘటిత మేయది యొప్పు, రజతశైలగుహాంత • రాళమట్లు
సురభినానావస్తు • శోభిత మెయ్యది, చెన్నొందు దర్దుర • శిఖరమట్లు
కాముకాభీష్టభో • గప్రదం బగు నెద్ది, మహనీయసిద్ధవి • మానమట్లు
దేవగంధర్వాది • దివిషదాలేఖ్య మై, వెలయు నెయ్యది యింద్ర • వేశ్మమట్లు

తే. దివ్యదర్పణములు నలు • దెసలఁగలిగి, రత్నగృహ మనఁ జాలునా•రమణిశయన
గృహముఁ జొచ్చెమహాకవి•గేయుఁ డనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. కలధౌతశుచిదంత • కనకపాత్రస్థిత, భోగ్యవస్తువులసం • పూర్తిఁ జూచి
యాత్మభోగస్థాన • మతిధవళము హంస, తూలికాతల్పము • లీలఁ గాంచి
వెలిపట్టుమేల్కట్టు • మెఱఁగి వ్రేలెడుమంచి, మానికంబులఁ గని • మానసమున
నక్కజపడి చాల • హర్షించి యద్దేవ, దేవికన్నన్నలు • దెలిసి గురుఁడు

తే. శయ్యపైఁ బవ్వళించినఁ • జామరంబు, వీచిచరణాంబుజముల్రొత్తి•వెలఁది గంధ
కుసుమతాంబూలములుసూరి• కొసఁగెననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. కొమరొప్పఁగావీణ • గోటమీటుచుఁబాడు, సస్వరగ్రామమూ • ర్ఛనలు మెఱయఁ
జెన్నొందఁగా పిపం • చికఁ గేలఁ గీలించి, గోటఁ బల్కించును • గొంతతడవు
మంచివేషము వేసి • మించుటద్దముఁ జూపు, సరససల్లాపముల్ • సలుపునతని
గిలిగింత సోలించుఁ • గిలికించితము సల్పు, మణితమంజుల మగు • మదనకేళి

తే. గురునిఁగూడిమొనర్చు న • క్కువలయాక్షి, సరసశృంగారచేష్టలా • సాత్త్వికునకు
దెలిపె నీరీతి నద్దేవ • దేవి యనుచు, వాదిభీకరగురుఁడ నె • మోద మలర.

సీ. ఆరేయి జరపె కా • ల్యమునందు మేల్కాంచి, యంతనాయుష్కర్మ•మాచరించి
యభ్యంజనస్నాతుఁ • డై మంచికుపటపు, టంచుదోవతుల ధ • రించి మించి
పలుచనితిరుమణి • ఫాలమునం దుంచి, శ్రీకరశ్రీచూర్ణ • రేఖఁ దీర్చి
స్వామికృత్యములకుఁ • జరమశాంతి యొనర్చి, హరిశాసనంబుల • కంజ లెత్తి

తే. మణివిభూషణపుష్పదా • మములఁ దాల్చి
కాముకుం డయ్యె మూర్తిమ • ల్కాముఁ డనఁగ
విప్రనారాయణుం డార్య • వినుతుఁ డనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర.　　67

సీ. శౌరికృపాలబ్ధ • సర్వతంత్రస్వతం, త్రుఁడు గాన వైష్ణవధుర్వహుండు
కొంతిప్రొద్దింతితో • బంతులాడుచునుండు, వీణవాయించు నా • వెలఁది మెచ్చఁ
గలకంఠిగీత మా • కర్ణించి కొనియాడుఁ, జదరంగ మాడు నా • చానతోడ
భరతనయజ్ఞులు • కరతాళములుగొల్వ, మార్దంగికులు మెచ్చ • మదనుఁ డలర

తే. నాట్యకేళియొనర్చునా • నాతిఁగూడి, యభినయించునుబదముల • య్యతివపొగడఁ
జేయు నీరీతి శృంగార • చేష్టలనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఆరామఁగూడి గృహారామములయందు, విహరించుచును గడు • వేడ్కనతఁడు
వెలయాలికోరిన • విరిగుత్తిఁ దెచ్చిచ్చు, వెలఁదికి మెడ నిడు • విరులసరులఁ
దరుణి పూవులదండఁ • దనమెడ నిడిననా, చెలియను గౌఁగిటఁ • జేర్చుకొనును
జొక్కునొక్కెడసోలు • సుందరితోనాడుఁ. బాడునొక్కెడ మంచి • పద్యములను

తే. గందుకక్రీడ యొనరించుఁ • గాంత గూడి, వికచనీలోత్పలంబులా•వెలఁదిచెవుల
సంచితంబుగ గురువరుం • డుంచుననుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర.

సీ. చిత్రపక్షిరవంబు • చెవులకుఁ జవిఁ జిల్క, మధుపగీతము విని • మదిసుఖింప
సురభిపుష్పసమృద్ధిఁ • జూచుచు నిలిచిన, ద్రుమములనడుమ న • త్తోయజాక్షి

మోమునెత్తమ్మిని • మునరుతేం ట్లుదబింబ, ఫలమని చెలిమోవి • చిలుక లానుఁ
బడఁతిపాణితలంబు • పల్లవభ్రాంతిఁ గో, కిలలు రా భయపడి • కీరవాణి

తే. యంచితంబుగఁ బ్రియుఁగౌఁగి,లించిమించి, యన్నిసందియముఁదీర్చె•నాలతాంగి
యట్లువిహరింతురార్యుఁడ • య్యతివయనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. విరులకానల డాఁగి • వెదకియొక్కరినొక, రీక్షించిహర్షింతు • రిద్ద రచట
మగువయొక్కెడఁబుష్ప•మంజరుల్ప్రియునకై, పుణుకఁబూఁతెమ్మకై •భుజములెత్త
నవియేల విరిగుత్తు • లివె మంచిపని చాన, చనుబంతులనుబట్టు • సరసతముఁడు
చెలికిరహస్యము • చెవినూఁదుమిషఁబూని, చెక్కిలి ముద్దాడి • చెలువుఁ డలరు

తే. లలనకుచకుంభములసాటి • మెలఁగుబిల్వ, తాళదాడిమఫలములఁ • గేలఁజూపు
చునుజరించునయ్యింతితోఁ • జెలువుఁడనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. హేలావతిని గూడి • లీలావిధేయుఁడై, డోలిక లూఁగు వి • శాలయశుఁడు
కమలేక్షణకుఁ గర్ణి • కారపుష్పములను, గర్ణావతంసముల్ • ఘటెఁ డొనర్చు
దిలక మాకామినీ • తిలకఫాలమునందుఁ, దిలకసూన మొనర్చు • ధీరవరుఁడు
పొన్నలఁ బొగడల • గున్నమావులనీడ, విహరించునార్యు డా • వెలఁదితోడ

తే. మల్లికామాధవీజాతి • మండపముల, నీడ మరుకేళిసలుపు నా • నెలఁతఁ గూడి
విప్రనారాయణుఁడుకడు • వేడ్కననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. కొలఁకుల నుదయించి • కూనగాడ్పులు వీచఁ, బూఁదేనెకాల్వల•పొంత నలరు
సప్తపర్ణాటవిఁ • జక్కనిక పురంపుఁ, దిన్నెపై నార్యుఁ డ • ద్దేవితోడ
మాయతో రంజిల్లు • మదనగురుం డన, సనమవనశ్రీవ • సంతుఁ డనఁగ
విలసిల్లుచును వేయి•విధములఁ గ్రీడించి, సొలసి యద్దేవితో • సూరివరుఁడు

తే. చని మరుద్వృధజలముల • సలిలకేళి, సల్పి యద్దేవదేవితో • సదన మొంది
గురుఁడుతడవిట్లు సుఖముండెఁ•గూర్మిననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. దైవవశప్రాప్త•ధన మనేకవిధంబు, దెచ్చిచ్చునంతకు • దేవదేవి
తల్లి మన్నించు నా•తని నల్లుఁ డం చని, మొల్లమి నతనితో•ముచ్చటాడు
నిల్లాలి కీవస్తు • విష్టము తెమ్మను, మల్లెపూ లత్తరు•మడుపు లనుపుఁ
దల్లి యీతఁడె నీకుఁ • దగినవిభుం డని, కల్ల లాడు నతని•యుల్ల మలరఁ

తే. గొందఱిని జూపి బావమ•అందు లనుచు, వదినెమఱదండ్రు వీరంచు•వావు లిట్లు
పొసఁగ నతనికిఁ దెలుపునా•ముసలి దనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. ప్రహదతోయముల నిదా•ఘార్కాభ గొన్నట్టు, విప్రేంద్రువిత్తము•ల్వేశ్యగొనియె
నంత నిర్ధనుఁడైన•యార్యునిఁ దనసుత, విడిచి పొమ్మని పల్కె•వేశ్యమాత
వెలఁదిని విడలేక • విప్రనారాయణుఁ,డతని బాయఁగలేక • యాలతాంగి
మదిఁ గుంద సుతకుఁ ద•న్మాత యిట్లనియె నిం,టింట భిక్షాన్నము•నెత్తితినెడు.

తే. తిత్తిబాఁపనదాసరి • దీటె నీకు, వీనితోఁ బొత్తు నీ వింక • విడువు మనుచుఁ
దెలిపె ముదుసలి యద్దేహ•దేవి కనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

వ. అని పలుకువేఁడిములుకులం బోలుతల్లిపలుకుల వినియు విననట్లద్దేవదేవి యమ్మహా
పురుషునిపూర్వస్నేహంబుఁ దలంచి యూర కున్నంతఁ బ్రావృట్సమయ సము
ద్భూత మహాద్భుత జీమూతజాత సముదిత నిష్ఠుర నిర్ఘాత ఘర్ఘరానర్గళ భీషణభాష
ణంబుల నమ్మనీషి భాషాపతికిఁ దజ్జనని యిట్లనియె ఖ్యాతిలాభార్థంబుగా సాత్త్వికవేషంబు ధరించి పుష్పకైంకర్య తత్పరుండవైన పరప్రతారక మంత్రవాది
బ్రాహ్మణాభాసుండవు గావున మార్గశ్రమాపనోదనార్థంబుగా భవదీయ పుష్ప
వనంబునందు విశ్రమించు మదీయపుత్రికను మాయామంత్ర మహౌషధిబలంబున
మరులుకొలిపి స్వవశవర్తినిగాఁ జేసికొన్న దుర్వినీతుండవు నిర్దయుండవుం
గావున మూకభావంబు వహించి స్వవిషయ బహువిధ వ్యామోహగహనప్రాపకం
బగుమోహినీభూతంబుకరణి నస్మత్సుతం బూని విడువంజాలక యున్నవాఁడవు
గావున మదీయవికటక విశంకట కరతలావలిత స్ఫుటపటుచపేటికాభూతి సంకలిత
మాషమరీచకాషూత సంఘాతంబులచే భవదుచ్చాటనంబుఁ జేసెద నని ఝంక
రించుచుఁ జణవల్కల సముదాయసచ్ఛాయంబు లగుకేశంబులు క్రొమ్ముడి వీడి
పృష్ఠభాగంబున నర్తనంబులు సలుప నింద్రగోపకీటాభంబులగు తాళపత్రమయ
కర్ణవేష్టనంబులు కపోలస్థలంబుల నసియాడ మదిరాస్వాగజనిత మదఘూర్ణిత
రోషభీషణ తామ్రేక్షణంబుల నిప్పు లుప్పతిల్ల నుత్పాతశంకచే వెఱచి యతిపక్వ
దీర్ఘ తుంబికాభీలోపమాన పయోధరంబులు మదనమందిర మహాదుర్గప్రదేశంబున
కుద్గమింప సమకట్టి మార్గమధ్యస్థితపాతాళ సదృశనాభిమండలావర్త పాతభీతిం
జెంది చననొల్లక నివర్తించి స్వరక్షణక్షమక్షేమస్థానంబుఁ గన్గొనలేక భయ
భ్రాంతంబు లైనట్లు నిజోదరపార్శ్వస్థలంబుల దిర్దిరం దిరుగుచుండ వైకంకతా
ఖర్వదర్వీధూర్వహ ప్రతిమానబాహు విక్షేపవిశేషంబులచే నంతర్గతక్రోధంబు
బయల్పడ నభినయించుచు శ్రీరామభద్రునిం గదిసి విటతటంబుగా నార్భటి సేయు
తాటక చందంబునను దయభాస్కరభాసుర సమీరకుమారునిం గబళింప నుద్యో

గించు విరసయగు సురసకరణి నాగాలిచూలినిం గదిసి కరాళించులం కాధిదేవత మాడ్కిఁ గట్టలుకం బెట్టిమిట్టిపడుచు భూతలంబునం బాతరలాడుచు నమ్మహాత్ముని పాణిపల్లవం బూని యాకర్షింప నతం డద్దేవదేవి కనుసన్న నెఱింగి శయన గృహంబు వెళ్వడిన నిజసఖీజనంబుచే నర్ధరాత్రంబు సమయంబున స్వకీయ మందిరబహిర్ద్వారంబు నిర్గమింపంజేసి కవాటంబు మూసిన నద్దేశిక సార్వభౌముం డును దదీయబహిర్ద్వారవితర్దికయందు నిజోత్తరీయంబు పొసంగముసుంగిడి వాసుకిభోగీంద్ర భోగోపమానం బగునిజభుజదండం బుపధానంబుగాఁ బవళించి నిజాంతరంగంబున భుజంగరాజశయానుండును నభంగరథాంగపాణియు నగు శ్రీరంగనాథునిం దలంచుచుండె.

సీ. అంత శ్రీరంగరా • జర్ధరాత్రమునందు. రంగనాయకితోడ • రంగు మీఱ
విపులబృందావన • వీథులందును ముందు. మురళీవినోదియై • తిరిగినట్టి
వేదాంతవీథుల • విహరించుగతి రంగ.వీథులందు విలాస • విహరణములు
సలుపుచున్నంత వే•శ్యామందిరద్వార.వేదిక నిద్రించు • విప్రుఁ గాంచి

తే. మోమునెత్తమ్మిఁ జిఱునవ్వు•ముద్దుచిలుక.సామి వీఁడెవ్వఁడని సిరి•శౌరి నడుగ
భర్తమగిడి యిట్లనెఁ బద్మ•పాణి కనుచు.వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. కొమ్మపూదండలు•గుమ్మల నిడుకొని. మనకుఁ దెచ్చిచ్చు ము•న్నామన్యుఁ డితఁడు
విప్రనారాయణుం•డప్రమేయజ్ఞాని. మన్మాయ వేశ్యచు•మ్మరులు దగిలి
దానితో విహరింప.ధన మంత యుడిగిన.వెడలఁ ద్రోయింప నా•వెలఁదియింటి
వాకిటితిన్నెపై•నీకొలందిని నున్న.వాఁ డెఱుంగుము మన.వాఁడు వీఁడ

తే. టనుచు హరిపల్కవినిసిరి•యనమ నీదు. విశ్వమోహనమాయకు•విషయ మతని
సలుప వల దననొడఁబడె•శౌరి యనుచు. వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. ప్రీతితోఁ దొల్లి వి•భీషణుఁ డర్పించు. పంచకార్తస్వర•పాత్రమధ్య
భవ్యశుద్ధోదక•పాత్రముఁ గొని బ్రహ్మ.చారి యై చని రంగ•శౌరి దేవ
దేవిగృహద్వార.దేహళికడ నిల్చి. పిలువ నెవ్వఁడ వనఁ • బలికె నతఁడు
మగువ నే నళహియ•మణవాళదాసుఁడ. విప్రనారాయణ•విప్రమణికి

తే. నమ్మఁదగినట్టి శిష్యుఁడ•నాతి నీకు. నస్మదాచార్యుఁ డొకవస్తు వనిపె ననిన
దేవదేవి కవాటముఁ•దెఱచె ననుచు. వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. కస్తూరితిలక సం•కలితోర్ధ్వపుండ్రము. గరుణారసముఁ జిల్కు•కన్నుదోయి
చక్కనిచెక్కిళ్లు • నరసంపుఁగెమ్మోవి. చిల్కపల్కులముద్దు • చిఱుకమోము

నల్లనిసిగముడి • వెల్లజన్నిదమును, గొపీనకటిసూత్ర•కటితటంబు
వెలిపట్టుపుట్టము • మొలగూడకట్టును, వలిపెంపుదుప్పటి•వల్లెవాటు

తే. మెలఁగు చామనిచాయల•మేనివానిఁ, గైతవబ్రహ్మచారిని • గాంచి మ్రొక్కి
యతనికనుమ్రోలనిలిచె న•య్యతివయనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. బలియిడుభిక్ష మే•పాణిపద్మము గొనె, నభయప్రదం బెద్ది • యాశ్రితులకుఁ
గోరి లక్ష్మీకుచ•కుంభములం దెద్ది, మకరికారేఖ లే•మఱక దీర్చు
గోపిక లలిగినఁ • గూర్మి నేచెయి చాఁచి, వారితో బతిమాలి • వాంఛఁ జెందు
నాకరాంబుజ మెత్తి • యాగిన్నె నొసఁగె నా•యింతికి మద్గురుఁ•డిచ్చెననుచు

తే. నంత నీప్రియనిన్ను ర•మ్మన్న దనుచు•గురుని కెఱిఁగించి తాఁ జని•యురగరాజ
శయ్యపైఁ బవ్వళించెను • శౌరి యనుచు, వాదిభీకరగురుఁడనె•మోద మలర.

వ. అంత.

సీ. వెన్ను డిచ్చువపసిండి•గిన్నెఁ గైకొని తన్నుఁ, గన్నతల్లికిఁ జూపెఁ•జెన్ను మీఱ
రం గైనఱవిక మె•ఱుంగుబంగరుచీర, మెఱుఁ గొందుతొడవులు • మేనఁ దాల్చి
విరులసరంబులు • వేనలిఁ గీలించి, యగురుచందనపంక • మలఁది మేనఁ
బరిమళమిళిత మై • బహుంభోగ్యభోగోప•కరణ మౌశయనమం•దిరముఁ జొచ్చి

తే. శయ్యపైనుండి తనప్రాణ•సఖిని బిలిచి, విప్రనారాయణుని నీవు•వేగ తోడి
తెమ్మనుచుఁ బంచె నద్దేవ•దేవి యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. గోపికాజారుని•కొలఁది విలాసినీ, స్తనబాహుదృష్టిచిం•తామనస్కు
విప్రనారాయణు • వీక్షించి మ్రొక్కి యా•వెలయాలినెచ్చెలి • పలికె నిట్లు
స్వామి ప్రేమ మెలర్పఁ • జయ్యన నినుఁ దోడి•తెమ్మని పంచె న•ద్దేవదేవి
నినుఁ బాసిత్రుటి యైన • నిదురింపలే దింతి, విరహవేదనలచేఁ • బొరలు చున్న

తే. దలరువిల్తునివేదన • మెలఁగ నీక, రమ్ము లె మ్మని యతనికే•ల్దమ్మిఁ బూని
యార్యుఁదోడ్కొనిచనియెన•య్యతివయనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

వ. అంత నవ్విప్రనారాయణుం డానందకందళిత హృదయారవిందుండై యప్పణ్యాసుం దరీమందిరంబుఁ జొచ్చి శయనగృహద్వారసమీపంబున కరుగుదెంచి యున్న నమ్మహాత్ముని కద్దేవదేవి యెదు రేఁగుదెంచు చున్నంత,

సీ. ముదుసలి మొదలుగా , మునుపటివా రెల్ల, హర్షింపఁగా నమ్మ,హాత్ముఁ జూచి
కాశ్మీరమృగమద,ఘనసారయుతపయో,ధరయుగ మతనిపె,న్నురము సోఁక
గాఢసంశ్లేషముఁ , గావించి విరహా_ర్తిఁ, దీర్చి తోడ్కొ_ని చని , దేవదేవి
చందనం బలఁది పు,ష్పములిచ్చి తాంబూల,మొసఁగి పూశయ్యపై, నునిచియతనిఁ

తే. బాదసంవాహన మొనర్చి , పాడి యాడి, సురఁటి వీవంగ నద్దివ్య,సూరిచూచి
యంచయానను గడుగార,వించె ననుచు, వాదిభీకరగురుఁ డనె,మోద మలర.

సీ. దరహాససుధఁ జిల్కు_,తరుణిముఖేందునిఁ, జూడ్కు_ లానందింపఁ , జూచిచూచి
మదనాహవోచిత,మదపూ_ర్తి కాయింతి,యధరబింబామృత , మానియాని
తనయనంగజ్వర,తాప నూరఁగఁ బ్రియ, జిగిబిగికౌఁగిటఁ , జేర్చిచేర్చి
రతికేళితమి మీఱ , రమణిపాలిండ్లను, బాణిపద్మములచేఁ , బట్టిపట్టి

తే. మాటిమాటికి వలరాజు,మనికిపట్టు, మేటికోటకుఁ బోటిచ్చె , ధాటి మీఱ
విప్రనారాయణుఁడు కడు,వేడ్క_ ననుచు, వాదిభీకరగురుఁ డనె , మోద మలర.

సీ. శ్రీదేవదేవీవ,శీకృతనిజకాయ, మానస నీ కగు , మంగళంబు
శ్రీదేవదేవి సం,శ్రితసూరితరువల్లి, మాతల్లి నీకగు , మంగళంబు
అతులపురాణపు,ణ్యశ్లోక శుభగుణ, మందిర నీ కగు , మంగళంబు
పరమయోగివిలాస,కరదివ్యరూపిణి, మానిని నీ కగు , మంగళంబు

తే. మాధవప్రియ నీకగు , మంగళంబు, మధురభాషిణి నీ కగు , మంగళంబు
లని నివాళింతు రిరువుర , కాప్తు_లనుచు, వాదిభీకరగురుఁ డనె , మోదమలర.

సీ. అంత నుషఃకాల , మైన రంగేశుని, యర్చకపరిచార,కాదిబుధులు
చనుదెంచి గుడిప్రద,క్షిణముఁ జేసి సువర్ణ,బలిపీఠికడ భక్తిఁ , బ్రణుతిఁ జేసి
పంచమహావాద్య,పటహకాహళశంఖ, భేరీమృదంగవీ,ణారవములు
శుభవేణుగీతముల్ , సూతమాగధవంది,సుప్రభాతాఖ్యసం,స్తుతిరవములు

తే. నెఱసిబ్రహ్మాండభాండము, ల్నిండి జగద, మంగళంబులు సమయింప,రంగనాథ
దివ్యభవనకవాటముల్ , దెఱచి రనుచు, వాదిభీకరగురుఁ డనె , మోదమలర.

సీ. అంత శ్రీహరికడ , కరిగి చూచినఁ ద_ప్త, భర్మ శుద్ధోదక , పాత్ర మొకటి
గనఁబడకున్నను , గడుభీతిఁ జెంది యా,యర్చకు లేతెంచి , యవనిభ_ర్త
కెఱిఁగింప నిమశాపు,రీశ్వరుం డారాజు, విని విస్మయముఁ జెంది , వీరికన్న
వెన్నునిసన్నిధి,గిన్నె ప్రముచ్చిల వేఱు, తస్క_రుల్ రారిది , తథ్య మనుచుఁ

తే. బలికి వీరిని దండించి, పసిఁడిగిన్నెఁ,గొను మనుచు దండనాధుని,కనిన వాఁడు
వారి దండించుచుండెను, వరుస ననుచు, వాదిభీకరగురుఁ డనె, మోదమలర.

వ. అయ్యవసరంబున దేవదేవియింటిఘటచేటిక జలాహరణార్థంబుగాఁ జనుచుండి తనతో మైత్రి మెలఁగుచున్న యొక్క యపీచ్యవయస్కుని రాజభటులు దండింపం గని వానిం డాసి నిరపరాధుండ వగు నీకీ రాజదండనం బేమినిమిత్తం బని యడుగ నతండు దాని కిట్లనియె: స్వామిసన్నిధి తపనీయ శుద్ధోదకపాత్రమొక్కటి యదృశ్యం బగుటంజేసి మా కిట్టి రాజదండనంబు ప్రసక్తం బయ్యె నని చెప్పిన విని రహస్యంబుగా నతని కది యిట్లనియె. తత్తజాంబూన దమయంబగు నొక్క చషకంబు దెచ్చి విప్రనారాయణుని ప్రియశిష్యం డగునొక్కమాణవకుండుదేవదేవి కొసంగంజూచితి నాసువర్ణచషకం బద్దేవతవినల్పంబునం దలగడమెత్త క్రింద నున్న యది యెఱింగించినియె నంత నగ్ఘటచేటీవిటుండు తద్వృత్తాంతంబు దండనాధున కెఱింగించిన.

సీ. దండనాధుం డంతఁ, దగుభటాళిని గూడి, యద్దేవదేవిగృ,హంబుఁ జొచ్చి
తన్మృదుశయ్యపైఁ, దలగడమెత్తను, గ్రింద నొక్కెడనున్న, గిన్నెఁ జూచి
నగుచుఁ గైకొన విప్ర, నారాయణుని దేవ, దేవితోఁ గొని చని, భూవిభునకుఁ
జూపింపఁ జూచి యా, భూపతి యీగిన్నె, నీ కెవ్వరిడి రని, నెలఁత నడుగ

తే. దేవ యీస్వర్ణచషకముఁ, దెచ్చియిచ్చె, విప్రనారాయణుం డని, వేశ్యపలుక
నతఁడు నే నియ్యలేదని, యనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె, మోదమలర.

సీ. వే యన నేల యీ, విప్రనారాయణ, ప్రహితుఁడు బాలక, బ్రహ్మచారి
గుణనిధి యశహియ, మణవాళదాసుఁడు, మాయింటి కేతెంచి, మధ్యరాత్ర
మది నీకు మద్గురుఁ,డచ్చెఁగొ మ్మనుచు మా, కీగిన్నె నిచ్చి లా, నేఁగి పురలె
నని వేశ్య పలికిన, విని విప్రనారాయ, ణుఁడు పల్కె ని ట్లని, పుడమిజేని

తే. కవనిమాకొకదూతలేఁ, డరసి చూడ, గిన్నె నే నియ్యలే దని, యున్నయట్లు
పల్కెనటమీఁద నామిత, భాషి యనుచు, వాదిభీకరగురుఁ డనె, మోదమలర.

సీ. దండనాధుఁ డొసంగు, తపనీయపాత్ర మ,ర్పించి యర్చకుల నం, పించె గుడికి
దేవతాద్రవ్యముఁ, దెచ్చియిచ్చినఁ బుచ్చు,కొంటివి గాన వా, ల్గంటి నీకుఁ
దప్పిది యని చెప్పి, తగినవిత్తము గొని, దేవదేవిని బంపి, భూవిభుండు
నితఁడు స్వర్ణస్తేయి, యితనికినుచితమౌ, శాస్త్రోక్తదండము, సలుపవలయు

తే. ననుచు సభ్యులు విన( బల్కి • యమ్మహాత్ము, దండనాధునికావలి • నుండజేసి
సురుచిరాంతఃపురంబున • కరిగె ననుచు, వాదిభీకరగురుం డనె • మోద మలర.

సీ. ఆరేయి నిద్రింప • నపరరాత్రమునందు, రాజుస్వప్నమున శ్రీరంగశౌరి
తాను గన్పడిపల్కె • ధరణీశ యీవిప్ర,నారాయణుండు జగ • న్మాన్యయశుండు
ప్రారబ్ధకర్మాను • భవమిట్లితని కేను, గావించితిని నను • గ్రహ మెలర్ప
దేవదేవికి గిన్నెం • దెచ్చి నే నిచ్చితి, నీగిన్నెజోలి తా • నెఱుంగం డితడు

తే. పాపరహితుండితండుమ • త్ప్రియజనముండు, ఇతనినర్చించి పంపు ము,ర్వీశ వేశ్య
ధనము దానికి మగిడియి • మ్మనియె ననుచు, వాదిభీకరగురుం డనె • మోదమలర.

వ. ఇట్లు రాజున కుపదేశించి శ్రీరంగనాథుం డంతర్హితుండయ్యె నంత.

సీ. అరుణోదయపువేళ • నారాజు మేల్కాంచి, స్వప్నదృష్టరమేశు • వచనములను
దలంచుచుం బులకితో • దారిసర్వాంగుండై, యానందబాష్పము • లక్షులొలుక
విప్రనారాయణు • వీక్షించి యతనికిం, బ్రక్రమం బొనరించి • ప్రణుతింజేసి
స్వామి దేవరవారి • సామర్థ్య మెఱుంగక, యపచారపడితి నే • నది క్షమింపం

తే దగుదుః నిపల్కి సకల స,త్కారములను, నలిపియారాజుపనుప నా,సత్త్వజలధి
యాత్మపుష్పవనంబున • కరిగె ననుచు, వాదిభీకరగురుం డనె • మోదమలర.

వ. అంత భగవదనుగ్రహామృతాసారప్రక్షాళితా భ్యుపగతప్రారబ్ధకర్మశకలశంకాపంక లేశుండైన విప్రనారాయణుం డాత్మవిహీనకృత్యంబుం దలంచి మిగుల ననుతపించి విషయవిరక్తుండై యగమ్యాగమనప్రాయశ్చిత్తార్థంబుగా, శ్లో॥ ఏతత్పుఙ్చ మహాపాపప్రాయశ్చిత్తం మనీషిభిః। నిర్ణీతం భగవద్భక్తపాదోదకనిషేవణమ్॥ అనియును, శ్లో॥ తిస్రః కోట్యర్ధకోటీచ తీర్థాని భువనత్రయే। చక్రాఙ్కితస్య విప్రస్య పాదే తిష్ఠంత్యసంశయః॥ అనియును బురాణప్రసిద్ధంబు గావున, శ్లో॥ అర్థపఞ్చకతత్త్వజ్ఞాః పఞ్చసంస్కారసంస్కృతాః। ఆకారత్రయసంపన్నా మహాభాగవతాః స్మృతాః॥ మహాభాగవతా ఏవ వైష్ణవా నేతరాస్స్మృతాః॥ అని పారాశర్యోత్తర ఖండప్రసిద్ధంబు గావున నర్థపంచకాభిజ్ఞత్వపంచసంస్కార సంస్కృతత్వాకారత్రయసంపన్నత్వాదిలక్షణ లక్షితులగు శ్రీ మహాభాగవతుల శ్రీపాదంబు జీవించి పరమపవిత్రుండ నయ్యెదనని తలంచి తదనంతరంబ 'ధిక్కు లేన దురాత్మనా, మ్మనియెడున్యాయంబున గ్రామకులాదినిమిత్తాగతంబగు నామం బనర్థహేతు వగుటం జేసి, శ్లో॥ యస్యమూర్ధ్నిస్థితం యావద్వైష్ణవాఙ్ఘ్రి

రజ శ్శుభమ్॥ గఙ్గాదిసర్వతీర్థాని తావ త్తిష్ఠ్యం త్యసంశయః॥ అనియును, శ్లో॥ నిరపేక్షం మునిం శాన్తం నిర్వైరం సమదర్శనమ్। అనువ్రజా మ్యహం నిత్యం యో జయత్యంఘ్రి రేణుభిః॥ అని భగవంతు డగునారాయణునకు బ్రార్థనీయంబై పరమపవిత్రంబగు శ్రీవైష్ణవాంఘ్రిరజో వ్రజంబు తనకు నిరూపక నామంబుగా 'భక్తాంఘ్రిరేణు, వనియును' తొండరడిప్పొడియాళ్వా, రనియును దివ్యనామంబులు ధరియించి తృణీకృతేతరపురుషార్థుండై ధారకపోషకభోగ్య త్రయంబు భగవంతుం డని తనమనంబున విశ్వసించి భగవదనుగ్రహంబుచే నజ్ఞాననిరోధకజ్ఞానానందకందళితహృదయారవిందుండై హరిప్రసాదసాక్షాత్కృత పరవ్యూహవిభవాంతర్యామ్యర్చారూపగుణవిభూతిచేష్టితుండై భగవదనుగ్రహప్రాప్త పరభక్తిపరజ్ఞానపరమ భక్తిసంపన్నుండయి 'తిరుమాలై' 'ప్రాబోధకి' యను రెండు దివ్యప్రబంధంబు లానతిచ్చి స్వకీయపరమకృపచే సర్వచేతనో జ్జీవనం బొనర్చి వైభవంబు చాలించి యర్చాస్వరూపంబు ధరియించి యుండె నమ్మహాత్ముండు శబ్దాదివిషయవిరక్తుండై నయుత్తరక్షణంబద్దేవదేవియు నట్లుండందలంచి రనవిశేషస్పర్శనంబున నినుము హేమించుకరణిఁదదీయదివ్యాంగసంస్పర్శనంబునఁ దత్పాదాబ్జాన వరతసేవాభజనప్రభాతసమయసముచితప్రభాకరమండలనిశ్శేష నిరస్తనిఖిలజన్మార్జిత సంచితప్రారబ్ధాదిఖేదఖిన్న ప్రభూతపాతకాంధతమస్కయై 'జ్ఞానీ త్వాత్మైవ మే మతః'॥ అనుగీతోక్త క్రమంబుగా భగవదాత్మభూతుండును బరమభాగవతాగ్రగణ్యుండును నగు శ్రీవిప్రనారాయణుని శ్రీపాద పద్మంబులయం దమందంబుగా నశ్రాంతంబు తా నొనర్చుస్వకీయజనానివార్య పరిచర్యచే సంతుష్టాంతరంగు డగు శ్రీరంగనాథుండు, శ్లో॥ అనన్యదేవతాభక్తా యేమద్భక్తజనప్రియాః। మామేవ శరణంప్రాప్తాస్తే మద్భక్తాః ప్రకీర్తితాః॥ అనియును, శ్లో॥ మమమద్భక్తభక్తేషు ప్రీతిరభ్యధికాభవేత్॥ అనియెడు నిజదివ్య సూక్తిక్రమంబున ననుగ్రహపూర్వకంబుగాఁ గటాక్షింపఁదదీయదివ్యకరుణా కటాక్షవీక్షణంబులచేస్స్వరూపవిరోధిస్వరూపోపాయ స్వరూపపురుషార్థస్వరూప రూపార్థపంచకజ్ఞానవతియై భగవదనన్యార్హ శేషత్వానన్యశరణత్వానన్యభో, గ్యత్వ రూపాకారత్రయంబును నవికలంబును నచలంబును సకళంకంబునునగుకలిమిలభించిన సమస్తసాంసారికసంగంబులువిడనాడిస్వసంపాదితధనకనకప్రవాళ మౌక్తిక మాణిక్యమహనీయాభినవార్ఘ్యభూషణక్షౌమాంబరాస్తరణాసనశయనీయాది సమస్త ద్రవిణంబులు శ్రీరంగభర్త కర్పించితదీయదివ్యమంగళ విగ్రహోత్సవాద్యనుభవ జనితప్రీతికారితతదీయమందిరానవరతసమ్మార్జనాది కైంకర్యంబు లొనర్చుచుఁ

దదీయతీర్థప్రసాదంబుల నుజ్జీవించుచు గుణానుభవకైంకర్యపరు లగుశ్రీమహాభాగవతులం జూచి నిరుపాధికసకలవిధబంధువులఁ గాఁ దలంచుచుఁ గొన్నిదినంబు లుండి శ్రీభక్తాంఘ్రిరేణుమహాదేశికప్రాప్తమహోన్నతస్థానంబు లభించి సుఖించు చుండె నంత.

సీ. భక్తాంఘ్రిరేణుప్ర • భావ మవాఙ్మనో, గోచర మార్యులు • కూర్మి బలుక
విన్నంత కన్నంత • వెన్నునికరుణచేఁ, దెలియ వచ్చినయంత • తేటపడను
జెప్పితిఁ గావునఁ • దప్పుల నెంచక, పరమకారుణికు లౌ • భాగవతులు
సాహసం బిది కృప • క్షమియింపఁ దగుదురు, తల్లిదండ్రులు బాలు• దౌష్ట్యమట్లు
తే. సారెసారెకు మీపాద • సరసిజముల, నమ్మి యున్నాఁడ నెమ్మది • మిమ్ముదక్క
వేఱుపాయము పేయము • వెదక ననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

శా. శ్రీమత్కాంతిమతీతనూజ సకల • శ్రేయోనిదానోదయా
భూమప్రాభవకేశవార్యహృదయాం , భోజాతసూర్యోదయా
కామక్రోధమలీనమానసజన • గ్రామాతిదూరాదరా
స్వామీ శ్రీయతిరాజశేఖర హృద , బ్జస్ఫారదామోదరా.

క. శ్రీభట్టనాథగోదా, శోభితదివ్యప్రబంధ • జుష్టమనస్కా
శ్రీభూతనగరభాగ్య, ప్రాభవభక్తాంఘ్రిరేణు • పదకమలాత్మా.

మాలినీవృత్తము. సరళజనశరణ్యా • సప్తలోకీవరేణ్యా
పరిచితగురుకాండా • భాగినేయత్రిదండా
గురుకుశలచరిత్రా • కూరపాంభఃపవిత్రా
సరసిజదళనేత్రా • సజ్జనస్తోత్రపాత్రా.

గద్యము. ఇది శ్రీభగవద్రామానుజకరుణాకటాక్షకలిత కవితావైభవపరవాదిభయంకరాచార్యాభిమతచ్ఛాత్రాపస్తంబ సూత్రకణ్వసగోత్ర పవిత్రోభయకవిమిత్ర వేంకటకృష్ణార్యపుత్ర విబుధవైష్ణవవిధేయ కేశవనామధేయప్రణీతంబై నయాచార్యసూక్తిముక్తావళియను మహాప్రబంధంబునం బూర్వభాగంబునందు శ్రీభట్టనాథ ప్రభావదర్శనంబును, గోదాభ్యుదయకల్యాణకీర్తనంబును, విప్రనారాయణ లీలామహోదయవర్ణనంబును, అమ్మహాత్ముని వైరాగ్యాదిప్రపంచకథనంబును, దేవదేవీవిరక్తిముక్తిసూచనంబు నన్నవి ద్వితీయోల్లాసము.

—.o—

శ్రీమతే రామానుజాయ నమః



# ఆచార్యసూక్తిముక్తావళి

## పూర్వభాగము

---

## తృతీయోల్లాసము


శ్రీమద్రంగపవస్థిర
ధామా వజ్రత్రిదండ ॰ ధరకరకమలా
రామానుజ భూమగుణ
స్తోమా సంపూర్ణకామ ॰ సుజనారామా. 1

### ధర్మవర్మఁ డను రాజుకూఁతురు శ్రీరంగరాజును బెండ్లాడుట

వ. అవధరింపుము. 2

సీ. చారుమరుద్వృథా॰జల మాని వాయువు, లేదెస విసరు న॰య్యెడ వసించు
ధన్యుల కగు ముక్తి ॰ తత్తీరవాసుల, కపవర్గసంసిద్ధి ॰ కడుగ నేల
యట్టివై భవముచే ॰ నలరారుకావేరి, తీరమునందున ॰ దివ్యసౌధ
మణిమయప్రాసాద॰మందిరగోపుర,ప్రాకార పరిఖాది॰భాసురంబు

తే. బ్రాహ్మణ క్షత్రియోరుజ॰పదజయుతమురత్న బహుళంబునిచుళాపు॰రంబువెలయు
భాస్వదమరావతీపురి॰పగిది ననుచు, వాదిభీకరగురుఁ డనె॰మోద మలర. 3

సీ. ఆపట్టణం బేలు॰నర్కవంశ్యుఁడు చోళ,వసుధాధిపతి ధర్మవర్మఁ డతని
కుదయించె నొకపుత్రి॰యుర్వి నీళాంశ యై, పాలవెల్లికిఁ దొల్లి॰పద్మపగిదిఁ
గలితాఖినవచంద్ర॰కళయట్లు సంతత, పరివర్ధమాన యై ॰ బాలికలను
గూడి యాడుచు నైనఁ॰గూర్మితో శ్రీరంగ, రాజకల్యాణవి॰గ్రహముఁ దలఁచి

తే. కన్నులానందబాష్పము॰ల్గ్రమ్ముకొనఁగఁ, బులకితాఖిలగాత్ర యై॰పొనఁగ నతని
భవ్యనామము లక్కన్నె॰పలుకు ననుచు, వాదిభీకరగురుఁడనె॰ మోద మలర.

సీ. అంతట నవయౌవ•నారంభదశఁ జెంది, యుద్యానవనమున • కొక్కనాఁడు
చనియందుఁ జెలులతో • సౌరభమిళిత పుష్పములు గ్రహించుచుఁ • బాడియాడి
యలసి పుష్పప్రవా ౹ ళాంచల్లతావృత, వృక్షవాటికలందు ౹ విశ్రమించి
రంగరా జచటికి ౹ రంగుగా వేఁ టాడ, విచ్చేయఁ దద్దివ్య ౹ విగ్రహంబుఁ

తే. జూడ్కులలరంగఁగని మ్రొక్కి౹చోళరాజ, కన్య కామించి కందర్ప౹కరవిముక్త
పుష్పనారాచవేదనఁ౹బొందెననుచు, వాదిభీకరగురుఁడనె ౹ మోదమలర. 5

సీ. శ్రీరంగనాథుని ౹ త్రిభువనమోహన, దివ్యమంగళమూర్తి ౹ దీప్తిఁ జూచి
యతనికౌఁగిలిఁజెంది ౹ యసమాస్త్రబాణవే,దనమానిసుఖియింపఁ౹దలఁచి మదిని
నచటినుం డేతెంచి ౹ యాత్మీయనిలయముఁ,జొచ్చితచ్చింతచే ౹ సుఖము లేక
తనదివ్యశయనీయ • తలమునఁ బవళించి, భోజనమజ్జన౹భూషణాది

తే. వాంఛ విడిచిన నాధర్మ ౹ వర్మనృపతి,చూచి మృదుమధురోక్తుల౹సుతను జాల
ననునయించుచుఁ బ్రీతి ని ౹ ట్లనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె౹మోదమలర,

సీ. అమ్మ నీనెమ్మది ౹ నభిమత మెయ్యది, యైనఁ జేసెద సంది,యంబు మాని
వాక్రువ్వు మని చోళ౹వసుధాధిపుఁడు పల్కఁ, దండ్రి కిట్లనియెను౹దనయమరలి
యార్య యుద్యానవి౹హారార్థ మేనాత్మ,సహచరీజనముతోఁ ౹ జనిన నచట
శ్రీరంగపతి దన౹శ్రీమూర్తిఁ గాన్పించి, నామానసముఁ గొని౹నన్నుఁ దనకు

తే. మరులుకొల్పెనుమన్మథ౹మన్మథునకు,నన్నిపుడొసంగునాప్రాణ౹నాథుఁ డతఁడు
పరుని నేనొల్ల నని కన్య౹పలికె ననుచు, వాదిభీకరగురుఁ డనె౹మోద మలర. 7

వ. అని యిప్పగిది నప్పైదలి ముప్పిరి గొన్నమోహంబునం జెప్పిన విని యప్పుడు.

సీ. భగవంతుఁ డారంగ•భర్త భక్తవిధేయుఁ డతని కీవృత్తాంత • మంత దెలిపి
యతనియభీప్సిత • మరసి వచ్చెద నని, ధర్మవర్ముఁడు రంగ•ధామ మొంది
ప్రణమిల్లి శ్రీరంగ•భర్త కావృత్తాంత, మంతయుఁ దెలిపిన • హర్ష మొంది
రంగరా జనియె నా•రాజున కీరీతి, నీవు ధార్మికుఁడవు • నీదుపుత్రి

తే. మన్మనోరమ యిఁక వేయు,మాట లేల,బొమ్ము తోడ్కొనిరమ్ము మా•కిమ్ము సుతను
జేయుమీ పెండ్లి యనిహరి,చెప్పెననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర,

వ. ఇత్తెఱంగున రంగనాథుండానతిచ్చిన విని నృపపుంగవుండు పుత్రికామంగళోత్సవ
సూచకంబుగాఁ బట్టణంబు శృంగారించుటకై నిజప్రధానుల కాజ్ఞాపించినప్పుడు.

సీ. ఆధర్మవర్మమ•హారాజశాసన, మాల్యము తలఁ దాల్చి • మంత్రివరులు
రధ్యల విఫణుల • రాజమార్గంబుల, సన్నిధివీధులఁ • జక్కఁ జేసి
శోధించి యంతట • సురభిచందనజల, సేచనం బొనరించి • సిరుల మించి
ము_త్తియంబులఁ బూల • ముగ్గులు వెట్టించి, రత్నమాలికల ద్వా • రములఁగట్టి

తే. పంచటరఁగులఁ బూర్ణకుం • భముల నిలిపి, లలితరంగేశపురియ ట్ల• లంకరించి
రాజునకుఁ జెప్పి రామంత్రి • రాజులనుచు,వాదిభీకరగురుఁడనె • మోద మలర.

సీ. మఱియు రంగవిమాన • మండపప్రాకార, వరపుర ద్వారక • వాటములను
సురభివిచిత్రప • సూనమాల్యములచే, లలితరత్నాళి న • లంకరించి
ప్రతివీధి రాత్రిప్ర • భాసిద్ధికై మణి, దీపవృక్షముల న • ల్దెసల నాటి
ద్వారపార్శ్వములందుఁ • ద_ప్తచామీకర, కదళికా_స్తంభము • గ్మముల నిలిపి

తే. చంద్రపుష్కరిణీతట • స్ఫారకల్ప, తరువులందు విచిత్రప • తాకములను
జాలఁ గట్టించి రారాజ • సచివు లనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. చందనాగురుధూప • జాతధూమౌఘ మం, బరమునం దభవి • భ్రాంతి సలుప
భూరిభేరీశంఖ • పుణ్యాధ్వనుల్ మించి, గర్జితస్వనశంక • గారవింపఁ
బ్రాకారగోపుర • బహువిధమణిదీ_ప్తి, యింద్రా యుధద్యుతి • నేర్పరింప
ఘనవిమానాగ్రభా•గములందుఁగాంతలు, మెఱపుఁదీఁగలచాయ • మెఱయుచుండఁ

తే. బురమయూరము లీక్షించి,పురులు విచ్చి, నృత్యకేళి యొనర్చును • నిత్య మార్య
వినుతరంగేశకల్యాణ • వేళ ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. రంగ వైభవరంగ • రంగదపాంగవి, హంగతురంగ వ • య్యాళిరంగ
తుంగరథాంగ ము • ద్దులరంగ మోహన, రంగ శుభాంగ సా • రంగవరద
దురితవిభంగ క • స్తూరిరంగ దయాంత, రంగ భుజంగమ • రాజశయన
రంగనాయక యని • రాజకీరంబులు, శారికలును రంగ • శౌరికడను

తే. రంగనామామృతము చిల్క • సంగ ముడిగి, కర్ణపుటములఁ గ్రోలుచు • గాసిఁబాపి
పెండ్లికొమరునిఁ జూతురు • పెద్ద లనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఆమ్నాయములువైష్ణ•వాగ్రణుల్నుండువంగ, సుజనులుచూచిసం•స్తుతులుసలుప
వందిమాగధసూత•బృందము ల్పొగడంగఁ, గనుమ్రోల నొంపుగా•గణికలాడ
మహనీయకల్యాణ • మండపమధ్యస్థ, సింహాసనమునందుఁ • జెలువు మిగులఁ
బేరోలగం బున్న • పెండ్లికుమారునిఁ, గస్తూరిరంగనిఁ • గన్నులారఁ

తే. జూచి సంతస మంది యా • చోళనృపతి, వేగ నిచుళాపురంబున • కేఁగియందు
దేవి కాకృత్య మంతయుఁ • దెలిపెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. అంత నద్దేవియు • నాత్మపుత్రికి వివా, హోచితాలంకృతు • లొదవఁ జూచి
యారాజు హర్షించి • యక్కన్నియను రత్న. శిబికయందెక్కించి • సిరుల మించి
తనదేవియునుదాను•దగువాహనములెక్కి, సామంతనృపులుపా•ర్శ్వములఁగొలువఁ
జతురంగబలములు • సచివపురోహిత, నైగమనగరజ • నంబుఁ గదలి

తే. ప్రీతి నేతేర శంఖభే • రీమృదంగ, పటహనాదము బ్రహ్మాండ • ఘటము నిండ
వచ్చి శ్రీరంగపతిప్రోలు • చొచ్చె ననుచు, వాదిభీకరగురు డనె • మోదమలర.

సీ. గురుపురోహితమంత్రి • వరులతోఁ జనుదెంచి, గుడికడ యానము • లుడిగిరత్న
చతురంగయానస్థ • సుత కిరుగడలను, మెల్లమెల్లనఁ జని • యుల్ల మలరఁ
దలిదండ్రు లిరువురు • తపనీయమణిమయ, కల్యాణమండపాం • గణమునందు
యానము తగ్గించి • యకళంక శారద, పూర్ణేందుముఖి యైన • పుత్రిచెట్టఁ

తే. బట్టి తోడ్కొని చని రంగ • భర్తకడను, నిలుప నద్దేవియొప్పెను • నీలజలద
జాలకలితతటిల్లత • లీల ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. జనకుఁ డాశ్రీరామ • చంద్రభూజానికిఁ, బ్రీతి మున్ సీత న • ర్పించినట్లు
ధర్మవర్ముఁడు తన • తనయను సలిలధా, రాపూర్వకముగ శ్రీ • రంగభర్త
కర్పింప నక్కన్ని • యను బాణివరణము, చేసి హర్షించె ల • క్ష్మీవరుండు
సుమవృష్టి గురిసెను • సురదుందుభులు మ్రోసె, పాడిరి గంధర్వ•పతులు మింట

తే. నాడి రచ్చరలు మహర్షు • లభినుతించి, రఖిలచేతనులకు సుఖ • మతిశయిల్లెఁ
జోళనృపపుత్రికల్యాణ • వేళ ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. తదనంతరంబ.

సీ. మున్నూటయెనుబది • ముఖ్యసువర్ణతం, డులభారములు హేమ • దోలికలును
నవరత్నమయభూష • ణము లమూల్యము లైన, మౌక్తికహారము•ల్మానికములు
భద్రగజంబులు • బహుమణియానము, లశ్వగోవృషరాంక • వాదికములు
ధన్యస్వలంకృత • దాసదాసీజనుల్, చంద్రోల్లసచ్ఛత్ర • చామరాదు

తే. లన్ని కూఁతున కొసఁగి ప • ర్యాప్తిగనక, తనదుసర్వ స్వమారంగ•ధామునకును
భక్తినర్పించె నాభూమి • భర్తయనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.



తిరుప్పాణియాళ్వారులు

# తిరుప్పాణియాళ్వారుల వైభవము

తిరుప్పాణి-త. శ్లో॥ కార్తికే రోహిణీజాతం శ్రీపాణిం నిచుళాపురే।
శ్రీవత్సాఙ్కం గాయకేన్ద్రం మునివాహన మాశ్రయే॥

వ. అయ్యవసరంబుననిచుళాపురాపరనామధేయం బగుతిరువరయూ రనుదివ్యదేశంబునందుఁ గార్తిక మాసంబున రోహిణీనక్షత్రంబునందుఁ బంచమవర్ణంబున శ్రీవత్స లాంఛనాంశంబుచేత శ్రీపాణియోగీంద్రుండు హసంతి కారవిందంబుచందంబున నవతరించి నిర్హేతుకజాయమానభగవత్కటాక్ష వీక్షణంబులచేఁ బరమసాత్త్వికుండై పరమపురుషార్థలక్షణమోక్షైకప్రయోజనుం డై భగవదనుగ్రహప్రాప్తతత్త్వజ్ఞానసంపన్నుం డగు శ్రీనారదమునీంద్రునిమాడ్కి 'ఏవముక్త్వాతుమాతఙ్గం రాక్షస శ్శరణజ్గతః' అన్నక్రమంబుగా శరణాగతుండగు బ్రహ్మరాక్షసు నుదేశించి, శ్లో॥ యన్మయా పశ్చిమ జ్గీతం స్వైకంకైశిక ముత్తమమ్। ఫలేనతస్య భద్రం తేమోక్షయిష్యతి కిల్బిషాత్॥ అనుకైశికపురాణోక్తి క్రమంబునబ్రహ్మరాక్షసునియందు యజ్ఞాంగలోపాగత దోషంబుఁ బరిహరించిరక్షించు పరమభాగవతునికైవడి భగవద్గాన విద్యాసార్వభౌముం డై శ్రీ పరమాత్ముండగు నారాయణునిం బ్రక్రమించుమ సామగానంబు సల్పుచు నిత్యసూరులం దొక్కరిట్లవతరించిరో యనఁ దగుదివ్యచరిత్రంబులు సలుపుచు శ్రీ పాణియోగీంద్రుండు భయకావేరీమధ్యదేశంబు తన పాదంబులం ద్రొక్కఁగూడదని తలంచియవాచీన కావేరీదక్షిణతీరంబునందుండి స్వవర్ణోచితంబుగా భగవన్మందిరద్వారాభిముఖుండై శ్రీరంగనాథ శ్రీపాదారవిందంబులఁ దనడెందంబునం గ్రందుకొననిలిపితదనుభవ జనితానందసందోహకందళిత హృదయారవిందుండై యొకపాణిపల్లవంబుచే వీణ మీటుచుఁ బెఱకేలం దాళంబుఁ గీలించి వాయించుచు భగవంతుం డగునారాయణుని దివ్యకల్యాణగుణచేష్టితంబులం బాడుచునాడుచు భగవద్గానజనితాహ్లాద వివశసర్వాంగుండై యున్మత్తునిపగిది వికవిక నగుచు నేడ్చుచుఁ ద్రెళ్లుచుం దుళ్లుచుం బ్రేమఁ బేరితుండయి సారెసారెకుం గేల్మోడ్చుచు భ్రాంతునిపగిది నిటునటుఁ బరిభ్రమించుచుఁ దద్దివ్యనామంబులం గీర్తించుచుం దద్వైభవం బెంచుచుఁ దదీయదివ్య మంగళ విగ్రహానవరత భావనాసక్త చిత్తుండై యున్నయంత శ్రీరంగనాథుం డమ్మహాత్మునియందుఁ బ్రసన్నుండయి యున్నం జూచి శ్రీరంగనాయకి శౌరి కిట్లనియె మనకుంబరమాంతరంగ భక్తుం డగునిమ్మహాత్ముండస్మన్మం దిరబాహ్య ప్రదేశంబునం దుండం దగఁడు గాన మనసన్నిధానంబునకు రప్పింపుమని ప్రార్థింప

నద్దేవదేవుం డమ్మహాత్మునిఁ దమసన్నిధికిఁ రమ్మని పలుమా ఱానతీయ నాసాత్త్వి
కపుంగవుండును స్వరూపానురూపనైచ్యంబుచేతను స్వవర్ణాను గుణనైచ్యంబు
నను భగవదాలయంబుఁ జేర వెఱచి విశ్లేషించియున్నంత భగవంతుం డగునారా,
యణుం డాత్మీయకృపాతిశయంబుననిజనిరంకుశ స్వాతంత్ర్యంబునం దనకుఁ
దిరుమంజనకైంకర్యంబు సేయుచుండు శ్రీలోక సారంగమహామునీంద్రునకు
స్వప్నంబునందుఁ దన్నుఁ గానిపించి యి ట్లనియె మహాత్మా నీవు శ్రీపాణియోగి
కడకుం జని జన్మజాతివైషమ్యంబు మాని గరుత్మంతుండునన్ను వహించుకరణి
నమ్మహాభాగవతాగ్రణి న్నిజభుజస్కంధపీఠంబున నెక్కించుకొని వేగ మత్సమీ
పంబునకుం దోడ్కొని రమ్మని యాజ్ఞాపింప నాశ్రీలోక సారంగ మహామునియు
మేల్కాంచి యాస్వప్నార్థంబుఁ దలంచి ‘అద్యమే సఫలంజన్మ సుప్రభాతాచ
మేనిశా’ యను న్యాయంబున మిగుల సంతసించి శ్రీ కావేరీనదియం దవగాహ
నం బొనర్చి కాలోచితహరిశాసనంబులు దీర్చి ‘సూదూర మపిగన్తవ్యం యత్ర
భాగవత స్థ్సితః, అనియెడున్యాయంబున దూరస్థితుం డగుశ్రీపాణియోగీంద్రునిం
గాంచి ‘తాణంతడక్కయ్యుం కూప్పి౯’ సాష్టాంగప్రణామం బాచరించి మహాత్మా
శ్రీరంగధాముండు నిజసన్నిధికి నిన్నుఁ దోడ్కొని రమ్మని దాసునకాజ్ఞాపించెం
గావున వచ్చితిని మీరలు స్వామిసన్నిధికి విచ్చేయ వలయునని విన్నవింప శ్రీపాణి
యోగీంద్రుండు మహాత్మా భగవన్నివేశ ప్రవేశోచితంబు లగు నాల్గుజాతులందుఁ
బుట్టినవాఁడనుం గా నతినీచుండ జ్ఞానహీనుండ నగునట్టి నేను బరమపవిత్రంబును
బరమ భాగవతస్థానంబును బ్రత్యక్షపరమపదంబు నగు శ్రీరంగనాథుని పురంబు
నిష్పాదంబులచేఁ ద్రొక్కనొల్ల నని వెనుక కడుగు లిడుచు భయపడు చున్న
నమ్మహాత్మున కమ్మునీంద్రుం డి ట్లనియె స్వామీ మీర లట్లు దలంచితి రేని
యస్మద్భుజపీఠారూఢుల రై రండని ప్రార్థించి న్యస్తభరుం డగునప్పాణియోగీం
ద్రుని నిజభుజంబులం దెక్కించుకొని యాతివాహకులు ముక్తపురుషునిం దోడ్కొని
తిరుమామణిమండపంబుఁ జేర్చువిధంబున శ్రీరంగనాథుని సాన్నిధ్యంబునం జేర్చె
నంత శ్రీరంగనాయకుండు నిత్యదరిద్రునకుఁ బెన్నిధి గాన్పించిన చందంబున
నిజదివ్య మంగళవిగ్రహంబు నమ్మహాత్మునికిం గన్పింపం జేసిన నవరత్న ఖచిత
తప్తచామీకరకిరీటకేయూరకుండలుండును బ్రలంబమానమౌక్తిక హారుండును
శ్రీవత్సలక్ష్మీ కౌస్తుభాలంకృతవిశాలవక్షుండును వైజయంతీవనమాలా లంకృతుం
డును స్వర్ధునీమృణాళతంతుసంతానాతి ధవళయజ్ఞోపవీతుండును గల్ప శాఖోప

మాననిజభుజాకల్ప శంఖచక్రగదాసిశార్ఙ్గాద్యనేక దివ్యాయుధుండును బాలభాస్కర ప్రభాభాసమానపీతాంబరధరుండును విచిత్రరత్న ఖచితతప్తకాంచన కాంచీదామోదరబంధన శింజానుమంజుమంజీరాద్య పరిమితదివ్యభూషణభూషితుండును నై యుగపదుదితరాకాచంద్ర సహస్రచంద్రి కాతిధవళం బయి యనల్పం బగు శ్రీమదనంతతల్పంబున స్వభక్తరక్షణదక్షం బగుదక్షిణహస్తం బుపధానంబుగా నుంచి ప్రసారితేతరదీర్ఘభుజుండై హలకులిశాంకుశాదిదివ్యలక్షణలక్షితం బగు శ్రీపాదారవిందద్వయంబు సాఁచి భూనీళాదిదివ్య మహిషీవర్గంబు శ్రీపాదసేవసలుపుచుండ శ్రీమదనంతగరుడవిష్వక్సే నాదినిత్యసూరినికరని షేవ్యమానుండై పవళించియున్న పరమపురుషునిం గాంచి మిగుల హర్షించి తిలకించి పులకించి స్తనంధయ బాలకుం డాత్మీయజననియితరావయవంబు లపేక్షింపక స్వజీవనార్థంబు స్తనాగ్రంబునందు నిజాస్యం బుంచుగతి శేషిత్వభోగ్యత్వోపాయత్వపరిపూర్తి వహించి మించుశ్రీపాదపద్మంబు లాదిగా శీర్ష పర్యంతంబు శ్రీహరిదివ్యమంగళ విగ్రహం బనుభవించి తదనుభవజనితప్రీత్యతిశయంబుచేఁ దా ననుభవించినయనుభవం 'బమలనాథపిరా' ననునొక దివ్య ప్రబంధంబుచే నానతిచ్చి సకలచేతనోజ్జీవనంబొనర్చి యానందించుచుండ శ్రీరంగనాథుండు కురువేరుఁ దన్మూలమ్మూర్తికతో నాదరించుకొలంది నమ్మహాత్ముని దివ్యదేహంబుతో నంగీకరించిన భగవత్సన్నిధానవర్తు లందఱుం గనుంగొన నప్పరమభాగవతసత్తముం డంతర్హితుండయ్యె నంత.

## తిరుమంగైయాళ్వారుల వైభవము

తిరుమంగై - త. శ్లో॥ కార్తికే కృత్తికాజాతం చతుష్కవిశిఖామణిమ్ ।
షట్ప్రబన్ధకృతం శార్ఙ్గమూర్తిం కలిహమాశ్రయే ॥

సీ. చోళదేశమునందు • సురుచిరం బగుతిరు, క్కొఱయలూరనుమ్లేచ్ఛ•కులమునందుఁ
గార్తిక వరకృత్తి • కాతారయందు శ్రీ, హరిదివ్యచాపశా • ర్ఙ్గాంశముననుబాలుఁ డొక్కఁడు పుట్ట • నీలవర్ణుం డని, తండ్రి పే రొసఁగె న • ద్దారకునకు
వాసరక్రమమున • వర్ధిల్లి యతఁ డపీ, చ్యవయస్కుఁ డయిస్మర • చాపముక్త
తే. పుష్పనారాచవేదనఁ • బొంది కుంది, జారవిద్యలఁ గాలము • జరపు చుండి
చోళభూపతి నొకనాఁడు • చూచెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. నీలజీమూతాళి • నిగ్గు లనఁ గఁ జాలు, మెఱుంగుచామనిచాయ • మేనివాని
వజ్రమయం బగు • వరకిరీటముఁ బోలెఁ, దలర సీతోష్ణీషముఁ • దాల్చువానిఁ
గెందామరలసొంపుఁ • గేరుకన్నులవానిఁ, గలితశూరశ్రీము • ఖంబువానిఁ
బరిఘోపమాజాను • బాహుయుగ్మమువానిఁ, నవసితవారవా • ణంబువాని

తే. రమ్యకటితటపటుకరా • రంబువానిఁ, గరధృతోజ్జ్వలఖేటఖ • డ్గములవాని
నీలనామకుఁ జూచె భూ • పాలుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. రూపము భీకరా • టోపముఁ జూచి వీఁ, డసహాయశూరుఁ డు • గ్రాహవమునఁ
బరకాలుఁ డని మది • భావించి సభయందుఁ, గూర్చుండనియమించి • కుశలమడిగి
యతనియాగమనకృ • త్యముఁ దదీయోక్తుఁల, దెలిసి యాతని కొక • దేశ మిచ్చి
కొంతబలంబుతోఁ • గొలువ నియోగించి, బహుధనభూషణాం • బరము లొసఁగి

తే. ప్రీతిఁబరకాలుఁ డనిపేరు • పెట్టియతనిఁ, జోళనృపుఁడంపఁ జనుదెంచి•నీలనామ
కుండుతనదేశ మేలుచు • నుండెననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర. 24

వ. ఆసమయంబునం దిరువాళి త్తిరునాడను దేశంబునం దొక్కచో నతిగంభీరనిర్మల నీరపూరితంబును నమలకమలకల్హారకైరవనీలోత్పలాది సుగంధబంధురంబును సద్యస్సముల్ల సదరవిందస్యందమానమకరందపానమత్తమిళింద సుందరీసందోహ మధురగీతమంగళంబును బిసకిసలయచ్ఛేదఖాదనోన్మత్తకలహంసకారండవచక్ర వాకబకక్రౌంచాంచితక్రేంకారసంకులంబును సముచితస్వకీయాంగనాసంగ సముత్కంఠిత కమఠపాఠీనాది జలజంతుసంతానసముల్లుంఠనాకుంఠితకల్లోలమాలా నీలాప్యాయిత కూలవిలసత్తరుగుల్మలతావితానప్రకాశితంబును ధవళతరాసంఖ్యేయ శంఖశుక్తి ముక్తాసక్తబృందారకద్వంద్వవిరహార్హాతమ విపులపులినంబును నిఖిలర్తునిత్యనిషేవ్యమాణతీరరుహానేకభూరుహప్రకరపతితపత్పతిష్యమాణ పుష్ప ఫల ప్రవాళమంజరీపుంజరంజితంబునుసకలమనోనయనాభిరామంబునయి యొప్పుచున్న యొక్క పద్మాకరంబుఁబొడగని రంభోర్వశీమేనకాద్యనేకాప్సరస్సమూహం బేతెంచి యందు జలక్రీడలాడుచుండంజూచి యరవిందమందిర యగునిందిరా సుందరి యమందానందంబు డెందంబునం గ్రందుకొన నప్సరోరూపంబు ధరించి వారితోడం గూడి క్రీడింపఁ బుష్పాపచయంబు సల్పుచున్నంత నద్దేవినిఁ దిగవిడిచి వారలందఱు యథేచ్ఛంజనిన నా శ్రీదేవియు మనోహరంబగు మనుష్య స్త్రీరూపంబు ధరియించి కుముదకుసుమంబుఁ గేలుదమ్మిం గీలించి సవిలాసంబుగాఁ జూచుచు నేకాకిని యై యున్నయెడఁ బ్రకటప్రకాశవిశంకటరత్న శిలాశక సంఘ

టిత హాటకప్రాకారగోపురమండపమందిరాది సుందరంబయి మాననీయ మంగళ దేవతాలింగ నారంగదంతరంగరథాంగపాణికింబరమమంగళవాసం బగు తిరుణాం గూరను దివ్యదేశంబు నుండి భిషగర్వుండైన యొక మహాభాగవతోత్తముం డనుష్ఠానార్థంబుగాఁ జనుదెంచి తత్తీరంబునఁ జింతించుచున్న యక్కుమారీ రత్నంబు జూచి విస్మయంబంది నీ వెవ్వరిదానవు శరభ శార్దూలపుండరీక గండక వేదండ కుండలీప్రముఖ దుర్జంతుమండల ప్రచండ తరుషండ మండితంబైన యిప్పుండరీకాకరంబుకడ నిజ తేజోమండలంబుచేత భూనభోంతరాళంబుఁ గప్పుచు నొంటిమై నేమి కారణంబున్న దానవురతివో భారతివో యరుంధతివో హైమవతివో జగదేకరక్షకుండగు పుండరీకాక్షునకుం బ్రాణపదంబై జగన్మాతయైన లక్ష్మీదేవివో మనుష్యభావంబునం నుండితివి గాన నిన్నెఱుంగం జాలనన విని యద్దేవియు నాతోడఁ గూడవచ్చిన సఖీజనంబు నన్ను విడనాడి చనియెం గావున నన్ను నీతోడం దోడ్కొనిపోయిన వచ్చెదనని పలుక నమ్మహాత్ముం డనపత్యుండు గావునఁ బ్రహృష్టాంతరంగుండై యక్కన్యా లలామంబుఁ దోడ్కొని నిజ నివాసంబునకుం జని తన గృహిణికిం జూపి యక్కన్నియ వృత్తాంతం బంతయు నెఱింగింపం దెలిసి యాసాధ్వి వంధ్య గావున మిగుల సంతోషించి యక్క న్నియపాణి పల్లవంబునందుఁ గుముదపుష్పంబు ధరియించి యుండుటం జేసి యదియె నిరూపకంబుగాఁ గుముదవల్లి యని యొక భవ్యనామం బొనర్చి పుత్రిక యని యభిమానించి పోషించుచు నా దంపతులిరువు రనపత్యతాప్రాప్తసంతాపంబు లుడిగి యానందించుచున్న సమయంబున నక్కన్నియ సౌందర్యాది గుణంబు లన్నియుఁ దెలిసి కొందఱప్పరకాలున కెఱింగించిననతండు ప్రహర్షించి తత్సౌం దర్య ప్రవణమనస్కుం డయి యతిరయంబునఁ దిరుణాంగూ రను దివ్యదేశంబు నకుం జనుదెంచి వైద్యవరిష్ఠుం డగు నబ్భాగవతశ్రేష్ఠుని భవనంబుఁ జొచ్చి యతనితో మాటలాడుచున్నసమయంబున నక్కుమారీ తిలకంబు వెలువడివచ్చినం గనుంగొని తద్దివ్యసౌందర్య సౌకుమార్య లావణ్య యౌవనచాతుర్య గాంభీర్యాది గుణంబు లన్నియుం జూచి విస్మితుం డయి యక్కన్యాజనకు నుద్దేశించి మహాత్మా నీ వనపత్యుండవు నీకుఁ గుమారీ రత్నలాభంబెట్లు సంభవించె యడిగిన నక్కన్య కామనవృత్తాంతంబంతయు నతం డతని కెఱింగించి యజ్ఞాత కుల గోత్రయుఁ బ్రాప్తయౌవనయునగు నిబ్బాలికామణి నెవ్వని కొసంగుదునని వ్యాకు లితాంతఃకరణుండ నై యున్నవాఁడ ననిన నప్పరకాలుం డిక్కన్యకను మాకుం బల్లిగా నియ్యందగునని బహు ధనరత్న భూషణ దివ్యాంబరంబు లబ్భాగవత

శిఖామణి కర్పించి యమ్మహాత్ముని మిగుల ననుసరించి యను నయోక్తుల నాద రించి యడుగ నద్దంపతు లిరువురు నతని కక్కన్నియ నర్పింప సమకట్టి యున్నంతఁ బంచసంస్కారపరుండగు నరవరునకు భార్య నగుదునని ముందు నా డెందంబున నిశ్చయించి యుండితినని తనహృదయగతం బగు నధ్యవసాయం బెఱింగించినయంత నప్పరకాలుం డతిరయంబునఁ దిరువరయూరికిఁ జని పరమ కృపైకావలంబి యగు నంబినిం గాంచి సాష్టాంగ దండప్రమాణం బాచరించి యమ్మహాత్ముని యనుగ్రహంబునఁ బంచసంస్కారసంస్కృతుఁడై యర్థ పంచకం బెఱింగి యాకారత్రయసంపన్నుండై మగిడి తిరుణాంగూరి కేతెంచి యా దంపతులం గాంచి యున్నంతఁ దప్తశంఖచక్రాంకిత చారుతరబాహామూలుం డును శ్రీచూర్ణ రేఖాలంకృతాంతరాళ ద్వాదశస్థాన రచిత ధవళోర్ధ్వ పుండ్రుం డును, అర్థపంచకజ్ఞానఘనుండును, ఆకారత్రయ సంపన్నుండు నై యొప్పు నప్పరకాలమునీంద్రునిం గనుంగొని యొక్కసంవత్సరం బ్రశాంతం బష్టోత్తర సహస్ర శ్రీవైష్ణవ సమారాధనం బాచరించి తదీయ శ్రీపాదతీర్థంబును దళిహ ప్రసాదంబును స్వీకరింపకకాని నిన్ను భర్తనుగాఁ గైకొన నొల్లనని కుముదవల్లి యను నక్కన్య కాలలామంబు తన మనోనిశ్చయం బెఱింగించిన నన్నీల నామకుండునట్లు సేయించెదనని శపథంబు పలికిన యనంతరం బా దంపతు లక్కుముదవల్లి యను కుమారి కామతల్లిక నప్పరకాలున కుదకపూర్వకంబుగా జగం బెఱుంగ సమర్పించి కల్యాణమహోత్సవం బొనరించి రంత నమ్మహాత్ముం డారాధనంబుల కెల్ల భగవదారాధనంబు ముఖ్యం బంతకన్నఁ దదీయారాధనంబు ముఖ్యతరంబని తన మనంబున నిశ్చయించుకొని తనదేశంబునందుఁ బ్రాప్తం బగు ధనౌఘంబుచే శ్రీ మహాభాగవత సమారాధనం బాచరించుచుండె నంత. 25

సీ. మంచిశాల్యన్నము • లంచితముద్గసూ, పములు హైయంగవీ • నయములు మేలి
కూరగాయలును జి • గురు లొప్పుపచ్చళ్ళు, పొడిచారు పలుచని • పుళి మరీచి
సురభిహింగూజీర • శోభిత మగుపుళి, చారుమోదకములు • షాడబములు
వడ లతిరసములు • గుడపాయసాన్నముల్, లవణవిశై ్వలాది • లలితదధియు

తే. వలసినట్లు సమర్పించి • వైష్ణవులకుఁ, బుష్పచందనతాంబూల • ములు నొసంగి
పాదతీర్థములను గ్రోలుఁ • బ్రాజ్ఞుఁ డనుచు, వాదిభీకరగురుఁడనెఁ • మోదమలర.

సీ. కుముదవల్లిని గూడి • కూర్మితో నారీతి, ననిశము శ్రీవైష్ణ • వార్చనంబు
సలుపుచుండిన గూఢ • చారులు గని చని, చోళరాజును జూచి • కేలు మోడ్చి

నీధనం బంత యా • నీలుఁ డనారత, మెల్లవైష్ణవులకుఁ • గొల్లవుచ్చె
నని పల్క విని నృపుఁ•డానీలుకడ కేఁగి, ద్రవ్యముఁ గొనుఁడని•తరువుకాంద్రఁ

తే. బంప వారేఁగి పరకాలుఁ • గాంచి యర్థ,మడుగ నాతండు రేపుమా•పనుచుజరుప
వార లరికట్టి రాతని • ద్వార మనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర. 27

సీ. తనద్వార మరికట్టు•తరువుకాంద్రను జూచి, మెడఁ బట్టి గెంటించె•మేటిమగఁడు
పరకాలుఁ డంత నా • భటు లేఁగి తమదొర, కాకృత్య మెఱిఁగింప•నాతఁ డలిగి
చతురంగబలముతోఁ • జని పరకాలునిఁ, బట్టి, తెమ్మని సైన్య•పాలు ననుప
వాఁ డశ్వరథమద•వారణపాదాతి, సహితుఁ డై వాద్యఘో • షము చెలఁగ

తే. నేఁగుదెంచినఁ బరకాలుఁ•డెఱిఁగి కడిఁది,పోటరులు తన్నుఁగొలువంగ•భూరిసకల
వాద్యరవ మొప్పడాసె నా•వైరి ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. అసహాయశూరుఁ డౌ • నతనిసేనాపతి, పరకాలుఁ గని మ్రొక్కి • పలికె నిట్లు
స్వామి దేవరవారు • చననేల యీ 'బీద,బలముల నని మొన • భంగపఱుప
నత్యుగ్రహవిషహరి • వ్యాపి విక్రమశాలి, యండజేంద్రుఁడు జల•వ్యాళములను
ఖండింప నరుగునా • కావున నీమమ్ము, నియమింపఁ దగు శత్రు•నిగ్రహార్థ

తే. మనివచించిన విని వాని•నని యొనర్పఁ, బంచెఁ బరకాల సూరివాఁ•డంచితోగ్ర
బలముతోడ నెదుర్కొనెఁ•బరుల ననుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర. 30

వ. అంత.

సీ. పటహకాహళశంఖ • భైరవారావముల్ పటుభటాక్ష్వేళితా • ర్భటులు తురగ
హేషితధ్వనులు మ • త్తేభబృంహితములు, రథచక్రనేమిసాం • ద్రస్వనంబు
లవియన్ని గుమిగూడి • యభ్రస్థలిని మించి, బ్రహ్మాండభాండము•బ్రద్దలింప
నుభయబలంబుల • యోధ లాయోధనో, న్మత్తు లై కదిసి పెఁనంగుచుండ

తే. బలుపరాగవ్రజంబు న • భస్థలంబుఁ, గప్పఁ జీఁకట్లు గ్రమ్మిన, గడిఁది చెడక
ఘోర మగుపోనర్చి రా • శూరు లనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ అట్లు పోరఁ బరస్ప • రాస్త్రశస్త్రాభిహతి, రణభూమి జనియించె • రక్తనదులు
శవమొందె నంత ర • జఃపుంజ మల్లన, విచ్ఛిన్న మూలమై • విఱిగి యడఁగి
చూపట్టె దెస లంత • శూలపరశ్వధ,ముండలాగ్రప్రాస • భిండివాల
పట్టిసకుంతాది • బహుసాధనములచేఁ, దఱుఁగక యొఱగక • తఱిమి యుఱిమి

తే. బీర మలరంగఁ దమతమ • పేళ్ళు చెప్పి, వీరు లత్తఱి నన్యోన్య•విజయకాంక్షఁ
బోరు సల్పిరి వేల్పులు • పొగడ ననుచు, వాదిభీకరగురు, డనె • మోద మలర.

సీ. తనమొన విఱిగినఁ • గని చోళసేనాని, పనిచెను జతురంగ • బలము మరల
విఱిగిన సైన్యము • తిరిగి యాబల మంది, పురికొని వెఱవక • పోరొనర్పఁ
బరకాలభటు లంతఁ • బరులకుఁ గనుప్రోలఁ కాలకింకరులట్లు • గానఁబడుచు
సింహనాద మొనర్చి • చెండాడి వైరులఁ, జిందఱవందఱ • చేయఁ జూచి

తే. చోళపృతనాధిపతి పర • కాలసేనఁ, గుప్పె దెప్పరముగ నంప • కోల లంత
యుద్ధభూమికిఁ దొలఁగిరా•యోధ లనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. ఆహవవిముఖుల • కాత్మసైనికులకుఁ, బరకాలవాహినీ • పాలుఁ డనియె
నీవేళ నయిన రే • పెల్లుండి యైన నూ,ఱేండ్లకైనను మృత్యు • వీశరీరి
నావహించును గాన • నాభిజాత్యము శౌర్య, మన్నియు దిగనాడి • యల్పవీర్యు
లైనప్రాకృతులట్టు • లనిమొన విడనాడి, వెన్నిచ్చి రిపులకు • వెఱచి పోవఁ

తే. దగునె యిండ్లకుఁజనినమీ•తరుణులైన,నగరె వెఱపేల మనకని • నాయమలరఁ
బలికి యమ్మేటిమగఁ డిట్లు • పలికె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. పరుల గెల్చితి మేని • పరకాలుకడనుండి, పరమభాగవతుల • పాదసేవ
సలుపు చుండెద మగ్ర • సమరాభిముఖుల మై, చచ్చితిమా జన్మ • సరణి మాని
వైకుంఠపురమందు • వసియించెదము గాన, వెఱవక పొడువుఁడీ • వీరులార
యని వారి మరలించి • యనిమొనకెదిరించి, కాలాగ్నిరుద్రుని • కరణి మించి

తే. రోషభీషణతామ్రనే • త్రుఁడుకలిఘ్న, సైన్యపతి చాపమెక్కిడి • శరముఁబూన్చి
యార్చి పేర్చెను శత్రువు • లవల ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. తనశరీరము జల • దంబుగాఁ గనిపింపఁ, దనసింహనిస్వన • స్తనిత మొప్పఁ
దనరత్నఖచితకో • దండ మింద్రాయుధ, ప్రభ లీన నారి మె • అపుకరణిని
మెఱయ శరాసార • మురుజలాసారమ, ట్లమర దుర్దంబు వ • ర్షాగమంబుఁ
జేసెను బరకాల • సేనాధిపతి యంత, నిజభటబర్హిణా • నీక మాత్మ

తే. శస్త్రనివహాస్త్రపంచపిం • ఛములు విచ్చి, సింహరవకేక లొనరించి • చెండియాడ
శత్రుఫణితతిచాటుకు • జరిగె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 36

సీ. అట్లు పలాయనా • యత్తసైనికుల కి, ట్లనియెను రాజసే • నాధిపుండు
వీరుల కనిమొన • విఱిగి పాఱుటకన్న, హైన్యము వేఱు లే • దరసి చూడ

నరుల నెదుర్కొని • మరణ మొందితి మేని, యరిగి వీరస్వర్గ • మనుభవింపఁ
గలము దెల్చితి మేని • కలకాల మాచోళ, నరపాలుకడనుండి • సిరులఁ జెందఁ

తే. గలము గావునఁ దిరిగి యీ • బలము గెలిచి, నీలనామకు నీ కొండ • పాశెగానిఁ
బట్టుకొనిపోద మని వాఁడు • పలికెననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. రాజసేనాని మర • ల్చి యా బలముతోఁ, బరకాలవాహినీ • పతిని దాఁక
నతఁ డతండును బ్రబల • యోధులట్లుపొంగి, యన్యోన్యకాంక్ష • నార్చిపేర్చి
పరశుగదాప్రాస • పట్టిసపరిఘాది,బహుసాధనములచే • బవర మొంది
తడఁబడకయుఁ గడుఁ • బొడుచుచు నడుచుచు, జరగుమ సవ్యాప • సవ్యగతుల

తే. మండలంబుల దిరుగుచు • బెండుపడక, చండకోదండనిర్ముక్త • కాండతతులఁ
బోరి రోడక యిర్వురా • శూరు లనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర. 28.

సీ. అంత విజృంభించి • యసహాయశూరుఁ డౌ,పరకాలవాహినీ • పాలకుండు
తనఘోరనారాచ • ధాటిచేఁ బగతుని, విలు ద్రుంచి యార్చిన • వీఁక వాఁడు
సయ్యన మఱియొక • చాప • మెక్కిడి వ్రేసె, నాశీవిషోగ్రము • లై నశరము
లమ్మేటియాతూపు • లాచాప మతఁ డూను,సకలాయుధముల నా • క్షణమతునిమి

తే. వాని సర్వాంగముల నాటె•బాణములను, బుష్పితాశోకవృక్షస,ముండు వాఁడు
సంగరాంగణపముఖుఁడై • చనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. కలిరిపుసేనాని • గెలిచి వైరులఁదన,స్వామిని గని మ్రొక్కి • జయముఁజెప్పి
యతనిచే బహుమతుఁ • డై యున్నతఁ జోళ,నరపాలవాహినీ • నాయకుండు
క్షతజధారాసిక్త • సర్వాంగుఁ డై నిరా,యుధుఁడై యహంకృతి • యుడిగిబడలి
ముడి వీడి కేశముల్ • మూఁపున నసియాడ, వడి నడుగిడఁ దడఁ,బడక నడచి

తే. వెడలి హత శేషబలముతోఁ • బ్రీడపడుచుఁ,జోళనృపతినిగనుఁగొని,కేలుమోడ్చి,
కలహవృత్తాంతమంతయుఁ • దెలిపెననుచు, వాదిభీకరగురుఁ డనె,మోదమలర.

సీ. ఓడి వచ్చినతన • యోధనాథునిఁ జూచి, పలికె రా జిట్లు పే • రలుక నతని
కతిఘోరచతురంగ • పృతనాధిపతి వగు, నీ వాజియం దిట్టి • నీచదశను
జెందఁ గారణ మేమి • చెప్పుమాయదియన్న,నభయమర్థించివాఁ • డనియెనిట్లు
రాజసత్తమ నే న • రాతి యౌనీలునిఁ, బట్టి తెచ్చెద నని • వంతగించి

తే. పోయి యతనిపురప్రాంత • భూమి నుండ, నన్నుఁ గదిసెను నీలసే•నాని వాని
బలముఁ జెప్పెద నని వాఁడు • పలికెననుచు, వాదిభీకరగురుఁడనె,మోద మలర.

సీ. వెలువక నీలుఁడు • తురగాధిరూఢుఁ డై, పురము వెల్వడి వచ్చె • దురమొనర్ప
నంతఁ దదీయబ•లాధ్యక్షుఁ డేతెంచి, యతని వారించి క • య్యంబు సలుపఁ
దచ్ఛరాధానసం•ధానమోక్షము లేమి, తెలియంగ నెవ్వరి • కలవి గాదు
వాని విల్లొంది జ్యా•వల్లి బాణములను, గనునట్లు దోఁచె మా • కన్నులకును
తే. శూరు లాపోర నీల్గుట • చూడఁబడును, గాని తచ్ఛరపాతము • గాన మైతి
మనుచువాఁడానృపాలున • కనియె ననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. నీలునిదళవాయి • నేటుముల్కులు సోఁకి, కాలుని పాలై రి • కడిఁదిమగలు
నీలాఖ్యుఁ డగుపర • కాలుబలోల్కలల, నాలములో నోర్వఁ • జాలినట్టి
దంటిమగండుబ్ర•హ్మాండభాండములయం, దుండఁ డంచువితర్క•ముండుమాకు
నండజనాథుఁడో • యహిమండలేశుఁడో, హరిదండనాథుఁడో • యతనిదివ్య
తే. శార్ఙ్గకోదండమూర్తియో • శౌర్యధైర్య, జలధిపరకాలుఁడితఁడయ్యె•సత్యమనుచు
బలికెరాజున కాసైన్య • పాలుఁడనుచు,వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. వాఁడిముల్కులఁ బోలు • వాని పల్కులు విని, యలుక తలంపులో•మొలకలెత్త
గాంభీర్యమున వానిఁ • గనఁబడ నీయక,మొగమునఁ దళుకొత్త • మొలకనవ్వు
పలికెఁ జోళక్షమా • భర్త సభ్యుల కిట్లు, మీరు నయానయ • స్ఫారమతులు
బలియుండు మంత్రియు • పాయజ్ఞుఁ డాప్తుఁడు, శూరుఁడు గమికాఁడు•ధీరబుద్ధి
తే. యిట్టివీఁ డోడి వచ్చిన • నింక మనకుఁ, జేయఁగలకృత్య మెట్టిదో•చెప్పఁడనినఁ
బ్రాజ్ఞు లతనికిఁ గొందఱు • పలికి రనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. వినుము మహారాజ • మును నిన్ను నీలుఁ డేతెంచి కాంచినగార,వించి వాని
దేశాధిపతినిగాఁ జేసితి • వామేలు, దలఁపక వాఁడు కృ • తఘ్నుఁ డయ్యె
నిలఁ గృతఘ్నునిఁ దక్క • నెట్టి మహాపాత, కులకైన నిష్కృతుల్•గలవుగాని
మీరు పేక్షించిన • శూరాభిమానివాఁ డడవిపల్లెలఁ జెంది • యాత్మసముఁడు
తే. లేఁడు నాకెవ్వ రెదు రని • వ్రీడ విడిచి, కానిపను లన్ని సలుపును•గాన వాని
బట్టి శిక్షింపు మని కృతుల్ • పలికి రనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఆమాట లాలించి • యానీలునకుఁ బ్రతి,కూలుఁ డౌ చోళభూ • పాలుఁ జూచి
నరకాలసూరి నం•భావనీయుఁడు గాని, దండనీయుఁడు గాఁడు • ధారుణీశ
పరమభాగవతుల • భక్తితో నర్చించు, నపకార మెవ్వరి • కాచరింప
దెప్పటికరణి మీ • కియ్యంగఁ దగునట్టి, ధన మొసంగును గాని • దాఁపఁడతఁడు

తే. పురనిరోధన మోర్వక • దుర మొనర్చె, వాలమర్దనమోర్చునే • వ్యాఘ్రమనుచు
బ్రహ్మవేత్తలుకొందఱు • పలికి రనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర. 46

సీ. సార్వభౌముఁడ వీవు • సరిదొర లైన నీ,యాజ్ఞను దలదాల్తు • రవని నట్టి
నీయానఁదొలఁగిన • నీలనాముఁడుపేంద్రుఁ,డోయింద్రుండో చంద్రుఁ•డోనరేంద్ర
వీనిశౌర్యంబెంత • వీడెంత వాఁడెంచఁ, గొండెపాటెములందుఁ • గూడియుండి
వంచించి పనడళ • వాయిని గెలిచెను, గానఁ గాననములఁ • గాల్చి వానిఁ

తే. బట్టి తెచ్చెదమని జెట్టు • మిట్టిపడుచు, శూరమానులు రాజకు • మారులందుఁ
బరశుపట్టినపాణులై • పలికి రనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర 47

సీ. అట్లు వేర్వే అంద • డాత్మమనీషల, కుచితము లగుమాట లుగ్గడింప
విని రా జనియె నిట్లు • వే యన నేటికి, నెనె నాబలముతో • నీలుకడకు
వనుదెంచినను జూచి • చయ్యన వెఱవక, న న్నెదుర్కొని పోరె • నా యతండె
మేటిపోటరి యని • మెచ్చి వానికి ద్రోహ, మాచరింపక యర్థ • మైనధనముఁ

తే. బుచ్చుకొని దేశ మిచ్చెదఁ • బోరలేక,పోయెనా వానిపురిఁ గొల్ల • పుచ్చి యతని
బట్టి తెచ్చెద నని రాజు • పల్కె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. స్వస్థానగుప్తిప్రాం • తస్థానరక్షయుఁ, బాష్టిశుద్ధి యొనర్చి • బహుబలంబు
గొల్వ వెల్వడి వచ్చి • కొరయలూ రనుపురి, చుట్టు ముట్టడి చుట్టి • చోళభూపుఁ
డున్నంత నిజచారు • లన్నరపాలుని, బలముఁ గన్గొని వచ్చి • ప్రణుతిసలిపి
పరకాలునకుఁ దెల్ప • బ్రళయాగ్నిభైరవ,కాడుఁ డతండు సం • గ్రామమునకుఁ

తే. బురమువెల్వడి సబలుఁడై • భూరిఘోర,శంఖకాహళపటహాని • స్స్వాణరవము
మించఁబగతురఁగనిమోహ • రించె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. జితకాశు లై నట్టి • ముతరాచవీరులు, సంఖ్య లేనట్టిని • షాదపతులు
పరకాలసూరిని • వలగొని చేమోడ్చి,యతఁడు డీకొల్ప ను • గ్రాహవమునఁ
గరిఘటలను దాఁకు • కంఠీరవములట్లు, వీఁకచేఁ జెంగునఁ • జౌకళించి
వైరులఁ గదిసిన • వీరు వారును దేవ,దానవులటుల యు • ద్దామవీర్య

తే. లైనహరిరాక్షసులమాడ్కి • నార్చిపేర్చి,పోరుఘోరమొనర్చినఁ • బుడమిరజము
గగనమండల మంతయుఁ • గప్పె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. బహుళభేరీశంఖ • ఖాంకారశింజినీ,టంకారములు వీర • హుంకృతులును
ఘంటాఘణాత్కార • గజరాజఘీంకార,హయచయహేషిత • హలహలములు

వినఁబడెఁ గాని యా • వీరుల కేమి గన్పడ దారజస్తమః • పటలి నంత
ఘంటారవంబుల • గజముల నూహించి, చక్రనేమిధ్వని • స్యందన మని

తే. తలఁచిహయముల హేషిత • ధ్వనులఁదెలిసి,హుంకృతులవైరివీరుల•యోధలెఱిఁగి
పోరి రన్యోన్యవిజయముఁ • గోరి యనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. శిరములుఁ గరములు • నురము లూరువు లంఘ్రు. లతిశితశస్త్రప్ర • హారములను
దెగినభటేభాశ్వ • దేహశైలములందు, జనియించి రక్తని • ర్ఝరవరములు
బాలార్కమండల • ప్రభలఁ దేలుచు నంగ, రేలపై వడిఁ బ్రవ • హించుచుండ
రజము మూలముఁ జేరి • రక్తాపగలఁ బడి, యంగారసదృశమై యణఁగె నంత

తే. దిశలుపదియునుభటులకు • దేటపడియె,నంతఁదమతమవీరధై • ర్యములుమెఱయ
యుద్ధమొనరించి రుడుగక • యోధ లనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. అంతటఁ బెంపొంది • యాసైన్యములు రెండు, దక్షిణోత్తరసము • ద్రములపగిదిఁ
దాఁకి భీకరముగా • వీఁక మీఱఁ బెనంగ, నలసి రాజభటౌఘ • మనికిఁ దొలఁగఁ
జూచి కరం బల్గి • చోళభూపాలుఁడు, పనిచెను జతురంగ • బలము మరలఁ
బ్రళయకాలోద్వేల • జలనిధికొలఁది నా,బల మొకపరి నీలు • భటులఁ గదిసి

తే. చండసాయకముద్గర • భిండివాల,శూలకుంతగదాకర • వాలముఖ్య
ఘోరతరశస్త్రవర్షముఁ • గురిసె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. నిజయోధులకు గాసి • నివ్వటిల్లఁగఁ జూచి, ప్రళయార్కబింబము • పగిది మెఱసి
యొఱజరాలునదూసి • కరవాల మలకాల,మృత్యుజిహ్వకు సరి • మీఱఁ గేలఁ
గీలించి పెఱకేల • ఖేటము జిగిఁ దాల్చి, గరుడసన్నిభతురం • గంబు నెక్కి
కలియుగాంతమునందు • మలినచేతనులను•ఖండించుకల్కి యీ • తండెయనుచు

తే. జనుల కూహింపఁ దగినట్టి • సాంద్రకీర్తి, చండవిక్రమస్ఫూర్తి • శార్ఙ్గమూర్తి
కలిహరుఁడు కదనకేళికిఁ • గదలె ననుచు, వాదిభీకరగురుఁ డనె మోద మలర.

సీ. ఏకవీరుం డితఁ • డీ సైన్యమా యనం,ఖ్యేయ మాయోధన • మెట్టు లగునొ
చూచెద మని యెంచి • సురలు గంధర్వు ల, చ్చరలు రాజర్షులు • సాధ్యసిద్ధ
కిన్నరవిద్యాధ్ర • కింపురుషులు నాగ,గరుడులు యక్షర • క్షఃపిశాచ
దైత్యదానవులు పి • తామహరుద్రమ, హేంద్రులవెనువెంట • నేఁగుదెంచి

తే. చూచుచుండంగ మింటిపై • సూర్యచంద్ర,శతములున్నట్టు గన్పట్టె • జనులకంతఁ
జొచ్చెఁబరకాలుఁ డాహవ • క్షోణి ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. తనయాన నవి మాని • తనజయ మర్థించి, వెలినుండి నిజభటుల్ • వింతఁ జూడ
హైహయసైన్యము • లనిమొనమునుదాఁకఁ, బరశురాముఁడుభంగ • పఱచినట్లు
ఖరదూషణాదిర • క్షస్సంఘములమూఁక,బలి మొకరాముఁడు • గెలిచినట్లు
తనచేతియడిదంబు • తళుక్కులాయోధుల, కన్నుఁగవఁ గప్పఁగాఁ • గలిహరుండు

తే. సాంద్రమండలసవ్యాప • సవ్యగతుల, సంచరించుచుఁ జోళరా • సైన్యములను
వీథు లేర్పడ నఱకెఁ బె • న్వేఁక ననుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర 56

సీ. వేల్పులయెకిమీఁడు • వేయికన్నులఁ గనఁ, దమ్మిచూలియు శూలి • తగు ననంగ
గంధర్వులగునన • గురుడోరగులు మెచ్చ,మునులునిలింపులు • ముదము జెందఁ
బ్రళయకాలోద్వృత్త • జలధి నాదివరాహ,దేవుఁడు చొచ్చి మ • థించినట్లు
చోళభూపాలక • రాళచతుర్విధ,బలములఁ గాలుని • పాలి కనిచి

తే. రక్తమాంసాదిబహుళమౌ•రణధరిత్రిఁ, బొనఁగమృత్యువుకాకపాన,భూమిఁజేసెఁ
గలిహరుఁడు ధైర్యశౌర్యాది • జలధియనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. అంత నబ్బంధనోర్వీమండలంబునం బ్రచండవేదండశుండాదండ మండితపరకాల దోర్దండమండనాయితమండలాగ్రశితధారా ఖండితంబు లయి పడియున్నయేనుంగులపీనుంగులును హీనాంగంబు లగుతురంగంబులును విశకలితంబులగురథంబులును బుడమిం బడి బెడఁగొందురథచ్ఛత్రాదికనకకలశంబులును దునుక లయినధ్వజంబులును భూపతితంబు లయి రజోరూషితంబు లగుపతాకలును ధరణిం బడి మెఱుం గుడిగినగొడుగులును గడిఁది యుడిగి కంఠగతప్రాణావశిష్టులై పానీయార్థంబుగా వాచఱచుచు భూమిం బడియున్న యోధులును బ్రోవు లైన ప్రేవులును మఱియు మహాగజశరీరంబు లనియెడుతీరంబులును గరికుంభంబులను కమఠంబులును మహోష్ట్రంబు లనుమకరంబులును ఘోటకింబులనుపాఠీనంబులును శ్వేతచ్ఛత్రంబులను రాజహంసంబులును భుజంగంబులను భుజంగంబులును జామరంబులను ఫేనసముదాయంబులును గంబంధంబు లనుబంధురదార్వాఘాటంబులును గేశజాలంబులనుశైవాలంబులును మాంసమజ్జామేదః పుంజంబులను మహాపంకంబులును ముఖపాణి పాదంబులను పద్మసముత్కరంబులును సంపీభూతా స్థిసంఘాతంబు లనుసైకతంబులును గృపాణధారాసంఘర్షణ జనితవిభూషణరత్నచూర్ణంబు లనుమృదువాలుకలుం గలిగి శోణనది ననుకరించి ప్రవహించుచున్న రక్తస్రవంతికలను రుధిరమాంసాద్యాస్వాదజనితమదవి ఘూర్ణితనేత్రంబు లయి

కాకఘూక చండతరగండ భేరుండభూతబేతాళశాకినీఢాకినీ ప్రముఖపిశాచసృగాలాద్రిక్రవ్యాదగణంబులు పరమానంద భరితంబులయి యేకవీరుండగు కలివైరినిజయజయశబ్దంబులం బొగడుచురణరం గస్థలినాట్యకేళియొనర్చుచు నిజబాంధవులంబిలుచుకొలంది మహానాదకోలాహలం బొనర్చు చుండం జూచిదండి చెడి బెండుపడి చింతాదో ధూయమానాంతకరణుం డయ్యును బీరంబు చెడక ధైర్యంబవలంబించి పలాయనపరాయణు లగుహతావశిష్టసైనికుల మరల్చి మోహరించి నిలిచిచోళభూమండలేశ్వరుండు జగద్రక్షకుండగు పుండరీకాక్షున కాత్మభూతుండయి యవతరించిన తదీయకోదండమూర్తి యగుపరకాలపండిత మండలాధిపతి కిట్లనియె మహాత్మానీవు లోకోపకారార్థంబుగా నారాయణాంశంబుచే నుదయించిన భవ్యమూర్తివి. గాని మనుష్యమాత్రుండవుగావని యెఱింగితి తావక శౌర్య ధైర్యాదిసద్గుణంబులకు మెచ్చితి మగిడి నీదేశంబు నీ కిచ్చితి మాకీయ నర్హంబగు ధనం బిచ్చిమత్ప్రాణ సఖుండవై యుండు మని పలికిన నతనిమాటల కొడంబడి సంతసించుచు రాజునకుం బరకాలుం డిట్లనియె రాజసత్తమా నీవు ధార్మికుండవు ప్రథమదర్శనంబున బహుమతి యొనర్చి యొకదేశంబుమాకు స్వాధీనంబుగా నిచ్చిపంచిన మహోదారుండవు చోళధాత్రీశ్వరుండవు గావున స్వదేహసంరక్షణార్థంబుగా నిట్లు సమర విహారం బొనర్చితిఁ గాని నీకుఁ బ్రతిపక్షి నయిపరాక్రమ ప్రకటనార్థం బిట్టి భీభత్సం బొనర్పం బ్రవర్తించినవాఁడఁ గాను మీకర్పింపదగు ధనంబిచ్చెద విజయశీలుండవయి మగిడి పురికి విచ్చేయందగునని పలికిన నమ్మహాత్మునివినయోక్తులకు సంతోషించి రాజు తన కాప్తుం డగునొక మంత్రిని మితపరివారంబుతో నాతం డిచ్చినధనంబుఁ గైకొను మని యద్దివ్య సూరికడ నునిచి తన పురంబునకుంజని సుఖం బుండె నంత.

సీ. ఆరాజమంత్రియు • నచ్చోట నొకశూన్య, హరిగృహమునఁ గలి • హరుని నునిచి
చుట్టుకావలి యున్న • సూరిరత్న మతండు, స్నానపానాదులు • మాని మూఁడు
దినములు పస్తుండఁ • దెలిసి దేవేశుఁడు, కరిగిరివరదుఁడు • కలను దోఁచి
వేగ కంచికి వచ్చి • వేగవతీనది, కడ నొకపెన్నిధి • గలదు దానిఁ

తే. ద్రవ్వి ద్రవ్యముఁగొనుమని • దయవచించి, కానఁబడకున్నమేల్కాంచి,కలివిరోధి.
పార్థివామాత్యునకు నిట్లు • పలికెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. మంత్రిసత్తమ నీవు • మాతోడఁ గంచి కే, తెంచిన మీద్రవ్య • మంచితముగ
నిచ్చెద నచ్చోట • నిది సత్య మన విని, మంత్రి భూజాని కా • మాటఁ దెలుప

జాగరూకుండవై • చని సీలుఁ డిచ్చిన, యర్థ మిచ్చుటకిఁ దె • మ్మనుచున్నృపతి
పల్కఁ నాసచివుఁడు • పరకాలసూరితోఁ, గంచి కేతెంచినఁ • గలిహరుండు

తే. వరదుఁ డానతి యిచ్చిన•వసుధఁ ద్రవ్వి, చూచిననుధనములేకున్నఁ • జోద్యపడుచు
దేవదేవునిఁ దలఁచి ని • ద్రించె ననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర

సీ. కరిగిరీశుఁడు పర • కాలునికలలోనఁ, గనఁ బడి యతనికిఁ • గరుణ మగుడ
నడియాలములు కొన్ని • యానతిచ్చిన విని, కలివైరి మేల్కాంచి • ఘనత మించి
శ్రీపతి చెప్పిన • శేవధికడ కేఁగి, ద్రవ్వి యం దమిత మౌ • ధనముఁ జెంది
రాజధనం బిచ్చి • రాజమంత్రిని బంప, నతఁ డేఁగి నృపతి కా • యర్థ మొసగెఁ

తే. కలిహరునిదివ్య చరితముఁ•దెలుపఁ దెలిసి, విస్మయం బంది చోళపృ•థ్వీవిభుండు
వేఱ యొక్కెడ నుంచెనా • విత్త మనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. పరకాలముని చోళ • నరపతి కియ్యఁగాఁ, జిక్కినధనముచేఁ • జింత లుడిగి
యతిభక్తితోఁ దదీ • యారాధనము సేయ, నావార్త విని చాల • హర్షమొంది
యాత్మదూతలఁ బంచి • యతని రావించి య•భ్యుత్థాన మొనరించి • యుచితపీఠ
మున నుంచి భక్తిఁజే•మోడ్చి రత్నసువర్ణ, భూషణాంబరములఁ • బొసఁగనొసఁగి

తే. పుష్పచందనతాంబూల • ముల నొసంగి, భక్తిసిరీతిఁ బూజించి • ప్రణుతిఁజేసి
పంచెఁ గలిహరుఁ జోళభూ • భర్తయనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. శౌరి ద్రౌపదికి వ • స్త్రములు ముందొసఁగిన, కరణి ధనంబిచ్చెఁ • గలిహరునకు
గణుతింపఁ బరమభా • గవతాగ్రగణ్యుఁ డీ, పరకాలముని యట్టి • భవ్యమతిని
దెలియక పస్తుంచి • తిని మూఁడుదినములు, పాతకి నయితి నీ • పాతకంబు
మన కతం డొసఁగిన•ధనము దేవబ్రాహ్మ, ణుల కిచ్చిననుగాని•తొలఁగ దనుచుఁ

తే. దలఁచి తనకాతఁ డిచ్చిన•ధనము దేవ, భూసురాళి కొసంగి యా • భూమిభర్త
యుడిగి పాపము ధర యేలు•చుండె ననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర

వ. అంత. 64

సీ. కలివైరి తనయింటి • కడ కేఁగి యందు శ్రీ, కుముదవల్లిని దన • కూర్మిసతిని
జూచి యిట్లు వచించె • సుందరి రాజసే, వలభించురాజస • వసుచయంబు
నను దదీయారాధ • నము సేయఁ కంపెను, బశ్యతోహరవృత్తి • బహుధనంబుఁ
దెచ్చి భాగవతుల • దినదిన మర్చించి, నను మంచి దని తోఁచె • నలిననేత్ర

తే. యనిన నద్దేవి తనసూక్తి, కనుమఱింప, నతఁడు దేవీసమేతుఁడై, యాశ్రితాళి యుక్తుఁడై చని కానల • నుండె ననుచు, వాదిభీకరగురుఁ డనె, మోదమలర.

వ. అట్లు నిజదేశంబు విడిచి వనదుర్గంబుల నుండి యొక్కసమయంబున. 66

సీ. ఒకనాఁడు పరకాలుఁ, డొకవైష్ణవునియింటి, వాకిట రాతిరి • వచ్చి నిలిచి
యాయింటిసతి తప్త, హాటకపాత్రముఁ, గడుగంగ నతఁ డది, యొడిసి పట్టి
యువతి యస్మద్గురు, భ్యోనమో యని పల్క, విని వీరువైష్ణవు • లని యతండు
పసిఁడిపళ్లెరము చేఁ • బట్టక వారింటి, కడపపై నుంచి క • న్పడక యున్న

తే. మగని కావృత్త మంతయు•మగువదెలుపఁ, దెలిసియావైష్ణవుఁడుతన•దేవిఁజూచి
పడఁతి వినుమని యొకసూక్తి • పలికెననుచు, వాదిభీకరగురుఁడనె, మోదమలర.

సీ. పరకాలుఁ డనుమహా • భాగవతాగ్రణి, వైష్ణవేతరు లైన • వారివిత్త
మపహరించుచు నిత్య, మఖిలభాగవతుల, కారాధనముసేయ • నతఁడు మనదు
ద్రవ్యముఁగొనెనేని • ధన్యుల మగుదుము, వేఱొక ద్రుమువైచెన • వృథయదియగు
నని పతి యన విని • చని సతి గడపపై, నున్నపాత్రముఁ గని • యుత్సహించి

తే. తెచ్చి తనభర్త కిచ్చినఁ•దెలిసి యాతఁ, డితఁడు కలిహరుఁడే కాని,యితరుఁడైన
తస్కరుఁడుగాఁడు నిజ మని • తలఁచె ననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

వ. అట్లు నిశ్చయించి గృహమేధి తనగృహిణి కిట్లనియె. 69

సీ పళ్లెరం బతఁడు చేఁ • బట్టినప్పుడు చూచి, చెలియ యేమంటివో • చెప్పు మనిన
నాచార్యవందన • మాచరించితిఁ గాని, పే ఱన లే దని • వెలఁది పలుకఁ
బరకాలముని వారి • పలుకుల విని వచ్చి, ప్రణమిల్లి వారికిఁ • బలికె నిట్లు
లార్య మీయెడ నే మ, హాపరాధమెఱుంగ, కయచేసితిని నన్నుఁ • గరుణఁ బ్రోవు

తే. మనుచు సాఁగిలఁబడిమ్రొక్క • నమ్మనీషి, యతనిఁగ్రుచ్చెకౌఁగిట • నప్పళించి
పరమసత్కార మొనరించి • పంచె ననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. అశ్రాంతమును దదీ • యారాధనము సల్ప, నున్నవిత్తము లెల్ల • నుడిగె నంతఁ
బశ్యతోహరవృత్తి, బహుభృత్యగణముతో, నరిగి పాంథులద్రవ్య • మపహరించి
యర్ధరాత్రమునందు, నర్థవంతులయిండ్లఁ, జొచ్చిధనౌఘముఁ • దెచ్చి నిత్య
మఖిలభాగవతుల • కారాధనము సేయ, నంతట నొక్కనాఁ, డర్గ మేమి

తే. దొరకకుండినన డవిలోఁ • ద్రోవఁగాచి, యుండెఁ బగలెల్ల శార్ఙ్గకో • దండమూర్తి
కలిహరుం డపహృతశ్రిత • కలుషుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర

వ. అంత నప్పరకాలమునీంద్రుండు సాయుధుండై నిజభృత్యవర్గంబుతోనరణ్యమార్గంబునం దొక్కయెడ మహోన్నతద్రుమాగ్రం బెక్కినలు దెసలంజూచుచున్న సమయంబున నప్పరకాలునిం జూచి సర్వేశ్వరుండు తనలో నిట్లని తలంచె నిమ్మహాత్ముం డిట్టి దారుణకృత్యం బాచరించుట శ్రీవైష్ణవారాధనార్థంబుగావున నితండు చరమపురుషార్థనిష్ఠాగరిష్ఠుండు గాన యితని భాగవతభక్తియే నిమిత్తంబుగా నితనియెడ విశేషకటాక్షంబుఁ జేసెద నని తలంచి వృద్ధబ్రాహ్మణరూపుం డగు పితామహుండు పురోహితుండుగాఁ దక్కిన వేల్పు లందఱుఁ దనతోడఁ జనుదెంచిన ప్రియ బాంధవులుగా శ్యామసుందర సుకుమారదివ్యశరీరుం డగునొక బ్రాహ్మణ కుమారుండై వివాహోచితసకలాలంకారాలంకృతుండై సర్వాభరణభూషితయగునిజపత్నినింగూడి మణిశిబికారూఢుండయి బహుద్రవ్యభారసహితుం డయి యనేక మంగళవాద్య ఘోషంబులు చెలంగసర్వాభరణ భూషితబహుపరిజనపరివృతుండయి కనిపింప నప్పరకాలుండమ్మహీరుహాగ్రంబు డిగివచ్చి భయంకరకరవాలాది బహుసాధనాన్వితులగునిజభటులతో వారింజుట్టుకొని ఘోరతరారావం బొనర్చుచు వస్త్ర భూషణధనాదు లన్నియు నపహరించి నవరత్న ఖచితంబులగు నవ్వధూవరుల సర్వాభరణంబులంగొని యప్పెండ్లి కుమారునిదివ్య పదాంగుళీయంబు నిజదంతంబు లంగీలించి యాకర్షించుచుండం జూచి కలియనోయని పెండ్లి కుమారుండానతీయ నతని కది యొకనిరూపకనామం బయ్యె. అంత ధనభూషణాది ద్రవ్యసముదాయంబు లన్నియుఁ బెట్టియలం బెట్టుకొని చన సమకట్టి కదల్ప నశక్తులైన నిజపరిజనులం జూచి రోషభీషణాకారుండై కలిహరుం డడిదంబు వెడిదంబుగా జళిపించుచు రాజర్జరితాంగుండును సమిత్కుశపాణియు స్వస్తివాచకమంత్రానుసంధానస్ఫురితాధరుండు నయి యొప్పునప్పురోహితుని నీవు మంత్రవాది వనిప్రహరింపనుద్గమించిన నప్పురోహితుం డిది యస్మత్కృత్యంబుగాదిప్పెండ్లి కుమారుండిట్టి మంత్రవాదంబులయం దభిజ్ఞుండు గాని యితరు లెవ్వరుం గా రనిన వారి సంవాదంబు విని త్రైలోక్యసమ్మోహనాకారుం డగు నప్పెండ్లి కుమారుం డీద్రవ్య భారంబులు కదలకుండ నేనే యభిమంత్రించితి నిమ్మంత్రంబు నీకుపదేశించెద నని మృదుమధుర గంభీరానునయోక్తుల నుపదేశంబున కతని నభిముఖునిం గావించి యప్పరకాలసూరిసత్తముని దక్షిణకర్ణం

నందు సర్వవేదాంత సంగ్రహంబును స్వరూపోపాయపురుషార్థ ప్రతిపాదకంబును సంసారార్ణవతారకంబును బరమపురుషార్థ లక్షణమోక్ష ప్రదాయకంబు నగుపెరియ తిరుమంత్రం బుపదేశించి మేరుశిఖరస్థితతటిల్లతాయుత నీలమేఘంబుపోలిక గరుడ వాహనారూఢుం డై లక్ష్మీసమేతుం డై శ్యామసుందర సుకుమారదివ్య మంగళ విగ్రహుం డై సకలాభరణభూషితుం డయి శంఖచక్రాదిదివ్యాయుధధరుండై భగవంతుండు తన్నుం బొడసూపఁ దత్ప్రసాదలబ్ధదివ్యదృష్టిచేఁ దదీయస్వరూప రూపగుణవిభూతులన్నియు సాక్షాత్కరించి తదనుభవజనితప్రీతి లోనడంగక వాక్ప్రవాహరూపంబుగాఁ బయల్వెంగినచందంబునఁ బెరియతిరుమొళి తిరుక్కురుం దాండగముతిరునెడుం దాండగము పెరియవెళకూర్ తిరుక్కై సిరియతిరుమడల్ పెరియతిరుమడల్ అనియెడియాఱు దివ్యప్రబంధంబులు శ్రీశఠకోపసూరిప్రణీతం బగుద్రవిడవేదచతుష్టయంబునకు షడంగంబులు గాఁ జిత్రమాధుర్యాది రస పరిపూర్ణంబులుగా సర్వాలంకారసంయుతంబులుగా నానతిచ్చి తాను జతుష్క విశిఖామణియని జగత్ప్రసిద్ధుం డగునట్లు లోకోపకారం బొనర్చి దివ్యదేశంబు లన్నియు మంగళాశాసనంబు చేసితిరుమలనుండి విచ్చేయుచు నిజపరిజనులతో మార్గ శ్రాంతుండయి శ్రీసత్యవ్రతక్షేత్రంబునం దొకరమణీయోద్యానవనంబు నందు విశ్రమింప భక్తాభీష్టప్రదాయకుం డగు నష్టభుజనృసింహుం డొక వృద్ధవిప్రుండై వచ్చి స్వాగతం బడిగి పంచవిధం బగుమృష్టాన్నం బొసంగ నారగించి సంతుష్టాంతరంగుండై మీ రెవ్వరని యడిగిన నిక్కాంచీ పురినిత్యవాసుండ నగునష్టభుజనృసింహుండ నని యానతిచ్చి నిజస్వరూపంబుఁ బొడసూపియంతర్హితుండయ్యె. అంత నప్పరకాల మునీంద్రుండు పరమభక్తి పరవశుండై యాక్షేత్రంబునం దద్దేవ దేవునిం గాంచి యభినుతించి వీడ్కొని చనుచుఁ జోళమండలంబునం దొక్కయెడఁ జతుష్క విశిఖామణికలిమలాంత ధ్వాంతనభోమణిపర కాలమునిశిఖామణి పరవాది మదేభకంఠీరవచూడామణి యని నిజాశ్రితులు తన బిరుదులం బొగడుచుండ విజయ కాహళంబు లూదింపం జూచి కార్తికేయాంశసంభవుం డగుసంబంధిప్పెరు మాళ్ళను నొక కవీంద్రుని శిష్యు లేతెంచి మద్గురుం డున్న చోట మీ రిట్లు పొగడింప వలదని విరోధింప నక్కలి హరుండు వారి కి ట్లనియె. భవద్గురుం డగుసంబంధికవీంద్రునితోడం దర్కిం చెద నని యానతీయ నట్టివారై తిరేని యస్మద్గురుండున్నచోటికి రండని యమ్మహా కవీంద్రునిం దోడ్కొని చని యావృత్తాంతంబంతయుఁ దమగురుని కెఱింగింప నతం డతనితో వాదింప నేతేర నాగ్రామంబునం దొకభగవదాలయం బైన నొక

వైష్ణవ గృహంబైనను లేక యూరంతయు వీర పాషండభూయిష్ఠంబై యున్నంత నొక భగవద్విగ్రహంబు దృగ్గోచరంబై యుండ కుండుటంజేసి యమ్మహాత్మున కొక్కతర్కం బైనను దోఁప కున్న నింకమీఁదఁ జేయందగిన కృత్యంబెద్దియనిచింతించుచుదైవ వశంబునందోచుమవైష్ణవియగునొక సాత్త్విక వనితంగనుంగొని యమ్మాభగవదారాధనీయంబగు భగవద్విగ్రహం బొక క్షణ మాత్రం బీదాసున కొసంగవలయునని ప్రార్థించి యాసాత్త్వికిచే నర్పితం బగు శ్రీ బాలగోపాల విగ్రహంబుఁ గైకొని సంబంధి యనుకవికడకుం జని యున్నంత వాఁడమ్మహాకవిం జూచి మీ రానతిచ్చిన కృతులం దొకగాథ పఠియింపం దగు ననిన నప్పరకాలసూరి శేఖరుండు 'ఒరుకురుళాయిరునిల' మ్మని యెడు తిల మొళి యానతీయ నవరసాలంకారపరిపూర్ణం బగునక్కవితాతిశయం బెఱింగి ప్రత్యుత్తరం బుపన్యసింప నశక్తుండయి సంతసించి చతుష్కవి శిఖామణి యను బిరుదు నీకేతగుఁగాని యితరకవులకుం జెల్లదని చాల వినుతించి చనియెనంతట భాగవతుం డగుపరకాలమునీంద్రుండు విజయకాహళశంఖారావంబులతోఁ దన బిరుదులం బొగడించుచు నుభయకావేరీ మధ్యప్రదేశంబునఁ బ్రణవవిమానమధ్యం బునందు శేషతల్పశయానుం డగుశ్రీరంగనాథునకు దివ్యవిమానమండప గోపుర ప్రాసాద ప్రాకారాది రూపకైంకర్యం బొనర్పం దలంచి నిజపరిజనులం బిలిచి శ్రీరంగరాజవిమానప్రాకారాదికైంకర్యంబున కుపయుక్తం బగుధనార్జనంబుసేయ నుపాయం బెయ్యది యని యడుగ నగ్గురుశిఖామణికివార లిట్లని విన్నవించిరి: మహాత్మా నాగపట్టణంబునందుఁదప్త జాంబూనదమయంబైన యొక బుద్ధప్రతిమ యభేద్యయంత్రాలయస్థలంబై యున్నయది దాని నీయుపాయకౌశలంబున సంగ్ర హించి ప్రకృతం బగుభగవత్కైంకర్యంబు నెఱవేర్పం దగు ననినఁ బరమా నంద భరితుండై పరకాలసూరి శేఖరుండును వారలతోడ నాగపట్టణంబునకుం జని స్వకీయకుశలోపాయాతిశయంబునఁ గనక మయం బగుమహోన్నత బౌద్ధ బింబంబుఁ బెకల్చి పరమరహస్య స్థానంబున నుంచి భగవత్కైంకర్యంబున కర్హంబగునట్లు కరఁగించి విక్రయించి యాద్రవ్యంబుచే సప్తప్రాకార ప్రభృతి సకలకైంకర్యంబు లొనర్పు చుండ భక్తాంఘ్రిరేణుగురుండు శ్రీరంగరాజునకుఁ బుష్ప కైంకర్యంబు సలుపుచున్నస్థలంబు ప్రాకారార్ధంబు సూత్రితం బగుప్రదేశం బునం బ్రసక్తం బయిన నచ్చోటు గనిపెట్టి ప్రాకారంబుఁ గట్టింపం జూచి తొండ రడిప్పొడి యాళ్వారు ప్రహృష్టాంతరంగుండై తా నొనర్పు పుష్పమాలా కైం కర్యంబున కుపకరణం బైనయాయుధ విశేషంబున 'కరుళ్మారి' యనిఁబుమ్మ

హాత్మ్యని తిరునామంబువార్త్తి పూర్వక్రమంబుగాఁ దిరుమాలా కైంకర్యం బొనర్చు చుండె నంత నప్పరకాలమునీంద్రుండు విమానగోపురప్రాకారాది కైంకర్యంబు నెఱవేర్చి కృతార్థుండయి యాప్రాకారాది నిర్మాణధురీణులగు కైంకర్య పరులకుం బరమపదంబుఁ బ్రసాదించి కుముదవల్లి యనునిజదేవితో భద్రాశ్రమంబున భద్రాసనాసీనుండై యోగమార్గంబుచే భగవంతుం డగునారాయణుని సాక్షాత్కరించి నిజస్వరూపంబు ధరింయించె నని శ్రీ మత్ప్రతివాదిభీకరగురుం డానతిచ్చి మఱియు శ్రీపరాంకుశముని ప్రభావం బుపన్యసింప నుపక్రమించె నంత.

సీ. జయ జయ పరకాల • శంఖచక్రాంకిత, భుజమూల లసదూర్ధ్వ • పుండ్రఫాల
కుముదవల్లీరమా • కుచకుంభకాశ్మీర, విరచితోరస్థల • విజయశీల
కల్యాణగుణధామ • కవిలోకసుత్రామ, వినుతభుజస్తోమ • విజితకామ
సకలదిగంతవి • శ్రాంతకీర్తివితాన, కరపద్మధృతఖేట • వరకృపాణ

తే. కమలతులసీలసద్దామ • కాంతిసోమ, గురువరేణ్య మదీయవా • గ్దోషములను
దలఁపఁ బోకుమి మదిని మా • తండ్రియనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

శా. శ్రీమత్పాణి మునీంద్రదివ్యపదధరా • జీవద్వయీభావనా
భూమాంచత్పరకాలసత్కవిసుధా • భూతోక్తిసంశీలనా
ధీమాంద్యాద్యపరవైరిషట్కహతమా • ద్యక్చేతనోజ్జీవనా
యామోదైకనిధానసద్గుణవిశీ • ష్టాద్వైతసంస్థాపనా. 74

క. సాక్షాత్కృతతత్త్వధనా, శిక్షానిక్షిప్తకుమతి • సిద్ధాంతగణా
మోక్షక్షేమనిధానా, ప్రక్షాళితపాపపంక • భక్తాదీనా. 75

మాలినీవృత్తము. సకలసుకవిగేయా • సాత్త్వికధ్యేయకాయా
వికచకమలనేత్రా • వేదశీర్షాబ్జమిత్రా
ప్రకటితగుకుగాథా • భాసురాగాధబోధా
స్వకిరణజితసూర్యా • సౌమ్యరామానుజార్యా 76

గద్యము. ఇది శ్రీమద్భగవద్రామానుజకరుణాకటాక్ష కలితకవితావైభవ పరవాది భయంకరాచార్యాభి మతచ్ఛాత్రాపస్తంబసూత్ర కణ్వసగోత్ర పవిత్రోభయ కవిమిత్ర వేంకటకృష్ణార్యపుత్ర విబుధవైష్ణవవిధేయ కేశవనామధేయ ప్రణీతం బయినయాచార్యసూక్తి ముక్తావళి యనుమహాప్రబంధంబునం బూర్వభాగంబు న్నందుఁ జోళపుత్రీ కల్యాణంబును శ్రీపాణియోగిమాహాత్మ్యంబును బరకాల సూరిప్రభావంబు నన్నది తృతీయోల్లాసము.

శ్రీమతే రామానుజాయ నమః



# ఆచార్యసూక్తిముక్తావళి

## పూర్వభాగము

---

### చతుర్థోల్లాసము

శ్రీవకుళాభరణముని
ద్రావిడనిగమప్రబోధ • రంజితభావా
భావాగోచరవిభవా
దేవా శ్రీయతివరేణ్య • దీనశరణ్యా. 1

### నమ్మాళ్వారుల వైభవము

శ్రీమన్నమ్మా. త. శ్లో॥ వృషభేతు విశాఖాయాం కురుకాపురికారిజమ్।
పాణ్డ్యదేశే కవే రాదౌ శరారిం సైన్యపం భజే॥

మధురకవియాత. శ్లో॥ చైత్రే చిత్రాసముద్భూతం శఠకోపపదాశ్రయమ్।
అంతిమోపాయవక్తారం మధురం కవి మాశ్రయే॥

2

వ. అవధరింపుము.

సీ. త్రైవిద్యవృద్ధమ • స్తకవిభూషణ మెద్ది, సంపత్తి యెయ్యది • సాత్త్వికులకు
నశరణ్యజనశర • ణ్యం బయ్యె నెయ్యది, పుడమి కెయ్యది యూరి • పుణ్యరాశి
తల్లియుఁదండ్రియుఁ • దనయులుదైవత, మఖిలమెయ్యది వైష్ణ • వాన్వయులకు
వకుళసౌరభనిత్య • వాసిత మెయ్యది, తామ్రపర్ణీతీర్థ • ధామ మెద్ది

తే. యట్టిశఠకోపమౌనిది • వ్యాంఘ్రియుగళ, మాత్మమానసపుండరీ • కాసనమున
నిలిపి భక్తి భజింపుఁడీ • నిత్యమనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర. 3

సీ. యద్గోసహస్ర ము • ద్యద్ఘోరతిమిరముఁ, బాపి చేతనులకు • భవ్య మొసఁగు
నెవ్వానిశ్రీమూర్తి • నెడఁబాయఁ దేప్రొద్దు, నారాయణుఁ డుజగ • న్నాయకుండు

శ్రుతిగతంబైనయ • త్స్వరుచిరమండల, మతిభక్తిఁ జేమోడ్తు • రవనిసురులు
ఎవ్వనియుదయ మీ • యిలఁ గల సాత్త్విక, చక్రములకు దోష • జనక మగునొ

తే. యట్టిశఠకోపభాస్కరు•నఖిలగురుని, దలఁపులో నిల్పితచ్చరి•తంబు బుధుల
వలనవిన్నంతఁ దెలపెద•నెలమిననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. భక్తిప్రభావసం•భావితాద్భుతభావ, బంధుసంధుక్షిత•ప్రణయసార
రసమహౌఘప్రపూ•ర్ణము సర్వవేదార్థ, రత్నాకరము విష్ణు•రమ్యపదము
ద్రావిడశ్రుతిసుధో•త్పత్తినిధానము, నుల్లసత్ప్రసదనేం•దూవయంబు
శ్రీవైష్ణవర్ధిల•క్ష్మీజన్మ హేతువు, సకలార్యనుతనదీ•సంగమంబు

తే. నఖిలలోకహితోపదే•శారవంబు, శ్రీపరాంకుశజలనిధి • చేతనులకు
నిఖిలకల్యాణముల నిచ్చు•నిత్యమనుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర.

సీ. సిరి కాటపట్టు గాఁ•జెన్నొందు పాండ్యదే•శమునందు గంగాది•సర్వనదుల
దరి మించి ప్రవహించు•తామ్రపర్ణీనదీ•తీరమునందు దే•దీప్యమాన
మాణిక్యగోపుర•మందిరప్రాసాద, పాండుసౌధవిమాన•భాసురంబు
సకలర్తుసేవ్యపు•ష్పప్రవాళఫలాది రాజదుద్యానవి•భ్రాజితంబు

తే. రమ్యహర్మ్యాదివిలసిత•రాజపథము, నరసుకర్షినిషేవ్యాది•నాథపదము
శ్రీపురీరత్న ముర్వి రం • జిల్లు ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. అట్టి శ్రీపురాపరనామధేయంబైన సర్వలోకోత్తారకం బగుకురుకా నగరంబునందు తిరువళీధినాడ రనియెడు నొక సాత్త్వికపుంగవుం డుదయించి యక్కురుకాపురీ నిర్వాహకుండై నిఖిలవైష్ణవ నిత్యపూజాతత్పరుండై యుండె నమ్మహాత్మునకా రత్తాంగియా రనునొక భాగవతోత్తముండు జన్మించె అతని కుమారుండు చక్రపాణి యతనిపుత్రుం డచ్యుతసూరి యతనిసుతుండు నేరందారను కవీంద్రుం డతనికి శక్కణ్ణియ రనియెడు తనయుండు జనియించె నతనికి శందామకక్కయ్యరాత్మజుం డయ్యె నతనికి పొర్కారియా రను తనూభవుం డుద్భవించె నా ప్రాజ్ఞునివలనఁ గారియను సూరిశేఖరుం డుత్పన్నుండయ్యె నంత పొర్కారియా రను సాత్త్వికపుంగవుండు తనకుం బుత్రుండగు కారిసూరికిం గల్యాణం బొనర్పం దలంచి యప్పౌరజనంబు సంతసింపఁ దిరువణ్బరిశారంబను దివ్యదేశంబునకు నిజాప్తబంధుగురుపురోహితసహితుండై కారికుమారునిం దోడ్కొని చనుదెంచి యద్దివ్యదేశంబునందుఁ దన కనాదిసంబంధియై శ్రీవైష్ణవసత్తముం డగుతిరువాళ్

మార్భరను సత్త్వవిధిం గాంచి యతనిచే నర్చితుండై నాథనాయికాపరనామధేయ యగునుడయనంగయారనుభవత్పుత్రిక నస్మత్పుతుని కిమ్మని యడిగి యొడం బఱచిన సంతుష్టాంతరంగుండై యతండుదకధారాపూర్వకంబుగానర్పించిన సకన్యా రత్నంబుఁ దనపుత్రుండగు కారిసూరికిం గల్యాణంబు గావించి యద్దివ్య దేశాధి పతి యగుతిరువాళిమార్భ రనుశ్రియఃపతి శ్రీపాదాబ్జంబు లర్చించి వినుతించి వీడ్కొని యవ్వధూవరులఁ దోడ్కొని సకలమంగళవాద్యఘోషంబులతో గురు మంత్రిపురోహిత బంధువర్గాన్వితుండై మగిడి శ్రీకురుకాపురంబున కేతెంచి కృతోద్వాహులై పత్నీసమేతు లగు శ్రీరామాదికుమారులం దోడ్కొని మిథిలా నగరంబుననుండి యేతెంచిన దశరథచక్రవర్తికి సర్వాలంకారశోభితం బగు శ్రీమదయోధ్యాపురంబు వెల్వడి సకలకల్యాణవాద్య ఘోషంబుతోఁ బురజను లెదుర్కొన్న చందంబున శ్రీనగరీవాసు లగుమహాత్ము లంద అతని నెదుర్కొనిన వారిని సముచితోక్తుల నభినందించి కల్యాణసముచిత సంస్కార సంస్కృతంబై సర్వాలంకార సుందరంబైన నిజమందిరంబుఁ బ్రవేశించి సుఖంబుండె నంత మార సుకుమారవిగ్రహుం డగు నక్కారిసూరి తన ధర్మపత్ని నాథనాయికం గూడి మగిడి యద్దేవికి జన్మగృహం బగు తిరువణ్బరిశారం బను దివ్యదేశంబున కేతెంచి యచ్చోటఁ గొన్నిదినంబు లుండి యద్దివ్యదేశాధిపతి యగు శ్రీపతినిం జూచి పొగడి యతనిచే ననుజ్ఞాతుండై మరలి కురుకాపురంబున కేతెంచుచు మార్గమధ్యస్థం బగు కురంగ నగరంబునకుం జని యందు తిరుక్కురుంగుడినంబి యనునారాయణునిం గాంచి యర్చించి యనేక ప్రకారంబులం గొనియాడిన న ద్దేవుండు సుప్రసన్నుండై యర్చకముఖంబున వరంబు వేఁడు మని యానతీయ భవత్సదృశుండగు పుత్రునిమ్మని ప్రార్థింప నద్దేవతాసార్వభౌముండు సమానా భ్యధిక రహితుండనగు నాతోడ సదృశుం డన్యుండు లేఁడని తలంచియే నేనీకుఁ బుత్రుండ నగుదునని తాధరించినమాల్యం బొక్కటి ప్రసాదించిన నక్కారి య మ్మాల్యంబు శిరంబునం దాల్చి ధన్యుండను గృతకృత్యుండను ననుగృహీతుండ నైతి నని సంతసించి దేవీసహితుండై మగిడి కురుకాపురంబున కేతెంచి నిజ నివాసంబున సుఖంబున్న యంతఁ గురంగనగరీపూర్ణాఖ్యుం డగు శ్రీహరిచే నను జ్ఞాతుండై విష్వక్సేనుం డక్కారిసూరిమానసంబునం బ్రవేశించి యమ్మహాత్ముని వలన నాథనాయికాగర్భ ప్రవిష్టుండయ్యె నంత నద్దేవికి దినక్రమంబుగా గర్భంబు వర్ధిల్లి ప్రసవసమయం బేర్పడఁ గలియుగాదియందు నలువదిమూఁడు వాసరంబులు గడచినపిమ్మట వర్తమాన బహుధాన్యం సంవత్సరంబునందు వసంతకాలంబు

నందు వైశాఖశుద్ధపూర్ణిమా శుక్రవాసరంబున విశాఖానక్షత్రంబునఁ గర్కట లగ్నంబునందు దివ్యయోగకరణంబుల సకలజగదజ్ఞానాంధకార నివర్తకుఁడును యుగపదుదిత ప్రభాకర సహస్రప్రభాసమాన దివ్యమంగళవిగ్రహుండు నగు శ్రీపరాంకుశ మునీంద్రునిం గనియె నమ్మహాత్మునకు వర్షాతపవారణార్థంబుగా నతని యవతారంబునకు ముందట ననంతుండు తింత్రిణీతరుస్వరూపధరుండై వర్ధిల్లుచుండె నవ్వకుళభూషణసూరి యవతారంబునకు ముందుగా సర్వసంపత్సమృద్ధంబై శ్రీయఃపతికి నిత్యనివాసంబగు తిరుక్కోవళూ రను దివ్యదేశంబు నందుఁ జైత్రమాసంబునఁ జిత్రానక్షత్రంబునందు శ్రీకుముద గణేశాంశంబున మధురకవిసూరిశేఖరుండు సూర్యోదయంబునకుఁ బూర్వకాలంబునం దరుణుం డుదయించుమాడ్కి నవతరించె నమ్మహాత్ముండు సామశాఖాధ్యయనశీల పురశ్చూడ బ్రాహ్మణకులంబునం దుదయించుక తనఁ దత్తత్కాలోచిత చౌలోపనయనాది సంస్కారంబులు పితృకృతంబులు లభియించి యధీతసాంగసశిరస్కస రహస్యామ్నాయసముదయుండై మహావిరక్తుండై యయోధ్యయు మధురయు మాయయుఁ గాశియుఁ గాంచియు నవంతికయు ద్వారవతియు మొదలగు ముక్తిప్రదాయక దివ్యదేశంబుల సేవింపం జనియె నంత నిట. 7

సీ. ఆత్మజుఁ డుదయించె•నని తండ్రినీరాడి, సంతసించుచు మహో•త్సవము సల్పఁ
గన్నులఁ దెఱవక • కటకట యేడ్వక, చనుఁబాలు గుడువక • శయన మొంది
వాడక శుచిపక్ష•వర్ధమానద్విజ,రాజుపోలిక వాస•రక్రమమున
వృద్ధిఁబొందుచు విష్ణు•విన్యస్తభరుఁ డైన,బాలునిఁ గనుఁగొని • పదిదినములఁ

తే. గడపి మఱునాఁడు మదినిదుః•ఖముపెనంగ, సుతునిగొనినాథ నాయిక•పతినిగూడి
యాదినాథునికోవెల • కరిగి రనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. తిరుతామ్రపర్ణిన•దీతీరమున శంఖ,తీర్థసమీపమం•దిరమునందు
సిరి ధర తనయిరు•చెంతల విలసిల్ల, స్థిరవాస మొనరించు•దేవదేవు
వరదాభయదకర•సరసిజయుగళుని, శంఖచక్రోల్లస•చ్చారుభుజుని
దరవికసితపద్మ•దళనేత్రుఁ దపనీయ, విభవక్తుఁ గాలాభ్ర•నీలగాత్రు

తే నాదినాథునిఁగని మ్రొక్కి•యాశుభాంగి, మాకుమారుఁడు దేవకు•మారుఁడనిన
మారుఁ డయ్యెను గారిక•మారుఁడనుచు, వాదిభీకరగురుఁడనె•మోద మలర.

సీ. ఆదినాథస్వామి•యాజ్ఞ చే నచ్చోటఁ, దింత్రిణీమూలప్ర•దేశమునను
బంగారుగొలుసుల • రంగుగాఁ జూపట్టు, పసిఁడిడోలికయందు • బాలు నునిచి

తమతలంపులను బు,త్రస్నేహ ముంపక, కులపాలుఁ డితఁ డని • కూర్మి నలిపి
తనకు సంభాషింపఁ • దగినట్టి యధికారి, లేఁ డని మౌని యై•నాఁ డితండు

తే. తథ్య మనుచు నెఱుంగక • తల్లిదండ్రు, లిలఁ గురుంగుడినంబి మా•కేమిమేలు
చేసినాఁ డని మదిఁ జింతఁ•జెంది రనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. శిశుచేష్టితము లేమి • సేయక యేఁడాది, తొట్ల లోపలనుండి • దోఁగియాడి
మెల్లన దిగి వచ్చి • తల్లిదండ్రులు గన, రమ్యచించాకోట•రంబుఁ జొచ్చి
యాషోడశాబ్ద మా•త్మారాముఁడై యుండె, నంత బదర్యాశ్ర • మాదిదివ్య
దేశము లన్నియు • వాసిగా సేవించి, శ్రీమదయోధ్యను • జెంది యుండు

తే. మధురకవిసూరి యొకనాఁడు • మాపుబయలు, పొంది దక్షిణదేశము•నందు దివ్య
సూర్యమండల మొక్కటి•చూచె ననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. అట్లర్ధరాత్రము•నందు నాల్గుదినంబు, లప్పో్డదయను దక్షి•ణాశయందుఁ
గనుఁగొని యచ్చోటు,గదలి విచ్చేయుచుఁ, బగలెల్ల నొకచోటఁ•బవ్వళించి
రాత్రులు నడచి శ్రీ•రంగధామముఁ జెంది, యాతేజ మెప్పటి•యట్లు చూచి
శ్రీపురి కేఁగి యా•రే యందు వసియించి, యాయూరి కవ్వల • నమ్మహోద

తే. యంబుగన్పడకున్న న•య్యార్యవరుఁడు, నాధనాయికసుకునిజ•న్మక్రమంబుఁ
దీర్ఘఘట్టములందునఁ • దెలిసె ననుచు, వాదిభీకరగురుఁ డనె,మోదమలర.

సీ. తామ్రపర్ణీనదీ•దక్షిణతటమున, శంఖతీర్థాంతిక•క్ష్మాతలమునఁ
దింత్రిణీతరుమూల•దివ్యకోటరమునఁ, బద్మాసనాసీను • భవ్యబోధ
ముద్రాభిరాముని • ముకుళితనయనుని, వకుళభూషణ ముని•వరునిఁ జూచి
చైతన్యసంశయ,శాంతికై పొగడుచుఁ, గరతాళ మొనరింప • ఘనుఁ డతండు

తే. మది నెఱింగికటాక్షింప•మధురకవియు, నతులనేత్రోత్సవంబుగా•నతనిఁగాంచి
మోదమలరంగ వలగొని • ్రమొక్కెననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

వ. అట్లు పద్మాసనాసీనుండై పరమపురుషపదారవిందన్యస్తభరుండై పరతత్త్వబోధక జ్ఞానముద్రాభిరాముండై ముకుళిత నయనుండై షోడశవార్షికుండై షోడశ కళా పరిపూర్ణుండగు సుధాకరుని చందంబునఁ దింత్రిణీమూలంబున విలసిల్లుచున్న పరమాచార్యుం డగు శ్రీ పరాంకుశమునీంద్రుం డమ్మధురకవి సూరిశేఖరుం గటాక్షింప నతం డిమ్మహాత్ముండు సర్వజ్ఞుం డీ గురుశిఖామణి నాశ్రయించి యుజ్జీవించెదనని తలంచి సాష్టాంగ ప్రణామపూర్వకంబుగాఁ దదీయాంఘ్రి కమలంబు

లాశ్రయించి తత్పదాంబుజధ్యాన తన్నామకీర్తన తత్కైంకర్యాదులఁ దదేకానుభవ తత్పరుండై యుండె నాసమయంబున దేవాదిదేవుండును సర్వ జగన్నాయకుండును సర్వజగన్నివాసుండును శంఖచక్రాది దివ్యాయుధభ్రాజమానభుజ చతుష్టయుండును శ్యామసుందర సుకుమార దివ్యమంగళ విగ్రహుండును సర్వాంతర్యామియు సర్వస్వామియు సర్వనియంతయు నగు శ్రీవైకుంఠ నిత్యనికేతనుం డగు శ్రీమన్నారాయణుండును మేరుశిఖరోదిత విద్యుల్లతావిలసిత కాలజలదంబు పోలిక లక్ష్మీసమేతుండై గరుడవాహనారూఢుండై యేతెంచి తన్నుం బొడసూపి యాత్మ స్వరూపరూపగుణ విభూతిచేష్టితంబు లన్ని యున్నయట్లు గాంచి యనుభవింపం దగునట్లు సకలాజ్ఞాన నివర్తకంబగు దివ్యజ్ఞానంబొసంగ నప్పరాంకుశ మునీంద్రుం డద్దేవదేవుని దివ్యాత్మస్వరూపంబును దదేకప్రకాశం బగు దివ్యమంగళ విగ్రహంబును దదాధేయంబు లగు కల్యాణగుణంబు లనుభవించి తదనుభవజనిత ప్రతివాక్ప్రవాహరూపంబుగా బయల్వెంగెనో యన ఋగ్యజురథర్వసారభూతంబు లగు తిరువృత్తంబు తిరువాశిరియంబు పెరియతిరువందాది యనుమూఁడు ప్రబంధంబు లొనరించి మఱియు సామవేద సారంబయిన తిరువాయ్మొళి యను చరమప్రబంధం బొనరిచ్చి యనన్యప్రపన్ను లగు శ్రీ మధురకవి సూరి ప్రముఖ దేశికోత్తముల కర్థానుభవపూర్వకంబుగా నుపదేశించి సర్వచేతనోజ్జీవనం బొనర్చె నంతఁ బుష్పత్యాగభోగ మండప ప్రముఖాఖిల దివ్యదేశ నిత్య నివాసు లగు భగవన్మూర్తు లేతెంచి శ్రీ తింత్రిణీవృక్షం వలంచించి తమ తమ దివ్యదేశంబులతోఁ దమ్ముం గనిపింప ననంత గరుడ విష్వక్సేనాది నిత్యసూరు లప్పరాంకుశముని వైభవంబుఁ గనుంగొన వచ్చి యచ్చటఁ గనిపించిన వారి నందఱ సాక్షాత్కరించి మంగళాశాసనం బాచరించి మహాప్రభావ సంపన్నుండై పరభక్తి పరజ్ఞానపరమభక్తిసంపన్నుండై ప్రపన్నజనకూటస్థుండైన యవ్వకుళాభరణమునీంద్రుండు సర్వలోకోజ్జీవనార్థంబుగా నర్చారూపంబు ధరియింపందలఁచెంద దనంతరంబయప్పరాంకుశమునీంద్రునకుం ప్రథమశిష్యుం డగు నమ్మధురకవి సూరిసత్తముండు 'కణ్ణిన్ శిరుత్తాం' బను నొక దివ్య ప్రబంధంబుచే నమ్మహాత్ముని ప్రభావంబుచరమపర్వనిష్ఠాగరిష్ఠులగు సాత్త్వికాగ్రణులకుం దెలియంజేసి యర్చారూపం బగు శ్రీవకుళాభరణ విగ్రహం బక్కురుకాపురి యందుం బ్రతిష్ఠించి యగ్గురుశిఖామణికి నిత్య పక్ష మా సాయనసంవత్సరోత్సవంబు లన్నియుం గొఱంతలేకుండఁ జేయించుచుఁ దద్బిరుదాంకితగాథలం బొగడుచు విజయకాహళంబు లూఁదింపంజూచి కంబనాథుం డను ద్రవిడ కవీంద్రుని

శిష్యుండొక్కఁడేతెంచి మద్గురుం డగు కంబకవీంద్రునిం గని జయించినం గాని యిక్కాహళంబు లూఁదింపం బనిలేదని నిరోధింప శ్రీమధురకవిసూరియు మీ రిట్లు పలుకుట న్యాయం బైనను శ్రీశఠకోప కవీంద్రుం డొక్కచోటికై ననిప్పు రంబు విడిచి పిచ్చెయం డదిగాన నమ్మహాత్ముం డానతిచ్చిన దివ్యప్రబంధంబులం దొక్క సూక్తిలేశంబుఁ గొనిపోయి భవదీయశంఖఫలకంబం దునిచిన నాఫలకం బా సూక్తిని వహించెనేని యస్మదాచార్యుం డేతెంచి భవద్గురుని జయించిన ట్లగు నని 'కణ్ణిక్కళవిన' యనియెడుపాశురం బొకపత్రంబునందు లిఖియించి యిచ్చిన వాఁ డది గొని చని తనగురుం డగుకంబునిం గాంచి యావృత్తాంతం బంతయుం దెలిపి యాలిఖితం బిచ్చినంజూచి వాఁడా పత్రిక శంఖఫలకంబునం దుంచిన దక్షిణ మధురావాసు లగు శతత్రయ సంఖ్యా సంఖ్యాతు లైన ద్రవిడసంఖ్యావంతు లేతెంచి యక్కంబ కవీంద్రునింగూడి శంఖఫలకం బెక్కి యున్నంత వాగధి దేవతాధిష్ఠితం బగు నమ్మహోన్నతఫలకం బప్పరాంకుశ గురుసూక్తిభూషితంబగు తాళపత్రంబు వహించి యక్కవీంద్రుల నందఱం బడద్రొబ్బ బ్రహ్మశాపోప హత దేవతలమాడ్కి వా రధోముఖు లై పుడమిం బడి రంతఁ గంబనామధేయుం డగు కవీంద్రుండు భయభ్రాంతచిత్తుం డై శ్రీపరాంకుశ మునీంద్రుని దలంచి తనమనంబున నతనిసాన్నిధ్యంబు గల్పించుకొని యి ట్లని స్తుతియించె మహాత్మా ప్రతిక్షణాక్షీణస్వపక్షవిక్షేపప్రక్షుభితప్రతిపక్షపక్షుండగు పక్షీంద్రుని యెదుటమక్షిక యాడఁ గలదే నిజదీప్తిమండిత బ్రహ్మాండభాండమండనాయిత ప్రపంచ మార్తండ మండలద్యోతిత వాతపథంబున ఖద్యోతంబు ప్రద్యోతితంబగునే నిజ గంధాఘ్రాణ నిస్త్రాణప్రాణిమారణాభివ్యగ్రనిర్ఘృణవ్యాఘ్రంబుకడ సారమేయం బెట్లుమొఱుఁగు గజకంఠలుంఠనాకుంఠితోత్కంఠకంఠీరవోపకంఠంబునఁ గ్రోష్టు వసియాడునే సర్వసమ్మోహనసర్వావయవ సన్నివేశంబు గల యూర్వశియెదుటఁ బిశాచంబు సుందరం బగునేయట్లు సర్వజగదాదరణీయం బగు భవత్ప్రబంధసముదాయంబు నందొక సూక్తిలేశంబునకైన ముజ్జగంబులం గలకృతిశతంబు సదృశంబు గాదని యనేక విధంబుల బొగడి సాపరాధచేతనుల మగుమమ్ముం గరుణింపు మని సాష్టాంగప్రణామం బాచరించె నంతఁ దక్కిన కవీంద్రు లంద ఱట్లు వినుతించి కృతార్థులైరి యిట్లు మధురకవి సూరిశేఖరుం డనేక ప్రకారంబుల నప్పరాంకుశ మునిప్రభావం బఖిలప్రాణు లెఱుంగునట్లు ప్రకాశితంబు చేసి కొంతకాలంబుండి విభవంబుఁ జాలించి యర్చారూపంబు ధరియించె మఱియును.

41

సీ. శ్రీపరాంకుశయోగి • శేఖర కారికు,మార సుందరసుకు • మారమార
శ్రీనాధనాయికా • సీమంతినీగర్భ, శు క్తిముక్తాఫల • సుగుణజాల
వకుళభూషణ దివ్య • వైభవకాసార, భూతాదిసూరి సం • పూజ్యచరణ
వైష్ణవాన్వయసుధా • పాధోధిరాకాసు, నాకర శ్రీరంగ • ధామశరణ

తే. లింత్రిణీమూలవిలసిత • దివ్యధామ, భక్తవత్సల పరమకృ • పావిధేయ
నీకు మ్రొక్కెద శఠకోప • నిత్యమనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

## శ్రీమన్నాద మునుల వైభవము

శ్రీమన్నాధ-త, శ్లో॥ జ్యేష్ఠమాసే త్వనోరాధాజాతం శఠజిదాశ్రయమ్ ।
ఉద్ధర్తారం ప్రబన్ధానాం శ్రీమన్నాధమునిం భజే॥

సీ. నిత్యము శ్రీరుక్మి • ణీసత్యభామలు, చన నొప్ప నుభయపార్శ్వములఁ గొలువ
శంఖచక్రములూర్ధ్వ • శయపద్మములఁ దాల్చి, పెఱకేలుఁదమ్ముల • మురళిఁబూని
మణిమయగోపుర • మండపప్రాకార, మహితమందిర వేది • మధ్యమునను
రంజిల్లుమన్నారు • రాజగోపాలుని, కభిమతవాసమై • యఖిలలోక

తే. సేవ్యమైసర్వసంపత్ప్ర • సిద్ధమైన, వీరనారాయణపురంబు • వెలయుచుండు
సరసవాంఛేయవనమున • సతత మనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. సద్గుణజలధి యీ • శ్వరభట్టగురువరుఁ, డప్పురియం దెప్పు • డధివసించు
నతనికిఁ బుత్రుఁడై • యవతరించెను బర,భక్తిపరజ్ఞాన • పరమభక్తి
ఘనుఁడు శ్రీమన్నాధ • ముని యమ్మహాత్మని. కీశ్వరముని పుట్టె • నిర్దయుఁడు
యమనియమాసనా • ద్యష్టాంగయోగసా,క్షాత్కృతహృత్పద్మ • సద్మదహర

తే. గగనరూపాంతరాత్ముఁడు • కలితనిఖిల, వేద్యుఁడానాధముని బుధ•వినుతగుణుఁడు
గానఁబడుగాక నామదిఁ • గరుణ ననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. హరికిఁ గైంకర్యము • లర్పించుఁ జబ్బుచు, నుంచి కొన్నిదినంబు • లొక్కనాఁడు
పితృపుత్రసహితుఁడై • ప్రీతితోఁ గోవెల, కరిగి ప్రదక్షిణ • మాచరించి
ధర్మతార్క్ష్యస్తంభ • బలిపీఠములకడఁ, జాగిలఁబడి మ్రొక్కి • జరిగిపోయి
మన్నారుకృష్ణుని • కన్నులమొగి నిల్చి, కేలుఁదమ్ములఁ దలఁ • గీలుకొలిపి

తే. బహువిధంబులఁ గొనియాడి • పరమభక్తిఁ, బలికెనిట్లనిరాజగో • పాలహరికి
యుక్తమఁడైనశ్రీనాధ • యోగియనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. సాధురక్షకు దుష్ట • సంహారమున కుర్వి, ధర్మసంస్థాపనా • ర్థము జనించి
స్వామి ముందే నీవు • శైశవపౌగండ, కౌమారయౌవన • కాలములను
జేసినచేష్టలఁ • జెన్నొందుచును భవ • త్పదపల్లవన్యాస • పావనంబు
లగు బృహద్వనము బృం • దాటవి గోవర్ధ,నాద్రి గోకులము శ్రీ • యమునమథుర

తే. ద్వారవతియు నయోధ్యయు • బదరికాశ్ర, మాదిపదముల సేవింప • నరుగ వీవి
కాజ్ఞయిమ్మని యడిగెన • య్యార్యుఁ డనుచు,వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. అర్చకముఖముగా • హరి పోయిరమ్మని, యాన తిచ్చిన విని • యచటినుండి
స్వకుటుంబసహితుఁ డై • చని దివ్యదేశము,లన్నియు సేవించి • యమున చెంత
గోవర్ధనపురంబుఁ • గొమ రొప్పఁగని యందు, గోపకుమారుని • ప్రాపుఁ జెంది
యఖిలకైంకర్యము • లతనికి సలుపుచుఁ, గొన్నినాళ్లుండె న • గ్గురువరేణ్యుఁ

తే. డంత మన్నారుగోపాలుఁ • డతనికలను,దన్నుఁగనిపించి ర మ్మని • దయనుబిలువ
నేఁగఁ దలఁచెను నాథము • నీంద్రుఁ డనుచు,వాదిభీకరగురుఁడనె • మోద మలర.

సీ. గోవర్ధనపురీశుఁ • గోపకుమారుని, యంఘ్రులఁ గని మ్రొక్కి • యాజ్ఞఁ బడసి
తమకుటుంబముతోడఁ • దరలి యచ్చటినుండి,కాశీపురముఁ జెంది • గంగఁగాంచి
తీర్థీకరించి యా • దేశముఁ గడచి యు,త్కలదేశమున నబ్ధి • తటమునందు
బదునాల్గు జగములఁ • బరమపావన మైన,శ్రీపురుషోత్తమ • క్షేత్ర మొంది

తే. బ్రహ్మదారుస్వరూపునిఁ • బరమపురుషుఁ,గాంచి మ్రొక్కి-డివినుతించి•కదలియచట
సింహగిరినాథమునిఁజెందె • శీఘ్రమనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ సింహాచలమునందు • శ్రీవరాహనృసింహు,ఘనభక్తి భజియించి • కదలి యచట
శ్రీ మదహోబల • క్షేత్రముఁ గని యందుఁ, బ్రహ్లాదవరదునిఁ • బ్రస్తుతించి
గరుడాద్రిని హిరణ్య • కశిపుమర్దను నృసిం,హునిఁ గని పొగడి య • హోబలంబు
విడిచి వచ్చి వృషాద్రి • వేంకటేశుని గాంచి, వేయువిధ-బుల • వినుతి సల్పి

తే. యచటినుండేఁగిఘటికాద్రి •హరినినృహరి,నీశునిఁగనిమ్రొక్కి-నాథము•నీశ్వరుండు
జరగి కనియెను శ్రీగృధ్ర • సరసి ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఆసరస్తటమున • హైమసౌధమున-దుఁ, గనఁబడు విజయరా • ఘవునిఁ గాంచి
హర్షపూర్వకముగా • నతనికి జోహారుఁ, జేసి కాంచీపురిఁ జేరి యందుఁ
గరిగిరివరదునిఁ గన్నులపండువు,గాఁ జూచి కేల్మోడ్చి • కడు నుతించి
యష్టాదశస్థిత•హరిదివ్యమంగళ, మూర్తులఁ గనుఁగొని • మ్రొక్కి- పొగడి

తే. యేఁగి శ్రీమదహీంద్ర పుఁరీశుఁడైన, దైవనాయకు వీక్షించి తగ భజించె
మాన్యతముఁ డైనశ్రీనాథమౌనియనుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

సీ. చాంపేయవనమున సొంపారు శ్రీవీర, నారాయణపురంబుఁ జేరఁ జనిన
నప్పురివైష్ణవు లందఱెదుర్కొని, నమ్రులై యర్చింప నాథమునియు
సముచితంబుగ వారి సన్మాన మొనరించి, వారలకుశలముల్ వరుస నడిగి
రంగుగా మన్నారు రాజగోపాలుని, శ్రీకార్యములయందు సేమ మరసి

తే. తానొనర్చిన తీర్థయాత్రాక్రమంబుఁ, దెలిపియా సాత్త్వికులతోడ దేవగృహముఁ
జొచ్చి మన్నారుకృష్ణునిఁ జూచె ననుచుఁ, వాదిభీకరగురుఁ డనె మోద మలర.

సీ. మన్నారుకృష్ణుని కన్నులమొగిఁ నిల్చి, శ్రీనాథముని నుతిఁ జేసినంత
నతఁడు ప్రసన్నుఁడై యర్చకముఖమున, నాదరోక్తులఁ గర మనునయించి
తిరుపరివట్టముఁ దీర్థముఁ దిరుమాల, శఠకోప మిప్పించి శ్రమము దీర్చి
యీనాథమునుల మీఁరిండ్లు కట్టించి యిం,దుంచుఁడీ యని హరి యూరివైష్ణ

తే. వులకు నియమింప వా రట్ల సలుప నాథ,మునికుటుంబసమేతుఁడై మోద మలర
నందు నిత్యనివాసముఁ జెందె ననుచు, వాదిభీకరగురుఁ డనె మోద మలర.

సీ. ఛాత్రుల కనిశము శాస్త్రపారంబులఁ, జెప్పుచు నమ్ముని శేఖరుండు
సకలసుగంధిపుష్పద్రుమారామము, నిర్మించి నిత్యము నిఖిలకుసుమ
మాల్యములనుగూర్చి మన్నారుకృష్ణుని, కర్పించుచుండు న య్యవసరమున
సాటి లేనట్టి మేల్నాటినుం డిరువురు, వైష్ణవు లొకనాఁడు వచ్చి యచట

తే. భవ్యగుణజాలుఁ బరమకృ పాళు జలద నీలు మన్నారురాజగో పాలబాలుఁ
జూడ్కు లలరంగభక్తితోఁ జూచి రనుచు, వాదిభీకరగురుఁ డనె మోద మలర.

వ. అట్లా వైష్ణవోత్తములు సర్వలోకోత్తారక యగు దక్షిణద్వారక నధివసించు మన్నారుకృష్ణుని దివ్యమంగళ విగ్రహంబు సేవించి తదనుభవజనితానందకందళిత స్వాంతులై ఫాలస్థలంబులఁ గేలుఁదమ్ములం గీలించి 'యారావముదే' యను తిరువాయ్మొళి యనుసంధింప విన నవధరించి శ్రీమన్నాథముని 'ఓరాయిరత్తు ళిప్పత్తు' మ్మని మీర లనుసధించితిరి. మీ రీయాయిర ప్రబంధబంధురం బగు శ్రీకోశం బిప్పింపుఁ డని యడుగ నాసాత్త్వికు లీ శ్రీకోశం బెచ్చటనుం గనఁబడ లే దని విన్నవింప స్వామిసన్నిధి శ్రీశఠకోపతీర్థ ప్రసాదాదిబహుమతి సేయించి వారిం బంచి తత్ప్రబంధ సంపాదనచింతాయత్త చిత్తుండయ్యె నంత.

సీ. గాథాసహస్రసం•ఘటితశఠారిప్ర, బంధమం దీపది•పాశురంబు
లధికరించితిమి మే • మది దక్క వే ఱెఱుం, గము గాన మాపుస్తక • ముధరిత్రి
నని పల్కి రీవైష్ణ•వాగ్రణు లది గాన, కురుకాపురము శఠ•కోపసూరి
కవతారపదము నే • నచ్చోటి కేఁగి యా,శ్రీకోశ మెం దైనఁ • జెందెద నని

తే. యెంచికురుకాపురంబున,కేఁగుదెంచి, యాదినాథునిఁగనిమ్రొక్కి • యభినుతించి
చూచె శఠవైరి నానాథ,సూరి యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ధన్యుఁ బరాంకుశ•దాసాఖ్యు మధురక,విప్రియశిష్యుని • వేడ్కఁ జూచి
తిరువాయిమొళి యను•దివ్యప్రబంధ మం, తయుఁ జదివినధన్య • తము లిచటను
గల రేని చెప్పుమా • ఘనుఁడ నీ వని నాథ,ముని పల్కనమ్మహా•త్ముని కతండు
పలికెనుమునుపీప్ర • బంధముసాంతము, గా నభ్యసింపనా • క్షణమునందుఁ [జెందె.

తే. బరమపదమొందుదురుగాన • భయముఁజెంది, జనులువిడిచిననదిప్రమో • షంబుఁ
ననుచు నతనికిఁ దెలిపె న•య్యార్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. తిరుమొళి మొదలైన • దివ్యప్రబంధము, లఖిలములు ఖిలంబు • లయ్యె నిట్టు
లవియన్ని మగిడి మీ • రధికరించుటకుపా, యముఁజెప్పెదను విను • మార్యవినుత
యస్మద్గురుప్రోక్త • మా కణ్ణినుణ్ శిరు, త్తాం బనియెడు ప్రబం • ధము లభించి
యాళ్వారికనుమ్రోల • నతనిఁ దలంచుచుఁ, దింత్రిణిక్రింద సు • స్థిరత నుండి

తే. వేడ్క నది నీవు పండ్రెండు,వేలమార్లు, జప మొనర్ప శఠారి ప్ర•సన్నుఁడగును
దథ్య మనియెఁబరాంకుశ • దాసుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. ఇట్లమ్మహాత్ముని సూక్తులాలించి సంతసించి శ్రీమన్నాథముని యాక్రమం బొనర్ప నుద్యోగించె నంత.

సీ. శఠవైరివిషయ మౌ • సత్ప్రబంధం బది, నయ మొప్పఁ జదివి శ్రీ•నాథయోగి
తిరుతామ్రపర్ణిలోఁ • దీర్థమా డేతెంచి, తింత్రిణీమూలప్ర • దేశ మొంది
ముద మొప్ప శఠకోప • మునికనుమ్రోలను, బద్మాసనస్థుఁడై • పరమనియతి
నుండి యాసత్కృతిఁ • బండ్రెండువేలమా, ర్లావృత్తిసలిపిన • నాదినాథ

తే. మహిషియాజ్ఞను శఠరిపు • మౌనిపూర్ణ, చంద్రుఁడుదయించి నాథహృ•త్సరసిజాభ్ర
మండలాంతస్తమంబెల్ల • మాపెననుచు, వాదిభీకరగురుఁ డనె, మోదమలర.

సీ. కఱివేల్పు తన కను • గ్రహముఁ జేసినయట్లు, నయ మొప్ప శఠవైరి•నాథమునికిఁ
బ్రపదన మొనరించి • పార్థున కలయదు,దేవునిగతి దివ్య • దృష్టి యొసఁగ

ద్వాదశాత్మనిగతి, ద్వాదశసూరిస్వ, రూపుని నాశర • కోపమునిని
నాదివ్యతేజోమ • యాకాశవీధిని, సాక్షాత్కరించి త • చ్చరణపద్మ

తే. ములకు భక్తి దలిర్పఁ జే•మోడ్చి పొగడి, వకుళభూషణముని నీదు,వాంఛితంబు
దెలుపు మని నాథసూరికిఁ • బలికె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. అంత నమ్మహాత్మునిదివ్యసూక్తు లాలించి శ్రీనాథముని యి ట్లనియె. 34

సీ. భవదీయదివ్యప్ర • బంధము లన్ని సాం, గోపాంగములు వీని • కొక్కసారి
సంప్రదాయార్థవి • జ్ఞానపూర్వకముగా, నాన తిమ్మన నతఁ • డతని కనియెఁ
దెఱబైట నీవుండి • తెలివిగా లిఖియింపఁ, జెప్పెద నవి యన్ని • చెవిసొరంగ
నని శఠారి వచింప • నతఁ డట్లొనర్చినఁ, బల్లాండు మొదటను • బలుకుకతన

తే. శ్రుతులమొదటను బ్రణవముఁ•జొనిపినట్లు, పరఁగుపల్లాండు దివ్యప్ర•బంధములకు
నాదియందును బలుకుదు • రార్యు లనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. నాథమనీషికి • నాలాయిరప్రబం, ధము లట్లు క్రమముగా • దయ నొసంగి
యతులరహస్యత్ర • యం బంతిమోపాయ, మష్టాంగయోగర • హస్య మఖిల
దర్శనముఖ్యతా • త్పర్యము సంశయ, మేమియు లేకుండ • నెఱుకపఱిచి
వర మిచ్చెదను నీదు • పరసమృద్ధికి మెచ్చి, కోరికొ మ్మని శఠ • కోపదివ్య

తే. సూరి పలికిన నానాథ • దూరదర్శి, సంతసించుచు భక్తితో • సాఁగి మ్రొక్కి
వకుళభూషణముని కిట్లు • పలికె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఈకలియం దుద • యించినచేతనుల్, దీర్ఘాయువులు గారు • తెలివి లేని
వారు దుర్భగులైన • వారు దురాచార, పరులు భూతద్రోహ • కరులు గాన
కరుణచే వీరి కం • దఱకు మే లొనరింప, నవనియం దిచ్చోట • నవతరించి
ద్రావిడామ్నాయముల్ • ధరఁ బైలుపుచ్చిన, మఱణభయంబుచే • మందబుద్ధు

తే. లధికరింప యున్నంత • నవి ఖిలంబు, లయ్యె నిప్పుడు చెప్పితి • రవియెమగిడి
వీని కని పల్కె నాబ్రహ్మ • వేత్తయనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర

సీ. ఈవేళమొదలుగా • నిఁకమీఁదఁదిరువాయి, మొళియభ్యసించుము • ముముక్షువులకుఁ
గలకాల మంతయుఁ • గడచినమీఁదట, మోక్ష మి మ్మని నాథ • ముని వచింప
న ట్లొసంగెద నని • యాళ్వారు మఱియొక, మాట వక్కాణించె • మౌనిమణికి
నాథార్య శ్రీవీర • నారాయణపురంబుఁ, జెంది యం దుండి నీ • శిష్యతతికి

తే. ద్రవిడవేదములివిచెప్పి, ధరణియందు, వృద్ధిఁబొందింపుమని బ్రహ్మ, విత్తమునకు
వకుళభూషణముని పల్కె, వాంఛ ననుచు, వాదిభీకరగురుఁడనె, మోదమలర.

సీ. శ్రీనాథముని కట్లు, చెప్పి శఠారాతి, బహుమతి యొనరించి, పంప నాతఁ
డాదినాథస్వామి, యంఘ్రులఁగని మ్రొక్కి, వినుతించి వీడ్కొని, వెడలి వీర
నారాయణాహ్వయ, నగరికిఁ జని యందు, మన్నారుకృష్ణునిఁ, గన్నులార
సేవించి పోయి వ, చ్చినక్రమ మతనికి, విన్నవించి తదాజ్ఞ, వేశ్మ మొంది

తే. యుర్విద్రావిడవేదము, లుత్తరోత్త, రాభివృద్ధము లెట్లగు, ననుచుఁదనదు
మదిఁ దలంచెను శ్రీనాథ, మౌని యనుచు, వాదిభీకరగురుఁ డనె, మోదమలర.

వ. అంతఁ బరమకారుణికుం డగు శ్రీమన్నాథముని మన్నారుకృష్ణుని యాజ్ఞచేఁగీళహ త్తాళ్వాన్ మేలేహత్తాళ్వానను నిజపౌత్రుల సాహాయ్యంబుగాఁ గూర్చుకొని భగవంతుం డగు కృష్ణద్వైపాయనుండు తొల్లి రాశీభూతంబు లగు వేదంబులు ఋగ్యజుస్సామాథర్వ భేదభిన్నంబుగా నుదాత్తానుదాత్త స్వరితప్రచయాత్మక స్వరంబులచే నుచ్చారణయోగ్యంబులుగాఁ జేసినట్లు సంఘీభూత ప్రబంధమధ్యంబునఁ జతుర్వేదసారభూతంబు లగు శ్రీవకుళాభరణ ప్రణీత ప్రబంధంబులు నాలుగు న్నాలుగు వేదంబులుగా నేర్పరించి యాద్రావిడామ్నాయంబులకు శ్రీపరకాలముని ప్రోక్తంబు లగుషట్ప్రబంధంబులు షడంగంబులుగా నవశిష్ట ప్రబంధంబు లన్నియుపాంగంబులుగా సర్వచేతనోజ్జీవనార్థం బొనర్చి సాత్త్వికతాస్తికతాద్యాత్మ గుణపరిపూర్ణు లగు శ్రీ వైష్ణవులచేఁ దత్తద్దివ్య దేశంబులయందు దివ్యగాన రూపంబుగాఁ బాడించిన నద్దివ్య ప్రబంధంబు లన్నియు శిష్యాచార్య క్రమంబు దప్పక యిప్పటికైన నిప్పుడమిం బ్రసిద్ధంబు లై వర్ధిల్లు చుండె నా సమయంబున షడ్జ మధ్యమగ్రామంబుల సకలజనమనశ్శ్రవణానందంబుగా మనుష్యగానంబుఁ బాడ నేర్చినపణ్యాంగన యొకతెయు గాంధారగ్రామయుక్తంబుగా దేవగానంబుఁ బాడనేర్చిన వారవిలాసిని యొకతెయు దమతమగానాతిశయంబునకై వివాదమొంది యద్దేశాధిపతి యైన చోళనాథుని సప్తాంగ లక్షణలక్షిత యగుసభఁ జేరంబోయి యమ్మహీపతినింగాంచి తదీయాజ్ఞచే సదస్యులు వినం దమతమగాన చాతుర్యంబు గనిపింప నాసామాజికులు మనుష్యగానంబు మెచ్చిన నమ్మహీమండలేశ్వరుండు మనుష్యగానంబుఁ బాడినపణ్య లావణ్యవతికి ధనకనక వస్తువాహనాది బహుమతు లొనర్చి పంచి దేవగానంబుఁ బాడినవేశ్యాలలామంబు నాదరింపకున్న నదియు నస్మదీయం బగుదైవతగీతాతిశయంబు దేవతలకుం దెలియుంగాని మానవు లెఱుంగ లేరని యాస

దస్యులకు వక్కాణించి ప్రతి దివ్యదేశంబులయందు భగవద్భాగవతముఖోల్లాసం బుగాఁ బాడుచుఁ గ్రమంబునం జని చని యొక్కనాఁడు వీర నారాయణపురంబు నందు మన్నారు కృష్ణునిసన్నిధిఁ జెంది విన్నాణంబుగాఁ బాడుచుండ సర్వజ్ఞుం డగు శ్రీమన్నాథముని విన నవధరించి యద్దేవగానంబునకు సంతసించి స్వామి సన్నిధి తిరుపరివట్టంబును దిరుమాలెయు శ్రీశఠకోపతీర్థ ప్రసాదాద్యఖిలసమ్మా నంబు లొనర్చి పంచినంత నా వేశ్యారత్నంబును మగిడి చోళభూమండలేశ్వరునిం గాంచి వినయం బొనర్చి యిట్లనియె శ్రీ వీరనారాయణ పురంబునందు శ్రీమన్నాథ ముని యనునొక ప్రాజ్ఞశిఖామణి మదీయదివ్య గానాతిశయం బెఱుంగు నమ్మహాత్ము నిచ్చటికి రావించిన నతండు మదీయదివ్యగా నోత్కర్షంబు మీకుం దెలుపఁగలం డనిన విని యబ్భూమిపతియు శ్రీమన్నాథ మునులం బిలిపించి ప్రత్యుత్థానాభివంద నాద్యర్చా విధులం బూజించి యంచితంబగు కాంచన పీఠంబునం దుంచి తదీయ శాసనంబుఁ దానుచితాసనాసీనుండై కరకమలంబుల మోడ్చి మహాత్మా యీ వేశ్యా స్త్రీ దివ్యగీతాతిశయంబు మీరెఱింగితి రేని మాకుం దెలుపుఁ డని సభ్యులు విన విన్నవింప శ్రీ నాథముని సత్తముం డాయిరువురు వేశ్యలం బాడ నియమించి యగ్గీతంబు లాకర్ణించి నృపసత్తమా మీర లందఱు షడ్జమధ్యమగ్రామకలితంబు లగుగీతం బెఱింగినవారు గావున నిమ్మనుష్యగానంబు విని సంతసించితి రిద్దేవ తాగీతాతిశయంబు నిలింపులకుం గాని మనుష్యులకుం దెలియ నశక్యం బనిన నాసార్వభౌముండు గురుసత్తమా మీ రీదేవగానం బెఱుంగుదు రని మా కెట్లు దెలియుఁ గావున నొకయడి యాలంబుఁ జూపుఁ డనిననమ్ముని సత్తముండు నన్నాట నలువది తాళంబు లేక కాలంబున వాయింప నియోగించిన రా జట్లు సేయింప నమ్మహానాదం బాలించి యమ్మహాత్ముండు కాంస్యమయతాళంబుల మానంబు వేర్వేఱ వాక్రువ్వ నమ్మార్గాభిషిక్తుం డగ్గురువరుం డానతిచ్చిన క్రమం బుగా నాతాళంబు లన్నియు నొకటొకటిగాఁ దుల నారోపించి పరీక్షించి తదుక్త క్రమంబున కించుకయైన న్యూనాధిక్యంబుఁ గనుఁగొనలేక యత్యాశ్చర్యంబుఁ జెంది పరమాహ్లాదసుధాహ్రదప్లూయమాన మానసుండై యానృపసత్తముం డద్దేశి కోత్తమునకు భక్తిపూర్వకంబుగా సాష్టాంగ ప్రణామం బాచరించి బహు విధా మూల్య రత్నభూషణాంబ రాదిద్రవ్యంబు లర్పింప నుద్యోగించినం జూచి భగ వంతుఁడగు శ్రీనాథ మునీంద్రుండు తృణీకృత బ్రహ్మరుద్రేంద్రాది విభవుండు గావున నాద్రవ్యం బేమియుం గొననొల్ల కచ్చోళభూభర్త నాశీర్వదించి మగిడి వీరనారాయణ పురంబున కేతెంచి మన్నారు కృష్ణున కశ్రాంతంబు సకలవిధ

కైంకర్యంబు లొనర్చుచున్న సమయంబున, శ్లో॥ శరీరం వసు విజ్ఞానం వాసః కర్మ గుణానసూన్। గుర్వర్థం ధారయేద్యస్తు సశిష్యో నేతర స్మృతః॥ అని యెడు న్యాయంబున శిష్యలక్షణలక్షితులగు నయ్యక్కొండార్ కురుహావలప్పన్ నంబికరుణా కరదాసర్ పెరియ తిరువుడయార్ తిరుక్కణ్ణ మంగైయాండాన్ వానమామలైయాండా నురుపుటారాచ్చాంబిళ్లై చొక్కత్తాళ్వాననియెడి యీమేన మంద్రుడు సాత్త్విక సత్తము లద్దేశికోత్తముని దివ్యపాదాబ్జంబు లాశ్రయింప నతండు సుప్రసన్నుండై వేదసారంబై మహా ప్రభావసంపన్నంబై మంత్రరత్నాపరనామధేయం బైనద్వయం బర్థానుభవ పూర్వకంగా నుపదేశించి తిరువాయ్ మొళి మొదలైన దివ్య ప్రబంధంబు లన్నియు వాచోవిధేయంబు లగునట్లు ప్రసాదించి సమస్త వేదశాస్త్రం బులధికరింపం జేసి శ్రీ రహస్యత్రయ సారార్థం బగు సకల జగత్కారణభూత పరమపురుష రూపపరతత్త్వ నిర్ణయం బెఱింగించి యష్టాంగయోగ ధారణాసాక్షాత్కృత భగవద్దివ్య మంగళశ్యామ సుందరసుకుమార విగ్రహానుభవ జనితానందకందళిత హృదయారవిందుండై యుండె నంత.

సీ. విని నాదమునియోగ • విభవముం గనం దన, హేలావతులం గూడి • చోళరాజు
విన్నాణముగ వచ్చి • మన్నారుకృష్ణుని, గన్నులపండువు • గా భజించి
యచటినుం డేతెంచి • యతిరహస్యక్షేమ, గిరిగహ్వరోపమ • గృహమునందు
ధౌతవస్త్రాజిన • దర్భోత్తరం బగు, విపులపీఠమునందు • వెలయువాని

తే. బద్ధపద్మాసనుని నూరు • భాగనిహిత, పాణితలు హృన్నిరీక్షిత • పరమపురుష
సూరివరు నాథయోగిని • జూచె ననుచు, వాదిభీకరగురుం డనె • మోదమలర.

సీ. అట్లు త న్నీక్షించి • యాశ్చర్యపడి తన, యంఘ్రిపద్మంబుల • కర్చం జేసి
వెలువడి నవతటి • ద్వృతకాలమేఘము, గతి నిజభార్యలం • గలిసి పురికిం
జనుచున్న చోళభూ • జాని వీక్షించి యీ, క్షితిగోపికావృత • కృష్ణుం డీతం
డని తలంచుచు నాథ•మునివరుం డారాజు, వెనువెంటం జనుచుండ • విని తదంగ

తే. రక్ష నలుపంగం బుండరీ • కాక్షముఖ్య, శిష్యవరు లేంగి పరభక్తి • సింధు వైన
గురునిం గని మ్రొక్కి పలికిరీ•కరణి ననుచు, వాదిభీకరగురుం డనె•మోదమలర.

సీ. స్వామి దేవరవారు • సర్వజ్ఞులై యుండి, యీరాజుసుతువెంట • నిట్లు చనుట
భువి విరుద్ధం బని • పుండరీకాక్షుడు, లన నాథముని వారి • కనియె నిట్లు

గోపికాపరివృత • గోపకుమారకుఁ, డితఁ డని మది నెంచి • యిప్పు డిట్లు
వచ్చితి వనఁ జోళ•వసుమతీశ్వరుఁ డితం, డని వారు దెలుపన•య్యార్యవరుఁడు

తే. మగిడి మన్నారుకృష్ణునిఁ • దగ భజించి, యతని కనిశము కైంకర్య • మాచరించి
కాల మొక్కింత యీరీతిఁ • గడపెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. మన్నారుకృష్ణునిఁ • గన్నులఁ గని మ్రొక్కి, స్తుతిఁ జేసియొకనాఁడు • చోళరాజు
మరలి యేఁగఁ దలంచి•మదహస్తి నెక్కంగ, నరినృపు ల్తలఁద•చ్చరణమానఁ
జూచి బ్రహ్మశివాది • సురశిరంబుల నూని, విహగాధిపతి నెక్కు • విష్ణు వనుచు
నుల్లములో నాధ • యోగి దలంచుచుఁ, బరభక్తివివశుఁ డై • యొరగె ననుచు

తే. ధరణివిఖ్యాత మీసంప్ర • దాయ మంత, యోగనిష్ఠాభిరతి నాధ • యోగినిత్య
తృప్తుఁడై యుండెనిలఁగొన్ని • దినములనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర

వ. అంత శ్రీమన్నాధ మునీంద్రుండు నిజచ్ఛాత్ర శేఖరుండగుకురుకావలప్ప ననుసూరిశేఖరునిం బిలిచి నీ వీయోగరహస్యం బభ్యసింపు మని యమ్మునీషిరత్నంబున కష్టాంగయోగక్రమం బుపదేశించి పుండరీ కాక్షపరనామధేయుండైన యుయ్యక్కొండా రనుగురువరునిం జూచి నీవష్టాంగయోగరహస్యం బభ్యసింపు మనిన నమ్మహాదేశికున కయ్యోగానుష్ఠానం బశక్యంబుగాఁదోఁప నమ్మహాత్మునితలం పెఱింగి వత్సా నీవు వేదశాస్త్రంబులు సకలామ్నాయసారభూతంబు లగుతిరువాయ్మొళిమొదలైన దివ్యప్రబంధంబులన్నియుం బ్రవర్తింపంజేయుమనినియమించి స్వపుత్రుండైన యీశ్వరముని నవలోకించి నీకస్మత్సమానుండగు కుమారుం డొక్కం డుదయించు నబ్బాలకునకు యమునత్తురవ రని తిరునామం బొనర్పుమని యానతిచ్చి యుయ్యక్కొండారు కురుహావలప్ప ననియెడియిరువురు సూరివరుల నుద్దేశించి మీకు నేనుపదేశించిన దర్శన తాత్పర్య యోగరహస్యారవిశేషంబు లన్నియుయాము నాచార్యున కుపదేశింపుం డని నియోగించి పూర్వక్రమంబుగా మన్నారుకృష్ణున కనవరత కైంకర్యం బొనర్చుచు యోగధారణాతత్పరుండై యుండె నంత. 45

సీ. ఉచ్చైశ్శ్రవము నెక్కి•యుర్విఁ జరింప ని, ట్లే తెంచినాఁడొ దే•వేంద్రుఁడనఁగఁ
దగినవేషముదాల్చి • మృగయావినోదియై, యుత్తమాశ్వమునెక్కి•యుచితబలము
గొల్వ వెల్వడి చని • ఘోరకాననముల, శరభసింహవ్యాఘ్ర • చమరసృమర
మహిషవరాహాది • బహుమృగంబుల నేసి, యలసి పురంబున • కరుగువేళఁ

తే. జెంది మన్నారుకృష్ణుని • సేవఁ జేసి, వీరనారాయణపురంబు • విడిచిపోయి
చోళభూపతి నిజపురిఁ • జొచ్చె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. ఆసమయంబున శ్రీమన్నాధమునులకడ కాత్మపుత్రిక లిరువు రేతెంచి యిట్లని విన్నవించిరి. 47

సీ. అయ్య నెయ్యం బొప్ప • నతిసుందరాకృతు, లిరువురు విలుకాండ్రు • నింతియొకతె
వారిపిమ్మట బాల • వనచరుం డొక్కఁడు, మనయింటి కేతెంచి • మమ్ముఁగాంచి
శ్రీనాధమును లేమి • సేయుచున్నా రని, యడిగి పోయిరి వార • లంద అనిన
విని నాధముని తన • మనమున వారలు, జానకీరామల • క్ష్మణసమీర

తే. సూనులనియెంచివారలఁ • జూచువేడ్కఁ, వేగవారలుచన్నత్రోవ • వెంటఁజనుచు
వచ్చుపధికుల కిట్లు వా • క్రుచ్చె ననుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర,

సీ. ధానుష్కులిరువురుఁ•దరుణి యొక్కతె యొక, వనచరార్భకుఁ డిట్టి • వారి నిపుడు
కంటిరా త్రోవలో • ఘనులార యనఁ బాంధు, లదె చనుచున్నవా • రనుచుఁ బలుక
విని వేగ చని నాధ • ముని వారిఁ ద్రోవలోఁ, గనలేక వగచుచుఁ • గడురయమునఁ
జని చని కనుమ్రోలఁ • గని చోళపట్టణ, ద్వారముకడ నున్న • వారి నడుగఁ

తే. జూడ లే దని వా రన • సూరివర్యుఁ, డక్కటా కాన లే నైతి • హరిపదాబ్జ
యుగళ మనియార్తిపడి నేల • కొఱిగెననుచు, వాదిభీకరగురుఁడనె, మోదమలర.

వ. అంత నశ్రాంతభగవదేకాంత చింతాసంతాన సమాక్రాంతస్వాంతుండును శాంతి దాంతిక్షాంత్యా దిగుణనితాంత విశ్రాంతిని శాంతుండైన యమ్ముని కాంతుండు. శ్లో॥ చక్రాష్టకే వ్యష్టిరూపాం సర్వానన్దేసమష్టికామ్। అష్టాక్షరీం మహావిద్యాం ధ్యాయే నారాయణాత్మికామ్॥ అనుయోగశాస్త్రక్రమంబున మూలాధార స్వాధిష్ఠాన మణిపూర కానాహత విశుద్ధాజ్ఞాలలాటక సర్వానందాభిధాన చక్రాష్టకంబున వ్యష్టి రూపంబుగా సర్వానందాష్టదళంబునందు సమష్టిరూపంబుగా విలసిల్లుచు నారాయణాత్మకంబగు శ్రీమదష్టాక్షరీరూపయోగ విద్యారహస్యంబును మంత్రరత్నార్థాద్యఖిలహితంబు లుపదేశించిన శ్రీపరాంకుశదివ్య సూరినిందలంచుచు హృత్పుండరీకాంతర్గతాపహత పాప్మత్వాది గుణాష్టకవిశిష్టజ్యోతిర్మయదహ రాకాశాత్మ కాంత రాత్మాభి ధానపరమపురుషాను గ్రహంబుచే లబ్ధంబగు మూలాధారద్వారంబునఁ బ్రాణశక్తి యుక్తకతిపయ తత్త్వరూపసూక్ష్మ శరీరంబుతో సుషుమ్నాఖ్య బ్రహ్మ

నాద్యంత రాయనంబుఁ జెందియుద్గమించి సహస్రార మధ్యమా మృతమయూఖ మండలమధ్య ప్రదేశాయిత విగ్రహుండై విద్యామాహాత్మ్యంబుచే మధ్యధమ న్యూర్ధ్వభాగంబు భేదించి బహిర్గతుండై ప్రణవరథారూఢుండై మనస్సారథ్యంబుఁ జెంది నిజప్రభావగాథా కథక వందిబృందాయ మానబృందారక సందోహాభివంద మానపదారవిందుండై యర్చిరాదిమార్గంబునం జనుచు వహ్న్యాదిన పూర్వపక్షోత్త రాయణాబ్దవాతాంశు మచ్చంద్ర విద్యుద్వరుణేంద్ర నిధాతృ లోకంబులందుఁ దత్తల్లోకాభిమాని దేవతలచే నర్చితుండై యన్ని లింపులగు ౯పు లన్నియు వీడ్కొలిపి బ్రహ్మాండ కటాహంబు భేదించుకొని దశగుణితోత్తరంబైన యావ రణ సప్తకంబును మూలప్రకృతియు నతిక్రమించి బ్రహ్మశివసనకసనందన సనత్కుమారసనత్సుజాతాది మహాయోగీంద్రుల కైన నవాఙ్మానసగోచరం బై తమఃపరివార పరివర్తమాన పరిచ్ఛిన్నాధోదేశం బై యామోదప్రమోద సమ్మోద వైకుంఠాఖ్యాభేదంబులచేఁ జతుర్విధంబయ్యు ననంతం బై నిత్యవిభూతి త్రిపా ద్విభూతి పరమపద పరంధామ పరమవ్యోమ పరమాకాశామృతాకాశాప్రాకృత లోకానందలోక వైకుంఠాయోధ్యాపరాజితాది శబ్దవాచ్యంబై పరమాశ్చర్యకరంబై సూర్యచంద్రాగ్నిప్రకాశనిరపేక్షంబై దివ్యజ్యోతిర్మయంబై యనంత గరుడ విష్వక్సేనాది నిత్యసిద్ధులనైన నియత్పరిమాణ మియదైశ్వర్య మీదృశస్వభావం బని పరిచ్ఛేదింప నయోగ్యంబై యొప్పుచున్న దివ్యలోకంబుఁ గాంచి ప్రహర్షించి మించి యతి త్వరితగతిం జని చని మార్గమధ్యస్థ మహోన్నత శాఖోల్లసత్తిల్య ఫలాశితిలకమూలంబునం దించుక విశ్రమించి మఱియు నతిత్వరితవిక్రముండై చని రంగదుత్తుంగతరంగ మంగళాయతనామృతాకార విరజాతరంగిణి నుత్తరించి తద్దివ్యకూలంకషామృత ప్రవాహావగాహనంబుచే లింగశరీరధూననం బొనర్చి నిబిడనీరంధ్ర నీలమేఘ నిర్ముక్త సుప్రసన్న సూర్యబింబంబు కరణి రాహు విముక్తరాకాసుధాకర మండలంబువోలిక సమీచీనసలిల సంక్షాళిత సాంప్రతర పంకసముద్ధృత దివ్యరత్నంబుమాడ్కి నిత్యనిరవద్య నిరవధిక నిరతిశయ దివ్య తేజోమయ జ్యోతిస్స్వరూపుండై జ్ఞానానందామలత్వాది స్వరూపరూపగుణా విర్భా వంబు లభించి యద్దివ్యనదీతీరంబునఁ దనరాక కెదురుచూచుచు శంఖచక్రాది దివ్యాయుధోల్లసిత దీర్ఘబాహుండు నమూల్యరత్నకిరీటాది దివ్యభూషణుండునై విచ్చేసియున్న యమ్మానవుని సుకుమారకర సరోరుహావమర్శంబుచే లావణ్యౌ దార్య గాంభీర్య చాతుర్యాది కల్యాణగుణాకరంబై శుద్ధసత్త్వమయంబై భగవ దనుభవపరికరంబై పంచోపనిషన్మయంబైన చతుర్భుజ శ్యామసుందర సుకుమార

దివ్యమంగళ విగ్రహం బవలంబించి యనేకవిధ దివ్యమంగళ వాద్యఘోషంబు తోడం జనుచు విరజాతీరంబునం దొక ప్రదేశంబునం బ్రగల్భవయోవేశాళీ వికారాక్రాంత యగు కులకాంత మంతనంబునం గంతుకేళిస్వాంతం బలరనిజ కాంతునిం గూడనొల్లక స్వపాణిపల్లవంబున స్వకీయనిస్తుల స్తననిర్దయ మర్దనాదు లొనరించి సుఖపర్యాప్తిం జెందు చందంబున స్వరూపానుభవమాత్ర సంతృప్తులై భగవదనుభవ బహిష్కృతులై యున్న కేవలాత్మల కావాసభూతంబై పరమపదం బున కవాచ్యస్థలంబనందగు కైవల్యం బతిదూరంబుగాం బరిహరించి యమృతజల పూర్ణంబైన యైరమ్మదీయ తటాకంబుకడ దివ్యాశ్వత్థమూలంబుం జెందియుండ ఛాందోగ్యవాజసనేయాద్యుపనిషదుక్తక్రమంబుగా దివమాల్య దివ్యాంబరాభరణాది పాణులగు పంచశత దివ్యాప్సర స్త్రీరత్నంబులసంఖ్య నిత్యసూరి బృదంబుల తోడం గూడి శంఖభేరీ మృదంగవీణాపట హకాహళాది దివ్యకల్యాణవాద్య ఘోషంబుతో నెదురేఁగుదెంచి తన్నుంగాంచి సంతసించి తనకు బ్రహ్మాలంకారంబు గావించు సమయంబునం దనేక దివ్యసహస్ర పతాకవితాన ముక్తాదామ దివ్యత్పుష్పమాల్యా ద్యలంకృతంబై దివ్యస్త్రీపరివృతంబై భగవత్సంకల్ప కల్పితంబై యొప్పు నొక్క దివ్యవిమానంబు విహంగమ సార్వభౌముండు కొనివచ్చి తనచేతం బ్రత్యుత్థానాభివందనాదులం బూజితుండై యత్యాదర పూర్వకంబుగా బహువిధంబులం దన్ను సత్కరించి యద్దివ్యవిమానంబునం దెక్కించుకొని మహోత్సవంబు చెలంగం దోడ్కొని చనుచుండ మఱియు ననేక దివ్యసీమంతినీ మణులతో నిత్యసూరులు కొంద ఱెదుర్కొని తనచే నభివాదితులై సత్కరించి త న్ననేకవిధంబులం గొనియాడం జని చని యతి సౌరభాతి మనోహర లలిత ప్రవాళకళికాప్రసూన మంజరీపుంజరంజితామృతోపమాన ఫలభారవ్రణమ్రాతి దీర్ఘ శాఖాసక్త వివిధవిచిత్ర విహగకుల కలకలాలాప వ్యాకులిత దివ్యోద్యాన శత సహస్రావృతంబై నిజపరిసరోర్వీరాజమాన బృహద్వన బృందావన గోకుల గోవర్ధనాది భగవదభిమతారామధామ గ్రామాభిరామభూమంబైన మధురాపురి లలా మంబుమాడ్కి స్వసన్నిహిత కేశవాది చతుర్వింశతి వ్యూహాధిష్టిత సాంతానికలోక సంకలితంబై సకలోపనిషత్ప్రతిపాద్యంబైన శ్రీవైకుంఠనగరంబు డాసి నానావిధ ధ్వజపతాకాద్యలంకృతం బగు శ్రీవైకుంఠద్వార గోపురంబునకుం జోహారుం జేసి తనచే నభివందితులగు జయవిజయాది ద్వారపాలకుల స్నేహగర్భ కరుణాకటాక్ష వీక్షణంబుల బహూమతుండై యద్దివ్య నగరంబు సొచ్చి యస్పృష్ట సంసార గంధులగు శ్రీ విష్వక్సేన వైనతేయాది నిత్యసిద్ధు లాత్మీయ దివ్యభవనంబులకుం

దోడ్కొని చని తమతమ దివ్యమహిషులం గూడి యర్ఘ్యపాద్యాసన గంధమాల్యనీరాజనాది విధులం బూజింప సంతసించుచు వారలతోడం గూడి విచ్చేయుచు నెదుర్కొను నిత్యముక్తులం గని భక్తిపూర్వకంబుగాఁ బ్రణమిల్లి వారలచే సమ్మానితుండై చని యప్పురమధ్యంబున దివ్యరత్నశిలాశకల సంకలిత మహోన్నత ద్వాదశప్రాకార పరివేష్టితంబై దివ్యశుకపిక శారికామయూరాది వివిధవిహగ విచిత్ర మధురరవాకీర్ణ శాఖోపశాఖకల్పద్రుమాది నానా తరుషండమండిత దివ్యారామ శతాభిరామంబై మణిముక్తాప్రవాళకృత సోపానపఙ్క్తి విరాజితామృత రసోదకాభి సంచరత్క్రౌంచ కలహంసకారండవ చక్రవాకాదిశోభిత కమలకల్హార కైరవ నీలోత్పలాది సుగంధబంధుర వాపీకూపతటాక పుష్కరిణీ పరివృతంబై మందారప్రముఖ బృందారక తరుబృంద పుష్పసందోహ నిష్యందమానామంద మకరంద ప్రవాహపోప్లూయమాన మహానందకందళిత హృదయారవిందాత్మ సుందరీమిళిత పుళింద పురందరోద్గీయమాన దివ్యగాంధర్వ పరిపూరితంబై శ్రీమన్నారాయణలీలోపకరణ దివ్యమండప క్రీడాశైల శతసహస్రావృతంబై చందనాగురు పుష్పావగాహిత మందానిల సేవ్యమానంబై దివ్యరత్నస్తంభ శతసహస్రగుంభితంబై నిత్యముక్త పరిషన్నిషేవ్యమాణంబై యత్యుచ్ఛ్రితంబై యతి విలాసంబై యత్యాశ్చర్యకరంబై యానందమయంబైన తిరుమామణి మండపంబు సేవించి భక్తిపూర్వకంబుగా సాష్టాంగప్రణామం బాచరించి యద్దివ్యమండప మధ్యభాగంబునందు నానావిధ దివ్యపుష్ప విచిత్రిత మహత్తర దివ్యయోగ పర్యంకంబునం దనంత భోగిభోగంబునఁ జామరగ్రాహక విమలాదిశక్తిమయాష్టదళ పుండరీక కర్ణికాసనంబుపై రజతశైల శిఖరంబునఁ బఱ మెఱుంగులఁ బెనంగు నీలమేఘంబు తెఱంగున శ్రీభూనీళాదివిలాసవతీ లలామంబులతో సుఖాసీనుండై యనర్ఘ్యరత్నకిరీటమకుట చూడావతంస మకరకుండల గ్రైవేయకహార కేయూరకటక కటిసూత్రముక్తా దామోదరబంధన పీతాంబరసింజాను మంజుమంజీరాద్య పరిమిత దివ్యభూషణ భూషితుండై శ్రీవత్స వైజయంతీ వనమాలాలంకృత లక్ష్మీసంలక్షిత వక్షస్థలుండై మందస్మిత సుందర వదనారవిందుండై నిత్యసూరి పరిషన్నిషేవ్యమాణ శ్రీపాదపద్ముండై యస్థానభయశంకితాంక మూర్తిభూత శంఖచక్రాది దివ్యాయుధోపాస్యమానుండై యున్న భగవంతుండైన నారాయణునిం గనుంగొని సమస్తపరివారాయ శ్రీమతే నారాయణాయ నమో' యనుచు ఫాలస్థలంబులఁ గేలుఁదమ్ములం గీలించి తత్కటాక్షవీక్షణామృతాప్యాయిత నిజస్వరూపుండై తదనుజ్ఞాతుండై హర్షప్రకర్షంబుచేతఁ 'బాదేనాధ్యారోహతి' యను శ్రుతిసూక్తి క్రమం

బుగాఁ దత్పాదపీఠంబునందు నిజాంఘ్రితలం బునిచి యంచితంబగు శేషపర్యంకంబుపై నెక్కినఁ జిరకాలప్రవాసంబు చేసి వచ్చినపుత్రునిం గని తల్లిదండ్రులు హర్షించు గతి సంతసించి 'యంకేభరత మారోప్య' యనుక్రమంబున నమ్మహాత్ముని నిజోత్సగంబుపై నుంచి గాఢాలింగనం బాచరించి నిజ దివ్యలీలాలాపామృతాస్వాద పరిబృంహితుం జేసి శ్రీదేవికిం గనిపింప నద్దివ్యమహిషియుఁ గంస వధానంతరంబునఁ దన సమీపంబున కేతెంచు శ్రీరామకృష్ణులం జూచి హర్షించు దేవకీదేవి చందంబున నాత్మ స్తన్యామృతంబు స్రవియింపఁ బుత్రస్నేహంబుచే నిజాంకంబునం దునిచి శిరం బాఘ్రాణించి యాలింగనం బొనర్చి కృతార్థునింజేసి తత్తదవస్థోచిత భగవత్కైంకర్యంబులయందు నియోగింప నతం డట్లొనర్చుచు నవిభిన్నభగవదనుభవజనితానందాబ్ధిమగ్న సర్వావయవుండై సుఖం బుండె నంత.

సీ. చోళపురాంతిక,క్షోణి నాథమునీంద్రుఁ, డాచార్యపదపద్మ • మందె ననుచు
విని పుండరీకాక్ష,విద్వచ్ఛిరోమణి, కురుహావలప్ప న,గ్గురువరేణ్యుఁ
డీశ్వరమునితోడ • నేఁగి తచ్ఛరమది,వ్యశరీర మీక్షించి • యార్తిఁ జెంది
సద్బ్రహ్మమేధసం,స్కార మగ్గురున కీ,శ్వరమునితోఁగూడి • నలిపి మగిడి

తే. వీరనారాయణపురంబుఁ • జేరి యచట, నతని కవశిష్టకృత్యము • లాచరించి
యుచితవృత్తులవా రంద,ఱుండి రనుచు, వాదిభీకరగురుఁ డనె,మోద మలర.

## ఉయ్యకొణ్డా రనంబడు శ్రీ పుండరీకాక్షుల వైభవము

ఉయ్యకొణ్డారు - త. శ్లో॥ చైత్రమాసే కృత్తికాయా ముదితం సద్గుణార్ణవమ్।
శ్రీనాథముని సచ్ఛాత్రం పుణ్డరీకాక్ష మాశ్రయే॥

మణక్కాల్‌నంబి - త. శ్లో॥ మాఘే మఘాయాం సమ్భూతం శ్రీరామగురుసత్తమమ్।
పుణ్డరీకాక్షపాదాబ్జచఞ్చరీక మహం భజే॥

శ్లో॥ అయత్నతో యామున మాత్మదాస మలర్కపత్రార్పణ నిష్క్రియేణ।
యః క్రీతవా నాస్థియౌవరాజ్యం నమామి తం రామ మమేయసత్త్వమ్॥

సీ. మును నాథముని యందు•ఘనయోగధారణ, నలుపుచుండెనా,సదనమునను
గురుహావలప్ప య•గ్గురుఁడు యోగాసక్తి, నుండె నా శ్రీనాథ•యోగికరణి
నంత శ్రీపుండరీ•కాక్షదేశికమణి, దర్శనస్థాపన•దక్షుఁ డగుచు
శ్రీనాథమునిపదా•శ్రితులతో నుభయవే,దాంతకాలక్షేప • మాచరింపఁ

తే. జూచి శ్రీరామమిశ్రాది సూరు లేవు, రాశ్రయించిరి తచ్చరణాంబుజముల
నతఁడు వారికిఁ దెలిపెను, హితములనుచు, వాదిభీకరగురుఁడనె మోదమలర.

వ. అట్లేగు రాశ్రయించిన వారికిం గొన్నిదినంబు లప్పుండరీకాక్షగురుండు తత్త్వహిత
పురుషార్థ ప్రతిపాదకంబు లగు వేదాంతార్థంబు లానతిచ్చుచుండె నంత. 53

సీ. అనఘ యాండాళమ్మ యాత్మీయగురుపత్ని, తిరునాటి కరిగె నా దివసముసుత
యార్యునింట వసించి యతనికి భక్తితోఁ బరివర్య పండ్రెండు వత్సరములు
సేయుచు నొకనాఁడు శ్రీరామమిశ్రులు, తన గురుపుత్రికాద్వయము సరసి
కవగాహనార్థమై యరుగంగఁ దోడేఁగి, వారినిఁ గూడి తా వచ్చుచుండ

తే. గాఢతరకర్దమం బగు కాల్వ యొకటిఁ జూచి పదపల్లవములందుఁ జొనుపవెఱచి
కాల్వదరి నుండి రగ్గురుకన్య లనుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర

వ. అంత. 55

సీ కాల్వ కడ్డము కట్ట గట్టినగతిఁ దన తిరుమే నునిచి రామదేశికుండు
యత్తికలార యీ యనుజునిమూఁపునం, దడుగునెత్తమ్ముల నాని కుల్య
దాఁటి పొం డని పల్క ధన్య లాకన్య లం, ట్లాచరించి నిజాలయంబు సొచ్చి
యమ్మహాత్మునికృత్య మంతయుఁ దండ్రికిఁ జెప్పిన విని సంతసించి యతఁడు

తే స్వపదపద్మము తలసోఁకఁ జాఁగిమ్రొక్కు రామమిశ్రులయం దనుగ్రహమెసఁగ
మంత్రరత్న మొసంగెను మగిడి యనుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

సీ అంతఁ గొన్నిదినంబు లైనమీఁ దొకనాఁడు, పుండరీకాక్షగురుండు రామ
మిశ్రుల కనె నింక మీఁద నీ వీదర్శనము నిర్వహించుము నాథమునికిఁ
బౌత్రుఁ డీశ్వరమునిభార్యయం దుదయించు, యమునత్తురవ నని యతనికాఖ్యఁ
జేసి సర్వహితోపదేశ మీ వాతని, ననుసరించుచు నైన నాచరింపు

తే. మార్యశాసన మిది వీని కబ్బదాయె, నయ్య యిది సేయు మీపని యానతిచ్చి
శ్రీమదార్యాంఘ్రిపద్మముఁ జెందెననుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

## ఆళవందారుల వైభవము

ఆళవందార్ల. త. శ్లో॥ శుచౌ మా స్యుత్తరాషాఢాజాతం యామునదేశికమ్।
శ్రీరామమిశ్ర పాదాబ్జచఞ్చరీక మహం భజే॥

శ్లో॥ శ్రీరామమిశ్రసచ్ఛిష్యం వన్దే తత్త్వార్థకోవిదమ్।
వాదా దవాప్తరాజ్యాద్యో విరక్తో యామునోఽభవత్॥

శ్లో॥ సింహాసనాంశభవ మీశ్వరయోగిసిన్ధు
ముక్తామణిం మహితనాథమునీన్ద్రపౌత్రమ్।
ప్రజ్ఞావిశేషజలధిం ప్రతివాదితూల
జఙ్ఝానిలం హృదయ చిన్తయ యామునార్యమ్॥

సీ. స్వగురుసంశ్లేషము • సైఁప నోపక రామ, మిశ్రు లార్యులతోడ • మిగుల వగచి
యతనికి బ్రహ్మమే • ధాఖ్యసంస్కారాది, చమత్కృత్యము లన్ని • సలిపి యంత
దర్శననిర్వాహ • తత్పరుఁ డై ద్రావి, డాగమార్థము రహ • స్యత్రయార్థ
మతుల మౌ బ్రహ్మసూ • త్రార్థ మాశ్రితులకుఁ, దెలుపుచు నుండెన • ద్దేశికేంద్రుఁ

తే. డంత నీశ్వరమునిదేవి • కయ్యె గర్భ, మఖిలసుజనుల కానంద • మతిశయింప
నెలలు నిండారె వరుస నా • నెలఁత కనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర

వ. అంత. 59

సీ. ఆషాఢమాసోత్త • రాషాఢతారయం, దీశ్వరముని కుద • యించెఁ బుత్రుఁ
డన విని హర్షించి • యతనింటి కేతెంచి, యమ్మహాత్మునిచేత • నర్భకునకు
జాతకర్మము చాలఁ • బ్రీతితోఁ జేయించి, శ్రీనాథముని ముందు • చెప్పినట్లు
పురుటివాసరములు • జరగినమఱునాఁడు, యమునత్తురవ రని • యాఖ్యఁ జేసి

తే. విష్ణులక్షణసంస్కార • విధి యొనర్చి, శిశువుకుడిచెవి మంత్రముల్ • చెప్పి రామ
మిశ్రు లరిగిరి సుజనులు • మెచ్చ ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర

వ. అంత. 61

సీ. నయ మొప్ప సుతున క • న్నప్రాశనముఁ జౌల, ముపనయనాదుల • నుచితకాల
ములయందు నీశ్వర • ముని చేసి సుతిథి వే, దాధ్యయనారంభ • మాచరించి
సంత యొక్కటి చెప్పఁ • జదివెను దనసహా, ధ్యాయులతోడ న • ద్దారకుండు
మఱునంత చదువక • మరల నిదే మని, యడిగినఁ దండ్రికి • ట్లనియెఁ దనయుఁ

తే. డార్య చెప్పినదేచెప్ప•నది వచింపఁ, ననిన మును చెప్పినది పల్కు•మనినఁదనకుఁ
జెప్పిన ట్లంత వచియించెఁ• జెఱుతఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె• మోదమలర.

సీ. ఆమేధఁ గని తండ్రి • హర్షించి సుతునకు, వినిపించె నొకసారి • వేదములను
న ట్లధీతామ్నాయుఁ • డై తండ్రికడ నతం, డర్థశాస్త్రత్రయ • మధికరించి

వాగీశ్వరునిగతి • వక్తయై విలసిల్ల, నతనికిఁ గల్యాణ • మాచరించి
తండ్రి యీశ్వరముని • ధరఁ గొన్నియేం డ్లుండి, లలితవైకుంఠ మ • లంకరించె

తే. నంతఁదండ్రికి బ్రహ్మమే • ధాదిసకల, చరమకైంకర్యములు యథా • శాస్త్ర మాచ
రించి యామునముని వాసి • గాంచె ననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. అంతఁ గొన్నాళ్లకు • యామునార్యుఁడు మహా, భాష్యభట్టరుకడఁ • బ్రతిభమీఱఁ
బాతంజలోక్తిప్ర • పంచ మంతయు శాంతి, సలుపుచునుండ నా • సమయమందు
నిలఁ జోళరాట్పురో•హితుఁ డాక్కియాళ్వాను, దశబంధ మిమ్మని•తరువు కానిఁ
బంచినఁ గని మహా • భాష్యభటార్యుఁడు, మౌని యై పవళించె • మందిరమున

తే. నతనినేమిడియనియాము•నార్యుఁడడుగ, స్వాంతగతమంతయాముని•చార్యులకును
బలికె నిట్లు మహాభాష్య • భట్ట రనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఆక్కియాళ్వానని • యాఖ్య గాంచినవాఁడు, సర్వజ్ఞమాని దు • స్తంత్రపరుఁడు
కుమతి విద్వజ్జన • కోలాహలుఁడు సద్వి, రోధియు రాజపు • రోహితుండు
చోళమండలపండి • తాళిచే దశబంధ, మార్జించుచు మనల • నడుగ వీనిఁ
బంచినాఁ డని మహా • భాష్యభట్టరు పల్క, విని యామునార్యుఁడు • వీఁకఁదరువు

తే. కానిచేఁ బత్త్రికను గొని • తానె చదివి, వాఁడు చూడంగనదిచించి • వైచెనంత
వాఁడు సని కనెనాక్కియా • ళ్వాను ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. వాఁ డేఁగి యాక్కియా • ళ్వాను కావృత్తాంత, మంతయుఁదెలిపిన • నలిగియతఁడు
పలికె ని ట్లని మహా • భాష్యభట్టరు నమీ, చీనశాస్త్రార్థవి • జ్ఞానఘనుఁడు
శాంతుఁ డాతనికడఁ • జదువుచు నొకబాలుఁ, డస్మదాజ్ఞను మీఱె • నతఁడు కవియొ
విద్వాంసుఁడో పోయి • వేగ విచారించి, వచ్చి వాక్రువ్వుమా • వార్త మాకు

తే. ననుచు రాజపురోహితుం • డనివాఁడు, మగిడిచని యామునార్యుని • దగభజించి
యడిగె ని ట్లని భయభక్తు • లమర ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర

వ. మహాత్మా నేనుజోళరాజపురోహితుండగు విద్వజ్జనకోలాహలుండు భవత్సన్నిధికిం బుత్తెర నేతెంచినవాఁడను నీవు కవీంద్రుఁడవో తంత్ర పారావారపారంగతుం డవో తెలియ నానతిచ్చిన నారాజపురోహితునకుం జెప్పెద నని విన్నవింపనా కర్ణించి యావిద్వత్పురందరుండు మందస్మిత సుందరవదనారవిందుండై, శ్లో॥ నవ యం కవయస్తు కేవలం నవయం కేవలత న్త్రపారగాః। అపితుప్రతివాదివారణ ప్రకటాటోపవిపాటనేక్షమాః॥ అను శ్లోకంబు లిఖియించి యాపత్త్రిక రాజ

పురోహితునకుం గనిపింపు మని తత్పత్రిక నతని కొసంగ వాఁడది గొని చని యప్పురోహితున కీయ నతం డీక్షించి రాజునకుం జూపియతండు ప్రబలపండితుం డతని నిచ్చోటికిం బిలిపింపు మనిన నచ్చోళమండలేశ్వరుండును 'వేగ నీవిచ్చోటికిర' మ్మనియొక యాజ్ఞా పత్త్రికఁ బంప నమ్మహామేధావియుం దొంటిచందంబున నమ్మనుష్యబృందార కేశ్వరుని యాజ్ఞాపత్త్రికయుం జించివైచినం జూచి వాఁడతిరయంబున నేతెంచి యావృత్తాంతం బంతయు నమ్మహీజానికిం దత్పురోహితునకుం జెప్ప వినియారాజాత్మగతంబున నిజయోగ వైభవావగతపరాపరవస్తుయాథాత్మ్య జ్ఞానసంపన్నుం డగుశ్రీనాథమునికిం బౌత్రుండును బ్రహ్మవిదగ్రగణ్యుం డగు నీశ్వరమునికిం బుత్రుండునైన యామునాచార్యుండు సకలసజ్జన సభాసంభావనీయ ప్రభావుండుగాని సామాన్యుండు గాఁడని తలంచియమందదృగానంద సంధాయకాతి సుందరాందోళికం బంచి నిజమందిరంబున కగ్గోవిందప్రియుని రావించి యభ్యుత్థానాభివందనాదుల నర్చించి యుచితాసనంబున నుంచి సముచిత సంభాషణంబులు సల్పుచున్న సమయంబున విప్రకులాలంకారభూతుండగు నక్కుమారు నీక్షించి యా రాజపురోహితుం డితనికి మీమాంసాశాస్త్ర పరిశ్రమంబు గలదో లేదో యని సంశయోక్తులం బలుక నాలకించి యమ్మహాత్ముం డొక తాళపత్త్రంబుపై, శ్లో॥ ఆశైలాదద్రి కన్యాచరణ కిసలయన్యాస ధన్యోపకణ్ఠా, దారక్షోనీత సీతాముఖ కమల సముల్లాసహే తోశ్చసేతోః। ఆచప్రాచ్యప్రతీచ్య క్షితిధరయుగళా దర్కచన్ద్రావతంసా,న్మీమాంసాశాస్త్ర యుగ్మశ్రమమృదిత మనామృగ్యతాం మాదృశోన్యః॥ అని యనవద్యంబుగా నొక పద్యంబు రచియించి లిఖియించి యిచ్చినం జూచి యప్పురోహితుండు గరం బలిగి యీ ప్రౌఢబాలకుండు సాహసప్రియుండు నఖర్వగర్వపర్వతారూఢుండుఁ గాన హిమవత్సేతు సూర్యసోమావతంస ప్రాచీన ప్రతీచీన శైలాంతరాళ భూగోళాలంకారభూత మనీషిమండలంబునం దనకు దీటగు కర్మబ్రహ్మ మీమాంసాశాస్త్ర యుగ్మశ్రమమృదిత మనస్కుండగు దండిపండితుం డన్యుం డన్వేషణీయుం డని యీ శ్లోకంబు లిఖియించి యిచ్చె నస్మదీయాబాధిత ప్రమాణతర్కశస్త్రచ్ఛటా ప్రహరణంబులఁ బరవాదుల జయించి శిరస్తాడనం బొనర్చుచున్నవాఁడ నట్టి నాకు మూఁడుమాటల కాఱుతప్పులు వచియించు నిద్దారకుని జయించు టెంతపని యని యధిక్షేపోక్తులం బలుకుచున్న యమ్మనీషిమానినిం జూచి స్వకీయజిహ్వాగ్ర దివ్యసింహాసనాసీన హయగ్రీవదేవుండును బ్రతివాది కుతర్కకోలాహలాతులతూల జాలాభీల ఝంఝూనిలాయమాన బలవత్ప్రమాణ తర్కానుగ్రాహకాగాధ బోధమేధా ప్రతిభాది కమనీయగుణకలాప కలితుండు నగు

యామునార్యుండు మదీయాంతరంగం బసాక్షిక ప్రసంగంబున కుత్సహింప దనిన విని యబ్భూపాలతిలకుండు చోళమండలంబునం గల దండిపండితులం బిలువం బంచి యగ్గురునిం దగు బసకుం జనుమని విన్నవించి యా సభాసదుల వర్జించి నిజాంతఃపురంబునకుం జనుదెంచి యుదంచిత కాంచనపర్యంకం బధిష్ఠించి తన మహిషినిం బొడగాంచి యా వృత్తాంతం బెఱింగించిన నాలకించి హర్షించి యద్దేవి సర్వజ్ఞుం డగు యామునార్యుం డెట్టి విశేషజ్ఞులకైన నజేయుండు మన పురోహితుం డమ్మహాప్రాజ్ఞుని జయించెనేని మృగయావినోదార్థంబు మన యింటం బెంపంబడు పంచాననోదారసారంబు లగు సారమేయంబుల కామిషజుషదాహార ప్రదానాది విహీనకృత్యంబుల నొనర్చెద నని విన్నవింప విని యమ్మూర్ధాభిషిక్తుండు సర్వతంత్రాభిజ్ఞుం డయిన యస్మత్పురోహితుని యామునాభిధాన వైష్ణవ కుమారుండు జయించెనేని యమ్మహాత్మున కర్ధరాజ్యం బిచ్చెద ననియె. అట్లా రాజదంపతు లిరువురుం బంతగించి రంతం జోళదేశీయ విద్వద్వరేణ్యు లేతెంచిన నెఱింగి యమ్మహీవల్లభుండు నిజవల్లభతో సముచితసత్కారంబుల వారి నర్చించి మణిసువర్ణ విచిత్రప్రభాభాసురంబగు సభామంటపంబున గురుమంత్రి పురోహితాభిజ్ఞ ద్విజాదిపరివృతుండై పేరోలగం బుండి దివ్యతర తిరస్కరిణీ పరివృతాదూర స్ఫార రత్నమంటపంబున స్వకీయ సహచరీవర్గంబుతోఁ దనదేవి యుండి నిరీక్షించుచుండ మణిమయంబగు చతురంతయానంబుఁ బంచి యామునాచార్య వర్యునిం బిలిపించి యభ్యుత్థానాభివందనాది సముచితసత్కారంబు లాచరించి యర్హణీయాసనంబుఁ జూప నగ్గురుశేఖరుం డందు సుఖోపవిష్టుండై యుండె నంత. 67

సీ. మాధ్యస్థ్య మొనరింప • మాసభ కేతెంచి, విద్వాంసు లున్నారు • వీరు వినఁగ
యామునాచార్య నీ•వాక్కియాళ్వానుతోఁ, దర్కింపు మాత్మవా•గ్ధాటిమీఱ
నని రాజు పల్కిన • యామునార్యుఁడ,య్యాక్కియాళ్వాని కి•ట్లని వచించె
వేదశాస్త్రములందు • వివిధవిద్యలయందు, మనము తర్కించితి • మా జయాప

తే. జయము లేర్పడఁ దడవగు • శపథమొకటి, చేసికొన్నను మేలని, • చెప్పి యతని
కనియె నీరీతి నయ్యాము•నార్యుఁ డనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. ముద మొప్ప నేనాడు•మూఁడుమాటల కాఱు, తప్పులఁ జెప్పంగఁ • దగుదునీవు
నేఁడు మాటలు మూఁడు • నీవాడినను వాని, కే నాఱుతప్పుల • నెంచెద నన

విద్వాంసు లామాట • విని సంతసించి ర,య్యార్కి-యాళ్వానిట్టు • లనియె నతని
కార్యకుమార నీ • వంద జాకర్ణింప, మూఁడుమాటలఁ బల్కు • మొదటననిన
తే. యామునాచార్యు లామాట • లాలకించి, లౌకికాలౌకికాభిజ్ఞ,లాలసీయ
దివ్యసూక్తిత్రయం బాన,తిచ్చి రనుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర.
సీ. వసుధ యుష్మన్మాత • వంధ్య గా దీరాజు, ధర్మాత్ముఁ డీతని • ధర్మపత్ని
పరమపతివ్రత • పరఁగ నీమూఁడుమా,టల కాఱుతప్పులఁ • బలుకు మనిన
నొక మాటకైనఁ బ్ర•త్యుత్తర మిడ లేక, కోఁతలఁ బెటికిన • క్రూరసర్ప
మట్ల మూర్ఛిల్లుచు • నవనతాస్యం డగు, ప్రతివాది కిట్లని • పల్కె గురుఁడు
తే. ఆహితాగ్నివి రాజపు,రోహితుఁడవు, స్థవిరుఁడవు గాన నీశిర,స్తాడనంబు
సేయ నని యామునార్యుఁడు • చెప్పె ననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.
సీ. ఆమాట విని మెచ్చి•యామునార్యుని సభా,స్తారులు బ్రహ్మర•థంబుఁ బూని
యర్పింప నది చూచి • యవనిక వెల్వడి, చోళరాట్పత్ని య,బ్బాలకవిని
దయ 'నెన్నె యాళవం•దా రివ, రని పల్కి,యెత్తుక లోపలి • కేఁగుకతన
నాళవందా రని • యామునగురునకు, నామధేయం బయ్యె • నాఁటనుండి
తే. సత్యసంధుఁడు చోళరా,జన్యమౌళి, యమ్మహాత్మున కర్ధరా,జ్యం బొసంగి
యతనిదేవిని బిలిపించె • నచటి కనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.
సీ. అర్ధరాజ్యముఁ జెంది • యామునగురుఁ డాత్మ, పత్నీసమేతుఁడై • భవ్యభౌమ
భోగానుభవ మొంది • భూమిఁ బాలించుచు, నున్న వాఁడనివిని • యుత్సహించి
నర్తనమొనరించి • నయమొప్పఁజను దెంచి, యామునార్యునిమణి•హర్మ్యపఙ్క్తిఁ
గాంచి హర్షించి త • త్కాంచనతోరణ, ద్వారముకడఁ దన్ను • ద్వారపాల
తే. కులు నిరోధింప శ్రీరామ • గురువరేణ్యుఁ, డంచితోక్తులు కొన్ని వ • చించి వారి
మంచితనమునలోఁజొచ్చి • మించెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.
సీ. మితభాషి శ్రీరామ • మిశ్రదేశికుఁడు శ్రీ, నాథపౌత్రునిమహా • నసముఁ జెంది
యందు వైష్ణవులతోఁ • బొందుగా భాషించి, యీశ్వరమునిపట్టి • కెయ్య దిష్ట
శాక మం చడిగిన • సతత మలర్కశా, కం బని ప్రతివచ • నంబు వారు
చెప్ప నాకర్ణించి • శ్రీరామదేశికుఁ, డాములుచ్చిఁతశాక • మాఱునెలలు
తే. దెచ్చి యిచ్చిన యామున • దేశికుండు, హరినివేదిత మాశాక • మారగించి
తలఁపఁ డాయెను శాకప్ర • దాత ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. అట్లాఱుమాసము • లాశాకమొసఁగుచు, యౌవరాజ్యస్థితు • యామునార్యుఁ
గనలేక యాగురు • గ్రామణి నాలుగు, దినము లాశాకముఁ • దేక యున్న
నారగించెడువేళ • యామునేయగురుండు, తిరుబోన మొనరించు • దేశికులను
నాశాక మేల లే • దని యడిగిన నొక, యతివృద్ధవైష్ణవుఁ • డాఱునెలల

తే. నుండి యాశాకమర్పించు•చుండి యిప్పు, డతఁడు దెచ్చినవాఁడుగాఁ•డది మహాత్మ
యనుచునతనికిఁ బలికి ర • య్యార్యులనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఆవాక్య మాలించి • యాశ్చర్యపడి యాము, నార్యుఁడు వారి కి • ట్లనియె మగిడి
యీసారిమనయింటి • కాసూరి వచ్చెనా, మా కెఱింగింపుఁడీ • మాంద్య ముడిగి
యనుచుయామునముని•యానతిచ్చినయంత, మఱునాఁడుశ్రీరామ • గురుడుఁమదిని
నీప్రొద్దుమాత్ర మి • ట్లిచ్చెద నని యెంచి, తెచ్చి శాకము వారి • కిచ్చె నంత

తే. వారుచెప్పినయామున • సూరి వచ్చి, యమ్మహాత్మునిఁ గని మ్రొక్కి • యర్చచేసి
యతినయోక్తుల నతని కి • ట్లనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర

సీ. సాధుసత్తమ భవ • చ్చరణాబ్జరజ మూని పావనంబయ్యె మా • భవన మంత
శాంతిభూషణ నీదు • చరణాబ్జసేవచే, ధన్యుల మైతిమి • ధరణి మేము
నైనను నామది • నానంద మొందదు, వాసిగా మీపని • చేసికాని
కావున మీశుభా • గమనప్రయోజన, మానతిం డని యాము • నార్యుఁ డడుగ

తే. నతనివినయోక్తులకుఁజాల • హర్ష మొంది, కరుణతోడుత శ్రీరామ • గురుఁడతనికిఁ
దనయభీష్టముఁ దెలుపంగఁ • దలఁచెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర

సీ. వత్స నీపాలికి • వసుపశుక్షేత్రాది, వాంఛచే వచ్చిన • వాఁడఁ గాను
నీపెద్ద లొకచోట • నిస్సమాభ్యధిక మౌ, నిధిఁగనుఁగొని యది • నీకుఁ జూపు
మని వీనితోఁ జెప్పి • యానందపదమున, కరిగినా రది మాకు • హస్తగతము
కావున నీ కది • కానిపించెద రమ్ము, వచ్చినదనుక నీ • ద్వారరోధ

తే. నంబులేకుండమాకీవొ • నర్చ మఱిన, నట్లు గావించె నతని క • య్యార్యుఁ డంత
వచ్చుచుండెను నగ్గురు • వర్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. యామునార్యుఁడు గీత • లష్టాదశాధ్యాయ, ములు రామమిశ్రుల • వలనఁ బడసి
తదుపపాదితతత్త్వ • దర్శనైకోపాయ, ముండెనా యది వీని • కొనఁగు మనుచు
నడిగినఁ జరమార్థ • మతని కయ్యార్యుఁడు, దెలిపినఁ దెలిసి య • ద్దేశికుండు
శాలిసస్యము జల • శాలియై పా లూని, పండి తా నొఱగిన • పగిది సుగుణ

తే. రాజినమ్రతఁగాంచి శ • రణ్యపాద, కమలరుచిమించి యితరసం • గములఁద్రుంచి
గురునితోఁ రంగపదమున • కరిగె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. గుడి కేఁగి యతని క • గ్గురుఁడు శ్రీరంగరా • ట్పదపద్మములఁ జూపి • పల్కె నిట్లు
మహి భవత్పితృపితా • మహలబ్ధ మీనిధి, జ్ఞానదారిద్ర్యైక • శామకంబు
నీనిధి గలవాని • నేఁ బ్రొద్దు వరియించు, ముక్తికన్యక తానె • ముదముఁ జెంది
యీశ్వరమునిపుత్ర • యీనిధి దలఁపని, పాపిజన్మము భూమి • భారకరము

తే. ఇట్టిసేవధిఁ గనుఁగొన్న • దిట్ట తొల్లి, యెట్టివాఁడైన హరికిఁ జే • పట్టఁ దగిన
వాఁడనుచుఁబల్కెనయ్యార్య • వర్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. శ్రీరంగనాథుని • శ్రీమూర్తి భక్తితో, నాపాదమస్తక • మనుభవించి
యిట్టిదివ్యామృత • మెఱుఁగ కేవెట్టినై, మట్టిఁ దింటిని యింత • వట్టు ననుచు
ననుతాపమొందె శ్రీ • యామునేయగురుండు హరిపదాబ్జములందు • నాత్మ నిల్పి
క్షేత్రమిత్రకళత్ర • గృహపుత్రధనముఖ, ప్రతికూలవస్తుప్ర • పంచ ముడిగి

తే. సన్న్యసించి యథావిధి • సాత్త్వికాళి, కాటపట్టైనరంగము • నందు రామ
గురునితోఁ గొన్నిదినములు • జరపె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ, అయ్యవసరంబునఁ బెరియనంబి తిరుక్కోట్టియూరునంబి పెరియ తిరుమలనంబి మాఱనేరినంబి తిరుకచ్చినంబి యాళవందారాళ్వాన్ తిరువరంగప్పెరుమాళరయర్ తిరుమాలై యాండాన్ వానమామలై యాండాన్ దైవవారియాండానీశనాండాన్ జియ్యరాండాన్ తిరుక్కురుహూరప్పన్ తిరుమోహూరినిన్నార్ తెయివప్పెరుమాళ్ వకుళాభరణ సోమయాజియార్ తిరుక్కురుహూర్ దాసర్ తిరుమాలిరుంజోలై దాసర్ వడమధురప్పిరందారాళ్ కొండి యమ్మంగి యనుదివ్యనామంబులు గలబ్రహ్మవిత్తము లాళవందారి తిరువడిత్తామర లాశ్రయించి యమ్మహాత్మునివలన సకలహితంబులు లభియించి దర్శన ప్రవర్తకులై యుండి తొల్లి తిరునగరియందు శ్రీపరాంకుశదాసుండు నిజపితామహున కొనరించిన యుపకారంబు దలంచి యామునముని నిజశిష్యాగ్రగణ్యుం డగు పెరియనంబికి శ్రీపరాంకుశదా
సుండని దాస్య నామంబుగావించె నాసమయంబున 81

సీ. యుష్మత్పితామహుం • డొకరహస్యార్థము, కురుకావలప్పఁ డ • గ్గురునికడను
నుంచి నీ కది యెఱిఁ • గించు మంచు విధించి, పరమపదంబున • కరిగెఁ గాన

నమ్మహాత్మునికడ • కరిగి నీ వాగోప్య, మభ్యసింపుము యాము • నార్యయనుచు
శ్రీరామమిశ్రులు • చెప్పిన విని యాళ, వందా రతని కొక్క • వాక్య మనియె

తే. స్వామి దేవరవారి కా • సంప్రదాయ, మేల లే దాయెనది వీని • కెఱుక పఱుపు
మనిన విని యాతఁ డతని కి • ట్లనియె ననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర

సీ. భువి మద్గురుం డగు • పుండరీకాక్షున, కష్టాంగయోగర • హస్య మొసఁగఁ
దలఁచినయుష్మత్పి • తామహుం డగునాథ, మౌని కి ట్లనియె న • స్మద్గురుండు
పీనుం గ టుండఁగాఁ • బెండ్లి యొనర్పంగఁ, జనునె శరీరావ • సానదశను
భగవత్స్వరూపాను • భవము విచ్ఛిన్నము, గాఁ గల్గుమీయను • గ్రహముఁ జేసి

తే. యనినఁ గురుహావలప్పని • కమ్మహాత్ముఁ, డారహస్య మొసంగె నీ • వతనివలనఁ
దెలియు మది యని యాసూరి • పలికెననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. అస్మదాచార్యుల • కారహస్యవిశేష, మట్లు చెంద నశక్య • మయ్యెఁ గాన
నది మాకు లే దాయె • నని రామదేశికుఁ, డాన తిచ్చిన విని • యామునార్యుఁ
డనియె ని ట్లని కురు • హావలప్పనికడ, కరిగి యోగరహస్య • మభ్యసించి
వచ్చెద ననుచు వా • క్రుచ్చి కోవెలయందు, సాత్త్వికు లగునిజ • సంశ్రితులకు

తే. భూరివేదాంతసూక్త్యర్థ • బోధమనిశ, మొసఁగుశ్రీయామునాచార్య • యోగివరుని
జూచి హర్షించె శ్రీరామ • సూరి యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. అయ్యవసరంబున మణక్కాల్నంబి తమతిరువడిత్తామరలయం దాశ్రయించిన మహాదేశికు లాళవందార్ తైవత్తిక్కరిశనంబి గోమరత్తు తిరువిణ్ణహరప్పన్ శిరిప్పిళ్లారుడయపిళ్లై వంగిప్పురత్తాచ్చి యనియెడు దివ్యనామంబులుగలవా రేవురు వారలకు దర్శనతాత్పర్య విశేషంబు లెఱింగించుచుఁ గొంతకాలంబు సుఖంబుండె నంత. 85

సీ. శ్రీరామగురుఁ డట్లు • చెప్పి నిజాంతిమ, దశ యామునేయత్రి • దండపతికి
నుర్విని గలనాథ • యోగిశేఖరునితో, నుభయసంబంధము • లుండుఁ గాన
తత్పదాబ్జయుగంబె • తంజ మంచుఁ దలంచి, నినుఁ బోలువిజ్ఞాన • ఘనుని నొకని
దర్శనస్థాపన • దక్షునిఁ గావించి, కలకాల మీరంగ • నిలయమునను

తే. జరపు మని చెప్పి శ్రీరామ • గురువరుండు పుండరీకాక్షదివ్యాంఘ్రి • పుండరీక
ములఁ దలంచుచుఁ జనియెను • ముక్తి కనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. ఏదివ్యపదమున • కేఁగుధన్యుఁడు దల్చు, స్వర్గాదిలోకముల్ • దుర్గతులుగ
వేదాంతవీధుల • విహరించుపురుషుని, సాయుజ్యమే తగు • సాత్త్వికులకు
నప్రమేయానంద • మాదివ్యలోకము, శ్రీరామగురుఁ డొంది • చెందె సుఖము
నంత నంతేవాసు • లయ్యాయమునార్యాదు, లాచార్యు నెడఁబాపి • యార్తిఁజెంది

తే. రంతవారలతోఁ గూడి • యామునార్యుఁ, డాత్మగురునకు బ్రహ్మమే • ధాదిసకల
చరమకైంకర్యజాతము • సల్పె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

యామునాచార్యులు కురుహావలప్పనికడ కరుగుట

సీ. అంత యామునగురుఁ • డార్యులతోఁ గురు, హావలప్పనియింటి • కరుగుదెంచి
పరమయోగసమాధి • భంగముగాకుండ, నడుగుచప్పుడు సేయ • కతనివెనుక
నున్నంతఁ దద్భవ్య • యోగసాక్షాత్కృత, దివ్యమంగళమూర్తి • దేవదేవుఁ
డతనిభుజంబులం • దంఘ్రిపద్మము లుంచి, యామునార్యుని జూడ • నడఁడెఱింగి

తే. లక్ష్మణార్యుఁడు శొట్టకు • లత్తినుండి, వచ్చియున్నాఁడు గాఁబోలు • వాఁడు గాన
వచ్చెఁగాకని యతఁడువా • క్రుచ్చెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఆసూక్తి విని యాము • నార్యుఁ డప్పనికను, మ్రోలకేతెంచి కే • ల్మోడ్చి పల్కెఁ
జప్పుడుసేయక • సామి యే నడుగుల, నిడి వచ్చి మీరున్న • యింటివెనుక
నున్న యీనన్ను నీ • కన్నులఁ గనుఁగొన్న, యట్లు మన్నించి ర • మ్మంటి రీర
లీవింత యేమొకో • యెఱుఁగలే నడియేని, కెఱిఁగింపఁదగునేని • యెఱుకపఱుపుఁ

తే. డనుచు యామునమునిపల్కు • నాలకించి, యొప్పమీఱంగఁగురుహావ • లప్పఁడతని
కనియె నిట్లని కనికర • మలర ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. గురుయోగధారణా • గోచరుఁ డగుహరి, నాతోడఁ గూడి యా • నంద మొందు
వేళ లక్ష్మీదేవి • లీలఁ దాఁ జందన, కాశ్మీరమృగమద • కలితమైన
కుచమండలంబుచేఁ • గ్రుమ్మినప్పటికైనఁ, దలఁపఁ డాసుఖ మేమి • తనదుమదిని
నట్టిదేవుం డిప్పు • డస్మద్భుజము లెక్కి, శుభగుణ నినుఁ దొంగి • చూచుచుండెఁ

తే. గానవీరాకనూహింపఁ • గలిగె మాకు, నిచటికేతెంచుపని యేమి • యెఱుకపఱుపు
మనుచు యామునముని కప్పు • డనియెననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. ఆపల్కు లాలించి • యక్కజపడి యాము, నార్యుఁ డీయోగర • హస్యమంత
దాసుని కెఱిఁగింపఁ • దగునేని యుపదేశ, మొనరింపు మనుచు న • య్యోగివరుని

యంఘ్రిపద్మముల సా • ష్టాంగ ప్రణామముఁ, గావింపఁ గ్రుచ్చెత్తి • గారవించి
యాచార్యపౌత్ర మా • యంతిమదశను నీ, కీరహస్యవిశేష • మెఱుకపఱచె

తే. దను మదీయాంతసమయము • తథ్యముగను, జెప్పెదను నీకునిర్మల•చిత్తవినుమి
యనుచు యామునమునికప్పు • డనియెననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ పొలుపార నేతెంచు • పుష్యమాసమునందు, గురుపుష్యయోగము • గూడినప్పు
డభిజిన్ముహూర్తము • నందు మద్గురుచర, ణారవిందమిళింద • మై సుఖింతు
నంతకు ముందు నీ • వరుగుదెంచితి వేని, యష్టాంగయోగర • హస్య మంత
చెప్పెద నని యొక • శ్రీముఖంబు లిఖించి, యర్పింప నది గొని • యామునార్యుఁ

తే. డాశ్రితులఁగూడియేతెంచి • యఖిలభువన•పావనం బగుశ్రీరంగ • పదముఁ జెంది
యుక్తతత్త్వార్థచింతతో•నుండె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. అంత శ్రీరంగనాథునకుం బ్రపన్నోత్సవంబు ప్రస్తుతంబై జరుగుచున్న కాలం బునఁ దిరువరంగప్పెరుమాళరయ రమ్మహోత్సవంబునందు భగవంతుండగు శ్రీరంగనాథుండు శ్రవణానందంబుగా నాకర్ణించుచుండ తిరువాయ్మొళి యభిన యించి పాడుచుండఁ గ్రమప్రాప్తంబగు 'కెడుమిడ రాయవెల్లా' మనియెడు తిరు వాయ్మొళియందు 'నడమినోనమర్గళుళ్ళీర్ నాముమక్కు-రియవ్వొన్నో' మనియెడు శ్రీసూక్తి తనకుం బశ్చాద్భాగంబున విలసిల్లుచున్న శ్రీయామునాచార్యు నీక్షించు చుఁ బలువగలం బాడియాడు చుండెనంత. 93

సీ. ఆదివ్యసూక్త్యర్థ • మరసి యామునముని, వకుళభూషణముని • వరున కిష్ట
దాసులయం దన్య • తముఁడనై తిరువనం, తపురంబునకు నేఁగఁ • దలఁపనైతి
బుద్ధిజాడ్యం బిది • పోయి వచ్చెద నిఁక, ననుచు రంగేశుని • యాజ్ఞఁ బడసి
స్వమరరక్షకుఁ దైవ• వారియాండా నను, నార్యసత్తము నుంచి • యచటినుండి

తే. తరలి కొన్నిదినంబుల • కరిగి తిరువ నంతపురమున శ్రీమద • నంతశయనుఁ
గృష్ణుఁ బొడగాంచె మూఁడువా • కిళ్ళనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర

సీ. తిరువనంతపురాఖ్య • దివ్యదేశమునందు, యామునార్యుఁడుకొన్ని•యహములుండి
కురుహావలప్పని • తిరుముఖపత్రికఁ, దెమ్మని సన్నిధి • దేశికులను
నడుగ వారది దెచ్చి• యమ్మహాత్మున కియ్య, నతఁడుగటాక్షించి • యరసిచూడఁ
బుష్యమాసము గురు • పుష్యయోగాదిక, మావేళనేకూడ • నతఁడు వగచి

తే. భగవదిచ్ఛను మాకుఁబు • ష్పకవిమాన, మబ్బెనాపోయియప్పని • నాశ్రయింతు
మనుచవాక్రుచ్చెనప్పుడ • య్యార్యుఁ డనుచు. వాదిభీకరగురుఁడనె, మోదమలర

వ. అష్టాంగయోగ రహస్యోపదేశ క్రమకలనంబు ఖిలంబైన నాఁటనుండి శ్రీయాము నేయగురుండు పూర్వాచార్యోపదేశపరంపరాప్రాప్త ప్రపదనమార్గం బనర్గళంబుగా నుత్తరోత్తరాభివృద్ధిఁ జెంది ప్రసిద్ధం బగునట్లు ప్రవర్తింపం జేసె నంత.

సీ. తల్లి దండ్రి హితప్ర • దాత దైవత మగు, తనగురు నెడఁబాసి • తైవవారి
యాండానుపాలెను • బాండుపత్రముభంగి, నదిపాండురుజయని • యార్యులెంచి
వైద్యులఁ బిలిపించి • వారి కాతనిఁ జూప. వా రొకవిషయాభి • వాంఛఁజేసి
కాని యీపాండిమ • గనిపింప దని పల్కి, ననఘ యీప్సితవిష • యంబు నీకుఁ

తే. దెలుపు మెయ్యది యనితన్ను • ధీరులడుగఁ, దైవవారిమనీషియా • ధార్మికులకుఁ
బల్కె నిట్లని తనయభి • ప్రాయమనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అస్మద్గురుండె మా • కభిమతవిషయము, గాని తదన్యము • నే నెఱుంగ
నని తైవవారిబు • ధాగ్రణి వచియింప, నాసూక్తి లాలించి • హర్ష మొంది
యొకతోట్లలో నంతి • మోపాయనిషుని, నమ్మహాత్ముని నుంచి • యార్యు లాని
గురుఁడున్నయెడకుఁ దో • డ్కొని చనుచుండ నా, తఁడు కొంతబడలిక • నుడిగినడచి

తే. వచ్చుచుండెను నబ్బుధ • వరులఁ గూడి, యంతయామునముని తిర్వ • నంతపురము
విడిచియేతెంచు చుండెను • వేడ్కనను చు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. యామునేయుఁ డనంత • ధాముని వీడ్కొని, గవ్యూతిమాత్రము • గదలి వచ్చి
వసియింప నాతైవ • వారియాండా నను, సత్త్వ సముద్రుఁ డ • చ్చటికి వచ్చి
యాఁకొన్నవాఁడు స్ని • గ్ధాన్నముఁ గన్నట్లు, స్వగురుని బొడగాంచి • నంతసించి
చాఁగిలఁబడి మ్రొక్కి • శక్తి చాలమిఁజేసి, యుర్వి లేవక పడి • యున్నయంత

తే యామునాచార్యమునివరుఁ • డతనిఁజూచి, యలుకనల్లనమపియ • దుఁ, బలుకరింపఁ
బలికె హేతుమదుక్తు లీ • పగిది ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. స్వామి స్వతంత్రుఁడు • శౌర్యవంతుఁడు గాన, నుంచినచోటనే • యుండె భరతుఁ
డట్ల స్వాతంత్ర్యశౌ • ర్యము లడియేనికిఁ, జాలవు గాన నీ • సరణి మీర
లుంచినచోటు వ • ర్జించి యేతెంచితి నన నతఁడు స్వరూప • హాని వచ్చె
నని దుఃఖపడి వివ • శాంగుఁడై యుత్థాన, శక్తి చాలక పడి • జడతఁ జెందఁ

తే. జూచి నన్ను స్వతంత్రుని • జూయనిగను. నీవు సేయంగ మది నెంచి•నావు చాలు
నయ్యనీస్నేహమనియె న • య్యార్యుఁడనుచు. వాదిభీకరగురుఁ డనె•మోదమలర

సీ. ఆర్యోక్తు లాలించి • య ట్లుండఁ దగ దని. చయ్యన లేచి యా • సాత్త్వికులకుఁ
గరపద్మములు మోడ్చి • గురునికన్మోగి నిల్వ. యామునగురునకి • ట్లనిరి బుధులు
స్వామి దేవరవారి • సాన్నిధ్య మెడఁబాసి. జలము వెల్వడినమ • త్స్యంబుపగిది
సత్త్త లభించెడు • సౌమిత్రిసముఁ డితఁ. డని తనసన్నిధి • యాస్య లనిన

తే. యామునార్యుఁడు తత్సూక్తు • లాలకించి. యమ్మహాత్మునిఁ గౌఁగిట • నప్పళించి
యాదరోక్తుల స్వాగత • మడిగెననుచు. వాదిభీకరగురుఁడనె • మోద మలర.

సీ. పాణితలంబునఁ • బలుమాఱతనిమూఁపు నివురుచుఁ బలికె నా • నిస్పృహుండు
వత్స న న్నెడఁబాసి • వాడితి వక్కటా, తల్లిని బాసిన • పిల్లఁడట్టు
లర్ధయోజనదూర • మగుతిర్వనంతపు, రం బల్లదే చూచి • రమ్ము వత్స
యని గురుఁ డన శిష్యుఁ • డతని కి ట్లనియెను, నరనుత యది మీక•నంతపురము

తే. నన్నెదుర్కొన్నదేనాయ•నంతనగర, మనుచు నతఁడుగ్గడింపన • య్యామునార్యుఁ
డరయ నిదియొకయధికార • మనియె ననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

వ. అంత. 103

సీ. ఆత్తైవవారిబు • ధాగ్రణి మొద లైన. యాశ్రితులను గూడి • యామునార్యుఁ
డరిగి శ్రీరంగము • నందు రంగేశుని, సేవించి బహుమతిఁ • జెంది వచ్చి
తనదుమఠంబున • ధన్యశరీరుల, కతులవేదాంతగు • హ్యార్థములను
బోధించుచును నన్నుఁ • బోలినదర్శనో, ద్ధర్త యెవ్వాఁ డింక • ధరణి మాకుఁ

తే. గలుగునని చాలనెమ్మదిఁ•దలఁచుచుండె, నంతఁ దిరుమలనంబి యా•యామునేయ
గురునియనుమతిఁ దిరుమల • కరిగెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

శా. శ్రీమత్కారి కుమారదివ్యపదరా • జీవామృతాస్వాదనా
కామక్రోధవిదూర నాథమునిము • ఖ్యప్రీతిసంవర్ధనా
స్వామిత్వస్థితపుండరీకనయనా • సన్మార్గసంస్థాపనా
రామార్య ప్రియయామునేయశరణా • రాజద్యతిప్రీణనా. 105

క. కరుణాకరవరుణాలయ, శరణాగతశర్మకరణ • శాంత్యాభరణా
యరుణారుణపరిధానా, వరణా రామానుజార్య • వరనిజకిరణా. 106

మాలినీవృత్తము. వరసరసిజనేత్రా • బాలసూర్యాభగాత్రా
　　పరిహృతహరిమాయా • భవ్యవిద్వత్సహాయా
　　నిరుపమశుభకీర్తీ • నిర్మలానంతమూర్తీ
　　స్థిరగురుపరివర్యా • స్తిక్యరామానుజార్యా. 107

గద్యము. ఇది శ్రీభగవద్రామానుజ కరుణాకటాక్షకలితకవితావైభవ పరవాది భయంకరాచార్యాభిమతచ్ఛాత్రాప స్తంబసూత్ర కణ్వసగోత్ర పవిత్రోభయకవిమిత్ర వేంకటకృష్ణార్యపుత్ర విబుధవైష్ణవవిధేయ కేశవనామధేయ ప్రణీతంబైన యాచార్యసూక్తి ముక్తావళి యనుమహా ప్రబంధంబునం బూర్వభాగంబునందు శ్రీవకుళాభరణదివ్య సూరివైభవంబును మధురకవిమాహాత్మ్యంబును శ్రీ మన్నాథముని ప్రభావంబును శ్రీ పుండరీకాక్ష గురుచరిత్రంబును శ్రీరామమిశ్ర శుభకథా కథనంబును శ్రీయామునాచార్య మహిమానుకీర్తనంబు నన్నది చతుర్థోల్లాసము.

శ్రీమతే రామానుజాయ నమః



# ఆచార్యసూక్తిముక్తావళి

## పూర్వభాగము

---

## పంచమోల్లాసము

శ్రీమన్నిజగురుకరుణా
భూమోపగతద్వయార్థ • బోధ మహాత్మా
భూమిగతాష్టోత్తరశత
ధామ శ్రీశప్రియా శ్రి • దండిమహేంద్రా. 1

### శ్రీరామానుజాచార్య దివ్యచరిత్రము

మారనేర్నంబి-త. శ్లో॥ మిథునే సార్పభే జాతం యామునార్యపదాశ్రయమ్।
మారనేర్నంబినామానం వన్దే జ్ఞానాదిసాగరమ్ ॥

శ్రీరంగమహాపూర్ణుల-త. శ్లో॥ కమలాపతికల్యాణగుణామృతనిషేవయా।
పూర్ణకామాయ సతతం పూర్ణాయ మహాతే నమః ॥

తిరుక్కచ్చినంబి-త. శ్లో॥ కుమ్భే మృగశిరోద్భూతం యామునార్యపదాశ్రయమ్।
దేవరాజదయాపాత్రం శ్రీకాఞ్చీపూర్ణ మాశ్రయే ॥

ఎంబెరుమానారు-త. శ్లో॥ మేషార్ద్రా సంభవం విష్ణో ర్దర్శనస్థాపనోత్సుకమ్।
తుణ్డీరమణ్డలే శేషమూర్తిం రామానుజం భజే ॥

### అవతారము

వ. అవధరింపుము. 2

సీ. తిరుపతి కేతెంచి • తిరుమలనంబి శ్రీ. వేంకటేశునిపాద • పంకజముల
సేవించి మది సంత • సించి తత్కైంకర్య. మాచరించుచు నిత్య • మచట నుండి

యతనితోఁబుట్టువు • లైనట్టిభూమిపి, రాట్టియుఁ బెరియపి • రాట్టి యనెడు
కన్యక లిరువురు • గల రందు భూమిపి, రాట్టిని భూతపు • రంబునందు

తే. దేవసముఁడు శతక్రతు • దీక్షితుండు, నైనయాసూరికేశవా • ర్యాహ్వయునకు
వాసి నర్పించె న గ్గురు•వర్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర. 3

సీ. మశలమంగల మని • మహిఁ బేరు గాంచిన, గ్రామమునం దుండు• కమలనయన
భట్టారకుం డను•బ్రహ్మవి త్తమునకుఁ, బెరియపిరాట్టి న•ర్పించి పెండ్లి
చేసి సంతోషించె • శ్రీశైలపూర్ణార్యుఁ, డంతఁ గొన్నాళ్ళ క•య్యతివ లిరువు
ర త్తవారిండ్లయం • దాత్మభ ర్తలఁ గూడి, సౌఖ్యముఁజెందెడు•సమయమునను

తే. భూపిరాట్టికిఁ బుత్రుఁడై • పుడమి శేషుఁ, డవతరించెను మేషార్ద్రి•యందువిష్ణు
దర్శనస్థాపనము సేయఁ•దలఁచి యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. భూమిపిరాట్టికిఁ • బుత్రకుం డుదయించె, నన విని బూదూరి • కరుగుదెంచి
కేశవార్యునిమహా•గేహమునకుఁ జని, యతనింట నర్చితుం • డై వసించి
జాతకర్మము తండ్రి • సల్పినపిదప నా•శిశుభుజంబులఁ దిరు•చిహ్నా లుంచి
శుభలక్షణము లన్ని•చూచి యబ్బాలుని, కాఖ్యచేసెను లక్ష్మ•ణార్యుఁడనుచు

తే. నంతఁ దిరుమలనంబి శే•షాద్రి కరిగెఁ, దగినవేళలఁ బట్టికిఁ • దండ్రి చేసె
నన్నసంస్పర్శచౌలవ్ర•తాదు లనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. అంత సకృచ్ఛ్రవ•ణాధీతవేదవే,దాంగుఁ డై బ్రహ్మచ•ర్యంబు విడిచి
సువిహితోద్వాహుఁడై • షోడశాబ్దములకుఁ, బరిపూర్ణచంద్రుని•పగిది సకల
జనమనోనయనము•జ్జననబీజవిరాజ,మానాంగుఁ డైన లఁ•క్ష్మణగురుండు
ధరఁ గాంచి యం దేక•దండి యాదవపంజ్ఞుఁ డద్వైతియతి యుండ•నచటి కరిగి.

తే యాతఁడద్వైతభాష్యార్థ•మాత్మశిష్య•సూరులకుఁజెప్పఁదానహ•శ్రోతయగుచుఁ
గాల మొక్కింత జరపె నా•కరణి ననుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర.

వ అయ్యవసరంబున మశలమంగలగ్రామంబునం గమలనయన భట్టారకునకుం బెరియపిరాట్టియా రను తద్ధర్మపత్నియందుఁ గ్రోధన సంవత్సరంబునం బుష్య మాసంబునందుఁ బూర్ణిమాతిథియం దిందువాసరంబునఁ బునర్వసూ నక్షత్రంబు నందుఁ బుత్రుం డుదయించె నని విని శ్రీశైలపూర్ణార్యుం డయ్యూరి కేతెంచి యక్కమలనయన భట్టారకునిం గాంచి సత్కరించి యతనిచే నర్చితుండై తద్భవ నంబున వసియించి పితృకృతజాతకర్మండగు నబ్బాలకునిఁ బొడగాంచి సంత

సించి యితండు వేదశాస్త్రపారావార పారంగతుండు గాఁ గలం డని నిర్ణయించి యా శిశువునకు భుజమూలంబులం దిరులక్షణంబు లేర్పరించి గోవిందమిశ్రుం డని దివ్యనామంబు గావించి యథేచ్ఛం జనియె నంతఁ దజ్జనకుండగు కమలనయన భట్టారకుండును దత్తదుచితకాలంబు లతిక్రమింపకుండ నక్కుమారున కన్న ప్రాశన చౌలోపనయనాది సంస్కారంబు లొనర్ప నబ్బాలకుండును సాంగోపాంగంబుగా వేదత్రయం బధికరించి కాణాదపాణినీయాంతస్తంత్రాదిశాస్త్రంబు లభ్యసించి పురాణ ధర్మశాస్త్రేతిహాసాదులం దెలిసి లక్ష్మణార్యుండు కాంచీపురంబు నందు యాదవప్రకాశునికడ స్వదర్శనంబునకుం బూర్వపక్షంబుగా నద్వైత భాష్యం బాకర్ణించుచున్నవాఁ డని విని యచ్చోటి కేతెంచి యమ్మహాత్ముని సేవించి యతనితో సహశ్రోతయై యున్నయంత వారి నిరువుర నయ్యాదవప్రకాశకుం డొక కారణాంతరంబునఁ దీర్థయాత్రావ్యాజంబుచేఁ దోడ్కొనిచని యగణ్య దౌర్జన్యశరణ్యం బగువింధ్యారణ్యంబునం దాలక్ష్మణసూరి విడిచి చనుచుండఁ గరిగిరివరదుండు పెరుందేవితోడఁ గూడి వచ్చి వనచరమిథునరూపంబునం బ్రసన్నుండై యమ్మహాత్మునిం గాంచి పురంబునకుం దోడ్కొనివచ్చె నంత యాదవునితో గోవిందమిశ్రుండు కూడ నేఁగి ప్రయాగాంతికంబునం ద్రివేణిం గాంచె నంత. 7

సీ. గంగలో మునుఁగంగ • లింగ మొక్కటి వచ్చి, కదిసి గోవిందుని•కరతలమునఁ
బడినఁ గన్గొని యాద•వ ప్రకాశకునకుఁ, జూపిన గోవింద•సూరి కతఁడు
చెప్పె ని ట్లని వత్స • శివలింగ మిది యర్చ, చేసితివా నీకు • సేమ మగును
అనిపల్క విని యతం • డట్లుసేయుచు నేఁగు,దెంచి యాతనితో స్వ•దేశ మొంది

తే. స్థిరత శివలింగ మొకచోఁ బ్ర•తిష్ఠితముగఁ జేసివచ్చెద మరలి నీ•చెంతకనుచు
నుడివి యాదవు వీడ్కొని • వెడలెననుచు. వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. మజ్జన్మభూమి యా•మళలమంగల మిందు, లింగప్రతిష్ఠ నే • రంగు మీఱఁ
జేసెద నని మదిఁ • జింతించి యాయూర, ద్విజులసమ్మతి నొక•దేవళమున
శాస్త్రోక్తవిధిని సం•స్థాపించి యాలింగ, మతిభక్తి గోవిందుఁ • డర్చ సలుపఁ
గాళహస్తీశుఁ డా•ఘనుని స్వప్నమునందుఁ, గాన్పించి పల్కె నీ•గతి నతనికిఁ

తే. గాళహస్తీశ్వరుఁడ నేను•గనుము నన్ను,వచ్చి మాకడనుండుము,వశ్య మనుచుఁ
బలికి కనఁబడఁ డాయెఁ గ•పర్ది యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. తదనంతరంబ యక్కాళహస్తీశ్వరుండు స్వమందిరాధికారపూరుషునకు స్వప్నంబునం దన్నుం బొడసూపి యిట్లనియె. వత్సా! గోవిందమిశ్రుం డను విప్రకుమారుం డొకండు ముందు త్రివేణీస్నానంబు చేసి వారణాసీ నగరంబునకుం జనుదెంచి యందు మణికర్ణికాఘట్టంబునందు భాగీరథీప్రవాహ బునం దఘమర్షణావగాహం బొనర్చుచుండ నస్మత్ప్రేరితంబై యొకలింగం బతనిపాణితలంబునం బడ నది గ్రహించి యాదవప్రకాశకునికిం జూపి యతనిచేతం బ్రోత్సాహితుండై పూజించుటంజేసి యమ్మనీషికి నుళ్ళంగై కొండందనయనా రని ద్రవిడభాషాభూషితంబగు నామవిశేషం బమరెనతం డిప్పు డిద్దే[illegible]కేతెంచి మళలమంగల మనియెడి యొక మహాగ్రహారంబున వసియించెను. అమ్మహాత్ముని బహుమానపూర్వక బుగా నివటికిం దోడ్కొనిరమ్మని యాజ్ఞాపించి యంతర్హితుం డయ్యె నంతట నద్దేవాలయాధికారి మేల్కాంచి మిగుల నానందించి నిజపరివారంబుతో నమ్మళలమంగల గ్రామంబున కరుగుదెంచి యమ్మేధావినిం బొడగాంచి సముచిత సత్కారంబుల నర్చించి యతనిం దోడ్కొనివచ్చి శివశాసనంబుచేఁ దదీయ ధనకనకరత్న వాహనాంబరాభరణాది మండిత భాండాగార ముద్రికలన్నియు నతని యధీనంబులుగాఁజేయ నతం డద్దేవాలయంబునం దదీయ సర్వకార్య నిర్వాహకుండై యుండె నంత.

సీ. భాగినేయుం డిట్లు • బాహ్యకుదృష్టుల,మత మవలంబించి • మతిఁ దలంచి
కాళహస్తీశుని,కడ నున్నవాఁ డని, తిరుమలనంబి తాఁ • దెలిసి వచ్చి
శైవపూరుషశత•సంవృతు గోవింద,సూరిని దవ్వులఁ • జూచి చూచి
తనతోడ భాషింపఁ • దలఁపక తన్నుపే,క్షింప నాతనిఁ గటా•క్షించి సర్వ

తే. శేషిసంకల్ప మిట్లుండఁ • జేతనుండు, సేయఁగల దేమియని మదిఁ • జింతలుడిగి-
యరిగెఁ దిరుమలనంబి శే•షాద్రి కనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. మఱియు నొక్కనాఁ డమ్మహాదేశికుం డక్కాళహస్తికిం జనుదెంచి యుళ్ళంగై కొండందనయనా రనేకశైవజన పరివారపరివృతుండై యేతెంచుచుండ నతని కన్మొఱల శ్లోకః॥ కః శ్రీ(శ్రియః పరమసత్త్వ సమాశ్రయః కః కః పుండరీకనయనః పురుషోత్తమః కః। కస్యాయుతాయుత శతైక కళాంశకాం శైర్విశ్వం విచిత్ర చిదచి త్ప్రవి భాగవృత్తమ్॥ అనియెడు భగవద్యామునమునిప్రణీతస్తోత్రరాజభ్రాజమానంబగు శ్లోకం బొకటి లిఖియించి యమ్మార్గమధ్యంబునందు వైచిన నమ్మేధావియు దానిని గ్రహించి పఠించి దరహసితభాసుర ముఖారవిందుండై

యగ్గురువరేణ్యునిం జూచి సాధుసత్తమా యీ శ్లోకంబు మీకుం బరదైవతం బగు నారాయణునకు సర్వోత్తమత్వ ప్రతిపాదకంబు గావున మీయెడ నుండవలయు నని తత్సన్నిధానవర్తి యగు శ్రీవైష్ణవున కొసంగి చనియె నంతట నద్దేశిక సార్వభౌముండు భగవల్లీలావిలసితం బీయాత్మయం దీక్షణంబున కిట్లుండె నని సంతసించుచు నంజనాచలంబునకుం జని యందు శ్రీనివాసున కనవరత సకలవిధ కైంకర్యంబు లాచరించుచుండె నంత.

సీ. పరమసాత్త్వికుఁడు మద్భాగినేయుఁడు సర్వవేదశాస్త్ర పురాణవిదుఁడు నయ్యు
గోవిందుఁ డిప్పుడు కుమతులతోఁగూడి, యెవ్వనిమాయఁ దన్నెఱుఁగఁ డాయె
నమ్మహామాయావి నఖిలలోకశరణ్యు, నాశ్రితవత్సలు నాదిగురుని
శరణొంది యింకొకసారి గోవిందునిఁ, గనుఁగొని వచ్చెద నని తలంచి

తే. పెరియతిరుమలనంబి శ్రీహరిని శరణు, పొంది తదనుగ్రహముఁ జెంది పురము విడిచి
యరిగి పొడగాంచె నా కాళహస్తి ననుచు, వాదిభీకరగురుఁ డనె మోద మలర.

వ. అట్లరుగుదెంచి యగ్గురువరుం డప్పురపరిసర పరివర్తమాన పరిపూర్ణ నీరపూర విరాజమాన సువర్ణముఖీతీరంబునఁ దమూర్మిజాలాతి శీతలాంబు కణకలితసమీర సంకలన సమాప్యాయిత పల్లవితకోరకిత కుసుమితఫలిత శాఖిశాఖోపగతశుకపిక శారికామయూరాది వివిధవిచిత్ర విహగకులకలరవాకుల వకుళాశోక పాటలీపున్నాగ చందన చాంపేయ కదంబకర వీరకర్ణికార కాశ్మీరమాలూర మధూకమన్మథ మాతులుంగ మాకందమందారతాల తమాలహింతాలరసాల సాలజంబు జంబీరాద్య పరిమిత మహోన్నత ద్రుమాభిరామంబైన యొక్క యారామంబుఁ బొడగాంచియం దతికోమలబహుళ ప్రవాళమిళితంబై సాంద్రతర సంతతచ్ఛాయంబై సర్వజనమనోనయనానంద సంధాయకంబగు బిల్వతరుబృందంబు గాంచి యగ్గోవిందమిశ్రుం డిచటికి స్వదేవతారాధనార్థంబుగా బిల్వపల్లవ సంగ్రహంబు సలుప రాఁగలం డని తన మనంబునం దూహించి యం దొక్క తరుమూలంబున వసియించి తిరువాయ్మొళియందు రెండవపది కర్థం బాశ్రితులకుం బ్రసాదించుచున్న సమయంబున భస్మోద్ధూళిత సర్వాంగుండును గిరీటహార కేయూరకటక కటిసూత్ర భూతిరుద్రాక్షమాలాలంకృతుండును నైన యుళ్ళంగై కొండందనయనా రా ప్రదేశంబున కేతెంచి యమ్మహాదేశికున కప్రదక్షిణంబుగాఁ జని యబ్బిల్వవృక్షారోహణం బొనర్చి పంచాక్షరీ మంత్రోపాంశుజ స్ఫురితాధరుండై బిల్వదళోపాదానంబు సల్పుచుండఁ 'దేవుమెప్పొరుళుం బడైక్క' యనుపాశురంబు ప్రస్తుతంబైన దేవాది సమస్తవస్తు

విస్తార విధానార్థంబుగా స్వనాభికమలంబునం జతుర్ముఖునిం బుట్టించిన శ్రీమన్నారాయణాభిధానుండగు దేవాదిదేవునకుం గాక యితర దేవతలకుం బుష్పంబులుం బూజయుం దగునే యని తదర్థం బగ్గురుండు చెప్ప విని తగదు తగదని స్వదేహపరివృతంబు లగు రుద్రాక్షవలయంబు లన్నియుం ద్రెంచివైచియు బిల్వదళపూరితంబులగు పుటికలం జించివైచియు నిజోత్తరీయంబుచే నొడలంబూసిన భసితంబుఁ దుడిచివైచియు స్వరూపబహిష్కృతుండై కడపిన కాలంబునకుం బెద్దయుం బ్రొద్దు పరితపించుచు నబ్బిల్వశాఖాగ్రంబున నుండి గుభాలునం బుడమిపైకుఱికి యప్పెరియ తిరుమలనంబి తిరువడిత్తామరలయం దార్తప్రసన్నుఁడై పడియున్న యగ్గోవిఁదమిశ్రు నుపేక్షించి యద్దేశికేంద్రుండు జగద్రక్షకుం డగు పుండరీకాక్షునిం దలంచుచు నిజపరివారంబుతో నతిరయంబునం జనుచుండ నగ్గోవింద సుధీవరుండును ధేనువు ననుసరించి చనుచున్న వత్సంబుమాడ్కి నమ్మహాత్ముని వెనువెంటం జనుచుండె నంత నావృత్తాంతం బంతయు నెఱింగి తచ్ఛిష్యప్రశిష్యులగు విలక్షణాత్ములు గొంద ఱశేషాయుధ విశేషభూషితాంగులై స్వాచార్యుం డగు నమ్మహాదేశికుని దివ్యదేహ సంరక్షణార్థంబుగా నేఁగుదెంచి యగ్గురువరునకు భక్తిపూర్వకంబుగా సాష్టాంగప్రణామంబు లాచరించి యతనిం బరివేష్టించి చనుచున్న యంత నక్కాళహస్తీశునికడ నున్న శైవశాక్తాదిజనులంద ఱస్మద్గురుండైన యుళ్ళంగై కొడందనయనా రీశ్వరారాధనార్థంబుగా బిల్వపల్లవాపచయంబు సేయుచుండ నొక వృద్ధవైష్ణవుండు ద్రవిడభాషా మంత్రవాదబలంబుచే మరులుకొల్పి యతనిం దోడ్కొని చనియె నని వింటిమి. ఇప్పు డస్మద్గురుని విడిపించుకొని దుర్వినీతుండగు నమ్మంత్రవాది బ్రాహ్మణునిం బట్టి కట్టి తెచ్చెదమని కట్టుకంబెట్టు మిట్టిపడుచుఁ ద్రిశూలపరశుపట్టిన భిండివాలప్రాసాసి ముసలము ద్గరలగుడాద్యనేక సాధనపాణులై యతిత్వరితగతిం జనుదెంచి బహుపరిజన పరివృతుండైన శ్రీశైలపూర్ణ దేశికేంద్రునిం గదిసి నిలు నిలు మనియధిక్షేపించి మద్గురుని విడిచిపొ మ్మట్లు సేయవేని ప్రాణంబులం గోలుపుచ్చెద మని దురుక్తులం బలుక నాఁకించి యా సాత్త్విక సార్వభౌముండు పెద్దయుం బ్రొద్దు చింతించి శైవవీరులారా! మాకు మీ గురునితోడం బని యణుమాత్రం బయినను గనంబడదు గావున భవద్గురుని మగిడి తోడ్కొని చనుండని యానతిచ్చి క్షణమాత్రంబు మౌనియై యుండె నంత. 14

సీ. శైవవీరులు నిజాచార్యుల కని రిట్లు, వినుము విన్నప మార్య వినుత యనుచు
హైమవతీభర్త యాగమాంతములచేఁ, బరతత్త్వ మని చెప్పఁ బడును గాన

కాళహస్తీశుని • కడనుండి యతనికి, సంతుష్టి నిత్యము • సల్పవలయు
నని శైవశాస్త్ర ర•హస్యసారము మాకు, బోధించుసద్గురు•మూర్తి నీవ

తే. యాత్మశిష్యుల మగుమమ్మ•హరుని విడిచి, వైష్ణవుల మాయవలఁబడ•వలదువలదు
మరలి రమ్మని పల్కి రా•మందు లనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. అట్లా శైవులపలుకుల విని గోవిందమిశ్రుండు వారి కిట్లనియె. 16

సీ. సంగమదోషముఁ జేసి • వెంగలి నై తొల్లి, గఁగాధరునిపూజ • గారవించి
చేసితిఁ గొన్నాళ్లు • సేమ మెఱుంగక, సద్గురుకృప నది • మాను కొంటిఁ
దిరుమలనంబియే • దేవుఁడు మా కిఁక, నతనికైంకర్యమే • యర్హతమము
గాన వేఱొక్కటి • కలనైనఁ దలఁపము, జరగుఁ డీ యిఁక మీరు • జాగు మాని

తే. బాదరాయణిసంబంధి•భావమట్లు, ఘటన యొక్కటి హరిమాయఁ • గల్గె మాకు
మీకు నని పల్కె గోవింద•మిశ్రుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. అంత. 18

సీ. శరచాపముఖ సర్వ•సాధనపాణులై, తమచుట్టు శ్రీవిష్ణు•దాసు లరుగఁ
దిరుమలనంబి శ్రీ•పురి కేఁగె నాతని, వెనువెంటఁ జనియె గో•విందుఁ డంత
బీరము చెడి శైవ•వీరులు తమగురు, నెట్లేనిఁ దోడ్కొని • యేఁగఁ దలచి
యల్లనల్లన వారి • ననుగమించుచునుండ, శేషాద్రిచెంతలఁ • జెంది యచట

తే. నమలజలపూర మైనప•ద్మాకరంబుఁ, గాంచి యొక్కటి యం దవ•గాహనంబుఁ
జేసి రయ్యార్యు లిరువురు•వాసి ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. అంత గోవిందమిశ్రుండు మరల విచ్చేయు మని తన్ను ననేకవిధంబులం
బ్రార్థించు శివసేవకుల కిట్లనియె.

సీ. శైవులు మీరు శ్రీ•శైలపూర్ణులయింట, నూడిగ మొనరించు • వాఁడ నేను
గాన మీతోఁ బొత్తు•గారాదు మా కిఁకఁ, బొందుపొం డిచ్చట•నుండఁగూడ
దని తనయెడ వారి • కాసయే లేకుండఁ, దెలిపి గోవిందసు•ధీవరుండు
నయమొప్పఁ దిరుమల•నంబి శ్రీపాదము, లాశ్రయించిన నతం • డలరి యతని

తే. కఖిలహితములఁ గావించి•యతనితోడ, నంజనాద్రీశుఁగని మ్రొక్కి•యభినుతించి
యతనియానతిఁ దమయింటి • కరిగెననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. గోవిందమిశ్రుఁడు • గురుని కెల్లప్పుడు, సకలకైంకర్యముల్ • సల్పుచుండె
నతఁ డెందు వైష్ణవుఁ • డయ్యెదాని మనుష్య, లెంబాసచెఱువందు • రిప్పుడైన

నంత శైవులు కాళ•హస్తికిఁ జని చింత,పడుచుండ వారిస్వ•ప్నములయందుఁ
గనఁబడి హరుఁడ నే • ఖగరాజు గోవింద,సూరి యాతనిమతి • శుద్ధి నరయ

తే. నిట్లొనర్చితి వగపు మీ•కేటి కనుచు, శంభుఁ డన విని మేల్కాంచి,శైవు లతని
కుచితకృత్యము లొనరించు•చుండి రనుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర.

## తిరుమలనంబికిఁ బితామహ పితామహ నామంబు గలుగుట

వ. అంత. 23

సీ. తిరుమలయం దొక•తీర్థము పాపవి,నాశనం బని భువి • వాసి కెక్కె
నాతీర్థమున నిత్య • మంభఃప్రపూర్ణకుం,భము తిరుమలనంబి • భక్తిఁ దెచ్చి
యంజనాద్రీశున • కర్పించుచుండె నా,హరి మెచ్చి తనయాత్మ • ననియె నిట్లు
రెండుకోసులదూర • ముండు నాతీర్థేంద్ర, మరిగివచ్చుట కొక • యామ మగును

తే. స్థవిరుఁ డీతండు మత్ప్రాణ•సఖుఁడుగాన, యింత మాకయి కష్టింప,నేల యనుచు
వింతయొక్కటి చేసె నా•విష్ణు వనుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర.

సీ. వేఁ టాడఁ దగినట్టి • వేష మొక్కటిఁబూని, మారాఖ రాజకు•మారలీల
మృగయావినోదియై • మేటిసింగములను, శార్దూలములఁ గృష్ణ•సారములను
శరభశల్యాలులాయ • చమరీమృగంబుల, గండకఖడ్గమూ • కరవరముల
మాటికి శరఘాటి • మాపుచు వానికి, మునిదుర్లభం బగు • మోక్ష మొసఁగి

తే. వేంకటేశ్వరుఁ డాశ్రిత • పంకహరుఁడు, వేడ్క విహరించుచును వన•వీథులందు
నలసియొక్క తరుచ్ఛాయ • నిలిచె ననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

వ. అప్పుడు. 26

సీ. పాపవినాశన • భవ్యతీర్థామృత,కలశము కుదురుగాఁ • దలను నిలిపి
మంత్రరత్నార్థము • మదిని దలంచుచుఁ, దిరుమలనంబి యే•తేరఁ జూచి
యమ్మహాత్ముని డాసి • యర్థించె నాహరి, దగఁ గొంటి జలమిమ్ము • తాతయనుచు
స్వామినిత్యస్నాన•జల మిది యన్యుల, కియ్యరా దని గురుఁ • డేఁగ నతని

తే. వెనుకఁ జప్పుడుసేయక • చని మురారి, మేటిబాణాగ్రమునఁ గుండ•తూటువుచ్చి
లీల నంజలిచే నీరు • ద్రోలె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. సలిల మాహరిం గ్రోలఁ, గలశము లఘువైనఁ, దిరుమలనంబి తాఁ దిరిగి చూచి
విలుకానిఁ గని వత్స వెన్నునియెడ నవ,చార మీ విల్లెల సల్పితి వనఁ
దాత నేఁ జేసిన తప్పేమి దగఁ గొని, యిట్లొనర్చితి విప్పు దేమికొఱఁత
శుద్ధోదకం బిడఁ జూపించెదను నీవు, వేగ నాతో రమ్ము జాగు మాని

తే. యనుచుభాషించి మృగయావి,హారిశౌరి,గురునిఁగొని చనియతనికిఁ,గొండదవుడఁ
జెమ్మటలనీరు చూపించె నెమ్మి ననుచు, వాదిభీకరగురుఁడనె మోదమలర.

సీ. గజగండభిత్తిపైఁ గనఁబడుదాన ని,ష్యందమట్లున్న యీ సలిలములను
ఘటమెట్లు పూరింపఁ,గల వేంకటేశుని, స్నానకాలముమించె నయము దొలఁగి
గోవతనంబున దేవహేళన మిట్లు, గావించుటయు మేర గాదు నీకుఁ
దాటోటుమాటల పాటెఱుంగక యిట్టి, యాటకు లోనైతి వనిన గురుని

తే. మాటలాలించి యమ్మాయ,వేఁటకాఁడు, మోమునెత్తమ్మిఁ జిఱునవ్వు,మొలకలెత్తఁ
బలికె నయ్యార్యవరున కీ,కొలఁది ననుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

సీ. తాత బాలకునిపై దయ సేయవలెఁ గాని, యలుగవచ్చునె జగ,దార్య నీకు
నవని మీబోఁటి మ,హానుభావుల యను,గ్రహమె కా సర్వసు,ఖప్రదంబు
దేవహేడన మిది దెలియక చేసితి, నిష్కృతి దీనికి నివ్వటిల్ల
నభ్రగంగా ప్రవా,హముఁ బోలునిర్ఝర,మొకటిఁ బుట్టించెద నూర్జితముగఁ

తే. జూడు మనుచును శపథించి సురలు మెచ్చ, వేంకటేశుఁడు తనచేతి,విల్లువంచి
యందు సంధించెనొక్క ది,వ్యాస్త్రమనుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

సీ. ఆకొండదవుడ ల,క్ష్యము చేసి యద్దివ్య,బాణము విడిచినఁ బర్వతంబు
పటపటఁ బగులఁ ద,త్తటమువల్లను సుధా,ధవళమహానీర,ధార పొడమి
త్రైవిక్రమాంఘ్రిప,ద్మస్ఫురన్నఖచిన్న, కమలజాండోదిత గంగభంగి
మహిఁ బడఁ జూచి య,మ్మాయాధనుర్ధరుం, డాకాశగంగ యీ,యంబుధార

తే. యందు సలిలముఁ దెచ్చి మా,కిమ్ము నిత్య, మనుచు శ్రీశైలపూర్ణుల కానతిచ్చి
యతఁడు చూడంగఁగనఁబడఁ డాయెననుచు, వాదిభీకరగురుఁడనె, మోదమలర.

సీ. వేఁటకాఁడితఁడు శ్రీ,వేంకటేశుం డని, మది నిశ్చయించి య,మ్మాన్యతముఁడు
తచ్ఛాసనము సేయఁ,దలఁచి యయ్యాకాశ, గంగోదకంబుచే ॥ ఘటము నించి
తెచ్చి శ్రీవేంకటా,ద్రి శ్రీనివాసున, కని సమర్పించుచు నచట నుండె
మహిఁ బితామహ పితా,మహుఁ డని తిరుమల,నంబికిఁ బేరయ్యెఁ నాఁటనుండి

తే. యమ్మహాత్ముని కులమునం॰దవతరించు, సౌమ్యు లాకాశగంగలో ॰ జలముఁదెచ్చి
హరికి నొసఁగుదు రిప్పటి॰కైన ననుచు, వాదిభీకరగురుఁ డనె ॰ మోదమలర.

వ. అంత నక్కడ. 33

సీ. గంగనుం దేతెంచి ॰ కాంచీపురమునందు, యాదవుఁ డాలక్ష్మ॰ణార్యుఁ గాంచి
యాశ్చర్యపడు చు విం॰ధ్యాటవి ని న్నెడఁ,బాసి నే నతిశంక॰పడుచు నేఁగి
వచ్చితి మగుడ ని ॰ న్నిచ్చటఁ గంటి నీ, వెట్లేఁగుదెంచితి ॰ విచటి కనిన
విని తాను వచ్చిన॰విధ మంత యతనికిఁ, జెప్పిన విని సంత॰సించి యతఁడు

తే. మనుజమాత్రుండు గాఁడని॰మదిఁదలంచి, యమ్మహాత్ముని నెప్పటి॰యట్లు మిగుల
గారవించెను యాదవ॰హరి యనుచు, వాదిభీకరగురుఁ డనె ॰ మోద మలర.

వ. అంత. 35

సీ కాంచీపురమును-డి ॰ ఘనులు వైష్ణవు లిర్వు, రతిభక్తిఁ గోవెల ॰ కరిగి యందు
రంగేశుఁ బొడగాంచి ॰ మంగళాశాసన, మొనరించి యామున॰యోగివరునిఁ
గని మ్రొక్క వారినిఁ ॰ గరుణించి యతఁడు మీ, రెందుండి వచ్చితి॰రిచటి కనినఁ
గాంచినుం డిచటి కే॰తెంచితి మన గురుం॰ డచటి విశేషము ॰ లడుగ వారు

తే చదువుచున్నారు లక్ష్మణా॰చార్యులచట,యాదవాహ్వయ యతికడ॰నని యతనికిఁ
బలికి మఱియు విశేషముల్ ॰ వలికి రనుచు, వాదిభీకరగురుఁడనె ॰ మోద మలర.

వ. అవ్విశేషంబు లెట్టి వనిన నట్లు లక్ష్మణదేశికుండు ప్రతిపక్షవిక్షేపణదక్షం బగు స్వపక్షంబునకుం బూర్వపక్షంబుగా నయ్యాదవ ప్రకాశకునికడ నద్వైతభాష్యం బాకర్ణించుచుండ నొక్కనాఁ డతండు 'సత్యం జ్ఞాన' మిత్యాద్యుపనిషద్వాక్యం బితరవ్యావృత్తిపరంబావ్యావృత్తియు నశేషవిశేషప్రత్యనీక నిర్విశేష చిన్మాత్ర బ్రహ్మస్వరూపరూపంబై యొప్పుఁగాని వేఱొక్కటిగాఁ జెప్పంబడ దని యా లక్ష్మణార్యుండు సార్వభౌముండైన రాజునకు మణిమౌక్తికదామాభిరామంబై శరదిందుసుందరం బగు శతశలాకచ్ఛత్రంబుమాడ్కి ననన్య సాధారణంబైన జగజ్జన్మాదికారణత్వ లక్షణంబుచే నుపలక్షితంబగు పరబ్రహ్మంబునందు సత్య పదంబును నిరుపాధిక సత్తాయోగిత్వంబును జ్ఞానపదంబు ననంకుచిత జ్ఞానాశ్రయ త్వంబును ననంతపదంబు త్రివిధపరిచ్ఛేదరాహిత్యంబును జెప్పం గాన కల్యాణ గుణ యోగార్థకత్వం బవ్వాక్యంబున కర్హతమంబై యుండ నిట్లు వ్యావృత్తి యవ్వాక్యార్థంబుగా నుదాహరించుట యన్యాయం బనిన నయ్యేకదండి రోషారుణిత

నేత్రుండై హుంకరించె. మఱియు నతండు గంగాయాత్రార్థంబు చనుటకు ముం దొక్కనాఁ డయ్యిలయాళ్వారతనికిం దైలాభ్యంగంబు సల్పుచుండఁ, 'దస్యే థాకప్యాస' మిత్యాదిచ్ఛాందోగ్యోపనిష ద్వాక్యంబున కపార్థంబు వర్ణింప నాలకించి యా లక్ష్మణగురుండు దన మానసంబునం గ్లేశింప నమ్మహాత్ముని దుఃఖాశ్రు బిందువులు ప్రదీపచ్యుత తైలబిందువుల చందంబున నక్కుమతియూరు తలంబునం బడ నతం డులికిపడి హిమలవక్లిన్న కమలంబుపోలిక దుఃఖాశ్రువ్యాకులిత నేత్రం బగు నగ్గురుశేఖరుని ముఖారవిందం బీక్షించి దుఃఖపడఁ గారణం బేమి యని యడుగ సూర్యాంశు వికసితారవిందంబు పోలికఁ బరమపురుష నేత్రయుగం బొప్పునని యర్థంబుఁజెప్ప నుచితంబై యుండ నిట్టి యపార్థంబు విన నిట్టి క్లేశంబు సంభవించెనని గురుసత్తముండు పలుక విన సహింపక యతం డతనికి నపకృతు లొనర్పనవియు భగవదనుగ్రహంబుచే నమ్మహాత్ముని యెడఁ గృతఘ్నునికిం జేయుఁగ్గులుం బోలె నిరర్థకంబు లయ్యె నని య వ్వైష్ణవులవలన సవిస్తరంబుగా విన నవధరించి యా మునాచార్యుండు సన్ని ధానవర్తు లయిన యార్యుల నుద్దేశించి, శ్లో॥ అనంత ఏవాత్రహి సంభవంతి హసంతికాయా మివహవ్య వాహాః। అత్రైవ సంతో యది సంభవంతిహ్యా త్రైవలాభ స్సరసీరుహాణామ్॥ అనియెడు న్యాయంబున నివ్విభూతియందు హసంతి కాగ్నికణంబులగతి దుర్జనసముదాయంబు విస్తరించియుండు నిందు సజ్జనులుం గలిగిరేని హసంతికారవిందలాభంబు సంభవించిన ట్లుండు నని యా నతిచ్చి యమ్మహానుభావు నిరీక్షింప నుత్సహించి యనేక శ్రీవైష్ణవబృందంబుతో శ్రీరంగధామంబు విడిచి యతిరయంబునం జనుదెంచి, శ్లో॥ పురీణా మపి సర్వా సాం శ్రేష్ఠాపాపహరాహిసా। నామ్నాకాంచీతివిఖ్యాతా పురీపుణ్యా వివర్ధనీ॥ అని యెడి మాహాత్మ్యంబుగల కాంచీపురంబుఁ గాంచి వేగవతీతీరంబునం దొకయు ద్యానవనంబున నిలిచియుండ నావృత్తాంతం బంతయు విని మిగులసంతసించి శ్రీ గజేంద్రదాసా పరనామధేయుం డగుతిరుక్కచ్చినంబి స్వాచార్యుండగు యాళ వందారున కెదురేఁగుదెంచి యగ్గురునకుం బ్రదక్షిణపూర్వకంబుగా సాష్టాంగదండ ప్రణామం బాచరించినం జూచి యమ్మహాదేశికుం డతని నాత్మీయకరుణా కటాక్ష వీక్షణంబుల నీక్షించి స్వకీయకరకమలంబులచేఁ దచ్ఛిరంబు దువ్వుచుఁ గుశల ప్రశ్నాదికంబులచే మిగుల నాదరించి యాశిష్య రత్నంబుతో నిజాశ్రితసాత్త్విక బృందంబుతో నప్పురంబు సొచ్చి విచ్చేయు చుండ నద్దేవదేవుని దివ్య గోపురపు రోభాగంబున విరాజమానంబగు షోడశస్తంభగుంభిత రత్నమంటపంబుకడకు

వరుందరుం బెరుమాళరయ రద్దివ్యాలయ పరిచారకులగు శ్రీ వైష్ణవులతోడంగూడి యనేక మంగళవాద్య ఘోషంబులతోఁ దిరుమాలెయు శ్రీశఠకోపంబునుంగొని యగ్గురువరు నెదుర్కొనయ్యామున మునియు సాష్టాంగప్రణామపూర్వకంబుగా సేవించి యత్తిరుమాలెయు శ్రీశఠకోపంబును శిరసావహించి వారలతోడం గరి గిరిని డాసి యత్తియూరానఘహరికి మంగళాశాసనం బొనర్చి కరిగిరి ప్రాసాదంబు నందు శ్రీ పెరుందేవితాయారుతోడం గూడి యున్నవరదుని భజించి మగిడి ప్రదక్షిణంబు సేయుచు, శ్లో॥ ఉదక్పశ్చిమభాగస్థం వల్మీకం మహతోగిరేః। పూజనీయశ్చతత్రాస్తే శేషః ఫణిభృతాం వరః॥ అన్నక్రమంబుగా నక్కరిగిరికి వాయవ్య ప్రదేశంబున విలసితంబగు వల్మీకంబునందుఁగల శ్రీమదనంతునకు జోహారువు చేసి తత్సమీపవర్తియగు కటిమాణిక్యశౌరికిం జేమోడ్చి యచ్చోట నిజాశ్రితులతో వసియించు సమయంబున బహుశిష్యపరివృతుండగు యాదవ ప్రకాశకుండు భగవత్సేవ యొనర్చి రెండవ ప్రాకారంబునకుం ప్రదక్షిణంబుగా వచ్చుచుండం జూచి యామునగురుండు వీరలయం దిలయాళ్వా రెవ్వరని తిరుక్కచ్చినంబి నడిగిన నగ్గజేంద్రదాసుండును నిజగురు నుద్దేశించి బాలభాస్కర ప్రభాభా సమాన దివ్యమంగళ విగ్రహుండును దత్క్షణోన్మీలిత పుండరీకదళాయ తాక్షుండును మందస్మిత సుందరవద నారవిందుండును దప్తతపనీయకటి కోపమాన శ్రీచూర్ణ రేఖా సమంచితాంత రాళసుధాధవళ మృత్స్నాంచితచ్ఛిద్రోర్ధ్వపుండ్రసముల్లసల్లలాటాది ద్వాదశాంగుండు నుదులసీనలినాక్షమాలికాలం కృతవిశాలపీవరో రస్థలుండును బరిఘోపమాయతసు వృత్తభుజాభిరాముండునునై యవ్విమతజన మధ్యంబునఁ గరోరకంటక ద్రుమంబులనడుమం బఘుకార్తస్వరకల్ప వృక్షంబు కరణిం జూపట్టుచున్నవాఁ డిలయాళ్వారని కేలం జూపఁజూచి యగ్గురువరుం డమందానందంబు డెందంబునం గ్రందుకొన నా లక్ష్మణమునియెడల విశేష కటాక్షం బొనర్చి 'యాముదల్వ నివ' నని తన మనంబున నిర్ణయించుకొని, శ్లో॥ యస్య ప్రసాదకలయా బధిరశ్శృణోతి పఙ్గుః ప్రధావతి జవేనచ వక్తిమూకః। అన్ధః ప్రపశ్యతిసుతం లభతే చ వన్ధ్యా తం దేవ మేవ వరదం శరణం గతోస్మి॥ అని సకల ఫలప్రదుండగు శ్రీకరిగిరివరదు నుద్దేశించియిఁకమీఁద నీలక్ష్మణాచార్యుండు దర్శన ప్రవర్తకుండగున ట్లనుగ్రహింపు మని ప్రపత్తిఁ జేసి మగిడి వరదునికిం బెరుందేవికిని మంగళాశాసనం బొనర్చియప్పు రాణదంపతుల కంతరంగంబగు తిరువాలవట్ట కైంకర్యంబు సల్పున త్తిరుక్కచ్చి నంబిని నియమించి యాలక్ష్మణార్యునకు హితోపదేశం బొనర్చుట కవసరంబు గాకుండుటంజేసి తన వెను

వెంట నేతెంచుచున్న స్థలవాసుల నిలువ నియోగించి నిజాశ్రితవర్గంబుతో నతిత్వ రితగతిం జనుదెంచి శ్రీరంగధామంబుఁ జెందియాత్మీయ మఠంబునందు నిజచ్ఛాత్ర వర్గంబుతో సుఖించుచుండె నంత. 37

సీ. మఱియొకనాఁడు ల • క్ష్మణముని యాదవ, సంయమికడ విద్య • చదువు చుండి
యాతఁ డద్వైతవా • క్యవ్రజం బద్వితీ, యబ్రహ్మపదముగా • నన్వయింప
నావాక్యములు విశి • ష్టాద్వైతపరములు, గా నన్వయించె ల • క్ష్మణబుధేంద్రుఁ
డాయర్థముల విని • యలిగి యాదవసూరి, మాకడఁ జదు వింక • మాని నీకుఁ

తే. దగినయట్లు వచించుమే • ధావికడను, జదువుకొమ్మని పల్కిన • సంతసించి
యమ్మహాత్ముఁడు తనయింటి • కరిగె ననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

వ. అంత. 39

సీ. జననికి లక్ష్మణా • చార్యుండు చేమోడ్చి, యావార్త లన్నియు • నాన తీయ
నాలించి సుతున కి • ట్లనియె భూమిపిరాట్టి, చదివినవిద్యయే • చాలు నీకుఁ
దనయ యింక గజేంద్ర • దాసునికడ కేఁగి, యమ్మహాత్ముని భక్తి • ననుసరించి
యతఁడు విధించిన • హరికృత్య మొక్కటి, గావింపు మని తల్లి • గారవించి

తే. పంచ లక్ష్మణముని యేఁగు•దెంచి మించి, నయము మీఱఁదిరుక్కచ్చి•నంబి గారి
సుందరాంఘ్రిసరోజముల్ • సూచెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఆదరోక్తుల లక్ష్మ • ణార్యుల మన్నించి, కలుషదూరుఁడు తిరు • క్కచ్చినంబి
వచ్చినకార్యము • వాక్రువ్వ మన విని, కరిగిరీశునకుఁ గైం • కర్య మొకటి
గావింపఁదలఁచితిఁ • గరుణించి యది యిది, యని విధించిన దాని • నాచరింతు
నని లక్ష్మణాచార్యు • లానతిచ్చిన విని, శాలక్కిణరునుండి • జలఘటంబుఁ

తే. దెచ్చి యనిశము వరదున • కిచ్చియచట, నుండు మనినంబి చెప్పన • తండుహరికి
నిత్య మర్పించు చుండెఁ ద • న్నీర మనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర

వ. అయ్యవసరంబు శ్రీరంగధామంబునందు యామునమునికిం జరమకాలంబు ప్రసక్తంబైన యెడఁదిరువరంగప్పెరుమాళర యరనుగుఁ నింబుఁ కష కారంబుగాఁగొని తిరుక్కోట్టియూరినంబియుఁ బెరియనంబియు నమ్మహాదేశికునకుం బ్రణమిల్లి కరకమలంబులుమోడ్చి మహాత్మా మాకుందిరమహితం బొక్కటి యనుగ్రహింప వలయునని ప్రార్థింప నయ్యాము నేయగురుండును వారి నుద్దేశించి సార్వకాలం బిద్దివ్యదేశం బెడఁబాయక వసియించి శ్రీరంగరాజ భ్రాజమానచరణ సరోజ

సాన్నిధ్యంబున వీణాపాణియై నిత్యనివాసం బొనర్చి దివ్యగానంబున నద్దేవదేవుని మెప్పించుచున్న శ్రీపాణియోగీంద్రు నా పాదమస్తకం బనుభవించుచుండుచే మీకుఁ బరమహితంబని యానతిచ్చి యీ యనుష్ఠానంబునకు శ్రీ వేంకటేశుని భజించుచున్న కురుంబరుత్తనంబియు శ్రీకరిగిరివరదుని సేవించుచున్న తిరుక్కచ్చి నంబి మొదలగు తత్త్వవిత్తములు ప్రమాణంబని బలికి యుర్వియం దెవ్వఁడేని యొక్కండు ప్రసన్నుండై భగవదధీనం బైనయాత్మ యాత్రయందుం గర్మాధీనంబగు దేహయాత్రయం దన్వయంబు గలదని తలంచెనేని యాత్మ సమర్పణంబు వానికి నిరర్థకం బగుటంజేసి వాఁడు నాస్తికుం డగుంగావునఁ గరణత్రయంబుచే నుభయయాత్రలయం దీచేతమున కన్వయంబు లేదనివాక్రుచ్చి యనన్య ప్రసన్నులగు శ్రీ వైష్ణవుల శ్రీపాదపద్మంబు లెల్లప్పుడుం బ్రాప్యప్రాపకంబులుగా నమ్మియుండుఁడని నియమించిన వారలదెందంబులందు సందియంబు గ్రందుకొనం దెలిసి వత్సకులారా మీర లీయర్థంబునకు సందేహంబుఁ జెందవలదు మీకుం దిరుమంత్రార్థంబు భోగమండపంబు చరమశ్లోకార్థంబు పుష్పమండపంబు మంత్ర రత్నార్థంబు త్యాగమండపం బీ యర్థ విశేషంబునకుం బ్రమాతలు శ్రీపాణియోగీంద్రుండు మొదలుగాఁ గల యభిజ్ఞ శిఖామణులని తెలిసి నీ రాడి తత్కాలోచితక్రియ లన్నియు విన్నాణంబుగాఁ దీర్చి సంశ్రితులగుస్వాములనుసరింప భగవత్సన్నిధి కేతెంచి భక్తిపూర్వకంబుగాఁ బ్రణామం బాచరించి నిత్య విభూతికిం జననాజ్ఞయిమ్మని యద్దేవశిఖామణిం బ్రార్థింప సుప్రసన్నాంతరంగుండై రంగనాధుండు కరుణాపూర్ణకటాక్షామృత వీక్షణంబులనబ్భాగవతోత్తము నీక్షించు సమయంబునఁ దదీయ శిరోభూషణంబయిన దివ్యమాల్యం బొక్కటి జాఱినఁ దిరువరంగగురుం డమ్మాల్యంబుఁ దనపాణిపల్లవంబునంగొని దేశికోత్తమునియుత్తమాంగంబునం జుట్టెనంత నుత్తమనంబియు శ్రీ శఠకోపతీర్థ ప్రసాదాది బహుమతు లొనరింప మిగుల సంతుష్టాంతరంగుండై యామున గురుండు నాహరిని వీడ్కొనిని జాశ్రిత వర్గంబుతో స్వమఠంబుఁ జెంది యంచు గోవిందారాధనం బాచరించి శ్రీరంగగోష్ఠిపూర్ణ మహాపూర్ణ ప్రముఖ నిఖిలదేశికుల శ్రీపాద తీర్థం బుజ్జీవించి వార లారగించినపిమ్మట భగవద్భాగవత శేషస్వీకారం బొనర్చి కాంచీపురినుండి వచ్చిన శ్రీ వైష్ణవులవలన లక్ష్మణాచార్యుండు యాదవుని విడిచి శ్రీగజేంద్ర దాసానుమతిచే వరదునకుం దిరుమంజన కైంకర్యం బొనర్చుచున్న వాఁడన విన నవధరించి సంతసించి మాకడకయ్యిల యాళ్వారిని దోడ్కొని రమ్మని పెరియనంబినిం బనిచివైశాఖ మాసంబునందు శ్రవణనక్షత్రంబున నభి

జిన్ముహూర్తంబునందుఁ బద్మాసనాసీనుండై పాణిపల్లవంబులు మోడ్చి నిజాచార్యుండగు శ్రీరామమిశ్రు శ్రీపాదకమలంబుల ధ్యానించుచు బ్రహ్మవల్లియు భృగువల్లియుఁ బురుషసూక్తంబును నర్చిరాదియు 'శూళ్ విశుంబణి ముహి' లను తిరువాయ్మొళియు సన్నిధి దేశికులను సంధింపశంఖ వేణువీణా కాహళప్రముఖనానావిధ మంగళవాద్య ఘోషంబులు చెలఁగ నృత్త గీతాద్యుత్సవం బాశ్రితులు సల్పుచుండ యోగధారిణాలబ్ధ మధ్యధమని ద్వారంబున వెలువడి స్వపితామహుండగు నాథముని తెఱంగున స్వకీయాచార్య దివ్యపదాంబుజంబులం జెందె నంతఁ దిరువరంగ పెరుమాళరయ్యరు మొదలుగాఁగల దేశికోత్తము లాచార్య విశ్లేషంబు సహింపఁజాలక ఛిన్నమూలంబులగు ద్రుమంబులమాడ్కిఁ బుడమింబడి మిగుల వగలం బొగులుచుండం జూచియచ్చటి సాత్త్వికపుంగవులు కొందఱు వారల నూఱడించి శ్రీ యామునాచార్య పుత్రుండగు పిళ్లైక్కరశునంబి తోడంగూడి చరమకైంకర్యంబు క్రమంబుగా సలుప సమకట్టియున్న సమయంబున దేవదాసీజనం బేతెంచి మరద్వారాంగణాదులందు సమ్మార్జన ప్రోక్షణాదుల స్థలశుద్ధి యొనర్చి యచట బ్రహ్మరథంబుఁ దెచ్చియుంచి కుశకూర్చల రక్తోత్పలమాల్యంబులను శుభ్రచామరంబులచే మఱియు విచిత్రంబులగు పట్టుకుచ్చులచే నలంకరించి యవ్విమాన ద్వార చతుష్టయంబునందు బాలకదళీస్తంభంబులు నాటి నవక్రముకమంజరులచే బాలరసాల ఖండంబులచేఁ బలువిధంబులగు ఫలంబులచేఁ జిత్ర విచిత్ర పతాకంబులచే నలంకృతిఁ గావించి పూర్వదక్షిణ పశ్చిమోత్తర ద్వారంబులఁ బాలాశాశ్వత్థఖాది రౌదుంబర పల్లవంబులచే దోరణంబులు నిర్మించి యవ్విమాన సమీపభూతలంబునందు ద్రోణ మాత్రప్రమాణ ధాన్యంబుచే మండపంబు రచియించి తన్మధ్య ప్రదేశంబునఁ బూర్ణకుంభం బొక్కటి నిలిపి తన్మంటపకోణ చతుష్టయంబునందు నాలుగు పూర్ణకలశంబులుంచి మగిడి కేశవాదిద్వాదశనామంబు లుచ్చరించుచుఁ బ్రాగాదిదిశలందు శుద్ధజల పూరితంబులగు ఘటంబు లెనిమిదింటిం బ్రతిష్ఠించి కుశదూర్వాదర్భ విష్ణుక్రాంత ప్రసూన మాలికలచేఁ గలశంబులవి యన్నియు నలంకరించి గురుపరంపరా పూర్వకంబుగా మంత్రరత్నంబను సంధించుచు నక్కుంభంబుల నన్నియు నర్చించి ద్వాదశ నామంబులచేఁ గలశస్థాపనంబుచేసి తదనంతరం బాయామున గురుచరమదివ్య విగ్రహంబునకుం బంచామృతస్నానం బాచరించి యీశాన్య భాగస్థిత సంకర్షణ కుంభంబు దక్కఁ దక్కిన నాల్గు కుంభంబులెత్తి శ్రీ పురుషసూక్తంబుచే నభిషేకం బొనర్చి యద్దేశికులందఱాతీర్థంబుఁ దమతమ శిరంబులఁ బ్రోక్షించుకొని యున్నయంతఁ దచ్చరమ

కైంకర్యకర్త యగుపిళ్లైక్కొరశునంబి స్వపాణిపద్మంబునం దొక తాంబూలం బుంచుకొని భక్తి పూర్వకంబుగా నద్దేశికోత్తములకుం బ్రదక్షిణం బాచరించి యున్నంత మఠ ద్వారాంగణ ప్రదేశంబున గోమయకృత స్థండిలంబునందు ద్రోణమాత్ర వ్రీహులు పఱచి ముసలోలూఖలంబులు మంత్ర పూతజలంబుచే శోధించి యభినవ వస్త్రంబులంజుట్టి యాయులూఖలంబు వ్రీహిమండపమధ్యంబు నం దుంచి యందు హరిద్రాని క్షేపణంబుచేసి శుభ్రవస్త్ర మాలాద్యలంకార శోభితంబును బంచసంస్కార సంస్కృతంబు నగుదేవ దాసీజనంబా హరిద్రాశకల సముదాయంబుఁ బూర్ణించినయంత సాత్త్వికులా మండపంబునకు నవచేల వేష్టనం బొనరించి యందుఁ ద్రివిక్రమవ్యాపార ప్రతిపాదక మంత్రంబుల నుల్లేఖనం బొనర్చి పృథివీదైవత్యం బగునాయుల్లేఖనంబునందు ప్రాగాద్యష్ట దిశలదివ్యతర చూర్ణతైలాను లేపనమాల్యాలా జదుగ్ధదధిశుద్ధజల పూర్ణంబులు నుదర్భ పవిత్రాశ్వత్థపల్లవ పవిత్రంబులు నగుకలశంబులు మంత్ర రత్నంబను సంధించుచుఁ బ్రాగాదిక్రమంబుగా స్థాపించి పరమాకాశ దైవత్యం బగునా హరిద్రాచూర్ణంబునందు దివ్యనక్షత్రదైవత్యం బగురిత్తుషోపలలాజంబులుంచి తదుభయద్రవ్య పూరితంబగు పాత్రంబుఁ దూర్పుదెసనుంచి యమ్మహాభాగవతాంఘ్రి నీరజనీర పూరితకుంభంబుఁ బడమదెస నిలిపి స్వాములకు సమర్పణీయంబగు ద్రవ్యంబు దగ్భాగంబునం దొకపాత్రయందుంచి భగవచ్ఛేషభూతంబగు శ్రీమాలాక్షౌమచేల నిర్మాల్యాది ప్రసాదంబుల దక్షిణదిగ్భాగంబున నొకసౌవర్ణ పాత్రంబునందుంచి యాశ్రితవందారు విమల చరమవిగ్రహంబునకు సాష్టాంగ ప్రణామం బాచరించి యద్దేశికులంద ఱమ్మహాత్ముని భక్తిభావనచేఁ దమతమ దివ్యచిత్తంబులం బ్రవేశింపంజేసి పరివేష్టించి యున్నంత శ్రీమధురకవి ప్రబంధంబును శ్రీ విష్ణుచిత్త ప్రణీత మంగళాశాసనగాథా దశకంబును నర్చిరాదిగత ప్రతిపాదక శ్రీశఠ కోపప్రోక్త గాథా దశకంబును దిరువరంగ దేశికుండు దేవగానంబుచే ననుసంధించినపిదప నద్దేశికోత్తము లంద ఱవ్విమానముం గొని నృత్తగీత వాద్యఘోషంబుతోఁ దిరువృత్తం బనుసంధించుచుఁ దిరువీథీ ప్రదక్షిణం బాచరించివచ్చి మఠద్వారంబునం దాప్రబంధంబు నిగమించి యగ్గురుచరమ విగ్రహంబునకు భగవచ్ఛేష భూతంబు లగుతైల చూర్ణంబు లర్పించి యవశిష్టకల శోదకంబులచే మగిడి తిరుమంజనం బాచరించి శ్రీచూర్ణ రేఖాంచితాంతరాళంబులగు ద్వాదశోర్ధ్వ పుండ్రంబులు లలాటాదిశుభాంగంబులయందు రచియించి శ్రీరంగ రాజప్రేషితంబులగు దివ్యమాల్యానులేపన పీతాంబరాదులచే నద్దివ్య చరమవిగ్రహంబు నలంకరించి స్వాచార్య శేషం

బగుతైల చూర్ణాదికంబు దిరువరంగగురుండు మొదలుగాఁ గల దేశికులందఱుం బరిగ్రహించి యాచార్య విశ్లేషంబునకు నార్తిపడుచు నా బ్రహ్మరథంబునం దాదివ్యచరమ విగ్రహంబుంచి తిరువడి త్తాంగులు భుజంబులందు వహించి యల్లనల్లన నడుగు లిడుచుండ శంఖభేరీ పటహకాహాళవేణు వీణాది దివ్యమంగళవాద్య రవంబులు చెలంగ రమణీయ నృత్తగీతాదిరవం బొప్పుచుండ నగ్రభాగంబున శ్రీపరాంకుశ పరకాలాదిదివ్యసూరి శ్రీసూక్తులను సంధింపఁ బశ్చాద్భాగంబునం దామ్నాయ ఘోషంబు చెలంగ నడుంగులకు మడుంగు లిడుచు స్వామిలందఱిజు దండంబులు కేలుఁదమ్ములం గీలించి చనుచుండ నందొక సాత్త్విక పుంగవుండు సంకర్షణ కుంభంబుఁ దనశిరంబునం బూని కూడ విచ్చేయ నాచారలాజమిశిత ప్రసూనంబు లాత్రోవ నంతటం జల్లుచు నడవ నద్దివ్యదేశ నివాసినులగు శ్రీవైష్ణవ సువాసినులు మంగళహారతులు పాణి పల్లవంబు లంగీలించి పురోభాగంబునం దరుగుచుండ నద్దివ్య విమానంబున కిరుగెలంకుల ధవళవాల వ్యజనంబులు వీర రాకాసుధాకర ధవళకౌశేయకూర్చ లెదుట విసరుచు వెనుకడుంగు లిడుచుఁ గొంద ఱార్యు లరుగుచుండఁ దదీయదివ్య చేష్టితప్రతిపాదక గాధలను సంధించుచు వంది బృందంబునఁ గొందఱు విద్వత్పురందరు లరుగుచుండఁ దిరువీధులకుం బ్రదక్షిణం బొనర్చి తిరుక్కారిహ తీర్థ ఘట్టంబునందుఁ బ్రవేశింపంజేసి యాసంకర్షణకుంభోదకంబుచే నచట ద్వయ మనుసంధించుచు భూశుద్ధిఁ గావించి తత్ప్రదేశంబునం దాబ్రహ్మ రథంబుడించి యతిసంస్కార విధాయక శాస్త్రోక్తక్రియలు సాకల్యంబుగా నొనర్చి యద్దివ్య విమానంబువలన నద్దేశికోత్తముని దివ్యచరమ విగ్రహంబు తిరుప్పళ్లి యొనర్చు కాలంబున ముందు నిజాచార్యుని యుక్తుండగు మహాపూర్ణగురుండు కాంచీపురంబునకుం జనుదెంచి శ్రీగజేంద్రదాసునిఁ బొడగాంచి యతని యనుమతిఁ బెరుందేవి తాయారుతోడంగూడియున్న వరదునిం గాంచి యభినుతించి వారిసమ్మతిచే నిలయాళ్వారిని దోడ్కొని వచ్చి శ్రీరంగధామ బాహ్యోద్యాన ప్రదేశంబునఁ గవేరకన్యా గర్భంబునం దిరుక్కారిహతీర్థ ఘట్టంబునఁ బెంపారుచున్న గుంపులం జూచి యచటం గనంబడు జనుల నడిగి యాము నాచార్యచరమావస్థ యెఱింగి పెద్దయుం బ్రొద్దాలక్ష్మణార్యులతో దుఃఖించి సమీపంబున కేతెంచి స్వగురుచరమ విగ్రహం బీక్షించి వలగొని మ్రొక్కియుండె నంతట నయ్యిలయాళ్వారు పరమగురుని చరమదశ నీక్షించి యనేక ప్రకారంబుల శోకవ్యాకులితాంత రంగుడై ప్రదక్షిణ పూర్వకంబుగా సాష్టాంగ ప్రణామం బాచరించి తదీయాకుంచితాంగుళిత్రయంబు నీక్షించి యమ్మహాత్ముని యభిప్రా

యంబుఁ దెలిసి మహాత్మామీరు దలంచిన కార్యంబులు మూఁడు దేవరవారి యనుగ్రహంబుచే సమర్థించెద నని శపథంబు చేసినం బూర్వక్రమంబుగా మూఁడంగుళంబులు నచటివా రందఱుం గని యక్కజపడఁ బ్రసారితంబు లయ్యె నంత వా లక్ష్మణ గురుండును నద్దివ్య సూరిచరమ విగ్రహంబునకుం బ్రదక్షిణ ప్రణామంబు లాచరించి యవభృథంబులు గావించియామునా చార్యకుమారుం డగుపిళ్లైక్కారశునంబి మొదలైన యార్యులతో ఖననాదిచరమక్రియ లన్నియు నిర్వర్తింపం జేసి యాచార్యవిశ్లేషజనిత దుఃఖసంతప్తహృదయుండై యచట నుండ నొల్లక కాంచీపురంబుఁ జెంది యందు వరదున కెప్పటియట్ల కైంకర్యంబు సేయుచుండె నంత.

## పరిత్తికొళ్లైనాచ్చియారు వైభవము

సీ. దేవదేవునిఁ బెరుం•దేవీసహాయునిఁ, గరిగిరివరదునిఁ • గన్నులార
సాక్షాత్కరించిన • సాధుసత్తముఁ దిరు,క్కచ్చినంబిని జగ•త్కలుషహరునిఁ
గని మ్రొక్కి శిష్యునిఁ•గా నన్నుఁ గైకొను,మని భక్తితో లక్ష్మ•ణార్యుఁడనిన
భగవదాజ్ఞారూప•వర్ణాశ్రమాచార, ధర్మసేతువుఁ ద్రెంపఁ • దగునె యెట్టి
తే. జ్ఞాని కైనను లక్ష్మణా•చార్య యనుచు, నంబి యన విని కరిగిరి • నాథసూక్తి
నాశ్రయించె మహాపూర్ణు • ననఘుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె• మోదమలర.

సీ. ఆశ్రమస్వీకార • మాచరించినమీఁదఁ, గోవెల కేతెంచి • గురువరేణ్యుఁ
డమలశరారి సూ•క్త్యర్థానుభవముచేఁ, గాలము జరపుచు • లీల నుండి
వేంకటేశుని కిష్ట•కైంకర్య మొనరింప, ననుప ననంతార్యుఁ • డరిగి యచటఁ
గైంకర్యములు సల్పఁ • గర్ణామృత బుగా, నావార్త విని యంజ•నాద్రిపతికి
తే. మంగళాశాసన మొనర్ప • మదిఁ దలంచి, సంశ్రితౌఘముతో రంగ•శౌరి నడిగి
యరుగుదెంచుచు నుండెవృ•షాద్రికనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ మహితనామక్షేత్ర•మందిరుఁ బద్మలో,చనునిఁ గన్గొని మ్రొక్కి • సన్నుతించి
దేహళీపురమున • దేవదేవునిఁ ద్రివి,క్రమునిఁ గన్నులవిందు • గా భజించి
మార్గమధ్యస్థిత•మహనీయదివ్య దే,శములందు హరికి నం•జలి యొనర్చి
వచ్చి విద్వజ్జనా•వాస మౌనష్ట స•హస్రనామగ్రామ • మంది శిష్య
తే, సంఘములతోడ మార్గవి•శ్రాంతిఁ జెంది, తత్పురోద్యానవనమునఁ • దగ వసించె
వరగుణస్ఫూర్తి యతిచక్ర•వర్తి యనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. వరపరిత్తికొల్లై • వరదార్యుఁ డొక్కఁడు, యజ్ఞేశనామకా•భిజ్ఞుఁ డొకఁడు
యతిరాజునకు శిష్యు • లాయిర్వు రయ్యేర, వసియించి రబ్బుధ•వర్యులందు
నతిదరిద్రుఁడు వర•దార్యుఁ డాయజ్ఞేశుఁ, డాఢ్యుఁడు గావున • నతనికడకుఁ
దమశుభాగమన మా•తనికి నెఱింగింపఁ, బ్రాజ్ఞుల నిర్వురఁ • బంచె గురుఁడు

తే. వారు యతిపతియాజ్ఞచే • వచ్చి పురము, జొచ్చిచెప్పిరి యజ్ఞేశ•సూరి కిట్లు
గురునివృత్తాంత మంతయుఁ•గూర్మి ననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. యజ్ఞేశ యీయగ్ర•హారోపవనమునం, దరుగుదెంచి వసించె • యతివరేణ్యుఁ
డచటికేతెంచి మీ • రమ్మహాత్మునిఁ గాంచి, యర్చింపఁదగుదు రం•చాప్త్యు లనిన
స్వాగతం బడుగక • యర్ఘ్యపాద్యాదుల, వారి నర్చింపక • యూర కున్న
యజ్ఞేశు నీక్షించి • యధ్వశ్రమార్తు లౌ,నాసూరు లతనియం • దాస విడిచి

తే. వేగవిచ్చేసి యతిరాజు•వినఁగఁదాఁ, బోయివచ్చిన గ్రమమంతఁ • బొసఁగఁదెలుప
నతని యతిపతి గననొల్లఁ • డాయెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

వ. అంత. 48

సీ. వరదార్యుఁ డక్షయ•పాత్రముఁ గైకొని, శిలము పల్లెలవెంట • సలుపుచుండ
సంయమీంద్రుఁడు శిష్య•సహితుఁడై యతనిగృ•హాంగణంబున కేఁగి•యచటనిలువ
నతిజీర్ణవస్త్రయు • నవ్వరదునిదేవి, యగుపరిత్తికొల్లై•యమ్మ యంత
వ్రీడచేఁ దనయిల్లు • వెల్వడకయు గట్టి,గాఁ గవాటము మూసి • గడియ దాఁపి

తే. ద్వయముఁ బల్కుచునుండె త్రి•దండపాణి,వరదుఁడేడని యడుగఁ ద•త్స్వర మెఱింగి
గురుఁడితం డని తెలిసె నా•గరిత యనుచు వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. అప్పు డప్పతివ్రతాతిలకం బాత్మగతంబున

సీ. మాపాలఁ గృపయుంచి • మమ్ముఁ గటాక్షింప, మాయింటి కేతెంచె•మద్గురుండు
నిట్లు దిక్చేల నై • యేరీతిఁ బల్కుదు, నెట్లు సేవించెద • నిమ్మహాత్ము
నగ్నయై యున్నట్టి • నాతి పూరుషులతో, భాషింపఁ దగదని • ప్రాజ్ఞులంద్రు
మాటాడకుంటినా • మాయింట నిల్వక, నరుగు నస్మద్గురుం • డని తలంచి

తే. వెఱచి కార్పాసవనలక్ష్మి • వ్రీడపడుచు, స్వకరతాళత్రయధ్వని • సలుప సంజ్ఞ
నింగితజ్ఞుఁడు యతిచంద్రుఁ • డేఁగెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. తన తిరుముడిచుట్టుఁ, దళుకొత్తుశాటికఁ, బాణిపల్లవముచేఁ • బట్టియెత్తి
వేగ లక్ష్మణముని • విసరివైచిన నది, యాయింటఁ బడిన నా,యతివ చూచి
తనగురుఁ డిదె నని • తాల్చి కవాటముఁ, దెఱచి వెల్వడి వచ్చి • గురువరువకు
నతిభక్తి మ్రొక్కిడి • యర్ఘ్యపాద్యాదుల, నర్చ లొనర్చి త•దాశ్రితులను

తే. గ్రమముగానట్లు పూజించి • గారవించి, యందఱికి వారి కాతిథ్య • మాచరించి
తనదుచిత్తమునందిట్లు • దలఁచెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. తొలిజన్మములయందు • దొడ్డపుణ్యం బేమి, సలిపితిమో యెట్టి • సత్తవంబు
లాచరించితిమొ యె • ట్లర్హతముల కేమి, దాన మిచ్చితిమొ చే•తనులఁ బ్రోవ
నవని ననంతాంశుఁ • డై జనించిన లక్ష్మణార్యుఁడు మాయింటి • కరుగుదెంచె
యతిరాజమద్గురుఁ • డమితశిష్యుఁడును నీ,యార్యున కాతిథ్య • మాచరింతుఁ

తే. దలఁప గహ్వైన నోలెఁడు•ధాన్యమైన, వేశ్మమునలేవు పతియుంచ • వృత్తిధాన్య
మేమియగు వీరికని యెంచె • నింతియనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. తమపూర్వకర్మ బం•ధములచే జీవుల,గములు సంసారచ•క్రమునఁ దగిలి
పుట్టుచు గిట్టుచు • భూరిదుఃఖములచే, వ్యాకులపడఁగ న•వ్యాజకృపను
వారిని గ్రీఁగంట • నారాయణుఁడు చూచి, యాచార్యరూపి యై • యవతరించి
జ్ఞానాంజనశలాకఁ • జక్షురున్మీలన, మొనరించి వారల • నుద్ధరించెఁ

తే. గాన గుర్వర్థ మయి పశు•కాయవిత్త, ధాన్యవస్త్రగృహాదుల • దాల్చె నెవ్వఁ
డతఁడె వోశిష్యుఁ డనియెంచె•నబలయనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. అదియునుం గాక. 55

సీ. అలసి యతీశ్వరుఁ • డంతేనివాసుల,తోడ మాయింటికి • నేఁడు వచ్చె
నది గాన నే నకృ•త్యంబైనఁ గావించి, విందు చేసెద వీరి • కందఱికిని
బరకాలముని ముందు • పశ్యతోహరవృత్తి, బహుధన మార్జించి • భాగవతుల
కారాధన మొనర్చె•నచ్యుతార్థము సేయు, పాపమైనను బుణ్య•భావ మొందు

తే. మురహరునిమాని సల్పిన•పుణ్యమైనఁ, బాపమగుఁగాన యాచార్య•రూపహరికి
నర్చ చేసెదనని యెంచె • నతివయనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. పొలుపారునాల్గు వి•భూతులు గలవేని, యట్లీశ్వరద్వయ • మలరునేని
కృప గురుఁడొనరించు•నుపకారమునకుఁ బ్ర•త్యుపకృతిసలుపంగ•యుక్తమనుచు

మదిలోఁ దలంచి యా•మగువ గుర్వర్థమై, సాహస మొక్కటి • సలుపఁ దలఁచి
ధనమదాంధుఁడును గం•దర్పబాణాతురుఁ, డూరుజుఁ డొక్కఁడీ•యూరఁ గలఁడు

తే. వాఁడు ననుఁ జూచి నిత్యము • వాంఛపడును, గాన వానికి మే నమ్మి•కని ధనంబు
గురుని బూజింతునని యెంచె•గరితయనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. మాంసమేదోస్నాయు•మజ్జారుధిరశుక్ల, మలమూత్రపూరిత • మలినదేహ
మక్కామివైశ్యున • కమ్మి ద్రవ్యముఁ దెచ్చి, యార్యు నర్చించెద • నని తలంచి
స్వామి దేవరవారు • క్షణమాత్ర మీయింట, విశ్రమించిన వస్తు • వితతు లిచటఁ
గనఁబడు మీయను•గ్రహమువల్లను దదీ,యారాధనార్థము • యతివరేణ్య

తే. యనుచుఁ గార్పాసవనలక్ష్మి•యాత్మగురున, కతిమృదూక్తుల విన్నప•మాచరించి
చని మదాంధుని వైశ్యునిఁ•గనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. పూర్ణచంద్రునిఁబోలు•ముఖపద్మ మమృతసుం,దరతరమందస్మి•తమున మెఱయఁ
దనసోయగపుమేలు • తళుకువాల్గన్నులు, మరుతూపులై వాని • మనముఁ గలఁపఁ
దనతిరుమేని సౌం•దర్య మామందునిఁ, బంచాస్త్రవేదన • పాలుసేయ
వైశ్యకుమార నీ•వాంఛిత మీరేయి, సిద్ధించు విను మొక • చిన్నమాట

తే. మహితశిష్యగణంబుతో•మద్గురుండు, వచ్చినాఁ డాతిథేయము • నలసినట్లు
సలుపు మాతని కనియె నా•సాధ్వి యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. తదనంతరంబ. 60

సీ. కార్పాసవనలక్ష్మి • ఘనసుధామధురోక్తు, లాలించి యమ్మద • నాతురుండు
తనమది నిట్లని • తలఁచె ముం దీలేమ, పలుకరించిన మూఁగ • పగిదిఁ జనును
కనుసంజ్ఞ చేసినఁ • గన్నెత్తి చూడదు, వరవస్త్రభూషణ • వసుచయములు
పంప గ్రహింప ద•ప్పడఁతి యిట్లిప్పుడు, కత్యంతరము లేదు • గడచి వచ్చి

తే. నాదు నంతఃపురముఁ జెంది • నన్నువలచె, నేఁటికీడేరె నాకోర్కె • నెలఁత గోరు
ద్రవ్య మిచ్చెదనని వాఁడు•దలఁచె ననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. శాలితండుల ముద్గ•చణక మాషాదులు, కూరగాయలు దధి•క్షీరములును
సద్యోఘృతము తైల•శర్కరామ్లాదులు, సకలపాత్రౌఘము • సరసఫలము
లర్పించి యవి వర•దార్యునియింటికి, వైశ్యుఁ డంపించె నా•వనితవెంట
యతిరాజుకనుమొగి • నాపదార్థము లన్ని, యుంచి యద్దేవి సే•వించి యున్న

తే. నప్పతివ్రతసుగుణాళి • కలరి గురుఁడు, తల్లి నీ రాడి పెరుమాళ్ళ • తళిహ సీవె
సేయుమని సంశ్రితులు వినఁ•జెప్పెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఆసాధ్వితోఁ గొంద•ఱార్యులు తనయాజ్ఞఁ, దళిహ సేయంగఁ ద్రి•దండపాణి
భవ్యతీర్థంబగు • పద్మాకరమునందు, నవగాహనము చేసి • యరుగుదెంచి
శ్రీచూర్ణ రేఖలఁ • జెన్నొందు ధవళోర్ధ్వ, పుండ్రము లుచితాంగ•ముల ధరించి
హరి కర్చనముచేసి • యద్దేశికుల కెల్లఁ, బెరుమాళ్ళతీర్థముఁ • బ్రీతి నిచ్చి

తే. పఙ్క్తులుగ వారిఁ గూర్చుండఁబనిచి మొదట, మంచిపీఠమునందు వ•సించియంత
వేగ పరిమారు మనియె నా•పెలఁది ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. శుచిరుచిరతదాన్న•సూపాద్యశాకముల్, చవి మించుమంచిప•చ్చళ్లు కొన్ని
సురభిహింగూజీర • సుమరీచిసర్షపా,న్విత నిరుపమతింత్రి•ణీరసములు
వడ లతిరసములు • వరషాడబాపూప, మోదకాదిక భక్ష్య•ముఖ్యములును
బహువిధామృతరస•ఫలశర్కరైలాది, భవ్యద్రవీభూత•పాయసములు

తే. జాంబవైలాలవణవిశ్వ•సహితదధియు, వారి కందఱ కర్పించె • వలసినట్లు
ప్రాజ్ఞ కార్పాసవనలక్ష్మి•భక్తి ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అట్లార్యజనులతో • నారగించి యతీంద్రుఁ, డాయింటిమొగి నుచి • తాసనమునఁ
గూర్చుండి శ్రీశర • కోపదివ్యప్రబం, ధార్థ మాశ్రితులగు • నాన తిచ్చు
తఱి వరదార్యుఁడు • చరితోంఛవృత్తియై, యేతెంచి యాధాన్య • మింటనుంచి
గురున కాతిథ్య మే • కరణిని నెఱవేఱెఁ, దెల్పు మంచును దన • దేవి నడుగ

తే. నమ్మహాత్మున కానతి • యతివరునకుఁ, దాను జేసినయాతిథ్య • తత్త్వ మంతఁ
జెప్ప నాతఁడు విని సంత • సించె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. నీవు బాలిక వైన • నిర్మలసుజ్ఞాన, గురుభక్తిశీలముల్ • గొప్ప వయ్యె
నీవు చేసినపని • నిత్యసూరుల కైనఁ, గొనియాడ నర్హమౌ • కువలయాక్షి
భాగ్యోదయమున మ • ద్భార్య వైతివి గాని, పరదేవతవు మాకు • నరసి చూడ
సేవృత్తిచే నైన ' నిల ధన మార్జించి, తత్త్వబోధకుఁ డైన • తనగురునకు

తే. స్థితియొనర్చినవాఁడె యం • తేనివాసి. యన్యుఁ డాచార్యవంచకుఁ • డనుచు సతిని
జాల మన్నించి పలికె నా • సౌమ్యుఁ డనుచు, వాదిభీకగురుఁడనె • మోదమలర.

వ. అట్లమ్మానినీమణిని సన్మానించి కార్పాసారాను వరదావార్యుం డఖిలద్రావిడామ్నా
యవ్యాఖ్యాన వైఖరీగరిష్ఠుం డగుయతి శ్రేష్ఠునిం గాంచి భక్తి పూర్వకంబుగా

సాష్టాంగ ప్రణామం బాచరించి కరకమలంబులు ముకుళించి యిట్లనియె దేవా నీయవతారంబు చరాచరాత్మకం బగులోక త్రయంబునకుం బరమహితావహంబు సాక్షాదనంత స్వరూపుండ వగునీజన్మ కర్మంబులు పరమాశ్చర్యకరంబులు జగ ద్విలక్షణంబులు విష్ణుమాయారచిత పుత్రమిత్ర కళత్రాదిబాంధవా భాసాసక్తచిత్తు లగుచేతను లంధకారకూ పనిపతిత జంతువులమాడ్కి జ్ఞానయాథాత్మ్య ప్రదాయ కుండవగు నిన్నుఁ గనలేక సంసార కూపంబునంబడి చరింతురు సూర్యుండంధ కారంబుఁ బాపుగతి నజ్ఞానంబు జ్ఞానప్రదీపంబుచే నిర్వర్తింపంజేసి యజ్జీవ లోకం బుజ్జీవింపం జేయుటకు నీకంటె సమర్థుండులేఁడు భవత్పాదార విందర జః స్పర్శంబుచే రాజపుత్రిని విడిచి బ్రహ్మరాక్షసుండ క్షయానంద ప్రదాయకం బగు దివ్యలోకంబుగాంచె నీ భూలోకంబునందు మీరవతరింపరేని మాబోఁటి చేతనులకు గతియేరీతి సంభవించు నభిజ్ఞులైనను గలికలుషదూషితాంతః కరణులై పాషండవృత్తుల నాశ్రయించి నిరయంబు నంబడుదురు భవదీయదివ్య పాదార వింద సేవామృత వృష్టి లభింప కతాపత్రయ దారుణదవాన లాభివ్యాప్తి యీచేతను లకెట్లు శమించు సంసార సర్పోగ్ర విషంబునకు భవద్దివ్య నామోచ్చారణంబు గరుడమంత్రంబై చెల్లు భవాభీల ఘర్మాభితప్తులకు భవద్దర్శనంబు వార్షిక బలాహ కాయమానంబగుఁ గామగ్రహోన్మాద వ్యాధిబాధితులకుం ద్వదీయ శ్రీపాదతీర్థంబు దివ్యౌషధర సాయనంబుగాఁ దలంతు ననేకచ్ఛాత్ర పరివృతుండవై యకించనుం డైన యీ దాసజనునియందుం గృపచేఁగార్పాస వృక్షచ్ఛా దితంబయిన యడియేని గృహం బన్వేషించుచు యుష్మదీయ దివ్య పదాబ్జరజః కణంబులచేఁ బవిత్రంబులు సేయ నిట్లు విచ్చేసితిరి భవద్దర్శనంబుచే మదీయ పూర్వ పాపంబులన్నియు నివ ర్తించె ధన్యుఁడను గృతకృతుండను నైతి మదీయపితృవర్గంబుఁ జెందె నస్మజ్జ న్మంబు నేఁడు సఫలం బయ్యెనని యిట్లు బహువిధంబుల స్తుతియించి గురునిచే నాజ్ఞప్తుండై తదీయ శ్రీపాదతీర్థం బుజ్జీవించి భగవద్భాగవతాచార్య భుక్తావశిష్టం బై శుచిత్వభోగ్యత్వాది గుణవిశిష్టంబైన యాయన్నం బారగించి నిజదేవీ సహి తుండై సుఖంబుండెనంత నాసంయ మీంద్రుం డాదంపతుల పరస్పరైక మత్యం బవలోకించి శిష్యజ నంబుతో సంతసించి వారలచే నారాధితుండగుచుఁ గొన్ని దిన బు లుండెనంత.

సీ. యతిశేఖరునితళి, హప్రసాదమును శ్రీ, పాదతీర్థము గొని, పరమసాధ్వి యాపరిత్తికొల్లె, యమ్మ రాతిరి తన, భర్తతోఁ జని వైశ్య, భవన మొంది

చయ్యనఁ దీర్థ ప్ర • సాదము లొసఁగిన, నవి వాఁడు గైకొని • యనుభవించి
మంచివివేకముఁ • గాంచి యద్దేవికిఁ, గరములు మోడ్చి యీ • కరణిఁ బల్కె

తే. నమ్మపాపాత్ముడనుమద•నాతురుండ, ధనమదాంధుడనగునన్నుఁ•దనయుఁడనుచుఁ
దలఁచి కరుణింపు మని వాఁడు•పలికెననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. తల్లి నీవే మాకుఁ • దండ్రి నీభర్తయే, తనయునిఁ గరుణింపఁ • దగునుమీకుఁ
దల్లి నీయెడ దొడ్డ•తప్పుఁ జేసితి దాని. క్షమియింపు మనుచుఁ బ్రఁ•క్రమముఁజేసి
చాఁగిలఁబడి మ్రొక్కె • సాధ్వివ న్నైల్లైన, సన్మార్గగతునిఁ గా • నల్పు మింక
భవదీయగురునిశ్రీ • పాదసంబంధిని, గాఁ జేయుమా నన్నుఁ • గన్నతల్లి

తే. యని వణిగ్వరుఁడన విని•యాలతాంగి, యాత్మభర్తకుఁ దెల్పిన•నతఁడువానిఁ
దొడుకచనియెను యతిరాజు•కడకు ననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. వరదార్యుఁ డావణి • గ్వరునిఁ దోడ్కొని వచ్చి. శిష్యునిఁ గా యతి • శేఖరునకు
నర్పింప వానికి • యతిపతి పంచసం. స్కారాదిహితములు • కరుణ సలుప
సాత్త్వికుఁడై వాఁడు • సద్భక్తితో గురు. దక్షిణ గా బహు • ధన మొసంగి
ప్రార్థింప నది గొని • ప్రాజ్ఞులు మెచ్చ నా. వైశ్యునిఁ బంపించి • వరదువింటఁ

తే. గొన్నిదివసము లుండెన•గ్గురువ రేణ్యుఁ, డంత యజ్ఞేశుఁడనుతాప•మందిగురున
కర్చనలుపంగఁ దలఁచి యి•ట్లనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. ఇచటికి గురువరుఁ • డేతెంచినాఁ డని, వినియు నూరక యుంటి • విననియట్టు
లస్మదార్యుండైన • యమ్మహాత్మునిపూజఁ, గావింపఁ గొలఁ గాని • కలిమియేల
యని తనమనమునం • దనుతాపపడి గురు, స్వామి కాతిథ్యము • నల్పఁ దలఁచి
బహుపదార్థములు సం•పాదించి గృహమునం, దుంచియజ్ఞేశుఁడా•యుడయవరులు

తే. వరదగురుమందిరంబున • వాస మొంది, యున్నవా రని శిష్యులు • విన్నవింపఁ
దెలిసి యచ్చోటికై చను • దెంచె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. అంత యాచ్చా నను ద్రవిడ నామాంతరంబు గలయజ్ఞేశుం డతివ్యాకులితాంతః కరణుండై విషాదంబుఁ జెంది యతిత్వరితగతి నేతెంచి యచ్చానని ప్రసిద్ధిఁగాంచిన కార్పాసారామవరదార్యుని గృహంబునందు మృద్వాస్తరణా స్తీర్ణంబైన యొక విశాలభవ్య పీఠంబునందు సుఖాసీనుండై శ్రీ శఠకోపదివ్య ప్రబంధార్థంబు లాశ్రితులకుం బ్రసాదించు చున్న శ్రీ మద్రామానుజమునివరునిం గాంచి సాష్టాంగ ప్రణామం బాచరించి సాపరాధచేతనుని వీని ననుగ్రహింపు మని మిగుల నార్తిం

డై పడియున్నఁ బరమకారుణికుం డగుగురు ధరణీశ్వరుం డతనిం దనకరుణా కటాక్ష వీక్షణంబుల నీక్షించి యాశ్రితాభయ ప్రదంబగు నిజపాణి పల్లవంబుచే నతనిశిరంబు దువ్వి క్రుచ్చియెత్తి లోకశిక్షార్థంబుగా నతని కిట్లనియె వత్సా ప్రపన్నుం డగుచేతనునకుం బంచసంస్కార సంపత్తియు శ్రీ మహాభాగవతార్చనంబు నాచార్యాధీన వృత్తియు నర్థపంచకజ్ఞానంబు దదీయాను వర్తనంబు శ్రీ వైష్ణవత్వపూర్తికరంబు లగుపరమధర్మంబు లిద్ధర్మ పంచకంబునందు మార్గ శ్రాంతుండై తనయింటి కేతెంచిన శ్రీ వైష్ణవాతిథినిం జూచి సాక్షాత్కృతుండగు పుండరీ కాక్షునింగాఁ దలంచియర్ఘ్య పాద్యాది విధులంబూజించి మృష్టాన్నదానాదుల సంతృప్తునింజేసి చందన కుసుమతాంబూలాది ప్రదానంబుచేత సంతుష్టునిం జేసి తద్భుక్తావశిష్టాన్నంబు నిజపుత్రమిత్ర కళత్రాదులతో భుజించుట పరమ ధర్మం బట్లు సేయ కున్నవానికి శ్రీ వైష్ణవత్వ పూర్తి సంభవింపదు నీవు ఖ్యాతిలాభార్థంబుగా ధర్మానుష్ఠానం బొనర్చినవాఁడవు గాని పూర్వోక్త ప్రపన్న లక్షణ లక్షితుండవు గావు గావున దంభార్థంబుగా ధర్మంబు సల్పుమీబోఁటి వారి గృహంబులు మా కావాసయోగ్యంబులుగా వని గురుం డాన తీయ నాకర్ణించి యతండు లజ్జితుండై చింతాదోధూయ మానమానసుండై కరకమలంబులు మోడ్చి యిట్లనియె. దేవా మదీయాపరాధంబు లన్నియుఁ గరుణాసఖి యగు భవదీయక్షమచే మఱచి నన్నను గ్రహింపుమని విన్నవింత త్వదీయశుభాగమన వార్తాశ్రవణజనితాహ్లాదపోప్లూయమాన మానసుండనై యన్యంబేమి యెఱుంగకున్న సమయంబు నభవత్ప్రేషితుఁగు శ్రీవైవులం జూచి యుపేక్షించితిఁగాని యశ్రద్ధచేతఁ గాదు బహుశిష్య సమేతుండ వగునని న్నారాధిపం దలంచి జాత్యాశ్రయనిమిత్త దుష్టంబులు గానట్టిద్రవ్యంబు లన్నియు సంపాదించి గృహంబునం దుంచి యేతెంచితిఁ గాన శిష్యుండను దాసుండను నగునన్నను గ్రహించి మదీయభవనంబు యుష్మదీయ శ్రీపాదపద్మ రజః కణంబులచేఁ బావనంబు సేయ విచ్చేయ వల యునని యనేకవిధంబులఁ బ్రార్థింప నమ్మహాత్ముండు వత్సా యొక్కహితోపదేశంబుఁ జేసెద నీమదికి రుచియించెనేని విను మది యెయ్యది యన సార్వకాలం బనన్య ప్రపన్నులగు శ్రీ మహాభాగవతుల సకలోపచారంబులచే నర్చించు చుండుము ముముక్షుజనుల కింతకంటెఁ బరంబగు హితంబులేదని యుపదేశించి యజ్ఞేశుని స్వీడ్కొల్పి వరదార్యునిం దదీయమహిషిని నిజనివాసంబున నిలువ నియోగించి యష్టసహస్ర గ్రామంబు విడిచి యపరిమిత శిష్య పరివృతుండై సత్యవ్రత క్షేత్రంబునకుం జనియె నంత. 72

తనియను.—శ్లో॥ శ్రీరామానుజ పాదాబ్జసేవామృతనిషేవిణౌ।
కార్పాసారామక మలావరదౌ దంపతీ భజే॥

సీ. కాంచియం దాతిరు • క్కచ్చినంబిని గాంచి, యతనితోఁ గరిగిరి • కరిగి యందు
దేవరాజును బెరుం • దేవిని సేవించు, చును మూఁడుదినము ల • చ్చోట నుండి
యచటినుం డేతెంచి • యంజనాచలయామ్య, తటమునఁ గపిలతీ • ర్థంబుఁ జెంది
యడు గిడఁ జనదు శే • షాద్రియం దని యెంచి, యచట హరిధ్యాన•మాచరించు

తే. చున్నపదుగురుసూరులఁ • గన్నులారఁ, జూచి కొన్నిదినంబు ల • చ్చోట శిష్య
సహితుఁడై యుండెసంయమి•స్వామియనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. అంత విఠ్ఠలరాయ • డనునాఖ్యగలవాఁడు, తుండీరమండల • ధూర్వహుండు
యతిరాజునకు శిష్యుఁ • డై బహుధన మీయ, నతనిపైఁ గరుణచే•నది గ్రహించి
యంజనాచలనమున • కామడలోన సం, • ఫుల్లపద్మసువర్ణ • ముఖరికడను
ముప్పదివృత్తుల • నొప్పారునలమండి, యం బనుమహదగ్ర • హార మొకటిఁ

తే. జేసి యాశ్రితులకొసంగి • వాసిమీఱఁ, గొన్నిదివసములందుండి • గురువరుండు
తిరిగి తిరుమలకడ కేఁగు • దెంచె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ద్వాదశగురువరా • వాస మై కాపిల, తీర్థేంద్ర మాళ్వారి • తీర్థ మయ్యె
నందువసించురా•మానుజార్యుని ననం, తార్యుఁడుగని మ్రొక్కి•యనియె నిట్లు
వేంకటేశునిఁ జూడ • విచ్చేయు మని పల్క, హరిరూపి యీగిరి,యనుచు నద్రి
కరుగ లే దాళ్వారు • లది గాన వారికి, శిష్యుల మగుమాకుఁ • జెల్ల దంట

తే నాద్రిపై కెక్కననిగురుఁ • డాన తిచ్చి, యయ్యనంతార్యువృషగిరి•కనిపి మరలి
తరలి చని కాంచె శ్రీరంగ • ధామ మనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర

సీ. రామానుజార్యుఁడు • రంగధామముఁజెంది, యున్నంతఁగూరేశుఁ • డొక్కనాఁడు
మహదుత్సవమునందు • మందిరాంగణభూమి, సమ్మార్జన మొనర్చి • జలముచల్లి
తటిఁ గుప్పటపుటంచు • ధవళవస్త్రయుగంబు, ధరియించి సురభిచం•దనము మేన
నలఁది తృణగ్రాహి • లలితేంద్రనీలకుం, డలకాంతి గండమం•డలము లొప్పఁ

తే. గనకకటిసూత్ర కటకోర్మి • కలను దాల్చి, పూలదండలు సిగఁ జుట్టి•పొల్పుమీఱ
వైష్ణవాన్వయుఁ డొకఁ డటు • వచ్చెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర•

సీ. ఆవైష్ణవకుమారుఁ • డాత్రోవ నేతేర, నతనివస్త్రములపై • ననిలగతిని
జలబిందువులు పడ • నలిగి యాతఁడు కూర, పతిని దురుక్తులు • పల్కి చనిన

నంతట భాగవ • తాపచారము వచ్చె, ననుచుఁ గూరాధిపుఁ • డనుతసించె
నటమీఁదఁ గొన్నాళ్ళ • కావైష్ణవుఁడు దేహ, ముడిగి యమక్షయ • మొందనతని

తే. ధర్మరాజు నిరీక్షించి • ధరణి నిన్నుఁ, బాడి దెలియక మాదూత • పట్టి తెచ్చె
నిలకు మరలేఁగు మనుచును • బలికెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర

సీ. ఆవైష్ణవుఁడు భూమి • కరుగుదెంచినవేళ, నతనికాయము దగ్ధ • మయ్యె నంత
పారావతశవంబు•పడి యొక్క యెడ నున్నఁ, జూచి యద్దేహముఁ•జొచ్చియతఁడు
రంగధామునిగోపు • రమునందువసియించి, జాతిస్మరణ మొంది•జలము మేఁతఁ
జాలించి యొకనాఁడు•స్వామియుత్సవమున, యతిరాజు కూరేశుఁ•డార్యవరులఁ

తే. గూడియేతేరఁ గూరేశ•గురునిచరణ, కమలములయందుఁ బడియది•కదలకున్నఁ
జూచి విస్మయ మొందె నా•సూరి యనుచు, వాదిభీకరగురుఁడనె•మోద మలర.

సీ. అట్లు పారావత•మంఘ్రులఁ బడఁ జూచి, యతఁడిదే మని సంది•యంబుఁ జెంద
నపరాధ మోర్చితి • మని మీరు ముమ్మాఱు, పలికినఁ గాని యీ ౘ పక్షి లేవ
దని లక్ష్మణాచార్య • లాన తిచ్చిన విని, యట్లు కూరాధిపుఁ • డనినయంతఁ
బక్షిరూపముఁ బాసి • యక్షయానంద మై, రాహువిముక్తచం • ద్రప్రకాశ

తే. మైనయొకదివ్యవిగ్రహ•మతఁడు చెంది, సుందరవ్యోమయానము•నందుమింట
నిలిచి కూరేశ్వరున కిట్లు • పలికె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. సర్వజ్ఞుఁ డీయతి • సార్వభౌముఁడు కృపఁ, దెలిసి నాదురవస్థ • పలికె నిట్లు
కూరేశ నీయెడ • ఘోరాపరాధముఁ, గావించి నరకముఁ • గాంచి యందు
యమునికన్మొగి నిల్వ • నతఁడు న న్ననె నిట్లు, పరమభాగవతుని • పాల నీవు
నపచారపడితివి • యది సహింపఁడు హరి, తద్దాసదండము • తగదు మాకు

తే. నతనిశరణొందుమని యము•డనియెఁగాన, నిన్నుశరణొంది యఘశాంతి, నేడుగంటి
నని యతఁడుపల్కి ముక్తికిఁ•జనియె నమచు. వాదిభీకరగురుఁ డనె, మోదమలర.

సీ. ధరఁ బురాతనకర్మ • పరిపాకవశమున, ఘనహసంతికయందుఁ • గమలమట్టు
లంతిమక్షేత్రము•నందు జన్మించెను, శౌరిభక్తుఁ డొకండు • మారనూర
బుషిసమానుం డయ్యుఁ•గృషికర్మ మొనరించి, శాలిపాలనవృత్తి•సల్పుచుండి
యతఁ డొకదినమునం•దాఁకొన్నవేళ కా,త్మీయు లాహారముఁ • దేక యున్నఁ

తే. జెఱువులోపల మూఁడుదో•సిళ్ళ బురద, జలముతోఁ ద్రావ నాతని•స్నాన మార్వ
వచ్చి యామునముని చూచి•మెచ్చె ననుచు. వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. అతనిఁ గటాక్షించి • యామనముని డాసి, యి ట్లొనర్చుట కేమి,హేతు వనిన
స్వామి దేవరవారు • సర్వజ్ఞు లీమీకుఁ, దెలియనియర్థము • గలదె జగతి
వినుఁ డైన దాసుని,విన్నప మొక్కటి, యాఁకటివేళ క•యత్నసిద్ధ
మన్న మెయ్యదియైన • ననుభవించుచు నుండి, మీసరిగురునకు • దాసుఁ డైన

తే. వాఁడె కృతకృత్యుఁడాచార్య•వర్య యనుచు, విన్నవించిన నతని వి•వేకమునకు
సంతసించిరి యామునా•చార్యు లనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. పరమకారుణికుఁ డా•హరి భవద్భ్రాపియై, వీనికంటికి నేఁడు • గానఁబడియెఁ
గాన వీనికి హిత•కరుఁడవు గమ్మని, చాఁగిలఁబడి మ్రొక్కి • సన్నుతింప
నతనిలెమ్మని యాము•నార్యుఁ డానతియిచ్చి, కరుణతోఁబంచ సం•స్కారముఖ్య
హితముల నాతని • కేకకాలమునందుఁ, గృపఁజేపి మగిడి స్వ•గేహ మొంది

తే. న-త సంతుష్టచిత్తుఁడై • యతఁడు సకల,సంగములఁబాసి యేతెంచి • రంగధామ
మొంది యేకాంతపదమునం,దుండెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ప్రాకారములబైట • భవ్యోపవనమునం, దతివివిక్త శుభాల,యమున నుండి
యరుణోదయము వేళ,నల్లనమేల్కాంచి, ద్వయమార్యపంక్తి పూ•ర్వకముదలఁచి
కావేరి నీరాడి • కలితోర్ధ్వపుండ్రుఁడై, తులసీకమలబీజ•వలయములను
ధరియించి తనయింట • దైవవశాత్త మౌ,నాహార మేదైన • నారగించి

తే. సూరిజనమాన్యుఁ డామార,నేరినంబి, నిర్భరత్వానుసంధాన•నిశ్చలాత్ముఁ
డై వసించెను గొన్నియ,హంబు లనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. రంగేశ్వరున కంత,రంగప్రసన్నుఁడై, మహితచరిత్రుఁ డౌ•మార నేరి
నంబికిఁ గొన్ని,ది•నంబు లారీతిని, జరగినపిదప రా•జవ్రణంబు
పొడమినఁ గని మహా•పూర్ణదేశికుఁ డర్ధ,రాత్రమునందు శ్రీ•రంగరాజ
తీర్థప్రసాదముల్ • దెచ్చి యాతీర్థోద,కమున నావ్రణమంతఁ • గడిగి యందు

తే. నాప్రసాదము పూడుషా,హారమాత్ర, ముంచి ఖండాంశుకముచే బి•గించి కట్టి
మరలి చను నౌరు లెఱుఁగని,సరణి నమచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర.

సీ. వ్రణమునం దుంచిన • రంగప్రసాదము, దిని క్రొవ్వి క్రిములు బా•ధింప నాతఁ
డాదుఃఖ మంతయు • హరికృపాఫల మని, యంతరంగమునందుఁ•జింతసేఁయుఁ
గాని వేఱొక్కటి • కలనైనఁ దలఁపఁడు, భవ్యాత్మ గురుపదా•బ్జములు దక్కఁ
ఫలభూతగురుపదా,బ్జాత సంప్రాప్తికే, త్వరపడుచుండు నా•ధన్యతముఁడు

తే. అట్టి మహనీయశీలున • కాత్మగురుఁడు, సలుపుచున్నట్టి కైంకర్య•సార మరయ నుల్లమున నెంచె లక్ష్మణ•యోగి యనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. నడురేయిచీఁకటి•నుడయవ రొకనాఁడు, మఱుఁగుగా నాత్మీయ•గురునితోడ నరిగి యతం డమ్మ•హాత్మున కొనరించు, సత్కృత్యమెఱిఁగి యా•సాదుతముని బాధఁ గన్గొన లేక • ప్రపదన మొనరింప, నతఁ డెప్పట ట్లుండి • యార్తిఁజెంది యక్కటా శ్రీయాము•నార్యాంఘ్రిదాసుని, మేలోర్వ లేనట్టి • బాలుఁ డెవ్వఁ

తే. డనుచుఁ బరితాపపడుచున్న•యతనికడకు, యతిశిఖామణి చనుదెంచి•యాదరించి కరుణ దళుకొత్తఁ బల్కె నీ•కరణి ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఏ నిలయాళ్వార • నే నీశ్రమముఁ జూచి, యిట్లొనర్చితి సౌమ్య • యిందు కలుగ వల దని యతిరాజు • పలుక నాకర్ణించి, ధీరాత్ముఁ డామార • నేరిన-వి ధరణి మాబోఁటి వే•తనులఁ బ్రోవఁ దలంచి, యవతరించినహరి•వనుచు గురువు లాన తీయఁగ వింటి • నానిన్నుఁ గన్గొంటి, మంటి యీమంట నా•మింటనైన

తే. హరికృపాఫలమీ దుఃఖ • మనుభవించి,గురుని పద్మములఁజెందు • కరణినన్నుఁ జేయుమని పల్క గురుఁడట్లు • చేసెననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. అంతసంయమిచంద్రుఁ•డచటినుం డేతెంచి, మరమునం దెఱుఁగని•మాడ్కినుండ నట్లు కొన్నిదినంబు•లరుగ నతం డొందెఁ, బ్రకృతిబంధముఁ బాసి• పరమపదము నంత సంస్కారము•లతనికిఁ జేసి మం,దిర మొంది యందుండెఁ • బెరియనంబి యిట్టిలోకవిరుద్ధ • మేల చేసితి రని, యతిరహస్యస్థలి • నాత్మగురుని

తే. యతిశిఖామణి యడుగ న•య్యార్యవరుడు, క్షమఁ బురాతనధర్మజ్ఞ • సమయములను బలికెఁ గొన్నిట్టు లాయతి•భర్తకనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. క్షితిజటాయువునకుఁ•జేసె సంస్కారముల్, చక్రవర్తిసుతుండు • జనులుమెచ్చ నాస్వామికంటె నే • నధికుఁడనా యితం, డధముఁడా యాపత్ర • రధముకంటె వృషలీసుతుం డగు • విదురున కప్పాండ వాగ్రణి సంస్కార • మాచరించె శ్రేష్ఠుఁడనా నే యు•ధిష్ఠిరుకంటె నీ,జ్ఞాని జఘన్యుఁడా • క్షత్తకంటె

తే. సంయమీంద్ర విశేషశా•స్త్రంబుత్రోవ, నెఱిఁగి యెఱిఁగిట్లు నన్నన•హేతువేమి ముని గురుండన హర్షించె•నార్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. ఇవ్విధంబునఁ బ్రహ్మాష్టాంతరంగుం డగు నయ్యతిశేఖరుండు తన మనంబున నా నుశాసనిక పర్వంబునం దేకోనపంచాశ దధ్యాయంబునందు. శ్లో॥ ఋషీణాం చ నదీ

నాం చ సాధూనాం చ మహాత్మనామ్। ప్రభవో నాభిగ న్తవ్యః స్త్రీణాందు శ్చరితస్య చ॥ తస్మాత్రచిన్తా కర్తవ్యా మహర్షీణాం సముద్భవే। యధా సర్వగతోహ్యగ్ని స్తధాతేజో మహాత్మసు॥ అనియు నాశ్వమేధిక పర్వపంచ దశోత్తర శతత మాధ్యాయంబునందు, శ్లో॥ క్షాన్తం దాన్తం జితక్రోధం జితాత్మానంజితేన్ద్రియమ్। త మహం బ్రాహ్మణం మన్యే శేషా శ్శూద్రా ఇతిశ్రుతిః॥ నజాతిః పూజ్యతే రాజ స్గుణాః కల్యాణకారకాః। చణ్డాల మపి వృత్తస్థం తం దేవాబ్రాహ్మణం విదుః॥ మద్భక్తా న్ఛూద్రసామాన్యా దవమన్యన్తియే నరాః। నరకేష్వవతిష్ఠన్తి వర్షకోటిం నరాధమాః। చండాల మపి మద్భక్తం నావమన్యేత బుద్ధిమాన్। అవమత్య పత త్యేవ రౌరవే నరకే నరః॥ మమ మద్భక్తభక్తేషు ప్రీతిరభ్యధికా నృప। తస్మా న్మద్భక్తభక్తాశ్చ పూజనీయావిశేషతః। కీటపక్షి మృగాణాం చ మయిసన్న్యస్త చేతసామ్। ఊర్ధ్వ మేవ గతిం విద్ధి కిం పునర్జ్ఞానినాంనృణామ్॥ అనియు నప్పర్వంబునందు సప్తదశోత్తర శతతమాధ్యాయంబునందు, శ్లో॥ అపార్థకం ప్రభాషంతే శూద్రా భాగవతా ఇతి। నశూద్రా భగవద్భక్తా విప్రాభాగవతా స్మృతాః॥ అని యుద్యోగపర్వంబున, శ్లో॥ సర్వవర్ణేషుతే శూద్రా యేహ్యభక్తా జనార్దనే॥ అని పంచమవేదభూత మహాభారతాది గ్రంథంబులు బోధించుచుండుట యెఱింగి సకలవేదశాస్త్ర పరిపూర్ణుండైన యమ్మహాపూర్ణుం డమ్మహాభాగవతాగ్రగణ్యునకుఁ జరమ కైంకర్యం బొనరించుట యుత్తమధర్మంబుగాఁ దలంచి నామమాత్రో చ్చారణ దూరీకృతశరం బగు మరంబుఁ బ్రవేశించె నంత.

సీ. సదసద్వివేకము • చాలక గర్వించి, కూడనిపని సేయ • గురువు నైన
విడువు మంచునుశాస్త్ర• విధిచూడఁబడెఁగాన, పాటిఁదొలంగి యీ • పనియొనర్చు
పెరియనంబింటి కెవ్వరుఁ బోవఁ దగ రతం, డేతేరఁ దగఁ డెవ్వ•రిండ్ల కనుచు
స్వాములందఱుఁగూడి•సమయ మొనర్చిన, హరిలీలయదియని•యాత్మఁదలఁచి

తే. సంతసించుచు నాత్మీయ • సదనమునను, వాసుదేవగుణామృతా•స్వాదనిత్య
పూర్ణులైయుండి రమ్మహా•పూర్ణు లనుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర.

సీ. అంతట నొక్కనాఁ • డత్తుళాయమ్మ శ్రీ,రంగమహోత్సవ • రంగమునను
గస్తూరిరంగనిఁ • గని మ్రొక్కి యనియె ని, ట్లందఱువైష్ణవు • లాలకింప
నీదివ్యశాసన • నిరుపమానవిశేష, శాస్త్రోక్తధర్మము • సలిపినట్టి
యస్మజ్జనకుఁ డిట్టి • యాఱడి కర్హుఁడే, యి ట్లుపేక్షింప నీ • కేమివాసి

తే. గలుగు మాతండ్రి వెలిదీర్చి • గాని లక్ష్మి•యాన నీయాననొక యడు•గైనఁగదల
వలదు నీ వని రంగేశు • నిలిపె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. అట్లత్తుళాయమ్మ•యానఁ బెట్టిన విని, కస్తూరిరంగఁడు • కదలఁ డయ్యె
నాతనిమహిమచే • నంద ఱట్లున్నంత. నా రంగరాజ ది•వ్యాజ్ఞఁజేసి
పరమభాగవతుని • బెరియనంబిని బ్రహ్మ•రథమునం దెక్కించి • ప్రాజ్ఞు లెల్లఁ
గస్తూరిరంగని•కరణిఁ దోడ్కొనివచ్చి, యతనిసన్నిధి దింప • హరి యతనికి

తే. సకలబహుమతు లొనరింప • సంతసించి, రంగనాథునికడ బుధ • రాజిమెచ్చ
నతఁడు యతిరాజుతోఁగూడి • యలరెననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. కంచియం దొకనాఁడు • కరిగిరిపై రాత్రి. తిరుచుట్టుమాలెలో • దేవితోడఁ
దిరుగుచు వరదుఁడు•కరుణఁ గాంచీపూర్ణ, దేశికేంద్రున కిట్లు • తెలియఁబలికెఁ
బ్రారబ్ధకర్మాను•భవ మించు కంతైనఁ, జెందుము మఱుమాటఁ • జెప్పఁబోకు
మని మధుసూదనుం•డంతర్హితుం డైన. ధన్యోస్మి యని మదిఁ•దలఁచి యతఁడు

తే. బీగముద్రలుగావించి • బాగుమీఱ, సంశ్రితులఁగూడి యేతెంచి • స్వమరమొంది
మంచిమృదుశయ్యపైని ని•ద్రించెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ప్రొద్దున లేచి యా•మునముఖగురుపఙ్క్తి, మంత్రరత్నార్థము • మదిఁ దలంచి
వేగవతీనదీ•విమలజలావగా•హన మొనరించి ధౌ•తాంశుకములఁ
దాల్చి కేశవముఖ • ద్వాదశ దివ్యనా•మాంకశరారిగా•థాదికముల
నుచ్చరించుచు ధవ•ళోర్ధ్వపుండ్రంబుఁ, శ్రీచూర్ణ రేఖలఁ•జెలువు మిగులఁ

తే. దత్తదుచితస్థలంబులఁ • దగ ధరించి, లలితతులసీకమలబీజ • వలయములను
గంబుగళమున ధరియించె • నంబి యనుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర.

సీ. ప్రొద్దుల మేల్కాంచి•పుణ్యకోటి విమాన•శృంగముల్చూచి యు•ప్పొంగి మొక్కి
స్నానసంధ్యాదులు • సల్పి యర్చకపరి•చారకాదిక శుభా•చారపరుల
మచ్చిక నా తిరు•క్కచ్చినంబిని గని, యతనితోఁ గోవెల • కరుగుదెంచి
భద్రము లగుబీగ•ముద్రలఁ వీక్షించి, తలుపులఁ దెఱచి లో•పలికిఁ జొచ్చి

తే. స్వామియుపకరణాదుల•సేమ మరయ, నందు హరియుష్ణధారల•నారగించు
దండిబంగరుగిన్నె లే•కుండె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అంతట వా రంద • ఱక్కజపడి గుడి, యధికారి కెఱిఁగింప • నతఁడు వచ్చి

నీనంబి దక్క మే•మిచ్చోట నొక్కర, మైన లే మనుచు వా • రంద అనిన
నధికారి యానంబి • నడిగిన నతఁ డనె, యీజోలి మేమేమి•యెఱుఁగ మనుచు

తే. నంత వాఁ డమ్మహాత్ముని • నచటినుండి, తొడుకచని దండనాథుని•కడను విడువ
వాఁడు దండించె నద్దిర•వర్య ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అబాధ లన్నియు • హరికృపాఫల మని, యోర్చుకాంచీపూర్ణ•యోగికడకుఁ
గరిగిరివరదుఁడు • కరుణచే మును వేగఁ, గరిరాజుకడ కేఁగు•కరణి వచ్చి
కపటమోహనబాల•క బ్రహ్మచారి యై, కనిపించి యాదండ•కరునిఁ జూచి
దండనాయక నీకు • దండనీయుఁడు గాఁడు. భువనేశ్వరులకైన•బూజ్యుఁడితడు

తే. వరదునకుఁ బ్రాణభూతుఁడుఁ • బరమయోగి, కటకటా యీమహాత్ముని•గాసిచేసి
పాపివైతివి నీ వని • పలికె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. వెన్ననిసన్నిధిఁ • దిన్నఁగా వెదకినఁ, గన్నుల కాగిన్నె • కానఁబడును
ఈఁగిన్నెజో లేల • యీవిరక్తుని కని, వేగ నాతనికట్ల • విడిచివైచి
శరతల్పవేదనా•క్రాంతుని భీష్ముని, స్వకపాణీతలముష్టి•జానుఘాత
వంతుని శ్రీజాంబ•వంతునిఁ దనకర,నీరజంబులచేత • నిమిరినట్టు

తే. లతనితిరుమేను తడవిన • నార్తిఁ దొలఁగి, న్యాయవాది తిరుక్కచ్చి•నంబిమదిని
దారకుఁడు వరదుఁ డనుచుఁ • దలఁచెననుఁ, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. మర్యాద విడిచి యీ • మహనీయశీలుని, దండించితివి నిర•ర్థకము గాను
గిన్నె శ్రీవరదుని•సన్నిధిఁ జూపెద, నావెంట రా దండ•నాథ యనుచుఁ
గపటబాలుఁడు దిరు•క్కచ్చినంబిని దన, వెనువెంటఁ గొని చన • వేగ వాఁడు
వారితోఁ గరిగిరి • వరదునికడ కేఁగ, నంద జీక్షింప నా • యర్భకుండు

తే. కృష్ణదోవతి కుచ్చెల • క్రిందనున్న, వన్నెమించిన బంగారు•గిన్నెఁ జూపి
యందజీక్షింపఁ గనిపింపఁ•డాయె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. సాక్షాత్కృతాచ్యుత•చరణారవిందుని, ఘనునిఁ గాంచీపూర్ణ•మునిని జూచి
భగవంతునకు బహిః•ప్రాణ మీతం డని, భక్తితో బ్రలగొని • ప్రణతి సల్పి
కాలోచితంబు గాఁ • గరిగిరినాథున, కారాధనముఁ జేసి • యచటినుండి
వారివారిండ్లకు • వరుసగాఁ జనుదెంచి, కూర్మిఁ గాంచీపూర్ణ • గురుని కథలు

తే. వాసి వర్ణింతు రాక్షేత్ర•వాసు లెల్ల, నా తిరుక్కచ్చినంబి ప•దాబ్జములను
దలఁచు మనుజులు పుడమిలో•ధన్యులనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

శా. శ్రీరంగప్రియధామ భూమిభువన • క్షేమంకరస్వోదయా
స్ఫారాచారవిచార పావనవచ • స్సారా సమంచత్ప్రయః
పారావారవిహార సూరిజనసం•భావ్య ప్రభావా క్షమా
సారా భూతపురీవర ప్రచుర సం•చారాఢ్య రామానుజా.

క. శ్రీయామున మునిశరణా, మాయావశజీవలోక • మంగళకరణా
న్యాయవిదార్యాభరణా, భూయఃశ్రేయోనిదాన•పుణ్యవిహరణా. 104

మాలినీవృత్తము. సరసమధురనామా • సాహితీసారధామా
నిరుపమశుభకాయా • నిత్యనిర్దోషగేయా
పరమపదనిదానా • భారతీపద్మినీనా
పరిహృత మనుజేంద్రా • భవ్యసాంద్రా యతీంద్రా.

గద్యము. ఇది శ్రీభగవద్రామానుజ కరుణాకటాక్ష కలితకవితావైభవ పరవాది భయం కరాచార్యాభిమతచ్ఛాత్రాపస్తంబసూత్ర కణ్వసగోత్రా వేంకటకృష్ణార్యపుత్ర విబుధవైష్ణవవిధేయ కేశవనామధేయ ప్రణీతంబయిన యాచార్యసూక్తి ముక్తావళి యను మహాప్రబంధంబునం బూర్వభాగంబునందు శ్రీ లక్ష్మణముని యవతారంబును నమ్మహాత్ముని విద్యాభ్యాస క్రమంబును శ్రీ గోవిందమిశ్రుల జననంబును దదీయవిద్యాగ్రహణ విధంబును నతండు శైవాగమ ప్రవిష్టుండై మగిడి తిరుమల నంబి నాశ్రయించి యతనికి నిత్యకైంకర్యంబు సల్పుటయు శ్రీశైలపూర్ణ గురుండు శ్రీ వేంకటేశునికృపఁ బితామహప్రపితామహుం డనిఖ్యాతి గాంచుటయు యామునార్యుండు సత్యవ్రత క్షేత్రంబున కేతెంచి యచట లక్ష్మణార్యునిం గటాక్షించి యతండు దర్శనస్థాపకుండు గావలయు నని వరదు నుద్దేశించి ప్రపదనం బాచరించుటయు నమ్మహాత్ముని చరమక్రమ కథనంబును బ్రహ్మమేధ సంస్కార స్వరూప నిరూపణంబును నష్టసహస్రాభిధాన గ్రామంబునందుఁ గార్పాసారమ లక్ష్మి యొనర్చిన గురుసమారాధన వైభవంబును యతీంద్రుండు యజ్ఞేశునకు భాగవతధర్మంబు లుపదేశించుటయు శ్రీ వేంకటాద్రి సమీపంబున సంయమిశేఖరుం డాశ్రితులకు మండెయం బనుగ్రహారం బొనర్చుటయు లక్ష్మణయోగీంద్రుండు మరల శ్రీరంగధామంబుఁ జెందుటయు భాగవతాపచార క్రౌర్య ప్రదర్శనంబును దిరుక్కచ్చినంబి చరమక్రమంబు నన్నది పంచమోల్లాసము.

శ్రీమతే రామానుజాయ నమః



# ఆచార్యసూక్తిముక్తావళి

## పూర్వభాగము

---

## షష్ఠోల్లాసము

క. గోవిందయతివరార్చిత. గోవిందబుధేంద్రబద్ధ•గురుసౌభ్రాత్రా
గోవిందప్రియసంస్కృత, గోవిందపదారవింద•గురుపదశరణా, 1

### శ్రీవైష్ణవుల లక్షణము

వ. అవధరింపుము. 2

సీ. ప్రత్యక్షవైకుంఠ•పదమునం దొకనాఁడు, యతిరాజు మఠమునం•దలరు చుండ
సాత్త్వికుం డొక్కఁడా•సంయమీంద్రునిఁ జూచి, వైష్ణవుఁ డెట్లుండ•వలెను బుడమి
నని యడిగిన నతఁ•డతని కిట్లనియెను, దిరుమలనంబిని•దెలియు మనుచు
నంత నావైష్ణవుఁ•డంజనాద్రికిఁ జని, శ్రీశైలపూర్ణార్యుఁ•జెంది మ్రొక్కి

తే. యార్య వైష్ణవలక్షణం•బాన తిమ్ము, వీని కని పల్క నా బ్రహ్మ•[illegible]త్త్ర యతని
నాదరోక్తుల నిట నుండు•మనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. హరియాగ మొనరించి•యానంబి యతనికి, బ్రహ్మవారులపంక్తి•భక్తమిడిన
నలుగకయియ్యవో•కతఁడు సాపడఁ జూచి, నయమొప్ప మఱునాఁడు•నంబియన్న
మధ్యాపకులపంక్తి•నతనికిఁ బెట్టింప, నతిశయించితి నని•హర్ష పడక
యతఁ డారగింప న•య్యార్యశిఖామణి, మూఁడవదినమందు•ముదముఁ జెంది

తే. గోపసుతులందుఁ గృష్ణుని•కొలఁది బ్రహ్మ•విత్తములపంక్తి నడుమను•వేడ్క నతని
నుంచి యచ్చటఁ దా నార•గించె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. ఆరాత్రి జరగ న•హర్మ్యఖంబున లేచి, యచ్యుతాజ్ఞావిధు•లాచరించి
వైష్ణవుం డెట్లుండ•వలెనని యబ్బుధుం. డానంబి నడుగ న•య్యార్యుఁ డనియె
సైంధవఘనబక•చరణాయుధములట్లు, వత్స నీవలె నుండ•వలెను వైష్ణ
వుం డని గురుఁ డన•దండిసందియ మొంది యమ్మహాత్మునియాజ్ఞ•నచటినుండి

తే. వచ్చిశ్రీరంగధామముఁ,జొచ్చియందు,సంయమీంద్రునిఁగని మ్రొక్కి-సన్నుతించి
యతని కిట్లనిపల్కె-న,య్యార్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె,మోద మలర.

సీ. యతిరాజ నీయాజ్ఞ,నంజనాద్రికిఁ జని, శ్రీశైలపూర్ణుల,సేవఁ జేసి
యతిభక్తి నీయర్థ,మడిగిన నతఁ డేమి, తెలియఁజెప్పఁగ లేదు,దేశికేంద్ర
యని యరఁ డన విని,యచ్చోట జరిగిన, వృత్తాంత మంతయు,విశదపఱుపు
మనుచు లక్ష్మణగురుఁ,డాన తిచ్చిన విని, యమ్మహాత్ముని కతఁ,డచటివృత్త

తే. మంత వివరింప యతివరుఁ,డాలకించి, నాయ మలరంగఁ దిరుమల,నంబిగారి
ధీరసూక్తుల కర్థంబుఁ,దెల్పె ననుచు, వాదిభీకరగురుఁ డనె,మోద మలర.

వ. అగ్గురుం డతనికిఁ దెలిపినయర్థక్రమం బెట్టి దనిన. 7

సీ. వరకృపారసపూర్ణ,వాఙ్మనఃకాయుఁడై, సైంధవమ ట్లుండు,సాత్త్వికుండు
ఒక దివ్యదేశమం,దుండి యుజ్జీవించు, సరసిని బక మట్లు,సజ్జనుండు
సారతమార్థైక,సంగ్రహం బొనరించుఁ, జరణాయుధమునట్ల,సత్తముండు
దురభిమానాత్యంత,దూరస్థితిని జెందు, వసుధ నీపోలిక,వైష్ణవుండు

తే. అనుచుగంభీరపదముల,నస్మదార్యుఁ, డీయుదారార్థములఁజెప్పె,నియియెఱుంగు
మనుచు యతిపతి వ్రాక్రుచ్చె,నతని కనుచు, వాదిభీకరగురుఁడనె,మోదమలర.

## కూరేశదాశరథులకుఁ జరమోపదేశము

సీ. ఒకవత్సరం బైన,నుపవసింపవాని, కీరహస్యార్థ మీ,విడకు మనుచుఁ
దనగురుఁ డనెఁ గాన,తన కప్పవిత్రమౌ,కూరేశునకు నైన,సారతమముఁ
జరమార్థ మెఱిఁగింప,సంయమీంద్రుఁడుసంశ-యించినఁ దెలిసి కూ,రేశ్వరుండు
మాసోపవాసియై,మహితభక్తిని గొల్వ, యతిపతి యతనికి,హర్షపడుచుఁ

తే. జరమపరమార్థ మున్న ట్లొ,సంగినంత, దాశరథిసూరి చూచి త్రి,దండపాణి
యంఘ్రులకు మ్రొక్కి-యతనికి,ట్లనియెననుచు.వాదిభీకరగురుఁడనె,మోదమలర.

సీ. అడియేని కీరహ,స్యార్థ మానతి యిమ్ము, యతివర యన నతఁ,డతని కనియెఁ
గూరేశునకు ముందు,గురునియాజ్ఞ లభించి, చెప్పితి నీయర్థ,మివ్వు డీవు
నభిజనవిత్తవి,ద్యామదం బెడఁబాసి, గోష్ఠీపురీపూర్ణ,గురునికడనె
యాఱుమాసము లుండ,నతఁడె యీయర్థముఁ, దెలుపును నీ కని,తెలియఁబలుక

తే. నతఁడు గోష్ఠిపురంబున•కరిగి యందు, నమ్మహాత్ముని సేవించి•యతనియింట
నాఱునెల లుండి పనిఁ జేసె•నతని కనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. అట్లార్తిఁ జరమర•హస్యార్థసిద్ధికై, తనయింటఁ బని సేయు•దాశరథిని
నానంబి మిగులనె•య్యం బొప్పఁ గని వత్స, యభిజనాద్యభిమాన•మంతవిడిచి
యతిపతి నర్థింప•నతఁడె నీ కీగుహ్య, ముపదేశ మొనరించు•నూర్జితముగ
నని పంప నతఁ డేఁగి•యమ్మహాత్మునిఁగాంచి, యాచింపఁగరుణన•య్యతివరుండు

తే. చరమతాత్పర్య మొసఁగ దా•శరథిసూరి, తెలిసికృతకృత్యుఁడై నిజ•దేశికునకు
నుచితకైంకర్యములు సల్పు•చుండెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

జలజంతుమోక్షప్రదానము

సీ. ఒకఁనాడు లక్ష్మణ • యోగీంద్రుఁ డొక్కపు, ష్కరిణిలో నీరాడి • కాల్యకృత్య
మచటసల్పుచునుండ • నాశ్రితుల్ గని సాఁగి, మ్రొక్కిడి యుభయవి•భూతినాథ
స్వామి యీసరసిలో • సకలజంతువులకుఁ, మోక్షముఁ గరుణని • మ్మీక్షణంబ
యనుచుఁ బ్రార్థించిన • నమ్మహాత్ముఁడు సుప్ర, సన్నుఁడై నిజపద•సరసిజముల

తే. సంస్పృశించుచుఁదత్సర•స్సలిలములను, గరసరోరుహములమోడ్చి•హరినిదలఁచి
పొసఁగఁ దజ్జంతువుల కిచ్చె•మోక్ష మనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

వ. అంత. 13

సీ. జలముపైఁదేలి యా•జలజంతువులు తమ, కాయముల్ విడిచియా•కాశమొంది
జ్యోతిర్మయాత్మీయ • సూక్ష్మశరీరులై, సంయమీంద్రునిఁ జాల • సన్నుతించి
తమవెంట నంటి బ్రం • దారకస్తోమముల్, వందిబృందములకై•వడిని బొగడ
లలితభాస్కరమండ • లంబు భేదించుక చని బ్రహ్మచేఁ బూజఁ•గొనియజాండ

తే. భాండభేదన మొనరించి•ప్రకృతి దాఁటి, పరమపదమొందియందుశ్రీ•హరికినిత్య
సేవ సేయుచు సుఖములఁ • జెంది రనుచు, వాదిభీకరగురుఁడనె•మోద మలర.

శ్రీరంగామృత కవీంద్రుం డనుతిరువరంగత్తముద నారిచరిత్రము

తిరువరంగత్తముదనారి-త శ్లో॥ మీనేహస్తాసముద్భూత తంశ్రీరఙ్గామృత మాశ్రయే।
కవిం ప్రపన్నగాయత్ర్యాః కూరేశపదసంశ్రయమ్॥

సీ. హరిగృహశ్రీకార్య • పరులకు సంబంధి, మేధావి సుకవియు • మిశ్రభక్తుఁ
డభిజనవిత్తవి • ద్యామదాన్వితుఁడును, సంగీత శాస్త్రార్థ • సరసమతియు

నైన శ్రీరంగామృ • తాభిధానుం డొక, ద్విజుఁడు డోలిక లూఁగు • వేళ నచట
వేణుమృదంగస • ద్వీణానుగుణమనో, హరభవ్యగీతనా • ట్యములు వెలయ

తే. నొక్కదినమున లక్ష్మణ • యోగిచంద్రుఁ, డమ్మహావీధి నరుగుచు,నతనిఁ జూచి
పలికె నిట్లని శ్రీశూర • భర్తకనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. సంగీతసాహిత్య • సాస్వతస్తనా, భోగానుభవబుద్ధి • పూర్ణుఁ డీతఁ
డిమ్మహారసికు నీ • వేరీతి నైన బో, ధించి సాత్త్వికునిఁ గా • వింపు మనుచుఁ
గూరేశునకుఁ దన • గురుఁ డాన తిచ్చిన, నేఁడాది గా నాఱు • నెలల కితవి
భవదంఘ్రిదాస్యత • త్పరునిఁ గాఁ జేసెద, నీయనుగ్రహముచే • నిక్క మనుచు

తే. వేడ్క నిజగురుసన్నిధి • విన్నవించి యమ్మహాత్ముని యాజ్ఞ న,య్యవనిసురుని
యింటి కేఁగుచు నుండెఁ గూ • రేశుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర

సీ. యతిభూమిపతిశిష్య • తతి కగ్రగణనీయుఁ డాగమాంతజ్ఞుల • కగ్రయాయి
శ్రుత్యంగములకును • శుభవిహారస్థాన, మామ్నాయముల కెల్ల • నాటపట్టు
సంయమీశ్వరునకు • సలిలపవిత్రంబు, సకలవిద్యలకును • జన్మభూమి
వైష్ణవాన్వయదుగ్ధ • వనధిరాకాచంద్రుఁ, డఖిలకల్యాణగు • ణాకరుఁడు

తే. రామసోదరగురుబహిః • ప్రాణము నగు, కూరపతిసూరి యాప్రతి • కూలవిప్రు
నలయకయునిత్య మొకసారి • చూచుననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. భూతిగూహితవహ్నిఁ • బోలె స్వరూపముఁ, దెలుపక యతనింటఁ • దిరుగుచున్న
గానైకలోలుఁడై • కర ముపేక్షించుచు, ద్విజుని వీక్షించి యా • దివ్యసూరి
తనశక్తి బైల్పడ్చఁ • దలఁచి పతాహాపె, హస్తావహిత్థాంగ • హారముఖ్య
తాండవక్రియలందుఁ • దాళమానములందు, స్వరకల్పనలను మూ • ర్ఛనలయందుఁ

తే. జాల శంకింప విని వాఁడు • శాస్త్రరీతి, నుత్తరముఁ జెప్పఁ జాలక • యోడి మ్రొక్క
యుచితంబు గ నతనిఁ బూ • జించి రనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. అఖిలశాస్త్రములందు • నతనిఁ బరీక్షించి, సర్వజ్ఞుఁ డీతఁడు • సత్య మనుచుఁ
దలఁచి యావిప్రుఁ డా • తత్త్వజ్ఞ మౌళిని, గొన్నియర్థము లిట్లు • కోరి యడిగె
భూతిరుద్రాక్షత్రి • పుండ్రాదు లేల మీ, రాదరింపరు చెప్పు • మార్య యనిన
వత్స భస్మము శైవ • పాశుపతాంగము, గాని కర్మాంగము • గాదు గాన

తే. పరమవైదికు లది చేతఁ • బట్టఁదగదు, గాన మాకది ధార్యము • గాదు వినుము
మఱియునొకమాటయనియెన,మ్మాన్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. మఱియు, శ్లో॥ రుద్రాక్షం రుద్రనిర్మాల్యం లీలయాపి న ధారయేత్। యఃకా మాద్ధారయేత్కశ్చి ద్ద్విజ శ్చాన్ద్రాయణం చరేత్॥ అని ముద్గలస్మృతివచనంబుచే విలాసార్థం బైన రుద్రాక్షరుద్ర నిర్మాల్యంబులు విప్రునకు ధరియింప నర్హంబులు గావు కోర్కి మీఱ నేద్విజుం డయిన నవి ధరించె నేని యతండు చాంద్రాయణ రూపప్రాయశ్చిత్తార్హుం డగు: శ్లో॥ బ్రాహ్మణస్య న కర్తవ్యం తిర్యక్పుణ్డ్రస్య ధారణమ్। నశూద్రఏవ మన్తవ్య స్తిర్యక్పుణ్డ్రస్య ధారణాత్॥ త్రిపుణ్డ్రధారిణం విప్రం యచ్ఛ్రాద్ధేభోజయిష్యతి। నష్ట భవలితచ్ఛ్రాద్ధకదాతా చ నరకం వ్రజేత్॥ అని బ్రహ్మాండహారీ తాదిస్మృతి వచనంబులచేఁ గస్మకాలంబున నిషేధింపం బడుతిర్యక్పుండ్రంబు సాత్త్వికులకు నాదరణీయంబు గా దని కూరేశుం డాన తిచ్చిన విని సంతోషించి యాద్విజుండు తప్తచక్రాంకచ్ఛ్రోర్ధ్వ పుండ్ర ధార ణంబునందుఁ బ్రమాణం బెయ్యది యని యడుగ వారాహాథర్వణ మహోపనిష దాది హారీత వ్యాసపరాశ రాదిశ్రుతి స్మృతివచనరూపప్రబల ప్రమాణ శతంబు లుపన్యసించి యతని సందియంబుఁ బాసిన నబ్భూసురోత్తముండు మిగులం బ్రహర్షించి శ్రీశరకోపాదిదివ్యసూరుల జననక్రమంబును దత్ప్రబంధంబులకు శ్రుతిత్వప్రకారంబునెట్టి దనియడుగ మార్కండేయబ్రహ్మాండబ్రహ్మకైవర్తవృద్ధ పాద్మనార దీయస్కాందోక్త వైష్ణవసంహితా శ్రీమహాభాగవతాది వచనశతంబుల చే నతనికిఁ బ్రత్యుత్తరంబులు చెప్ప నతండు సమ్మతించి సర్వదేవోత్కృష్టుం డని శాస్త్రప్రసిద్ధుం డైనశివుండు మీ కనాదరణీయుం డగుట కేమి కారణంబది యెఱింగింపు మనిన నావిప్రున కయ్యాచార్య సత్తముం డిట్లనియె. శ్రుతిః॥ ఏకోహవై నారాయణ అసీత్ - దివ్యో దేవ ఏకో నారాయణః - శుద్ధో దేవ ఏకో నారాయణః—నద్వితీయోస్తి—తత్త్వం నారాయణః పరః॥ శ్లో॥ విష్ణో స్సకాశా దుద్భూతం జగత్తత్రైవ చస్థితం। స్థితి సంయమకర్తా సౌ జగతోస్య జగచ్ఛసః। తత్త్వం జిజ్ఞాసమానానాం హేతుభి స్సర్వతో ముఖైః। తత్త్వ మేకో మహాయోగీ హరి ర్నారాయణః పరః॥ అని మహత్సువాలనారాయణ తైత్తిరీయాద్యుపనిషత్పరాశరపారాశర్యాదిభారతీశతంబులచే జగజ్జన్మాదికారణం బును బరమతత్త్వంబును బరమపావనుండును నారాయణుండే కాని యన్యుం డు గాఁ డని యసంకుచితఘంటా ఘోషాయమానంబు గా నభియుక్తోక్తం బైన సిద్ధాంతం బెఱింగి పరమసాత్త్వికు లగుముముక్షు లన్యదేవతల నారాధింపరు గాయత్రీమంత్రంబు సూర్యమండలాంతర్వర్తి నారాయణైకపరం బని సర్వవే దాంతప్రసిద్ధంబు శ్రీరామభద్రప్రతిష్ఠాపితుండు గావున హరుం డధికుం డని

తలంచితివేని యీయర్థంబు వాల్మీకిప్రోక్తంబు గాదు రావణబ్రహ్మహత్యానిర్హరణార్థంబు శ్రీరామభద్రుండు లింగప్రతిష్ఠ యొనర్చె నని వక్కాణించితి వేని రక్షోహననంబు దోషావహంబు గాదు; శ్లో॥ ఆతతాయిన మాయాన్తం హన్యాదే వావిచారయఞ్ । నాతతాయివధే దోషో హన్తు ర్భవతి కశ్చన ॥ అని మనుస్మృతి ప్రసిద్ధ బు గాన యపారపరదారాపహరణంబుచే నాతతాయిశ్రేష్ఠుం డగు దశకంధరుని వధించుట విధిచోదితంబు గాన నిషిద్ధంబు గాదు. వేదాంత విత్తముండైన యాచార్యుండైనను సర్వసాధన సమన్వితుండై యుద్ధరంగంబున నెదుర్కొనెనేని యతనిం దెగటార్చుట పాపాస్పదంబు గాదని పంచమవేద ప్రసిద్ధంబు బ్రహ్మహత్యాశతాక్రాంతుండై ప్రజ్ఞాప్రభావహీనుండైన వినాయకుం డెవ్వనినామ సహస్రానుసంధానంబుచేఁ బరిశుద్ధుండై సుఖించె. వారాణసీ క్షేత్రంబునందు యదీయతారక మంత్రోపదేశంబు లభించి బ్రహ్మహత్యాది విరక్తుండై రుద్రుండు సుఖించుచుండెను. అట్టి పరమపవిత్ర పరమకల్యాణసముద్రుం డగు శ్రీరామభద్రునకుఁ బాపంబు గలదని పల్కు మహాపాపి పాతకంబులకుఁ బారంబు లేదు. వాని జన్మంబు పరిశీలనీయం బగు సార్వభౌముండైన రా జొక దేశ పరిపాలనార్థం బొక్కయెడ నొక్క యధికారి నుంచుగతి స్వసేతు సంరక్షణార్థంబుగాఁ దత్సమీపంబునందు స్వసేవకునిం గా శివునిం బ్రతిష్ఠింప నతండు నిజదేవీ సహాయుండై స్వేప్సిత శ్రీరామనామ జపైక పరాయణుండై తదీయ శ్రీపాదతీర్థంబుచే నిత్యస్నానపానంబు లొనర్చుచు సమ్మోదించుచుండు కతన 'శివలింగ ప్రతిష్ఠా, యను పురాణవచనంబు వ్యర్థంబు గాదని యి ట్లనేకవిధంబుల శంకింప నా బ్రాహ్మణునకు నద్దేశిక సార్వభౌముం డనేక బలవత్ప్రమాణంబు లుపన్యసించి యతని సందియంబులన్నియు నుడుప నతండు విస్మయానంద రసాబ్ధిమగ్నుండై యమ్మహాత్మునకు భక్తిపూర్వకంబు గాఁ బ్రదక్షిణప్రణామంబు లాచరించి శిష్యునిఁగా వీనిం గై కొమ్మని ప్రార్థింప నమ్మహాత్ముం డతనిఁ దోడ్కొని యతిశిఖామణికడకుం జని యావృత్తాంతం బంతయు విన్నవించి యితనికి సకలహితోపదేశం బొనర్పుం డనిన విన నవధరించి యగ్గురుశేఖరుండు వత్సా యీసాధుసత్తముండు భవదాశ్రితుండు గావున నీవె సకలహితోపదేశంబులు సలుపు మని యాజ్ఞాపింప నిజగురుశాసనంబుచే నతం డతనికిఁ బంచసంస్కారాద్యఖిలహిత ప్రదానం బొనర్చిన నా శ్రీరంగామృతకవీంద్రుండు శ్రీవైష్ణవశ్రేష్ఠుఁడై శ్రీరంగధామంబునం దాచార్యాభిమతకైంకర్యంబు లాచరించుచు సుఖం బుండెనంత.

సీ. సందేహ ముడిగి స్వ•సంబంధు లంద ఱా,సంయమీంద్రునిపద,సరసిజంబు
లాశ్రయించి కృతార్థు•లైన హర్షించి శ్రీ,రంగామృతగురుం డు,•రంగు మీఱ
స్వగురుమనః ప్రీతి,సంపాదకంబు రా,మానుజభవ్యనా•మాంకితంబు
నవనిఁ బ్రపన్నగా•యత్రి నూత్తందాది, యని ఖ్యాతిఁ గాంచుదివ్య•ప్రబంధ

తే. మతిగభీరమృదూక్తుల•నాన తిచ్చి, తెచ్చి కూరేశునకుఁ జూప, మెచ్చి యాతఁ
డతనిఁ దోడ్కొని కోవెల•కరిగెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. తమ్మునితోఁ గూడి•తనదేశికునివెంటఁ, జనుదెంచి రంగరా•ట్ప్రభను గాంచి
యందుసంశ్రితులతో•నలరారుచున్నట్టి, సంయమీంద్రునిఁజూచి•సాఁగిమ్రొక్కి
యవనియాజ్ఞ లభించి • యనుజునితోడ శ్రీ,రంగసుధాకవి • రాజరాజు
వేడ్క నూత్తందాది • వినిపింప యతిదేవుఁ, డాకబ్బ మంతయు • నాలకించి

తే; చాలసంతోష మంది యా•సాత్త్వికునకు, స్వామిశఠకోపతీర్థ ప్ర•సాదమాల్య
చందనాదిక బహుమతి • సల్పె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. అంత నెంబెరుమానా రత్తిరువరంగత్తముదనారిం దోడ్కొని యాళ్వాన్ తిరువరంగ ప్పెరుమాళరయరు తిరుమాళిగ కేతెంచి యతనిచే సముచితసత్కారంబులు లభించి తనకుఁ జరమోపాయ నిష్ఠానుష్ఠానాద్యుపదేష్ట యగు నగ్గురుశ్రేష్ఠు నుద్దేశించి మహాత్ము మహామేధావి యగు శ్రీరంగసుధాకవీంద్రుం డొనర్చిన యాకృతి నాలాయిర గ్రంధబంధురంబు లగు ప్రబంధంబులం దెందైన ననుసంధింపుఁ డని యానతీయ నాకర్ణించి యగ్గురుపురందరుండు శ్రీకోశనివేశంబుఁ జొచ్చి విస్తులంబగు పుస్తకస్తోమంబునందు నిజపాణిపద్మంబునుంప భగవత్ప్రేరితంబై నాలాయిర గ్రంధంబు తనకేలుఁదమ్మినిం గీలుకొనం గటాక్షించి మిగులఁ బ్రమోదభరితాంతఃకరణుండై యం దా ప్రబంధంబు సందర్భించి శ్రీ లక్ష్మణ యోగీంద్రు సాన్నిధ్యంబున యతు లేకాంగు లాచార్యపురుషులు మొదలగు శ్రీవైష్ణవులు విన బ్రాహ్మణులకు గాయత్రీమంత్రంబు నిత్యజాప్యంబైన మాడ్కి ననన్య ప్రపన్నులకు నీ దివ్యప్రబంధం బనవరతాను సంధేయం బని యానతిచ్చిన శ్రీ వైష్ణవులంద ఱాకర్ణించి శిష్యప్రశిష్య క్రమంబుగా నా సంప్రదాయం బిప్పటికైన నాచరించుచుందురు గాన ప్రసన్నగాయత్రి యని యానూత్తందాది పుడమిం బ్రసిద్ధం బయ్యెనని శ్రీ వాదిభీకరగురుం డానతిచ్చె. 23

# క్రిమికంఠజన్మ నిమిత్తము

సీ. ధరణియం దఖిలచే•తనులు శ్రీయతిరాజు, నాశ్రయించి కృతార్థు•లై శరీర
ములు మానినప్పుడు • మోక్షమొందుచు నుండ, యమపురిపాడైన • హరవిరించి
పురుహూతముఖదేవ•మునివరు లందఱు, చనుదెంచి శ్రీరంగ•శాయిచరణ
సరసిజంబులఁ గాంచి • సాఁగి మ్రొక్కిడి నిజ•రత్నకోటీర నీ•రాజనములు

తే. సలిపి వేయువిధంబుల • సన్నుతింప, సుప్రసన్నకృపాదృష్టిఁ • జూచి వారి
నిట్లు స్వాగత మడిగె రం•గేశుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. భావుకమా నీకుఁ • బంకేరుహాసన, కౌశలమా నీకుఁ • గాలకంఠ
సేమమా నీకు సు•త్రామ యీసురలకు, హర్షమా మీకు మ•హర్షులార
యని శౌరి కుశలము • లడిగి వచ్చినపనిఁ. దెల్పుఁడీ యన బ్రహ్మ • తెల్పెనిట్లు
నిత్య మనాదియు • నీ విభూతియుగంబు.నందు భోగవిభూతి • యస్మదాది

తే. దేవతలకైన సనకాది • దివ్యయోగ, సిద్ధులకు నైన నిట్లని • చెప్ప నలవి
గాని దని పల్కె భారతీ•కాంతుఁ డనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

వ. మఱియును, 26

సీ. భవదీయమాయా ప్ర•బద్ధచతుర్దశ, భువనాఢ్యలీలా వి•భూతియందు
వసుధలో నందఱు • వైష్ణవలక్షణ.లక్షితులై మోక్ష•లక్ష్మి కయిరి
భూమికి వైకుంఠ•పురికి భేదము గాన, మీవింత యేమొకో,యెఱుఁగ మీశ
యముఁడు నిర్వ్యాపారుఁ•డై యుండె జనులకుఁ, గలుషమేమియులేని•కతననార్తి

తే. హరమనోహర దివ్యవి•హార నీదు, క్రీడ యిఁకమీఁద నెట్లు వ•ర్ధిల్లు ననుచుఁ
బ్రీతి వాక్రుచ్చె వేల్పుల•పెద్ద యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. అఁత నత్తమ్మిచూలిపల్కు లాలించి రమణీయగుణస్తోమాభిరాముం డగు శ్రీరంగ
ధాముండు తనలో నిట్లని తలంచె. 28

సీ. రాజు పుత్రునియందు • రాజ్యభారం బుంచి, స్త్రీలోలుఁడై విహ•రించుకరణి
నస్మద్విభూతి యు•గాధికారము లక్ష్మ•ణార్య మహాయోగి•యందు నునిచి
శ్రీభూమినీళాది•సీమంతినీరత్న, విలసనపరుఁడ నై • వేడ్క నుండ
నిదె సమయం బని • యెంచి లక్ష్మణముని, కొల్ల యొనర్చె వై•కుంఠపురముఁ

తే. గ్రీడ పాడయె నేప్రొద్దు•స్త్రీలఁ గూడు, కాముకుల కేల నిల్చును•గలిమియింకఁ
జాలుస్త్రీసంగ మనియె నా•శౌరి యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ముందు హిరణ్యాక్ష • ముఖ్యదైత్యులభంగిఁ, దామసప్రకృతిని • దానవాంశఁ
గాలాభుఁ గ్రిమికంఠుఁ•జోళభూపాలునిఁ, గూచియు మాచియుఁ•గొలువియనెడు
వనితలఁ బుట్టించి • వారివల్లను శైవ• శాక్తాదిమతవృద్ధి • సల్పి మఱియుఁ
గలినైనఁదలఁచిన • గలుషావహము లగు, ఖలమతంబులు కొన్ని • గలుగఁజేసి

తే. వేడ్కఁ దనలీల కీరీతి • వృద్ధి యొదవ, సంతసించెను శ్రీరంగ•శౌరి యంత
నతని వీడ్కొని బ్రహ్మాదు•లరిగి రనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. తన కభిమానపు•త్రకు లైనకూరేశ కవిసుతులను దన•కన్ను మోలఁ
గనకడోలిక నుంచి • కమలావిలాసిని, రక్షింపఁ జూచి శ్రీ•రంగరాజు
ముద మొంది తనకన్ను•మొగినొకనాఁడుంచి, పసిఁడిపళ్లెరములోఁ • బాయసాన్న
మాత్మనివేదిత • మా యర్చకులు గాంచి, జానుకరంబుల • జరగి వచ్చి

తే. చిన్నిచేఁదమ్ములను గొని • చెన్ను మీఱ, నారగింప నిరీక్షించి • యలిగి వేగ
యర్చకులు వారి నవ్వేళి • కనిచి రనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. రంగేశుఁడారాత్రి • రాజుస్వప్నమునందుఁ, గనిపించి పల్కె నీ•గతి నతనికి
నధిప పరాశర•వ్యాసభట్టారక, నామాభిరాముల • మామకాంశ
జాతుల శిశువుల • సావడ నియ్యక, యర్చకుల్ తర్జించి • యడిచి బైటి
కనిపిరి గాన నీ•వర్చింపతళిహ యీ•వేళ సావడ నైతిఁ • జోళరాజ

తే. పట్టి యాఁకొన్నఁదండ్రికి•బాధగాదె, యనుచు హరిపల్కె మేల్కాంచి • యవనిపాలుఁ
డర్చకులఁబిల్చి దండించి • యనిపెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. ఇట్లు శ్రీ రంగరాజానుగ్రహంబుచే శ్రీరామప్పిళ్లతోడ దినదిన ప్రవర్ధమానుండగు శ్రీ పరాశరభట్టారకుండు పంచవార్షిక బాలకుండై యొక్కనాఁడు శ్రీవత్సచిహ్న మిశ్రగురుండు 'నెడుమాల్కడిమై' యను తిరువాయ్మొళి యను సంధించుచుండ నందు 'శిరుమామనిశరాయ్' అనుపదం బాకర్ణించి యయ్యా పరస్పర విరుద్ధంబు లగు హ్రస్వత్వదీర్ఘత్వంబులు తేజస్తిమిరంబు పోలిక నొక వస్తువునందుండ నిట్టి ధర్మద్వయంబునకు సామానాధికరణ్యం బేరీతి సంభవించు నని యడుగ, వత్సా! నీ వనుపనీతుండవు గావున నీకు శ్రుతిప్రమాణంబులచే సమాధానంబుఁ జెప్పఁ దగ దైనను సూక్ష్మక్రమంబుగాఁ దెల్పెద విను మాకారకృతహ్రస్వత్వం బును నిర్మలజ్ఞానాతిశయప్రాప్త మహౌన్నత్యంబును నొక్కయెడ నుండం దగు నని యానతిచ్చు సమయంబున శిరియాచ్చానరుళాళ ప్పెరుమా ళెంబెరుమానా రని

యెడి యిరువురు మహాదేశికులు విచ్చేయఁ బ్రత్యుత్థానాభి వందనాదుల వారిని సత్కరించి యిట్టివారు 'శిరుమామనిశ' రని తెలియం దగునని యానతిచ్చె నంత.

సీ. విమలగంగాతీర•విద్వాంసులను గెల్చి, సర్వజ్ఞుఁ డనునొక • జన్నిగట్టు
శ్రీ యతీంద్రునికీర్తిఁ • జెవులార విని వచ్చి, శ్రీరంగధామముఁ • జెందియందు
సంయమీంద్రుని గెల్వ • సర్వజ్ఞభట్ట రే,తెంచినాఁ డని పొగ•డించుకొనుచుఁ
బ్రకటతరాటోప•పటిమ నేతేరఁ గ,న్గొని యతని జయింపఁ • గోరి చూచి

తే. బాలకులఁ గూడియాడుచు • భట్టరయ్య, యిసుకదోసిటఁబట్టి యీ • యిసుక యెంత
తెలుపు మఖిలజ్ఞ యనిడాసి • పలికెననుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర.

సీ. ఇసుక యింతనియతం•డెఱుఁగ కూరక యుండ, భట్టారకార్యుఁ డా•బ్రాహ్మణునకు
నిది చెప్ప లేవైతి • విది యెంత యని యొక, చేతఁ జూప నతండు•చెప్ప లేక
యవనతాస్యుండైనఁ • నతని కతండనె, నదిదోసెఁ డిది చేరెఁ • డనుచుఁ జెప్పఁ
జాలవైతివి నీకుఁ • జాలు నీబిరుదమ్ము, లజ్ఞ సర్వజ్ఞుఁడ • వైతి వెట్టు

తే. లని పరాశరభట్టార • కార్యమౌళి, యాన తిచ్చిన విని విస్మ • యంబుఁ జెంది
యాతఁ డచ్చటివారి కి • ట్లనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. తండ్రి యేధన్యుఁ డీ • దారకమణి కని, యడుగ నచ్చోటివా • రతని కనిరి
దర్శనస్థాపన • దక్షుఁ డౌనెంబెరు, మానారు కాత్మస • మానుఁడైన
శిష్యుఁ డౌ శ్రీవత్స • చిహ్నమిశ్రగురుండు, తండ్రి యిబ్బాలక • తరణి కనుచు
జను లన విని యాద్వి•జన్మవరుండును, జాలలాలించి య • బ్బాలచంద్రు

తే. ముందుబృందావనమునందు•నందుఁడాత్మ,నందనునిమాడ్కి•భుజముల•యందుఁబ్రీతి
నెత్తికొని వచ్చెఁ గూరేశు•నింటికనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. అంత. 37

సీ. సాధ్వియౌన్నాచ్చారు • సయ్యనఁ జని కని, యావిప్రుభుజమునం • దధివసించు
కూరేశుపట్టిని • గూర్మిసందిటఁ గొని, చేలాంచలముఁ గప్పి•సిరులు మెఱయ
మంత్రరత్నము మాటి • మాటికినుడువుచుఁ, బరదృష్టిదోషముల్ • పరిహరించి
తల్లిచేతికి నిచ్చి • తనయుని వీథులఁ, దిరుగ నీయకు మని • తెలియఁ బలుక

తే. నట్లొనర్చెద నని తల్లి • యాన తిచ్చి, సంయమీంద్రునిశ్రీపాద•సరసిజామృ
తంబు సుతున కొసంగె వ•త్సలత ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

వ, తదనంతరం బప్పరాశభట్టారకుండు యోగ్యకాలమునందుఁ బితృకృతోపనయ నాదిసంస్కార సంస్కృతుండై సకృచ్ఛ్రవణమాత్రసమధిగతవేదవిదుపాధ్యాయన మీరిత సాంగోపాంగ సరహస్యామ్నాయసముదాయుఁడై కాణాదపాణినీయపూర్వోత్తరమీమాంసాపురాణధర్మశాస్త్రాద్యర్థతత్త్వంబుకూరేశగోవిందమిశ్రుల వలనం దెలిసి యొక్కనాఁడు. 39

సీ. శ్రీరంగనాథుని • సేవింప నేతేర, యవనికాంతరమునం • దమ్మురారి
శ్రీభూమినీళాది • సీమంతినులఁ గూడి, సరససల్లాపముల్ • సల్పు చుండ
సమయము గా దని • చయ్యన వెనుక కే, తెంచి పరాశర • దేశికేంద్రుఁ
డున్నంతఁ గని మన • పిన్నవానిని వీని, మన్నింప కుండుట • మనకుఁ దగునె

తే. యనుచు సిరిపల్కహరివిని•యతనిమగిడి, యాశ్రితులఁబంచిపిలిపించి•యాదరించి
భట్టరయ్యకుఁ దా నిట్లు • పల్కె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. తెరమఱుంగున నున్న • తఱి మమ్ము నీవెట్లు, తలఁచితి వని రంగ•ధాముఁడడుగ
శ్రీరంగధాముని • సిరియును గా మిమ్ము, భావించితి నటంచు • భట్టరనిన
ముందు నీడెందము•నందు మే మెవ్వర, మని తలంచితి వన • హరికి నతఁడు
తలిదండ్రు లని మిమ్ముఁ•దలఁచి యుండితిఁ గాని, వేఱెన్న లేదని•విన్నవింప

తే. నింక నాయాన సిరియాన•నెప్పటట్లు, మమ్ముఁ దలిదండ్రు లని నీదు•మదినినమ్మి
వత్స సుఖియింపుమని శౌరి • పల్కెననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

వ, అంత శ్రీవత్సచిహ్న మిశ్రగురుం డాత్మీయతనూజులకు వివాహోచితవయఃపరిమాణంబు గని సముచితక్రమంబుగా సంయమీంద్రునిం గాంచి మహాత్మా బాలకులకుం గల్యాణకాలం బుపస్థితం బయ్యె నస్మత్పూర్వ సంబంధు లందఱుఁ బ్రాకృతు లయియుండిరి యుష్మద్దాసులైనయిద్దారకులకు శ్రీవైష్ణవసంతాన సముదితకన్యకాలాభం బెట్లు గల్గు నని విన్నవింప విన నవధరించి యతీంద్రుండస్మదాచార్యులైన శ్రీ మహాపూర్ణ దేశికేంద్రుల తిరువంశంబునం దవతరించిన శ్రీవైష్ణవులు పెక్కండ్రు గలరు వారలు బృహచ్చరణులని విచారింపఁ దగదు సాంగరహస్య వేదవేదాంత ద్వయనిష్ఠా గరిష్ఠులగు వారలయందొక్కచోటఁ గన్యా పరిగ్రహంబు సేయందగునని యానతీయ నావర్ణించి కూరేశగురుండు త్రిదండపాణినిం బురస్కరించికొని యమ్మహాపూర్ణాన్వవాయుండైన యొకభాగవత శ్రేష్ఠునింటికిం జని యస్మత్తనయుం డైన శ్రీపరాశరభట్టారకునకు భవత్పుత్రికలం గల్యాణంబు సేయం దగునని ప్రీతిపూర్వకంబుగా నడుగ నద్దేశిక సత్తముండును

భట్టారకార్యునియాభిజాత్యంబుఁ దలఁచి యమ్మహాత్మునికాత్మపుత్రికల నర్పింప నుత్సహించియు ననీనసంబంధం బెట్లొనర్చెద నని యుపేక్షింపనక్కూరేశగురుండు తిరిగి నిజమందిరంబున కేతేరనతనిదేవియు బాలికలకుం బరిణయ కాలం బుపగత మయ్యె మీ రిట్లు పేక్షించుటకుంగారణం బేమి యన విని యతం డీశ్వర కుటుంబంబునకు మత్ప్రయత్నం బేమిగల దనివాక్రుచ్చి భగవత్సన్నిధికింజను దెంచి యర్భకులకు వివాహసమయం బయ్యెనని విన్నవింప విని శ్రీరంగనాథుం డిబ్భారంబు నీకేమియస్మత్తనూజులకల్యాణం బేనె యొనర్చెద నననతండు మగిడి యేతెంచె నంత నబ్భగవంతుం డమ్మహాపూర్ణ దేశికవంశ్యుం డగునా శ్రీవైష్ణవుని స్వప్నంబునఁ దన్నుం గనిపించి నీకన్నియల నిరువురను మదంశ జాతుండగు శ్రీపరాశరభట్టారకున కీఁ దగు నని నియమింప నతండు మేల్కాంచి స్వప్నలబ్ధ భగవదనుగ్రహంబు సారెసారెకుం దలంచి సంతసించి ప్రభాతకాలో చిత కృత్యంబు లొనరించి శుభనిమిత్తంబులం గాంచి యాసంబంధంబు తిలకించి దేవీసమేతుండగు కూరేశునిం బొడగాంచి సముచిత ప్రకారంబుగా సంభాషించి కల్యాణంబు నిర్ణయించి శుభముహూర్తంబునం దనపుత్రిక లైనయక్కచ్చియు మన్నియు ననియెడి యిరువురు కన్నియల నుదకధారా పూర్వకంబుగా శ్రీపరాశ రభట్టారకు నకు సమర్పించి వివాహమహోత్సవంబు సల్పె నంతఁ బరాశరభట్టార కుండును దేవీద్వయ సమేతుం డై శ్రీరంగనాథునింబలెననేక మంగళవాద్య ఘోషంబులతో నిజమందిరంబుఁ జెంది యందు సుఖించు చుండె నంత. 42

సీ. సంయమీంద్ర శరీర•సంబంధులను మాని, సన్న్యసించితిరి దా•శరథిసూరి
నెడఁబాయ కుండుట•కేమికారణ మని, యాశ్రితు లడుగన•య్యార్యవరుఁడు
దాశరథిని దక్కఁ•దక్కినచుట్టాల, నందఱ నుడిగి స•న్న్యాసి నైతి
నీత్రిదండస్థాన•మితఁడు మా కది గాన, నిది యుడిగితి నేని•యితని విడిచి

తే. యుండవచ్చునటంచుఁ ద్రి•దండపాణి,యాన తిచ్చిన విని బుధు•లాయతీంద్రు
భాగినేయునిఁ బొగడిరి•భక్తిననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర. 43

సీ. అతిమృదులాస్తర•ణాస్తీర్ణవేత్రమ,యాసనాసీనుఁ డై•యతివరుండు
ముదమొప్పఁదిరువాయి•మొళియొకసంతఁజె,ప్పిన వినిగ్రహియించి•పృథుతదర్థ
బోధామృతముఁ గ్రోలి•భువిఁ బ్రమత్తునిగతిఁ,బరభక్తివివశుఁడై•పరమగురుండు
శ్రీమదనంతదీ•క్షితసుతుండు యతీంద్ర,భాగినేయుండును•బరమభాగ

తే. వతుఁడు దాశరథిప్రాజ్ఞ•వల్లభుండు, నతులవాధూలకులకల•శాబ్ధిచంద్రుఁ
డతనిఁ దలఁపునఁ దలఁచెద•ననిశ మనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

## అత్తుళాయమ్మగారి వైభవము

సీ. అత్తుళాయమ్మగా•రత్తింట సౌఖ్యముఁ, జెందుచు నొకనాఁడు•చెన్నుమీఱఁ
గావేరియం దవ•గాహనార్థము తన,యత్తను దోడు ర•మ్మనుచుఁ బిలువఁ
బుట్టింటివా రిచ్చు•బోనకత్తెను వెంటఁ,బెట్టుక పొమ్మని•నెట్టణంపు
మాట య త్తన విని•మఱుమాట నుడువక, తనదుపుట్టింటి కా•తరుణి యరిగి

తే. తండ్రి కావార్తఁ జెప్పన•తండు నీదు,నన్న కెఱిఁగింపుమనఁబోయి•యతికులాగ్ర
గణ్యునకుఁ దెల్పె నావాలుఁ•గంటియనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

వ. అంత రామానుజగురుం డగ్గురుపుత్రికసూక్తులాలించి యద్దేవి నూఱడించి తన కుం డ్రిదండస్థానాపన్నుఁడును భాగినేయుండును వాధూలవంశవారాశిరాకా సుధాకరుండు నగు దాశరథిసూరినిం బిలిచి వత్సా నీవీసాధ్వితోడం జని వీరియింట నఖిలకృత్యంబులు సల్పు చుండు మని నియమించి యగ్గురుపుత్రి నుద్దేశించి యమ్మా నీకుం బుట్టింటివారంపించిన సేవకుండితఁ డితనిఁ దోడ్కొని చను మని యాదరపూర్వకంబుగా నానతీయ నాకర్ణించి యమ్మహాత్ముం డప్పతివ్రతాతిలకంబుం దోడుకొని చని కావేరీప్రవాహంబునం దవగాహనంబు చేయించి మరల వారియింటం బ్రవేశింపంజేసి యందు వారల కుచితకాలకృత్యంబు లన్నియు సల్పు చుండి యొక్కనాఁడు. 46

సీ. వైష్ణవు లిరువురు•వారివాకిటను మా,ధ్యస్థ్య మొ్బ్రహ్మవా•దంబు సలుప
నం దొక్కసాత్త్వికుం•డధికయుక్తులఁ జెప్ప,నవి యప్రమాణము•లనుచునతఁడు
వ్యధికరణోక్తుల•వంచించె నితరవై,ష్ణవుఁ డది దెలిసి దా•శరథిసూరి
యన్యాయ మిది యని•యూన తిచ్చిన విని, యతఁడునీవెఱుఁగవీ•యర్థ మనిన

తే. నుభయవాదుల సూక్తుర సగ్గడించి, సార మీయుక్తియిది గత•సారమనుచుఁ
గరుణ వారికిఁదెలిపె దా•శరథి యనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

వ. అట్లు దాశరథిసూరిచేఁ దెలుపంబడి యమ్మహాభాగవతులిరువురు నన్యోన్యాను కూల్యంబుఁ జెంది యితఁడు ముదలియాండానని యెఱింగి యమ్మహాత్మునకుం బ్రణామంబు లాచరించి తదనుజ్ఞాతులై యథేచ్ఛం జని రంత నత్తుళాయమ్మకుఁ దదీయశ్వశురుం డిట్లనియె. 48

సీ. జగదేకగురుఁడైన•నంయమీశ్వరునకుఁ, బృథివి సద్గురుఁ డయ్యె•బెరియనంబి
ప్రాణపదం బైన•పట్టి పీ వతనికి, నది యెఱుంగనిది మీ•యత్త నిన్ను
నన్నమాటల కల్గి•యతిసార్వభౌమత్రి,దండాయమానుఁ డౌ•దాశరథిని
వెంటఁబెట్టుక వచ్చి•యింట ని ట్లితనిచేఁ, బనులఁ జేయించు టే•పాటి నీకుఁ

తే. బుత్రికీకై నపను లన్ని•పొసఁగమేమె,చేసెదము వారిఁ బొమ్మని•చెప్పుమనుచు
నత్తుళాయమ్మ కనియెన•య్యార్యుఁ డనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. మామగా రన్నట్టి•మాట లన్నియు విని, యత్తుళాయమ్మయే•మనక యున్న
నతఁడు దాశరథి కి•ట్లనియె మహాత్మ మా,బోఁటిభవాంబుధి • ప్లుతుల జనుల
నుద్ధరింపఁ దలంచి•యుర్విపై నవతరిం,చినవారు గాన మీ•శ్రీపదాబ్జ
ములకుమ్రొక్కెదమింక•ముదమందియతిరాజు,కడకేఁగియతనికై•కర్యములను

తే. నలుపుచుండుము మాతండ్రి•జరుగుమనిన,నార్యశాసనముడిగినే•నరుగననుచు
నతని కనియెను దాశర•థ్యార్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. నెయ్య మొప్ప నతండు•వియ్యంకుఁడైనట్టి,పెరియనంబిని గాంచి•ప్రీతి మ్రొక్కి
యతనిచే సత్కృతుఁ•డై మత్స్వరూపము,దాశరథిగురుండు•దక్కనీయఁ
డిది విరుద్ధం బార్య•యిఁక నైన నతనిని, బిలిపింపు మని పల్కెఁ•బెరియనంబి
యడియేని కిది యసా•ధ్యము స్వామి దేవర,వారు శ్రీలక్ష్మణ•సూరికడకు

తే. వేగ విచ్చేసి యతనికి•విన్నవింప నతఁడు రప్పించుఁ దనకడ•కతని ననిన
నతఁడు లక్ష్మణమునికడ•కరిగె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. ఆవైష్ణవుఁడు లక్ష్మ•ణార్యులకడ కేఁగి, భక్తిపూర్వకము గాఁ•బ్రణతిఁ జేసి
స్వామి దేవరవారు•సర్వచేతనరక్ష, నాచరింప ధరిత్రి•నవతరించి
దాశరథిని బెట్టి•త్వద్దాసుఁ డగువీని,నత్తకు మోసము•నలుప నేల
యతని రావించి మీ•యంఘ్రులకడ నుంచి, నన్ను రక్షింపు మ•నాథనాథ

తే. యనుచుమ్రొక్కెడగరుణించి•యతివరేణ్యుడత్తుళాయమ్మమాచెల్లె•లనుచుఁజెప్పి
యతనిఁ బిలిపింపనయ్యార్యుఁ•డరిగెననుచు,వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. కూరము విడిచి య•కూరేశ్వరుఁడు దొల్లి, శ్రీరంగమునకు వి•చ్చేయువేళ
నతనితోఁ దద్దేవి•యరుగుచు నాతండు, పాలారగించెడు•పసిఁడిగిన్నె
యొడి నిడుకొని చని•యడవిలో భయపడి, భయ మయ్యెనని తన•భర్తకనిన
నొడి నున్నవస్తువు • విడిచితివా నీకు, భయ మేటి దని విజ•పతి వచింప

తే. న ట్లొనర్చినఁ జూచి కూ•రాధిపుఁడు, భార్యతోఁ గూడి శ్రీరంగ•పదముఁ బొంది
యందు నిత్యనివాసముఁ • జెందె ననుచు, వాదిభీకరగురుఁ డనె, మోదమలర.

వ. అంత శ్రీమద్రామానుజ మునీంద్రుం డొక్కనాఁడు గోష్ఠీపురంబునకుం జనుదెంచి యందు నిజనివాసంబున క్షేమతర వివిక్త ప్రదేశంబునందు నతిమృదులశ్వేతాసనంబున బద్ధపద్మాసనుండై నిజాంకన్యస్తహస్తుం డయి పరమశుభాస్పదధ్యానారూఢుం డగు తిరుక్కోట్యూరి నంబినిం గాంచి ధ్యానావసానంబున న గ్గురువరునకు సాష్టాంగప్రణామం బాచరించి యతనిచే సమ్మానితుం డయి తదుద్దిష్టవరిష్ఠ విష్టరాసనం బధిష్ఠించి, మహాత్మా! మీకు ధ్యేయంబెద్ది సదానుసంధేయం బెయ్యది యని యడుగ ధ్యేయం బాచార్యవిగ్రహం బను సంధేయంబు తదీయ దివ్యనామం బని యతం డానతిచ్చిన విని సంతసించి యతనిచే ననుజ్ఞాతుండయి మగిడి శ్రీరంగధామంబున కేతెంచి స్వకీయ మఠంబునందుఁ గూరేశ దాశరథ్యాది సూరివరులతో వేదాంతగోష్ఠి సలుపుచున్న యవసరంబున ముదలియాండానునకుం బ్రియపుత్రుండగు కందాడయాండా నను మహాదేశికుండు శ్రీభూతపురియందు భగవద్రామానుజార్చా విగ్రహప్రతిష్ఠా సమయంబున శిల్పకారకరధృత సువర్ణ శలాకచే నేత్రోన్మీలన మహోత్సవంబుఁ జేయించు కాలంబున శ్రీరంగధామంబునందు. 55

సీ. కరపద్మయుగముచేఁ గన్ను లించుక మూసె, సర్వజ్ఞుఁ డాయతి•చక్రవర్తి
స్వామి యి దే మని•సంశ్రితు లన నిది, కందాళయాండాను • కార్య మనుచు
నానతిచ్చిన విని • యార్యులందఱును సం,దియమొంది మఱికొన్ని•దినములకును
శ్రీభూతపురినుండి • శ్రీవైష్ణవులు వచ్చి, యచటివృత్తాంతము • లన్నిదెలుపఁ

తే. దెలిసి యాశ్చర్యమొంది ర•ద్దేశికేంద్రు, లట్టి యతిరాజదివ్య క•థామృతంబు
శ్రుతిపుటులఁ గ్రోలుచుందురు•సుజనులనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఒక మూకవైష్ణవు • నొకనాఁడు చేసంజ్ఞఁ, బిలిచి యాతనితోడఁ • బ్రేమనొక్క
యింటిలోఁజొచ్చి యా•యింటివాకిలిమూసి, యుడయవరాత్మాంఘ్రి•యుగమతనికిఁ
గనిపించి నీకింత•కంటె గమ్యము గతి, యన్యము లేదని • యానతీయ
నందు రంధ్రములఁ గూ•రాధిపుఁ డది చూచి, యక్కటా శాస్త్రము•లధికరించి

తే. చెడితిఁ గాకున్న నీమూక•చేతనునకుఁ, బోలె వీనికి నిజపదాం•భోజయుగము
గుఱుఁడు చూపింపఁడా యని•కుందె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. తన సంశ్రితులనెల్లఁ • దగినకైంకర్యము,లందు నియోగించి • యతివరేణ్యుఁ
డొకవైష్ణవుని కేమి•యుచితకైంకర్యముఁ, జెప్పకున్న నతండు • చింతనొందె
నది యెఱింగి యతీంద్రుఁ, డార్య నీ శ్రీపాద,తీర్థము మా కిమ్ము • దినదినంబు
కైంకర్య మిది నీవు • గావింపు మన నతం, డనుదినంబును దీర్థ • మాడివచ్చి

తే. మ్రొక్కి లక్ష్మణమునికన్న•మ్రోలనిలిచి, కరసరోరుహములమోడ్చి•కదలకుండుఁ
దనదుకైంకర్య మయ్యెడు•దనుకననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. హరిపూజనముఁ జేసి • యతని శ్రీపాదతీ,ర్థముఁ గ్రోలి కాని త్రి•దండపాణి
యారగింపఁడు నిత్య,మదిచూచి యాశ్రితు,లొకనాఁ డిదేమి మీ,కుచితమనిన
నడయవ రాకృత్య • ముడిగి యే మనకున్న, శ్రీమదార్యునియాజ్ఞ • సేయనేని
వీనిస్వరూపము • హానిఁ జెందును గదా, యని కదలక నిల్చె • నమ్మహాత్ముఁ

తే. డతని గురుభక్తి కాశ్చర్య•మంది రాయ్య. లంతఁ దత్పాదతీర్థము • యతివరుండు
చేకొని వారితో సంత•సించె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. మఱియొకదినమున• మఠములోఁ గొందఱు, స్వాములు హరియాగ • సమయమునను
గురునితోఁ జెప్పక • కూరేశుఁ గదళీప,లాశముల్ దెమ్మని • వాసిఁ బనుప
నతఁడుదాత్రముఁ గొని,యరఁటితోఁటకుఁ జని,యొక యాకుగోసిన•నుదకమొలుకఁ
గటకటా చేతన•మాతి నైతి నటంచు, నతఁడు మూర్ఛిల విని • యార్యుఁడరిగి

తే. యానృశంస్యాదిగుణనిధి • నతనిఁ జూచి, యిట్టిపని కితనిని బంచి • రెవ్వరనుచు
వగచియాతనిఁ దోడ్కొని • వచ్చెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

## గోష్ఠి పరిపూర్ణ పత్ని పుత్రీ వైభవము

సీ. బ్రహోత్సవముఁ జూడ•బ్రహ్మవిత్సముదాయ, మంజనావలమున•కరుగుచుండి
గోష్ఠిపరిపూర్ణ • గురునింటి కేలేర, నానఁబి లేకున్న • నతనిపత్ని
వేఱుధాన్యము లేక • విత్తులపురి దీసి, దంపించి యాశాలి • తండులాన్న
మమృతోపమవ్యంజ,నాన్వితముగ నిడ, సాపడి జరిగి రా,స్వామి లంత

తే. నాత్మపతి వచ్చి విత్తులే•వనుచు నడుగ,విత్తితిని బ్రహ్మపదమున•విత్తులనుచుఁ
దెలియఁ బల్కెను భర్తక•ద్దేవియనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. గోష్ఠిపరిపూర్ణ • గురుపుత్రి యొకనాఁడు, యతిరాట్పదాబ్జము • లాశ్రయింప
సకలహితంబులు • సల్పి యతీంద్రుఁ డా,సాధ్వికి నిజపదా•బ్జములఁ జూపి

తంజ మిదే యని • తలఁచి యుండితి వేని, కరతలామలక మై • పరమపదము
గలుగును నీ కని • పలుక నగ్గురుపుత్రి, యంతిమదశను మా•యయ్యగారు

తే. తావకాంఘ్రులు శరణొందె • దాసి కేమి, చెప్పవలె మీపదాంబుజ • సేవసేయ
ననుచు వాక్రుచ్చి చేమోడ్చి•యరిగెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. భువి నేగురుని తిరు•ముడి యన్వయముఁ జెంది, పూర్వదేశికులెల్ల•ముక్తిఁ గనిరి
యర్వాఙ్మనీషు లే•యార్య పదాబ్జసం•బంధు లై కాంచిరి • పరమపదముఁ
జారుభవిష్యదా•చార్యు నెవ్వనిఁ దొల్లి, సాక్షాత్కరించెను • శఠవిరోధి
యుభయవిభూతుల • నొసఁగె నే యారికి, దాససమృద్ధికై • శ్రీసఖుండు

తే. ఇలను మత్కృతినాయకుఁ•డేఘనుండు, అట్టి రామానుజాచార్య • లస్మదీయ
బుద్ధిఁ గనిపించుఁ గాక యే•ప్రొద్దుననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

శా. శ్రీమద్భూతపురీశ కేశవసుతా•శ్రీవిష్ణుధర్మవ్రతా
భూమ్నిమధ్యద్విదశాబ్దపీరగతజం•బూద్వీపభాగ్యోదయా
కామాదిద్విషదౌష్మదావదహనా•క్రాంతాత్మవృష్యధ్ఘనా
హైమస్తోమత్మణాశ్మలోష్టసమ యా•త్మారామ రామానుజా.

క. రామానుజ కార్పాసా రామరమారాధితాంఘ్రి•రాజీవయుగా
శ్రీమద్యజ్ఞేశ బుధ•గ్రామణివినుతప్రభావ•కలిరిపుదేవా. 64

మాలినీవృత్తము. ప్రపదనసదుపాయా•పాదజుష్ఠాగధేయా
శపథజితకువాదీ•సద్గుణబ్రహ్మవాదీ
కపటగుణసుదూరా•కారమారేష్టచారా
విపదురగఖగేంద్రా•విశ్వచంద్రా యతీంద్రా 65

గద్యము. ఇది శ్రీభగవద్రామానుజ కరుణాకటాక్షకలితకవితావైభవ పరవాదిభయంక రాచార్యాభిమతచ్ఛాత్రాపస్తంబసూత్రకణ్వసగోత్ర పవిత్రోభయకవి మిత్రవేంకట కృష్ణార్యపుత్ర విబుధవైష్ణవవిధేయ కేశవనామధేయప్రణీతంబై నయాచార్య సూక్తిముక్తావళి యనుమహాప్రబంధంబునం బూర్వభాగంబున శ్రీ వైష్ణవస్వరూప నిరూపణంబును గూరేశదాశరధులకుం జరమోపదేశక్రమంబును నొక్క పుష్కరిణియందు వసించు జలజంతువులకు యతీంద్రుండు ముక్తి నొసఁగుటయు శ్రీరంగామృత గురువరోపాఖ్యానంబును గ్రిమికంఠజన్మ నిమిత్తకధనంబును భట్టార్యబాలచేష్టిత ప్రదర్శనంబును శ్రీపరాశర భట్టారకవివాహను హోత్సవ

వ్యాఖ్యానంబును దాశరధి మాహాత్మ్య ప్రవచనంబును శ్రీ మహాపూర్ణ పుత్రికా విభవాభిభాషణంబును గూరేశగుణ ని శ్రీరంగ ప్రవేశ వర్ణనంబును శ్రీ భూత పురియందర్చాత్మక శ్రీయతీంద్రప్రతిష్ఠాను క్రమసంకీర్తనంబును మూకముక్తి ప్రదానఫణితియు శ్రీపాదతీర్థ మాహాత్మ్య ప్రకటనంబును గూరనాథానృశంస్య ప్రకారంబును దదీయారాధనాతిశయద్యోతనంబును గూరనాథానృశంస్య ప్రకారంబును దదీయారాధనాతిశయ ద్యోతనంబును గోష్ఠిపూర్ణపుత్రిక శ్రీ సంయమీంద్రునిపదాబ్జంబు లుపాయోపేయంబులుగా నిశ్చయించుటయు నన్నది సర్వంబును షష్ఠోల్లాసము.

ఆచార్యసూక్తిముక్తావళి

పూర్వభాగము

—: ౦ :—

శ్రీమతే రామానుజాయ నమః



# ఆ చా ర్య సూ క్తి ము క్తా వ ళి

## మ ధ్య భా గ ము

---

### ప్ర థ మో ల్లా స ము



శ్రీభూతపురనివేశా
ప్రాభవనిజకాంతివిజిత•శాలదినేశా
శోభితవైష్ణవదేశా
స్వాభావికశమదమాది•సద్మయతీశా. 1

వ. అవధరింపుము. 2

సీ. శ్రీసఖజలధిసు•స్థిరకృపాసలిలంబుఁ, గ్రోలి శఠారాతి•కాలఘనము
నాథమునీంద్రుఁ డ•న్నగముపై వర్షింప, నది రామపుండరీ•కాక్షు లనెడు
ఝురముల యామునా•చార్యమహానది, పూరించి పొరలి యి•బ్భువి యతీంద్ర
పద్మాకరేంద్రంబు•పరిపూర్ణ మొనరింప, దేశికాభ్రమములు•దిశలయందుఁ

తే. బ్రాణిసస్యంబు లన్నియుఁ•బపిమి మీఱఁ,జాలఁ బ్రవహించుచున్నది•సరసులార
నమ్మయాళ్వారి నెమ్మది•నమ్ముఁడనుచు,వాదిభీకరగురుఁడ డనె•మోద మలర. 3

సీ. నారాయణుఁడె శేషి•నరసురగిరిముఖ, చేతనాచేతన•సృష్టి కెల్ల
నతనికల్యాణగు•ణాత్మక మగుదివ్య•విగ్రహంబు శఠారి•వేష మయ్యె
నతనికెంజాయల•యంఘ్రిపద్మమ్ములె, రామానుజార్యులై•రంగు మీఱె
నమ్మహాత్మునియందె•యాచార్యదేశిక•గురుపదంబులు దొడ్డ•కూర్మిఁ జెందెఁ

తే. గనుక మిగిలినగురుకుల•మెనసి చూచి, యాయతీంద్రునికే శేష•మయినకతన
నతని విడిచిన మోక్షి మె•ట్లబ్బు ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. శ్రీభాష్య మాచార్య•సేవచేఁ బరియించి, శిష్యముఖంబు గాఁ•జెప్ప వలయు
నది యొనర్ప నశక్తుఁ•డాయెనా శఠవైరి,శ్రీసూక్తులే విశ్వ•సింప వలయు

నట్లు రంగాదులం, దమరి యాహారికిఁ బ్రసిద్ధకైంకర్యమే, చేయ వలయు
మంత్రరత్నార్థమే• మననంబు సేయుచుఁ, కలిగినకాలంబుఁ•గడప వలయు

తే. సతతవైష్ణవపూజలే • సలుప వలయు, నొదిఁగి యదుగిరిచెంతఁ•నుండవలయు
సేమ మిది యని యతిపతి•చెప్పె ననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర

సీ. నయనాపదేశిక • నాయకుం డొకనాఁడు శ్రీరంగనాథుని • చెంత నిలిచి
శ్రీశఠకోపంబుఁ • జెన్నుగాఁ దలఁ దాల్చి, సాత్త్వికజను లెల్ల • సన్నుతింప
సర్వభూతోద్ధర్త • జగదేక గురువర్య, లుడయవరే కాని • యొరులు గారు
సత్యంబు సత్యంబు • శపథించి పల్కెద, స దియంబులు మాని•చెందుఁ డితని

తే. ననుచుఁ బల్కిన విని నమ్మి•యఖిలజనులు, నతనిశిష్యప్రశిష్యుల•నాశ్రయించి
ధన్యులై రాయతీంద్రుఁడే • దైవ మనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర

సీ. శౌరిరాజగురుండు • సరసచతుశ్శ్లోకి, నెవ్వనిమంత్రార్థ • మెఱుకపఱిచె
నఱయిరింబప్పామ • హోత్ముఁ డష్టశ్లోకి, నెవ్వనిమహిమము • లేర్పరిచె
వ్యతిరేక నియతి నె • వ్వనినామవైభవ, మెఱిఁగి వచించెఁ గూ • రేశగురుఁడు
యజ్జన్మకార్యజ్ఞుఁ • డయ్యె దాశరథి యి, ట్లరుళాళముని యతీ • యత్ప్రభావ

తే. మెంచ నెంచెదరాచార్యు • లెల్ల నవని, నాయతీంద్రునిసంబంధు • లయినవారె
ధన్యులయి ముక్తిఁ గాంతురు•తథ్యమనుచు వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. ఏడునూఱులయతు • లేకాంగు లీరాఱు, వేలు డెబ్బదినాల్గు • పీఠపతులు
నాచార్యపూరుషు • లఖిలవైష్ణవులును, శ్రీరంగమందునఁ • జెలఁగి కొలువఁ
గావిమడుంగులు • గలమేనిపై ద్వాద, శోర్ధ్వపుండ్రద్యుతు • లుబికి మెఱయ
వజ్రదండత్రయ • వ్యాఖ్యానముద్రల, నుభయక రాబ్జముల్ • ప్రభలు గుల్క

తే. శిఖయు యజ్ఞోపవీతంబు • సిరుల సీన, గోష్ఠిభూషణమైనయ•గ్గురువరేణ్యుఁ
దలఁచి కొలిచినమనుజులే • ధన్యు లనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. బాలభాస్కరు నైన • బవరానఁ దూలించు, తిరుమేనిచాయలఁ • దేలువానిఁ
బూర్ణేందుబింబంబు • పోలిక మీఱిన, మొలకనవ్వులముద్దు • మోమువానిఁ
బలుమాఱనన్యప్ర • పన్నులకనుమ్రోలఁ, బసిఁడికల్పక మనఁ • బరఁగువానిఁ
గరుణామయాపాంగ • కలితసుధావృష్టిఁ, జెందినవారిపైఁ • జిలుకువాని

తే. నడుగుఁగెందామరలదోయి•బెడగుగముల, నజ్ఞతాధ్వాంతములఁ బాపు•యతివరేణ్యుఁ
దలఁచికొలిచినమనుజులే • ధన్యు లనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఏగురుఁ డిల వేంక • టేశున కిచ్చెను, శంఖచక్రంబుల • జను లెఱుంగఁ
గాళహస్తీశుని • గడపపర్యంతము, కుమతులఁ జెందాడు • గురుఁ డెవండు
శ్రీశైలపూర్ణుల • చెంత నబ్దం బుండి, యెఱిఁగె రామాయణ • మేమనుండు
తిల్లగోవిందునిఁ • దెచ్చి శ్రీపురియందు, నెలకొల్పె నెవ్వఁడు • నేర్పు మీఱఁ
తే. బుడమి శ్రీ శైలపూర్ణుని,భూరికృపను, గోర గోవిందమిశ్రులఁ•గొనియె నెవ్వఁ
డస్మదాదులదైవత • మతఁడె యనుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర.

సీ. ఆసూరివంశామ్బు • తాబ్ధిని నెవ్వాఁడు, జనియించె సంపూర్ణ • చంద్రుఁ డనఁగ
నవనినభోవీధి • కాకల్ప మై యెవ్వఁ, డజ్ఞాత-కధ్వాంత • మడఁచివైచె
నాత్మగ్రగహర్షతా • రాధ్యక్షుఁడై నేలఁ, జదల వెలిఁగెడు • సరసుఁ డెవఁడు
ప్రతికూలవిరహిహ్బా • ద్బాధాకరబ్రహ్మ, తర్క-ప్రమాణాంశు • ధరుఁ డెవండు
తే. సాధుహృత్కుముదినీస క్త,సరసుఁడెవఁడు,సచ్చకోరుల భాజ్యోత్స్న•సరగునెవ్వఁ
డస్మదాదులదైవత • మతఁడెయనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర

సీ. అలకేశవార్యోద • యాచలేంద్రముల్లఁ, గాంతిమతీప్రాచి • గర్భమందు
నుదయించి భూతపూ • ర్వ్యోమస్థలిని మించి, యతిరాజభాస్కరుం•డలరుచుండ
నజ్ఞానతిమిరౌఘ • మల్లనల్లనఁజెడె, విజ్ఞానదీప్తులు • విస్తరించె
సాత్త్వికాంభోజముల్ • చల్లన వికసించె, వాదిఘూకంబుల • వడి యడంగె
తే. వస్తుతత్త్వంబు భవులకు•వసుఁ దెలిసె, శేషతాకృత్యధనములఁ•జెందఁ గలిగె
నహహాయోరవిదీప్తియే•మందు మనుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర.

సీ. భూతపురాభ్రప్ర • భూతలక్ష్మణముని, దివ్యాబ్ద మొక్కటి • దెసలఁ గప్పఁ
దత్కటాక్షేక్షను • ధాదివ్యవృష్టిచే, సూరిచాతకములు • సుఖముఁ జెందె
సుజనమయూరముల్•చోద్యంబుగా నాడె, వాదిహంసకులంబు•భేద మొందెఁ
దాపత్రితయదావ • దహన బు చల్లారె, సాత్త్వికావళి భూమి • సంతసించెఁ
తే. గలిమలపుఁజీడపీడలు • గడచి బ్రదికె, ప్రాణిసస్యంబు లన్నియుఁ•బ్రభవహించె
మంచికాలము నేఁటి కే•తెంచె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. కాంతిమతీదివ్య • గంగానది జనించి, రామానుజహ్రద • రాజ మొకటి
కరపదముఖనాభి • కల్యాణసౌరభ, పద్మమీక్షణమీన • భాసురంబు
దీర్ఘబాహూతరంగ • ధీర మాశ్రితరాజి, రాజహంసావళి • భ్రాజితంబు
లలిత ప్రపావవి • లక్షణక మరంబు, భూరితేజోజల • పూరితంబు

తే. నగుమఁ బూదూరఁ గనిపించె•నందఱికిని. దానిఁదలఁచినఁ ధీఱు నే•తాపమయినఁ
జెందువారికి సేమ మెం•తందు ననుచు వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. కేశవనామల•క్ష్మీపతిప్రీతికై, భూతపూర్ణ్ందన•భూమినడుమఁ
గేశవప్రభుఁ డైన•కేశవార్యునివల్లఁ. గాంతిమత్యావాల•కలన మొ౦ది
బాహుశాఖలు పాణి•పాదపల్లవములు, మొలకనవ్వులపుష్ప•ములు వహించి
రంజిల్లుచున్నది•రామానుజార్యుఁ డ,న్పసిఁడివేల్పుల చెట్టు•పలువిధముల

తే. దెసలుపదియును దనవాయఁ•దెలివిదాల్చి, పెరుగుచున్న దిలాపు౦•ప్రీతికొఱకుఁ
జెడక నరులార దాని భ•జింపుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. కేశవాచార్యు లా • కేశవనాథుండు, కాంతిమతీదేవి • కలిమికొమ్మ
యాదంపతులె లక్ష్మ • ణాచార్యులై రని, తలఁచెద బహువిధ • తర్కములను
మత్తారకత్వంబు • నుజ్జ్వలఘటకత్వ, మట్లు గా కున్న నె • ట్లగు నితనికి
నుత్తారకత్వోప • యుక్తకృపామాత్ర, సుప్రసన్నార్యత్వ • సుందరుండు

తే. నీ మహాత్ముఁడు గనుకనే, యితని దివ్య పాదపద్మంబులే తల్చి • పరమపదముఁ
జెంది రాచార్యు లెల్లఁ బ్ర•సిద్ధ మనుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర.

సీ. శ్రీశ్రీపతులు సర్వ•చేతనులను మన్ప, వరలక్ష్మణార్యరూ•పంబుఁ జెంది
యవతరించినకత • నాపెరు బూదూరు, గోచరంబైన వై•కుంఠ మయ్యె
నచ్చోట నెలకొన్న•యఖిలవైష్ణవులును, శేషశేషాశనా•శివిషాశు
లాదిగాఁ గలసూరు • లచటిపద్మాకర, మైరమ్మదీయ మ • ట్లచటివాఁక

తే. లన్నివిరజాపగాకృతు • లై వెలుంగు, ధన్యపుష్కరిణీంద్ర మా•తరులు గిరులు
తలఁప నప్రాకృతంబులు•తథ్యమనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. శ్రీపెరుంబూదూరు • చేరువై కనిపింపఁ, దీర్ఘయాత్రల కేల • తిరుగవలయు
రామానుజార్యులు • రంజిల్లు చుండంగ, వేఱుదైవత మేల • వెదకవలయు
నతనికైంకర్యమే • యాత్మార్హమై యుండ, మఱియొకపని యేల • మరగవలయు
నతనినామమె జిహ్వా•కర్హమై యుండంగఁ, గాఱుకూఁతల నేల • కఱవవలయు

తే. నతనిమంగళచరిత గు•ణామృతంబె, క్రోలుచును బ్రొద్దుపుచ్చుట•గుణమె గనుక
జనులకెల్లను మేలిది • సత్యమనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. సర్వజ్ఞుఁడై సర్వ•శక్తిసంపన్నుఁడై, సత్యసంకల్పుఁడై • సర్వశేషి
యైన సర్వేశ్వరుం • డమితజన్మము లెత్తి. యొక్కాత్మ నైనను • జక్కఁబఱుప

శక్తుండు గాక వి • చారింప శేషుఁ డా • హరితోడఁ బంతము • నాడి వచ్చి
రామానుజాచార్య • భూమిక ధరియించి, జ్ఞానాంజనంబువ • మానవులకుఁ

తే. జూపె నచ్యుతపదదాస్య • సులభధనము, నిట్టికలి మిచ్చుసద్గురుం • డెందుఁగలఁడు
ఇతనియంఘ్రు లుపాయము • పేయమనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. సకలపాతకములు • సలుపువా రైనఁ గి • రాతాదిదుష్కుల • జాతు లయిన
వర్ణాశ్రమవిరుద్ధ • బహువిధదారుణ, వృత్తుల బ్రదుకును • న్మత్తు లైన
భూమి రామానుజ • మునిపాదపద్మము, లాశ్రయించిననాఁడె • యఖిలలోక
పూజ్యులై శ్రీసఖ • పుణ్యవిమానాయ, మానమనస్కులై • మనుదు రెచట

తే. వారిపూర్వాన్వయక్రియా • వర్తనములె, యస్మదాద్యులకర్హణీ • యంబు లగును
వారెపో నిత్యసూరు లీ • వసుధ ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. విద్యానదుల కెల్ల • హృద్యమౌ జన్మాద్రి, జనిపథపథికవి • శ్రమణశాఖి
యఖిలకుబుద్ధిమా • యాశర్వరిని దొల్గఁ, బంప నేర్చినబాల • భాస్కరుండు
సతతామితామ్నాయ • శాస్త్రపయోరాశి, వేలాసముల్లస • ద్విమలవిధుఁడు
నీషణత్రయతూల • భీషణపవనుండుఁ, బాపాటవీదావ • పావకుండుఁ

తే. బరమధర్మము లన్నియు • బహువిధముల, నవని నెలకొల్పఁ బూదూర • నవతరించి
యున్నయతిపతి గతి మతి • యుతుల కనుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర.

సీ. పరవాసుదేవుని • పాదాంబుజచ్యుత, మకరందఝరములు • మనుపు జనుల
సకలోపనిషదుక్తి • జాలంబు లెల్లను, దమ్ము భజింపంగఁ • దనరు చుండు
నేదోషములు లేక • యెలమిఁ జెందుచు విన్న, వారిదోషంబుల • వడి యడంచుఁ
గథకేంద్రులతలంపు • కల్పన లలరింపఁ, గల్పవృక్షసమృద్ధి • గలిగియుండు

తే. యతిపతీద్ధప్రబంధంబు • లాశ్రితులకుఁ, దాపములఁబాపి సుఖములఁ • దనుపుగనుక
దత్ప్రబంధార్థవేత్తలే • ధన్యు లనుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర.

సీ. బహువిధసమయప్ర • భావనల ధరిత్రిఁ, గ్రీడింపఁ దలఁచిన • కృష్ణుమొదటి
వ్యూహభేదం బంత్య • మొకవర్ణ మలరింప, విశ్వంబు రక్షింప • వినయనియతి
వ్యంజితానుగ్రహ • వంతుఁడై హరిసైన్య, నాథుండె యీయతి • నాథుఁ డయ్యెఁ
దద్వేత్రసారమే • తత్త్రిదండం బయ్యెఁ, గాక యెట్లీశక్తి • గలుగ నేర్చు

తే. నిమ్మహాత్మ్యనివైభవం, బెవ్వఁ డెఱుఁగు, శేషుఁడో సైన్యనాథుఁడో • శ్రీసఖుండొ
సదయుఁ డై తోఁచె నిట్టులు, సత్య మనుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర.

మత్తకోకిలవృత్తము. కేశవాంఘ్రిసరోజభాజన • కీర్తిసారసుభాజనా
కేశవప్రియనందనా శుభ, కృత్యవైష్ణవచందనా
దేశికేంద్రశిఖామణీ శ్రుతి, దివ్యపద్మనభోమణీ
దాశరథ్యనుకూలభాషణ • ధర్మపద్ధతిపోషణా. 24

క, శ్రీరామానుజమునివర, కాంఙణీక మహాత్మ ఘోర • కలిదోషహరా
చారుశ్రీభూతపురా, గారనిరంతరవిహార • కల్యాణకరా.

మాలినీవృత్తము. సుకవినుతచరిత్రా • శోభితస్వర్ణగాత్రా
వికసదమితవిద్యా • వేదవిత్సూరిహృద్యా
ప్రకటితబుధషండా • పాణిపద్మత్రిదండా
వికలితఖలకాండా • శ్వేతమృత్స్నోర్ధ్వపుండ్రా,

గద్యము. ఇది శ్రీభగవద్రామానుజ కరుణాకటాక్ష కలితకవితావైభవ పరవాదిభయంకరాచార్యాభిమతచ్ఛాత్రాపస్తంబసూత్ర కణ్వసగోత్ర పవిత్రోభయకవిమిత్ర వేంకటకృష్ణార్యపుత్ర విబుధవైష్ణవవిధేయ కేశవనామధేయప్రణీతం బైన యాచార్యసూక్తిముక్తావళి యనుమహాప్రబంధంబునందు మధ్యమభాగంబున శ్రీశఠకోపాదిగురుపారంపర్యక్రమంబునఁ జేతనులుహరికృపామృతంబులభించుటయు శ్రీయతీంద్రునియందు గురుపదంబు విశ్రమించుటయు శ్రీరామానుజచరమవార్తాషట్కనిరూపణంబు నద్దేశికేంద్రునివిగ్రహవర్ణనంబు నగ్గురుశిఖామణిప్రభావచరిత్రసంగ్రహంబును రామానుజాచార్యావతార ప్రకాశనంబును శ్రీభూతపురీమాహాత్మ్యంబును మఱియు నగ్గురునియవతార ప్రయోజనకథనంబును దదీయసేవకాతిశయద్యోతనంబును వెండియుఁ దత్ప్రభావతద్గ్రంథాధిక్యాదిప్రవచనంబు నన్నది ప్రథమోల్లాసము.

—: ० :—

శ్రీమతే రామానుజాయ నమః



# ఆ చా ర్య సూ క్తి ము క్తా వ ళి

## మ ధ్య మ భా గ ము

---

## ద్వి తీ యో ల్లా స ము

శ్రీకాంతిమతీగర్భ
శ్రీకరశుక్తిప్రభూత • సితమౌక్తికను
శ్లోకశ్లాఘితశుభగుణ
శ్రీకరిగిరివరదనిత్య • జీవనదానా,

వ. అవధరింపుము. 2

సీ. జననాదిసకలశై • శవచేష్టితంబుల, నాభూతనగరిలో • నాచరించి
సత్యవ్రతక్షేత్ర • సౌభాగ్య మితఁ డనఁ, గాంచీపురముఁ గాంచి • ఘనత మించి
వర్ణాశ్రమోచిత • వైదికాచారము, లవిలంఘ్యహరిశాస • నాత్మకములఁ
బఱపుచు నయ్యాద • వప్రకాశునికడఁ, బూర్వమీమాంస నై • పుణ మెలర్ప
తే. నధికరించుచుఁ గరిగిరి • హరికి నిత్య, మభిషదామృత మర్పించు • నార్యమణిని
దలఁచువారె కృతార్థులు • ధరణి ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. తిరుమంజనఘటంబు • దివ్యమాల్యముఁ బట్టి, శిరమున నపరిక • చెంద నునిచి
చామరంబులు వీవ • సకలవాద్యధ్వనుల్, నృత్తగీతరవంబు • నిఱిగి నెఱయ
స్తోత్రరాజం బర్థ • పద్ధిగాఁ జదువుచుఁ, దదనుభవప్రీతి • దనర వచ్చు
ధన్యునిఁ గని యాము • దల్వెనివ న్నని, యాళవందారు తా • మాన తిచ్చి
తే. ప్రపదన మొనర్చె వరదాంఘ్రి • పద్మ మందు, దానిచేతను దర్శన • స్థాపనాఢ్యుఁ
డయ్యె నితఁ డనిచెప్పుదు • రార్యులనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. వరదుని వీడ్కొని • తరలి యామునముని, శ్రీరంగమునకు వేం • చేసె నంత
నలయిళియాళ్వారు • లాయాదవప్రకా • శకునింట శాస్త్రంబుఁ • జదువుచుండఁ

జోళభూపాలకు • సుత నొక బ్రహ్మరాక్షసుఁ డూని బాధింపఁగా నెఱింగి
యారాజు యాదవ • సూరి కెఱింగింప, నతఁ డెంతపని యిది • యనుచుఁ బల్కి

తే. రాజసుతను బూనినబ్రహ్మ•రాక్షసునకు, విడిచి పొమ్మని యీనేను • నుడివితి నని
పల్కి మనియొక్కశిష్యునిఁ•బనిచె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అతఁడు పంచినశిష్యుఁ • డరిగి రాచూలినిఁ, గదిసినబ్రహ్మరా•క్షసునిఁ జూచి
వరమంత్రవిద్యాద • వప్రకాశకులు ని, న్విడిచి పొమ్మని రని • నుడివె నంత
నీదేశ ముడిగి మ•ఱేదేశమునకైన, నిన్నుఁ బొమ్మనె నని • నీవు చెప్పు
మని యతఁ డన విని • యతంయంతేవాసి, దాఁపనరాకాసి • పలుకు లన్ని

తే. గురుని కెఱిఁగింప నతఁడల్గి • కోరివచ్చి, మంత్రజపజాతగర్వంబు • మదినిబెనఁగ
బ్రహ్మరక్షోవరున కిట్లు • పలికెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. బ్రహ్మరాక్షసముఖ • బహువిధగ్రహములు, నాపేరు వినిపింప • నలిగి చనును
అట్టిన న్నెఱుఁగక • యాజ్ఞమీఱిననిన్ను, మంత్రబలంబున • మసి యొనర్తు
ననుచు యాదవసూరి • యల్గి పల్కిన బ్రహ్మరాక్షసావిష్ట యౌ • రాజపుత్రి
యొకకాలు ముడిచివే•ఱొక కాలుచాఁచుక,ముందుండి తద్వాక్య•ములకు నలిగి

తే. పాదములు రెండు నతనికై • పాఱఁ జూఁచి, నీదుబింకము లేమియు • నెగ్గ విచట
వలదు కష్టింపఁ జను మని • పల్కె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. వేయుఁ బల్కఁగనేల • విను మొక మాట నీ, మంత్రము లన్నియు•మాకుఁగలవు
నీయాజ్ఞ సలుపంగ • నీ వెవ్వఁడవు మాకు, నీకంటె నధికుఁడ • నిజము నేను
నీపూర్వవృత్తమే • నీ వేమెఱుంగవు, మాజన్మ మెట్లు నీ • మదికిఁ దోఁచు
నీతొలిజన్మంబు • నీ కిట్టివిభవము, మాపూర్వవృత్తము • మాకుఁ దెలియు

తే. ననుచుఁ బల్కెడిబ్రహ్మగ్ర•హాధిపతికి, నీవు నేనెవ్వరము ముందు • నిజముగాను
దెలుపుమని పల్కె యాదవ • ధీరుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. సార మౌకావేరి • తీరమం దొకయగ్ర,హారైకభోక్త నౌ • నవనిసురుఁడు
సకలసాంగోపాంగ • సశిరస్కసరహస్య, వేదశాస్త్రవ్యాఖ్యాన • విశదమతియు
నైననే నొకమహా • యాగ మొనర్చుచు, నం దంగలోపము • చెందుకతన
నిట్టిదుర్దశఁ జెంది • యీరాచపట్టిని, బట్టి నాసుగతికై • బాధపడుచు

తే. నుంటినని బ్రహ్మరాక్షసుం డన్నయట్లు, తనదువృత్తాంతమంతయా దవుఁడువినగఁ
జెప్పి యాతనిజన్మంబుఁ జెప్పె ననుచు, వాదిభీకరగురుఁ డనె మోద మలర.

సీ. తిరుమలలో బ్రహ్మ తిరునాళ్ళ సేవింప, భూలోకవైకుంఠ పురమునుండి
స్వాములు వేంచేసి సరస మౌమధురాంత, కపుఁజెర్వులో నవ గాహనంబుఁ
గావించి పొదరింటఁ గమలామనోహరు, నర్చించి తచ్ఛేష మారగింప
నొకపుట్టలో దొడ్డ యుడుమవై యున్ననీ, వావైష్ణవులకడ కరుగుదెంచి

తే. వార లంఘ్రులు గడిగిన నీరు ద్రావి, తత్ప్రసాదంబుఁదిని యిట్టి ధరణిసురుఁడ
వైతివని బ్రహ్మరాక్షసుఁ డనియెననుచు, వాదిభీకరగురుఁ డనె మోద మలర.

సీ. ఆబ్రహ్మరాక్షసుఁ డన్నమాటలువిని, మగిడి యాదవుఁ డొక్కమాటఁ బల్కెఁ
గాలత్రయీజ్ఞాన ఘనుఁడవు గనుకను, నీదుముక్తికిఁ ద్రోవ నీవె తెల్పు
మని పల్క విని భూసురాసురుఁ డిట్లనె, నిత్యసూరుల కెల్ల నేత యొకఁడు
నీకడఁ జదువుచు నిను డాసి యున్నవాఁ, డాతండె పో లక్ష్మణార్యుఁ డవని

తే నతఁడుపొమ్మనఁ బోయెద ననుచుఁబల్క యాదవప్రేరితుఁడు లక్ష్మణార్యుఁడపుడు
బ్రహ్మరాత్రించరున కిట్లు పల్కెననుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

సీ. నీవు గోరినయట్లు నేనె పొమ్మనియెద, వేగ నీరాచూలి విడిచి పొమ్మ
టని లక్ష్మణాచార్యు లానతిచ్చిన విని, బ్రహ్మరాక్షసుఁ డిట్లు పలికె మరల
శ్రీలక్ష్మణార్య నీ శ్రీపాదయుగము నా తల నుంచితేఁ గాని తరల నిచట
నని పల్కనను విని యఖిలజగద్గురుం డాలక్ష్మణాచార్యు లట్లొనర్చి

తే. తనదుశ్రీపాదరేణు వాతరుణినుదుట, రక్షఁ బెట్టిన నాబ్రహ్మరాక్షసుండు
గాసి నెడఁబాసి మోక్షముఁ గాంచెననుచు, వాదిభీకరగురుఁ డనె మోద మలర.

సీ. యాదవునకు లక్ష్మణార్యుం డొకప్పు డభ్యంజన మార్చ నయ్యాదవుండు
తస్యయథేత్యాద్యుదారశ్రుతికి వానరాసనాక్షుఁడు హరి యర్థ మనినఁ
దనవేఁడియశ్రు లాతనితొడఁ నిడ నుల్కి పడి వాఁడిదేమన్నఁ బలికె నిట్లు
శ్రుతి కపార్థము వచించుట ననఁగాఁ బరమార్థ మే దనఁ జెప్పె నతఁ డతనికి

తే జలము గ్రోలుటచేఁ గపి సవిత యతని వలన వికసించునె త్తమ్మి వంటికనులు
కలవు హరి కన యాదవుఁ డలిగె ననుచు, వాదిభీకరగురుఁ డనె మోద మలర.

సీ. లక్ష్మణమునిదివ్య • లక్షణంబులఁ జూచి, యితఁ డస్మదీప్సిత • మతవిరోధి
కాఁ గలఁ డీతనిఁ • గని కననట్లుగా, మాపెద నని తన • మదిని దలఁచి
గంగాదితీర్థావ • గాహనచ్ఛలమున, యాదవుఁ డాలక్ష్మ • ణార్యుతోడ
గోవిందమిశ్రులు•కూడ నేతేరఁగా, శిష్యులతోఁ గూడఁ • జెంది నడచి

తే. దూరతరఘోరకాంతార • దుష్టజంతు, బాధవదసాధుభూమి ని • శీథమందు
విడిచి లక్ష్మణమునులను • వెడలె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. విమతిదుర్మంత్రంబు • విని యిలయాళ్వారి, కెఱిఁగించిగోవిందుఁ • డరిగె వారిఁ
గూడి లక్ష్మణముని • గురునిద్ర విడనాడి, కరిగిరివరదునిఁ • గడుఁ దలంపఁ
గనుమ్రోలశరచాప • కరవృద్ధవనచర, ద్వంద్వ మద్వంద్వ మా•తనికిఁ దోఁచి
చెంచువారము మేము • చిఱుతఁడ వీ విందు నీరాత్రి నుండుట • కేమికత మ

తే, టనుచువారిర్వురడుగన • య్యార్యవరుఁడు, తానువచ్చినక్రమమునా • దంపతులకుఁ
జెప్పెనని విందు మార్యులు•చెప్ప ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. వేఁటవేడుకఁ జెంది • విహరించు చుండుమే మర్ధరాత్రమునఁ గా • నడవి నివట
ని న్నొక్కరునిఁ జూచి • మన్నింప వచ్చితి, మన్ననీ కేమిష్ట • మడుగు మనినఁ
గరిగిరివరదుని • చరణారవిందముల్, గనుఁగొన వేడుక • గలదు మాకు
నన్న మాతోడ ర • మ్మన్న లక్ష్మణముని, యరుణోదయపువేళ • నప్పురాణ

తే. దంపతులతోడ నేతెంచి • ధన్యజనుల, కాటప ట్టైనకాంచిని • నమరఁ గాంచి
యిప్పురం బెద్ది యని మది•నెంచె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. కాంచీపురం బిది • కరిగిరి యదె యిందుఁ, బుణ్యకోటి విమాన • భూరి శిఖర
తతి యది యని చూపి•తఱుచుకాఱడవుల, దాఁటి వచ్చినకతఁ • దనరె శ్రమము
దగఁ గొన్న యీ వృద్ధ•దంపతులకు శుద్ధ•జలము దెచ్చిమ్మి యీ•సరసి కేఁగి
యనుచు నా దంపతు • లన లక్ష్మణార్యుండు, శాలక్కిణరునుండి • జలముఁదెచ్చి

తే. వారి నచ్చటఁ గానక • వగచి పిలిచి,నంతఁ దెలతెలవాఱిన • నన్ని తెలిసి
వారిఁ దలఁచుచు నింటికి • వచ్చెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. తల్లిని గని మ్రొక్కి•తన గతాగతసర్వ, వృత్తాంత మెఱిఁగింప • విని జననియు
వరదుఁడు దేవితో • వనచరద్వంద్వమై, కనిపించియానిన్నుఁ • గాంచిఁ జేర్చి

పానీయ మర్థించె • భక్తితో నీవును, శాలక్కి-ణరునుండి • జలకలశముఁ
దెచ్చి సమర్పింపు • దినదిన మనినను, జననివియోగంబు • సల్పుచుండె

తే. లక్ష్మణార్యుండు లోకవి•లక్షణాత్మ, కలితశుభహరిదివ్య వి•గ్రహము గనుక
సర్వలోకైకగురుఁ డిది • సత్య మనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. యామునగురుఁ డిల•యాళ్వారిఁ గన్గొనఁ, జాల నిరీక్షించి • శాంతిఁ బొందె
నంత లక్ష్మణముని • యతిరయంబున వచ్చి, రంగస్థలోద్యాన • రంగమందు
యామునచరమది • వ్యాకృతిఁ గనుఁగొని, వలగొని యార్తితో • వగచి ప్రణతు
లాచరించుచుఁ దత్క- • రాకుంచితాంగుళీ, త్రితయంబుఁజూచిసం • దియముఁజెంది

తే. యిమ్మహాత్ముని కీకొఱం • తేమి యనిన, నచటివారిది తెలియ లే • మనిన లక్ష్మ
ణార్యుఁ డందఱు విన నిట్టు•లనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. బ్రహ్మసూత్రములకు • భాష్యంబు రచియించి, దెసలఁ జాటించెద • ధీరు లలర
వ్యాసపరాశర • వరనామధేయులఁ, జేసెద నికువుర • సిరులు మెఱయఁ
గురుకాపురీశుని • తిరునామ మొక్క-రి, కొనరించి పిలిపింతు • నూర్జితముగ
ననుచు లక్ష్మణముని • యానతి యిచ్చిన, యొక్కొ-కవార్త కొ•క్కొ-క్క-వ్రేలు

తే. సాఁచి యెప్పటియ ట్లుండ • సకలజనులు, కనిరి యామునచరమవి•గ్రహముచటన
టనుచుఁ బెద్దలు చెప్పఁగా • వినుదుమనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఆళవందారితో • నఱగడె యైన సం•భాషింపఁ గలిగినఁ • బః మనిలయ
పర్యంతసోపాన•పంక్తిఁ దీర్పెంతును, రంగేశుఁ డీపేద్ద- • భంగపఱచె
నాచార్యరహిత మౌ • హరిమందిరం బైనఁ, గంఠీరవాక్రాంత • గహ్వరంబు
గావున నిప్పు౹డీ•కస్తూరిరంగని, సేవింప నొల్ల దీ•చిత్త మనుచు

తే. లక్ష్మణార్యుండు కల్యాణ•లక్షణుండు, మఱలికాంచీపురముఁజెంది • వరదునంఘ్రి
పద్మసేవధిఁ గాంచెను • భక్తిననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. తిరుమానపుసేవఁ • దీర్చినపిమ్మటఁ, దిరుచుట్టుమాలెలో • దేవితోడఁ
గరిగిరివరదుఁడు • ఘనరాజసం బొప్పఁ, బ్రక్రమంబులు మూఁడు • పఱపుమండఁ
దిరుకచ్చినంబి చా•మరసేవ సేయుచు, నకనితోఁ దగుముచ్చ•టాడు ననుచు
విని యమ్మహాత్మునిఁ • గని లక్ష్మణార్యుండు, భక్తి నగ్గురునితోఁ • బలికె నిట్లు

**తే.** దలఁచియుండితిఁ గొన్నియ॰ర్థములు మదిని, వాని ప్రత్యుత్తరములెల్ల॰వరదునడిగి
తెలిసి మా కానతిమ్మని ॰ పలికెననుచు, వాదిభీకరగురుఁ డనె ॰ మోద మలర.

**సీ.** పరతత్త్వమే న ట్లుఁ॰పాయంబు న్యాసంబు. దర్శనమట్లు భే॰దంబు నిజము
ఆమహాపూర్ణుఁడే ॰ యాశ్రయణీయుండు, దేహాంతమందు నీ ॰ దేహాలకును
మోక్ష మంత్యస్మృతి ॰ మోక్షణం బీయాలు, ప్రత్యుత్తరములు నీ॰ప్రశ్నములకు
హస్తిగిరీశుఁ డి ॰ ట్లానతిచ్చెను గాన, నీ కెఱిఁగించితి ॰ నిజముగా న

**తే.** టనుచుఁ దిరుకచ్చినంబి రా॰మానుజార్య,వర్యున కెఱుంగఁబలికిన ॰ వార్త లన్ని
తెలిసి యున్నమహాత్ములఁ ॰ దలఁతు ననుచు, వాదిభీకరగురుఁ డనె॰మోదమలర.

**సీ.** కలలోనఁ గన్పడు॰కరిగిరీశునియాజ్ఞ, నెదురేఁగుదెంచు ని॰జేష్టగురుని
నెదు రేఁగుదెంచు శు॰భేష్టతీర్థముఖంగి, మధురాంతకతటాక॰మహితసేతు
బంధంబుపైఁ గాంచి ॰ ప్రక్రమ మొనరించి, చాఁగిలిమ్రొక్కి ల॰క్ష్మణగురుండు
శిష్యునిఁ గా వీనిఁ ॰ జేకొను మనిన న,ప్పెరియనంబియుఁ గడుఁ॰బ్రీతిఁ జెంది

**తే.** జాగు దగ దని లక్ష్మణా॰చార్యులకును, బంచసంస్కారములు నర్థ॰పంచకాది
పరమహితములఁ గృపచేసి॰పనిచెననుచు, వాదిభీకరగురుఁ డనె॰మోదమలర.

**సీ.** ఒక పుట్టుమూఁగబాలకుఁ డష్టవార్షికుఁ, డగపడకయుఁ గాంచి ॰ నద్ది యొకటి
గడచినపిదపఁ గ॰న్పడి యెల్లవారికిఁ బల్కెను జవి గుల్క॰పల్కు లిట్లు
క్షీరాబ్ధినాథుని ॰ సేవించితిని బోయి, యతనితో శేషుఁ డి॰ట్లనఁగ వింటి
నవనిఁ బుట్టుకఁ జెంది,యఖిలాత్మలను దీర్చి, నీపనుల నొనర్తు॰నిక్క మనుచు

**తే.** శేషుఁ డీయిలయాళ్వారి॰వేష మంది, యఖిలచేతనులను బ్రోవ ॰ నవతరించె
ననుచు నబ్బాలుఁ డనిస్వేచ్ఛ॰నరిగెననుచు, వాదిభీకరగురుఁ డనె ॰ మోదమలర.

**సీ.** మఱియొకనాఁడు ల॰క్ష్మణముని తనకుఁ దై, లాభ్యంజన మొనర్ప॰నర్హుఁడైన
యొకబ్రహ్మచారి నిం॰టికిఁ బిలిపించిన, నతఁడు క్షుధార్తుఁడై॰ యన్న మడుగఁ
దనదేవిఁ బిలిచి యా॰తని కన్న మిడు మన్న, నద్దేవి లే దన్న॰మనుచుఁ బలికి
జలసంగ్రహార్థంబు ॰ చనినంతఁ బర్యుషి,తాన్న మున్నదిచూచి॰యవ్వటునకుఁ

**తే.** జాలినంతన్నమొసఁగిల॰క్ష్మణగురుండు, కలుషములకెల్లఁ గొంతలా॰కరములనుచు
దెలిసి యద్దేవి విడనాడఁ ॰ దలఁచెననుచు, వాదిభీకరగురుఁ డనె ॰ మోదమలర.

**సీ.** సదనంబులో నిజ॰సతిఁ గాంచి లక్ష్మణా,చార్యుండు పలికె నా॰సాధ్వి కిట్లు
వెదకి తప్పులు మూఁడు ॰ విడిచెదనిన్నని, మునుపుచెప్పితిని నా॰మూఁడు వినుమి

యాచార్యపత్ని ఘ•టాంబులవంబులు, గాలిచేఁ జెదరి నీ•ఘటముఁ జెంద
నలిగి నీవు దురు క్తు • లన రాని వన్నియుఁ, బలికిన నాసాధ్వి • పతికిఁ దెల్ప
తే. నమ్మహాత్ముండు నీదుర్న•యంబుకతన, దేవితోఁ గూడి మఱిమొక•దేశమొందెఁ
ద ప్పిదొక్కటి నీ కని • చెప్పె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. మఱియుఁ గాంచీపూర్ణ•మాన్యుని సాపడఁ, జెప్పిన వేగ వి•చ్చేయ కున్న
నమ్మహాత్ముఁడు వచ్చు•నప్పుడె యతనికి, సాపడఁ బెట్టుమీ • జాగు మాని
యని యొకత్రోవ నే•నాతనిఁ బిల్వ బో,యినను వేఱొకత్రోవ • నిచటఁ జేరి
యాతఁడు సాపడి • యరుగఁ దదుచ్ఛిష్ట,భాజనం బొకచోటఁ ( బరిహరించి
తే. నాయభీష్టముఁ దెలియక•నయముఁ దొలఁగి, కట్టుపుట్టముతో మున్గు•కతననీకుఁ
దప్పు రెండవ దిది యని • చెప్పెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అభ్యంజనము సల్ప • నాహూతుఁడైన యీ•బ్రహ్మచారికి క్షుధా•బాధితునకుఁ
బర్యుషితాన్నంబు • బహుళంబుగా నుండఁ, బెట్టెఁడన్నము నీవు • పెట్ట లేక
లేద యంటివి గన్క • లేమ మూఁడవ దిది, తప్పు నీ కాయెను • దగినయట్టు
లర్థ మిచ్చెద నీకు • యావదాయుష్యము, పుట్టింట నుండుమీ • పొలుపుఁజెంది
తే. యనుచుఁ బనిచెను బుట్టింటి•కాత్మసతిని, లక్ష్మణార్యుండు సర్వాత్మ•రక్షకుండు
విహితవిషయము నీరీతి • విడిచె ననుచు వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. సర్వజ్ఞుఁడైన ల•క్ష్మణముని సర్వదో,షోల్బణ సంసార • ముడిగి యరిగి
దేవదేవునిఁ బెరుం•దేవి తాయారుతో, గరిగిరి నెలకొన్న • వరదుఁ గాంచి
తద్దత్తదివ్య త్రి•దండకాషాయ వ,స్త్రములు ధరించి శా•స్త్రక్రమంబు
సల్పి సర్వం మయా • సన్న్యస్త మని పల్కి, యావరదుని చర•ణాబ్జములకు
తే. భక్తిఁ బ్రణమిల్లి యితరవి•రక్తిఁ జెంది, సర్వదేశదశాకాల • సర్వశేష
తార్హకృత్యము లొనరించె•నవట ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ యామునార్యునికాల • మయినపిమ్మట నిట, దర్శనస్థాపన • దక్షుఁ డెవఁడు
కలుగును మన కని • కలదేశికేంద్రులు, రంగమందిరసభా • రంగమందు
మంత్ర మొనర్చి ల•క్ష్మణముని మనలకు, దర్శనస్థాపన • దక్షుఁ డనుచుఁ
దెలిసి యాతనిఁ బిల్వఁ • దిరువరంగ ప్పెరు,మాళరయరు చని • మధురదివ్య
తే. గీతమున వరదరాజును • బ్రీతుఁ జేసి, యతని నర్థించి తెచ్చెను • యతినృపతిఁ
ననుచుఁ బంచిరి తిరువరం•గార్యననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. తిరువరంగగురుండు • దేశికప్రార్థనఁ, గాంచీపురముఁ జెంది • కరిగిరీశు
ఘనలతావేష్టిత • కల్పతరూపము, దేవీసమాశ్లిష్ట • దివ్యదేహు
వరదునిఁ గని మ్రొక్కి • వరనృత్తగీతవా,ద్యములమెప్పింప నా•హరియు మెచ్చి
యిల్లాలిఁ దక్కనీ • వేమి వేఁడిన నిత్తు, నన నిలయాళ్వారి • నడుగ మొదట

తే. నాలిలక్ష్మణమునిఁదక్క•నడుగుమనక, యిప్పుడనృతంబుఁబల్క మా•కెట్లుచెల్లు
నని యొసంగెను లక్ష్మణ•మునుల ననుచు, వాదిభీకరగురుఁడ డనె•మోద మలర.

శా. సారాచారవిహార సూరిపరిష•త్సత్యవ్రతక్షేత్ర సం
చారా భూరిశివంకర స్వగుణవి•స్తారా శుభాకార గం
భీరారంభవచోవిజృంభణజితా•భేదాదిదుర్వార పం
సారారణ్యకుఠార దాసజనర•క్షాదీక్ష రామానుజా, 33

క. కరిగిరివరదామరతరు, పరిచరణసమేధమాన•భాసురవిద్యా
భరణా కరుణాపాంగ, స్ఫురణా శరణాగతేష్ట • పూరణకరణా 34

మాలినీవృత్తము. విమలకమలనేత్రా • విశ్రుతస్తోత్రపాత్రా
శమితకుమతివాదా • శర్మసంపూర్ణవేదా
స్తిమితసుగుణజాలా • దీప్తకాషాయచేలా
శ్రమహరనిజలీలా • సంయమిక్షోణిపాలా. 35

గద్యము. ఇది శ్రీభగవద్రామానుజ కరుణాకటాక్షకలిత కవితావైభవ పరవాది భయంకరాచార్యాభిమత వాధూలస్తంబసూత్ర కణ్వపగోత్ర పవిత్రోభయకవిమిత్ర వేఁకటకృష్ణార్యపుత్ర విబుధవైష్ణవవిధేయ కేశవనామధేయ ప్రణీతం బైన యాచార్యసూక్తి ముక్తావళి యను మహాప్రబంధంబునందు మధ్యమభాగంబున సత్యవ్రత క్షేత్రంబునకు లక్ష్మణార్యుండు విచ్చేయుటయు యాదవసూరికడఁ బూర్వ మీమాంసాధ్యయనంబు సల్పుటయు వరదునకు దిరుమంజనఘటంబు సమర్పించుటయు యామునాచార్య ప్రపత్తియు బ్రహ్మరాక్షసమోక్ష ప్రదానంబును గప్యాసపదంబునకుఁ దత్త్వార్థంబుఁ జెప్పుటయు యాదవుండు లక్ష్మణాచార్యుని వింధ్యారణ్యంబున విడిచి చనుటయు వరదుండు దేవీసమేతుండై వనచరమిథున రూపంబునం దోఁచి లక్ష్మణార్యునిఁ గాంచీపురిఁ జెందించి పానీయం బర్థించుటయు నతండు జననీనియోగంబున వరదునకుఁ దిరుమంజనకలశం బర్పించుటయును నామీఁద రంగస్థలోపవనంబున యామున చరమవిగ్రహంబు సేవించి తదీయా

కుంచితాంగుళీత్రయమోచనం బొనరించి మరలి వరదుని సాన్నిధ్యంబుఁ జెందుటయు షడ్వార్థోపపాదనంబును మహాపూర్ణార్య సమాశ్రయంబును లక్ష్మణముని శేషాంశసంభూతుండని పుట్టుమూఁగ యగు బాలకుం డుపన్యసించుటయు లక్ష్మణాచార్యుండు విహితవిషయ పరిత్యాగంబుఁ జేసి సన్న్యసించుటయు వరదుండు తిరువరంగగురునకు రామానుజార్యు నర్పించుటయు నను నిట్టి సంప్రదాయంబులు గల ద్వితీయోల్లాసము

---

శ్రీమతే రామానుజాయ నమః,



# ఆచార్యసూక్తిముక్తావళి

## మధ్యమభాగము

---

### తృతీయోల్లాసము

శ్రీమద్రంగపురీవర
ధామ గురుస్తోత్రపాత్ర ♦ ధన్యచరిత్రా
రామానుజ మునిపుంగవ
సామజ వరదాంతరంగ ♦ సచివ శుభాంగా. 1

వ. అవధరింపుము. 2

సీ. కరిగిరివరదుని ♦ కరుణ లభించిన, రామానుజార్యుని ♦ రంగపతికిఁ
దెచ్చి సమర్పించి ♦ తిరువరంగ ప్పెరు,మాళరయరు తన ♦ మనికిపట్టుఁ
జెందినమీఁదట ♦ శిష్యు లీయతిపతి, కైరి దెబ్బదినల్వు ♦ రమలమతులు
కూరేశముఖ్యులీ ♦ గురునితో రంగేశు, కైంకర్య మనుదొడ్డ ♦ కలిమిఁ జెంది

తే. దినము శ్రీరంగమందున ♦ దివ్యగోష్ఠి, సల్పుచున్నట్టి యతికుల ♦ సార్వభౌముఁ
డతలకులదైవతము మన ♦ కనిశ మనుచు, వాదిభీకరగురుఁ డనె ♦ మోద మలర.

సీ. అష్టాదశావృత్తు ♦ లాతిరుక్కోట్టియ్యూరి, నంబిగారింటికి ♦ నాయ మలరఁ
దిరిగి యతీంద్రుఁడు ♦ దేశికగురుకృప, మంత్రరాజముఁ జర♦మంబుఁ బడసి
మంత్రదౌర్లభ్య మ♦స్మద్విధాత్మల ఘోర, దురవస్థలఁ దొలంగఁ♦ద్రోయఁదలఁచి
గురునాజ్ఞ మీఱి యం♦దఱువిన మంత్రముఁ,జాట నాలించి యా♦చార్యపురుష

తే. లయిరి డెబ్బదినాల్గు సిం♦హాసనాధి,పతులు మంత్రప్రవర్తన♦పరులు వారె
యనుచుఁ బెద్దలు చెప్పఁగా♦వినుదుమనుచు, వాదిభీకరగురుఁ డనె ♦ మోద మలర.

సీ. యతిపతిఁ బిలిపించి ♦ యా తిరుక్కోట్టియ్యూరి,నంబి యి ట్లాయతి♦నాథు నడిగె
గురునాజ్ఞ మీఱిన♦కుమతి కేగతి యన్న, నరకమే యని యతి♦నాథుఁ డనియె

నతిగుహ్య మీమంత్ర • మన్యుల కెవరికిఁ, జెప్ప రా దని నీకుఁ • జెప్పినపుడె
యట్లాచరించెద • నని పోయి మంత్రముఁ, గొల్లఁబెట్టితి విది • ఘోరనరక

తే. హేతువని తెలిసి యుండియు•నేల యిట్లు, సాహసముఁ జేసితివినీవు•సత్త్వనిధివి
దెల్పు మన నది యతిపతి•దెలిపెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. సర్వజ్ఞ నీయాజ్ఞ•సలుపనికతన వీ, నికి నొక్కరునికిఁ బో•నిరయబాధ
భవదుపదిష్ట మౌ•పరమమంత్రము విన్న, వారు వారిని జెందు•వారివారు
ముక్తులై వైకుంఠ•మున సుఖించెద రిదె, తగు ననునామహా•దార్యనిధిని
నెంబెరుమానారె•యిందు రమ్మని పిల్చి, యానంబి కౌఁగిట•నప్పళించి

తే. సద్గురుండవె నీవె పో•జనుల కెల్ల, మాకొఱంతలు దీఱె నీ•మహిమకతన
ననుచుఁబల్కెను యతిపతి•కప్పు డనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. అనంబిగురుకృప•యతిపతి యెంబెరు, మానారుసంజ్ఞని•మ్మహి లభించి
తిరిగి రంగేశుని•పురిఁ జెంది యతనికిఁ, గొన్నికైంకర్యముల్•కుదురుపఱచి
శ్రీశైలపూర్ణుల•సేవింప మది నెంచి, శ్రీపురిఁ జెంది వ•సించె నంత
శేషస్వరూపమై•శేషాద్రి గనిపింప, నిది ద్రొక్క నడవరా•దెవరికైన

తే. ననుచు లక్ష్మణముని దల్చి•యచటినుండి, నంతఁ దిరుమలనంబిగా•రది యెఱింగి
మెచ్చి యతిపతిఁగనుఁగొన•వచ్చె ననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. గరిమతో వచ్చిన•తిరుమలనంబిని, గని ప్రదక్షిణము దీ•ర్ఘప్రణామ
మాచరించిన లక్ష్మ•ణాచార్యుఁ గరుణించి, శ్రీరంగవాసుల•సేమ మడిగి
వచ్చినపనిఁ జెప్పు•వలె నన్నుఁ దిరుమల, నంబితో రామాయ•ణంబుఁ జదువ
నరుగుదెంచితి నని•యతిపతి పల్క నా, నంబి నీయిష్టం బొ•నర్తు ననుచుఁ

తే. బలికి వెడలెను వేంకట•భర్తకడకు, మరలి లక్ష్మణముని తన•మనికిపట్టుఁ
జెందెననియస్మదార్యులు•చెప్పి రనుచు, వాదిభీకరగురుఁడనె•మోద మలర.

సీ. తిరుమలనంబిగా•రరుణోదయపువేళ, స్వామిపుష్కరిణిలో•జలక మార్చి
యాకాశగంగామృ•తాపూర్ణకలశము, నంజనాద్రీశుతి•రుమంజనార్థ
మర్పించి తత్ప్రభా•తార్చన మొనరించి, వచ్చి వృషాద్రియు•పత్యకోర్వి
నొక్కతింత్రిణిక్రింద•నుండుసద్గురునకుఁ, దనర రామాయణా•ర్థము వచించి

తే. తిరిగి వచ్చుచు నుండె న•ద్గురువరుండు, నట్లు వత్సరమునకు రా•మాయణార్థ
మంత దెలిపెను యతిపతి•కచటననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. శేషాద్రివాసులు•శేషమూర్తిని యతి, పతిఁ గని వినతులై •పలికి రిట్లు
రంగదాసుఁడుముందు•రచియించి మాల్యము, లీవేంకటేశుని•కియ్యఁగోరి
వచ్చువేళ నను ర్త్య•వనిత లవస్త్రలై, జలములఁ గ్రీడలు•సలుపఁ జూచి
స్ఖలనముఁ జెంది లఁ•జ్జాసక్తచిత్తుఁడై, వని సచేలావగా•హన మొనర్చి

తే. మరల రచియించి పుష్పదా•మములఁదెచ్చి, వేంకటేశుని కర్పించి•విమలభక్తి
పారవశ్యము గనె నని•పల్కి యనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. ఆరంగదాసుని•కంజనాద్రీశుఁ డి, ట్లనె నీవు సుఖకాంక్షి•వైనకతన
భువిఁ జక్రవర్తివై •పుట్టి సుఖింపుమి, నిన్నుఁ బ్రోచెద శత్రు•నికృతివలన
నని పల్కె నాతండు•చని తొండమాఁ చక్ర, వర్తియైపుట్టెను•వసుధ నంత
బలవద్విరోధులు•పల్వు రొకప్పుడు, బాధింప నాచక్ర•వర్తి వచ్చి

తే. వేంకటేశునిఁగని మ్రొక్కి•వినుతి సల్ప, శంఖచక్రములిచ్చెనా•శార్ఙ్గినృపతి
కనుచుఁ బల్కిరి యతిపతి•కార్య లనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. నాఁటనుండి వృషాద్రి•నాథుఁడు భక్తవా, త్సల్యముఁ గనిపింప•శంఖచక్ర
ముల మరలఁ గరాబ్జ•ముల ధరింపనికత, నురమున సిరి దొల్గి•యుండుకతన
వేంకటాద్రీశుని•వీరభద్రుం డని, శైవు లర్చింతురు•సతత మిచట
వారిని వారింప•వలె నని పల్కిన, యతిపతి వారి ని•ట్లడిగె మరల.

తే. వేంకటేశుని సిరికొమ్మ•విడువ నేమి, హేతు వని పల్కె యతిపతి•కిట్లు వారు
చిరకథాంతర మొక్కటి•చెప్పి రనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. మునులపంపున భృగు•ముని వచ్చికటివేల్పు, నురముఁదన్నిననాఁడు•సిరిదొలంగి
పురుషోత్తముం డని•పొందితి నీతని, నీహైన్య మేమి నే•నెఱుఁగనైతి
నని కనిపింపక•యరిగిన హరియును, జయ్యన నీపద్మ•సరసికడను
దప మొనరించెను•దైవమానంబునఁ, బదివేలయబ్దముల్•పరమనియతి

తే. నంత నీపద్మసరసి నొ•కబ్జమందు, లక్ష్మి గనిపించె శ్రీవత్స•లాంఛితునకు
పనుచుఁబలికిరి యతిపతి•కార్యులనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. విప్రాంఘ్రిహతిఁ బోలె•వెలసినశ్రీవత్స, చిహ్న మిప్పటికిని•జెంది యుండె
నైన నీతనిసక•లావయవౌజ్జ్వల్య, సౌందర్య సౌగంధ్య•సౌకుమార్య

నిత్యయౌవనముఖ్య•నిర్మలాసంఖ్యేయ, కల్యాణగుణముల•కలిమిఁజేసి
యాచిన్నె వన్నెగా•నగపడెఁ గనుక నే, నితనిఁ జెందెద ననీ•నిశ్చయించి

తే. మగనికౌఁగిటనలమేలు•మంగ చెంది, పలికెనిట్లని భర్తకుఁ•బ్రణయ మలర
ననుచుఁ బలికిరి యతిపతి•కార్యుఁ నుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. ఈశ్రీశుకాశ్రమ•మీపద్మపాసార, మీస్వర్ణముఖరి ని ట్లీవనాళి
విడువలే నది గాన•వినుము నీతోఁగూడి, యెప్పొద్దు విహరింతు•నిచట ననిన
నందు కొడంబడి•యలమేలుమంగతో, నతఁడు సుఖించుచు•నచటనుండి
వేఁటకాఁడై వచ్చి•విహరించి యలసి యీ, యజ్ఞవరాహుని•యండ నుండెఁ

తే. గాన యతనికి సిరి యెట్లు•గలుగనేర్చు, నీవు దలఁచిన నవియన్ని•నెగ్గు ననిన
సమ్మతించెనుయతికుల•స్వామి యనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. యతిపతి తిరుమల•కరిగి యాశ్రీశుని, పనులయడ్డంకులఁ•బాపఁ దలఁచి
ముదమొప్ప మెత్తలు•పొదిగినమోఁకాళ్ళ, నడచియాట్రములఁ•గడచి యెక్కి
వినుతతరుచ్ఛాయ•విశ్రమించినయెడ, నొక బ్రహ్మచారిబా•లకుఁడు వచ్చి
సహకారఫలశీత•జలముల నర్పింప, నెవరిశిష్యుఁడవు ని•న్నెఱుఁగఁ బలుకు

తే. మన్న మద్దేశికుం డనం•తార్యుఁడతని, తనయ యిది యని చెప్పినఁ•దథ్యమనుచు
జలఫలంబులు గొనియె నా•సక్తి ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. తిరుమలనంబియుఁ•దీర్థప్రసాదముల్, దెచ్చి యతీంద్రుని•కిచ్చె నంత
నచ్చట బాలకుం•డగపడఁడాయెనా, యీప్రసాదంబు మా•కిచటి కనుప
నని పల్కుయతిపతి•కగ్గురుఁ డి ట్లనె, వీథులు నాలుగు•వెదకి చూడ
నాకన్నబాలుఁడు•లేకపోయినకత, నీప్రసాదంబు నీ•కిచటి కేను

తే. దెచ్చితిని దీనిఁగై కొమ్ము•దేశికేంద్ర, యనిన యతిపతి యదికొని•యారగింప
శేష మాశ్రితు లెల్లభు•జించి రనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. శేషాద్రిపతియాజ్ఞఁజెంది కాల్నడ నేఁగె, నవటినుండి యతీంద్రుఁ•డతనికడకు
నాయతీశ్వరునిచే•ననుభూతసార మౌ, ఫల మొకవృక్షమై•పరిఢవిల్లె
గురుభుక్తశేషంబుఁ•గొన వలెనని పండు, టాకులు గొనిపోదు•రార్యు లచట
నర్చావతార మై•యచట యతీశ్వరుఁ, డెల్లవారికిఁ దోఁచు•నిప్పటికిని

తే. నంత యతిపతి చనియంజ•నాద్రినాథుఁ, గాంచివలగొని మ్రొక్కినుతించిమించి
యచటిశైవుల నిట్లని•యడిగె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. శైవులు మీర లం•స్మత్స్వామి నీవేంక, టేశుని బూజింప•హేతు వేమి
యనిన నాశివభక్తు•లాత్మీయదైవత, మితఁ డని యర్చింతు•మిచట ననిన
శివవిష్ణుచిహ్నముల్•చేయించి యిరువుర, మీరాత్రి యుంచెద•మితనియెదుటఁ
దలుపుఁగడియలఁ•దగిలించి బైటను, బీగముద్రలు సల్పి•బింక మలర

తే. నాయుధంబులుచేకొని•యాప్రభాత, మొకరిపైనొండ్లుకావలి•యుందమిచట
నని యతీంద్రుఁడు మఱియుని•ట్లనియెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. అరుణోదయపువేళ•నర్హక్రియలుదీర్చి, మనముద్ర లన్నియు•మరలఁ జూచి
తలుపులఁ దెఱచి లో•పలి కేఁగి చూచిన, గరముల శంఖచ•క్రము లితనికి
నుండెనా హరి గన్కఁ•జెండించెదను మిమ్ముఁ, గాళహస్తీశుని•గడపదనుకఁ
గాక శివాంకముల్•గరములఁ దాల్చెనా, శివుఁ డని మమ్మట్లు•సేయఁదగును

తే. జంద్రగిరిదన్క నని యతి•చక్రవర్తి, శపథ మీరీతి సల్పెను•శైవతతికి
సమ్మతించిరి యది విని•శైవు లనుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర.

సీ. వేంకటేశునియగ్ర•వేదికపై శంఖ, చక్రము లుంచె ల•క్ష్మణగురుండు
సుందరడమరుత్రి•శూలము లచటనే, యుంచిరి శైవు లం•ట్లంచితముగ
దేవాదిదేవుఁ డా•దివ్యాయుధములలో, శంఖచక్రముల భు•జంబులందు
నుంచినయట్లు ధ•రించె మరల్పక, భక్తవాత్సల్యము•బయలుపఱప

తే. నంత మఱునాఁటిప్రొద్దున•నతని హరిని, శంఖచక్రసమంచితా•జానుబాహుఁ
గాంచి వైష్ణవు లెల్ల సు•ఖించి రనుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర.

సీ. యతిపురందరుఁ డంత•నాత్మీయదాసుల, నానావిధాయుధ•నైపుణులను
నత్యంతశూరుల•నతివిధేయులఁ బిల్చి, పూర్వోక్తసమయంబు•పూర్తిఁజెంద
శైవౌఘములఁ ద్రుంపఁ•జనుఁ డని పనిచిన, వా ర ట్లొనర్చిరి•వసుధ మెచ్చ
నంత లక్ష్మీరూప•కాంత మా బంగారు, పతకమందునఁ దన•ప్రార్థనలను

తే. గాంచియలమేలుమంగవ•సించెనదియు, వేంకటేశునియురమందుఁ•బొంకమమర
నుంచి యతిరాజు మించి సు•ఖించె ననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. శంఖచక్రంబు లా•శార్ఙ్గి కిచ్చినకత, నతనికి గురు వయ్యె•యతివరుండు
అలమేలుమంగ నా•హరి కిచ్చి యతనికి, మామగా రయ్యె ల•క్ష్మణగురుండు
నది గాననే కదా•యంజనాద్రీశునిం, టికిఁ బెద్దతన మీతఁ•డే వహించెఁ
బదుగురుసూరుల•పద మీతఁడే కాన, వేంకటేశునియింట•వెలసె నొకఁడె

తే. యితనిసుత గాననే కదా•యింటిసవతి, పోరు లలమేలుమంగను•బొందవాయె
నితనిమహిమములనునెవఁ•డెఱుఁగుననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. తిరుమల డిగి యతి•దేవుఁడు తిరుపతి, వైకుంఠనాధుదే•వళము పాడు
పడి యున్నదే మని•యడిగిన నాతఁడు, బడబాగ్నిఁబోలెఁ బె•న్గడుపు గల్గ
స్వామి యొకతనఁ బ్ర•సాదాదు లీతని, కర్పింపఁ జాల రై•రఖిలజనులు
అది గాన పా డాయె•నని చెప్పి రచ్చటి, వైష్ణవు లాయతి•వర్యునకును

తే. నంత యతిపతి తిరుమల•యందు సౌమ్య, విష్ణువిగ్రహ మొక్కటి•వేదవిధిస
మంచితంబుగ నుంపఁద•లఁచె ననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. రాయవేలూరికి•రాజైనమ్లేచ్ఛుండు, తిల్లగోవిందునిఁ•దెచ్చి కోట
వాకిటిపరిఖకు•వంతెనఱాయి గాఁ, ద్రిప్పి కీల్కొలిపినఁ•దెలిసి యంత
సకలకళాశాస్త్ర•సరసురా లొకపణ్య, లావణ్యవతి వచ్చి•లక్ష్మణార్య
సంబంధవతి గాన•సరసకళాప్రజ్ఞ, నామ్లేచ్ఛు మెప్పించి•యతఁ డొసంగ

తే. రత్నధనతిల్లగోవింద•రాజదివ్య, విగ్రహము లాత్మగురునకి•వేగ తెచ్చి
యిచ్చెఁ గృతకృత్యురాలిదె•యెంచననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. అంత యతీశ్వరుం•డాతిల్లగోవింద, రాజప్రతిష్ఠకు•రంగు మీఱ
వైకుంఠనాధుని•వామభాగంబునఁ, గోవెలవెడలుపు•కుదురుపఱిచి
యం దంతరాళము•నందు గర్భగృహంబు, తిరుచుట్టుమాలెయుఁ•దీర్చిమొగిని
నాస్థానమండప•మతివిశాల మొనర్చి, కనకతార్క్ష్యగృహంబు•గడపయందుఁ

తే. దప్తకాంచనగారుడ•స్తంభ మెదుట, సర్వమణిమయబలిపీఠ•సంగతముగ
భక్తిఁ గట్టించి మఱియు నే•ర్పఱచెననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. ఆగ్నేయభాగమం•దాముక్తమాలికా, భవనంబుఁ దిరుమట్ట•పల్లి యచట
బంగారుతలుపుల•బావి యాదవ్వలఁ, బదుగురాళ్వారుల•భవన మచటఁ
గల్యాణమణిమయ•కల్యాణమండప, మావెంట రత్నభాం•డాలయములు
యానోపకరణమా•ల్యాకల్పగృహములు, పల్లవమండప•ప్రభృతు లన్ని

తే. మణిమయద్వారగోపుర•మహితమైన, సాలయుగళంబు యతికుల•చక్రవర్తి
యిట్లొనర్చియుఁ దృప్తివ•హింపఁ డనుచుఁ, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

M—12

సీ. అద్వితీయావృత్తి•యామ్యభాగంబున, మహితవిష్వక్సేన•మందిరంబు
సిరి కాటప స్టైన•గురుధనభవనము, ల ట్లుదీచిని జాలఁ • జెట్లు కొన్ని
దౌవారికోచిత•ద్వారవేదికలును, మణిమయవాహన•మంటపములు
శతసహస్రస్తంభ•శాలిబహిస్సభా, మండపాందోళికా•మంటపములు

తే. సలిలయంత్రము లారీతి•సకలరత్న, కులసువర్ణ బహిర్ద్వార•గోపురములు
తీర్చి కట్టించె సంయమి•దేవుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. రాజవీధులు నాల్గు•రంగుగాఁ దీర్పించి, సన్నిధివీధులు•చక్కఁజేసి
మందిరాంతర్గృహ•మండపగోపుర, ద్వారశాఖలరత్న•తోరణములఁ
దపనీయకదళికా•స్తంభగుంభితచూత, నీలోత్పలాంభోజ•మాలికలను
బుష్పమౌక్తికములఁ•బొలుపొందుమ్రుగ్గులు, బంగారుముఖమంట•పంబుమెఱయ

తే. లక్ష్మణార్యుండు గుడి యి ట్ల•లంకరించి, తిల్లగోవిందరాజును•దెచ్చి యందుఁ
జేర్చె నని దేశికేంద్రులు•చెప్పి రనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. మొదటఁ గూటాగార•ముల సర్వధాన్యముల్, పూరించి ఘృతతైల•పూర్ణకూప
ముల గుడశర్కరా•ముఖ్యరసద్రవ్య, ములు కొన్నిగృహముల•బొలి యొనర్చి
యొకశుభదివసము•హూర్తమం దాతిల్ల, గోవిందశౌరి కం•కురశరావ
ములు నిల్పి ప్రోక్షణ•ములు నధివాసముల్, వేదచోదితములు•విశదపఱిచి

తే. హాటకాంచితరత్నసిం•హాసనమున, నుంచి ప్రాణప్రతిష్ఠఁ గా•వించి మించె
యతిశిఖామణి మనదైవ•మితఁడె యనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. స్థిరపంచబేరప్ర•తిష్ఠఁ గావించి యా, సూరులఁ బదుగుర•శూడికొడుతఁ
దత్తద్గృహంబులఁ•దగునట్లు నెలకొల్పి, తిల్లగోవిందుని•కిల్లు నిలిపి
శ్రీభూమినీళాది•సీమంతినీరత్న, ములపెండ్లి సేసెను•మునులు మెచ్చ
సకలోత్సవంబులు•సర్వకైంకర్యము, లొనరింప నుంచె స•ముచితజనుల

తే. నల్లవైకుంఠపతితేజ•మెల్లఁ దెచ్చి, తిల్లగోవిందరాజుల•దెసను నిల్పె
సర్వశక్తుండు యతిపతి•సత్య మనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. గోవిందమిశ్రుఁడు•కొన్నిదినంబులు, శైవుఁ డై యుండి యా•శౌరికృపను
శ్రీశైలపూర్ణుల•శిష్యుఁడై వారింటఁ, బసులఁ జేయుచు నొక•వాసరమునఁ

దిరునందవనమందుఁ దిరుమాలెఁ జేర్చుచుఁ, దనకను మొగిఁ దోఁచు దారుణాహి
నాలికనెడ ముల్లు నాటినఁ గనుఁగొని, కటకటా యని దాని కడకుఁ బోయి

తే. ముల్లు దీసిన నాచిల్వ ముదముఁ జెంది, వచ్చిన ట్లేఁగె నెంబారు బావి మునిఁగి
వచ్చినను జూచి యతిపతి మెచ్చెననుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

సీ. ఈసచేలస్నాన మే మని యడిగిన, మైల దొల్గుట కని మరలి పల్కు
నాసర్వభూతసౌ హార్ద మహంకృతి, రాహిత్య మాయతి రాజు చూచి
శ్రీశైలపూర్ణులఁ జెంది యాచించి యా, గోవిందమిశ్రులఁ గొని వృషాద్రి
శ్రీపురి నున్న దేశికులను వీడ్కొల్పి, శ్రీరంగధామముఁ జెంది యచట

తే. మంగళాశాసనముఁ జేసి రంగపతికి, సకలకైంకర్యముల వేడ్క జరపు చుండ
స్థిరచరంబులు సిరుల భజించె ననుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

సీ. తనగురు నెడఁబాసి తప్తుఁ డై యె బారు, పాండుపత్త్రిముఖభంగిఁ బాలినంతఁ
గనుఁగొని లక్ష్మణ ముని యమ్మహాత్ముఁ ద, ద్గురుఁ డున్నచోటికిఁ గోరి యనుప
నతఁ డేఁగి స్వగురుని యంఘ్రులు గని మ్రొక్కఁ, గని కననట్లుండె ఘనుఁ డతండు
గురుపత్ని పతితోడ గోవిందుఁ డి ట్లుండఁ, దగునె సాపడఁ బిల్వఁ దగఁ డెమనకు

తే. ననినఁ దిరుమలనంబియు నాత్మసతికి, మేఁతఁ బెట్టంగఁ దగునె వి క్రీతపశువు
కనిన విని దేవి యేమన దాయె ననుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

సీ. తిరుమలనంబి యా తీరునఁ బల్కిన, మరలి వచ్చి యతీంద్రు మఱుఁగుఁ జొచ్చె
నతనికి సకలదా స్యములను సల్పుచు, సుఖపడుగోవింద సూరివరుని
శోభనకల్యాణ వైభవం బొనరింపఁ, బిలిచిన మామతోఁ బలుక కున్న
నాశ్వశురుఁడు సంయమీశ్వరుఁ బ్రార్థింప, యతిపతి గోవింద కృతిని బిలిచి

తే. యత్తవారింటి కీ వేఁగి యచటఁ గొన్ని, దినము లేకాంతమందు నీ దేవితోడఁ
గలసి సుఖపడి రమ్మని పలికెననుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

సీ. యతిపతియాజ్ఞ మహాప్రసాదం బని, శిరమునఁ దాల్చి వి చ్చేసి యత్త
వారింటిలోన నెంబా రగ్నిసంధాన, ఫలదానముఖములఁ బఱపి రాత్రి
యంతర్గృహంబున కనిపిన దేవిని, దాంబూలసుమగంధ తల్పములను
దఁ(పక నిలుచున్నఁ దద్దేవియును దెల్ల, వాఱినదనుక నా వరుస విలిచె

తే. మూఁడుదినములుగడపి ట్లు మోహముడిగి, యితనిపంబంధనిధిగల్గె నింతె మాకుఁ
జాలు నని పల్కె నాసతి జనని కనుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

సీ. ఎంబారుమామగా•రెంబెరుమానారు, కల్లునిసడవడి•యానతీయ
నమ్మహాత్మునిఁ బిల్చి•యతిపతి యడిగిన, సర్వదశాదేశ•సమయములను
నీ దివ్యమంగళ•నిర్మలరూపముఁ, గనుఁగొనువీనికిఁ•గలదె మఱుఁగు
మఱుఁగు లేకున్నను•మందుని కైనను, విషయభోగము లెట్లు•విఱ్ఱవీఁగు
తే. ననిన విని లక్ష్మణార్యుండు•హర్ష మొంది, యిట్టియధికారి కీవేష•మేల యనిన
విడిచె నెంబారు గృహపతి•వేష మనుచు, వాదిభీకరగురు డనె•మోదమలర

సీ. రామానుజార్యుల•రాజితకరుణచే, శాస్త్రసమ్మతముగ•సన్న్యసించి
గోవిందమిశ్రులు•గురునామమందున, నాద్యంతపదముల•నమరినట్టి
యెంబారనెడునామ•మింపుగాధరియించి, స్వగురుపదాంబుజ•చ్ఛాయ యయ్యెఁ
గోవెలయధికారి•గురుగర్వయుక్తుఁడై, శిష్యుఁ డయ్యెను మది•శ్రీయతీంద్రు
తే. గణన సేయనికతన రం•గశమేశు, పనులు తగ్గిన సంయమి•భర్త యతనిఁ
దనకు వశ్యునిఁ గానుంపఁ•దలఁచెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. ఆంతట నొక్కనాఁ•డాగుడియధికారి, తనయింటఁ దంద్రిశ్రా•ద్ధంబు గదియఁ
జెలు వొంద శ్రీవత్స•చిహ్నమిశ్రుల నిమం, త్రణ మొనరించినఁ•దా నెఱింగి
యతిపతి యాగుడి•యధికారి నెల్లైన, మనవళవర్తిగా•నుసుపు మనినఁ
దనగురుసూక్తిని•దలఁ దాల్చి కూరేశుఁ, డరిగి వారింటిలో•నర్చఁ జెంది
తే. తళిహపరిషేచన మొనర్చి•తనరుతీర్థ, మారగింపక యున్నంత•నభిమతంబుఁ
జెప్పు మన్నను వారికిఁ•జెప్పె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. గుడిబీగముద్రల•నడిగితి ని మ్మన్న, వడిఁ దెచ్చి పిడికిట•నిడినపిదప
నారగించి ప్రమోద•మంది కూరేశుండు, బీగముద్రిక లెల్ల•వేగ తెచ్చి
యతిపతి కర్పింప•నతఁడును శ్రీరంగ, రాజకైంకర్యసా•మ్రాజ్య మేలు
చుండె నయ్యతిపతి•యురుతరకీర్తివి, స్ఫూర్తిని విని యజ్ఞ•మూర్తి వచ్చి
తే. జగతి రంగేశవిజయధ్వ•జం బనంగ. వాపి కెక్కినలక్ష్మణ•దేశికేంద్రు
వాదభిక్షార్థమై చూచె•వయస ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. ఆరంగభూపతి•యాస్థానమంటప, మణిభూమి గురుశిఖా•మణులనడుమ
నమలనభోవీధి•విమలగ్రహర్క్షస్థ, పూర్ణచంద్రునిగతిఁ•బొలుపు మీఱ
బ్రహ్మతర్కచ్ఛటా•ప్రబలశస్త్రాస్త్రి, సమరకేళీమహో•త్సవము సల్ప
నొడ్డోలగం బున్న•యూర్జిత యతిపతి, బాలసూర్యభ్రాంతిఁ•బరమపురుషు

తే. చుట్టుఁగై దువుఁగబళింపఁ, జొచ్చురాహు, వట్లుగదిపెను బ్రతివాది, యజ్ఞమూర్తి
యిట్లు శపథ మొనర్చి రా, యిరువు రనుచు, వాదిభీకరగురుఁ డనె, మోదమలర.

సీ. అష్టాదశదినంబు, లాగమాంత ప్రసి, ద్ధబ్రహ్మతర్క శ, స్త్రములచేతఁ
గస్తూరిరంగని, కను బ్రొమోలఁ బోరంగ, నెవ్వనితర్కము, హెచ్చి యుండు
వారికి శిష్యు లా, వలివారు గావలె, నని పంత మాడి రా, మానుజార్యుఁ
డా ప్రతివాదితో, నద్వితీయబ్రహ్మ, జీవాత్మలకు భేద, సిద్ధికొఱకు

తే. బ్రహ్మతర్కో పనిషదాది, పరమజీవ, భేదసాధకసూక్తుల, వాద మొందఁ
గడచెఁ బదియాఱుదినము లీ, కరణి ననుచు, వాదిభీకరగురుఁడనె, మోదమలర.

సీ. పదియేడవదినంబు, పగట నా ప్రతివాది, తర్కప్రమాణముల్, తఱచు నుడువ
వీని ప్రత్యుక్తులు, వినిపింతు రే పని, యతిపతి మఠమున, కరిగి యచటఁ
బరమదయాళుని, బరముని వరదుని, పరభక్తి నర్చించి, భక్తియుతుల
ననుయోగ మొనరింపు, డని పంచి వరదుని, శ్రీపదాబ్జంబుల, చెంతఁ జెంది

తే. నాధ నీ వన్నసూక్తులు, నమ్మి యిట్లు, భేదవాదం బొనర్చితిఁ, బెక్కు గతుల
దీని నిర్గింపు మని సన్ను, తించె ననుచు, వాదిభీకరగురుఁ డనె, మోదమలర.

సీ. యతిపతిచే స్తవ, మంది యావరదుండు, కను బ్రొమోల నిలిచి యీ, కరణిఁ బల్కె
నీయంతశిష్యుని, నీకు సంపాదింప, నిట్లు చేసితి నిప్పు, డేమికొఱఁత
ప్రణవోధసుర్యను, ప్రబలోపనిషదుక్తి, మఱచితివో యన, మదిని దెలిసి
సంతస మంది ల, క్ష్మణగురుం డారాత్రి, గడపి ప్రభాతకైం, కర్యవిధుల

తే. జరపి శ్రీరంగభూపతి, సభకు వచ్చి, మోద మలరంగ నాయజ్ఞ, మూర్తి నందుఁ
జూచె నని యాన తిత్తురు, సూరు లనుచు, వాదిభీకరగురుఁ డనె, మోదమలర.

సీ. అమృతాంశుబింబసు, ధాసారములమాడ్కి, ముఖమున దరహాస, ములు వెలుంగఁ
గాషాయపరిధాన, కినదుత్తరీయము, లరుణోదయద్యుతి, నవహసింప
ద్వాదశస్థ ధృత, ధవళోర్ధ్వపుండ్రముల్, శ్రీచూర్ణరేఖలు, చెలువు గులుకఁ
బ్రతివాదిగర్వప, ర్వతవజ్రసారమై, కేలఁ ద్రిదండంబు, లీల మెఱయ

తే. సురముపద్మాక్షమాలిక, లుల్లసిల్ల, సభను వెలుఁగంగ యతిలోక, చక్రవర్తి
మూర్తి నీక్షించె నాయజ్ఞ, మూర్తి యనుచు, వాదిభీకరగురుఁడనె, మోదమలర.

సీ. జీవేశ్వరాభేద, చిన్మాత్రసత్యత్వ, తదితరసకలమి, థ్యాత్వములను
స్థాపించుయుక్తు ల, ద్వైతశ్రుతులు కొన్ని నిన్న మీ రనిన య, న్నింటి కిపుడు

ప్రత్యుత్తరములు గాఁ బల్కెఁద బాధక, తర్క భేదశ్రుతి తతుల ననుచు
యతిపతి పల్కిన యజ్ఞమూర్తియు నిన్ను. శేషశేషాసన శ్రీధరాన్య

**తే.** తమునిఁ గా మది నెఱిఁగితిఁ బావకాస్య, చంద్రనిర్గతదరహాస చంద్రికలను
జూచి యని పల్కె లక్ష్మణ సూరి కనుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

**సీ.** సర్వజ్ఞమౌళివి సద్గుణరాశివి, జగదేక గురుఁడ వస్మద్గురుండ
వైతి విం కాలస్య మమృతం విషమ్మను, న్యాయంబునను జాగు సేయఁదగునె
యనిన లక్ష్మణముని యాయజ్ఞమూర్తికి, సకలహితంబులు సలిపి కృపను
అరుళాళపదమట్లు పెరుమాళ్ళనెడిపద, మెంబెరుమానా ర నెడిపదమును

**తే.** మూఁడుజోడించియొకనామ మీడుపఱిచి, దాస్యనామంబొనర్చెనం దఱువినంగ
వెలసెఁ దిరునామ మతనికా కొలఁదిననుచు, వాదిభీకరగురుఁడనె మోదమలర.

**సీ.** తలఁప శిష్యస్య పుత్రస్య న కించి దం, తర మనుధర్మశా స్త్రమునఁ జేసి
యభిమతశిష్యున కాత్మజసదృశున, కితనికి మనసు మ హేష్టదైవ
తంబు మహోపక ర్తయు నగువరదుని, తిరునామ మాదిని దిర మొనర్చి
గురునామ మీతండు గోరెఁగావున నిది, యంతిమపదముగా నమరఁగూర్చి

**తే.** యేకనామంబుఁ గావించి యితని కిడిన, మనకు మనవారికందఱ కనుగుణముగఁ
బిలువఁ దగు నని యీపేరు పెట్టె ననుచు, వాదిభీకరగురుఁడనె మోదమలర

**సీ.** ఆదాస్యనామోక్తి నరుళాళముని స్వకీ, యాచార్యవందన మాచరించి
స్వగురునివేదిత సర్వస్వుఁ డై స్వార్యు, ననుమతి నొకపర మందు నుండె
నంత మేల్నాటినుం డాగంతువైష్ణవు, లిరువు రాతిరువీధి కేఁగుదెంచి
మహనీయ మెంబెరు మానారుమఠ మెద్ది, యని యడిగిన విని యచటివార

**తే.** లిరువు రెంబెరుమానారు లిచటఁగలరు, వారిలో మీరు గోరిన వారిమఠము
దెలుపఁ గల మని వారికిఁ బలికిరనుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

**సీ.** ఇపు డిలయాళువా రెంబెరుమానారు, మఠముఁ జూపింపుఁడీ మాకు మీర
లి ట్లన్న విని వార ల ట్లొనర్చినయంత, నావార్త విని వర దాఖ్యగురుఁడు
ఎంబెరుమానారు కెదురుత ట్టైతిని, నభినవార్యద్రోహి నైతి ననుచు
ననుతాప మంది దుః ఖాయత్తచిత్తుఁ డై, దీనికి విష్కృతి దెలిసె ననుచు

తే. మరము పెనుచిచ్చుపా ల్పేసి॰మచ్చ మాపి, యతిశిఖామణికడ కేఁగి॰యతనిపాద
పద్మసేవధిఁగాంచెను॰భక్తి ననుచు, వాదిభీకరగురుఁ డనె॰మోదమలర.

సీ. ఆర్తితో యతిపతి॰యడుగునెత్తమ్ములఁ, జాఁగిలఁబడి మ్రొక్కి॰జనులు గనఁగఁ
గన్నీటిధారలఁ॰గడుగుచు దుస్తర, మీగురుద్రోహాబ్ధి॰నెట్లు గడతు
నని పల్క యతిపతి॰యాశిష్యవర్యునిఁ, గరుణతో గ్రుచ్చెత్తి॰కౌఁగిలించి
నీ కేమికొఱఁత యీ॰నీవు బహిః ప్రాణ, భూతశిష్యుఁడ వని॰బుజ్జగించి

తే. యాత్మసాన్నిధ్యవర్తి గా॰నాదరింప, ఛాయపోలిక గురు నెడఁ॰బాయ కుండె
నట్టియరుళాళమునిఁ దల్తు॰ననిశ మనుచు, వాదిభీకరగురుఁడనె॰మోదమలర.

సీ. అరుళాళమునికృప॰నాన తిచ్చెను జ్ఞాన, సారమును బ్రమేయ॰సార మరసి
గురునియానతి యతి॰కులపతి కొన్నాళ్ల, లేడింట్ల భైక్ష్యన్న॰మెత్తి తెచ్చి
భుజియించి మఱియొక॰ప్రొద్దు తిరుప్పావుఁ, జదువుచు భైక్ష్యము॰సలుపువేళ
స్వగురునియింటికిఁ॰జను చుండఁగా నుందు, మదకళిత్తనుపాటఁ॰జదువఁ దొడఁగి

తే. యంచుదిరవాయియనుపద॰మందుకొనిన, నత్తుళాయమ్మతలుపుదా॰నపుడెతెఱవఁ
దలఁచె నప్పిన్న యని యతి॰తిలకుఁ డనుచు, వాదిభీకరగురుఁడనె॰మోదమలర.

సీ. గురుపుత్రికను యతి॰వరుఁడు కన్గొని రమా, రమణి నప్పిన్నపి॰రాట్టి యనుచుఁ
బరభక్తి వివశుఁ డై॰బడలికఁ బడ వచ్చి, పెరియనంబియుఁజూచి॰ప్రీతితోడ
నలయుందుమదకళి॰త్తనుపాట ప్రస్తుత, మాయెనో యని పల్క॰నంత నాత్మ
గురునింట భైక్ష్యముఁ॰గొనిపనిమరమొంది, మఱియొకనాఁడు లం॰క్ష్మణగురుండు

తే. మాధుకరవృత్తిసలుపఁగా॰వీధిజనులు, చూచియతిభక్తిసేయఁగాఁ॰జోద్యమంది
మిద్దెపైనుండి కనెనొక॰ముద్దియ యని, వాదిభీకరగురుఁ డనె॰మోదమలర.

సీ. మిద్దెపైనుండి యా॰ముద్దియ దిగి వచ్చి, మాధుకరముఁ గొని॰మరలినట్టి
యతిపతిఁ గనుఁగొని॰యాయింటిముంగిటి, వాకిటి కడ్డము॰వచ్చి నిల్వ
రామానుజార్యుం డ॰అక్షణ మూరక, నిలిచి పో ని మ్మని॰పలికె నంతఁ
గస్తూరిరంగని॰కంటె నీపైఁ బ్రేమ, మధికముగాఁ జేతు॰రఖిలజనులు

తే. మాయయో మంత్రమో మందొ॰మచ్చుపొడియొ
యేమియో హేతు విది మాకు॰నెఱుఁగఁ బల్క
మనుచు నాసాధ్వి యతిపతి॰నడిగె ననుచు
వాదిభీకరగురుఁ డనె॰మోదమలర.

సీ. ఆనంబి చెప్పిన • యతిపతి కప్పు డా,కూరమాలాధర•గురువరుండు
ద్రవిడోపనిషదర్థ • తత్త్వముఁ దెల్పిన, సంతసించుచు యతి•చక్రవర్తి
దేశికోత్తముఁడైన • తిరువరంగ ప్పెరు.మాళరయరియింట • మఱఁగియుండి
యంతిమోపాయ బో•ధార్థ మగ్గురునకు, సకలశుశ్రూషల • జరపుచుండి

తే. యతని కొకనాఁడు తల యంటి • యంగములకుఁ
గుసుమసుకుమారచూర్ణముఁ • గూర్మిఁ దెచ్చి
నలుఁగుఁ బెట్టిన నగ్గురుఁ • డలరె ననుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 64

సీ. తిరమైనశుశ్రూషఁ • దిరువరంగ ప్పెరు,మాళరయరును సం•మ్మదముఁ జెంది
నను నాదు సర్వస్వ•మును నీయధీనముఁ, గాఁ జేసికొంటివి • గనుక నీకు
నభిమత మొనరింతు,నని యంతిమోపాయ, మెఱిఁగించి ముందాయ•తీశ్వరునకు
శరకోపసూక్తులఁ•జదివించె గురుఁ డిట్టు, లేగురామ్యుల నొందు • టెంచి చూడ

తే. గురుఁ డొకండని మదినెంచఁ•గూడ దనుచుఁ, జెప్పినట్లయ్యె నదిగానఁ•దప్పుగాదు
గురువులెందఱు గలిగిన • నరులకనుచు. వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. గద్యత్రయోక్తులఁ • గస్తూరిరంగని, పాదపద్మములఁ బ్రం•పత్తి సలుప
నతఁడు ప్రసన్నుఁడై • యడిగిన దిచ్చెద, నడుగుమాయనియన్న • యతివరుండు
దయ నిమ్ము మోక్షము • ధరఁ గల్గుమావారి, వారిఁ జెందినవారి • వారికెల్ల
నని వర మడిగిన • యతిపతి కాశౌరి, తిరము గాఁ దనవిభూ•తిద్వయంబు

తే. నొసఁగ భూతిద్వయము గల్గి•యుండుకతన, యతిశిఖామణియుడయవ•రనిధరిత్రి
నొక్కచక్కనితిరునామ•మొందె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. యతివరుఁ డొక్కనాఁ • డరుణోదయపువేళఁ, గావేరియం దవ•గాహ మార్చి
కాలకృత్యంబులఁ • గావించి వచ్చుచుఁ, ద్రోవలోనొకవింత • దోఁపఁజూచె
నెట్లన్నఁబ్రొద్దున • కెదురేఁగు నొకరామ, కభిముఖుడై వెను•కడుగు లిడుచు
బాలార్కునకు నొక్క•చేల మడ్డము పట్టి, చనునొకకాముక • సార్వభౌముఁ

తే. జూచి వీఁ డతిరసికుఁడు • సుఖశరీరి, హితము వీనికిఁ దెల్ప మా • కిచ్చపుట్టె
ననుచు లక్ష్మణముని డాయఁ•జనియె ననుచు వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఇంత లంపటపడ • నేల నీ కని పల్క, యతిభర్త కాకామి • యనియె నిట్టు
లీలేమకనుదోయి • యీరవిప్రభ సోఁకి, బడలునేమో యని • భయముఁ జెంది

యి ట్లొనర్చెద నన్ను • నెచ్చట సరిలేని, సొబగుకన్నుల నీకుఁ • జూపఁ గలను
రమ్మన్న నొడఁబడి • రసికుఁ డగ్గురునితో, శ్రీరంగపతిచెంతఁ • జెంది విలువఁ

**తే.** దెలిసి యతిపతి సన్నిధి•తీర్థ మెత్తి, యతనికన్నులఁదుడిచి యీ • యహిశయాను
నక్షియుగమిది గనుఁగొను•మనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

**సీ.** భూరిగంభీరాంభ•ములఁ బొల్చి దృఢనాళ, మై బాలభాస్కరు • నంశుతతులఁ
బొరి వికసించిన•పుండరీకముఁ బోలు కస్తూరిరంగని • కన్నుదోయి
కమనీయ దివ్యమం•గళ విగ్రహంబును, దేవీవిభూషణ • దివ్యహేతు
లాయతీశానుగ్ర•హంబుచేఁ గనుఁగొని, యమ్మహాత్ముం డతి•హర్ష మొంది

**తే.** యెవనికృపచేతఁ గంటి నే•నిట్టిసుఖము, నతఁడె వీనికి సర్వస్వ•మని తలంచి
యాశ్రయించెను యతిపతి•యంఘ్రులనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర

**సీ** లక్ష్మణార్యుం డావి•లక్షణాత్ముని విష్ణు•లక్షణలక్షితు • లలి నొనర్ప
నతఁడు ధనుర్దాసుఁ•డని ప్రసిద్ధుం డయ్యె, నతనిపత్నియుఁ దన్నె•యాశ్రయింప
నాసతీమణికి హే•మాంబిక యని పేరు, సకలహితోపదే•శములు సల్ప
దారాదికము ధను•ర్దాసుఁడు విడనాడి, పద్మినీపాంచాల•భావ మెఱిఁగి

**తే.** యిదియెమా కార్యదక్షిణ•యిమ్మనడిగి, మరలియాదంపతులఁగూర్చె•మాన్యతిలకు
డతఁడెసర్వజ్ఞమౌళి ద•యాళు వనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

**సీ.** తిరువీధి విచ్చేయ•దేవదేవునివిగ్ర, హంబుఁ గదల్ప వా•హకుల నైనఁ
దన్నైనఁ దెగటార్పఁ•దలఁచెద నని యొక్క, వాఁడికరారము•వరను నిద్రఁ
జెంద నీయక పూని•శ్రీరంగపతిముఖ, మలరఁజూచుచు వెనుఁకడుగు లిడుచు
నరుగునపీచ్యన•యస్కొధనుర్దాసు, పిళ్లైయురంగాద•వెల్లిదాసుఁ

**తే.** డనిరి ద్రష్టలు మల్లవి•ద్యాతిశయము, ధారుణీశులకడఁ జూపి•ధనముఁ దెచ్చి
యార్యకైంకర్య మొనరించు•నాతఁడనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

**సీ.** అసమాధికాభిజా•త్యంబునఁ బేర్కొను, మొదలియాండా నాది•ముఖ్యుఁ డతని
కైదండ గొని తిరు•కావేరితీర్థ మా, డను జని లక్ష్మణ•మునివరుండు
ఆర్ద్రవస్త్రావృత•మాదాశరథికేలు, దం డాని మరలి తా•దారినడుమ
మల్లరంగమున రం•జిల్లుసాములఁ జెప్పి, యలసి ధనుర్దాసుఁ•డనుగుదెంచి

**తే.** తన్నుఁగనుఁగొనివలగొని•ధరణిఁజాఁగి, మ్రొక్కి లేచినఁ జూచిన•మ్మోదమంది
యతనికైదండ గొని మర•మందెననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. తలఁపఁగా నీధను•ర్దాసుఁడు మాకన్న, నధికుఁడా యిట్లు మీ•రాదరింప
నని తన్నుఁగూర్చియ•ల్గినవైష్ణవులఁజూచి, యుడయవ రుచితోక్తి•నూఁఱడించి
యారాత్రి మఠములో•నాండాను మొదలైన, సింహాసనస్థుల•చేలతతుల
నొక్కొక్కవస్త్రమం•దొక్కొక్కకౌపీన, మాత్ర మెత్తించె ల•క్ష్మణగురుండు

తే. తెల్లవాఱిన నీరాడి•దేశికేంద్రు, లెల్లఁ దమతమవస్త్రము•లెల్లఁ జూచి
కలఁతపడి పల్కిరనరాని•పలుకు లనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. ఆ వైష్ణవులమాట•లన్నియు విని నగి, యతిదేవుఁ డిరువురా•శ్రితులఁ బిలిచి
యీరేయిఁబొన్నాచ్చి•యారిసొమ్ములుమీరు, ద్రుచ్చిలియీమాకుఁ•దెచ్చియొసఁగుఁ
డని పంచినను జని•యావైష్ణవులుదివ్య, తరహంసతూలికా•తల్పమందుఁ
దనభర్తతో సుఖ•తరనిద్రఁ గొని యున్న, యద్దేవియాభర•ణాదు లొక్క

తే. వంక పన్నియుఁ గొనిన న•వ్వనిత నిద్రఁ, దెలిసి స్వాములువీరని•తలఁచిసొమ్ము
లన్ని యిచ్చుటకై పొర్లె•నప్పు డనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. ఈలేమ మేల్కాంచె•నిం దుండరాదని, చని యొకపార్శ్వభూ•షణము లన్ని
గురున కర్పించి మం•దిర మోఁది రాస్వాము, లంత ధనుర్దాసుఁ•డడుగ సతియు
నిరువురువైష్ణవు•లీవంకసొమ్ములఁ, గొన నున్న వన్నియుఁ•గొనుట కేను
బొరలిన బెదరి పో•యిరి వార లన్నను, నింతస్వాతంత్ర్యమా•యింతి నీకు

తే. నని ధనుర్దాసు డలుకతో•నాత్మసతిని, బలికివిడనాడి చని యతి•పతినిజెంద
నగ్గురుం డిది యేమని•యడిగె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర,

సీ. దేవరదాసి ని•ద్రింపఁగా నీరాత్రి, వైష్ణవు లిరువురు•వచ్చి చూచి
యొకవంకభూషణ•నికరంబుఁ గొన నిద్రఁ, దెలిసి యాస్వాములు•వలసినట్లు
భూషణంబులఁ గొని•పోయెద రని యూర, కుండక పొరలెఁ దా•నున్న సొమ్ము
లన్నియు నిచ్చెద•నని దుస్స్వతంత్రయై, యంత వా రీప్సిత•మంద లేక

తే. చనిరి గావునఁ జాలుఁద•త్సంగసౌఖ్య, మనుచుఁబల్కుధనుర్దాసు•నాదరించి
మరలవారింటికనిపె న•మ్మాన్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర,

సీ. అంత సన్నిధివైష్ణ•వాగ్రేసపులఁ జూచి, యతివరుం డిట్లని•యాన తిచ్చె
నభిజనవిత్తవి•ద్యాధికు లైనమీ, కట్టుపుట్టములలోఁ•జిట్టెఁదేసి
గోఁచిగుడ్డలఁజించు•కొనువారు వైష్ణవు, లని యోర్చి యుండక•యలిగి మిగుల
వినరానిమాటల•వినిపించితిరి మీర, లెంచ ధనుర్దాసు•డేమి చదివె

తే. నెందు జన్మించె నీతెలి•వెట్లు చెందె, నాత్మతత్త్వాభిజ్ఞుల•యభిజనాదు
లడవిఁగాచినవెన్నెల•యనియె ననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. గురువాక్సుధావృష్టిఁ•గోపాగ్నిఁ జల్లార్చి, యాధనుర్దాసుని•సాధుశేష
తాపారతంత్ర్యతో•దారతాసాత్త్విక, తాస్తికతాదుల•నాత్మగుణము
లన్నియుఁ గనుఁగొనిఁ•యఖిలభాగవతులుఁ, జరమపర్వాధ్యవ•సాయవిభవ
మితనికిఁ గలిగిన,ట్లెవ్వరికిని లేదు, గనుక లక్ష్మణముని•కరుణ యితని

తే. యెడల నెలకొనెఁ గావున•నితఁడె మనకుఁ, బూజనీయుండు వైష్ణవ•పుంగవుండు
ననుచుఁ గొనియాడి సంతస•మందిరనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. నీరాడఁ జన భాగి•నేయునికై దండఁ, గొని యేఁగునీయతి•కులవిభుండు
మరలి వేంచేయుచు•మల్లరంగమునుండి, వచ్చు ధనుర్దాసు•వరకరాబ్జ
మాని వచ్చు నితండు•నతిపక్షపాతిగా, కే మని కొందఱు•స్వాము లనిన
విని తనకన్నొక్రిల•ఘనమృదుతల్పంబుఁ, బఱపించి వచ్చిన•వైష్ణవులను

తే. గాంచియీపాన్పుపైఁబవ•ళించుఁడనుచుఁ, బలుకుయతిపతిసూక్తుల•కులికిపడుచు
సందియముఁ జెంది రంద ఱా•స్వాములనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ, అంత ధనుర్దానుఁ•డరుగుదెంచినఁ జూచి, పవళింపు మిప్పు డీ•పడుకపయిని
నని తనగురుఁ డన్న•యప్పుడే పవళించె, లె మ్మన్న దిగ్గన•లేచి నిల్చె
నెంబెరుమానారి•కీతండుక్రయవిక్ర, యార్హ దాసుఁడు గదా•యరసి చూడ
జ్ఞాన మనుష్ఠాన•మేనరునకుఁ గల్గు, వాఁడెపో పుడమి స•ద్వైష్ణవుండు

తే. అరయనాచార్యపారతం•త్ర్యంబులేని, యభిజనాదులఁగాల్పనే•యనుచుఁదప్పుఁ
దెగడి వారుధనుర్దాసుఁ•బొగడి రనుచు, వాదిభీకరగురుఁడనె•మోద మలర.

సీ. ఇరువురువైష్ణవు•లెంబెరుమానారి, నీయాత్మ కాచార్యు•లెంద అనిన
యతివరుం డీయర్థ•మాధనుర్దాసుని, దేవి నడ్గిన మీకుఁ•దెలియఁ బల్కు
నని పల్కి పంచిన • నాసాత్త్వికులు పోయి, యద్దేవిఁగనుఁగొని • యడిగినంతఁ
గొప్పువిప్పి పిదిర్చి•యొప్పుగాముడిఁగూర్చి తొగవదారముఁజుట్టి • ద్యుమణిఁజూచి

తే మ్రొక్కి యిలు చొచ్చి వాకిలి • మూసి దాసి
కేమి తెలియును గురుఁడె మీ • కెఱుకపఱుచు
ననుచుఁ బల్కెను వారి కా•యతివ యనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 81

సీ. ఆస్వామి లేతెంచి • యతిపురందరుఁ గాంచి, యాసాధ్వి చెప్ప లే • దనిన గుఱుఁడు
ఏమేమి చేసె నే • మే మనె నన్నను, నచ్చటి నడవడు • లన్ని దెలుప
నాచార్యు లీయాత్మ • కఖిలవైష్ణవు లని, చెప్పెను సిగ దుల్పి • కొప్పుముడిచి
యాపూర్తి యొకరికే, యని తెల్పె నతనిఁ గా, మముఁ జూపెఁ దొగ యుదా • రమున మీకు

తే. గుఱుఁడె గతియని తెల్పె న • ర్యుఁ డనకు మ్రొక్కి, యింతకం టేమి లేదని, యిల్లు వొచ్చి
మూసెఁ దలుపని యనె నార్యు • ముఖ్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. తొల్లి యాదవసూరి • తల్లి తిరుకచ్చి, నంబిగారి యను గ్ర • హంబు వలన
వరదునిఁ గనుఁగొన • వచ్చుచుఁ బోవుచు, నా లక్ష్మణార్యుని • యమృతగోష్ఠి
సేవించి తనయిల్లు • చెంది పుత్రునిఁ జూచి, మన లక్ష్మణార్యుని • మాడ్కి నీవు
నుండితి వేని సు • బోదయ మందెద, వని పల్కి విని యతఁ • డాత్మలోన

తే. లక్ష్మణార్యులగోష్ఠి వి • లక్షణత్వ, మతివయోవృద్ధుఁ డద్వైత • మతియు యతియు
నైన నను గెల్చె నెట్లిక • ననియె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. అట్లు సందియమొంద • నారాత్రి కలలోన, వరదుండు గనిపించి • పరమకృపను
నద్వైతయతి నని • యభిమానపడక నీ వాలక్ష్మణార్యుల • నాశ్రయింపు
మని పల్కి కనరాక • చనెనంత యాదవ, సూరి మేల్కొని మన • శ్శుద్ధి లేక
హరినోటిమాటకై • యానంబి నడిగిన, నగ్గురుం డచ్యుతు • నడిగి వచ్చి

తే. కలను నేవన్నవార్తలు • కల్లగావు, నమ్ము మని చెప్పెఁ గరిగిరి • నాథుఁ డనుచు
నంబి చెప్పినఁ దనకల • నమ్మె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఆశ్రయించెద నని • యతిపతికడ కేఁగఁ, బూర్వాపకృతులెత్తి • బొడుచునేమొ
యని సంశయింప నా • తనితల్లి ఘటకయై, తోడ్కొని చనియెను • దోషభోగ్యు
లయిన లక్ష్మణముని • యంఘ్రులకడ కంత, నతనిఁ గటాక్షించి • యతివరుండు
వచ్చినపని యేమొ • వర్ణింపు మనినను, భవదంఘ్రిశశి రవి • ప్రభలు మదిని

తే. జొచ్చి యజ్ఞానతిమిరము • ద్రవ్చుకతన, సద్గురుని నిన్నుఁ గనుఁగొంటి • ఛాత్రవృత్తి
ననుచుఁ బల్కెను యాదవుఁ • డార్యు ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఉడయవ రామాట • కొడఁబడియును మది, నతని మనశ్శుద్ధి • నరసి చూడ
బ్రాహ్మణోచితశిఖా • బ్రహ్మసూత్రాదిక, త్యాగనిష్కృతి భూప్ర • దక్షిణంబు
కర్తవ్య మది సల్పఁ • గాలము గాదు నీ, కతివయోవృద్ధున • కనుచుఁ బల్క
నరయ నెవ్వనితల • లం దొక్కతలపైని, దెల్లావగిం జనఁ • జెల్లుఁ బుడమి

తే. నట్టిచిల్వలతేఁడు నీ • వైనకతన, నిన్ను వలగొని మ్రొక్కిన • నిఖిలపాప
తతులఁ జెడునని పల్కె నా•దాంతుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ముమ్మాఱు వలగొని•ముదమొప్ప సాష్టాంగ,దండప్రణామముల్ • దనరఁ జేసి
యున్నయాదవుఁ గని • మన్నించి యతిపతి, సకలహితంబులు • సలిపి కృపను
దిరునామ మొనరించెఁ • దిరముగా గోవింద, జియ్యరం చతనికి•నెయ్యమొప్ప
నాతనిమది గణ•యతి విషయంబుగా, నొకగ్రంధ మొనరింప • నుచితమవిన

తే. గ్రంధమొక్కటిచెప్పెను•బంధురముగ, నదికటాక్షించి యతిపతి • యర్థమవియె
నమ్మహాత్మునిఁ దలఁచెద • ననిశ మనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. శ్రీభాష్య మొనరింపఁ • జింతించి యతిపతి, కూరనాథాది స•ద్గురులఁ గూడి
పృథులసరస్వతీ•పీఠంబుకడ కేఁగి, విమలబోధాయన•వృత్తి నడుగ
నిచటఁ జూచెడువారి•కిచ్చువార మె కాని, యది వ్రాయనియ్య మ•ర్యాద లేదు
అనిపల్క విని లక్ష్మ•ణార్యుఁ డూరకయుండెఁ, గూరేశుఁడిమ్మని • కోరి యడిగి

తే. పుచ్చుకొని కేలఁగీలించి • పుస్తకంబుఁ, జూచి యఱువదివే లగు•సూత్రవృత్తి
నంత మదిలో ధరించె న•య్యలఘుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. కూరేశుఁ డదిమాచి•గుఱుతుగా మది నిల్పి, గురువితో సూరులఁ•గూడి రాఁగ
వృత్తి లేదని యతి•విభుఁడు చింతించిన, వచ్చినదని కూర•వరుఁడు పలుక
నామధురోక్తి కా•హ్లాదించి సంయమి,రాజు నిజచ్ఛాత్ర • రవిని జూచి
సీతసేమముఁ దెల్పు•శ్రీకపిరాజు నా,రారాజుపోలిక • గారవించి

తే. పుడమిఁ బ్రత్యక్షవైకుంఠ•పురముఁజెంది, యచటఁ బరవాసుదేవుని • యాజ్ఞఁబడసి
భాష్య మొనరింపఁ దలఁచెనా•ప్రాజ్ఞుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. యదుపజ్ఞమై చెల్లు • నఖిలవిద్వజ్జన, సౌజన్యజన్య య•శశ్చయంబు
ఆకూరరాడ్గురు • నస్మద్వహోయోగ్య,తాదులఁ గని వ్రాయు • మనుచుఁ బలికి
యరుళాళమునుల స•హాయంబుగాఁ గొని, భాష్య మారంభించి • భవ్యతిధిని
బరమజిజ్ఞాసాధి•కరణంబు మొదలుగా, బ్రహ్మతర్కంబులు • బహువిధముల

తే. వేయుమోములు గల్గిన•వేల్పుకరణిఁ, జెప్ప యోగ్యతఁగనివ్రాసె • నొప్పుగాను
గూరవంశాబ్ధిచంద్రుఁ డా•కొలఁది ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. శేషత్వసహిత మై•చెల్లుజ్ఞాతృత్వ మీ,యాత్మకు లక్షణం • బని వచింప
నదివ్రాయ కున్నఁ గూ•రాధిపు నార్యుండు, నీవె భాష్యముఁజేసి • నెగ్గుమనుచుఁ

గోపించి పొమ్మన్నఁ • గూరేశుఁ డచ్చట, నుండక మఱుచోట • నొదిఁగియున్న
నిఁకమీఁద నీతలం • పే మని యడిగిన, సూరిబృందమున కా • దూరదర్శి

తే. స్వస్వరూప ప్రదీప సం•స్థాపకుండు, స్ఖలితశాసితయైన య•స్మద్గురుఁడు
గలుగ నేమికొఱం తని • పలికె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అంత విచారించి • యనుతాపపడి యాత్మ, జీవనౌషధు నగ్ర్య • శిష్య సుగుణుఁ
గూరేశుఁ బిలిపించి • గురుఁడు కౌఁగిటఁ జేర్చి, యుచితసూక్తులఁ జాల•నూఱడించి
జ్ఞాతృత్వకలితశే • షత్వమే ముఖ్యల,క్షణ మాత్మ కనిన నా • ఘనుఁడు వ్రాసె
నట్టి లావృత్తిసూ • త్రాంతముగా భాష్య, మాయతీంద్రుఁడు చెప్ప•నతఁడు వ్రాసె

తే. సరసవేదాంతసంగ్రహ • సారదీపి, కాఖ్యదివ్యప్రబంధము • లాన తీయ
వాసిఁ గూరేశుఁ డవి యన్ని • వ్రాసె ననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. ఉడయవ రొక్కనాఁ • డడవిమ్రాఁకులకడ, వైష్ణవుఁ డేకాకి•వగవఁ జూచి
యతనిదుఃఖముఁ బాపు•మనిపన్పఁ గూరేశుఁ,డట కేఁగి యడిగిన•యతఁడు చెప్పె
మత్సుత నెవఁ డైన•మహిఁ బెండ్లి యాడ వాఁ,డా వేదికను డిగ్గి•నపుడె త్రెళ్ళు
ననియెఱిం గెవ్వని • కాత్మజ నీ వైతి, నియ్యకున్నఁ గుటుంబ•మెల్ల జెడును

తే. దుఃఖమిదియని దెల్పఁద•ద్దుఃఖముడుప, నీయఁ దగునేని సుతనుమా•కిమ్మనడుగఁ
గూరనాధున కతఁ డిచ్చెఁ • గూఁతు ననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. శాస్త్రోక్తవిధి నగ్ని • సాక్షిగాఁ దత్సుతఁ, బెండ్లాడి యప్పెండ్లి • వేది దిగక
కూరేశుఁ డప్పుడే • కోరి వనస్థుఁ డై, యద్దేవితోఁ బెండ్లి • యరుఁగు డిగ్గి
యత్తమామల బంధు•లార్యుల వీడ్కొని, శ్రీరంగధామముఁ • జేరి గురున
కావృత్త మెఱిఁగింప • నతఁడు సంతోషించి, పంచిన భార్యతో • భవన మొందె

తే. యుచితవృత్తినుపాదాన•మొడిపి తెచ్చి, కాలయాపన మొనరించు•ఘనుఁడతండు
దంపతుల వారి నిరువురఁ • దలఁతు ననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. అంతఁ బ్రావృట్కాల • మావిర్భవించిన, నీలమేఘంబులు • నింగిఁ గప్పి
వర్షించె నొకనాఁటి • పగ లెల్ల నావేళ, నక్షయపాత్ర మే • మమర కున్న
నీ రాడి కూరేశుఁ • డారాత్రి పెరుమాళ్ళ,కొకఫల మర్పించి • యుపవసించె
నారంగరాజు రే • యారగించెడు వేళఁ, జెలఁగు ఘంటాధ్వని • చెవులఁ బడిన

తే. నాత్మదాసుల విడిచి తా • నారగించె, రంగపతి యని తనయంత • రంగమందుఁ
దలఁచెఁ గూరేశుదేవి యు • ద్బాధ ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. అప్పు డాండాళమ్మ • య ట్లన్న విని రంగ, భర్త స్వకైంకర్య•పరులఁ బిలిచి
పస్తుండి రాకూర • పతియును దత్సతి, యీ ప్రసాదము వారి•కియ్యఁ దనినఁ
బాయసపూర్ణ మౌ • పసిఁడిపళ్ళార ము, త్తమనంబి తనతలఁ • దాల్చి యరుగఁ
దనచుట్టు సూరులు • తగ నాలవట్టముల్, పడగలు గొడుగులుఁ • బట్టి నడవఁ

తే. నాజ్యపూర్ణప్రదీపంబు•లమరఁ జుట్టు, సకలమంగళవాద్యఘో•షములతోడ
వచ్చె నానంబి కూరేశు • వసతి కనుచు, వాదిభీకరగురు. డనె • మోద మలర.

సీ. వచ్చి యుత్తమనంబి • వారి కాభగవత్ప్ర•సాద మొసంగి తాఁ•జనియె నంత
నీవింత యే మని • యిల్లాలి నడిగిన, నున్నయ ట్లద్దేవి • విన్నవింప
హరి నేమి యనకయే•యతఁ డేల పంచు ని, ట్టీప్రసాదము మన•యింటికడకు
నని పల్కి దేవిపై•నలిగి కూరేశ్వరుం, డాప్రసాద మొకించు•కారగించె

తే. నతనిభుక్తావశిష్టాన్న•మర్థ మనుచు, నారగించిన నద్దేవి•కయ్యె గర్భ
మనుచుఁ జెప్పిరి మాకన్న•దార్యులనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. అవనివాసప్రస్తుఁ•డై పతి యుండఁ ద,త్పతియు గుర్విణి యైన•సరణి యెట్లో
యనిశంకపడువారి•కారంగధాముండు, మత్ప్రాయసూనంబు•మహిమయనుచుఁ
దెలిపెనకూ్కరేశు•దేవియు నిరువుర, సూర్యచంద్రులఁ బోలు•సుతులఁగనియెఁ
బురుడు దీఱినయంత•గురుశిరోమణి కూర,కులపతియింటికిఁ•గోరి వచ్చి

తే. చిన్నశిశువులఁగనుఁగొనఁ•జిత్తమందుఁ,దలఁచియెంబారుననుపనా•తండువెడలి
బాలకులఁజూచిసంతోష•పడియె ననుచు, వాదిభీకరగురుఁడనె,మోదమలర.

సీ. తల్లి యాండాళమ్మ•తా నుడయవరాజ్ఞ, నెంబారు కాత్మజు•నియ్య నాతఁ
డసురసంధ్యాకాల•మనిమంత్రరత్నముఁ,బలుకుచుఁ దెచ్చియు•బాల్పతిలకుఁ
జూపిన యతిపతి•చూచి సంతోషించి, కౌఁగిట నద్దుక•గారవించి
శిరము మూర్కొని పేరిఁ•జేసె బరాశర, భట్టారకుం డని•బాలకునకు

తే. వ్యాసభట్టారకుం డని•భాసురముగఁ, బే రొనర్చెను శ్రీరామ•పిళ్ళ కట్లు
సత్యసంకల్పుఁ డాయతి•చంద్రు డనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. దయ శిశురక్షకై •ద్వయ ముచ్చరించిన,కతన నబ్బాలక,కలభులకును
గురుఁడవు గ మ్మని•గోవిందదేశికు, నియమించి యతిరాజు•నిలయ మందె

నంత నెంబారుజి, య్యరుతమ్ముఁ డై నట్టి, శిరియగోవిందదే, శికునకు దయ
భాను బ్రభుం డై న, సూనుండు గలిగిన, విని లక్ష్మణార్యుండు, వేగ వారి

తే. మందిరముఁజొచ్చియబ్బాల, మణికినసుగు, ణంబుగా శ్రీపరాంకుశ, నంబియనుచు
మంచిదినమందుఁ బేరు గా, వించెననుచు, వాదిభీకరగురుఁ డనె, మోదమలర.

సుగంధివృత్తము. శాంతిసద్మ వేంకటేశ, శంఖచక్రదాయకా
శాంతదుర్మతప్రచార, సత్పథప్రవర్తకా
సంతతాతికాంతరంగ, శౌరిసన్మహోత్సవా
చింతితత్వదంఘ్రిపద్మ, జీవనౌషధీసుధీ. 101

క. శ్రీరంగధామశరణా, కూరకులాధీశముఖ్య, గురునుతచరణా
ఘోరకలిదోషహరణా, సారశ్రీభాష్యసూక్తి, జగదుద్ధరణా.

మాలినీవృత్తము. రజతవిమలకీర్తీ, ప్రస్ఫురచ్ఛేషమూర్తీ
స్వజనహితవిచారా, జ్ఞాతవేదాంతసారా
ద్విజముఖకృతపూజా, దీప్తగోవిందరాజా
గజవరదవిధేయా, ఖండితాశేషమాయా. 103

గద్యము. ఇది శ్రీభగవద్రామానుజ కరుణాకటాక్ష కలితకవితావైభవ పరవాదిభయంకరాచార్యాబ్ధి మతచ్ఛాత్రాపస్తంబసూత్ర కణ్వసగోత్ర పవిత్రోభయకవి మిత్రవేంకటకృష్ణార్యపుత్ర విబుధవైష్ణవవిధేయ కేశవనామధేయ ప్రణీతంబైనయాచార్యసూక్తి ముక్తావళి యనుమహాప్రబంధంబునందు మధ్యమభాగంబున శ్రీలక్ష్మణార్యుండు తిరువరంగ గురునితో శ్రీరంగధామంబుఁ జెందుటయు నమ్మహాత్మునిఁ జతుస్సప్తతి దేశికులాశ్రయించుట నగ్గురుండు తిరుకోట్టి యూరినంబి వలన మంత్రరాజంబు లభించి బయల్పుచ్చుటయు మరల శ్రీరంగంబుఁ జెంది యచటనుండి తిరుమలకు విచ్చేయుటయు శ్రీశైలపూర్ణులకడ శ్రీరామాయణం బధికరించుటయు రంగదాస వైభవంబును శ్రీవేంకటేశప్రకాశంబును శైవాదిని గ్రహంబును దిల్లగోవింద ప్రతిష్ఠయు గోవిందమిశ్రస్వీకారంబును గోవిందమిశ్రులు తురీయాశ్రమంబుఁ బరిగ్రహించుటయుఁ గూరేశగురుండు కోవెలబీగ ముద్రలు స్వాధీనంబు గాఁగొని గురున కర్పించుటయు యజ్ఞమూర్తిని యతీంద్రుండు జయించి శిష్యునిఁ గావించుకొనుటయు యతీంద్రుండు గృహ సప్తకంబున భైక్ష్యం బాచరించుటయుఁ గొంగుపిరాట్టి వృత్తాంతంబును విష తీర్థపానంబును గురుండు విషాన్నంబుఁ బరిగ్రహించి పరిహరించి యుపవసించుటయు

గోష్ఠీపూర్ణుండు యతీంద్రునకు నన్నాదిప్రదానార్థంబు కిడాంబివరదార్యుని నియమించుటయు యతిశేఖరుండు తిరుమాలెయాండానుకడఁ దిరువాయ్మొళి యర్థంబు వినుటయుఁ దిరువరంగార్యు ననుసరించి తిరువాయ్మొళి యధికరించి యంతిమోపాయం బెఱుంగుటయు గద్యత్రయ ప్రసన్నుండైన హరివలన యతీంద్రుండు విభూతి ద్వయంబు స్వాధీనంబుగా లభించి యుడైయవరని ఖ్యాతిఁ గాంచుటయు ధనుర్దాస చరిత్రకథనంబును యాదవసూరి యతీంద్రు నాశ్రయించుటయు శ్రీభాష్యాదిషట్ప్రబంధంబుల గుఱిండు చెప్పుటయుఁ గూరేశ వైభవంబును గూరేశ విభుండు పత్నీపరిగ్రహం బొనర్చి వాన ప్రస్థాశ్రమంబు స్వీకరించుటయు రంగేశప్రేరిత ప్రసాదాశనంబుచేఁ గూరేశపత్ని పుత్ర రత్నద్వయంబుఁ గాంచుటయు నబ్బాలకులకు యతిశేఖరుండు వ్యాసపరాశర నామధేయంబు లొనర్చుటయు సంయమీంద్రుండు శిరియగోవిందగురున కుదయించిన యర్భకునకు శ్రీపరాంకుశనంబి యని తిరునామం బొనర్చుటయు నన్నది తృతీయోల్లాసము.

—: ० :—

శ్రీమతే రామానుజాయ నమః.



# ఆ చా ర్య సూ క్తి ము క్తా వ ళి

## మ ధ్య మ భా గ ము

---

### చ తు ర్థో ల్లా స ము

శ్రీభాష్యప్రముఖ ప్రబంధవిలస•త్సిద్ధాంతసంస్థాపనా
శోభానిర్జితపద్మపాదయుగపాం•సువ్రాతపూతాఖిల
క్ష్మాభాగా భగవద్గుణానుభవసం•జాతప్రమోదా ప్రకా
శీభూతాదిమరంగముఖ్యమురజిత్•క్షేత్రాఢ్య రామానుజా. 1

వ. అవధరింపుము. 2

సీ. అ ట్లాళవందారి•కానృణ్య మొందిన, యతిరాజు సభ దీర్చి•యలరువేళ
వరచతుస్సప్తతి•గురు లెల్ల సాష్టాంగ, దండప్రణామముల్•దనరఁ జేసి
స్థిరవిశిష్టాద్వైత•సిద్ధాంత మీ బ్రహ్మ, సూత్రభాష్యోక్తుల•సులభ మయ్యె
సకలదిగ్విజయంబు•సల్పి యీ సిద్ధాంత, మంతట వైష్ణవ•సంతతులకుఁ

తే. దెలియవివరించికుమతుల•తేటఁజెటిపి, మరలి యీక్షేత్రమొందిన•మహిసుఖించు
ననుచు శిష్యులు ప్రార్థించి•రార్య ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. గురుచతుస్సప్తతిఁ•గూడి యేకాంగులు, పంద్రెండువేలస•ప్తశతియతులు
చిత్రగుప్తుల కైనఁ•జెప్ప శక్యము గాని, సాయుధసూరిని•త్యవ్రజంబు
లారీతికొత్తెపు•టమ్మలుఁ గొలువ ల, క్ష్మణముని వెడలెడు•సమయమందు
విష్ణుసేనలరాజొ•విహగరాజొ రథాంగ, రాజొ పన్నగరాజొ•రంగరాజొ

తే. దెసలుగెల్వంగయతిరాజు•తెలుగుదాల్చి, చనియెననిద్రష్టలూహింప•సర్వగురుఁడు
నరిగె శ్రీరంగరాజది•వ్యాజ్ఞ ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర. 4

సీ. కలివైరి ముందు ప్రా•కారగోపురమండ, పాదు లెవ్వానికి•నాచరించె
గంగగర్వముఁ బాపఁ•గావేరికడుపులో, నెవ్వాఁడు వసియించు•నిపటి కైన

నాద్యన్వయంవ్యక్త•మతుల ప్రణవరూప, మిద్ధరంగవిమాన•మెవనిగృహము
యద్విమానాగ్రము•నందుఁ జేతనులచే, శ్రుతిరూపశిఖరముల్•సూపఁబడునొ

తే. యట్టిరంగేశుఁగనుగొని•యడిగియతని, యాజ్ఞఁదలఁదాల్చివెడలెదా•నన్నిదెసల
గెలువ లక్ష్మణయోగి యా•కొలఁది ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. ఇతఁడు దత్తాత్రేయ•యతియని తలఁతురు, శాస్త్రీయయతిలింగ•చయముచూచి
యితఁడు విష్వక్సేనుఁ•డిది నిజ మందురు, తద్దాససైనిక•ధాటిఁ జూచి
పంచాయుధాంశసం•భవుఁ డీతఁ డందురు, విమతులఁ జెండించు•విధముఁజూచి
భావింతు రార్యులు•ఫణిరా జితం డని, నానావిధప్రమా•ణములచేత

తే. గరళపానాదికముఁ దల్చి•గరుడుఁడందు, రుడయవరుగా నహరియంఘ్రు•వెడలువేళ
స్వామి లిట్లెంతు రాయతి•స్వామి ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. రంగేశునకు ముందు•మంగళాశాసన, మొనరించి లక్ష్మణ•మునివరుండు
రావు దర్శి తిరుక్కో•డందకు వేంచేసి, యంద తృప్తామృత•మనుభవించి
శ్రీభాష్య మచ్చటి•శ్రీవైష్ణవుల కెల్ల, నర్థానుభవపూర్వ•మాన తీయ
వారె జయించి రు•పస్థితప్రతివాది, తండ మాత్మబ్రహ్మ•తర్కతతుల

తే. నచట విజయముఁ జాటించి•యఖిలగురుఁడు, నరిగి యళగరితిరుమల•కచటనున్న
మాలిరుంజోలెనంబిని•మరిగె ననుచు, వాదిభీకరగురుఁడనె•మోద మలర.

సీ. మాలిరుంజోలెస•న్మందిరగోపుర, ప్రాకారమండప•ప్రభలు మదికి
నాహ్లాద మొనరింప•నగ్గురుం డర్కుండు, కనకాద్రిగతిఁ బ్రద•క్షిణ మొనర్చి
కలితతార్క్ష్యస్తంభ•బలిపీఠములకడ, దండప్రణామంబుఁ•దగ నొనర్చి
యంత రాలయ మొంది•యాహరివిగ్రహ, మాపాదమస్తక•మనుభవించి

తే. యతనిదివ్యాంగదివ్యాయు•ధాదులకును, విష్ణుచిత్తోక్తగాథలు•విన్నవించి
మంగళాశాసనము చేసి•మరలె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. స్వస్నానపానాది•సాధుతీర్థీకృత, దివ్యగంగాదిక•తీర్థుఁ డితఁడు
నిత్యోత్సవాదులు•నిర్విఘ్నములు చేసి, పుష్పోపవనములు•పొలి వహింప
మల్లెలు మొల్లలుఁ•దెల్లచేమంతులు, సన్నగన్నేరులు•జాతిలతలుఁ
బాటలీపున్నాగ•పారిజాతంబులుఁ, గేతకీచాంపేయ•కేసరములుఁ

తే. బనసఖర్జూరకదళికా•బదరినారి, కేళసహకారముఖఫల•క్షితిజములును
నవ్యతులసీవనంబులు•నాటె ననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. అళగరితిరుమల•హరి కన్నిపనులును, జక్కఁ జేసి తదీయ•శాసనమునఁ
దరలి యచ్చటినుండి•తనదాసకోటితో, దక్షిణాంభోనిధి•తటముఁ జెంది
మేర్వంతికోర్విపై•మెఱుఁగులతోఁదోఁచు, నీలమేఘముఁ బోలు•వేలకడను
సౌమిత్రికృతదర్భ•శయ్యపైఁ బవళించు, జటిలు నాశ్రీరామ•చంద్రుఁ జూచి

తే. పూర్వతరజన్మసంస్కృతి•పొడమినట్లు, కనులనానందబాష్పముల్•గ్రమ్ముకొనఁగ
భక్తిఁ బ్రణమిల్లె నాయతి•భర్తయనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. ఆదర్భశయ్యాశ•యానుఁ డాశ్రీరాముఁ, డర్చాకృతిని జెంద•నతని కచట
ఛాయాదిసిద్ధికై•సౌమిత్రి యి ట్లయ్యె, ననఁ దగునశ్వత్థ•మచటఁ జూచి
కుశశయుఁ బొగడి వీ•డ్కొని చని తత్పద, పద్మయుగన్యాస•పావనంబు
రావణాదికసర్వ•రాక్షసనిధనైక, హేతు వబ్ధివిభేద•హేతు వుభయ

తే. భూతిహేతువు మైథిలీ•ముఖవికాస, హేతువౌ సేతువును జూచి•యిష్టగురుఁడు
దక్షిణాంబుధిదర్శిత్రోవఁ•దరలె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. తిరునగరికిఁ జనఁ•దిరువుళ్ళమునఁ దల్చి, వెడలుచు మార్గము•వెంట నున్న
మందారమాలూర•మాతులుంగలవంగ, మాకందమన్మథా•మ్లాతకాది
ఫలపుష్పపల్లవ•భరనమ్రతరులను, బద్మాకరంబులఁ•బర్వతముల
నాశ్రమంబుల బ్రాహ్మ•ణాగ్రహారంబుల, గ్రామపట్టణఘోష•గర్వటములఁ

తే. గనికరం బొప్పఁ జూచుచుఁ•గడచి వచ్చి, తామ్రపర్ణీనదీతీర•తరుల క్రింద
విశ్రమించెను యతిరాజు•వేడ్క ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. ఏనది నెడఁబాయ•కెల్లప్పు డుండును, ఘనుఁడు విష్ణుయశుండు•కల్కితండ్రి
యేనదికడ నిల్చు•నించుకబ్రాహ్మ్యము. కలియుగాంతము పెను•గాసి దొలఁగి
యేనదిజలముల•నిం పొందఁ ద్రావినఁ, గలుగుసుజ్ఞాన మే•కలుషి కైన
నేనదీతీరమం•దెల్లచేతనులకుఁ, గనిపించు శరవైరి•కరుణ నట్టి

తే. పరమపావని శ్రీతామ్ర•పర్ణిఁబొలిచి, మించుపద్మరజంబుతో•మంచిగాంచు
కూనగాడ్పులు యతిరాజు•గొలిచె ననుచు. వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. చారుముక్తాఫల•జన్మనిదానము, సమదగజాకీర్ణ•సైకతంబు
ఫలపుష్పమంజరీ•పల్లవభరనమ్ర, దివ్యద్రుమోల్లస•త్తీరయుగముఁ
జలదూర్మిడోలికా•సక్తకారండవ, బకకోకహంసాది•పక్షికులము
భవ్యపద్మమరంద•పానమత్తభ్రమ, భృంగీమధురగీత•సంగతంబు

తే. వకుళభూషణనిర్మాల్య•వాసితంబు, తీర్థవత్తామ్రపర్ణీన•దీవరంబు
శ్రీయతీంద్రుఁడు చూచి హ•ర్షించె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. లోలమీనాక్షులఁ•జాలఁ జూచి విహంగ, కులకలరవములఁ•గుశల మడిగి
కమలకోశాంజలిఁ•గావించి తనవీచి, బాహువుచేఁ బుష్ప•బలి యొనర్చి
భ్రమరగీతములచే•బహుభంగులను వేఁడి, స్నానపానాదుల•శ్రమముదీర్చి
తనతీరములఁ బొల్చు•ధరణీరుహంబుల, సరసఫలంబులఁ•జాల నొసఁగి

తే. యతిశిఖామణి కమితశి•ష్యాన్వితునకు, నతిథిపూజలఁ గావించె•నతులభక్తిఁ
దామ్రపర్ణీమహానది•ధన్యయనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. ఆతామ్రపర్ణీమ•హానదీతటమున, సంపూర్ణకలమాది•సస్యములను
నారికేళవనాళి•నాగవల్లీ వృత, పూగీవనంబులఁ•బొగడతరులఁ
గాశ్మీరపాటలీ•కరవీరచంపక, కేతకీపున్నాగ•కేసరముల
మల్లెల మొల్లలఁ•దెల్లచేమంతుల, మాలతీమాధవీ•మండపములఁ

తే. బనసఖర్జూరసహకార•బదరికదళి, రుచిరచందనకాలాగు•రుద్రుమముల
నుడయవరుచూచియానంద • మొందెననుచు, వాదిభీకరగురుఁడనెఁ • మోదమలర.

సీ. తిరుతామ్రపర్ణిలోఁ•దీర్ఘఘట్టములందు, నీ రాడుచున్నట్టి•సారమతుల
స్నాతులై ద్వాదశ•స్థలముల విమలోర్ధ్వ, పుండ్రముల్ దీర్చెడి•పుణ్యనిధుల
స్వార్యులు వేదశా•స్త్రార్థము లొకసారి, పలుక గ్రహించెడు•బాలవటుల
దివ్యప్రబంధముల్•దెలిసి పఠించుచు, సలిలసంగ్రహములు•సలుపుసతులఁ

తే. బాలసరములఁ బటికలఁ•గేలఁ బూని, స్వామికోవెల కేఁగెడు•సాత్త్వికులను
జూచి హర్షించె సంయమి•సూర్యుఁ డనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. వైకుంఠపురిచుట్టు•వరుసగా విలసిల్లు, సాంతానికము లను•జనపదముల
తెఱఁగున నీదివ్య•దేశముచుట్టును, నవదివ్యదేశముల్•భవహరములు
నిం పారనెలకొన్న•విక్కురుకాపురి, రత్నము నక్షత్ర•రాజినడుమఁ
బూర్ణచంద్రునికతిఁ•బొలుపారు చున్నది, తిరముగా నాతొమ్మి•దింటినడుమ

తే. నాదినాథుండు బ్రహ్మాండ•మంత యరసి, మరులుకొన్నవాఁ డిప్పురి•మహిమభంగి
ననుచుఁదనశిష్యులకుఁజెప్పె•నార్యుఁడనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. ఆదినాథస్వామి•కభిమత మైనయీ, కురుకానగరమందుఁ•గోరి నిత్య
వాసము చేసెడు•వరవైష్ణవులు నిత్య, సూరు లాజన్మవి•శుద్ధబుద్ధు

లది గన్కనే నమ్మ•యాళ్వారు లిచ్చోట, నవతరించిరి మన•కభయ మొసఁగ
నని యాన తిచ్చుచు•నల్లనల్లన చని, తిరుతామ్రపర్ణిలోఁ•దీర్థ మాడి

తే. యుచితకృత్యములను దీర్చి•యుదయవరులు
రమ్యహర్మ్యము కురుకాపు•రంబుఁ జొచ్చి
నమ్మయాళ్వారి సేవించి•నడచె రనుచు
వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. సమ్మార్జన మొనర్చి•చందనోదకములు, చల్లి మౌక్తికరంగ•వల్లికలను
వాకిళ్ళముంగిళ్ళ•వరుసఁ, దిన్నెలయందు, రచియించి ద్వారపా•ర్శ్వములయందు
బంగారపరఁటికం•బములను నెలకొల్పి, నవపద్మమణితోర•ణములఁ గట్టి
పంచతిన్నెలయందు•ధర్మప్రపూర్ణకుం, భములజంటల నిల్పి•పడఁతు లెల్ల

తే. నాణిముత్తెపుమంగళ•హారతులను, జేసి యర్చించి రాయతి•శేఖరునకుఁ
బురుష లొనరించి రర్ఘ్యాది•పూజ లనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. సూర్యచంద్రుల మించి•జొత్తిల్లుమేడల, దివ్యనానారత్న•దీప్తు లెల్ల
శకలీకృతము లైన•జలదములను గ్రమ్మ, నసమయసంధ్యోద•యము ఘటిల్ల
మహితమహానీల•మణిమయభిత్తుల, కాంతులఁ గటికిచీఁ•కటి వహింప
శరకోపమునిదివ్య•సవితృమండలమహా, కాంతివిభ్రాంతులఁ•గడకుఁ జిమ్మ

తే. నట్టికురుకాపురంబున•యతివరుండు, వీధు లన్ని కటాక్షించి•వేడ్క రెండు
శుద్ధకాంచనరథములఁ•జూచె ననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. వేల్పుల కిర వైన•విష్ణుపదిని దలఁ, దాల్చితి నని మేరు•ధరణిధరము
కమఠరాజుకు వెన్ను•కండూతిఁ బాపుచుఁ, దత్పదాబ్జంబులఁ•దల ధరించి
యమృతరమాదిజ•న్మాదికారణ మైతి, నని మందరాద్రియు•నతిశయమున
నహమహమికఁ బోరి•నాదినాథునికడ, ధర్మాసనముఁ జెంది•తరల కిట్లు

తే. రెండురథములు గా నిల్చి•యుండునొక్కొ
యని మనంబునఁ దలఁచుచు•యతివరేణ్యుఁ
డాదినాథునికోవెల•కరిగె ననుచు
వాదిభీకరగురుఁ డనె•మోద మలర. 22

సీ. కోవెలచుట్టును•గొమ రొప్పఁ జల బాల, కల్పవృక్షాగ్రశా•ఖల వసించి
వకుళభూషణ దయా•వారిధే దాసోస్మి, యని పల్కుచిలుకల•యమృతసూక్తు

ల ట్లతిమధురస్వ॥రాంచితకలకంఠ, కాలకంఠంబుల॥కలరవములఁ
గురుకాపురీశుని॥గురుకీర్తిగాయకు, లనఁ జాలుతుమ్మెద॥లారవముల

తే. నాలకించుచుఁ గల్పద్రు॥మాళి దాఁటి, యాదినాథునిదివ్యాల॥యంబుఁ జూచి
సంయమీశ్వరుఁ డంజలి॥నలిపె ననుచు, వాదిభీకరగురుఁడనె॥మోదమలర.

సీ. కటికిచీఁకటివెన్కఁ॥గదిసి బాధించును, ముంగిట మణిభూమి॥ముట్టరాదు
తలను విష్వక్సేన॥ధనదాదిగృహములు, సిరిమది కేమి వ॥చింప దనుచుఁ
దలఁచి లోకాలోక॥ధరణీధ రేంద్ర మి, ట్లాదినాథునిగుడి॥కర్హ మైన
ప్రాకార మయ్యె వి॥ష్వక్సేనుఁ డిం దుండెఁ, బక్షిరాజాకృతి॥వరము లిడుచు

తే. గోపతులునలువురు నాల్గు॥గోపురంబు, లయిరి సుఖపడ నిది ధ్రువ॥మర్హ మనుచు
యతికులాగ్రణి కోవెల॥కరిగెననుచు, వాదిభీకరగురుఁడనె॥మోదమలర.

సీ. వైకుంఠమునఁ దిల్ల॥వాసుదేవుఁడు దివ్య, సింహాసనంబందుఁ॥జెన్ను మీఱ
సిరితో సుఖాసనా॥సీనుఁ డై వెలుఁగొంద, రక్కసుఁ డొక్కరుఁ॥డుక్కుమిగిలి
శరనాముఁ దేతేరఁ॥జయ్యన వానిపై, హరియును బాదుక॥లనుప నపుడె
యాపాదుకాద్వయ॥మారక్కసునిఁ గూల్చి, శరకోప మనియెడి॥సంజ్ఞఁ జెంది

తే. హరిపరవ్యూహవిభవార్చ॥లందు నిలిచె, నట్టిశ్రీశరకోపంబు॥నఖిలగురున
కాదినాథుండు కృప నెదు॥రనిపె ననుచు, వాదిభీకరగురుఁడనె॥మోదమలర.

సీ. శ్రీహరిపాదుకా॥శ్రీమూర్తి గనుకను, శరమారుతజయంబు॥సలుపుకతన
శరకోపముని యని॥చక్కనితిరునామ, మొందె నేసూరి యీ॥యుర్వియందు
నానమ్మయాళ్వారు॥లాత్మచిత్తమునముం, దేమహాత్ముని, జూచె॥నింపుమీఱ
నమ్మహాత్మునకు రా॥మానుజాచార్యున, కట్టిశ్రీశరకోప॥మాత్మపాదు

తే. కాంశజాతము నఖిలవా॥ద్యములు మొరయ
ఛత్రచామరవాద్యఘో॥షములతోడ
నాదినాయకుఁ డెదురు గా॥ననిపె ననుచు
వాదిభీకరగురుఁ డనె॥మోదమలర.



సీ. గోపురాంగణమణి॥కుట్టిమభూమిని, మాన్యులు ముందఱ॥మధురకవుల
గాథల భక్తితోఁ॥గర మనుసంధింప, నుపనిషత్తుల నార్యు॥లూఁద వెనుక
స్వామి లిర్వంకలఁ॥జామరంబుల వీవ, ఛత్రముల్ ధరియింప॥సత్త్వనిధులు
మొగి వేత్రపాణులు॥మ్రోయ హెచ్చరి కని, యగ్రభూమిని వేశ్య॥లాడుచుండ

తే. వేణువీణాదిరవములు•విస్తరింప, నిట్లు చూపడుశఠకోప•మెలమిఁ జూచి
యతికులాగ్రణి సన్నిధి • కరిగెననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. భాష్యకారగురుండు•వరభక్తి సాష్టాంగ, దండప్రణామముల్•తగ నొనర్చి
నతనియంతేవాసు•లంద ఱామాడ్కిన, బ్రణమిల్లి పంక్తులై•భక్తి నిలువ
శ్రీమదర్చకుఁ డంత,శ్రీశఠకోపంబు, శ్రీలక్ష్మణార్యుల•శిరమునందుఁ
గుడిభుజమున నుంచి•కూరనాథాదుల, కట్లొసంగిన వారు•హర్ష మొంది

తే. యనుగృహీతోస్మిధన్యోస్మి•యనుచుబల్కి, యగ్రమందునశఠకోప•మరుగవెనుక
యతిశిఖామణి వెనువెంట•నరిగెననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. శ్రీశఠకోపంబు,శ్రీహరికడ కేఁగ, వెనుక యతీంద్రుఁడు•వేడ్కఁ జనుచు
గోపురద్వారంబు•కొమరొప్పఁగా దాఁటి, కోవెల వలగొని•గురునితోడ
నాంతరాళిక మొంది•యాదినాథునిఁ జూచి, యాపాదమస్తక•మనుభవించి
భట్టనాథాదిక•బహుసూరిసూక్తుల, సన్నుతించుచుఁ దత్ప్రి•సాద మొంది

తే. మహితశఠకోపతీర్థని•ర్మాల్యములను, జెంది కేలోడ్చి వీడ్కొని•శ్రీశరారి
మందిరంబున కేఁగెన•మ్మాన్యుఁ డనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. తామ్రపర్ణీనదీ•తటమున మేలైన, పసిఁడిసోపానంపు•బంక్త నొప్పు
స్థిరశంఖశుక్త్యాది•తీర్థఘట్టంబందు, నార్యులు దఱు శేషుఁ•డనుచుఁ బొగడ
నర్హమై దీర్ఘశా•ఖాంచిత మై దివ్య, దవళరత్నాఢ్యవి•తర్దియందు
సుదృఢరూఢనుమూల•శోభిమహాస్కంధ, బంధురము విచిత్ర•పక్షిరవము

తే. చంద్ర సూర్యావతంసము•శాశ్వతంబు, శర్మదము తింత్రిణీవృక్ష•సార్వభౌమ
మఖిలచేతనరక్షకై•యలరుననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర,

సీ. అతింత్రిణీమూల•మందు నంబరచుంబి, మణిమయదివ్యవి•మానమందు
నజ్ఞానతిమిరౌఘ•మంతయు నుడుగార, జ్ఞానప్రదీపంబు•జనుల కలర
సూర్యమండలమందు•జొత్తిల్లుహరిగతి, దివ్యపీఠంబునఁ•దేజరిల్లు
వకుళభూషణునిఁ బ్ర•పన్నకూటస్థుని, శ్రీపరాంకుశుఁ జూచి•చేర్వఁజెంది

తే. యాత్మజీవాతు వగుతత్ప•దాబ్జయుగము, మస్తకంబునధరియించి•మధురకవులు
సూక్తివినుతింప లక్ష్మణ•సూరియనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. అమాడ్కి వినుతించు•యతికులచంద్రుని, నఖిమతశిష్యుని•నంఘ్రిగతునిఁ
గరుణాకటాక్షవీ•క్షణసుధఁ జిల్కుచుఁ, దనదివ్యమంగళ•తనువుఁ జూపి

మహనీయచరిత నీ॰మహిమముకత నుర్వి, శ్రీవైవసమృద్ధిఁ॰జెందు ననుచు
నతిమృదుమధురోక్తు॰లాదరించుచుఁ బల్కి, బహుమతు లొసరించి॰పంచినంత

తే. నచటనుండి యతీంద్రుఁ॰డయ్యాలయంబు, వెడలి చని కనె నొకతిరు॰వీథి నుండు
ఖేలదాలోలబాలికా ॰ జాల మనుచు, వాదిభీకరగురుఁడనె॰మోదమలర.

సీ. హెచ్చరించుచుఁబంక్తు॰లేర్పరించుచుస్వర్ణ, వేత్రపాణులుముందు॰వెడలుచుండ
నిరుగెలంకుల యతు॰లేడునూ ర్గొరారు, వేలయేకాంగు లా॰వెనుక నడవఁ
బిదప డెబ్బదినాల్గు॰పీఠస్థులును గొల్వ, నందఱినడుమ న॰య్యతివిభుండు
జిక్కులలో నిండు॰రేఁడుపోలిక, నంశుసాహస్రమం॰దర్కునట్లు

తే. సూరులందునుహరిమాడ్కి ॰ సొపగుమిగిలి, కదిసిరాఁజూచికదలియ॰క్కన్యలరుగ
నొక్కకన్నియ కదలక॰యుండెననుచు, వాదిభీకరగురుఁడనె॰మోదమలర.

సీ పసిఁడిసలాకయో॰బంగారుబొమ్మయో, యనఁ జాలుకన్నియ॰నచటఁ జూచి
గురుఁడు తిరుప్పుళిం॰గుడి యెంతదూరము, గల దని యడుగ న॰క్కన్నెయపుడు
తిరువాయమొళినీకు॰దృఢముగా వచ్చునా, రాదా యనుచు భిక్షు॰రాజునడుగ
తిరువాయిమొళివాగ్వి॰ధేయమైనను శ్రీపు, ళింగు డింతని మాకె॰ఱుంగు పెట్టు

తే. లనుచు నప్పిన్నపాపకు॰యతివరేణ్యుఁ, డానతిచ్చిన నది విని॰యగ్గురునకుఁ
బలికె నిట్లని మరలి య॰బ్బాల యనుచు, వాదిభీకరగురుఁడనె॰మోదమలర

సీ. తిరువాయిమొళియందుఁ॰దిర మగుతొమ్మిదౌ, పదిని రెండవతిరు॰వాయిమొళి
కొడువిన్నై ప్పడగ ళ॰కొనపదోపాటలోఁ, గూవుదలిత్యాది॰కొనపదములఁ
గోరి తిరుప్పుళిం॰గుడి కూఁతపెట్టుమా, రం బని తెలియంగ॰రాదొ యిచటి
కని పల్కునక్కన్ని॰యను జూచి హర్షించి, యాళ్వారికృప నిందు॰నర్భకులకు

తే. నైన నాలాయిరప్రబం॰ధాదికములు, పార మగుఁ గాన సూరుల॰పగిది వీరిఁ
దలఁపఁ దగు నని యతిరాజు॰పలికెననుచు, వాదిభీకరగురుఁడనె॰మోదమలర.

సీ. కరుణతో నక్కన్య॰కావతంసము నెత్తు, కొని మస్తకంబు మూ॰ర్కొని పవిత్ర
వాణిపల్లవముచేఁ॰బలుమాఱు చుబుకంబుఁ దడవిచెక్కులదువ్వి॰దయను గురుల
సవరించుమఁ దదీయ॰సదనంబునకు నేఁగి యక్కన్యతలిదండ్రు ॰లతులభక్తి
మ్రొక్కి పూజింప స॰మ్మోదించి వారిఁ బ, రిగ్రహించి కరం బ॰నుగ్రహించి

తే. మీరు సూరిసమానులు॰మీకుమాకు, నొక్కసంబంధమేర్పడ ॰ నుచితమనుచుఁ
బలికె యతిపతి యాగృహ॰భర్తకనుచు, వాదిభీకరగురుఁడనె॰మోదమలర.

సీ. అక్కన్నియకుఁ దండ్రి•యైన మహాత్ముండు. పలికెనిట్లని యతి•పతికి మరలి
తలఁచినకార్య మీ•దాసునకు విధింపఁ, దగు నన విని యా త్రి•దండపాణి
యొప్పుతిరుక్కురు•హూర్పిరాన్పిళ్ళాను, కిక్కన్నియ నొసంగు • మితఁడు మాకు
నభిమానపుత్రకుఁ • డని విధించిన విని, యక్కన్నెతండ్రియు • న ట్లొనర్చి

తే. బాంధవులతోడ నానంద•భరితుడయ్యె. నతనివీడ్కొల్పి యతినాథుఁ • డప్పురంబు
విడిచి పరిజనులనుగూడి , వెడలెననుచు. వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. కోరి తిరుక్కురుం • గుడికేఁగి యద్దివ్య. దేశవాసులు తన•దెస కెదురుగ
వచ్చి సంభావింప , వారితో మొదలిటి.వారితో నప్పురీ•వరముఁ జొచ్చి
తద్రత్నగోపుర • తపనీయమయసాల, గంభీరపరిఖా వి•జృంభణముల
నభ్రంకషాదభ్ర • శుభ్రవిభ్రాజితో.త్సవ సప్తభూమికా , భవనములను

తే. సంతతాలంకృతద్వార•చత్వరముల, మంగళామ్నాయఘోషవ•న్మంటపములఁ
గాంచి యతిరాజు మించి సు•ఖించె ననుచు. వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. స్వస్వరూపాభిజ్ఞ • సాత్త్వికజనపూర్ణ, మఖిలసమృద్ధుల • కాటపట్టు
భూలోకవైకుంఠ•పుర మిది గా కున్న, నీసిరు లిం దేల • వాసి కెక్కు
నని తల్చి యతినాథుఁ , డపు డా తిరుక్కురుం.గుడినంబికోవెల • గోపురంబుఁ
గనుఁగొని సాష్టాంగ • కలితప్రణాముఁ డై, పరభక్తి పెన్గ లో•పలికి వెడలి

తే. కూరపతిభాగినేయాది • గురులుగొల్వఁ, బ్రక్రమముఁజేసె గుడిఁడగ్ర•భాగమందు
వినుతి యొనరించి కాంచె నా•విష్ణు ననుచు. వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. నీలాద్రిపైఁ దోచు • బాలసూర్యునిగతిఁ, దలను గిరీటంబుఁ • దాల్చువానిఁ
జవిచాలఁ జిల్కెడు • చంద్రబింబముఁ బోలు, మొలకనవ్వులముద్దు• మోమువాని
వెండిబంగారంపు • విరులగుత్తులమాడ్కిఁ, గరములశంఖ చ•క్రములవాని
ముమ్మెఱుంగులకాలు•మొగులట్టు లిరుపార్శ్వ.ములబోర భార్యలు• మెలఁగువాని

తే. సాధుపుష్పితకల్ప వృ•క్షంబుకరణిఁ, గలిత సర్వవిభూషణాం•గంబువాని
నమ్మురారిని గాంచె న•య్యార్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఆపాదమస్తక • మతనియంగములకు, సద్భక్తి మంగళా•శాసనములఁ
గానించుచున్నంతఁ • గని యా తిరుక్కురుం.గుడినంబి పల్కెన•గ్గురున కిట్లు
లాత్మలఁ బ్రోవఁ బె•క్కవతరించితిఁ గాని, యొక్కాత్మనైనను • నొడియనైతిఁ
జేతను లందఱు , శిష్యులయిరి నీకు, దీనికి హేతువుఁ • దెల్పు మనిన

తే. నొక్క-మంత్రంబు మాకడ•నుండుకతన, నాశ్రయింతురు మమ్ముంద•అనుచుఁబల్కు-
దిరిగియాహరి పల్కె- న•గ్గురున కనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఆ మంత్ర మెఱిఁగింపు•పుని హరి యర్థింప. యతిరా జతని కిట్టు • లానతిచ్చె,
వినియెదురీతిని • వింటివా యది నీకు, వినిపించెదము గాని • వేఱు లే ద
టనినఁ గృతార్థోహ•మని పల్కి- యాహరి, స్వగురున కున్నతా•సన మొసంగి
యా మహోన్నతపీఠ•మం దాత్మదేశికుఁ. డున్నట్టు భావించి • యుర్వినుండి

తే, దివ్యచిత్రాసనంబునఁ • దేజరిల్లు, శ్రీ కురంగపురీపూర్ణ•శేషి కపుడు
మంత్రరత్న మొసంగె న•మ్మాన్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. శ్రీమత్కు-రంగపు•రీపూర్ణులకు మంత్ర•రత్నోపదేశము • రమణఁ జేసి
సర్వాపరాధపుం•జం క్షమస్వ ప్రభో, భక్తవత్సల యని • ప్రణుతి సలిపి
యతనిచేబహుమతి • యనుమతియునుజెంది,యా సంయమీశ్వరుఁ • డచటినుండి
జరగి తిర్వణ్పరి•శార మన్నిపతి, యట్ల తిర్వాట్టార • మనెడు దివ్య

తే. దేశములఁగాంచియ ద్దేవ•దేవునకును, మంగళాశాసనముఁ జేసి • రంగు మీఱఁ
దిరువనంతపురంబున • కరిగె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. శ్రీమదనంతపు•రీమతల్లికబైటి•తోఁటలో నెలకొన్న • తులసితరులు
పొన్నలు పొగడలు • సన్నగన్నేరులు, కరవీరములు కర్ణి•కారతరులు
కేతకీచందన • కృష్ణాగురుకదంబ, పాటలచాంపేయ • పనసతరులు
క్రముకేక్షు కదళికా•ఖర్జూరబదరులు, జాంబవసహకార • జంభలములు

తే, నారికేళాది ఫలపుష్ప • నగచయములు, శాలిసస్యాదులును జూచి • సర్వగురుఁడు
చోద్యమందుచు నప్పురిఁ•జొచ్చె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. కందమూలపశవ్య•ఘన నిర్ఝరోదక, దారుపుష్పఫలాది • దానములను
ఈగిరు లీతరు • లీస్థలవాసుల, కుపకారములు సల్పు • నూర్జితముగఁ
బద్మాకరంబు ల•పారగభీరోద•కా పూరితంబు లై•యఖిలసస్య
హేతువు లై తృప్తి•హేతువు లగు వీరి, కనుచు వర్ణించుచు • యతివరుండు

తే, స్నానపానాదియోగ్యకా•సారదివ్య• దీర్ఘికాపుష్కరిణ్యాది • తీర్థములను
జూచి పొగడుచు నప్పురిఁ•జొచ్చె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ప్రియునిఁ జెందెడువేడ్క•బిడ్డలపైఁ బ్రేమ•మదిఁబెన్గ నాహరి•మహిషి యిచటఁ
గదలకయుండినఁ • గవి దుగ్ధజలధియుఁ, దనముద్దు పట్టికై • తరలి వచ్చి

తప్తజాంబూనదో•దార నానావిధ, రత్నసంకలిత మై • రమణఁ జెంది
మిన్నుల వ్రాయుచు • సన్నుతజనులకుఁ గోరిక లిచ్చునీ • కోటచుట్టు

తే. నిట్లు వసియించెనో యని • యెంచఁదగిన, పద్మసౌరభగంభీర • పరిఖ గురుఁడు
చూచి పొగడుచు నప్పురి • జొచ్చెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. నాల్గుగోపురములు • నాఁగు మకుటముల్, నాల్గుద్వారంబులు • నలుమొగములు
గల్గి యీసాలమై • కమలజుఁ డేశేష,శాయిని గన నెడఁ•బాయ కిచట
నుండెనో యనిమది•నూహించుచును మణి,ప్రాకార మదిదాఁటి • పరమపదముఁ
బోలినయప్పురి•భూరిసంపద లన్ని, యతిశేఖరుఁడు స్వకీ•యాశ్రితులను

తే, గూడి కోవెల కరుగుచుఁ • గోరిచూచి, యున్నగతిఁ బొగడువిధముల•నుగ్గడింతు
ననుచు మద్భావపీఠిపై• నలరుమన్న, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. కులగిరు లన్నియుఁ•గూడి మంత్ర మొనర్చి, హేమాచలజిగీష • నిచటఁ జెంది
యీ యనంతశయాను • నీశు నారాధించి, బంగరుమేడలై • పరిఢవిల్లి
యాత్మజాలాఢ్యయా•తాయాతవత్సౌర్య, చంద్రతచేఁ దదు•చ్ఛ్రియమాత్మ
సుమనోనిలయతఁ ద•త్సుమనోనిలయతను, దమరత్నమయతఁ ద•ద్రత్నతటత

తే. మించి మేరువు నిట్లు జ•యించి విష్ణు,దాసవాసములై యుండెఁ•దథ్య మనుచు
గురుఁడు పలుకుచుఁగోవెల•కరిగెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర

సీ. బ్రాహ్మణు లిచ్చోట•భగవదారాధన, రూపవైదికకర్మ•రూఢమతులు
రాజన్యు లార్వ ర•రాతుల గెల్చియు, సాధువిరోధులఁ•జంపువారు
వైశ్యు లనన్యప్ర•పన్నులు విహితవా,ణిజ్యాదిసంభృత•నిఖిలధనులు
శూద్రు లిమ్మువ్వర•కద్రోహవైష్ణవ.దాసుల కశ్రాంత్ర•దాస్యరతులు

తే. శ్రీ లనంతశయానుని•సేవఁజేసి, భాగ్యవతు లౌదురనుచు•భాష్యకర్త
యాన తిచ్చుచుఁ గోవెల•కరిగె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. వృత్రాసురుఁడు మ్రింగె•వృషతోడనెద్దాని,సైంహికేయుఁడు పూర్ణ•చంద్రునట్లు
మేఘనాదుఁడు పోర•మేటియై యెద్దాని,దంతముల్ పెకలించి•తండ్రి కిచ్చె
నాయభ్రమాతంగ•మస్మత్సమానమా, యనిధిక్కరి.చుచు•హరిమహోత్స
వాంగము లీషష్టి•హాయనమత్తమా•తంగపుంగవము లు•త్తుంగతనువు

తే. లీయనంతశయాను ర•మేశుఁగొలిచి,యతిశయముఁజెందుని ట్లని•యతివరేణ్యుఁ
డాన తిచ్చుచుఁ గోవెల•కరిగె ననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర. 50

సీ. ఉచ్చైశ్శ్రవము తొల్లి•యుగ్రాహవక్షోణి, నింద్రపరాభవం•బేర్పరించె
నామానసో త్తర•మాధారముగఁ జె౽ది మేరువు వలగొను•సురహరులు
గరుడమారుతమనో•ఘనజవాతిగములు, సర్వకల్యాణల•క్షణయుతములు
నీతురంగంబులం•దీ శేషశాయిసే,వకవాహనంబు ల•వ్యాహతంబు

తే. ల ట్లనాధారధౌరిత•కాదిగతుల, సర్వలోకైకచారము•సల్పు ననుచు
గురుఁడు పలుకుచుఁగోవెల•కరిగెననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. గోలోకమందున్న•గోవు లన్నియుఁ గూడి,శ్రీకాంతునకుఁ బ్రీతిఁ•జేయఁదలఁచి
యేకాంతభక్తితో•నిచ్చట వసియించి, యెల్లప్పు డీజగ•దీశ్వరునకు
వెన్నలుజున్నులుఁ • బెరుఁగుమీఁగడలును, హైయంగవీనముఁలాజ్యములును
జుఱ్ఱుఁబాయసములు•జోర్కుదధ్యన్నము, లీభోగ్యవస్తువు•లేర్పరింపఁ

తే. బాలు మేలుగఁబితికెడు•పసులభక్తి, నహహ యెంతనిపొగడుదు•ననియతీంద్రుఁ
డాన తిచ్చుచుఁ గోవెల•కరిగె ననుచు,వాదిభీకరగురుఁ డనె•మోదమలర, 52

సీ. ప్రాసాదజాలని•ర్గతధూపధూమముల్, హోమధూమచ్ఛట•లొఱసి నెరపి
నీలమేఘములీల•నింగిఁ గన్పింప సౌ,ధాగ్రకాంతులు శంప•లట్లు మెఱయ
విపణివితర్దికా•వివిధరత్నప్రభా,చ్ఛట యింద్రచాపంబు•సరణి నొప్ప
సకలవాద్యధ్వనుల్• స్తనితముల ట్లుండ, వర్షాగమభ్రాంతి•బర్హికులము

తే. భూరికేకారవంబుతోఁ•బురులు విచ్చి, యాడునెప్పుడు నిప్పురి•నాశ్రయించి
భక్తు లివి యని యతిరాజు•పలికె ననుచు,వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. భళి న దైవం కేశ•వాత్పర మని కీర,శారిక లిప్పురిఁ•జదువు చుండ
మఱియు సర్వం విష్ణు•మయ మని పలుకును, దాసోస్మి యనిపల్కు•దాసులఁగని
విద్రుమసోపాన•విలసితదీర్ఘికా,పుష్కరిణీస్ఫుర•త్పుష్కరాళు
లం దుల్లసద్రాజ•హంసకారండవ,చక్రవాకక్రౌంచ•సారసాళు

తే. లన్ని యీ శేషతల్పశ•యాంఘ్రిపద్మ,ముల భజింప వసించిన•మునివరేణ్యు
లని వసించుచు నరిగెన•య్యార్యుఁడనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ, పటికంపుఁజలుపులఁ•బఱ సమంబుగా, రచియించినట్టియా•రాజవీధి
క్రోవ కిర్వంకల•దొడ్డమేడలపంచ, వజ్రవితర్దికా•వళులయందుఁ
ద త్తరంగస్ఫుర•ద్ధవళోర్ధ్వపుండ్రులు, తులసిపద్మాక్షస•ద్వలయధరులు
వైష్ణవుల్ గొంద ఱీ•ఫణిరాజశాయిస,త్కల్యాణకథా•కలనములను

తే. బ్రొద్దుపుచ్చుచునుందు ర•హఃప్రాంత•బొలుచు,నారికేళంపుమ్రాఁకుల•నడుమననుచు
గురుఁడు పలుకుచుఁ గోవెల•కరిగెననుచు, వాదిభీకరగురుఁడనె మోదమలర.

సీ. నీలంపుగోడల•నిగ్గుల నొకవంకఁ, జీకట్లు గ్రమ్మి చీ•కాకుపఱుప
మఱువంక భిత్తుల,మలచినవజ్రంపుఁ,బలకలతళుకు లా•బెళుకు లగుచ
మేడలఁ గీల్కొన్న•మేలిరత్నంబుల,ఛాయ లాకాలిక•సంధ్య లీన
నీసందియము లన్ని•యెంబెరుమానారు, తనమేనికాంతులఁ•దఱచి యడఁచి

తే. రాజవీథులఁ జని చని•రంగు మీఱ, నొక్కచోటఁగటాక్షించె•నున్నతంపు
రత్నమయతప్తకాంచన•రథము ననుచు, వాదిభీకరగురుఁడనె,మోదమలర. 56

సీ. మణిమయకూబర•మహితంబు షోడశ,చామీకరవికార•చక్రయుతము
స్వర్ణాంతరాళికా•చ్ఛాదనఫలకంబు, కాంచనాసనపద్మ•కర్ణికంబు
మరకతస్తంభ•స్థిరగుంభితంబును, మేరుమందరశోభి•మహిరసమము
మణిఘంటికాశత•మధురధ్వనియుతంబు, హాటకమయశిఖ•రాంచితంబు

తే. శ్రీకరోన్నచిత్రప•తాక నిచయ, మశ్వసూతసమన్విత•మతివిచిత్ర
మట్టిరథముఁగటాక్షించె•నార్యుఁడనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. పసిఁడిగుబ్బలిమీఁదిబాలార్కబింబముఁ, బోలగ్రకలశము•మోము గాఁగఁ
జలఘంటికాస్వాన,ఝుకృతియుతపతా,కాశ్రేణు లాత్మప•క్షములు గాఁగఁ
బ్రాలంబమౌక్తిక•బహుపుష్పమయదామ,సర్వహారాదిభూ•షణము లమరఁ
దార్ష్యుఁ డీరథరూపధారియై యీశేష,శాయికోవెలకడ•సతత ముండు

తే. నని తలంచెద నని మ్రొక్కి•యాత్మశిష్య
వరులతో గోపురముఁ జెంది,గురుఁడు మ్రొక్కి
చోద్యపడుచును గోవెలఁ•జొచ్చెననుచు
వాదిభీకరగురుఁ డనె,మోదమలర. 58

సీ. రావణాదుల గెల్చి • రాముఁడీస్థలియందు, స్థాపించు పృథుజయ• స్తంభమొక్కొ
రసనుండి వెల్వడు • రత్నాంశుయుగ్దంష్ట్ర, తారకవారాహ•దంష్ట్ర మొక్కొ
భక్తులు వైకుంఠ•పద మొందఁగట్టిన, బంగారుసోపాన • పంక్తియొక్కొ
యని జను లూహింప • నర్హమౌ మణిమయ, గారుడస్తంభంబు•కడను మ్రొక్కి

తే, కూరనాథారిగురులతోఁ•గోవెలకును, బ్రక్రమముఁజేయుచును జూచె•బద్మనాభ
మందిరశ్రీల నాజగ•న్మాన్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఆమ్నాయములు గొంద•ఱావృత్తి సలుపుచు, నొకచోటసేవించి • రుడయవరుల
నన్యులు నామస•హస్రంబుఁ జదువుచు, భజియించి రొక్కెడఁ • బరమగురుని
శ్రీపుష్పకైంకర్య•సిద్ధు లొక్కెడఁజూచి, యలరుచుమ్రొక్కి రా•యతివిభునకు
శారిక లొకచోట • శౌరినామంబులఁ, జదువుచుఁ గనియె నా • సత్త్వనిధిని
తే. నంద ఱిట్లు భజింప నా•యార్యుఋషభుఁ, డమ్మురారి విమానాగ్ర•మందు వెల్గు
కనకమయరత్నశిఖరముఁ • గాంచెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. వాచ్య మీబ్రహ్మము • వాచక మగువేద, మీవిమానము జ్ఞాన • మీశిఖరము
నన్యోన్యసంబంధు • లగుమూఁడువస్తువు, లిచ్చోట నెలకొన్న • విట్ల ధ్రువము
లని పల్కి బోధమ•యప్రదీపం బనఁ, జాలువిమానాగ్ర•సక్తశిఖర
మావిమానమువెన్క • నతిభక్తి సేవించి, బలిపీఠము భజించి • ప్రణతి సల్పి
తే. గారుడపుఁ బచ్చచలువల • గదిపినట్టి, భవనమందు వసించు సు•పర్ణుఁ జూచి
స్వామికడకేఁగె నయ్యతి•స్వామి యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. శారదపూర్ణిమా • చంద్రమస్సాహస్ర, ముదయించెనా మింట • నొక్కసారి
వర్ణింపవచ్చు నె•వ్వనిమేనితో సాటి, యట్టియనంతుని • యతులభోగ
శయ్యపైఁ బవళించు • చక్కనివేల్పుల, రాయని రజతాద్రి • రమ్యశిఖరి
సంసక్తవార్షిక • జలదమాలికభంగి, మూఁడువాకిళ్ళ స•మ్మోద మొదవఁ
తే. జూచి యాదేవదేవుని • సుందరాంగ,ములను దివ్యవిభూషణ•ముల వరాయు
ధములఁ గనుఁగొనె నమ్మహో•దారుఁ డనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. మహితమహానీల•మయనగాగ్రస్థిత, లలితబాలార్క మం•డలముపగిది
నూహింపఁదగిన స•ర్వోత్కృష్టరత్న సం•ఘటితకిరీటంబు • గల్గుశిరము
నసితాభ్రమధ్యస్థి•తాష్టమీచంద్రాభ, కుటిలాలకావృత•నిటలతటముఁ
దత్షణోన్మీలితాం•తఃస్థభ్రిమరదివ్య, పుండరీకములను • బోలుకనుల
తే. నవ్యకాంచన కళికాభ•నాసికయును, నీలమణిదర్పణాభక•పోలములను
నుడయవరు గాంచి సంతస•మొందె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. కుసుమబాణునివింటి•కొనలను నగఁజాలు, కమనీయమగుకన్ను•బొమలదోయి
శ్రీకారములఁ బోలు • చెవులను ద్రేలెడు, మకరకుండలముల•మణిమయములఁ
జంద్రబింబామృత•ఝరి యనఁ జాలెడు, ముద్దుమోమునఁబొల్చు•మొలకనవ్వు
బింబవిద్రుమముల • బింబిండిపఱచి కా•ఱడవిపాలికిఁ బంచు•నధరపుటిని

తే. దక్షిణావర్తశంఖసుం•దరము గళము, శంఖచక్రాంచితోన్నతాం•సద్వయంబు
గూఢజత్రులఁ గనియె న•క్రోధుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. సుందరసుకుమార•సుభగసువృత్తము, లిందిరాలింగనా•నందములును
మరకతపరిఘోప•మానంబులును దివ్య•సౌరభ చందన•చర్చితములుఁ
గమనీయనవరత్న•ఖచితతప్తసువర్ణ, భూరికేయూరాది•భూషితములుఁ
బంచాయుధగ్రహ•ణాంచితస్థలపద్మ. గర్భచారుద్యుతి • కరతలములు

తే. పుష్పపల్లవకోశాది•భూషితోరు, కల్పతరుశాఖలను బోలు•ఘనభుజములు
భాష్యకర్త భజించెనా • పగిది ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. గ్రైవేయమౌక్తిక • కలితహారావళుల్, తారావళులసొంపు • తగ్గుపఱుపఁ
జలవైజయంతికా • తులసీసుగంధము, సాధుబృందములకుఁ • జవులు దెలుప
నప్పారసన్మనో•హారి కౌస్తుభరత్న•దీప్తి తాపత్రయ•తిమిర మడఁప
శ్రీవత్సచిహ్నము•చెంత లక్ష్మీదేవి, మంగళాభరణంబు • మాడ్కి వెలయ

తే. హేమరాజితచిత్రవ•దింద్రనీల, శకలకలితకవాట వ•క్షస్స్థలంబుఁ
గాంచి యతిపతి మించి సు•ఖించె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఆరీతి నూర్ధ్వావ•యవములఁ గనుఁగొని, మధ్యమద్వారంపు • మార్గమునను
లోపలి కేఁగి యా•శ్రీపతిజగదేక•పావన మగుదివ్య•పార్శ్వయుగము
నిఖిలజగజ్జాల • నిత్యశుభావాస, కోమలవిలసిత • కుక్షితలము
శుభగభీరావర్త • సుందరవిశ్వసృ•డ్జననకారణనాభి • జలరుహంబుఁ

తే. గనకకాంచీగుణావృత • కటితటంబు, భవ్యరత్నమయోదర • బంధనంబుఁ
గాంచి యతిపతి మించి సు•ఖించె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. పీతాంబరావృత • పృథుజఘననితంబ, రాజరంభాది పీ•రాజదూరు
లను జూచి యానంద•ఘనచిత్తుఁ డైమ్రొక్కి, యంతిమద్వారము • ననుసరించి
వచ్చి లోఁ జొచ్చి యా•పద్మనాభుని మహా•నీలికాహాళములఁ • బోలువర్తు
లానుపూర్వులజంఘ • లతిమనోహరజాను, శింజానమంజుమం•జీరములను

తే. భవ్యకమఠోన్నతోజ్జ్వల • ప్రపదములను, స్థలసరోరుహరక్తాంఘ్రి • తలహలాది
సుభగరేఖల యతిపతి • చూచె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. భువనము లన్నియుఁ • బొరిఁ బవిత్రములుఁ గాఁ, జేసెదనని గంగ•వాసిఁ దేఁచి
పద్మనాభునిపాద • పద్మసర్వాంగుళీ, స్వచ్ఛనఖప్రభా•చ్ఛలముఁ దాల్చి

బహూముఖములనిట్లు, ప్రవహించుచున్నదో, యనఁదగు నఖకాంతు, లమరఁజూచి
యాదేవదేవుని, యాహ్లాదమయదివ్య, మంగళమూర్తిని, మదిని నిలిపి

**తే.** శ్రీపరాంకుశమునిగతి, నాపురాణ,పురుష శేషశయానునిఁ, బొగడి యతని
యాజ్ఞఁదలఁదాల్చిమరలె నఁ,య్యార్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర.

కవిరాజవిరాజితవృత్తము. సులలితబాలదివాకర విగ్రహ, శోభితదీనదయాజలధీ
కలమృదుభాషణ కంజదళేక్షణ, కామితకల్పక కల్పయశా
జలరుహబీజస మంచితవలయవి, శాలభుజాంతర సత్త్వనిధీ
విలసదనుగ్రహ విబుధపరిగ్రహ, విష్ణుపరత్వసమిద్ధమతీ. 70

క, శ్రీమదనంతపురీమణి,ధామగతానంతభోగ, తల్పశయ శ్రీ
కాముకహరిపదకమల, ప్రేమాతిశయా యతీంద్ర, పృథుగుణసాంద్రా. 71

మాలినీవృత్తము పరమశుభచరిత్రా, పాపవల్లిలవిత్రా
స్ఫురితగుణనివేశా, ప్రోల్లసద్దివ్యదేశా
పరిచరదనవద్యా, పాలితబ్రహ్మవిద్యా
భరిత భవవిరక్తా, బ్రహ్మసూత్రార్థవక్తా 72

గద్యము ఇది శ్రీ భగవద్రామానుజ కరుణాకటాక్ష కలిత కవితావైభవ పరవాది భయంకరాచార్యాభిమతచ్ఛాత్రాప స్తంబసూత్ర కణ్వసగోత్ర పవిత్రోభయకవిమిత్ర వేంకటకృష్ణార్యపుత్ర విబుధవైష్ణవవిధేయ కేశవనామధేయ ప్రణీతంబైన యాచార్యసూక్తిముక్తావళి యను మహాప్రబంధంబునందు మధ్యమభాగంబున దిగ్విజయార్థంబుగా యతీంద్రులు ప్రార్థించుటయు నా సంయమీంద్రుండు శ్రీరంగ రాజాజ్ఞచే శ్రీరంగధామంబు నుండి వెడలి తిరుకొ్కాడందయు నళగరితిరుమలయు దర్భశయనంబును దిరునగరియుఁ దిరుక్కురుంగుడియుఁ దిరువణ్బరిశారంబును దిరువాట్టారంబును దిరువనంతపురంబును జెంది యాయాస్థలంబుల శ్రీహరిని సేవించి మంగళాశాసనంబుఁ జేసి ప్రతివాదివిజయం బొనర్చుటయు నన్నది చతుర్థోల్లాసము.

—: o :—

శ్రీమతే రామానుజాయ నమః



# ఆచార్యసూక్తిముక్తావళి

## మధ్యమభాగము

---

### పంచమోల్లాసము

క. బలవత్ప్రమాణ తర్కో•జ్జ్వలకిరణసహస్రధూత•పరవాదిమహో
చ్ఛలవాదాంధతమిస్రా, సులలితరామానుజార్య•సూర్య మహాత్మా 1

వ. అవధరింపుము. 2

సీ. బాహ్యమంటపమందుఁ • బ్రతివాదులనుజూచి, బ్రహ్మతర్కములచే • భంగపఱిచి
కైంకర్యములు కొన్ని • గావింప నియమించి, యాశ్రితవర్గము • లనుసరింప
మఱియు నప్పురిఁ బాసి • మళయాళదివ్యదే•శములకు మంగళా•శాసనంబు
గావించి పాండురం•గక్షేత్రమందున, విఠ్ఠలేశ్వరుఁ గాంచి • వినుతి సల్పి

తే. రాజదుత్తర మధురాపు•రంబుఁ జెంది, బాలకృష్ణుని గనుఁగొని • ప్రణుతి సలిపి
యల్లవ్రేపల్లెకరిగె న•య్యార్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. రామకృష్ణులు ముందు • రంజిల్లి రెచ్చోట, గోపికాగోపగో•కులముతోడ
బృంద తపం బొందె•విధికృతి యద్రూప, మంది ముకుందుఁ డ•నందుఁ దాల్చె
నెందు గుల్మలతాదు•లం దొక్కటై పుట్టఁ, గోరె నుద్ధవుఁ డసం•కుచితభక్తి
నెచ్చోటఁ దడ వుండె • నిరవు చేసుక ముందు, శ్రీనాథమునిగురు•శేఖరుండు

తే. అట్టిబృందావనముఁ జెంది•యఖిలగురుఁడు, నందసూనునిఁ జూచి యా•నందమొంది
కనియెఁ బావనయమునోప•వనము ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. యమునాప్రవాహమం • దవగాహన మొనర్చి, కాళియహ్రదతట•కలితభవనుఁ
గాళియమర్దనుఁ • గమలాక్షు సేవించి, గోవర్ధనాలయు • గోపవేషుఁ
గనుఁగొని సాష్టాంగ•కలితప్రణాముఁడై, పొగడి శ్రీద్వారకా•పురముఁ జెంది
శ్రీప్రవర్షణగిరి•శిఖరముపై నుండి, కుప్పించి యుఱికిన • కుహకభయుల

తే. మాగధాహవవిముఖుల • మహితబలుల, రామకృష్ణుల లోకైక•రక్షకులను
గాంచి లక్ష్మణముని విను•తించె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. గోవిందనామక•పావనద్వాదశి, నెద్దాని నిశఁ గాంతు • రెల్లవారు
శ్రీరామకృష్ణులు • చేతనులను బ్రోవ, నెవ్వోట నెలకొని • రిపటికైన
నెద్దానిఁ దలఁచిన•నెట్టిపాతకు లైనఁ, బావను లగుదురు•పాప ముడిగి
పుర మెల్ల ముంచి యం•భోరాశి హరియాజ్ఞ, నెద్దాని ముంపలే•దిప్పటికిని

తే. దేవుదేవుఁడు నివసించె•దేనియందు, నట్టిద్వారవతీపుర•మమర హృదయ
దర్పణంబందుఁగనె నాత్రి•దండి యనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. పుడమిపొలంతుకఁ•బొల్పొందఁగాఁదన, కొనగొమ్ముపై ముస్త•కొలదిఁ దాల్చి
శ్వేతవరాహము•వెల్వడినబిలంబు, పుష్కరతీర్థమై•పుడమి వెలసె
నాపుష్కరాటవి•కరిగి యజ్ఞవరాహు, నర్చించి కని యయో•ధ్యాపురంబు
విశ్లేషభీతు లై•పివిధర్షు లర్థింప, నర్చాస్వరూపమై•యచట నున్న

తే. రాము సానుజు సీతాభి•రాము హనుమ, దాదిపరివృతు సరయూత•టాలయస్థుఁ
గాంచి వినుతించె శ్రీభాష్య•కర్తయనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర

సీ. అచటనుండి ప్రయాగ•కరిగి త్రివేణిని, స్నానపానాదుల•సత్కరించి
తీర్థీకరించి త•త్తీరనివాసుని, మాధవు వినుతించి•మఱియు గయకు
విచ్చేసి వటమును•విష్ణుపాదము గదా, ధరు భక్తిఁ గేల్మోడ్చి•తరలి వెడలి
వెడలు పామడ యంత•పౌడవుసాలగ్రామ, నగమును గండకీ•నదిని మఱియు

తే. స్థలజజలజభిదాభిన్న•సౌమ్యరామ, కృష్ణనృహరివరాహాది•విష్ణుదివ్య
మూర్తులను జూచెనాశేష•మూర్తి యనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమరల.

సీ. వైకుంఠపదమందు•వాసుదేవునిఁ జూచి, నైమిశాటవి రమా•నాథుఁ గాంచి
హరిని హరిద్వార•మందుఁ గన్నులఁ గని, కాశ్మీరదేశము•కడ సపాద
లక్షపర్వతము ల•లక్ష్యముగా దాఁటి, వెన్నముద్దలత్రోవ•వెంటఁ జనుచుఁ
దాలతమాలత•క్కోలహింతాలర, సాలసాఁకదంబ•సరళవకుళ

తే. చంపకాశోకపున్నాగ•చందనాది, క్రమఫలపుష్పపల్లవ•నమ్రశాఖ
శాఖులను జూచె సంయమి•స్వామియనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. క్షీరాబ్ధిపతిసితా•సితకేశములు రెండు, నిల నెవ్వరై జగ•మేలు చంద్రు
భరతవర్షంబందు•బహువర్షములనుండి, వసియించి రెవ్వ రీ•వసుధఁ బ్రోవఁ

దమయూరువునఁ బుట్టు•తరుణిచేతను రంభ, గర్వమడంచుని•ష్కాము లెవ్వ
రాజేసినెల లొక్క•రని నల్పుచు సహస్ర, కవచుని గెల్చి రే•ఘనులు ముందు

తే. నాపురాణమహర్షుల•కాదికవుల, కభిమతావాస మగుబద•ర్యాశ్రమేంద్ర
ముడయవరుచూచిసంతస•మొందె ననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. గురుశిష్యరూపముఁ•గొని(ప్రాణులకుఁదానె, తిరుమంత్ర మొసఁగెడి•గురుఁడితండు
వ్యాసపరాశర•హారితనారదముఖ, తత్త్వార్థసారబో•ధకుఁ డితండు
యమనియమాసనా•ద్యష్టాంగయోగహృ, త్పుండరీకధ్యేయ•పురుషుఁ డితఁడు
భారతవర్షైక•భాగధేయం బీతఁ, డాగమాంతోక్తుల•కర్థ మితఁడు

తే. కంటి మీతనిఁ గన్నుల•కలవుదీఅ, మంటి మీదొడ్డమేలుగై•కొంటి మనుచు
గురుశిఖామణి వొగడె నా•కొలఁది ననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. నయ మొప్ప నానర•నారాయణుల నిత్య, మర్చింపఁ గొందఱ•నాశ్రితులను
దీర్ఘప్రసాదప్ర•తి గ్రహోద్యర్హుల. శ్రీవైష్ణవుల నందుఁ•జెంద నిలిపి
యాహరిపాదోద•తాత్యష్టజలపూర్ణ కుండముఁ గనుఁగొని•గురువరుండు
వసుధార యనుసమీ•పగ్రామ మీక్షించి, దివ్యసరస్వతీ•తీరరమ్య

తే. కాశ్రమంబుఁ గటాక్షించి•యచటిఋషులు, తనదువైష్ణవధర్మసం•స్థాపనంబుఁ
గాంచిహర్షింప నచ్చటఁ•గదలె ననుచు, వాదిభీకరగురుఁడనే•మోదమలర. 12

సీ. అచటనుండి యతీంద్రుఁ•డరిగి లసద్భట్ట, మంటపోపవనాద్య•మహితలమునఁ
దనదాసులను నిల్పి•తాఁ దగువారితో, భారతీభండార•భవన మొంది
యాద్వారశాఖల•హస్తాబ్జముల నూని, తన కభిముఖి యొక•తరుణి నిల్వ
నతముఖుఁ డాయతి•పతి త్రోవ యిమ్మన్న, నతని కి ట్లని పల్కె•నాలతాంగి

తే. యొక్కశ్రుతి కర్థ మడిగెద•నున్నయట్లు, చెప్పఁ గలిగినఁద్రోవయి•చ్చెదను నీకు
సత్య మిది యని పల్కె•నా•సాధ్వియనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర,

సీ. ఆశ్రుతి యెయ్యది•యని యతఁ డడిగినఁ, దస్యయథేత్యాద్యు•దాఃవేద
ఘనవాక్యమందునఁ•గప్యాసశబ్దార్థ, పుండరీక పదార్థ•ములను రెండు
గూర్చి యొక్కటిఁ జేసి•గోవిందుకనులకు, సాటి వర్ణింపు వా•గ్దాటి మెఱయ
ననుచు యతీంద్రుని•కావధూమణి పల్కె, నందఱు వినుచుండ•యతివరుండు

తే. విమతగంభీరసూక్తుల•విస్తరించి, యాశ్రుతిప్రోతపదముల•కన్నిటికిని
స్థిరవిశిష్టార్థ మొక్కటి•చెప్పెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర

సీ. కమ్మన జలము లా•కమ్మలఁ దన దగు, కరములచేఁ గ్రోలు•కతన సూర్యుఁ
డాకపిపదమున•కర్థ మై చెల్లు న, ట్లాసశబ్దము వికా•సార్థపరమ
యది గాన శుభగభీ•రాంభస్సముద్భూత, పరిరూఢదృఢనాళ•బాలసూర్య
భానుసద్యస్స్ఫుట•త్పావనపుండరీ, కములఁ బోలెడువాలు•గన్నులమర
తే. నంతరాదిత్యవర్తికి•హరికి ననుచు, యతిశిఖామణి పల్కఁ నా•యతివ యతని
కతిముదంబున మరల ని•ట్లనియె ననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. భాష్యంబుఁ గనిపింప•వచ్చినవేళయం, దిశ్రుతివాక్యార్థ•మేనె యడుగఁ
గపిగుదములఁ బోలు•కన్నులు గలవాఁడు, కమలాక్షుఁడనుచు శం•కరుఁడుపల్కఁ
నదిసుత యింతవ•ట్టాత్మ నేఁ గ్రుంగెద, నీప్రొద్దు నాదుఃఖ•మెల్లఁ బాపె
నని పల్కఁ యానతి•యచటఁ గన్పడ కున్న, నంద అక్కజపడి•యాత్రిదండి
తే. నాధునకు భారతీశోక•నాశనుఁ డని, నామ మొనరించి రాయతి•నాయకుండు
శుభసరస్వతీనిలయముఁ•జొచ్చెననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర,

సీ. ఆభట్టమంటప•మందు సరస్వతీ, భండార మనురత్న•భవనమందు
నేదేవి నెలకొని•యిపటి కై నను దన, కరపల్లవమునందుఁ•గావ్య మునుప
దోషము లుండెనా•దూరము పడఁ జిమ్ముఁ, గృతి లెస్స యైన నం•గీకరించు
నట్టివాగ్దేవిని•యతిరాజు గనుఁగొని, శ్రీభాష్య మిచ్చినఁ•జేతఁ బూని
తే. తానె తలఁ దాల్చి యిచ్చి యీ•ధరణి మీరె
భాష్యకారులు మత్ప్రియ•భాష్య మిదియె
యని సరస్వతి పల్కె నా•ఘనున కనుచు
వాదిభీకరగురుఁ డనె•మోదమలర. 17

సీ. పంకజపద మిలఁ•బద్మమునకుఁబోలె, భాష్యకారపదంబు•భాషకతన
యౌగికరూఢ మై•యతిరాజునకుఁ జెల్లు, నది గాననే తదీ•యాశ్రితులకు
నామ మై చెల్లు నీ•భూమి నిప్పటికిని, మఱియు సరస్వతి•మదిని మెచ్చి
విమలహయగ్రీవ•విగ్రహం బొక్కటి, యతిపతి కిచ్చిన•నచటికుమతు
తే. లోర్వఁజాలక తర్కించి•యుడయవరుల, కోడి చని యాభిచారిక•హూతియొనర్చి
యష్టసాయకభుజకృత్య•ననిపి రనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. ప్రహ్లాదుఁ గని కృత్య•భగ్నయై చని తనుఁ, బంచుభార్గవులఁ గీ•డ్పఱిచినట్లు
శ్రీభాష్యకారుల•సేవించి యాకృత్య, తిరిగి యాద్విజులఁ గీ•డ్పఱుపఁ జనిన

వేయువిధంబుల•వెంగళు లై వారు, నగ్నులై భగ్నులై•నలఁకఁ జెందఁ
బడమిజేఁడదివిని•యుడయవరం(ఘులఁ, గని(మొక్కి(ప్రార్థింపఁ•గరుణ నతఁడు

**తే.** తనదు(శ్రీపాదతీర్థ మం•దఱికి వారి, కనుపఁ (గోలి సుఖించి య•య్యవనివిబుధు
లా(శ్రయించిరి యతిపతి•యడుగు లనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

**సీ.** ఆ(ప్రభావముఁ జూచి•యాధరి(త్రీవిభుం, డాయతిశేఖరు•నా(శ్రయించి
తనబలంబులతోడ•ధరణీసురులతోడఁ, దక్కినవారితోఁ•దగినభక్తి
నర్చించి యతిరాజు•నంపఁగాఁ దా వచ్చి, రెండు (ప్రయాణము•లుండి మరలి
గురుని వీడ్కొని తన•పురిఁ జెంద నగ్గురు, వరుఁడు వారాణసీ•పురముఁ జెంది

**తే.** దేవదేవుని(శ్రీపాద•తీర్థ మనుచు, గంగ నవగాహన మొనర్చి•కదలి వెడలి
(క్రమముగా నీలశైలముఁ•గాంచెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర

**సీ.** (శ్రీపురుషోత్తమ•క్షే(త్రరత్నమునందుఁ, దనయా(శ్రితుల నిల్పి•తగినచోటఁ
గోవెలమంటప•గోపుర(ప్రాకార, ములు పుష్పవనములు•పురపుసిరులు
తతమత్స్యకచ్ఛపేం•(ద్రద్యుమ్న జలధిమా, ర్కండేయరోహిణీ•కుండచ(క్ర
తీర్థములు మహాన•దీశ్వేతగంగలు, వటప(త్రశయకృష్ణు•వటము చ(క్ర

**తే.** ధరు జగన్నాథు (శ్రీసుభ•(ద్రాసహాయు, రాము నభిరాము నీలా(ద్రి•ధాముఁగాంచి
యతినభోమణి తనచోటి•కరిగెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

**సీ.** ఆరా(త్రి యతిపతి•యాస్థలవైభవ, మంతఁ దలంచి (ప్ర•హర్ష మొంది
(శ్రీపాంచరా(త్ర(ప్ర•సిద్ధవైష్ణవధర్మ, ముల నందు నెలకొల్పఁ•దలఁచినంత
నత్యంతపతితుల•నైనఁ బవి(త్రులఁ, గావింప బిరుదులు•గటినట్టి
యీమాయెదుట యుష్మ•దీప్సితధర్మము, లేవియు సరిపడ•విని నిజంబు

**తే.** గనుక మీరిటవచ్చుచే•ఘనతమాకు, సత్యమిదియని యాజగ•త్స్వామియిట్లు
భాష్యకారులకను(మోలఁ•బలికెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

**సీ.** ఏవిధంబున నైన•నిది దివ్యదేశముఁ, గావింప వలె నని•కదల కున్న
జన్మాంతరముల ని•జ(భాత యిపు డిల, జనకుఁ డార్యుఁడు మామ•సచివుఁడైన
యతిపతి నాహరి•యలగరుత్మంతుండు, తన్నుఁ దాల్చినగతిఁ•దగవహించి
(శ్రీకూర్మధామముఁ•జెందించి యాశ్వేత, కుండముకడ దించి•కూర్మరూపి

**తే.** నైనదను లింగ మని తల్చి•యబుధు లిచట, నర్చఁ జేసెదరీగాసి•నడఁపుమనుచుఁ
బలికి యంతర్హితుం డయ్యె•వరదుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. సత్యసంకల్పుండు•సర్వస్వతంత్రుఁ డౌ, నీజగన్నాయకుఁ•డింత•చేసె
నని యెంచి రామాను•జాచార్యుఁ డాశ్వేత, కుండములో దిగి•కాంచ మాడి
జల మూర్ధ్వపుండ్రంబు•సంజ్ఞగా ధరియించి, భగవదాజ్ఞావిధిఁ•బఱపి యచట
శ్రీపరాంకుశముని•చించక్రిందనుబోలెఁ, జందనద్రుచ్ఛాయ•యందుఁ జెంది

తే. కాంచెఁ గనుఁ్రమోలఁ గఱిమేని•కలిమివాని
సిగయు జన్నిదమును సిరి•చిల్కువాని
బాలు వటులీలు సుగుణాల•నాలు ననుచు
వాదిభీకరగురుఁ డనె•మోదమలర. 24

సీ. ఆ(బ్రహ్మచారియు•నల్లనల్లన డాసి, ప్రణతుఁ డై యాయతి•భర్త నడిగె
నెందుండి వచ్చెద•రెచ్చోటి కరిగెద, రిం దొంటిమై నుని•కెందుకతనఁ
దిరుపగూ డెచట నం•తేవాసు లెచ్చోట, నప్పవిత్రత్రిదం•డాదు లేడ
భైక్షాటనము సల్ప•నక్షమ మిచ్చోట, శైవపాశుపతాది•సంకులంబు

తే. గనుక నిన్నియు నడిగితిఁ•గరుణ గల్గి, శిష్యునకు వీని కున్నట్లు•చెప్పఁదగినఁ
జెప్పుమని(మ్రొక్కి•పలికెనా•చిఱుతఁడనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. చవి గుల్కు•పల్కులు•చక్కనితిరుమేను, మొలక నవ్వుల నీను•ముద్దుమోము
కౌపీనకటిసూత్ర•కరపల్లవస్థిత, పాలాశదండంబు•బ్రహ్మసూత్ర
ముచితస్థలద్వాద•శోర్ధ్వపుండ్రంబులు, దర్భపవిత్రంబుఁ•దగినసిగయు
స్వాధ్యాయజపపర•స్వాస్యపద్మంబును, గరుణారసముఁ జిల్కు•కన్నుదోయి

తే. నన్నియును జూచి యతిరాజు•హర్ష మొంది
యాత్మవృత్తాంత మంతి నా•యర్భకునకుఁ
జింత లన్నియు దిగనాడి•చెప్పె ననుచు
వాదిభీకరగురుఁడనె•మోద మలర. 26

సీ. వత్స వైష్ణవునకు•వరసితమృత్కృత, చ్ఛిద్రోర్ధ్వపుండ్రముల్•సిరులవెంట
లవి లేక యుండితి•నమలమృత్తిక లేక, యన నొకగనిఁ జూప•నచటఁ ద్రవ్వి
ధవళమృత్తికఁ గొని•ద్వాదశచ్ఛిద్రోర్ధ్వ•పుండ్రము లన్నియుఁ•బొసఁగఁదాల్చి
శ్రీచూర్ణ మడుగ నా•క్షితి మఱొక్కెడఁ(ద్రవ్వి•యావర్ణ దెచ్చియ్య•నది ధరించి

తే. యారగింప నిమంత్రించి•యతివరుండు
తగదు కుడువంగ యతికిఁ ద్రి•దండ ముడిగి

యనుచు బలికెను గుహనార్భ•కునకు ననుచు
వాదిభీకరగురుఁ డనె• మోదమలర. 27

సీ. స్వాదుఫలక్షీర•శర్కరాదుల నిత్య, మర్పించు చుండె నా•యర్భకుండు
శ్రీకూర్మధామముఁ•జెందె యుష్మద్గురుఁ, డచటికి మీ రంద•ఱుఁ గుఁ డనుచు
దేవాదిదేవుఁ డ•తిస్వతంత్రుండు శ్రీ,హరి సుభద్రామనో•హరుఁడు పలుక
మనగురు నెడఁబాపు•మాయావి యితనితో, మనకేమిపని యని•మాన్యులెల్లఁ

తే. దరలి శ్రీకూర్మ మొంది రా•వారకుండు
శిష్యుఁ డై నాల్గుదినములు•చెంతఁ గొలిచి
కానరాఁడాయె యతిపతి•కనుల కనుచు
వాదిభీకరగురుఁ డనె• మోదమలర. 28

సీ. ఆచార్యపురుషు లే•కాంగులు యతులును, గొత్తెమసానులుఁ•గొఱఁత లేని
సాతాను లతిశిత•సర్వసాధనపాణు,లతిశూరు లగునిత్యు•లధికబలులు
స్వస్వరూపజ్ఞాన•సంపన్ను లందఱు, నందఱు విజితకా•మాదిరిపులు
నంతిమోపాయని•ష్ఠాసక్తు లందఱు, నధిగతపరమార్థు•లంద ఱందు

తే. నష్టసేవధిఁ గనుఁగొన్న•నరులభంగి,నంద ఱానంద మొంది ర•య్యార్యుఁజూచి
యుడయవరు వారిఁగనిహర్ష•మొందెననుచు, వాదిభీకరగురుఁడనె• మోదమలర.

సీ. వేయుకరంబుల•విలసిల్లురవిభంగి, ఘనసింధువులఁ బాల•కడలికరణి
గ్రహతారతతులరా•కాకళానిధిమాడ్కి, నాత్మీయులను గూడి•యతివరుండు
విలసిల్లుచుండి యా•విష్కృతశక్తియై, శైవులఁ బిలిపించి•సాంత్వవచన
ములనూఱడించుచు•ముందటికథఁజెప్పె, ఋషికుల్యకడఁదొల్లి•ఋషులుహరిని

తే. నాదికూర్మాకృతిని జూపు•మనుచుఁ బొగడ
వాసి హరి దోఁచె నొకపుణ్య•రాశికరణి
ననుచు వారికిఁ బలికె న•య్యార్యు డనుచు
వాదిభీకరగుఁ డనెఁమోదమలర. 30

సీ. ఆశుద్ధసత్త్వకూ•ర్మాకారహరి యిట, నీశ్వేతశైల మై•యిపటి కైనఁ
గనిపించు చున్నాఁడు•గనుక నద్దేవలకుఁ, గనఁబడు నిగ్గిరి•కమఠమట్లు
నిజసేవకులు తన్ను•నిత్య మర్చింప నీ•శ్వేతకుండాంతిక•క్షేత్రమందు
మహితసాలగ్రామ•మాలికాలంకృత, శ్రీకూర్మమూర్తియై•చెలఁగుచుండుఁ

తే. గనుక మాదేవుఁ డీతండు•గాన మీరు, శైవముఖ్యులు హరికర్చ•నలుపఁదగద
టనుచు వారికిఁబలికెన•య్యార్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర

సీ. శ్రీభాష్యకారుల•శ్రీసూక్తు లన్నియు, విని పల్కి రాశైవ•వీరు లిట్లు
తడవులనుండి యీ•తనిఁ బూజ చేసెద, మభిమతశివలింగ•మనుచు నమ్మి
వేయుమాటల కేమి•వినుఁ డొౌకనిశ్చయ, మితనికోవెలవెన్క•నేకభక్తి
మీ రుండిప్రార్థింపఁమీకభిముఖుఁడుగా, దిరిగెనాయితఁడుఁ•దేవుఁడనుచు

తే. శైవు లన విని యతిరాజు•సంతసించి, శక్తిశూలాదిసాధన•శైవతతికి
సమ్మతం బగుశపథంబు•సలిపె ననుచు, వాదిభీకరగురుఁ డనెఁమోదమలర.

సీ. పడమటిదెసనుండి•ప్రవపదన మొదవ మా, కభిముఖుఁ డాయెనా•హరి యితండె
యప్పుడు గుమిగూడి•యస్మదీయబలంబు, లొకమూఁడుక్రోసులు•యుష్మదీయ
జనుల వధింతురు•సత్య మీశపథ మిం, దట్లు గాకుండెనా•హరుఁ డితండె
యప్పుడు మాబల•మట్లుగావింపుఁడీ, యనియతీంద్రుఁడు పల్కి•ననుమతించి

తే. శక్తిశూలాదిసాధన•శైవబలము, కూర్మధామము మొదలు కా•కుళముదనుక
యుద్ధసన్నాహ మేర్పడ•నుండె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. కోవెలపడమటఁ•గోశత్రయావధి, దక్షిణాశను సముద్రంబుదనుకఁ
గాలకింకరజయ•ఘంటారవాంఘ్రుల, నాత్మకింకరుల దీ•ర్ఘాసిధరుల
గుర్వర్థసంభృత•సర్వార్థపూర్ణుల, సమరసన్నద్ధుల•నమర నునిచి
యసహాయశూరుల•నాయుధపాణులఁ, గొందఱ స్వస్థాన•గుప్తి కునిచి

తే. శ్వేతకుండావగాహముఁ•జేసి తత్ర•దుచితపదనిర్మితద్వాద•శోర్ధ్వపుండ్ర
విలసితుం డయ్యెనాయతి•విష్ణు వనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ తిరుపవిత్రంబులు•తిరుమణిత్తావళం•బులు బ్రహ్మసూత్రము•బోరమెఱయఁ
బాణిపల్లవధృత•వజ్రత్రిదండంబు, భవులసాపాద్రుఁ•బగులు నడవఁ
గాషాయమృదుచేల•కాంతిపుంజంబులు, పద్మరాగాంశులఁ•బరిభవింప
ముఖపూర్ణచంద్రకౌ•ముదిదరస్మితసుధా•సారము భవతాప•శాంతి నలుప

తే. సికశిలీముఖగరుడుకు•శ్రీల మించఁ, గూరరాడ్భాగినేయాది•గురులు గొల్వ
యతిశిఖామణి కోవెల•కరిగెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. వేయుమోములవేల్పు•విధమునఁ గనిపించు. జనువేళ వైష్ణవ•జనుల కెల్లఁ
జక్రహస్తునిభంగి•శైవుల కగపడు, సన్న్యాసిగతిఁ దోఁచు•సాధువులకు

వాగీశ్వరునిమాడ్కి•వక్తలముదిఁ దోఁచు, బ్రహ్మమట్లుండు స•ద్బ్రాహ్మణులకు
బహువిధంబుల నిట్లు•భావితుఁడై వచ్చి, కోవెలలోఁ జొచ్చి•గురువరుండు

తే. మధునిషూదనుతిరిచుట్టు•మాలెయందు
బ్రక్రమముఁ జేసి హరిపృష్ఠ•భాగమందు
నొక్కమృద్వాసనంబున•నుండె ననుచు
వాదిభీకరగురుఁ డనె•మోచమలర. 36

సీ. పద్మాసనస్థుఁ డా•భాష్యకారగురుండు, ప్రపదన మొనరించి•పలికె నిట్లు
భక్తవత్సల నీవు•పరతత్త్వ మైతివే, నాదికూర్మాకృతి•వైతివేని
శ్రీశ భక్తులఁ బ్రోవ•నిచట నుండితి వేని, శ్రీపతిత్వము నీకె•చెల్లునేని
శ్రీజగన్నాథ యీ•శ్వేతకుండముకడ, నీవు పల్కినపల్కు•నిక్కమేని

తే. తిరిగి మమ్ముఁ గటాక్షింపు•దీనపోష
యనుచుఁ బ్రార్థించుయతిపతి•కభిముఖము గఁ
గూర్మనాథుండు దిరిగెను•గూర్మి ననుచు
వాదిభీకరగురుఁ డనె•మోద మలర. 37

సీ. అంతట యతిరాజు•హర్షించి నియమింప, నయ్యాత్మకింకరు•లచటినుండి
వెల్వడి గుంపులై•వేయువిధంబుల, శైవులతో దొడ్డ•సమర మొ.ది
శ్రీకూర్మ మాదిగా•శ్రీకాకుళాంతము, ఋషికుల్యసాక్షిగా•ఋషులు మెచ్చ
శైవులఁ జెండాడి•జయముఁ జేకొని వచ్చి, గురుపదాబ్జంబులఁ•గోరి మ్రొక్కి

తే. జయముఁ జెప్పిన విని యతి•చక్రవర్తి, నిజకటాక్షసుధావృష్టి•నెఱపినంత
నార్తిఁదొలఁగి సుఖించిరా•యాత్మ లనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. పాంచరాత్రాగమ•ప్రథితక్రమంబునఁ, బ్రోక్షణ మొనరించి•తత్క్షణంబ
దివ్యదేశముఁ జేసి•దేశికేంద్రులతోడఁ, దీర్థప్రసాదప్ర•తిగ్రహంబుఁ
జేసి యతీంద్రుఁడు•శ్రీకూర్మనాథప్ర•కాశకుం డని దొడ్డ•వాసిఁ గాంచి
శ్వేతాంతరీప మీ•క్షేత్ర మాక్షీరాబ్ధి, యీశ్వేతకుండ మ•హీంద్రశయుఁడు

తే. నాథుఁడనిరుద్ధుఁ డీకూర్మ•నాథుఁ డనుచుఁ, జెప్పి కొండఱ నాహరి•సేవకునిచి
యారమేశుని వీడ్కొని•యరిగె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. నాఁటినుండి పటికై•నను దూర్పువాకిటఁ, జని చూచు చుందురు•సకలజనులు
కమలామనోహరుఁ•గనకపీఠస్థితుఁ, బ్రత్యఙ్ముఖునిఁ గూర్మ•భర్త నచట

మనపూర్వగురు లెల్ల•మన్నించి రనుచు మా,కీప్సిత మాక్షేత్ర,మిపటికైన
వైష్ణవాన్వయులకు•వరకూర్మధామము,దాఁటి పోలా దని•తగ విధించి

తే. తరలి శ్రీరామతీర్థము•దాఁటి పద్మ,నాభగిరికడ గోస్తనీ•నదిని గడచి
సింహగిరిఁ గాంచె సంయమి•సింహుఁడనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. శీతలకల్లోల•శీకరాప్యాయిత,తీరరుహానేక•భూరుహంబు
నిత్యర్షిసంభృత•నీవారధాన్యాది,షష్ఠభాగాంచిత•సైకతంబు
క్రౌంచకారండవ•కలహంసబకకోక,స తత క్రేంకార•సంకులంబు
పుల్లపద్మమరంద•భూరిపానోన్మత్త,భృంగాంగనాగీత•మంగళంబు

తే. మత్స్యకూర్మాదివిహృతిని•ర్మలజలంబు, నైనపద్మాకరశ్రేష్ఠ•మచటఁగాంచి
వాస మొందెను యతిరాజు•వాసి ననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. ప్రహ్లాదు జలధిలో•పల ముంచి యతనిపైఁ, బడ వేసె నద్దానిఁ•బాపి తండ్రి
పాహి మాం శ్రీశ య•న్నుక్తోక్తి విని వేగ, నుఱికె నద్దానిపై•మురవిరోధి
నేత మెత్తినగతి,నెయ్య దిప్పటికైనఁ, దూర్పున మిణ్ణుగాఁ•దోచుచుండు
సింహాద్రినామంబు•చెల్లు నద్దానికి, సింహస్వరూపంబుఁ•జెందుకతన

తే. ధార లిరువదినాలుగు•దనరు నెందు, నట్టిసింహాద్రిచెంతల•నత్తటాక
నికటమందున యతిరాజు•నిలిచెననుచు,వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. ఆరాత్రి గడపి క•ల్యంబందు మేల్కాంచి, యాజ్ఞావిధియొనర్చి•యచట నున్న
శ్రీజనార్దనుఁ జూచి,సింహాద్రిపై కెక్కి, కోవెలఁ జెంది య•గ్గురువరుండు
తిరుచుట్టుమాలెలోఁ•దిరిగి శ్రీభండార,ముందు వసి-చుప,ద్మాలయకును
బ్రణుతి యొనర్చి సు•వర్ణాలయముకడ, సేవించి లోఁ జొచ్చి•శ్రీపురూరు

తే. మందిరంబందు నెలకొన్న•సుందరాంగు, శ్రీవరాహనృసింహు సు•శ్రీకుఁజూచి
భూరివేదాంతసూక్తులఁ•బొగడెననుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

సీ. పాతాళమందు నా•ప్రహ్లాదుఁ డర్చించు, పాదపద్మంబులు•భవహరములు
మోకాఁటిచెంతన•మోఘమై ద్రవియించు,భోయతూపుననేయు•గాయమొకటి
సరసకేశలఁ జారు•స్వర్ణచేలము మొల, జాఱనియ్యక పట్టు•సవ్యకరము
పక్షిరాజుకు సుధా•పానంబుఁ జేయించు,దక్షిణపాణి•పద్మంపుసొంపు

తే. మూఁడుభంగులతిరుమేను•మూఁడుకనులు
కుందపుష్పంపుఁజాయల•గొలుసుజడలు

పటలు గని యుబ్బె నయ్యతి•చంద్రు డనుచు
వాదిభీకరగురుఁ డనె•మోదమలర. 44

సీ. శ్రీమద్వరాహనృ•సింహప్రసాదంబు, లభియించి వెల్వడి•లక్ష్మణార్యుఁ
డాస్థానమంటప•మం దొకబ్రాహ్మణు, నతిరాజుసుని గృష్ణ•మార్యు విష్ణు
భక్తుని గని యిట్లు•పలికె మీరేరాత్రి,గానముసేయ మీ•కనులమొగిని
హరి యాడ నతని ని•ట్లడుగుఁడీయెంబెరు,మానా రనెడుయతి•మనయెడలకు

తే. వచ్చి దిగియుండె నతనికిఁ•బరపదము, కలుగునాకల్గదా యని•తెలియనడిగి
తెలుపు మామాట మాకని•పలికెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర

సీ. నావంటిభక్తుఁ డీ•నరులందు లేఁ డని, గర్వితుఁ డై యుండు•కత నతండు
నాశేషమూర్తిని•యతిమాత్రుఁగా నెంచి, యుపకరించెద నని•యూహఁ జేసి
య ట్లొనర్చెద నని•యతఁడు పల్కినయంతఁ,దిరుచుట్టుమాలెలో•వేళికేంద్రుఁ
డీశాన్యభాగమం•దించుకకాలము, గోష్ఠి యొనర్చి సం•తుష్టి పెనఁగఁ

తే. బ్రక్రమముఁజేసి దిగివచ్చి•వాసమొంది,యచ్యుతారాధనముఁ జేసి,యారగించి
కడపె నారాత్రిపూర్వార్య•కథల ననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. అంతటఁగృష్ణార్యుఁ•డారాత్రి హరిమ్రోలఁ,దాళంబు వీణె హ•స్తములఁబూని
పాడ నానరహరి•యాడు చుండెడువేళ, యతిరాజువృత్తాంత•మంతఁదెలుప
నతనికిఁ గలుగఁగా • నాతఁడిచ్చినవారి, కందఱికిని మోక్ష • మబ్బు ధ్రువము
అని హరి పలికిన • నాకృష్ణమార్యుఁ డా,యతిపతి దొడ్డవాఁ • డనుచుఁ దెలిసి

తే. హరిని వీడ్కొని తనగృహ•మందు నిద్ర,సల్పి ప్రొద్దునమేల్కాంచి•సంధ్యవార్చి
దేవళముఁ జెందె నెప్పటి•తెఱఁగున నని, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. యతిపురందరుఁ డంత • నర్మాణీయచ్ఛాత్ర,సహితుఁడై యాహరి•సదన మొంది
శ్రీవరాహనృసింహు • సేవించి యాస్థాన,మందుఁ గృష్ణార్యుని • నడిగె నిటు
మామాటలకు మాఱు•మాట లేమనిమీకుఁ, జెప్పెనోహరివానిఁ • జెప్పుమనిన
నీకు నీ విచ్చిన • నిఖిలచేతనులకు, మోక్షము గల దని • మురహరుండు

తే. పల్కె నదిగాన నిల మంచి • భక్తిగలుగు, దొడ్డసన్న్యాసి వీ వని • తోఁచె మాకు
ననుచుఁ బల్కెను గృష్ణార్యుఁ•డతని కనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. భక్తిసంపద్గర్వ • పరిపూర్ణుఁ డై నట్టి,యా కృష్ణమాచార్యు • లన్నమాట
లాలకించి యతీంద్రుఁ•డతని కి ట్లని పల్కెఁ, గలుగునో లేదొ మో•క్షంబు నీకు

నడుగుమీ యాహరి • నని పల్కె నాతండు, భాష్యకారుల కిట్లు • పలికె మరల
హరిని గన్నుల(మోల•నాడింపఁ గలమాకు, సంశయ మేమి మో•క్షము లభింప

తే. ననుమఁ బల్కిన నతనికి • యతిపరేణ్యుఁ, డడిగినను చప్పలే దన•నతఁడు హరిని
దెలియ నడిగెద నని సమ్మ•తించె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. దేవాదిదేవుని • తిరుచుట్టుమాళెముఁ, దీశాన్యభాగమం • దిచుకంత
కాలము వేదాంత•ఘనగభీరోక్తులఁ గడపి యచ్చటినుండి • కదలి గుడికిఁ
బ్రక్రమం బొనరించి • భాష్యకారగురుండు, తిరుమల దిగి తన•ధిష్ణ్య మొందె
నాఁటనుండి ప్రదక్షి•ణము సేయ వైష్ణవు, లావిష్ణుమంచెర•మందు గురుఁడు

తే. గోష్ఠి సల్పినమూఁటకుఁ • గోరి(మొక్కి, చనుదు రిప్పటికైన రా•జసుఁడు కృష్ణ
మార్యుఁ డారాత్రి హరికడ•కరిగెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఆరాత్రి హరికడ • కరిగి కృష్ణార్యుండు, గీతవాద్యములచేఁ • గృష్ణ జిష్ణు
సంతసమొందించి•స్వామిమోక్షముమాకుఁ, గలుగునాకల్గదా • తెలియఁబల్కు
మని విన్నవింప నా•హరి యూర కున్నంత, మరల నిట్లనియె నా•మాధవునకు
నూర కుండు ట దేమి•యుచితము మీ కని, కృష్ణార్యుఁ డన్న నా•విష్ణు నిట్లు

తే. పల్కె భక్తుఁడ వీవు నీ•పలుకులకును, మదివిచారించి చెప్పెద • మాఱుమాట
లనుచు సింహాద్రిపతిపల్కె•నతనికనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ముక్తినాసొమ్మని•ముల్లోకము లెఱుంగు, మూలస్మృతులు వేద•జాలమెఱుఁగు
నాముక్తి యయ్యేఁబ•రాయత్త మెట్లన్న, వినుముచెప్పెద నీకు • విశదముగను
మాకు దక్షిణపిల్లి • మహిరంగధామ మం•దహిరాట్ఫయాను న • న్నడిగినంత
నెంబెరుమానారు • కిచ్చితి ముందు నే, నుభయవిభూతుల • నూర్జితముగ

తే. నిచ్చెదనుగాని మరలనే•నేమి గొనను, గనుక సంశయమయ్యె నీ•కాంక్షఁదీర్ప
భక్తవశ్యుఁడ నే నని • పలికె ననుచు, వాదిభీకరగురు, డనె • మోద మలర.

సీ. అతనికి మఱియు ని•ట్లని పల్కె నాహరి, యుభయవిభూతుల • నుడయవరుల
కిచ్చిననాఁటనుం • డెవరికైన నతండె, సకలసుఖంబు లొ•సంగుఁ గనుక
నేస్వతంత్రుఁడఁగాను • నిశ్శ్రేయసం బీయ, నది గాన యతిపతి • నడిగి ముక్తి
కలదులేదని చెప్పఁ • గర్తయాతఁడె కాన, నడుగుమీ నీవె పో • యతని ముక్తి

తే. యట్లుగాకున్న లేదని•యతఁడెనుడువు, నియ్యఁదగుననితోఁచె నా•యిచ్చుముక్తి
ననుచు సింహాద్రిపతి పల్కె•నతని కనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. అంతఁ గృష్ణార్యుఁ డా•హరిసూక్తు లన్నియు, విని పల్కె మరల నా•విష్ణునిట్టు
లక్కటా యొక్క స•న్న్యాసికై నావంటి,భక్తుని వంచింపఁ • బాడి యగునె
శైశవ మాది నా•స్వామివి నీ వని, నమ్మితి నిట్టియ•న్యాయ మెఱుఁగ
నాలగాపరికి యు•క్తాయుక్తభావన, కలుగనేరదు గదా • కలిగెనేని

తే. తప్పులేమియు లేని సీ•తావధూటి, యగ్నిఁ జొరఁజూతురే రామ • యట్టినీకుఁ
జేయరానిప నే మని • చెప్పె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. కలకాల మొకరీతిఁ • గలగీతములఁ బాడి, కవితయుఁ జెప్పి నీ•కడనె యుండి
నీనృత్యకేళికి • నిత్యసాహ్యముఁ జేసి, నిన్నుఁ గన్నుల ప్రోల • నే భజించి
యఖిలలోకములలో • నే దొడ్డభక్తుఁడ. నని పేరు వడి యెప్పు • డాత్మ నిన్నుఁ
గడపముంగిటికల్ప•కం బని తలఁతు నా,ముంగొంగుపసిఁ డని • మురియుచుందు

తే. భక్తిభావన లన్నియుఁ • బదటఁ గలసె
మాయసన్న్యాసి ని న్నేమొ • మరులు కొల్పె
ననుచుఁ బలికెను గృష్ణార్యుఁ • డతని కనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 55

సీ. వేయుఁ బల్కఁగ నేల • వినుము నీగర్వంబు, ని న్నింత చేసె నా•నేర మేమి
యాకారకత్రిత • యార్థపంచకబోధ, సంస్కారపంచక•శాలి యైన
ప్రపదనపరులకుఁ • బరమపదం బబ్బుఁ, దక్కిన భక్తు లు•దారమతులు
సుకృతులు మదినన్నుఁ•జూచి హర్షించుచుఁ, గాలముఁగడపుచుఁ•గ్రమసుపక్వ

తే. శుద్ధసత్త్వాత్మబోధాది•సుగుణు లగుచుఁ, గలితవేదవిదాచార్య • కరుణఁ బరమ
పదముఁ జెందెద రని హరి•పలికె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. భువిఁ జరాచరరూప•ములు రెండు మాకగు, వినుము నీకవి రెండు•విశదపఱుతుఁ
జరవిగ్రహము దొడ్డ•సన్న్యాసిరూప మ, ట్లచరరూపము విగ్ర•హాదికంబు
నస్మత్స్వరూపు రా•మానుజాచార్యాఖ్య. శాస్త్రోక్తయతి సదా•చారనిరతుఁ
గనుఁగొని లేచి మ్రొ•క్కక యూరకుంటివి, పాడితి నని గర్వ•పడితి వీవు

తే. భక్తిభావనరతనఁ గన్పడితి నీకుఁ, బాడితివి గాన నాడితిఁ • బరమపదము
జ్ఞాననిష్పాద్య మని పల్కెఁ•జక్రియనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. అగ్రవర్ణుల కిల•నర్హము గాకను, నిత్యులపా లగు•నీకవిత్వ
మని నృహరి శపింప•నాకృష్ణమార్యుండు, మరల శాపం బిచ్చె•మాధవునకు

నీదు విమానము•నేలఁ గూలును గాక, యే కుదినంబు ల•స్లైకరీతిఁ
గాలియుఁ గోవెల•కదల కూర్జిత మగు, మరల విమానంబు•మహిత మగును

తే. బలికి యీరీతి నావిష్ణు•భక్తుఁ డరిగె, హరియు భక్తునిశాపము•నాదరించె
భక్తవశ్యత గనిపించె•భవుల కనుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర.

సీ. కృష్ణమాచార్యుల•కీర్తన లన్నియు, నిత్యభోగ్యము లయ్యె•నేఁటి కైన
మఱికొన్నినాళ్ళకు•మలికినే బనువాఁడు, మ్లేచ్ఛాధిపతి వచ్చి•మిన్ను రాయు
దివ్యవిమానముఁ•దెగటార్చి కోవెల, బారచాఁపులఁ దైల•వాసితములఁ
జుట్టించి కాల్చిన•సుడిసి యేడహములు, గాలి భక్తోక్తిచేఁ•గదల కుండె

తే. ముకురములభంగి దూరార్ధ•ములను దెల్పు
దర్పణ స్తంభములు మాసి•ద్రష్టలకును
నేఁటి కైనను దళ్కు గ•న్పించు ననుచు
వాదిభీకరగురుఁ డనె•మోదమలర. 59

సీ. అంతఁ బశ్చాత్తప్తుఁ•డనితరగతికుఁ డా•కృష్ణమార్యుఁడు మదిఁ•గినుక మాని
సింహాద్రినాథుని•శ్రీపదాబ్జంబులఁ, గని మ్రొక్కి యర్చించి•కమలనయన
సర్వలోకశరణ్య•జగదార్తిహర భక్త, వత్సల సంశ్రిత•పారిజాత
తల్లియుఁ దండ్రియు•దాతయు దైవత, మెల్లచుట్టములు మా•కీవె యనుచు

తే. నాత్మఁ గడు నమ్మి యుంటి నీ•యంఘ్రులాన
నాదురుక్తుల మఱచి యీ•నన్నుఁ బ్రోవు
మనుచుఁ బ్రార్థించె నాన్నృహ•ర్యక్షు ననుచు
వాదిభీకరగురుఁ డనె•మోదమలర. 60

సీ ఎల్లలోకంబుల•నేలెడుమాకు నీ.వంటిభక్తునిఁ బ్రోవ•బరువు గాదు
అపకారి నైన ముం•దనృతమాడఁగ లేదు, పలుక నెప్పటికైనఁ•బాడి దప్పి
యది గాన మునుపు నే•నన్నట్లు బోయి రా•మానుజాచార్యుల•నాశ్రయింపఁ
గరతలామలకము•గాదె మోక్షము నీకు. వత్స సందియపడ•వలదు చనుమ

తే. యనుచు సింహాద్రిపతి•యనుపఁ గృష్ణ
సూరి సింహాద్రి దిగివచ్చి•చోద్యపడుచుఁ
గాంచె యతిరాజుబిలముల•కలిమి ననుచు
వాదిభీకరగురుఁ డనె•మోదమలర. 61

సీ. ధవళమృద్విరచిత•ద్వాదశచ్ఛిద్రోర్ధ్వ, పుండ్రమధ్యములందుఁ•బొలుపు మీఱఁ
బదునాల్గువన్నెల•బంగారుచాయలు. గలుగుశ్రీచూర్ణరే•ఖల ధరించి
తులసీసరోజాక్ష•కలితమాలికలను. లలితకంఠముల నలంకరించి
గురుని కెల్లప్పుడు•కోరి దాస్యము సల్పు, శంఖచక్రాంకిత•చారుభుజుల

తే. యతుల నేకాంగులను బీర•పతుల నిట్లు, సంఖ్య లేనట్టివైష్ణవ•సంఘములను
జూచి యక్కజపడెఁ గృష్ణ•సూరి యనుచు,వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. వేణుపత్రముఁ బోలు•విలసదచ్ఛిద్రోర్ధ్వ•పుండ్రవల్లిక ఫాల•ముఽ వెలుంగఁ
దులసీజలజబీజ•విలసితమాలికా,యుగళము గళమునఁ•దగిలి మెఱయ
జిహ్వాగ్రనర్తన•శీలనారాయణ పదమునఁ బెనవులు•గదలు చుండ
స్ఫటికాక్షమాలిక•స్ఫుటముగాఁ ద్రిప్పుచు, దౌవారికుల వేత్ర•ధరులఁ జూచి

తే. కృష్ణమార్యుండు నీదువా•కిటికి వచ్చి,యున్నవాఁడనితెల్పుఁడీ•యుడయవరుల
కనుచుఁ వారికిఁ బల్కెఁ గృ•ష్ణార్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. ఆవేత్రపాణులు•యతిభూపతిని జూచి, ప్రణతులై యతనికిఁ•బలికి రిట్లు
స్వామి యాకృష్ణమా•చార్యు లిచ్చట వచ్చి, యున్నవాఁ డని వారు•విన్నవింప
నాకృష్ణమాచార్యు•లనెడుబ్రాహ్మణునితో, మాకేమిపని లేదు•మదిఁదలంప
నని యతీంద్రుఁడు పల్క•నామాటవిని వచ్చి,వేత్రపాణులు చెప్ప•విని యతండు

తే. తిరిగి సింహాద్రినృహరిని•దేవదేవుఁ
గాంచి యామాటలను విన్న•విఁచినంత
హరియుఁ బ్రత్యుత్తరముఁ జెప్పె•నతని కనుచు
వాదిభీకరగురుఁ డనె•మోదమలర. 64

సీ. ఆచార్యశబ్దము•యతిపతికే కాని, తక్కినవారికిఁ•దగదు గనుక
నాచార్యపదమున•కభిమానపడక నీ,పేరుమాత్రమె విని•పింపు మనుచు
మరల నంపింప నా•మాడ్కి నాతఁ డొనర్ప•నూరక యుండిరా•యుడయవరులు
హరి కతఁ డది దెల్ప• హరి యడియేఁ కృష్ణ•దాసుఁడ నని పల్కఁ•దగును నీకు

తే. ననుచు బోధించి పంచిన•నతఁడు మరల•సింహశైలము దిగివచ్చి•శ్రీయతీంద్రుఁ
గొలుచుదౌవారికుల కిట్లు•పలికె ననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. సద్వేత్రధరులార•సంయమీంద్రునకు మా,విజ్ఞప్తిఁ జెప్పుఁడీ•విశదముగను
ద్వారమందునఁ గృష్ణ•దాసుఁ డున్నాఁడని, గురునకుఁ బల్కుఁడీ•కరుణ ననిన

దౌవారికులు యతి•దైవతమును గని, కేలుఁదమ్ములఁ•గీలు కొల్పి
ద్వారములోఁ గృష్ణ•దాసుఁడు దేవర,వారి సేవింపను•వచ్చి యుండె

**తే.** ననుచుఁ బల్కినవారి క•య్యతివరేణ్యుఁ, డతనిఁ దోడ్కొనిరండని • యానతిచ్చె
వార లాతనిఁ దోడ్కొని•వచ్చి రనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

**సీ.** పుట్టుదరిద్రుం డు•భూరిసేవధిభంగి, జాత్యంధకుఁడు నిరీ•క్షణము మాడ్కి
ధన్వాఖ్యనీనుఁడు•ధారాసలిలమట్లు, వికలపాదుం డంఘ్రి•విహృతికరణి
నాకృష్ణమార్యుండు•యతిపతిసన్నిధిఁ,జెంది యానందించి•సిరి వహించి
దండప్రణామంబుఁ•దగఁ జేసి యున్నంత, నతనిఁ గటాక్షించి•యతివరుండు

**తే.** పంచసంస్కారములు నర్థ•పంచకంబు నాకృశిత్రయ మాది గా•నఖిలహితము
లాచరించి వచించె ని•ట్లతని కనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.  67

**సీ.** ప్రహ్లాదుఁ బ్రోచి యీ•పర్వతాగ్రమున దు, హరియొకపుట్టలో•నమరియుండ
వరపురూరవచక్ర•వర్తి యీనృహరికి, నొకదారుమంటప•మొనరఁ జేసె
లాంగూలగజపతి•లక్షణయుతముగా, మందిర మది చేసె•సుందరము గ
సన్న్యాసి యొక్కఁ డం•చత్రివేణిని దెచ్చి, గంగధారాదుఃఖ•గలుగఁజేసె

**తే.** నహహ సింహాద్రి విభవ మెం•దైనఁ గలదె
యిందు మావాఁడ పై యుండు•మెల్లకాల
మనుచుఁ బలికెను యతిపతి•యతని కనుచు
వాదిభీకరగురుఁ డనె•మోదమలర.  68

**సీ.** తనసన్నిధిని దాస్య•ధన మపేక్షించిన, కృష్ణసూరిని బుజ్జ•గించి కృపను
స్వస్వరూపోచిత•సకలకైంకర్యము, లీహరికే చేయు•మిచట నిలిచి
మాకభీష్టం బిది•మఱుమాటఁ జెప్పక, మాయజ్ఞ సలిపిన•మంచి గలుగు
నని యతీంద్రుఁడు పల్కి•నాకృష్ణసూరియుఁ, బ్రక్రమం బొనరించి•ప్రణతిఁజేసి

**తే.** గురునివీడ్కొనిచని సింహ•గిరివరాహ,నృహరికభిమతకైంకర్య•నిరతుఁడగుచుఁ
గడపి కాలము మోక్షము•గాంచెననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

**సీ.** ఏసూరి రజకుని•యింట మృతానుజు, నడపించెఁ బితృకాన•నంబుదనుక
నాబ్రహ్మరుద్రుల•కైనఁ గన్పడనట్టి,నృహరి నాడించెను•నిత్య మెవ్వఁ
డెవనిశాపమున స•ర్వేశునిగుడి యైన, నేడహములు కాలె•నేకరీతి
నట్టికృష్ణార్యుని•కైన లక్ష్మణముని, నాశ్రయింపక ము క్తి•యమర దయ్యె

తే. నట్టిరామానుజార్యుల నాశ్రయింప, కున్నకుమతికి మోక్షేచ్ఛ యుదధివి-ధ్య
పర్వతప్లవకాంక్ష గాఁ బరఁగుననుచు, వాదిభీకరగురుఁడనె మోదమలర. 70

సీ. శ్రీభాష్యకారుల శ్రీపాదతీర్థమీ,పద్మాకరం బని పధికులైన
సంప్రదాయకులు త జ్జలము లుజ్జీవించి, చనుదు రిప్పటికైన సంతతంబు
నచటనుండి యతీంద్రుఁ డాహరి వీడ్కొని, తనబలంబులతోడఁ దరలివెడలి
యాంధ్రనాథాదిది వ్యక్షేత్రపతు లెల్ల, నతనికిఁ గనిపింప నందటికిని

తే. మంగళాశాసనముఁ జేసి,మహిమమెఱయ, గౌతమినిగృష్ణవేణిని గడచివెడలి
శ్రీకరాహోబలస్థలిఁ జెందెననుచు, వాదిభీకరగురుఁడనె మోదమలర. 71

సీ. క్రిందియహోబల మందునృసింహునిఁ, బ్రహ్లాదవరదుని భక్తిఁ జూచి
యెగువహోబలమున కేఁగుచు భార్గవ,నారసింహునిఁ బ్రోవ నడుమఁ గాంచి
కారంజనృహరిని,గనులార సేవించి, శరకోపసూరుల శరణ మొంది
గరుడాద్రిని హిరణ్య కశిపుమర్దను రమా,కౌస్తుభశ్రీవత్స కలితవక్షు

తే. భవ్యభవనాశిని నిగత బ్రహ్మకుండ, నవ్యమణిగృహవాసుని నారసింహుఁ
గాంచి ప్రణమిల్లిగురుఁడుచు తించెననుచు,వాదిభీకరగురుఁడనె మోదమలర.

సీ. చెంచునాయకిఁ గాంచి శ్రీదేవిని భజించి. పావననృహరికిఁ బ్రణతిఁ జేసి
శుద్ధధారాకుండ చూతతీర్థంబుల, రాజద్వరాహతీర్థంబు గాంచి
శ్రీవరాహనృసింహుఁ జేమోడ్చియరిగియో,గానందనరహరి యంఘ్రిఁ బొగడి
సచ్ఛత్రవటనృకే సరియంఘ్రులకు మ్రొక్కి, జ్వాలానృసింహుని సన్నుతించి

తే. యుక్కుఁగంబముఁ బొడగని యుగ్రదైత్య, రచ్చగుబ్బలిశరభమా రణపుఁగొండ
గాఁచి యతిరాజు మరలియే తెంచెననుచు, వాదిభీకరగురు డనె మోద మలర.

సీ. శ్రీమదహోబల,శ్రీనారసింహుని, వీడ్కొని యతిరాజు వేడ్క నచటఁ
దనదాసజనులతోఁ దరల పినాకినిఁ, గడచి సోమవరంపుఁ గనుమ దాఁటి
యరిగెనిప్పటికైన నాకనుమను జను, బుధులెల్ల మ్రొక్కెడి పోదురిచట
నంత లక్ష్మణగురుఁ డాతిరుపతిఁజెంది,తన్నుఁ గన్గొని మ్రొక్కు ధన్యజనుల

తే. శీతలాపాంగసుధఁ జిల్కి సేమ మడిగి, తిల్లగోవిందరాజు సుస్థిరుని జూచి
సన్నుతించివృషాద్రికిఁ జనియె ననుచు, వాదిభీకరగురుఁడనె మోదమలర. 74

సుగంధివృత్తము, మందహాససుందరాస్య మాననీయ తిల్లగో
విందరాజసత్పదార విందవందనార్చనా

వందనాగురుప్రియాళు•చంపకాదివృక్షజా
ళ్మందిరాంజనాద్రినాధ•మానితా యతీశ్వరా, 75

మాలినీవృత్తము. స్థిరగిరివృషధామా•చిత్తముద్రాభిరామా
గురుపదపరివారా•క్రోధలోభాదిమారా
యురుతరశుభలీలా•యూర్ధ్వపుండ్రేద్ధఫాలా
పరమపదనిదానా•భాష్యకారాభిధానా. 76

గద్యము, ఇది శ్రీభగవద్రామానుజకరుణాకటాక్షకలితకవితావైభవ పరవాదిభయంకరాచార్యాభిమతచ్ఛాత్రాపస్తంబసూత్ర కణ్వసగోత్ర పవిత్రోభయకవిమిత్ర వేంకటకృష్ణార్యపుత్ర విబుధవైష్ణవవిధేయకేశవనామధేయ ప్రణీతంబైన యాచార్యసూక్తిముక్తావళి యనుమహాప్రబంధంబునందు మధ్యమభాగంబు నయనతింద్రుండు తిరువనంతపురంబు విడిచివిచ్చేసి మళయాళదేశంబులను శ్రీపాండురంగక్షేత్రంబును మధురానగరంబును గోకులబృందావనంబును గాళియహ్రదంబును గోవర్ధనాద్రియు ద్వారకయును బుష్కరారణ్యంబును దిరువయోధ్యయును బ్రయాగము గయ యుసాలగ్రామాద్రియును వైకుంఠస్నానంబును నైమిశాటవియును హరిద్వారంబును బదరికాశ్రమంబును గలాపగ్రామంబును వసుధారయుశమ్యకాశ్రమంబునుగనుంగొని యాయాక్షేత్రంబుల భగవద్విగ్రహంబులం గాంచి మంగళాశాసనం బొనర్చి యచటనుండి భట్టమంటపంబునం కేతెంచి సరస్వతీభండారద్వారంబునఁ గనఁబడు వాణితో సంభాషించి తన్మందిరాంతరాళంబుఁ జొచ్చి శ్రీభాష్యంబుఁ బరిగ్రహించి మెచ్చిన భారతిచే బహుమతిఁ గాంచి యచట వాదినిరసనంబు సేయుటయుఁ దద్దేశాధిపతి యచటిబ్రాహ్మణులతో యతీంద్రు నాశ్రయించుటయు వారణాసిపురంబు డాసి భాగీరథిం దీర్థీకరించుటయు నచటనుండి శ్రీపురుషోత్తమక్షేత్రంబుఁ జెందుటయు శ్రీజగన్నాథవాహనుండై యతీంద్రుఁడు శ్రీకూర్మక్షేత్రంబుఁ జెందుటయు శ్వేతకుండంబుకడ బ్రహ్మచారిరూపియై నరహరి గురున కుపచరించుటయు నచట నిజాశ్రితసమాగమనంబుఁ జెందుటయుఁ గూర్మనాథునిఁ బ్రకాశింపఁ జేయుటయు శైవవిజయంబును సింహాద్రిగమనంబును శ్రీవరాహనృసింహసందర్శనంబును గృష్ణమార్యుండు యతీంద్రు నాశ్రయించుటయు శ్రీమదహోబలక్షేత్రంబున శ్రీవరాహనృసింహుని సాక్షాత్కరించుటయు శ్రీపురిఁజెంది తిల్లగోవిందరాజునకు మంగళాశాసనం బొనర్చుటయు నన్నది పంచమోల్లాసము.

— 0 —

శ్రీమతే రామానుజాయ నమః.



# ఆచార్యసూక్తిముక్తావళి

## మధ్యమభాగము

---

### షష్ఠోల్లాసము

క. క్షేమంకరగుణనామ,స్తోమా వేంకటవరాహ • సురుచిపదాబ్జ
ప్రేమా ప్రామాణిక సు,త్రామా రామానుజా త్రి•దండిలలామా. 1

వ. అవధరింపుము. 2

సీ. ఆఱామడవెడల్పు • నమరు నేయద్రికి, ముప్పదామడచాఁపు • దప్ప కుండ
వేంకటశైలంబు • వృషభాద్రి నారాయ,ణాద్రి సింహాద్రి శే,షాద్రి యంజ
నాద్రియు శ్రీశైల,మట్లు తీర్థాద్రి యీ, నామధేయముల నే•నగము దాల్చి
నేయద్రిశిఖరము • నీక్షించువారికిఁ, బాతకంబులఁ బాపి • భాగ్యమిచ్చు

తే. నెందు వసియించు హరి తన•యిల్లువిడిచి, యెద్ది కలియుగవైకుంఠ,మీధరిత్రి
నట్టిశేషాద్రి కరిగె న,య్యార్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. కపిలపంచాయుధ•ఘనశేషస్తర్షి, గోగర్భవైకుంఠ•కులిశతీర్థ
గరుడసుదర్శనా•కాశగంగాపాన, నాశనసనకస•నందనాజ
కాయరసాయన • స్కందవిష్వక్సేన, వామనతుంబురు • వరవృషాది
గురునామములు షష్టి•కోటితీర్థము లెందు, విలసిల్లు సంతత•వృద్ధిఁ జెంది

తే. స్వామిపుష్కరిణీతీర్థ•చక్రవర్తి, స్నానపానార్థమై యుండు • సతత మెందు
నట్టిశేషాద్రి కరిగె న,య్యార్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. బ్రహ్మాదిదేవతా•పరమర్షిసంఘము, లేప్రొద్దు హరిఁ గొల్చు • నెందు నిల్చి
శేషశేషాశనా•శీవిషాశనముఖ్య,సూరు లెం దుందురు • సుఖముఁ జెంది
* పదుగురుసూరులుఁ • బాడి రేయద్రిని, గులశేఖరుం డెందుఁ • గోరె జన్మ
మురుపరస్పరవైర•ముడిగిజంతువు లెందు, మురరిపు భజియించి•ముక్తిఁ జెందు

---

* తొమ్మండ్రుసూరులే పాడి రని గ్రంథాంతరముల నున్నది.

తే. జెలఁగి యేయద్రి ప్రత్యక్ష•శేషుఁ డయ్యెఁ
జర్మ చక్షుష్కులకుఁ దోఁచు • శైలమట్టు
లట్టిశేషాద్రి కరిగె న•య్యార్యుఁ డనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. తిరుమలపై కెక్కి • దేవాదిదేవుని, తిరువీథులను నాల్గు • తిరిగి వచ్చి
ధవళధనుర్గత•ద్వాదశియరుణోద,యపువేళ సకలగం•గాదితీర్థ
ములు తమపాపవి•మోచన మొనరింప, నం దవగాహన • మొందు చుండు
బంగారుమేడలు•ఫలవృక్షములు కొన్ని, యేపుష్కరిణిచుట్టు•హెచ్చి యుండు
తే. నట్టి పుష్కరిణీస్వామి • నాశ్రయించి, యతికులస్వామి నీ రాడ • నవధరించి
శ్రీకిటిస్వామికోవెలఁ • జెందె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. మహితవరాహాగ్ర•మంటపమందు సు•ఖాసనాసీనుఁ డా•యతివరుండు
కేశవాదికనామ•కీలితశరరిపు, ద్వాదశగాథలఁ • దగఁ బఠించు
చును బదిరెండును • శుద్ధోర్ధ్వపుండ్రము,లను దత్తదర్వాస్థ•లములఁ దాల్చి
తులసీనలినబీజ • వలయముల్ ధరియించి, తిరుచుట్టుమాలెలోఁ • దిరిగి వచ్చి
తే. యజ్ఞవారాహదేవుని•హరిని గాంచి,మ్రొక్కి వినుతించి యతనిక•న్మ్రోల నిలిచి
యతులతీర్థప్రసాదము•లందె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఆహరి వీడ్కొని • యతిరాజు వెల్వడి, మహనీయః ధయాన•మంటపములు
మణిసహస్ర స్తంభ•మంటపగోపుర,ద్వారదేహళులను • దగ భజించి
వేంకటేశుం డెట్టి•సంకటములకైన, దుర్గాధిపతి గానఁ • దొలఁగఁ డింట
నమ్ములు రంగరా•జాదు లీతనిపంచఁ, జెందుదు రిడుమలఁ • జెందినపుడు
తే. గానముందొకసారి రం•గప్రభుండు, వచ్చి యెందుండెఁ బండ్రెండు•వత్సరములు
నట్టి శ్రీరంగమంటప • మందె ననుచు, వాదిభీకరగురుఁ డనె• మోద మలర.

సీ. స్వర్ణగారుత్మత• స్తంభము మణిమయ, బలిపీఠమును గాంచి • ప్రణతిఁ జేసి
యలరంగమంటప•మాస్థానమంటప, మతిభక్తితో మ్రొక్కి • యతివరుండు
కోశభాండాగార • గురుధాన్యశాలలుఁ, దైలాజ్యముఖరస•ద్రవ్యపూర్ణ
శుభగృహములఁ గొన్ని • చూచుచు రెండవ,ప్రాకారమునకొక్క•ప్రక్రమంబు
తే. సల్పి యామునతటవాసి•శౌరికడను, బుష్పమాల్యంబులను జేర్చు•పుణ్యనిధుల
వినతులను జూచి కరుణించి•వెడలె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. తొండమా నని యెడు • దొడ్డరా జొక్కఁడు, పగతురచే బలు • బాధఁ జెంది
శరకోపతీర్థంబు • సన్నిధిగుహ త్రోవ, నర్ధరాత్రపువేళ • నరుగుదెంచి
యందంపుఁ దూఁగుటు•య్యాలలోఁ బవళించి, శ్రీభూమినీళలు • చేరి కొల్వ
విలసనశీలుఁ డా•వేంకటేశుని, జూచి, వినుతించి తనయార్తి • విన్నవింప

తే. భక్తవత్సలుఁ డతనికి • భయముఁ బాపి, శంఖచక్రము లిచ్చెను • శత్రుహతికి
నృపతి యహితులఁ దెగటార్చి•నెగ్గె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. శ్రీభూమినీళలు • శ్రీవేంకటేశుని, మంతనమందున • మరులు కొల్పు
సమయమందున వచ్చు•చక్రవర్తిని జూచి, వ్రీడను జెంది యా•క్రీడ విడిచి
వక్షస్స్థలమునందు • వాపీనిలయమందు, శ్రీమహాసనమునఁ • జెందుకతనఁ
దాను ధరించుపూ•దండ లాహరియు నా,బావిలో విలసిల్లు • భార్య కొసఁగుఁ

తే. గానఁ బూ లియ్యరేరి కే•కాల మచట, నట్టితోమాలెబావికి•యతివరేణ్యుఁ
డంజలి యొనర్చి ముందటి•కరిగె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ముందటిమంటప•మున కేఁగి యట నిల్చి, సౌమ్యనారాయణా•చలశిఖరము
గనుఁగొని ప్రణమిల్లి • గారుడస్తంభన•ద్బలిపీఠములకుఁ బ్ర•దక్షిణముగ
వచ్చి చాంపేయక•ద్వారదేహళి మ్రొక్కి, దాఁటి విమాన ప్ర•దక్షిణమున
కరుగఁ దలంచి మే•యాజ్ఞాసన్నిధిని గాంచి, యాస్వామి సేవించి•యచటనుండి

తే. వచ్చి బంగారుతలుపుల•బావిఁ జూచి, భాష్యకారుండు తిరుమట్ట•పళ్ళిఁ జెంది
విష్ణుపత్నిని గని మ్రొక్కి•వెడలె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. కల్యాణమణిమయ•కల్యాణమంటపా,స్థానము వలగొని • జరగి వచ్చి
యన్వర్థనామక • మానందనిలయాఖ్య, దివ్యవిమాన బుఁ • దేటి చూచి
దివ్యవిమానాయ•తే నమో యని మ్రొక్కి, పరిమళాంచన్మంట•పంబుఁ జూచి
బ్రహ్మరుద్రేంద్రాది•బహుసురార్చితదివ్య, మణిభూషణములున్న•మఱుఁగులెటిఁగి

తే. మాన్య సూత్రవతీశు న•మస్కరించి, తొట్టితీర్థపుశంకలఁ • దొలఁగఁ ద్రోచి
సూరితిలకుండు తనచోటిఁ • జూచెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. నాథు యోగానంద•నరికేసరిని గాంచి, యాడి యాడీత్యాది•మార్యసూక్తి
వినిపించి మణిమయ•విహగేంద్రనిలయము, వలగొని ముఖమంట•పంబునకుమ
నయ మొప్ప దండప్ర•ణామముల్ గావించి, జయవిజయుల కను•సంజ్ఞఁ బడసి
పలుగాడితలుపుల•బంగారువాకిటి, గడపను గని మ్రొక్కి • కడచి యచట

తే. శేషశేషాశనాదుల • సేవఁ జేసి, యంజనాద్రీశు దివ్యశ•య్యాదికంబు
సంయమీంద్రుండు గని మ్రొక్కి•సొంగెననుచు, వాదిభీకరగురుఁ డనె• మోదమలర.

సీ. గడపగాఁ బడియుండి • కనియెద నీదొండ,పండుఁబోల ధరముఁ • బరమపురుష
కోనేట సుఖియించు • కోకాదిపక్షులం, దొకపక్షి నయ్యెద • నుర్వినాథ
నీపైఁడికొండపై • నే నొక్క మ్రైనై యుందు, స్థిరచరాదులయందు • దేవదేవ
యిట్లు ప్రార్థించె ముం • దేకు శేఖరుం, డతనినామాంకిత • మైనగడప

తే. దాఁట రా దని యతిరాజు•తలఁచెఁ గనుక, నిత్యకింకరులే తక్క•నేఁటి కైన
దాఁట రావెంటిగడపను • దాసు లనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ధ్రువకౌతుకోత్సవ•దీప్త స్నపనచక్ర, బేరాదిభేదముల్ • పెక్కు గలుగు
వేంకటేశునిపాద • పంకజయుగళము, నక్షత్రములఁ గేరు • నఖరములను
బలుకూర్మములఁ బోలు•ప్రపదములనుబూను, జంఘానమంజు మం•జీరములను
దాసుల రక్షింపఁ • ద్వరపడుహరినీల, కాహళాకారజం•ఘాయుగంబుఁ

తే. గదళికాస్తంభగంభీర • కనకచేల, పరివృతోరుద్వయంబు నా • వర్తనాభిఁ
గాంచి హర్షించె నాయతి•కాంతుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. సూర్యకటారంపు • సొంపుతోఁ గీల్కొన్న, కాంచీగుణావృత • కటితటంబు
సర్వలోకములకు • సదన మౌనుదరము, నతిసుందరవళిత్ర • యాతిశయముఁ
దారావళులయందుఁ • దారాధిపతిఁ బోలు, ఘనహారములయందుఁ•గౌస్తుభంబు
శ్రీవత్సలాంఛనాం•చిత మౌనురస్స్థల, మలమేలుమంగతా•యారు నచటఁ

తే. గలితభూషణకల్పశా • ఖాసమాన, శంఖచక్రగదాఖడ్గ • శార్ఙ్గసహిత
భుజములను జూచి యతిరాజు•పొంగెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. కంబుసుందరదివ్య•కంఠ మున్నతపీన, చార్వంసములు గూఢ • జత్రువులును
వైజయంతీపుష్ప • వరతులసీదళ, మహితసాలగ్రామ • మాలికలును
బింబప్రవాళాధ•రంబు సుందరమంద,హాసముఁ బుండరీ•కాక్షియుగము
మకరకుండలదీప్తి•మహితగండయుగంబు, శ్రీకారములఁ బోలు • చెవులు భవ్య

తే. నవ్యచాంపేయకలికాభ • నాసికయును, విలసితభ్రూలతాదివ్య • విభ్రమములఁ
గాంచి యతిరాజు మిగుల హ•ర్షించె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర

సీ. రమణీయకర్పూర • రచితోర్ధ్వపుండ్రంబు, నీలాలకావృత • నిటలతటము
శారదపూర్ణిమా • చంద్రమండలముతో, సాటి మీఱినముఖ • సరసిజంబు

నీలాద్రిశిఖరస్థ • బాలసూర్యునిఁ బోలు, తపనీయమకుటముఁ • దలను జూచి
వేంకటేశునిదివ్య • విగ్రహ మీరీతి, నాపాదమస్తక • మనుభవించి

తే. సంతసించి యతీంద్రుండు•సంస్తుతించి, చైత్రయాత్రాశ్రమం బెల్ల•జాఱ విడిచి
పేదపెన్నిధిఁ గన్నట్లు • పెరిఁగె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. శ్రీపాదమాది గా • శిరముపర్యంతంబు, శ్రీపాణిమునిభంగి • సేవఁ జేసి
భట్టనాథోక్త మౌ • పల్లాండుఁ బాడి యా,శౌరికి మంగళా • శాసనంబుఁ
జేసి కేల్గవ మోడ్చి • సేవించుయతిపతి, కంజనాద్రీశుఁ డి • ట్లనుచుఁ బలికె
భాష్యంబు రచియించి • భారతి మెప్పించి, ప్రతివాదుల జయించి • భవులఁ దీర్చి

తే. మంచి మా కొనరించున • న్మంత్రి వీవె
కనుక నిచ్చితి భూతియు • గంబు నీకు
శయనగృహమందు నని పల్కె • శౌరి యనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. శ్రీశఠకోపంబు • చెలు వొందుతీర్థప్ర,సాదాదులను గొని • సంయమీంద్రుఁ
డంజనాద్రీశుని • నలమేలుమంగను, స్వగురుని వీడ్కొని • జరగి వచ్చి
తిల్లగోవిందుని • తిరువడి సేవించి, యాత్మీయులను గూడి • యచటఁ గదలి
చోళసింహపురంబుఁ • జొచ్చి యతీంద్రుండు, ఘటికాద్రినృహరిని • గాంచి మించి

తే. గృధ్రపుష్కరిణీతీర•గృహనివాసు, విజయరాఘవుఁ గని మ్రొక్కి • వెడలి విభవ
యుక్తసత్యవ్రతక్షేత్ర•మొందె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. బహుపుష్పపల్లవ • ఫలభారనతశాఖ, తరుపతత్ఫలరసో • ద్యానవనము
కలహంసబకకోక•కారండవాకీర్ణ, పద్మాకరభ్రమ•ద్భ్రమరరవము
జాలాధ్వచరదర్క • చంద్రమఃప్రాసాద, రత్నరుగ్రాజిత • రాజపథము
హరిపాదకమలసే • వాసక్తమానస, స్త్రీపురుషాంచితా • శేషగృహము

తే. శత్రుషడ్వర్గనిత్యప్ర • శాంతికరము, ధన్యపశుపక్షిమృగకుల • తరునగాఢ్య
మైనకాంచీపురముఁ జూచె•నార్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. వేగవతీనది • విమలోదకంబుల, నవగాహన మొనర్చి • యతివరుండు
కాలార్హకృత్యముల్ • గావించి కూరేశ, దాశరథ్యాదిస • త్తములతోడఁ
గోవెల కేఁగుచు • గోపురాంగణహైమ, మణిషోడశస్తంభ • మంటపంబు
గని మ్రొక్కి వలగొని • ఘనగోపురద్వార, కనకదేహళి మ్రొక్కి • కడచి వచ్చి

తే. బ్రహ్మయోగోదితుం డగు • వరదుఁ డెందు, ననిశవాసముఁ గైకొనె • నాయనంత. పుష్కరిణిఁ జూచిమిగుల ను•ప్పొంగెననుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర.

సీ. శాతకుంభ స్తంభ•సాహస్రగుంభిత, పల్లవోత్సవమంట•పంబుఁ జూచి
పుష్పవనంబులఁ • బొరిఁ జూచుచును వచ్చి, శ్రీశఠారిపదాబ్జ•సేవఁ జేసి
పుణ్యకోటివిమాన•మును జూచి చేమోడ్చి, పదుగురుసూరుల • భక్తిఁ గొల్చి
వాహనమంటప,వరగారుడ స్తంభ, బలిపీఠములఁ జూచి • ప్రణతిఁ జేసి

తే దాఁటి రెండవద్వారము•త ప్తహేమ, మణిమయ స్తంభగుంభిత • మంటపముల
శ్రీయతీంద్రుఁడుచూచి హ•ర్షించెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. వరద నారాయణ • వాసుదేవ రమేశ, యని పల్కుచిల్కల • నాదరించి
వైశాఖమాసోత్స•వమున నవాహ్నిక,దీక్ష నెందు వహించు • దేవరాజు
ఆమహారత్నాది • వ్య స్తంభగుంభిత, మహనీయకల్యాణ • మంటపంబుఁ
గన్నులపండువు • గాఁ జూచి సాష్టాంగ, దండప్రణామముఁ • దగ నొనర్చి

తే. దర్శనస్థాపనార్థము • తన్నుఁ జూచి, ప్రపదనం బాచరించిన • పరమగురుని
యామునార్యునిగని మ్రొక్కె•నార్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. కృష్ణుండు దేవితోఁ • గ్రీడించుమాధవీ, మల్లికామాలతీ • మంటపముల
హరి పెరుందేవితో • ననిశముఁ గ్రీడించు, బంగారుకృత్రిమ • పర్వతములఁ
గరిగిరివరదుఁడు • కలిమికొమ్మను గూడి, విహరించుపుష్పద్రు•వీధికలను
వరదురచ్చకు నగు•బాలకల్పద్రుమూ,ల ఖచితరత్నశి•లాతలముల

తే. దివ్యవిద్రుమసోపాన•దీర్ఘికలను, హస్తిగిరినాథదివ్యమ•హానసంబు
నుడయవరుచూచియాహ్లాద • మొందెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర,

సీ. పాకగృహాంతిక • బహుకూటములయందు, నవధాన్యరాసులు • నగసమములు
నూతుల నించిన • నూనె తేనె ఘృతంబుఁ, బసిఁడిబానలనిండఁ • బాలుఁబెరుఁగు
గూనల డాపిన,గుడశర్కరాదులు, స త్తింత్రిణీఫల•సంచయములు
సర్షపతిలవిశ్వ • సరసార్ద్రకమరీచి, కైలాలవంగాది • జాలసురభి

తే. గంధవచ్చందనాగురు•ఖండములును, జూచి యతిరాజు హర్షించి•చోద్య మంది
శ్రీ పెరుందేవికోవెలఁ•జెందె ననుచు, వాదిభీకరగురుఁ డనె• మోద మలర.

సీ. ఆపెరుందేవితా • యారుకోవెలయందు, మణికుట్టిమాస్థాన • మంటపమున
రతనంపుఁజాయల • రంజిల్లువరదుని, మహిషితిర్మంజన • మంటపంబుఁ

గనుఁగొని చేమోడ్చి • ఘనదేహళిని దాఁటి, తిరుచుట్టుమాలెలోఁ • దిరిగి వచ్చి
గర్భగృహద్వార•కనకదేహళికడఁ, గేలుఁదమ్ములఁ దలఁ • గీలుకొల్పి

తే. శ్రీపెరుందేవితాయారు•సేవఁ జేసి, సంయమీశ్వరుఁ డానంద•జలధి మునిఁగి
పూర్వదేశికసూక్తులఁ • బొగడె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. దేశాంతరము చని • తిరిగి వచ్చినతన,తనయుని జూచిన • తల్లికరణి
భాష్యకారు నిజాంఘ్రి•పద్మప్రపన్నునిఁ, జేతనోద్ధరణైక•శీలుఁ జూచి
పరమహర్షముఁ జెంది • వరదునిదేవియు, మిగులఁ గటాక్షించి • మే లొసంగి
శఠకోపతీర్థప్ర•సాదాదు లిప్పించి, బహుమాన మొనరించి • పంచినంత

తే. నల్లనల్లన దిగి మేడ • యతివరుండు, వచ్చిమూఁడవ ప్రాకార•వరముఁ జూచి
శిష్యగణములతో సంత•సించె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. యతిభూమిపతి తురీ•యావృతి మణిదీప్త,హాటకద్వారదే•హళిని దాఁటి
యత్తియూరా నని • యార్యులు పొగడిన, నరకేసరిని జూచి • నతి యొనర్చి
నవరత్నభూషణ•నవ్యమాల్యక్షౌమ,కోశగృహంబులఁ • గొన్ని చూచి
కరిగిరి వలగొని • కనకమయంబు లౌ, మె ట్లెక్కి యామేడ•మీఁది కేఁగి

తే. తిరిగి తిరుచుట్టుమాలెలో•దేవదేవు, వెనుకఁ బ్రణమిల్లి వచ్చి యా•వేదవేద్యుఁ
గరిగిరీశునిఁ గన్నులఁ • గాంచె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. కమనీయనవరత్న•ఖచితకిరీటుని, నీలాలకావృత•నిటలతటుని
నవ్యకాంచనకోశ • నాసాపుటాంచితుఁ, బుండరీకాక్షు సు•భ్రూవిలాసు
మకరకుండలరుచి,మహితకర్ణకపోలు, మందస్మితాంచిత • మధురభాషు
విద్రుమబింబాది • విలసితాధరపుటుఁ, గంబుకంధరదివ్య • కంఠకలితు

తే. రత్నకంకణకేయూర,రాజదూర్మి, ముఖ్యభూషణభూషిత • భూరిభుజునిఁ
గరిగిరీశుని యతిరాజు•గాంచె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. శంఖచక్రగదాసి•శార్ఙ్గముల్ గలవాని, రమణీయభుజశిఖ•రములవానిఁ
గంఠికామౌక్తిక • ఘనహారములవాని, దివ్యకౌస్తుభమణి • దీప్తివాని
సిరియు శ్రీవత్సము • నురమునఁ గలవాని, మహనీయతులసిదా • మములవాని
నలువను గన్నట్టి•నాభిపద్మమువాని, నవరత్నకాంచీగు•ణంబువాని

తే. రాజరంభాతులస్తంభ • రాజమాన, కనకచేలావృతోరుయు • గంబువానిఁ
గరిగిరీశుని యతిరాజు • గాంచె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. మఱియు నార్తులఁ గని•మన్నింపఁ బరుగిడు, కమనీయజంఘాయు•గంబువాని
శింజానమంజుమం•జీరజానులవాని, లలితసత్పార్ష్ణిగు•ల్ఫములవానిఁ
బ్రథితకూర్మోపమ•ప్రపదాబ్జములవానిఁ, జుక్కల నగుగోళ్ళ•సొబగువాని
స్థలపద్మనిభపాద•తలములు గలవాని, దాసధనాంఘ్రిప•ద్మములవాని
తే. శ్యామసుందరసుకుమార•సత్యనిత్య, దివ్యమంగళవిగ్రహ•దీప్తివానిఁ
గరిగిరీశుని యతిరాజు • గాంచె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. సత్యవ్రతక్షేత్ర • సౌభాగ్యసముదయ, మర్థులపాలిటి • యమరతరువు
కాంచీపురీనిత్య • కల్యాణసేవధి, కరిగిరి నెలకొన్న • కాంఁఘనము
ఆర్తులపాలిటి • యమృతసముద్రంబు, నఖిలసద్గుణముల • కాటపట్టు
బ్రహ్మయాగఫలంబు • భక్తవశ్యం బగు, వరదునితిరుమేని • వరుసఁ జూచి
తే. పొగడి బహుమతుఁడై యతి•భూవిభుండు, గురునిఁ దిరుకచ్చినంబినిఁ•గోరి చూచి
వారియనుమతి వెల్వడి • వచ్చె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అష్టాదశస్థాన • హరివిగ్రహములను, గాంచి నుతించి యా•కాంచి నుండి
శ్రీభూతపురిఁ జెంది • సిరితోడ విహరించు, శౌరిని గేశవు • సదయుఁ జూచి
తిరుశరకోపంబు • తీర్థప్రసాదము, లర్థించి కైకొని • యతివరేణ్యుఁ
డతవి వీడ్కొని చని • యాత్మశిష్యులతోడ, భవ్యవీక్షారణ్య•పదముఁ జెంది
తే. దివ్యహృత్తాపనాశినీ • తీరమందు, సీతతో శేషతల్పముఁ • జెంది యున్న
వీరరాఘవు సేవించి • వెడలె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. భవ్యభక్తారామ • పదమొంది యచ్చట, భక్తవత్సలుఁ గని • ప్రణుతిఁ జేసి
తిరునీర్మలకుఁ జని • దివ్యాలయములందు, హరిపంచవిధ విగ్ర•హములఁ జూచి
భట్టనాథోక్తులఁ • బ్రస్తుతిఁ గావించి, తత్ప్రసాదముఁ జెంది • తరలి వెడలి
భూరిమహీసార•పురి కేఁగి యచ్చట, మాధవుఁ గాంచి న•మస్కరించి
తే. భార్గవాన్వయుఁ జక్రాంశు • భక్తిసార
సూరిఁ గని మ్రొక్కి చనియె నా•సూరివంశ
జలధిఁ బొలిచిన సంపూర్ణ•చంద్రుఁ డనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 36

సీ. భాగినేయుని జన్మ•పదముఁ గటాక్షించి, కైరవిణ్యాఖ్య పు•ష్కరిణిచెంత
మణిమయగోపుర•మంటపప్రాకార, బహుమహోత్సవదివ్య • భవనమందు

శ్రీరుక్మిణీసమా•శ్లిష్టపార్శ్వునిఁ బార్థ,సారథిని భజించి • సన్నుతించి [గాంచి
శ్రీమయూరపురంబుఁ • జెందియం దుదయించు, మహదాహ్వయమునిసూరి•మణిని

తే. మ్రొక్కి యర్చించి పొగడి స•మ్మోదమంది,శ్రీసహాయునిఁగేళవుఁ•జెందికొలిచి
మల్లపురకేఁగె నా జగ,న్మాన్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. భూతయోగినిమల్ల•పురియందుఁగని మ్రొక్కి. యతనికారాధనీ•యామ్యతునకు
జోహారుఁ గావించి•సూరులతోఁ గూడి,యాభూతపురిఁ గాంచి•యచటనుండి
కాంచీనగరి కేఁగి•కరిగిరివరదుని,మరల సేవించి స•న్మాన మొంది [మవుచ షుఁ
మధురాంతకముఁ జెంది•మణిమయాలయమందుఁ,బద్మాకరముఁ బ్రోచు•పర

తే. ప్రీతిఁకని మ్రొక్కి వినుతించి•పెరియనంబి,తనకనుగ్రహ మొనరించు•తావుచూచి
సంతసించి యతీంద్రుఁడు•జరిగె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర,

సీ. శ్రీవిల్లిపుత్తూరు•సేవింపఁ జనుచును, యతిరాజు మార్గమ•ధ్యమునఁ జూచె
వాఁగుల వంతల•వరసాగరంగమ,నదుల ధాతువిచిత్ర•నగవరములఁ
దాలతమాలత•క్కోలహింతాలర,సాలసాలార్జున•సరళతరులఁ
గుందకురంటక•కోవిదారంబుల. లుంగలవంగనా•రంగములను

తే. జందనాగురుకేసర•చంపకములఁ, బాటలీకేతకీస స్త•పర్ణములను
ప్లక్షజంబూవటామ్లజం•భలముల నని, వాదిభీకరగురుఁ డనె•మోదమలర. 36

సీ. అభ్యాగతుం డగు•యతిపతిని సశిష్యుఁ, బుష్పభ్రమరదృష్టి•పూర్తిఁ జూచి
యమ్మహామహూన కుం•ద్యత్పుష్పశాఖాగ్ర,కరములఁ జేమోడ్చి•ఖగరవముల
స్వాగతం బడిగి పుం•ష్పాసారములఁ బాద్య. మర్పించి విరులచే•నర్ఘ్య మిచ్చి
తమనీడగొడుగుగా•ధరియించి యమృతక,ల్పములైనబహువిధ•ఫలము లొసఁగి

తే. త్రోవ నడచినశ్రమమెల్లఁ•దొలఁగునట్టు.లతిథిసత్కారములఁజేసె•నట్టితరులు
వానిజన్మమె సఫల మీ•వసుధ ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. తమవైరముల మాని•దారుణమృగములు, గుంపులై తన్నుఁ గ•న్గొని భజింపఁ
బర్వతంబులు తన్ను•భజియింపఁ దలఁచియు, ఘనభక్తివివశతఁ•గదలకుండఁ
బౌరజానపదాది•బహుధన్యచేతను, లందంద తనయంఘ్రు•లాశ్రయింప
నదనదీహ్రదసరో•నలినీవరము లాత్మక,మలవృత్తిఁ దన్నుఁ•గని సుఖింప

తే. నల్లనల్లనఁ జని సిరి•తల్లియల్ల,విల్లిపుత్తూరునగరీమ,తల్లిఁ జెంది
కొల్లపఱిచెను ధనసేవ•గురుఁ డటంచు,వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. అన్నసౌమ్మని మనఁననుభవింపఁ దలంపఁ, డీయుపేంద్రుం డింద్రు•వింటనుండి
మనజోలిఁ దలఁపరు•మది నైన వైష్ణవు. లని యీకౌఱంతల•నడఁపఁదలఁచి
కఱివేల్పుశ్రీపాద•కమలముల భజించి, తత్ప్రసాదముఁ గాంచి•ధరణి మించి
రమ్యనందనచైత్ర•రథముఖదేవతా,రామము లీపురా•రామరూప

తే. మొందినో కాక సర్వర్తు•యుక్తపుష్ప.పల్లవాదికలక్ష్మి యీ•పగిది నెందుఁ
గల్గు నని పల్కె నాయతి•కాంతుఁ డనుచు,వాదిభీకరగురుఁడనె•మోదమలర,

సీ. గారుత్మతోపల•ఘటితశైలోపమ,సేతుబంధుసురద్రు•శేఖరములు
స్ఫటికామలోదక•పరిపూరితంబులు, మధ్యతీరస్వర్గ•మంటపములు
స్వవిమలకల్లోల•చలడోలికోల్లస,ద్రాజహంసాదివి•రాజితములు
మకరందపానప్రమ•త్తభృంగాంగనా,సంగీతకలరవ•సంగతములు

తే. కూర్మమీనాదియాదోవి•ఘూర్ణితములు,నార్యసేవ్యములచటిప•ద్మాకరములు
యతిశిఖామణివీక్షించె•నచట ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. కాంచనసోపాన•కమలనీలోత్పల,దివ్యసౌగంధిక•దీర్ఘికలును
మణిమయారోహణ•మధురోదకాంభోజ,సక్తాళిగీతపు•ష్కరిణిచయము
శ్రీవిష్ణుచిత్తపు•త్రీస్వయంవరకథా,గాయకశ్రీవృత•కమలకులము
కదళీసమావృత•ఘననాగవల్లీవ,నేక్షువనంబు లీ•శేప్సితములు

తే. నంతటనుయోజనత్రయ•మాయతము గ,విష్ణుచిత్తుండు చేసిన•విరులతోఁట•
గాంచియతిరాజు మదిసంత•సించె ననుచు, వాదిభీకరగురుఁ డనె,మోదమలర.

సీ. ఆతోఁటలోపల•నతిసౌరభంబు లౌ,చందనాగురుపారి•జాతములను
బొన్నలఁ బొగడల•భూరిచంపకములఁ, గేతకీకాశ్మీర•కేసరముఁ
గర్ణికారకదంబ•కరవీరపాటలీ,మల్లికామాలతీ•మంటపముల
పుల్లహల్లకసితాం•భోజనీలోత్పల,సౌరభమిళితకా•సారములను

తే. సరసతులసీవనంబుల•సంఖ్యములను, బహువిధామృతరసఫల•పాదములఁ
గాంచియతిరాజు మది సంత•సించె ననుచు,వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. అవతరించి కుశధ్వ•జామ్నాయరపమున, మును వేదవతి హరిఁ•బొందలేక
మరల నుర్విఁ జనించి•మైథిలి యై రాము,పత్ని యై విశ్లేష•బాధఁ జెంది
శ్రీవిల్లిపుత్తూర•శ్రీవిష్ణుచిత్తుని,తులసీమహాటవిఁ•దోఁచి మరల
రంగేశుసతి యై య•రక్షణం బైనఁ దా,నెడఁబాయ కుండెఁ బ్రా•ణేశుఁ గూడి

తే. యట్టియాముక్తమాల్యప్ర•దాఖ్యలక్ష్మి, యవతరించినతులసీమ•హావనంబుఁ
గాంచి యతిరాజు మది సంతసించె ననుచు వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. విష్ణుచిత్తుఁడు ముందు•విమపరంబులఁ,గూర్చుచోటీక్షించి•కూర్మి మ్రొక్కి
యాతోఁట వెల్వడి•యప్పురాంతికమందు,మాధవువిజయార్థ•మంటపములఁ
బాధోధిగంభీర•బహునీరపూరిత,పద్మసౌగంధికో•త్పలపరిఖల
స్ఫాటికమణిమయా•చలనిభప్రాకార,వప్రాదిపరివృత•పట్టణంబుఁ
తే. దప్తచామీకరాంచిత•ధవళరత్న,కీలితారత్నగోపుర•కీలితంబుఁ
గాంచి యతిరాజు మది సంత•సించె ననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. అలకామరావతు,లచ్యుతప్రీతలై, యవని నీపురవర•మైన వాక్కా-
కాక వైకుంఠ మీ•కలిచేతనులఁ బ్రోవ,నుర్వినిప్పురరూప•మొందె నొక్కా-
యట్లుగా కున్ననీ•హరిమహోత్సవపరం,పర లెట్లు విలసిల్లు•వసుధ నిందు
నని వితర్కించుచు•నప్పురీతిలకము, నల్లనల్లనఁ జొచ్చి•యతివరుండు
తే. హరిని గనఁ జను గంగయో•యని తలంపఁ,దగుమహాహీరకుట్టిమ•ధరణిరాజ
వీధిఁ గనుగొనెఁ బ్రాసాద•వీధి ననుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

సీ. చంద్రసూర్యావతం•సస్ఫురన్మణిమయ,వరసప్తభూమికా•భవనములను
గమనీయకాంచన•కమలనీలోత్పల,దళచారుతోరణ•ద్వారములను
గారుత్మతస్తంభ•ఘటితవజ్రోపల,స్థాపితద్వారవి•తర్దికలను
రజతభిత్త్యాలేఖ్య•రాజత్పరవ్యూహ విభవాంతకాత్మాది•విలసితముల
తే. వజ్రపంజరగతహరి•వాసుదేవ, రామనామామృతాస్వాద•రాజకీర
శారికలఁ జూచెనాయతి•చంద్రుఁ డనుచు వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. తుంగసౌధోద్గత•ధూపధూమాగ్రవిభ్రాంతినర్తితగృహ•బర్హిణముల
రాశీకృతస్వర్ణ•రజతనానారత్న,విలసితబహువస్తు•విపణికలను
నభ్యస్యమానశ•స్త్రీయఘోషవ, న్మాణవకాశ్రిత•మంటపముల
నవరత్నఖచితనా•నారత్నచిత్రిత,రత్నసానూపమ•రథయుగంబుఁ
తే. జూచుమను రథవీథులఁ•జుట్టి తిరిగి, మాడతిరువీథివైష్ణవ•మందిరముల
నుడయవరు చూచి యానంద•మొందె ననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. మహితస్వదాస్యనా•మము లుచ్చరించుచు, వందనంబులు సేయు•వైష్ణవులను
గరుణాకటాక్షవీ•క్షణముల వీక్షించి, కుశలము లడుగుచు•గురువరుండు

చూచి పంచాయుధ,సురుచిరద్వారపా,ర్శ్వములను రత్న•కవాటములను
నాలేఖ్యలిఖితప•రాంకుశపరకాల,విష్ణుచిత్తాద్యార్య•విగ్రహముల

తే. ద్రవిడవేదవిదంగనా•రచితరుచిర,రంగవల్లీవిరాజద్గృ•హాంగణముల
శౌరికైంకర్యనిరతవై•ష్ణవుల ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర. 51

సీ. సన్నిధితిరువీథిఁ•జక్కఁగాఁ జూచుచుఁ, గోవెల వలగొని•గోపురంబుఁ
గని మ్రొక్కి లోఁ జొచ్చి•గారుత్మతస్తంభ,బలిపీఠములకడఁ•బ్రణతిఁ జేసి
ప్రక్రమం బొనరించి•పదుగురుసూరులఁ, గన్నులపండువు•గా భజించి
యందఱాళ్వారుల•కభిమానపుత్రి యౌ,భట్టనాథునిముద్దు•పట్టిఁ జూచి

తే. మ్రొక్కి పొగడిన నద్దేవి•ముదముఁ జెందె. తనమతోఁ బుట్టు వితఁ•డనితలఁచి మదిని
బలికె నిట్లని యతిభూమి•భర్తకనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. పంచదారయుఁ దేనె•పండ్లు మంచివి గూర్చి, నూఱుబానలవెన్న•నోటిచవికి
సిరి కాటపట్టైన•తిరుమాలిరుంజోలె, నంబి కర్పించితి•నాదుమదిని
ఆనామనోరథ•మన్నా యొనర్చితి. వని నిన్ను మది మన•యయ్య మెచ్చె
సర్వజ్ఞ నీవు నా•సైదోడవై యుండఁ,గా నేమికొఱఁతలు•గలుగు మదిని

తే. ననుచువినుతించిబహుమతు•లాచరించు, శూడికొడుతనుజెలియలి•జూచిగురుడు
సంతసించుచు హరిఁజూడఁ•జనియెననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. గర్భగృహంబునఁ•గనిపించువడపెరుం,గోయిలునుడయాను,గోపరూపు
హరిఁ జూచి పొగడి తి•ర్వాలవట్టము తీర్థ,శరకోపమును సత్ప్ర•సాద మంది
వీడ్కొని వెల్వడి•విమతుల నిరసించి,యచటిసూరులకు భా•ష్యార్థ మొసఁగి
శిష్యవర్గముతోడ•శ్రీముష్ణమున కేఁగి. శ్వేతయజ్ఞవరాహ•సేవఁ జేసి

తే. వెడలి చాంపేయవనమందు•విలసమాన,వీరనారాయణపురంబు•విభవ మెల్ల
గన్నులింపొంద యతిరాజు•గాంచె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. అప్పురి హరిరత్న•హాటకగోపుర,మంటపప్రాకార•మందిరములఁ
జూచి యాహ్లాదించి•జోహారుఁ గావించి, ప్రక్రమం బొనరించి•భక్తి నందు
మహనీయగుణజాలు•మన్నారురాజగో,పాలు శ్రీరుక్మిణీ•భావలోలు
నాపాదమస్తక•మనుభవించి నుతించి, శరకోపతీర్థప్ర•సాదములను

తే. స్వీకరించియతీంద్రుఁడా•క్షేత్రమందు. శేషికైంకర్యములయందు• సేమ మరసి
శ్రితబుధాళికి భాష్యంబుఁ•జెప్పెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. అత్యంతభక్తిమ•యాష్టాంగయోగము, శ్రీనాథముని యెందుఁ•జేసె ముందు
నచ్చోట నిలిచి యా•హ్లాదించి వలగొని, చేమోడ్చి యచ్చటి•శిష్యజనుల
మన్నించి భక్తితో•మన్నారురాజగో,పాలుని వీడ్కొని•బయలుఁ జెంది
పాండ్యదేశస్థిత•బాహుదివ్యదేశము లన్నియు సేవించి•యతివరుండు

తే. రీవి జీవేశభిదను జా•టించి దెసల, జయముఁ జేకొని శ్రీరంగ•శాయికడకు
వచ్చె మరలియు మాన్యులు • మెచ్చననుచు, వాదిభీకరగురుఁ డనె• మోద మలర.

సీ. సస్యమాలికలచే•సాంద్ర మై విలసిల్లు, భవ్యకావేరిగ•ర్భస్థలమున
సద్రత్నగోపుర•స్ఫాటికప్రాకార, సప్తకకల్పద్రు•సంవృతంబు
పద్మకోశోజ్జ్వల•ప్రణవరూపామ్నాయ, శిఖరదివ్యవిమాన•శేఖరంబు
మరకతమణిమయ•మహనీయబలిపీఠ, గారుత్మతస్తంభ•కలితముఖము

తే. మణిమయస్తంభగుంభిత•మంటపంబు, మధురగీతము శ్రీరంగ•మందిరంబుఁ
జెంది యతిపతి జోహారుఁ•జేసె ననుచు, వాదిభీకరగురుఁడనె• మోదమలర.

సీ. గంగతో వాదాడి•కావేరి యెవ్వని, గర్భమందు లభించెఁ•గాంక్ష దీఱ
నాద్యస్వయంవ్యక్త•మాలయ మెవ్వాని, కిక్ష్వాకుకులధన•మెవ్వఁ డయ్యెఁ
బదుగురాళ్వారులుఁ•బాడి రెవ్వనియంఘ్రి, గురుపరంపర కాది•గురుఁడెవండు
బ్రహ్మకారాధ్య మౌ•పరదైవతం బెవ్వఁ, డారంగపతి నమృ•తాబ్ధికరణిఁ

తే. గాంచియధ్వశ్రమంబెల్లఁ•గడలుద్రొక్క, సంయమీశ్వరుఁడానంద•జలధియందుఁ
జాల నోలాడుచును నుతి•సల్పెననుచు, వాదిభీకరగురుఁ డనె• మోదమలర.

సీ. పరభక్తదళు కొత్తఁ•బల్లాండుఁ బాడి యా, శ్రీపాణియోగి వ•చించినట్లు
శ్రీపాద మాదిగా•శిరముపర్యంతము, శ్రీరంగనాథుని• చెలువుఁ జూచి
తదనుభవోదితో•దార మహానంద, పరవశుఁ డై నశ్రీ•భాష్యకారుఁ
గూర్మిఁ గటాక్షించి•గురుహర్షమున మించి, దరహాసచంద్రికో•దారమధుర

తే. సారగంభీరసూక్తుల•గారవించి, రంగు మీఱంగ శ్రీరంగ•రాజశౌరి
పలికె నిట్లని యాయతి•భర్త కనుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

సీ. పరతత్త్వమీనేను•బరజీవభేదము, రాద్ధాంత మని భాష్య•రత్న మిట్లు
రామానుజా నీవు•రచియించి దెసలను, బాహ్యకుదృష్టుల•భంగపఱిచి

భారతిచేఁ జాల•బహుమతులను గాంచి, దివ్యదేశములను•దీరుపతిచి
మందచేతనులను•మాకు భవ్యులఁ జేసి, యస్మజ్జయధ్వజ•మైతి వీవు

తే. మఱియు నాప్రాణపద మైన•మంత్రి వీవె,కనుక నిచ్చితి భూతియు•గంబు నీకు
నేలు మది యని పల్కె-రం•గేశుఁ డనుచు,వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. ఆసూక్తులను విని•హర్షించి యతిపతి, పలికె ని ట్లని రంగ•పతికి మరలి
స్వామి దేవరకృప•సకలము సమకూడుఁ, దక్కవే మగును నీ•దాసులకును
నీయాజ్ఞఁ దలఁ దాల్చి•నీయనుగ్రహముచే, నీపని సలుపుచు•నే సుఖింతు
నని పల్కి-యతిపతి,కారంగపతి మెచ్చి• శఠకోపతీర్థ•ప్రసాదములను

తే. బరమకృపచేత నిప్పించి•పంచె నంత, యతిశిఖామణి వెల్వడి•యాలయప్ర
దక్షిణముఁ జేసి చనెఁ దన•తావున కని, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. సకలవైష్ణవులు పా•ర్శ్వములందు వెనువెంట, నుపనిషదుక్తుల•నుగ్గడింప
వీధివీధులయందు•వివిధచేతను లుపా•యనపాణు లై తన•యంఘ్రిఁ గొల్వ
వైష్ణవపోషణ•వరగుణభూషణ• పరమతభంజన•బహుపరా క
టని వేత్రపాణులు•తన మ్రోల వినుతింప, నృత్తగీతధ్వని•నింగి నెరయ

తే సాంద్రతరకీర్తి యతిలోక•చక్రవర్తి•వచ్చి తనమఠ మొందెను•వసుధగెలిచి
శిష్యు లర్ఘ్యాదివిధులను•జేసి రనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. ఆడియా డనినఁ బ్ర•త్యాషాఢమునదృష్టి•రహి యగం గృహముక•రైందుకరఁగి
యిశచుఃఖగీతంబు•హెచ్చుగాఁ బాడి క•ణ్ణీర్మల్గి కన్నుల•నీరు గాఱి
యెంగుమంతటనాడి•స్వేచ్ఛవెదకియొక్క-•నృహరికోవెలఁజొచ్చి•బహువిధముల
వాణుదల్నొసటిపై•వడి మోఁదుకొని వాడు, వాడునీలోకము•వాడుననుచు

తే. నాట లాడుచు బాలకు•లాడి యాడి, యనెడుపాట కపార్థ మి•ట్లనివచింప
శ్రీయతీంద్రుఁడు విని వ్యథ•జెందెననుచు•వాదిభీకరగురుఁడనె•మోదమలర.

వ. అంత యంతీంద్రుం డాశ్రితవర్గంబుతో నొక్కనాఁ డొక్కతిరువీధియం దేతెంచు
చున్న సమయంబున నొక్కయెడ ద్రవిడదారకు లందఱుఁ బెంపుగా గుంపు
గూడి క్రీడ లాడుచుండ నం దొక్కప్రగల్భార్భకుండు బాలకులారా 'ఆడియా'
డీ త్యాదిపాఠరంబున కర్థంబు విశదంబు గా వివరించెద సావధానమనస్కు లై
వినుం డనుచుఁ దన్మధ్యప్రదేశంబునం గూర్చుండి యాచార్యత్వంబువహించి
వారి నుద్దేశించి యాడియాడి యనఁ బ్రత్యాషాఢమాసంబునందు నగం గరైం

దన మెండుగాఁ గురియుదండివర్షంబుచే విధ్వస్తంబులై గృహంబులు కరఁగిపోవ యిళపాడిప్పాడి యన రోదనాత్మకగీతంబులు సారెసారెకుం బ్రవర్తింపంజేసి కణ్ణీర్మల్గి యనఁ గన్నులవలన రుదితాశ్రుధార లొలుక నేడ్చి 'యెంగుంనాడియాడి' యన శీతవాతాహతి కోర్వలేక నివసింప నంతటఁ జోటు వెదకి వెదకి యొక నృసింహాలయంబు పొడగాంచినరసింగా వెన్న యన నరసింహా యనుచు 'నివ్వాణుదలే' యన ముఖలిలాటాదులు మోఁదుకొనుచు వాడువాడు మన నాహారంబు గానక జనంబు మిగుల శోషించె నని యప్పిన్నవాఁ డీ ట్లపార్థం బుగా వర్ణింప నాకర్ణించి మిగుల వగచి లక్ష్మణార్యుండు మిగులుస్వాము లందఱు వినఁ దిరుక్కురుహప్పిరాన్ బిళ్ళానవెడునిజాభిమానపుత్రునిం గటాక్షించి యి ట్లనియె. 64

సీ. నారాయణుఁడు తన•నాభిపద్మంబున, బ్రహ్మను నిర్మించి•ప్రాఁజదువుల
నతనికిఁ దెలిపిన•ట్లాత్మాంశమున నమ్మ•యాళ్వారిఁ బుట్టించి•యగ్గురునకు
ద్రవిడోపని దర్థ•తత్త్వముఁ దెలుప నా•తఁడు నాథముని కిది•దయ నొసంగె
నాతండు పుండరీ•కాక్షున కది దెల్పె, నది రామమిశ్రుల•కతఁ డొసంగె

తే. యాళవందారు కాయర్థ•మతఁడు దెల్పెఁ, గూరమాలాధరాదిస•ద్గురుల కతఁడు
దెలిపె నని లక్ష్మణార్యుండు•పలికె ననుచు, వాదిభీకరగురుఁ డనె• మోదమలర.

సీ. కూరమాలాధర•గురుఁడు మా కొసఁగె నా•ద్రవిడోపనిషదర్థ•తత్త్వ మట్లు
రమ్యోపదేశప•రంపరాప్రాప్త మీ•యర్థంబు వ్యాఖ్య గా•నలర కున్న
బహ్వపార్థంబుల•బాలమూఢాదులు, వర్ణించెదరు తిరు•వాయిమొళికి
ననుచుఁ దిరుక్కురు•హప్పిరాన్ బిళ్ళాను, కాయతీంద్రుం డొక్క•వ్యాఖ్యసలుపు

తే. మని విధించిన నిజదేశి•కాజ్ఞ నతఁడు, రమ్యపదముల విష్ణుపు•రాణసంఖ్య
చెలఁగ నారాయిరప్పడిఁ జేసెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. అక్కురుకేశుఁ డా•వ్యాఖ్యానరత్నము, నెంబెరుమానారు•కెదుట నునుప
నమ్మహాత్ముఁడు చూచి•హర్షించియావ్యాఖ్య•భాష్యంబుతోడుత•బ్రవచనంబు
నలుప నియోగింప•సకలవైష్ణవు లట్లు, సలిపిరి యతిరాజు•శాసనమున
నవని నాయుభయవే•దాంతము లిప్పటి. కైన సద్భక్తితో•నధికరింప

తే. సత్త్వమాస్తిక్యమలరంగ•సద్గురూప,సదనమొనరింతురేసదా•చారపరులు
వారె పో నిత్యసూరులు•వసుధ ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

స్రగ్విణీవృత్తము

మంగళవాసస•న్మానసీమోదయా, సంగతాసంగదో•షజ్ఞచూడామణీ
యింగితాభిజ్ఞ భ•క్తేష్టసంధాయకా, రంగరాజప్రియా•రామ రామానుజా.

క. మూకాపవర్గదాయక, శ్రీకస్తురిరంగదివ్య•సేవధిలాభ
ప్రాకటవిభవతృణీకృత,భూకాంతాకాంతహృన్న•భోదినకాంతా. 69

మాలినీవృత్తము, హుతహవనిరవద్యా•యుల్లసద్గద్యపద్యా
సతతవిజయకీర్తీ•సర్వవేదాంతపూర్తీ
వితరణగుణశీలా • వేదవృక్షాలవాలా
పతితకుమతిదండా • భాగినేయత్రిదండా. 70

గద్యము. ఇది శ్రీభగవద్రామానుజకరుణా కటాక్షకలితకవితా వైభవపరవాది భయంకరాచార్యాభిమతచ్ఛాత్రాపస్తంబసూత్ర కణ్వసగోత్ర పవిత్రోభయకవిమిత్ర వేంకటకృష్ణార్యపుత్ర విబుధవైష్ణవవిధేయప్రణీతం బైనయాచార్యసూక్తిముక్తావళి యనుమహాప్రబంధంబునందు మధ్యమభాగంబున శేషాద్రియందు శ్రీవేంకటేశుని శ్రీపురియందుఁ దిల్లగోవిందరాజును ఘటికాచలంబుననరకేసరిని గృధ్రసరసీతీరంబున శ్రీవిజయరాఘవుని హస్తిగిరియందు వరదుని భూతపురియందుఁ గేశవస్వామిని వీక్షారణ్యంబున వీరరాఘవస్వామిని భక్తారామంబున భక్తవత్సలునిఁ దోతాచలంబునఁ బంచవిధుండగు శ్రీహరిని మహీసారపురంబున శ్రీభక్తిసారమునులను దదారాధితుం డైనహరిని భాగినేయుని జన్మస్థానంబును గైరవిణీతటంబున శ్రీపార్థసారథిని మయూరపురంబున మహదాహ్వయయోగినిఁదదర్చనీయుండగు కేశవస్వామిని మల్లపురంబున భూతయోగీంద్రునిఁ దదారాధనీయశౌరిని మరల భూతపురీశుని గాంచీపురంబున వరదుని నష్టాదశస్థితభగవన్మూర్తులను మధురాంతకవాసి యగుపద్మాకరరక్షకహరిని శ్రీవిల్లిపుత్తూరుఁ జెంది పడవెఱుంగోయిలుడయా నని యెడిపరమపురుషుని శ్రీముష్ణంబున యజ్ఞవరాహదేవుని మన్నారుకోవెలరాజగోపాలుని మఱియుఁ బాండ్యదేశంబునం గలదివ్యదేశాధిష్ఠిత భగవన్మూర్తులను సేవించి మంగళాశాసనంబు లొనర్చి యెల్లదిక్కులఁ జీవేశ్వరభేదనారాయణపారమ్యాదిస్వసిద్ధాంతంబులఁ జాటించి మగిడి శ్రీరంగధాముని సేవించి ప్రవర్తింపంజేయుం డని శిష్యులకు నియమించుటయు నన్నది షష్ఠోల్లాసము.

— 0 —

శ్రీమతే రామానుజాయ నమః.



# ఆచార్యసూక్తిముక్తావళి

## మధ్యమభాగము

---

## సప్తమోల్లాసము

శ్రీకావేరీగర్భ
ప్రాకారాంతరవిహార • భవ్యవిచారా
శ్రీకరగురుగోష్ఠియుత
రాకేందుముఖాబ్జసుంద,రా యతిరాజా. 1

వ. అవధరింపుము. 2

సీ. శ్రీరంగరాడ్జయ • శ్రీవహధ్వజ మనఁ, జాలురామానుజా,చార్యవరుఁడు
శ్రీరంగమున శ్రిత•క్షేమకృన్మరమందుఁ, గూరనాథాదిస•ద్గురుమతులకు
భాష్యగుహ్యార్థముల్ • పలుమాఱు దెలుపుచు,సుఖగోష్ఠిచేనుండఁ • జోళరాజు
శైవతముం డైన,స్వపురోహితునిఁ గూడి, శైవశాస్త్రము నమ్మి • జడత గ్రమ్మి

తే. యట శివాత్పరతరం నాస్తి • యనుచు నెల్ల
వైష్ణవులచేత వ్రాయింప,వలసి వాఁడు
పిలువ నంపించె వైష్ణవ,బృందము నని
వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. స్వవిషయవాసు లౌ•సకలవైష్ణవులును, వచ్చి యాచోళభూ,పతిని జూడ
వాఁ డీసునను శివా,త్పరతరం నాస్తి య,న్వచన మీయాకుపై • వ్రాసిచనుఁడు
వ్రాయ రేని మదీయ•వసుధలో నుండక, కట్టుపుట్టములతోఁ • గడచి యరుగుఁ
డని పల్క విని కొంద • ఱాభాసవైష్ణవుల్, వృత్తుల గృహముల • విడువలేక

తే. చోళభూపతి చెప్పిన,సుద్దు లెల్ల, వ్రాసి రతిహేయవిషయప్ర,వణుల కేల
తలఁపులో నిల్చి వైష్ణవ•ధర్మ మనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. పాపిష్ఠభూపతి • పంచ నుండఁగరాదు, తద్దత్తవృత్తులఁ • దలఁ పరాదు
గురుధర్మ శాస్త్రమీ • కొలఁదిని ఘోషించుఁ, గాన నీచోళుని • గలుషమయుని
విడిచి యెచ్చటి కైన • వెడలుద మని తల్చి, వైష్ణవోత్తము లెల్ల • వలపదీసి
ముందు యాదవు లెల్ల • మూర్ఖునిఁ గంసుని, విడనాడి పోయిన • విధముదోఁపఁ

తే. గాంచి తిరుమల యదుగిరి • కడకుఁ జనిరి, పాపకర్ముండు చోళుఁ డా • పగిదిఁ జేసి
తన్నుఁ గృతకృత్యుఁ గాఁ దల్చె • ధరణి ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఆచోళభూపతి • యగ్రమందున నిల్చి, పరఁగ నాలూరాను • పలికె నిట్లు
లాభాసవైష్ణవు • లట్లు వ్రాసిన నేమి, సకలసద్వైష్ణవా • చార్యు లైన
రామానుజార్యుల • రమ్యహస్తములచే, వ్రాయింప వశమె యా • బ్రహ్మ కైన
నని పల్కినను విని • యల్గి చోళోర్వీశుఁ, డాత్మీయభటుల రా • మానుజులను

తే. బట్టి తెండని పన్ప న • ప్పాపిభటులు, వచ్చి శ్రీరంగధామముఁ • జొచ్చి యందు
యతిశిఖామణిమఠమున • కరిగి రనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఆరాజభటులు రా • మానుజ శ్రీమఠ, ద్వారమందున నిల్చి • తఱిమి యుఱిమి
రామానుజార్యుల • ర మ్మని రాజాజ్ఞ, యయ్యె నాతని బైటి • కనుపుఁ డనిన
నతిహర్షమున యతి • పతికిఁ దిర్మంజన, మర్పించు చున్న కూ • రాధిపుండు
నతిరహస్యంబు గా • నావార్త నొకవైష్ణ • వాగ్రణిచే విని • యచటినుండి

తే. యవ్వలకు నేఁగి వెల్లల • నచట విడిచి, తనగురునరుణవస్త్ర త్రి • దండములను
దాల్చి యారాజభటులతోఁ • దరలె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. యతివేషధారి కూ • రాధిపుఁ డొంటిగా, వెడలెఁ గదా యని • పెరియనంబి
యత్తుళాయమ్మయౌ • నాత్మపుత్రికతోడ, నమ్మహాత్ముని గూడి • యరిగినంత
యతిరాజు నీ రాడి • యంతర్మరం బొంది, తనదుకాషాయ త్రి • దండములను
ఛాత్రుల నడుగ దా • శరధికూరేశుల, కృత్య మంతయు నంబి • కృత్య మంతఁ

తే. దెలియఁ బల్కిన విని సర్వ • దేశికుండు, కూరనాథునివెల్లలఁ • గొని ధరించి
గాపిపడుచును రఁగేశుఁ • గనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఆరంగనాథుని • యడుగునెత్తమ్ములఁ, గని మ్రొక్కి పొగడె నీ • కరణి గురుఁడు
సమునకు నీ కెందు • శత్రుమిత్రులు లేరు, ధర్మవిరోధిత • త్పరులు దక్కఁ
బరమవైదికధర్మ • బాహ్యకుదృష్టులౌ • దనుజాంశనృపతుల • తలలఁ దఱుగ
నే కాక చక్రాది • నిఖిలాయుధములు నీ, బాహుశోభార్థమా • పరమపురుష

తే. నీపరవ్యూహవిభవాది•నిఖిలదివ్య, మంగళాకృతు లార్యుల • మనుమకొలఁకుఁ
జేసి తీవని యతిపతి • చెప్పె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. బహువిధంబుల నిట్లు•ప్రస్తుతు లొనరించు, శేషమూర్తికి యతి•శేఖరునకుఁ
బ్రణతార్తిహరుఁడు శ్రీ•రంగధాముఁడుసుప్ర,సన్నుఁడై కరుణ•నీసరణిఁబల్కె
సత్యంబుఁ బలికెదు • సజ్జనోత్తమ నీకు, నీవారికైనను • నేర్పు దొలఁగి
నాబాహులైన న•న్యాయం బొనర్చెనా, ఖండించెదను వానిఁ•గాంక్షపడక

తే. చోళరా జెంతమాత్రుండు • చూడ నిపుడు
కాల మీక్షించు చున్నాఁడఁ • గాన వానిఁ
జంప నని పల్కె నారంగ•శౌరి యనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. నీ వీడ నుండక • నేఁడె యేఁగుము తండ్రి, కాల మేరికి నైనఁ • గడపరాదు
కాలంబు నేనె క•న్కొను సర్వజగము లీ,కాలవశ్యము లగుఁ • గల్ల గాదు
మేలునాటికిఁ బొమ్ము • మేలు నీ కగు నన్నఁ, బ్రణతి యొనర్చి శ్రీ•రంగపతికి
దాశరథ్యార్యాది•ధన్యులు త్వరపెట్ట, విడిచి యారంగము • వెడలె గురుఁడు

తే. అంత యతిపతి గురుశిష్యు•లయిన పెరియ,నంబి కూరేశుఁడును జోళ•నగరిబైట
నుపవనస్థలి నొక చోట•నుండి రనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. వారు వచ్చినవార్త•చారులు చెప్పఁగా, నాలించి చోళుఁ డి•ట్లనుచుఁ బల్కె
రామానుజుల నిందు • రప్పించితిని శివా,త్పరతరం నాస్తి య•న్వాక్య మతని
చేత వ్రాయించెద • ఖ్యాతిగా నన విని, పలికె నాలూరాను • వాక్య మిట్లు
వచ్చినవాఁడు శ్రీ•వత్సచిహ్నగురుండు, గాని రామానుజ•మౌనిరాజు

తే. గాఁ డతనిఁ బిల్వ శక్యంబు•గాదునీకు, నప్రమేయ ప్రభావుఁడా•యతివరేణ్యుఁ
డనుచుఁ బలికిన నలిగె న•య్యధముఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. కనలినభ్రాష్ట్రము • కరణి మో మేర్పడఁ, గన్నుల నిప్పులు • కడఁగి రాలఁ
బేరల్కతోఁ బండ్లు • పెటపెటఁ గొఱుకుచు, మృదులాసనంబుపై • మిట్టిపడుచుఁ
బాపిష్ఠుఁ డౌభూమి•పాలుఁడు రామాను,జార్యుల రప్పింప • నతిరయమునఁ
బ్రకటనిశాటనో•ద్భటులను భటులను, బంచిన వా రేఁగి • భాష్యకార

తే. దేశికేంద్రుఁడుచనుచున్న•తెరువెఱింగి, తోడనేతెంచికనుచూపు•దూరమందుఁ
జూచిరావైష్ణవాంభోజ • సూర్యు ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

ఆరాజభటుల న•దూరవారులఁ జూచి, యీపాతకులవల్ల • నేమికొఱఁత
వచ్చునో యీయతి•వల్లభునకు నని, శిష్యు లందఱు మదిఁ • జింత సలుప
నిసుక చేరెఁడు పట్టి • యెంబెరుమానారు, భట్టనాథోక్తప్ర•బంధమందుఁ
గొడుమశైయ్యనియను•గుదుగాథపరియించి, చల్లించెశిష్యహ•స్తమునవదియుఁ
బరశురాముఃస్వర్గసో•పానసరణి,పరిఖ యై తోఁచు శ్రీరామ•బాణమట్లు
ఘోర మైతోఁచెనా త్రోవ • వారి కనుచు, వాదిభీకరగురు డనె•మోద మలర.

పాండవదూతను • బట్టఁ దలంచిన, ధార్తరాష్ట్రులప్రయ•త్నంబుమాడ్కి
నాజి సౌమిత్రిబ్ర•హ్మాస్త్రుగ్రశక్తిపై, నతులాతికాయప్ర•యత్నమట్లు
వాసిష్ఠకరధృత•బ్రహ్మదండంబుపై. వరకౌశికాస్త్రప్ర•పంచమట్లు
పరమభక్తుం డైన•ప్రహ్లాదుపైఁ బంచు, నిద్ధశుక్రసుతోగ్ర•కృత్యయట్లు
సంయమీంద్రునిపైఁ బాప•జాతినృపతి, దురభిమానంబుచే సల్పు•ద్రోహవితతి
యాత్మనాశైకకారణ • మయ్యె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

అడుగు ముందఱి కిడ•నవశులై మరలి యా, రాజసేవకులు మా•ర్గమునఁ జనుచు
మంత్రవాదముఁ జేసి • మాయఁ గల్పిండి యీ,బాఁపలు మనచేతఁ • బట్టువడక
చని రని పలుకుచు • స్వపురంబునకు నేఁగి, రాయతీంద్రుండు మ•హాత్ముఁ డంత
శ్రీదాశరథ్యాది•శిష్యులతోఁ గూడి, పడమటిదెసత్రోవ • బహుళదుర్గ
ఘోరకాంతారగిరినదీ • పూరములను, జారుసౌరభపద్మాకా • సారములను
గడచి చను మండె నబ్బలు • కాన ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

పాళురం బొక్కటి • పరియించి యతిరాజు, పెడికెడుమ న్నెత్తి • పృథివిఁ జల్లి
నది హెచ్చి పగవారి•నందఱ నోడించి, సంయమీంద్రునిభక్త•జనులఁ బ్రోచెఁ
గాన నాళ్వారుల•ఘనదివ్యసూక్తుల, న్నిల మహామంత్రము • లెంచి చూడ
నది గన్కనే కదా•యస్మదాచార్యులు, పదుగురాచార్యులసత్ప్ర • బంధములకు

వ్యాఖ్య లొనరించి మనబోఁటి • యాశ్రితులకుఁ
దెలియఁ దగినట్టియర్థముల్ • దేటపఱిచి
చేసి యుపకృతి బలువాసిఁ • జెంది రనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

ఛాత్రులతోఁగూడఁ•జని యతిపతివారి, నెడఁబాపె దిగ్భ్రాంతి • పొడమినట్లు
తెరువు దప్పి చరింపఁ • దిరుమలనల్లాను, సంబంధు లైనని•షాదవరులు

తమతమపొలములు • దగిలి బాగొనరింప, గుంపుగానొకచోటఁ • గూడియుండి
యెదుటిగుబ్బలికడ • నేతెంచుచున్నట్టి, వైష్ణవు నొకరిని • వారు చూచి

తే. యుచితదేశసముల్లస•దూర్ధ్వపుండ్ర,ముల నిరీక్షించివైష్ణవ•ముఖ్యుఁడనుచుఁ
జేరఁ జని మ్రొక్కియిట్లువ•చించి రనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఎందుండి వచ్చెద • రెటకు విచ్చేసెద, రని యమ్మహాత్ముని • నడుగ నతఁడు
శ్రీరంగముననుండి • చేరితి మిచ్చోటి, కని పల్క మరల వా • రడిగి రిట్లు
రామానుజాచార్య•రత్నము కుశలియే, శ్రీరంగపతి మేలె • సిరికి శుభమె
యని యడిగిన వారి • కాతఁ డి ట్లని పల్కె, నేమిరంగేశుఁ డిం•కేటిసిరులు

తే. చోళబాధల కోర్వక • శుక్లవస్త్ర,ధారియై యతివరుఁడు త్రి•దండ ముడిగి
చనియె నాతని వెదకెద•ననియె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ అతికఠోరము లైన•యావాక్యముల విని, హాకష్ట మిది యని•యార్తిఁ జెంది
నాఁటనుండియు షడ్డి•నంబు లాహారంబు, వర్జించి పొలములోఁ • బనులుఁమాని
యావ్యాధపత్తము • లవ్వోట న ట్లుండి, రంత నాఱవదిన•మందు రాత్రి
బెడిదంపుజడివానఁ • దడిసి కాఱువిడలో, వడవడ వడఁకుచు • బడలి యొదలి

తే. తడిమడుఁగులుబెడఁగొఁదఁ•బిడిచిముడిచి, యొక్కగిరికడనున్నట్టి•యుడయవరుల
శిష్యు లేతెంచి మరలిభ•జించి రనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ నష్టమౌన్వేష్టధ•నంబుఁ జూచినమాడ్కి, స్వగురునిఁ బొడగాంచి • సంతసించి
తమ రొందువర్షబా•ధలఁ దలంపక మదిఁ, దమదుకష్టముఁ జూచి • తాపమొందు
శ్రీదాశరథ్యాది•శిష్యులఁ గనుఁగొని, సంయమీశ్వరుఁడు దా • సంతసించి
యెదుట నించుక వెలుఁ • గీక్షించి యచటికి, నన్నుఁదోడ్కొనిచనుఁ • డన్నవార

తే. లాయతీంద్రునిఁ దోడ్కొని • యచటికేఁగి, యగ్నికడనున్నయానిషా•దాధిపతులఁ
జూచి యిట్లని పలికి రా•సూరు లనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. వత్సకులార యీ•వహ్ని నపేక్షించి, వలి గొని వచ్చితి • మలసి సొలసి
యీవహ్నికడకుఁ ద్రో • వెట్లని యడుగ నా,వనచరులును వచ్చి • వారిఁ జూచి
వసుధామరులు వీరు • వలిగొని యున్నారు, వాంఛితము లొనర్ప•వలయు వీరి
కనితల్చి యనలము • నత్యుజ్జ్వలముఁ జేసి, పొడిమడుంగులొసంగి•తడిపటములు

తే. శుష్కములఁ జేసి యిచ్చినఁ•జోద్య మొంది, శీతబాధల విడనాడి • ప్రీతిఁ జెంది
యగ్నిచుట్టు వసించి ర•య్యార్యులనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. శుష్కేంధనములచే • జొత్తిల్లు చున్నట్టి, పావకార్చులు రాత్రిఁ • బవలు పేయ
నావ్యాధసత్తము • లమ్మహాత్ములఁ గాంచి, యెందుండి వచ్చితి • రిచటి కవిన
శ్రీరంగధాముని•వెంతనుం డిచటికి, వచ్చితి మి ట్లని • వారు పలుక
నెంబెరుమానారి • కేమికొ•అంతలు, లేవు గదా యని • లెస్స యడుగ

తే. మీర లెంబెరుమానారు•సూరి నెట్లు, దెలియ నేర్చితి రది మాకుఁ•దెలుపుఁడనిన
వారి కిట్లని పలికి రా•వ్యాధు లనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. తిరుమలనల్లాను • గురు నాశ్రయించియీ•యాత్మల కొకహిత • మడుగ నతఁడు
మది నెప్పు డెంబెరు•మానారుపాదార•విందమే శరణంబు • వేఁడుఁ డిదియె
పరమహితం బని • పలుక నయ్యతిపతి, నెఱిఁగితి మని వన•చరులు పలుక
మన్నించి యెంబెరు•మానా రితం డని, చూపిరి వారి కా•సూరు లంత

తే. రాజదానందబాష్పధా•రలను గురుని, యడుగుఁదమ్ములఁ గడుగుచు•నతులభక్తి
నమ్రులై మ్రొక్కి రావ్యాధ•నాథు లనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. సూరులవల్లను • జోళబాధ లెఱింగి, వగచి యాసంయమి•వల్లభునకుఁ
దచ్ఛిష్యతతికి ఘ•ద్బాధోపశాంతికై, యరాత్రి యనుగుణ • మైనయట్లు
కటుకులు గానివి • గా నేర్చి గంపెకం•కులు జుంటితేనియల్ • క్రొత్తచట్లు
నావనచరు లియ్యె • నాకంకులను వేఁచి, నైపుణ మొప్పఁగా • నలిచి చెరిగి

తే. చెన్నుగాఁ దేనెతోఁ గూర్చి • శ్రీధరాది గురుపరంపర కర్పించి • గురునితోడ
నారగించిరి దాశర•థ్యాదు లనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఆరాత్రి సుఖనిద్ర • నచ్చోటఁ గావించి, యరుణోదయపువేళ • నార్యరచిత
వరనుతి మేల్కాంచి • గురుపంక్తిని దలంచి, హరిశాసనంబుల • నాచరించి
శ్రీరంగమందలి•సేమంబు తమకును, దమసేమ మచ్చోటి•దాసులకును
దెలియఁగలందుకుఁ • దేట గా లిఖియించి, శ్రీముఖం బొక్కటి • చేతి కిచ్చి

తే. యాత్మసన్నిధివైష్ణవు•లందు నొకరి, నానిషాదులయం దొక్క•యర్హతముని
నిరువురను గూర్చి పంపె య•తీశుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. ఎవ్వానిపదపద్మ•మేప్రొద్దు దలఁపుఁడీ, యనుచు నస్మద్గురుం•డాన తిచ్చె
నెవ్వనివిపదుక్తి•యీమనచెవిఁ బడ, నార్తిఁ బ స్తుండితి•మా ఋనాళు
లట్టిమహాత్ముండు•యతిలోకనాథుండు, పరదైవతము మన•పరమగురువు
వెంగళు లైనట్టి•పంగులపైఁ బాఱు,భాగీరథికొలందిఁ•బరమ కృపను

తే. వచ్చిప్రత్యక్ష మయ్యెనీ•పశుసములకు, నేఁడు ధన్యుల మైతిమి•నిక్క మనుచుఁ
దలఁచి సంతస మంది రా•దాసు లనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. నల్వదేవురు జగ•న్మాన్యు లార్యులు గొల్వ, యతిరాజు పయన మై•యరుగువేళ
నానిషాదాగ్రణు•లందఱు సాష్టాంగ.దండప్రణామముల్•దనరఁ జేసి
తళిగ నర్పింపఁగాఁ•దలఁచి యుల్లములన, య్యార్యులఁదోడ్కొని•యరిగి యచటి
యద్రికిఁ బడమట•నర్ధయోజన మేఁగి, త మ్మేలుదొరయిల్లు•నెమ్మిఁ జొచ్చి
తే. యతఁడులేకున్న నాతని•సతినిఁ జూచి, యస్మదాచార్యులేతెంచి•రనుచుఁ జెప్పి
వారిఁ జూపించి రాతని•వనిత కనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. ఈయుడయవరుల•కీప్రొద్దు పెరుమాళ్ళ, తళిగకుఁ దగినట్టి•ద్రవ్యములను
మాదొరకెఱిఁగించి•మాసంబళములందు, వ్రాయించియొసఁగు మ•వశ్యమనుచు
నేలికసాని కి•ట్లేర్పడఁగాఁ జెప్పి, యొప్పించి యతిభక్తి•నుడయవరుల
స్వాముల వలఁగొని•చాఁగిలఁబడి మ్రొక్కి, వీడ్కొని యరిగి య•వ్విపినచారు
తే. లుచితవృత్తి సుఖించుచు•నుండి రంత, సంధ్య పొడమిన వనచర•స్థపతియలసి
వేఁటఁ జాలించి యేతెంచె•వీటి కనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. వనచరస్థపతియు•వచ్చి జలము లాడి, తనభార్య చెప్ప నం•తయును దెలిసి
బాఁపలు మనయింటఁ•బస్తుండి రని తల్చి, యాఁకొని యుండియు•నశనముడిగి
భృత్యుల నిర్వురఁ•బిలిచి యిట్లనియె నీ, బాఁపనపల్లి కి•బ్రాహ్మణులను
దోడ్కొని చని మీరు•వేడ్కతో వీరికిఁ, దళిగకు వలసిన•ద్రవ్యములను
తే. వాసి నిప్పించి యాఁకంటి•గాసిదీఱ, భోజనము సేయుయోగంబు•పొందుపఱిచి
రండు పొం డనె నావ్యాధ•రమణుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. తమదొరయానతిఁ•దలఁ దాల్చి రామాను, జాచార్యులను దదీ•యాశ్రితులను
వెంటఁబెట్టుక కూఁత•పెట్టుదూరముపోయి, యొక చిన్న పల్లెటూ•రొనరఁ జొచ్చి
యందుఁ గట్టళవారి•యనియెడు బ్రాహ్మణ, సదనమందునఁ జోటు•కుదురుపఱిచి
తళిగకు వలసిన•ద్రవ్యము లని యొ,సంగఁ గట్టడిఁ జేసి•స్వాములార
తే. పచన మొనరించి సాపడి•పవ్వళింపుఁ
డనుచు మ్రొక్కిడి యరిగి ర•య్యటవిచారు
లుడయవరుతోడ నాయ్య లం•దుండి రనుచు
వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. ఆయింటి•పుని•కభిమత యగుపత్ని, తనయింట వైష్ణవో•త్తములఁ జూచి
యెవ్వరిసంబంధు•లెవ టాశ్రయించితి, రెందుండి వచ్చితి•రిచటి కనిన
మానిని యెంబెరు•మానారుసంబంధు,లము తత్పదాశ్రితు•లము ధరిత్రిఁ
బ్రత్యక్షవైకుంఠ•పదముఁ దిచటికి, వచ్చితి మనిన న•వ్వనిత సంత

తే. సించి సేవించి వారల,సేమ మడిగి, యారగింప నిమంత్రింప•నంత వారు
వలదు మా కని పలికి రా•వెలఁది కనుచు, వాదిభీకరగురుఁడనె•మోద మలర.

సీ. మన్నించి యెంబెరు•మానారుశ్రీపాద, మాశ్రయించితిఁ గాన•నతఁడె తండ్రి
చెలియలి నైతి నా•కొలఁది మీకది గాన, నారగింపుఁడి సంది•యంబు లుడిగి
యని పల్క యతిపతి•నాశ్రయించితివెందు, నవి సూను లడుగ న•య్యతివచెప్పె,
దేవమాతృక మైన•దేశము గాన ముం, దిం దనావృష్టిఁ బై•రెల్లఁ జెడిన

తే. గాసిపడలేక వచ్చి రం•గమున నొక్క,మచ్చుపై జోటు గల్గిన•మగనితోడ
నుంటిమనిపల్కె నావాలుఁ•గంటి యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ, ఆరంగధామున•కఖిలకైంకర్యముల్, సలుపుచు సంయమి•చక్రవర్తి
మాధుకరం బేడు•మందిరములఁ గొన, విచ్చేయఁగాఁ దిరు•వీథులందు
సకలంకభక్తితో•నకలంకనాటియా,ళ్వా నాదిగాఁ గల•బ్రహ్మవేత్త
లొదిఁగి సేవింప నే•నొకనాఁడు చూచి య,స్మద్దానగృహమున•మాధుకరము

తే. సంగ్రహింపంగ వచ్చిన•సమయమందు,మచ్చుపైనుండి దిగిద్వార•మధ్యమందు
వచ్చి యుండితి ననియె న•వ్వనిత యనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. ఆఁడుసాహసమున•నడ్డమై గవనిలో, నున్న న న్నీక్షించి•యుడయవరులు
దర నిరీక్షించుచుఁ•దరుణి తోఁగివి మ్మన్నఁ, బలికితి ని ట్లని•భయము విడిచి
యతి వీవు మాధుక•రాన్నైకభోక్త వీ, విన్ను రాజులు బుధుల్•నిలిచి కొల్వ
నేమికారణ మిది•యెఱిఁగింపు మనిపల్క, మాకడ నొకదొడ్డ•మంత్రమునికిఁ

తే. జేసి మమ్మనుసరింతు ర•శేషనుజను, లనిన నా కది చెప్పుట•కర్హమేనిఁ
జెప్పుమనియంటిననియెనా•చెలువయనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. ఆమాట విని గురుఁ•డప్పు డీయాత్మకా, మంత్రము కృపఁజేసి•మరముఁ జొచ్చె
మందబుద్ధిని గాన•మఱచితి నామంత్ర, మంతట మద్దేశ•మకిశయించి
పండిన దన విని•పయన మై నాభర్త, త్వరపడ నెట్లు మ•ద్గురుని మరలఁ
జూచెద నని మది•శోకింప నొకనాఁడు, మాధుకరార్థ మ•స్మన్నివాస

తే. మందిరంబునకేతెంచి,మరలెగురుఁడు. మూర్తిగొన్నట్టిమద్భాగ్య,మోయనంగ
ననుచుఁబలికెను వారి కా,యతివ యనుచు. వాదిభీకరగురుఁడనె,మోదమలర.

సీ. అమిద్దెపైనుండి,యప్పుడే దిగి వచ్చి, యెంబెరుమానారు,కెదుట నిలిచి
పరమకారుణిక నీ,కరుణ లభించిన, మంత్రము మఱచితి,మగిడి దాని
నెఱిఁగింపుమనివేఁడ,గురుపరంపరతోడఁ, గూర్చియామంత్రమా,గురుఁడొసంగె
నంత నర్చార్థమై , యర్థింపఁ దనదివ్య,పాదుక లిచ్చి ని,వాస మొందె

తే. నట్టిననుఁగన్నతండ్రి మా,యతివరేణ్యుఁ,డలరుచున్నాఁడొ లేడొ మా,యన్నలార
తెల్పుఁడీ యని పల్కె న,ద్దేవి యనుచు, వాదిభీకరగురుఁ డనె , మోదమలర.

సీ. అట్లు కొంగుపిరాట్టి , యన్నమాటల మది, నరసి యథార్థము , అని తలంచి
యాగురుభక్తికి,హర్షించి తిరుబోన, మొనరింపు మనుచు న,య్యువిదఁ బనిచి
యీసాధ్వియాచార,మీక్షించి ర మ్మని, యొకవైష్ణవునిఁబంచి,రుడయవరులు
మఱుఁగున నొదిఁగియా,మాన్యుఁ దీక్షింపఁగా, సమ్మార్జన మొనర్చి,సదనమలికి

తే. యంఘ్రిపాణులఁగడిగియ,ట్లాచమించి, యతులమంత్రమయస్నాన,మాచరించి
ధౌతవస్త్రముఁ దాల్చెనా,తరుణి యనుచు, వాదిభీకరగురుఁ డనె , మోదమలర.

సీ. గురుపరంపరఁదాల్చి,తిరువాయిమొళి నోరఁ,బలుకుచు నూతన,భాండములను
శాల్యోదనము మంచి,శాకములను ముద్గ,సూపముఁ బాయసా,పూపములను
దీయచారును బాల,తిమ్మనపుళిచారు, సరసంపుజిగురుఁబ,చ్చళ్లొనర్చి
వేఁడాఱకుండను,వెదురుగంపలఁ బ్రసా,దముఁ జేర్చి యన్నిద్ర,వ్యములఁ గల్పి

తే. ధౌతపాణ్యంఘ్రియై తొల్లి,దాల్చు వలువ,వదలి మఱియొకపరిశుద్ధ , పటముఁ గట్టి
తళిగ సన్నిధిఁ జేర్చెనా,తరుణి యనుచు, వాదిభీకరగురుఁ డనె,మోదమలర.

సీ. తిరుమట్టపల్లికి , వరకవాటము మూసి, సన్నిధిదీపంబుఁ , జక్కఁ జేసి
సన్నిధి మ్రొక్కిడి,సంయమీంద్రునిదివ్య, పాదుకాద్వయ మెత్తి,భక్తి నెత్తిఁ
గన్నుల నొత్తుక,కమనీయపీఠమం, దుంచి పైఁ బుష్పంబు,లుంచి మఱియు
ధూప మర్పించి సం,తుష్టి నస్మద్గురు,భ్యో నమో యని య,గ్రభూమిఁ దళిగ

తే. నింపుగా భక్తితో నార,గింపుఁ జేసి, నాతి కర్పూరనీరాజ,నం బొనర్చి
మంత్రపుష్పముఁబెట్టె నా,మాడ్కి ననుచు, వాదిభీకరగురుఁ డనె , మోదమలర.

సీ. మాతండ్రియెంబెరు,మానారు నినుఁదక్క, వేఱెఱుంగ నటంచు , వేడ్కమ్రొక్కి
తలుపు దగ్గఱఁ ద్రోసి , తనమల్లెసాలలో, నున్నవైష్ణవుల కా,సన్నుతాంగి

మ్రొక్కిఁడి నిలిచిన • ముముపు కోవర మున్న.సూరి యేతెఁచియా•సుదతినడత
గురునితిమచ్చెవి • గుసగుస జపియింప. హర్షించి యాతఁ డా•యబల నడిగెఁ

**తే.** దల్లి నీ వాచరించిన•తళిగ్రక్రమము. మాకు వివరింపుమా యను•మాన ముడిగి
యనిన యతిపతి కతివయి•ట్లనియె ననుచు. వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

**సీ.** నీ యనుగ్రహమున • నివ్వటిల్లిన సదా,చారము సలుపుచు • సతత మచట
భాష్యకృత్పాదుకా • పరదైవతమునకు. నర్పించి కాని య•న్నాదు లేమి
స్వీకరింపమి నిప్పు • డాకొలఁదిని దళి. గాచరించితివి మా•యయ్యలార
వేఁడి యాఱకమున్నె • వేగభుజింపుఁడీ. యాఁకొంటిరిదెపాద్య•మనుచుఁ బల్కు

**తే.** నుడయవరుపల్కె నీగురుఁ•డొసఁగినట్టి. పాదుకలఁజూపు మనినంతఁ•బడఁతిదెచ్చి
చూప నిట్లని పల్కె నా•సూరి యనుచు. వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

**సీ.** ఈ వైష్ణవులయందు•నెంబెరుమానారు. గలఁడొలేఁడో చూచి•తెలియు మనిన
నుజ్జ్వలద్దీపంబు • నొకకేలఁ గీల్కొల్పి. పెఱకేలఁ బాదుకల్ • బిగిఁ దగిల్చి
సన్నిధిస్వాముల • చరణాబ్జములకు య.తీశుపాదుకలకు • హెచ్చు తగ్గు
గని యంత శ్రీయతీం•ద్రునిదివ్యపాదార.విందము లందులఁ • గ.దు కొలుప

**తే.** నించుకైనను హెచ్చుత • గ్గేమి లేక. సరిపడినఁ జూచి యాసతి•సంతసించి
భక్తి వారికి నిట్లని•పల్కె ననుచు వాదిభీకరగురుఁ డనె , మోదమలర.

**సీ.** యతిలింగములులేని•కత సందియము గాని,యాయతీంద్రుఁడె యితఁ•డరసిచూడ
నని పల్కు చున్నట్టి•యద్దేవితెలివి కా.శ్చర్యముఁ జెంది రా•వార్యులెల్ల
మహిలోన నెంబెరు•మానా ఽ నేనె కా,నా యని యాయతి•నాథుఁ డనిన
కొంగుపిరాట్టి మ•ద్గురుఁ డితఁ డని నిశ్చ.యించి యంఘ్రులఁ బడి•యేడ్చి హర్ష

**తే.** బాష్పధారల గురునిశ్రీ•పాదములను. గడుగ నాతండు హర్షించి • గారవించి
కన్నుఁగవనీరు దుడిచెను•గరుణ ననుచు. వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

**సీ.** మన్నించి ముందు స•న్మంత్ర మొక్కటి నీకుఁ జెప్పితి దాని నీ • చిత్తమందు
మఱవకుండితి వేని•మాన్య లీ దేశికు. లారగించెదరు నీ•యన్న మనుచుఁ
జెప్పి గురుండు నా•చెవినూఁదుమామంత్ర. మన్న నాసతి యట్టు • లాచరింప
శంక లిం కేటి కీ•సాధ్విపెట్టినయన్న. మతిపవిత్రము భోగ్య•మని గురుండు

**తే.** దేశికేంద్రులకెల్లను•దెలియఁ జెప్పి. యొక్కరమణీయహరిమూర్తి• కొసఁగనట్టి
యన్నములమేముభుజియింప•మనియెననుచు.వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. అర్దేవి యర్పించు•హైయంగవీనము, పాలు చక్కెర మంచి•పండ్లు తనకు
నిత్యసమారాధ•నీయదైవత మైన, వరదున కర్పించి•గురువరేణ్యుఁ
డారగించినమీఁద•నలవిదురాన్నము, హరిక్రియ నాసాధ్వి•యన్నములను
స్వామి లారాత్రి ప్ర•సాపడి నిద్రింప, సద్భక్తిఁ దళిగప్ర•సాదమెత్తి

తే. భద్ర మొనరించి తళిగలు•పరిహరించి, శుద్ధిగావించి మచ్చుపై•సుఖశయానుఁ
దైవభర్తను లేపె న•య్యతివ యనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. చేర్చి ముం దునిచిన•శ్రీపాదతీర్థము స్వపతికి నొక్కవైష్ణవునిచేత
నిప్పించి తా సంగ్ర•హించిన తళిగప్ర,సాద మద్దేవి యొ•సంగ నతఁడు
సాపడి సెజ్జపై•శయనించి తనచెంతఁ, గూర్చున్న భార్యను•గూర్మిఁ జూచి
నీ రెవ్వరని పల్క•విని యస్మదాచార్య, లని తనమగని క•య్యతివ దెలుప

తే. నతఁడు నీవేల సాపడ•వైతి వనిన, గురుఁడు పస్తుండ సాపడఁ•గూడ దనుచు
నంటి వి ట్లనిపల్కెన•య్యువతియనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. తళిగ ప్రసాదంబుఁ•దగ భుజించుటకత, గురుపాదతీర్థము•గ్రోలుకతన
సత్త్వాధికతఁజెంది•సాధుబ్రాహ్మణుఁ డతం, డాత్మపత్నినిజూచి•యనియె నిట్లు
నీవు గోరినపని•నెఱవేర్చెదను దానిఁ, దెల్పు మన్నను సతి•దెల్పెఁ బతికిఁ
బ్రియ యీయతీంద్రుని•శ్రీపాదపద్మము, లీ వాశ్రయించుటే•యిష్ట మనిన

తే. నతఁడు యతిపతిశిష్యుఁడ•నగుదుననుచుఁ, జెప్ప శపథముఁజేయించి•చింతమాని
పడఁతి యప్పుడె లేచి సా•పడియె ననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. భక్తసంగతి లేని•పాపి కజ్ఞతగతి నానిశీథద్వాంత•మతిశయించె
గురుపరాయణులఁ గ•న్గొన నానిశీథినీ, తరుణికన్ను లనంగఁ•దార లొప్పె
నంత నతర్ధ్వాంత•మడఁచుగురుజ్ఞాన, దీపంబుగతి సుధా•దీప్తి పొడమె
సద్గురూపాసకు•షడరివర్గముఁబోలె, దీపర్షతతి తొంటి•తెలివిఁ దప్పె

తే. గురునిపదపాణితలచేల•కరములట్ల, తూర్పుదెస రక్తకాంతులు•తొంగలించెఁ
బరమశోభన మాసుప్ర•భాత మనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. పూర్వదిక్సతికేలఁ•బొలు పొందఁ గీలించు, పద్మరాగంబుల•బంతి యొక్కొ
వాసరశ్రీకాంత•వక్షస్థలి ధరించు, ప్రథిత మౌబంగారు•పతక మొక్కొ
విప్రులు మందేహ•విహతికై పంచిన, దివ్యతర బ్రహ్మ•తేజ మొక్కొ
జగదేకరక్షకై•శార్ఙ్గపంపునఁ దోఁచు, శర్మకరం బైన•చక్ర మొక్కొ

తే. పద్మినీకాంతతొలినోము•పంటయొక్కొ, జక్కువలభాగ్యమో యని•జనులుదలఁప
భువనలోచనుఁ డుదయాద్రిఁ•బొడిచెననుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర•

సీ. అంత సన్నిధివైష్ణ•వాగ్రేసరులు సుప్ర, భాత స్తవంబుల•భక్తి నుడువ
నీరజాక్షుఁడు యోగ•నిద్రను విడిచిన, కరణి రామానుజ•గురువరేణ్యుఁ
డల్లన మేల్కాంచి•యార్యపంక్తిఁ దలంచి, ధవళపస్త్రోత్తర•దర్భశయ్యఁ
గూర్చుండ నంత నా•కొంగుపిరాట్టియు, నిజభర్తతో సుఖ•నిద్ర విడిచి

తే. మచ్చుపై నుండి దిగివచ్చి•మగనితోడ, మ్రొక్కిముదమొప్పలక్ష్మణ•మునులకిట్లు
విజ్ఞు లక్కజపడ విన్న•వించె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. యతిరాజ పుడమి నీ•యవతార మస్మద్వి, ధాత్మరక్షకుఁ గదా•యరసి చూడఁ
గాన ముం దీనన్నుఁ•గరుణించినట్లు మ, ద్భర్తను గరుణింపఁ•దగుదు వీవు
మీకనుకూలుండు•మృదువరి మిమ్మాశ్ర, యింప నీతండు ద•లంచెఁ గనుక
నేఁడు మద్గృహమందు•నిలిచి యీ నాభర్త, కఖిలహితంబుల•నాచరింపు

తే మనుచు నాసతి ప్రార్థింప•యతివరుండు, పాలు చక్కెర గలిపిన•పగిది వీర
లిరువు రొక పైన మే లని•యెంచె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. ఉడయవ రాసాధ్వి•యుచితోక్తి కొడఁబడి, కాలోచితక్రియా•కలనమునకు
స్వాములతో నొక•సరసి కేఁగినయంత, సమ్మార్జనాదుల•సదనమందుఁ
గొను రొప్పఁ జేసి సాం•కురపూర్ణకుంభముల్, దనగృహద్వారవి•తర్దులందు
నిలిపి నీలోత్పల•జలజరసాలప్ర, వాళతోరణలస•ద్ద్వారపార్శ్వ

తే. కలితకదళీశుభస్తంభ•విలసనములు, వరగృహాంగణకృతరంగ•వల్లు లిట్టి
రంగు లొనరించెఁ గొంగుపి•రాట్టి యనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. ఆయతబాహువుల్•హంగుళములతోడ, శాఖోపశాఖల•సరణి మెఱయ
నుచితస్థలోల్లస•దూర్ధ్వపుండ్రావళుల్, విమలవల్లికలతో•వియ్య మంద
నధరబింబముఁ బాద•హస్తాబ్జతలములుఁ, జిగురుటాకులజిగి•సిరి వహింప
మందస్మితము పుష్ప•మంజరిగతిఁ దోఁప, శుభదంతనఖకోశ•సుమము లమర

తే. లలితజంగమకనకక•ల్పక మనంగఁ, దగినయతిరాజు కాల్యకృ•త్యములఁ దీర్చి
వచ్చు చుండెను విబుధులు•మెచ్చ ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఆగృహమేధిబ్రా•హ్మణుఁడు కట్టళవారి, యనువాఁడు జానప•దాదిహితుఁడు
యతిరాజు కెదురుగా•నవిపించెఁ బంచమ, హావాద్యములు మృదం•గాదు లంత

బ్రహ్మఘోషము భవ్య•బహువాద్యఘోషంబు, నృత్తగీతరవంబు•నింగి నెరసి
యఖిలలోకంబుల•కానంద మొనరింప, సంయమీంద్రుఁడు వాస•సదన మొంది

తే. వేత్రమయపీఠమం దుండి•ఛాత్రులకును, రమ్యభాష్యాబ్ధిమగ్నార్ధ•రత్నవితతి
నూర్జితంబుగఁ గృపసేయు•చుండె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర

సీ. కాంగుపిరాట్టియు•గుణవియానతి భర్త, కభ్యంజనస్నాన•మార్చినంత
నతఁడూర్ధ్వపుండ్రసం•స్కారాదిక్రియలు సల్పి, కనియతీంద్రునిపాద•కమలములకుఁ
బ్రణతి యొనర్ప నా•బ్రాహ్మణోత్తమునకుఁ, గనదురుకృపఁ బంచ•గవ్య మిచ్చి
యన్నశుద్ధి యొనర్చి•యాహారనియమంబు, గావించి పంచసం•స్కారములను

తే. సల్పి సద్విహితోపదే•శము లొనర్చె, నాసతీమణిభక్తిచే•నలరి విశద
కీర్తివిస్ఫూర్తి యాశేష•మూర్తి యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. అయిదాఱుదివసము•లం దుండి సవ్యకా, షాయత్రిదండముల్•సంగ్రహించి
స్వామి సన్నిధి నుంచి•సద్భక్తి సేవించి, యుచితమంత్రంబుల•నుచ్చరించి
యాకావిచేలము•లాత్రిదండాదులు, యతిరాజు తొల్లింటి•యట్లు దాల్చి
యాదంపతులఁ దన•యంఘ్రి ప్రపన్నుల, నతిమధురోక్తుల•నాదరించి

తే. యాశ్రితులతోడ వెల్వడి•యచటనుండి
తీవ్రగతి యొప్పఁ బడమటి•దెసకు నడచి
కాంచెఁ గన్మోర్లిల వహ్నిపు•ష్కరిణి ననుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 57

సీ. ఆవహ్నిపుష్కరి•ణ్యభిధాన మౌగళ, గ్రామంబులో వాస•రములు కొన్ని
గడపి యచ్చటనుండి•కదలి సూరులతోడ, లక్ష్మణముని మిధి•లాపురంబుఁ
జెంద నాయూర న•శేషమనుష్యులు, శైవశాక్తాదిదు•స్తంత్రరతులు
గాన సద్గురువరుఁ•గనుఁగొన రాకున్న, హితము వారి కనుగ్ర•హింపఁ దలఁచి

తే. సంయమీంద్రుండు సద్గుణ•జలధి యైన, దాశరధిసూరివరున కు•దారమధుర
వాక్య మొక్కటి పల్కె నీ•పగిది ననుచు, వాదిభీకరగురుఁ డనె• మోద మలర.

సీ. ఈయూరివా రెల్ల•నేరేవులో నీరు, గ్రోలుదు రారేవు•గుఱుతుఁ జూచి
యచటికి నీ వేఁగి•యానీటిలో నీదు, గురుపదాబ్జము లుంచి•కొంతతడవు
నిలువుమా యని భాగి•నేయుని యతిరాజు, నియమింప నాతండు•నిలిచె నట్టు
లంత నాయూరివా•రంద ఱాదాశర, థ్యార్యునిపాదతీ•ర్థామృతంబుఁ

తే. గ్రోలి తెలి వొంది సకలదు•ర్గుణము లుడిగి
వచ్చి మఱునాఁడు సంయమి•వసుమతీశు
శ్రీమదంఘ్రులు శరణమునఁ•జెంది రనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 59

సీ. పంచసంస్కారాది•బహూహిత-ములు వారి, కందఱ కొనరించి•యతివరుండు
వషడంతవఃమంత్ర•వదభిచారక్రియ, వఱుగనంబివి దన•పదసరోజ
పటుతరచ్ఛాయోప•పన్నునిగాఁ జేసె, సాత్త్వికశ్రీపాద•జలముకతన
మే లంది యాయూర•మిథిలసాలగ్రామ, నామము ధరియించె•నాఁటనుండి

తే. యంత సంయమిభూపాలుఁ•డచటినుండి. పండితులతోడ వేంచేసి•తొండనూరుఁ
జెంది యుద్యానభూమి వ•సించె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

స్వాగతవృత్తము. వాదికైరవది•వాకరరూపా, మోదమానబుధ•ముఖ్య యపాపా
వేదబోధనత•విర్ధలభూపా, యాదరాదిరహి•తాతిదురూపా. 61

క. మిథిలాపురనిత్యవస, ద్బధిరాజ్ఞజడాంధమూక•బాలాతివయో
వ్యధితఖలకుబ్జచేతన. విధివత్సంశ్రితపదాబ్జ•విమలచరిత్రా. 62

మాలినీవృత్తము. తరుణరవిసురూపా•దర్శితానంతరూపా
సరసిజదళనేత్రా•సర్వదుర్వాదిజైత్రా
పరిమళమిళితాంగా•బ్రహ్మవాదప్రసంగా
స్థిరచరహితకారీ•దివ్యదేశోపకారీ. 63

గద్యము. ఇది శ్రీభగవద్రామానుజ కరుణాకటాక్షకలిత కవితావైభవపరవాది భయం
కరాచార్యాభిమతాచ్ఛాత్త్రాప స్తంబసూత్ర కణ్వసగోత్ర పవిత్రోభయకవిమిత్రవేం
కట కృష్ణార్యపుత్ర విబుధవైష్ణవ విధేయ కేశవనామధేయప్రణీతంబైన యాచార్య
సూక్తి ముక్తావళి యనుమహా ప్రబంధంబునందు మధ్యమభాగంబున గురుగోష్ఠి
పూర్తియుఁ జోళరాజు దుర్వృత్తక థనంబును జోళదూతాగమనంబును గూరే
శుండు గురువేషధారియై పరమగురునితోఁ జోళపురంబున కేఁగుటయు యతీం
ద్రుఁడు ధవళవస్త్రంబులం దాల్చి మేలునాటికి విచ్చేయుటయు నాలూరానువలనఁ
జోళరా జెఱింగి సంయమీంద్రునికడకు నిజభటులం బంపించుటయు యతీంద్రుండు
నిజప్రభావంబుచేఁ జోళభటులకు మార్గనిరోధనంబుఁ జేయుటయు స్వాములు
గురుని విశ్లేషించి మార్గాంతరంబునఁ జనుటయుఁ దిరుమల నల్లానుసంబంధులై

ననిషాదులు గురునికష్టంబు విని యాఱుదినంబు లుపవసించుటయు గురుండువర్ష బాధఁజెంది యొకగిరికడ నిజశిష్యులం గూడుకొనుటయు నిషాదులం గలసి భాషించుటయు నవ్వనచరులు యతీంద్రుని బరమగురునిగఁ దెలిసి పూజించుటయు గురుండు శ్రీరంగధామంబునకు శ్రీముఖంబుఁ బంచుటయు నిషాదస్థపతి కట్టళవారి యనియెడు బ్రాహ్మణునియింట గురునికిఁ దళిగకుపచరించుటయు నాకట్టళవారి యను బ్రాహ్మణుండు స్వధర్మపత్ని యగు కొంగుపిరాట్టి పురుషకారంబున యతీంద్రు నాశ్రయించుటయుఁ గొంగుపిరాట్టియింట గురుండు త్రిదండకాషాయాదులు పరిగ్రహించుటయు గురుండు వహ్నిపుష్కరిణిఁ బ్రవేశించి కొన్ని దినంబు లుండుటయు నచటినుండి మిథిలాపురంబునకుఁ జనుటయు గురుఁడాభిచారికప్రయోగంబున వడుగనంబిని స్వవశునిఁగాఁ జేసికొనుటయు యతీంద్రుండచ్చటినుండి తొండనూరనుమహాపురంబుఁ జెంది యుద్యానభూమిని వసించుటయు నన్నది సప్తమోల్లాసము.

— 0 —

శ్రీమతే రామానుజాయ నమః



# ఆచార్యసూక్తిముక్తావళి

## మధ్యమభాగము

---

### అష్టమోల్లాసము

క. వరవిఠ్ఠలనృపతిపురం,దరతనయావిష్టఘోర•తరభూతసమా
చరితోన్మాదనివర్తక,చరణకమలసలిలశక్తి•సాంద్ర యతీంద్రా. 1

వ. అవధరింపుము. 2

సీ. విలసితయశుఁడు వి•ఠ్ఠలదేవరాయఁ డ,ప్పుడ మేలు చూడఁ ద•త్పుత్రి నొక్క-
బలవద్గ్రహము పూని•బాధింపఁగా భూత,వైద్యులారాజాజ్ఞ•వచ్చి చూచి
పాశమాయాంకుశ•ప్రబలబీజోల్లస,దాదిమధ్యాంతము•లట్లు సాధ్య
నామగర్భితములు•దీపఫడంతము, లుచ్చాటనప్రయో•గోచితములు

తే. నుగ్రశాబరతంత్ర యం•త్రోదయములు
ఘోరమంత్రములును గొన్ని•గొణిగి గొణిగి
విసిగి చాలించి చెప్పక•వెడలి రనుచు
వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. క్షితిఁ గృతఘ్నునకుఁ జే•సినలగ్గుల ట్లాగ్ర,హంబుపై మంత్రవీ•ర్యంబులుడుగఁ
బరునిపైఁ బంచిన•బలములు విఱిగిన, ట్లానృపాలుఁడు ఖిన్నుఁ•డై నయంత
దిక్కేల యైయింటఁ•ద్రిమ్మరుతనయను, జూచి తల్లియుఁ జాల•శోకమంద
నంత నక్షయపాత్ర•కచటి కేతెంచిన, ధీరవర్యుఁడు తొండ•నూరినంబి

తే. మదిని దుఃఖించునారాజ•మహిషిఁ గాంచి
శోక మే మని యడుగ నా•సుదతి చెప్పఁ
దెలిసి యద్దేవి కిట్లని•పలికె ననుచు
వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. రంగధామమునుండి•రామానుజార్యుండు, వచ్చియీనగరోప•వనమునడుమఁ
బసిఁడికల్పక మన•భాసిల్లుచున్నాఁడు, సర్వజ్ఞుఁ డమ్మహా•చార్యుఁ డతఁడు

ముం దొక్కచో రాజ•నందనఁ బూనిన,విప్రరాక్షసు విడి•పించె నతఁడు
కావున నతఁ డను•గ్రహదృష్టిఁ జూచెనా, నీకన్య కీగాసి•నిలువ దనుచు

**తే.** మడువుచున్నట్టియాతొండ•నూరినంబి,మాటలాలించి యారాజ•మహిషితనదు
భర్త కెఱిఁగింప నతఁ డిట్లు•పలికె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

**సీ.** ఏ మహాత్ముఁడు పాపు•నీపిశాచకృతార్తి, మత్పుత్రి కాతండె•మనకు గురువు
సత్య మీపలు కని•సతికానృపతి పల్కఁ, గులగురువుల నంతఁ•బిలువననుప
వచ్చినదూతకు•వా రిట్లు పలికిరి, ముందు ఢిల్లీశుఁ డీ•భూమిపతిని
బట్టి యొక్కంగుళి•గొట్టివైచెను గాన, నిట్టిహీనాంగుని•యింట మేము

**తే.** వచ్చితిన నొల్ల మనుచును•వార లనిన, పలుకు లారాజునకు దూత•పలికినంత
నమ్మహీశుఁడు వారిపై•నలిగె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

**సీ.** అప్పు డా నృపతి కి•ట్లని పల్కె నిజసతి, మననంబి చెప్పిన•మాట నీకు
హిత మనితోఁచెనా•యతిపతియంఘ్రుల,సంశ్రయించెద మింక•జాగుమాని
యని పల్కతనసతి•యతిమృదుసూక్తి సం,భావించి విఠ్ఠల•దేవనృపతి
వచ్చి సేవించి క•ల్పద్రుమమధ్యస్థ,పారిజాతాపలాశి•పగిది నచట

**తే.** దేశికేంద్రులనడుమను•దేజరిల్లు,సంయమీంద్రునిఁ బొడగాంచి•సంతసించి
పుడమిఁజాఁగిలఁబడిమ్రొక్కి•పొగడె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

**సీ.** కడుఁదిచ్చకుంటిపై•గంగ పొర్లినగతి•భవదాగమం బగు•భవులకడకు
నీదేశ మీపుర•మీమేము మీరాక, నతిపవిత్రుల మైతి•మయ్య నేఁడు
గాన మాయింటికిఁ•గరుణతో విచ్చేసి, యందఱికి ననుగ్ర•హంబు సలుపఁ
దగుదు నీ వని పల్కి•ధరణి సాష్టాంగప్ర,ణామము సేయుభూ•నాయకునకు

**తే.** మంగళాశాసనముఁ జేసి•మధురసూక్తి, నాదరించి యతీశ్వరుఁ•డంతరంగ
భక్తులౌవైష్ణవుల కిట్లు•పలికెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

**సీ.** రాజధానికిఁ జన•రాదు యతీశ్వరుఁ, డని వచించును శాస్త్ర•మది దలంచి
పురి మేము చొర మని•గురుశిరోమణి పల్క,సూరిరత్నము తొండ•నూరినంబి
మొదలైన దేశిక•ముఖ్యు లాయతిరాజు, చెవియందు గుసగుస•చెప్పి రిట్లు
క్షితిపాలుఁ డితఁడు మీ•శ్రీపాదపద్మము, లాశ్రయించెద నని•యాత్మమహిషి

**తే.** కోడ శపథంబుఁజేసి సంతోషమలర,వచ్చె నిచ్చటి కని చెప్పి•వారు మఱియు
మంచిమాటలఁ గొన్ని వ•చించి రనుచు,వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. దేవరవారి కం•తేవాసి యితఁ డాయె,నా మనపను లన్ని•సేమ మొందు
నీమేలునాడెల్ల•నితనియధీనము, గాన యాదవగిరి•కనకసౌధ
నాయకుఁ డగుతిరు•నారాయణస్వామి,సంప్రోక్షణాదులు•చక్కఁబడును
గాన నీనృపతియ•గారంబునకు మీరు, విచ్చేయ వలె నని•విన్నవింప

తే. నమ్మహాత్ములవిన్నప•మాలకించి, యతిశిఖామణి వా రంద•అనుసరింప
వచ్చె నావిఠ్ఠలేశుని•వసతి కనుచు, వాదిభీకరగురుఁ•డనె మోదమలర.

సీ. పరదైవతం బు గా•భావించి యాలక్ష్మ•ణార్యుని నర్ఘ్య పా•ద్యావివిధుల
నర్చించి యానృపుఁ•డతనిఁ గొల్వఁగ నంత, సన్నిధిసూరులా•సంయమీంద్రు
శ్రీపాదతీర్థము•శిరముపై బ్రోక్షించి, ముమ్మాఱు ద్రావింప•మొదటిచిత్త
విభ్రమం బుడిగి యా•విఠ్ఠలేశునిపుత్రి, కనకాంబరము గట్టి•కలితరత్న

తే. భూషణంబులు మాల్యముల్ బొసఁగఁ దాల్చి
సంయమీంద్రుని సేవించి• జననికడకు
వచ్చి నిలిచె సదస్యులు•మెచ్చ ననుచు
వాదిభీకరగురుఁ డనె•మోదమలర. 11

సీ. పత్నీసుతామాత్య•బంధుమిత్రబలాఢ్యుఁ, డారాజు యతిరాజు•నాశ్రయింప
నతఁ డతనికి హిత•మార్చి నామం బిచ్చె, రస విష్ణువర్ధన•రాయఁ డనుచు
నంతఁ బండ్రెండువే•లారాజగురువులు, కితవులు శుష్కతా•ర్కికులు నైన
క్షపణులు వచ్చి యా•సంయమీంద్రుని నుద,యార్కుని మందేహు•లట్లు డాసి

తే. కోరిమాశిష్యధనముఁగై•కొంటివీవు,గానమాతోడవాదంబుఁ•బూనుమనుచుఁ
గర్కశంబుగఁ దర్కింపఁ•గదిసి రనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ అంత సన్నిధివైష్ణ•వాగ్రణు లాయతి•భర్తకుఁ జేమోడ్చి•పలికి రిట్లు
మెఱసిన వెఱచెడు•నరు లుర్విఁ బిఱుగుల,పాలఁ బడ్డకొలందిఁ•దేలు కొదుఁగు
వారు దారుణసర్ప•వక్త్రంబునను బడు,సరణి సంకిళ్ళకు•జడియువారు
బొందలోపలఁ బడ్డ•పోలికఁ బరవాది,నొకని నైనను జూచి•యొదుఁగుమేము

తే. క్షపణతర్కచ్ఛటాఘోర•శస్త్రనిహతి,పాలు గాకుండఁ బ్రోచి నీ•పరమకృపను
విశ్వరూపివి గ మ్మని•వేఁడి రనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర. 13

సీ. మహనీయమణిమయ•మంటపం బొక్కటి, దవ్వులఁ గని యా త్రి•దండపాణి
నిష్కళంకసుధాంశు•నిజకీర్తిమూర్తులఁ, బోలువల్కలమయ•భూరిపటము

నామంటపముచుట్టు,నమలవజ్రమయంపు, భిత్తిఁ బెట్టినయట్లు,బిగియఁ గట్టి
యందఱుఁ గనుఁగొన,నామంటపముఁ జొచ్చి,శేషస్వరూపంబుఁ,జెందియపుడు

**తే.** వృద్ధిఁ బొందెను వామన,విష్ణు వట్లు. విస్మయముఁ జెంద నాబ్రహ్మ,వేత్తలెల్ల
నాస్వరూపముఁ దలఁచెద,ననిశ మనుచు,వాదిభీకరగురుఁ డనె,మోదమలర.

**సీ.** వేయిమస్తకముల,వెలయుమానికముల,కాంతులు దెసలెల్లఁ,గప్పుకొనఁగ
ఫూత్కారవాతవి,స్ఫూర్తుల జగముగ్ర,దురితతూలము లన్ని,తొలఁగనడువ
ధవళతరాత్మీయ,ధన్యవిగ్రహకాంతి, కమల మీ బ్రహ్మాండ,ఘటము నిండఁ
గలధౌతగిరిపార్శ్వ,కాలమేఘముఁబోలె, నీలచేలముకటి,నిగ్గు దేలఁ

**తే.** జూచి యాదివ్యమంగళ,శుద్ధసత్త్వ,విగ్రహము సర్వవేదాంత,వేద్య మనుచు
జ్ఞాను లందఱు సన్నుతి,సల్పి రనుచు,వాదిభీకరగురుఁ డనె,మోదమలర. 1

**సీ.** ఖరదూషణాదులం,దురు మూలబలములం, దొక్కొక్కవైరికిఁ,బెక్కురాము
లైతోఁచి యారాముఁ,డందఱ గెలిచిన,ట్లేకాకి యయ్యు య,తీంద్రుఁ డంత
యుక్తోర్ధ్వపుండ్రయ,జ్ఞోపవీతశిఖాత్రి,దండకాషాయాది,ధారు లయిన
విగ్రహంబుల నూర్లు,వేల లక్షలఁ గోట్ల,నొక్కొక్కనికిఁ జూపి,యుక్తిశతముఁ

**తే.** దర్కసాహస్రములఁజెప్పి,తగ జయింప, వాదు లాశ్చర్యజలధిలో,వాలలాడి
చాల వినుతించి రాయతి,స్వామిననుచు,వాదిభీకరగురుఁ డనె,మోదమలర.

**సీ.** ఉర్వి యత్ఫణములం,దొకతల నొక్కెడఁ, దెల్లావగింజయ,ట్లుల్లసిల్లు
యత్ఫణామణిఘర్ష,ణానలజ్వాలలఁ, గాల్చు నీజగ మంత్య,కాలమందు
నరయ నెవ్వానిది,వ్యాంశోదితుఁడు మహా,కాలుండు సంహార,కర్త యయ్యె
నెవ్వనితిరుమూర్తి,నేత్రపొద్దు నర్చించె,దరు నాగకన్య లు,దారభక్తి

**తే.** నాయనంతుని సంకర్ష,ణాభిధాను, శేషమూర్తిని నిన్ను భ,జింతు రెవరు
వారె కృతు లని పొగడిరా,వాదు లనుచు,వాదిభీకరగురుఁ డనె,మోదమలర.

**సీ.** భవమహాజలధిలోఁ,బలఁ బడి హిత మేమి, దెలియలేనట్టియా,దీనజనుల
కాచార్యరూపి వై,యవతరించినశేష,మూర్తి నీవే గతి,కీర్తి వెలయ
మమ్ముద్ధరింపుమీ,మహదుగ్రసంసార,వారాశిమధ్యంబు,వలన ననుచుఁ
బంద్రెండువే లైన,ప్రతివాదు లందఱుఁ,జాఁగిలఁబడి మ్రొక్కి,సన్నుతించి

**తే.** శరణ మొందినసంయమి,చంద్రుఁ డంత, విడిచి నిజరూపమాతెర,వెడలివచ్చి
యెప్పట ట్లుండి భాష్యముఁ,జెప్పె ననుచు, వాదిభీకరగురుఁడనె,మోదమలర.

సీ. అంత లక్ష్మణముని•యాచేతనుల కెల్లఁ, బంచసంస్కారాది•బహుహితంబు
లాచరించిన ధన్యు•లై వారు స్వాచార్యు, నర్చించి తమయిండ్ల•కరిగినంత
విష్ణువర్ధనుఁ డది•విని విస్మయముఁ జెందెఁ,జోద్యమ్మ దిరి చూచి•సుజను లచట
మననంబి యాచరిం•చినదైవతం బీతఁ, డీయుపకృతి మన•కితఁడు చేసె

తే. ననుచు యతిపతి యచ్చటి•హరికి నంబి,తంబిరా ననునామంబుఁ దా నొనర్చి
నృహరిమణిమందిరంబున•నిలిచె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. యతివరుం డానృసిం•హాలయంబందు శ్రీ•భాష్య మాశ్రితులకుఁ•బలుకుచుండి
ధరియింప సితమృత్తు•తక్కువై చింతింప,నారాత్రి కలలోన•యాదవాద్రి
నాయకుఁ డగుతిరు•నారాయణస్వామి, భవ్యుఁడై కనిపించి•పలికె నిట్టు
లీనేను మీరాక•కెదురుచూచుచు నుంటి, ఘనఘనాప్తికిఁ జాత•కంబుకరణి

తే. రమ్యయాదవగిరిశిఖ•రంబుపైని, మఱుఁగుపడియున్ననన్ను ల•క్ష్మణమునీంద్ర
బయలుపడఁ జేరరమ్మని•పలికెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. రామప్రియుఁడ నేను•రామానుజుఁడవీవు, మనకుఁజుట్టఱికమీ•మాడ్కిఁగదిసెఁ
గాన నీసంబంధ•గౌరవంబె తలంచి, వేగ విచ్చేయుమీ•జాగు మాని
శ్వేతమృత్తిక యదు•శిఖరిపై వలసిన, యంత గల్గును మీకు•నచట మాకు
వల్మీకకాననా•వరణబంధముఁ బాపు, బాలసూర్యుఁడు తమః•పటలమట్లు

తే. మాటఁ లేటికిఁ బదివేలు•మాకు నీవె, సర్వనిర్వాహకుండవు•సత్యమనుచుఁ
దెలిపి పొడసూపఁడాయె నా•దేవుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. యతిపురందరుఁ డంత•నల్లన మేల్కాంచి, యాస్వప్నదృష్టనా•రాయణీయ
దివ్యమంగళమూర్తి•భవ్యసుధోక్తుల, సారెసారెకుఁ దల్చి•సంతసించి
శిష్యుల కెల్లను•జెప్పిన విని వారు, సంతుష్టులై రంత•సంయమీంద్రుఁ
డరుణోదయపువేళ•నవగాహనముఁ జేసి, హరిశాసనము లన్ని•యాచరించి

తే. వచ్చి సింగరికోవెలఁ•జొచ్చి యందు, విష్ణువర్ధనరాయని•వేడ్కఁ జూచి
యొప్పుగా స్వప్న మతనికిఁ•జెప్పెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. విష్ణువర్ధనధరా•విభుఁ డాయతీంద్రుని, స్వప్నము విని చాల•సంతసించి
వివిధసైన్యములతో•వెనువెంట నడవంగ, ముందఱ వైష్ణవ•ముఖ్యు లరుగ
నందఱునడుమను•యతిభూమిపతి యొప్పె, సూరీంద్రసురవృత•శౌరిమాడ్కి
నట్టివైభవముతో•యతిరాజు జరగుచు, నటికించి ఘోరకా•ననము వెల్ల

తే. మిట్టపల్లము లన్నియు • మట్టుపఱచి, త్రోవ దిద్దించె యాదవ • గ్రావమునకు
సేవ్యజలవృద్ధిత్రోవలోఁ • జేసెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఎద్దానిశుభనామ • మెట్టిపాతకి యైన, నుడివినఁ బాపము • చెడి సుఖించు
యద్దివ్యశిఖరప • ద్మాకరాబ్జము లర్య. మోర్ధ్వాంశువులు సోఁకి • యుల్లసిల్లు
నెందు నిత్యనివాస • మొంది లక్ష్మీపతి, వైకుంఠపురముపై • వాంఛ విడిచె
సురలు మహర్షులు • సూరు లెందువసించి, యర్చింతురిందిరే • శాంఘ్రియుగముఁ

తే. గ్రూరజంతువు లన్యోన్య • వైరముడిగి, యనిశమెందు సుఖించున • య్యాదవాద్రి
చెంతకేతెంచె యతిసభా • కాంతుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. వేయుమోములతోడ • వెలయుచిల్వలతేఁడొ, వేదమయుం డగు • విష్ణురథుఁడొ
వైకుంఠధామమో • వసుధ నీయదుగిరి, కాక శ్రీహరి యేల • కదలఁ డిందుఁ
గల్యాణములకుప్ప • కలుషాంబుధికిఁ దెప్ప, యప్పనికొప్పగు • యాదవాద్రి
సార్ధత్రికోటిగం • గాదితీర్థములకు, నభిమతవిషయ మీ • యాదవాద్రి

తే. యర్థిజనకామధేను వీ • యాదవాద్రి. యస్మదాచార్యసేవ్య మీ • యాదవాద్రి
యనుచుయతిపతిపొగడెనా • యద్రి ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. యతివరుం డాయాద • వాద్రిమూర్ధమునంటఁ, దెరువుఁదీర్పించియా • సరణి వెంటఁ
బసిఁడిసోపానంపుఁ • బంక్తిఁ గట్టించెను. భర్తమధ్యమమంట • పంబు లమర
నర్చిరాదికమార్గ • మట్లది సొంపారె, నాత్రోవ నెక్కుచు • యతివరుండు
నిరుగెలంకులఁ జూచె • నిభసింహశార్దూల, శరభసూకరరురు • హరిణములను

తే. గవయగండకచమరీవ్ర • కప్లవంగ, శల్యభల్లుకగోపుచ్ఛ • సైరభాది
వైరదూరమృగౌఘముల్ • వరుస ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. మఱియు లుంగలవంగ • మాతులుంగములను, దుంగనారంగమ • ధూకములను
జందనమందార • చాంపేయకేతకీ, పాటలీకాశ్మీర • పనసతరుల
నక్తమాలకదంబ • నారికేళములను, జంబూవటప్లక్ష • చమరకములఁ
దాలతమాలత • కోలహింతాలక, సాలసాలాంకోల • సరళతరులఁ

తే. శింశుపాశోకఖర్జూర • సింధువార
జంభలౌదుంబరాశ్వత్థ • సర్జకాది
తరులఁ బొదగాంచె యతిసుధా • కిరణుఁ డనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. దక్షిణదిక్సతి దాల్చినతిలకమో, భూదేవి చేసిన పుణ్యఫలమొ
యని జను లూహింప నర్హమౌ యదుగిరి, ఋతువులా తే ప్రొద్దు స్థితి వహించు
కతన వృక్షము లన్ని ఘ్రాణతర్పణపుష్ప, ఫలపల్లవాదిక భరముఁ దాల్చి
నమ్రములై వందనంబు లాయతిభక్తి, కాచరించెడుమాడ్కి నలరు చుండ
తే. భవ్యమకరంద ఫలరసపానమత్త, చిత్రపత్రియుతస్థితిఁ జెలఁగు చుండ
నద్రిపై కేఁగుచుం డెన య్యార్యుఁ డనుచు, వాదిభీకరగురుఁడనె మోదమలర.

సీ. సోనవాన లొకచోట జోరునఁగురియఁగా, నచట మయూరము లాడుచుండు
మఱియొకచోఁ దీయ మామిడితరులపై, శుకపికనికరము సొక్కుచుండుఁ
గమలాకరములందుఁ గలహంసకలరవ, కలకలం బొకచోటఁ గర్ణ మాను
వకుళపుష్పమరంద పానమదభ్రమ, ద్భ్రమరము లొకచోటఁ బాడు చుండు
తే. మల్లికామాధవీజాతి వల్లికలను, మెలఁగుననుగాలి యొకచోటఁ జెలఁగునట్టి
యద్రిపై కేఁగుచుండెన య్యార్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర..

సీ. శిఖరము లన్నియు శిరములుగాఁ దోఁప, శైవాలమేఘకేశంబు లొప్ప
సాళిపద్మము లన్ని సాక్షిముఖంబులు, చాంపేయకోశనాసలు దలిర్ప
బహుదీర్ఘసర్పముల్ బాహుశాఖ లెలర్ప, ఘనగహ్వరములు వక్త్రంబులమరఁ
బ్రత్యంతగిరు లన్ని పాదము లట్లుండ, వృక్షరోమంబులు విస్తరింపఁ
తే పురుషసూక్తోక్తపురుషుఁడీ గిరిశరీరి, యనుచు నెమ్మదిఁ దలఁచెద ననుచు యాద
వాద్రిపై కేఁగుచుండెన య్యార్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

సీ స్ఫటికవైడూర్యవ జ్రమయప్రపాతంబు, పద్మరాగాంచిత ప్రస్థయుతము
లసదింద్రనీలశీలాతలకలితము, గోమేధికవికార గురుశిఖరము
మహనీయమరకత మణిమయకటకంబు, విద్రుమమౌక్తిక విసర మిట్లు
నవరత్నమయ యదు నగరాజ మొప్పారెఁ, దహరాభ్రమధ్యమ దహనసూర్య
తే. చంద్రమండల మధ్యస్థ సర్వభూష, సురుచిరాకారవైష్ణవ జ్యోతిమాడ్కి
నని తలంచెద ననియెన య్యార్యుఁడచుమ, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

సీ. నారాయణుఁడు హరి నరుల నందఱఁ బ్రోవ, యదుగిరిరూపియై యలరె నిచటఁ
బతితోడ భక్తులఁ బాలింప నిచ్చట, బహునదీరూపయై పద్మ యొప్పె
నిరువుర సేవింప నిచట వసించిరి, స్థిరచరరూపులై సురలు మునులు
నీయద్రికడనుండు నెవ్వాఁడువాఁడె పో, ధన్యుండు ముక్తిసుందరికిఁ బ్రియుఁడు

తే. ఇట్టియదుగిరివిభవ మ॰హీంద్రశాయి, దక్క నెవ్వఁ డెఱుంగు ని॰ద్ధరణి ననుచు
నమ్మహీధ్రముపై కెక్కె ॰ నార్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె ॰ మోదమలర.

సీ. వరబహుధాన్య సం॰వత్సర పుష్యమా,సమునందు శుక్లప॰క్షమున వేడ్క
యదుగిరిపై కెక్కె ॰ యార్యులతో పేద. పుష్కరిణీతీర॰భూమి విడిసి
దర్శనాదుల నెద్ది ॰ దారుణపాపముల్, వాపి శుభంబుల ॰ భవుల కిచ్చు
ముందు దత్తాత్రేయ॰మునిహరి దేనిపైఁ, గావిపుట్టములను ॰ గట్టికొనియె

తే. నటివరిధానశిలకడ ॰ నతనిఁబోలె, లక్ష్మణార్యుండు కావిచే॰లముల మగుడఁ
గట్టి మెప్పారె నాయోగి॰కరణిననుచు, వాదిభీకరగురుఁ డనె ॰ మోదమలర.

సీ. యాదవాచల మంత ॰ యరసిచూచినఁ దిరు,నారాయణస్వామి॰వారుదివ్య
మంగళమూర్తి యే॰మాటునఁ గనిపింప,కున్న లక్ష్మణముని ॰ చిన్నఁబోయి
స్వప్నములో మాకు ॰ స్వామి చెప్పినమాట, సత్యము గాకున్న ॰ సర్వశక్తుఁ
డగు భగవంతుని ॰ యద్వితీయప్రభా,వమున కొక్క కొఱంత ॰ వచ్చుఁ గాదె

తే. యనుచుఁ జింతించి పవళించు ॰ యతివరునకు
స్వప్నమందున యదుగిరి॰స్వామి మరలఁ
గన్నులకుఁ దోఁచి పల్కె నీ॰కరణి ననుచు
వాదిభీకరగురుఁ డనె ॰ మోద మలర. 34

సీ. ప్రాకారదక్షిణ॰భాగంబునను భవ్య,నవ్యచాంపేయ వ॰నంబుకడను
శ్రీదకల్యాణి ద॰క్షిణపశ్చిమాశను, శ్రీమదున్నతతుల॰సీద్రుమంబు
పెనఁగొని వర్ధిల్లు॰పెనుపుట్టలోపల, నుండితి మఱియొక ॰ సూక్తి వినుము
ముందు శ్వేతద్వీప॰మున నుండి గరుడుండు, సితమృత్తుదెచ్చి యీ॰క్షితిధరమున

తే. భవ్యకల్యాణసరసికిఁ ॰ బశ్చిమోత్త,రాశ నిక్షేప మొనరించె ॰ నదిమహాజ్ఞ
నక్షయం బయ్యెననిహరి ॰ యనియె నను, వాదిభీకరగురుఁ డనె॰మోద మలర.

సీ. ఈశాన్యదిగుభాగ॰కెదుట బాలకతుల,సీద్రుమావళివెంటఁ ॰ జెలఁగి నడుమ
లలితప్రవాళకో॰మల మంజరీకృత, మహనీయతులసీ ద్రు॰మంబుక్రిందఁ
గూటంబులకొలందిఁ ॰ గోమ లొప్పారఁగా, గట్టుపోలికఁ దోఁచు॰పుట్టనడుమ
వసియించి తిది యాన॰వాలు చెప్పితి నీకు, సంయమీశ్వర చింత॰సలుప నేల

తే. ననుచు జవిగుఱ్ఱపల్కుల॰నానతిచ్చి, యంత బొడసూపడాయె న॰య్యచ్యుతుండు
స్వప్న మట్లుండె నది యతి॰స్వామి కనుచు, వాదిభీకరగురుఁ డనె॰మోద మలర

సీ. అంతఁ బ్రత్యక్షసమాకార మౌకలఁ, గాంచి మేల్కాంచి సుఖించి మించి
యాత్రోవఁ జనుదెంచి,యార్యశేఖరులతో, నాపుట్టఁ బొడగాంచి,హరిఁదలంచి
ప్రక్రమ ప్రణతుల భక్తితోఁ గావించి, సజ్జన-జయఘోషము చెలంగ
దెప్పరంబుగఁ బుట్టకప్పు విప్పి పసిండి,కోవెలలో యదుగ్రావ దేవు

తే. నీలనిర్మలమణికాంతినిధిని జూచి, శ్రీయతీశ్వరుఁ డఖిలదేశికుఁ:తోడ
భూరివేదాంతసూక్తులఁ, బొగడె ననుచు వాదిభీకరగురుఁ డనె మోద మలర.

సీ ధరణిపై ద్వాదశోత్తరసహస్రాఖ్యక,శకమున బహుధాన్యవమమునందు
ఘనపుశ్యశుక్లప,క్షచతుర్దశీగుర,వారపునర్వసూతారయందు
నవయదుగిరి తిరునారాయణస్వామి, దివ్యమంగళమూర్తి దెసలు పదియుఁ
దన మహోదయమునఁ, దద్దయు వెలుఁగొందఁ, గనఁబడె నందఱకనుల కంత

తే. శంఖభేరీమృదంగ నిస్సాణవేణు, పటహకాహళవీణాదిభవ్యవాద్య
ఘోషముల నిండె రోదసీకుహర మనుచు, వాదిభీకరగురుఁ డనె మోద మలర.

సీ. ధన్యుఁ డౌవిష్ణువర్ధనరాయనృపతిని, బిలిచి చూప నతండు ప్రీతుఁ డయ్యె
నంత నాహరివిగ్రహమునకుఁ బాలతో, నభిషేక మొనరించి యాత్మహస్త
ముల మూఁడు దినములుముదమొప్పఁబూజించి, చారుకల్యాణిపుష్కరిణి పశ్చి
మోత్తరదిశయందు నురుత్రిదండముచేత, గీసినఁ బాలవారాశిఁబోలె

తే. శ్వేతమృత్స్నాకరము దోఁపఁ, జింత లుడిగి
దివ్యకల్యాణసరసిలోఁ, దీర్థ మాడి
యచట సితమృత్తు గొనియె నయ్యార్యుఁ డనుచు
వాదిభీకరగురుఁ డనె మోద మలర.

సీ ఆశ్వేతమృత్తిక నభిమతదైవత, మగువరదుని కనుమొగిని బెట్టి
యొప్పించి యది గొని యూర్ధ్వపుండ్రంబులు, తత్తదంగంబులఁ దగధరించి
కేలఁ ద్రిదండంబుఁ, గీలించి కోవెల, మణిమయప్రాకారమంటపములు
గోపురంబులు నాల్గు కొమరొప్పఁ గట్టించి, పుష్పవనంబులఁ బొందుపఱచి

తే. వాపికూపతటాకోపవనము లన్ని, చక్కఁ జేయించె మక్కువ చిక్కహరికి
సంతసముఁ జేసెనాయతిస్వామి యనుచు, వాదిభీకరగురుఁ డనె మోద మలర.

సీ. మణిమయప్రాకార మందిరద్వారవితర్దికాంగణధన్యతరజనంబు
పణ్యప్రసారితాగణ్య నానారత్న, హాటకరజతాది కాపణంబు

బ్రహ్మఘోషస్ఫుర•ద్బహువిధవైష్ణవ, ద్విజబాలవటుబహి•ర్వేదికంబు
కలకంఠశుకశారి•కాకలకంఠాది, పత్త్రిచిత్రోక్తి క•ల్పద్రుమంబు

తే. సిరికి హరి కాటపట్టగు•పురవరంబు, యదుగిరీంద్రముపైఁ జేసె • యతివరుండు
హరిప్రతిష్ఠాన మొనరించు • కరణి ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఆతఁడు నారాయ•ణాహ్వయపురమునం, దసదృశచిత్ర ది•వ్యాలయమున
శ్రీపాంచరాత్ర ప్ర•సిద్ధక్రమంబున, సంప్రోక్షణాదు లా•శార్ఙ్గపాణి
కాచరించి శఠారి•కంతరంగుఁడు గాన, యతిపతి యతని స•త్కృతులనొకటి
యొరునాయగం బను•తిరువాయిమొళి తిమ, నారాయణున కర్ప•ణంబుఁ జేసె

తే. నాఁటనుండి పటికైనను•బాటలవియె, పదియుఁబాడుదురార్యులు•భక్తినచట
విదితనిత్యానుసంధాన•వేళ ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

పంచచామరవృత్తము

ప్రభావదంఘ్రిపంకజప్ర•పన్నవిష్ణువర్ధనా
ప్రభావవైభవాశ్రిత ప్ర•పంచచేతనావనా
ప్రభూతయాదవాద్రిరాట్ప్ర•భావిభూతికారణా
ప్రభావభాస్కరోదయప్ర•భాసితాంబుజాననా. 43

క. సదయహృదయ మృదుభాషణ, విదితాఖిలవేద్య లోక•విశ్రుతచరితా
యదుగిరిహరిసురతరువర•పదసన్నిధిలాభహేతు•పావననామా.

మాలినీవృత్తము

ప్రశమితదురవస్థా•బద్ధపద్మాసనస్థా, దశశతకరతేజా•దర్శనాసక్తరాజా
వశగయదుగిరీశా•వర్ధమానప్రకాశా, విశదపరమహంసా•వేదవిద్యావతంసా

గద్యము. ఇదిశ్రీభగవద్రామానుజకరుణాకటాక్షకలితకవితావైభవ పరవాదిభయంకరా
చార్యాభిమతచ్ఛాత్రాపస్తంబసూత్రకణ్వసగోత్ర పవిత్రోభయకవిమిత్ర వేంకటకృష్ణా
ర్యపుత్ర విబుధవైష్ణవవిధేయ కేశవనామధేయప్రణీతంబైనయాచార్య సూక్తి
ముక్తావళి యనుమహాప్రబంధంబునందు మధ్యమభాగంబున విఠ్ఠలదేవనృపతి
యతీంద్రు నాశ్రయించుటయు నమ్మహాత్ముఁడు విశ్వరూపంబుఁ జూపించు

టయు క్షపణుల జయించి శిష్యులఁ గావించుకొనుటయు యదుగిరీశ్వరుండు స్వప్నంబునఁ దనయభీష్టంబు యతీంద్రున కెఱింగించుటయు యతీంద్రుండు యదుగిరికి విచ్చేయుటయు స్వప్నసాక్షాత్కృతుం డగునారాయణునిసూక్తులచే వల్మీకస్థితు నారాయణుని లభించుటయు శ్వేతమృత్స్నాకరంబుగురుండు గనుఁ గొనుటయు హరిమందిరపురాదికంబు బాగుసేయించుటయుఁ దిరు నారాయణస్వామికి సంప్రోక్షణంబు సేయించుటయు నన్నది యష్టమోల్లాసము.

—o—

శ్రీమతే రామానుజాయ నమః,



# ఆచార్యసూక్తిముక్తావళి

## మధ్యమభాగము

---

### నవమోల్లాసము

శ్రీయదుగిరిలక్ష్మీనా
రాయణపాదారవింద•రంజితపూజో
పాయా నిర్జితమాయా
ఛాయాతతసర్వదిగ్వ్రజా యతిరాజా 1

### ఢిల్లీవిజయము

సీ. శ్రీరంగరాజభ•ట్టారకార్యుని నిత్య•పూజన మొనరింపఁ•బొసఁగ నునిచి
సంతతపక్షమా•సమహోత్సవంబులు, సేయించుచును యతి•క్షితిమహేంద్రుఁ
డుచితకల్యాణమ•హోత్సవ మొనరింప, నంచితోత్సవబేర•మమర కున్న
జింతించి శయనింప•శ్రీపతి యతనిస్వ•ప్నమునందుఁ గనిపించి•పలికె నిట్లు

తే. మామకోత్సవబేరా•మత్ప్రియుండు, నల్లఢిల్లీశునింట రం•జిల్లు చుండె
నతనిఁ దెమ్మని పల్కెన•య్యాజితుఁ డనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. అంత మేల్కాంచి ప్ర•త్యక్షసమస్వప్న•దృష్టవిష్ణ్వాత్త లా•దేశికులకు
విష్ణువర్ధనరాజ•వృషభున కెఱిఁగింప, నందఱు విని చాల•హర్షమొంది
పొగడిప్రార్థించిన•భూరి ప్రభావుండు, యతిరాజు ఢిల్లీప్ర•యాణమునకు
సంకల్ప మొనరించి•సన్ముహూర్తమునందు, సర్వదేశికులతోఁ•జనెడివేళ

తే. రమ్యమాల్యవదగమున•రామభద్రు, హరిబలంబులగతియాద•వాద్రిగురుని
కోట్లతఱబడి బలములు•గూడె ననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. బాణతూణీయుగ•బాణాసనాఢ్యులు బరపట్టిసభిండి•పాశధరులు
ముసలగదాశూల•ముద్గరశంఖచ•క్రాంకుశప్రాసకుం•తాంచితులును

బాళతోమరదండ•పరిఘచ్ఛురీఖేట,ఖడ్గకుఠారాది•కలితకరులు
పృథుశౌర్యధైర్యు ల•పిచ్ఛవయస్కులు, నతిసాహసప్రియు•లధికబలులు

తే. నిత్యగురుదాస్యనిరతులౌ•నిత్యులఖిల. దేశములనుండి యతిరాజు•దెసకువచ్చి
ప్రణతు లొనరించి నిలిచిరి • భక్తినసుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అగ్రేసరులు నిత్య • లాహవార్భటిమీఱ, సకలవాద్యములతో • జరుగుచుండఁ
ద్రైవర్ణికులు బహు•ధనధాన్యముఖవస్తు•నాయకు లగుచును • నడుమ నడువ
శరచాపముఖసర్వ•సాధను లగుకుల•శేఖరుల్ దానచుట్టు • చెంది కొల్వ
విష్ణువర్ధనరాజు • వెనువెంట రథవాజి, కుంజరాదులతోడఁ • గూడి యరుగ

తే. నడుమ సంయమిచంద్రుండు•నరసురర్షి, మధ్యగతుఁడైనయాత్రేయ•మౌనినృపతి
పగిదినొంపారెఁ దనతను • ప్రభల ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. కరటిఘీంకారముల్ • కలభబృంహితములు, హయరత్నహేషిత • హలహలములు
చక్రనేమిధ్వనుల్ • విక్రమోద్భటభట•క్ష్వేళితంబులు మత్త•సింధురముల
ఘంటారవంబులు•కాహళపటహస్వ•నంబులు శంఖని•నాదములును
భేరీమృదంగగం•భీరనాదంబులు, కలితవీణావేణు•కలరవములు

తే. స్వస్తివిజయప్రబంధఘో•షంబు లన్ని,గలిసి బ్రహ్మాండమంతట • వెలపి మెలపి
గురునిజయధాటిఁ దెల్పెనం•దఱకు ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. చార్వాకపర్వత • శతకోటిసంకాశ, పాషండఖండన • బహుపరాకు
బౌద్ధమతధ్వాంత • బాలదివాకర, పాపవిధ్వంసన • బహుపరాకు
పరుషమాయావాద•ఫణిపన్నగాశన, భవరోగభంజన • బహుపరాకు
బహుమతవ్యాఘాత • పటుశుష్కతరుదావ, పావకమండల • బహుపరాకు

తే. అనుచు సాతానిదాసు ల•య్యవసరమునఁ బసిఁడిబెత్తులు చేఁబూని•పరమభక్తి
గురుని కనుప్రోలఁ బొగడుచు • జరగిరనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. హరిని దెచ్చుట కేఁగు•నక్రూరునకుఁ దొల్లి, శుభచిహ్నములు పొడ•సూపినట్లు
రామప్రియునిఁ గొని • రానేఁగుయతిపతి, జైత్రయాత్రారంభ • సమయమందు
బంధుమిత్రులఁ బంచు•బంధువులకొలంది, యనుకూలవాయువు • లనుసరించె
దక్షిణాక్షిభుజోరు•పక్షము లదరెను, ధృతిఁ దార్క్ష్యయుగళము • తీర్చికట్టె

తే. నట్టిశకునములను గని • యతివరుండు, కరతలస్థితఫలముగాఁ • గార్యసిద్ధిఁ
దలఁచి యాదవగిరినుండి • తరలె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. సర్వజ్ఞుఁ డయ్యును • సర్వశక్తుం డయ్యు, సంశ్రితవాత్సల్య • జలధి శౌరి
సీతాసతిని ముందు • చెఱఁబడు టాదిగా, బెడిద-పుటిడుమలఁ • బెట్టుకతనఁ
దాఁ దురుష్కునియింటఁ • దప్పకచెఱఁబడె, స్వకృతమేలతొలంగు•స్వామికైన
సీతనిచెఱఁ బాప • నెంబెరుమానారు, దక్క నెవ్వఁ డుర్వి•దక్షుఁ డనుచుఁ

తే. దలఁచు వేడ్కల హేతువా•దంబు లిట్లు, సల్పుచున్ద్రోవ నడచిరి•సత్త్వనిధులు
వారిఁ దలఁచెద మదిలో న•వశ్య మనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. రావణుం డాత్మకా•రాగృహస్థితు నింద్రు, సద్భక్తి బ్రహ్మ కొ•సంగినట్లు
మన గురుస్వామికి • మగిడి రామప్రియు, నిచ్చెనా ఢిల్లీశుఁ • డిః సుఖించు
నియ్య కున్నను సంయ•మీశునియాజ్ఞచే, ఢిల్లీపురీపుల్ల•వల్లిఁ బెఱికి
యమునాసతికిఁ గంఠ•హారయష్టిగఁ జేసి, రామప్రియుని యతి•రాజున కిడి

తే, యమ్మహాత్మునితో యాద•వాద్రి మరలఁ, జెందియుండెద మగ్గిరి•చెంత ననుచు
నిశ్చయముచేసి నడచిరి•నిత్యు లసమ, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. సాంబుఁ దెచ్చుటకుఁ బ్ర•లంబారి సబలుఁడై, హస్తినాపురమున•కరిగినట్లు
బహుబలంబులతోడ•బాణపురంబున, కనిరుద్ధుఁ దేనేఁ గు•హరియుఁ బోలెఁ
జిత్రగుప్తుల కైనఁ•జెప్పశక్యముగాని, సేనలతోఁ గూడి•శ్రీయతీంద్రుఁ
డల్లఢిల్లీపురి•కరుగుచు మలయద, ర్దురగిరులను గ్రామ•పురవరముల

తే జనపదంబులఁ గేరళీ•సంజ్ఞికముల, లలితఫలపుష్పవల్లవా•లంకృతముల
వివిధతరువులఁ జూచుచు•వెడలె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. కావేరిఁ గృష్ణను•ఘనగౌతమిని సహ్య•పర్వతేంద్రముఁ దుంగ•భద్ర దాఁటి
కర్ణాటదేశముఁ•గడచి మహారాష్ట్ర•రమ్యభూముల భీమ•రథిని దాఁటి
కొన్ని ప్రయాణముల్•గుఱుతుగాఁ జనిచని, కురుభూమివనిత కా•భరణమట్టు
లెల్లదేశములకుఁ•దల్లిపోలిక నిత్య, మలరారుఢిల్లీమ•హాపురంబు

తే ముందుబలకృష్ణపదరజః•పూత మిప్పు, డట్లరామప్రియున కిష్ట•మైనదనుచు•
గాంచి యతిభూమిపతి తిల•కించెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. దశయోజనాయత•ధరణిపై నెలకొని, యమునానదీతట•మాశ్రయించి
కోటలు కొమ్మలు•కొమరొప్పువాకిండ్లు, గంభీరపరిఖలు•గలిగి తురగ
గజరథపాదాతి•కలిత మై బహురత్న•ధనహేమరజతసౌ•ధముల మెఱసి
నృత్తగీతంబుల•నిఖిలవాద్యంబులఁ, బుష్పవనాళులఁ•బుష్కరిణుల

తే. వెలసి యమరావతినిమించి•కలిమికొమ్మ కాటపట్టై యప్పుర•మాశ్రితాళి
తోడ యతిరాజు చూచె సం•తుష్టి ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. వానరసేనల•వర్ణింపవచ్చును, గురుబలంబుల లెక్క•గొనఁగవచ్చు
ఘనదేవసైన్యముల్ • గణుతింపఁ గావచ్చు. యతిసార్వభౌముని • పృతన లన్ని
వాగీశ్వరుని కైన•వర్ణింప నలవి గా, వట్టిసేనలు ఢిల్లి•చుట్టు విడిసె
యతిపురందరుఁ డంత•యమునోపవనమున•, దాండువల్కలమయ•పటకుటీర

తే. మధ్యనిర్మిత వేదికా•మధ్యతలము.నందు మృద్వాసనాసీనుఁ•డై వసించి
యుచితగోష్ఠి యొనర్చుచు•నుండె ననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. అంత ఢిల్లీశుని•యనుజీవు లగుగూఢ,వారు లేతెంచి యా•సైన్యములను
గనుఁగొని తమరాజు•కడ కేఁగి నమ్రులై, కేలు ఫాలస్థలిఁ•గీలుకొల్పి
యభయము యాచించి•యతనియాజ్ఞ లభించి, భయనయముల మించి•పలికి రిట్లు
రాజాధిరాజ వి•భ్రాజద్యశశ్ఛత్రు, రాజరాజీవాళి•రాజబిరుద

తే. చిహ్నములు నీక చెల్లు నీ•క్షితితలమున, నిట్టినీపురి ముట్టడి • చుట్టి యుగ్ర
బలము నెలకొనె నని చటుల్•పలికి రనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. వాఁడిముల్కులఁబోలు • వారిపల్కుల కల్గి, యారాజు చారుల • కనియె నిట్లు
లెక్కలో లేరు నీ•లింపు లైనను మాకు, మనుజు లెంతటివారు•మమ్ము గెల్వఁ
గావున మదిని శం•కలు మాని మీరిర్వు. రాసేనలో నుపా•యమునఁ జొచ్చి
వా రెవ్వ రిచటికి • వచ్చినపని యేమి, వారిదేశం బెద్ది • వసతి యెచట

తే. నన్నిటి నెఱింగి రం డని•యధిపుఁ డనుప, విప్రచిహ్నములను దాల్చి•వేగ వారు
వచ్చి యతిరాజుసైన్యముఁ • జొచ్చి రనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. కెంపులు అవలఁ జె•క్కినయొంటిరుద్రాక్ష,పోఁగులు చెవిగవఁ•బొసఁగఁ దాల్చి
పద్మపత్రాకృతి • ఫాలస్థలము లవ,చ్ఛిద్రోర్ధ్వపుండ్రముల్ • చెందఁ దీర్చి
వెల్లజన్నిదములు • డొల్లుదోవతులును, దలల నుష్ణీషముల్ • దగ ధరించి
స్ఫటికాక్షమాలలు • జళజళఁ ద్రిప్పుచు. శంభో మహాదేవ • జలజనయన

తే. వరదనారాయణముకుంద•వాసుదేవ. యనివచించుచు గూఢచా•రాగ్రసరులు
వచ్చి యతిరాజుసైన్యముఁ•జొచ్చి రనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. పురముబాఁపల మని•బొంకుదు రొకచోటఁ, గనిపింతు రొక్కెడఁ•గవితసొంపు
సాముద్రికత్వము • జరుపుదు రొకచోట, నర్థింతు రొక్కెడ • నర్థులట్లు

పండితులట్లు సం॥భాషింతు రొకచోట, గణుతింతు రొక్కెడ • గ్రహగతులను
నలుదెసలను జూచి , నయనభాషలచేత, నెంచుదు రానేన • నెఱుఁగనట్లు

తే. పలువిధంబుల నీరీతి • బలములందుఁ, దిరుగుచారులఁజూచి సం॥దియముఁ జెంది
యింగితజ్ఞులు సైనికు • లెఱిఁగి రనుచు, వాదిభీకరగురుఁ డనె॥మోద మలర.

సీ. తొల్లి శ్రీరామభ॥ద్రునకు లంకను గపుల్, శుకసారణులఁ బట్టి • చూపినట్లు
సైనికు లాగూఢ॥చారుల నిరువురఁ, దిట్టుచు మొట్టుచుఁ • బట్టి తెచ్చి
యతిసార్వభౌముని॥యగ్రమందున నిల్పి, చేమోడ్చి తత్క్రియల్ • చెప్పి రిట్లు
వేగుఁ జూడఁగ నీడ • కేఁగుదెంచిరి వీరు, మాయబాఁపలు వీరిఁ॥గాయరాదు

తే. గాన వీరికి దండమొ॥క్కటి విధింప, నుచితమనిపల్కు యోధుల॥కుడయవరులు
చెప్పి రొకసూక్తి కనికర॥మొప్ప ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. స్వామికార్యములందు॥జాగరూకత గల్గు॥చారు లుత్తములు సం॥శయములేదు
రాజాజ్ఞచే వీరు • బ్రాహ్మణలింగముల్, ధరియించి మనసేనఁ • దిరిగి రిట్లు
తెలిసి వీరిని బట్టి , తెచ్చితి రిది మీకు, మంచిది మఱియొక॥మాట వినుఁడి
యిచ్చయించితిమేని • యిల దేవదానవ, సేన లైనను గోటఁ • జిమ్మఁగలము

తే. గాన శంకలు కడఁజిమ్మి • గరిమ వీరి, కస్మదీయబలంబుల • నన్ని చూపి
విడువుఁ డని పంచె నాయతి॥విష్ణు వనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. అంత సేనాధ్యక్షు • లాచారులకుఁ దమ॥బలము లన్నియుఁ జూపి • పంపినంత
యతిరాజుదెసకు సాం॥ష్టాంగప్రణామముల్, గావించి యీతని॥కరుణ మనము
బ్రతికివచ్చితిమని • పలుకుచు వెలుపచేఁ, దిరిగిచూచుచు వేగ॥పురముఁ జొచ్చి
సప్తాంగలక్షణ॥సభఁ దన్ను సరిదొర, లెన్న నొడ్డోలగ • మున్నవానిఁ

తే. దమనృపాలునిఁ గని ఫాల॥తలములందుఁ, గరతలంబులఁ గీలించి॥కడు నుతించి
ప్రణిధు లారాజునకు నిట్లు॥పలికి రనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. స్వపరరాష్ట్రములందు • సర్వార్థములు చార॥వరులవల్ల నెఱుంగ॥వలయు రాజు
కావున నృపతికిఁ • గన్నులు చారులు, వా రవంచకులు గా॥వలయుఁ బతికిఁ
బ్రియవాక్యవక్తలు • పెక్కండ్రు సులభు ల॥ప్రియపథ్యవక్త లీ॥పృథివి నరుదు
పిన్నంత పెన్నంత • విన్నవించెద మని, యభయము యాచింప • నమ్మహీశుఁ

తే దభయ మిచ్చియెఱింగిన॥యర్థమెల్లఁ, జెప్పుఁ డని వారి నియమింపఁ॥జింతమాని
ప్రణిధు లి ట్లనిపలికి రా॥ప్రభున కనుచు, వాదిభీకరగురుఁ డనె॥మోద మలర.

సీ. రాజాధిరాజ నీ•రాజదాజ్ఞాపుష్ప,మాలిక దలఁ దాల్చి • మాంద్య ముడిగి
వేల్పుల కైనఁ బ్ర•వేశింప శక్యము,గాని యీ బలుకోట•గవను దాఁటి
పట్టణప్రాకార•పరిఖ కద్దరిఁ జుట్టు,ప్రాకారమ ట్లున్న•పరబలంబుఁ
జొచ్చి త్రిమ్మరుచున్న • సురుచిరబ్రాహ్మణ, వేషధారుల మమ్ము • వేగ తెలిపి

తే. పట్టుకొని దండనాథుండు • కట్టికొట్టి, నెట్టుకొనిపోయి యొకయతి•నేతయెదుట
నిలిపె నని రాజునకుఁ జరుల్ • వలికిరనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. సిగలు జన్నిదములు • ఛిద్రోర్ధ్వపుండ్రముల్, తులసీనలినబీజ•వలయములును
సమలక్షణంబు లా•సభ్యుల కందఱ, కని విశేషము విను • మవనినాథ
ధవళపవిత్ర త్రి•దండకాషాయాది, గురులాంఛనాఢ్యులు • కొంద ఱందుఁ
గటి వెల్లపుటములు • కావిమడుంగులు, కొందఱు పైఁ గప్పు•కొందు రందు

తే. ధవళపరిధానసంవ్యాన•ధరులితరులు, మఱియుఁ జతురంగబలముల•గుఱుతుమీఁదఁ
జెప్పెద మటంచుఁ జారులు•చెప్పి రనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఘనపర్వతములందుఁ • గనకాద్రిపోలిక, వేల్పులనడుమను • విష్ణునట్లు
యతిలక్షణములకు • నఖిలసద్గుణముల, కాటప ట్టైనమ•హాత్ముఁ డొక్కఁ
డా సభాసదులయం • దలరారు చున్నవాఁ, డత•డె రాజఁట వారి • కందఱికిని
నాయతీంద్రునితేజ • మప్రమేయం బతఁ, డొకకేలఁ బుస్తక • మూని పట్టి

తే. జ్ఞానముద్రనుబెఱకేలఁ•బూనిశిష్య,తతికిఁ దత్త్వముఁ దెలుపుచుఁ • దాను గానఁ
బడియె మా కని చారులు • నుడివి రనుచు. వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. వేగుఁ జూడఁగ వచ్చు • వేషధారులు గాని, వీ రగ్రజన్ములు • గారు గాన
దండింపఁ దగు నని • దండనాథుఁడు చెప్ప, నతని కిట్లనియె న•య్యతివిభుండు
వేల్పుల కైనను • వెఱవనిమీర లీ,వేగులవారికి • వెఱవ నేల
మనసేన లన్నియుఁ • గనిపించి వీరిని, సాఁగ నంపింపుఁడీ • వేగ మనిన

తే. దండనాథుండు గురుసూక్తిఁ • దలను దాల్చి
బలములను జూపి మముఁ బంచె • బయటి కనుచుఁ
బుడమిఱేనికిఁ జారులు • నుడివి రనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. వర్ణించెదము చూచి•వచ్చిన క్రమమెల్ల, వినుము మహారాజ • కినుక మాని
యాసైన్యముల కొక్కఁ•యంతము గనిపింప, దేఱులు మున్నీటిఁ • జేరునట్లు

నలుదెసలను వచ్చు•బలము లాసేనలోఁ, గలియుట కెడమేమి • గానఁబడదు
పర్వకాలములందుఁ • బాధోధిపగిదిని, వర్ధిల్లుచున్నది • వారిబలము

తే. సేనలను బిల్వఁ జేసన్న•చేసినట్లు, గాలి నసియాడుపడగలు • గలిగి యలరు
బలముఁజూచితి మని చరుల్•పలికిరనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. మలలు మొగిళ్ళని•మదిఁ దలంపఁగఁజాలు, మదగజంబుల కందుఁ•గొదవ లేదు
మఱియు నందతిమనో•మారుతకాంభోజ, సైంధవాశ్వములకు • సంఖ్య లేదు
బంగారుకొండలో•బలువిమానంబులో, యనఁ దగురథము లి•న్ననఁ దరంబె
కాలమృత్యువు నైన • ఖండింపఁగలశూర, సంహతులన్నియు • సా మెఱుంగుఁ

తే. జూచివచ్చినయర్థము • దాఁచ కిట్లు, చెప్పితిమి గాన క్షమియింపఁ • జెల్లు నీకు
సామి యని యూరకుండిరి • చారులనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. ఆమాట లాలించి•యల్క మొల్క లిడంగ, ఘనగభీరాత్ముఁడు • గాన యోర్చి
నెమ్మి నాచరులను • ర మ్మని కనుఁ గిఁటి, వేగ సభాస్థలి • విడిచి వెడలి
మేరుమందరములఁ • గేరెడుచంద్రార్క, శేఖరప్రాసాద • శిఖర మెక్కి
తనపట్టణముచుట్టుఁ • బెనఁగొని యొకమహా, జలధిపోలిక నున్న • బలముఁ జూచి

తే. విస్మయావిష్టచిత్తుఁడై • వెఱఁగుపడుచుఁ, జరులకాత్మీయపార్శ్వక•చరుల కిట్లు
పలికె ఢిల్లీశుఁ డఖిలభూ•భర్త యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. చరులార యీమహా•సైన్యములకు రాజు, బాఁపఁడు యతి హరి•భక్తుఁ డనుచు
వింటిమి మీ రన • విప్రసన్న్యాసికి, మాతోడిపని యేమి • మఱియు నతని
కీమహాసైనికు • లెల్లెరి వశ్య లిం, దెవ్వరిదేశము • నేధరిత్రి
బలశౌర్యవంతు లీ•బలములం దెవ్వరు, వీరివర్ణాశ్రమ•వివృతి యెట్లు

తే. కోశదండసమృద్ధి యీ•గురున కెట్లు, గలుగనేర్చెను దెలిసిన•కొలఁది మీరు
తెలుపుఁడీయని యారాజు•పలికెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. వీరిసేనలయందు • విన్నవృత్తాంతంబుఁ, జెప్పెద మవనీశ • చిత్తగింపు
పాలవారాశిలో • ఫణిరాజు హరితోడఁ, బ్రీతిఁ బంతము లాడి • భూతపురిని
నాసూరికేశవ•భూసురాగ్రణివల్లఁ, గాంతిమతీదేవి • గర్భమునను
జనియించి రామాను•జఖ్యాతిచే పెద్ద, సన్న్యాసి యైనఁ ద•త్సద్గుణముల

తే. కోడి వశవర్తులయిరి యీ•యోధులెల్ల, వినుము వీరలదేశాది•వివృతి యనుచుఁ
బలికి రారాజునకు నిజ•ప్రణిధు లిట్లు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. రాకాసుధాకర•శ్రీకవల్కాలమయ, పటకుటీరాంగణ • ప్రాంతములను
జందనాగురుచారు • సుందరతమబద్ధ, భవ్యమంటపమధ్య • భాగమునను
దెలిపట్టుమేల్కట్టు • వెలయుచుఁ బైనొప్పు, నతిమృదుపేత్రమ • యాసనమునఁ
జుట్టు భాగవతులు • జొత్తిల్లుచుండంగ, సూరిమధ్యస్థిత • శౌరిమాడ్కి
తే. నమరి పేరోలగంబున్న•యతివరేణ్యుఁ, డతఁడె రామానుజాచార్యుఁ•డవనినాథ
యనుచుఁ జూపించి రాచారు•లతనికనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. రాజసత్తముఁడు వ•రాహధ్వజుండును, విష్ణువర్ధనరాజ • విశ్రుతుండు
శతసహస్రఖ్యాత • చతురంగవాహిని, గొలువంగ నేతెంచి • గురువితోడఁ
దమశరీరప్రాణ•ధనము లార్యున కిచ్చి, రితనియోధాగ్రణు • లిట్టివార
లితఁడు కర్ణాటరా•జ్యేందిరారమణుండు, తొండనూరనుపురి • నుండువాఁడు
తే. విమలవేదాంతతత్త్వ వి•విత్సు నితఁడు, స్వగురుసన్నిధిఁ బాయఁడో•సార్వభౌమ
యనుచు వాక్రుచ్చిరాచారు•లతని కనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. లంక సాధింపఁ ద•లంచి ముం దెవ్వఁ డా•యబ్ధిపై నడపించె • నశ్వరత్న
మెవ్వాఁడు సాక్షాత్కృ•తేందిరారఘురామ, లక్ష్మణుం డఖిలవి•లక్షణుండు
కేరళరాజ్యల•క్ష్మీవిభుం డెవ్వాఁడు, కోలపట్టణవాసి • గుణజలనిధి
యట్టిశ్రీకులశేఖ•రావని పతికుల•జాతుఁ డీతఁడు మీన•కేతనుండు
తే. ఘోరచతురంగబలముతోఁ•గూడివచ్చి, గురునివనులందుఁ బ్రాణముల్•గోరఁడల్ల
వాఁడె కనుమని చారులు • పలికిరనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఘనవింధ్యగిరివార్ధి•గర్వ మెవ్వఁడు తొల్లి, సమయించెనక్కుంభ•సంభవుండు
సౌస్నాతకుండయ్యు•సవనావభృథమునం, దెవ్వానిగృహమున • కేఁగుదెంచె
నట్టిపాండ్యునియింటఁ • బుట్టి యీతఁ డనంత•పద్మనాభునిపాద•పద్మయుగళ
మర్చించి దుర్జయుఁ • డైనవాఁడు కిరీట•మకుటమాంధాత రా•మప్రభుండు
తే. కోట్లతరబడిసేనలఁ • గూడివచ్చి, గురుని కథమత మొనరింపఁ•గోరి యిచట
విడిసెఁ గనుఁగొను మనిచరుల్•నుడివిరనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. అతనికిఁ బడమట • సంజనాభశరీరు, లసహాయశూరులు • నమితబలులు
బాణబాణాసన • తూణీరధారులు, మలయపర్వతమహా • మందిరులును
వరనిషాదులు వీరు • గురునికార్యములందు, బహుమతి పేయను • ప్రాణములను
మఱియు వీరలు తొండ•మండలవనశైల•సదిసులైనట్టిని•షాదపతులు

తే. వృషభగారుడవేద్రాద్రి•వితతగహన, గోచరులు వీరు ప్రాణముల్•దాఁచ రనిని
మఱియువిను మని పలికిరా•చరు లటంచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. తుండీరమండల•ధూర్వహుం డీరాజు, సింహధ్వజుఁడు దృ ప్త•సింహబలుఁడు
వరదునిచే ముందు•వర మొందుకత నాజి,వేల్పుల కైనను,వెఱవఁ డితఁడు
శతలక్షసంఖ్యాక•చతురంగవాహినీ,సహితుఁ డై వచ్చి యీ•సంయమీంద్రుఁ
గొలుచు చున్నాఁడు గ•ర్గానుమీన్నృపాలకు, నని పల్కి-తిరిగి యి•ట్లనిరి చరులు

తే. వీర లాంధ్రాధిపతులు స•ద్వీర్యనిధులు, వీరిచతురంగబలముల•వి స్తరంబు•
జెప్ప లే మని చారులు•చెప్పి రనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. ఇతఁడు కళింగాధి•పతి మాధవాఖ్యకుఁ, డీయతీంద్రునిశిష్యుఁ•డింద్రసముఁడు
కలితశస్త్రాస్త్రౌఘ•గటవిధానుఁ డసంఖ్య, దారుణసేనతోఁ•దరలి వచ్చి
స్వగురుకార్యములందు•జాగరూకతఁ జెంది,యున్నాఁ డితనిఁజూడు•మర్వినాథ
వింధ్యాద్రినిలయులు•వీరు కిరాతాధి,పతు లసంఖ్యలు యమ•భటులవంటి

తే. వారుధానుష్క-లాహవ•శూరులాత్మ,గురునిపనులందు•ప్రాణముల్ • గోరరధిప
వీరిఁ గనుమని పలికి రా•చారు లనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. జాజుగందముఁ బూసి•చల్లాడములుదాల్చి, జిగికాసెకోకలు•బిగియఁగట్టి
ఖండాయతులు విచ్చు•కత్తులు చేఁ బూని,దండిగాఁ దనవెంటఁ•దగిలి కొల్వ
లక్షణయుతుఁ డైన•లాంగూలగజపతి, యింటఁ బుట్టినయుత్క-•శేశ్వరుండు
నపరిమితోల్లస•దత్యుగ్రచతురంగ, వాహినీసహితుఁ డై•వచ్చి యచట

తే. స్వగురుఁ డైనట్టియతిచక్ర•వర్తి యెదుటఁ
గొలుచు చున్నాఁడు వీఁడె క•ర్గాను మధీశ
యనుచుఁ జారులు వర్ణించి•రతని కనుచు
వాదిభీకరగురుఁ డనె•మోదమలర. 39

సీ. మును భట్టమంటప•మున నున్నబ్రాహ్మణుల్,దద్రాష్ట్రపతి యీ•ద్రి•దండపాణి
కళిమతశిష్యు లై•యలరార నానృపుం, డాత్మీయబలముతో•నరుగుదేర
ముందు ద్రోణాచార్య•ముఖ్యులకరణి నా•బ్రాహ్మణు లేతెంచి•భ క్తితోడ
శరచాపదివ్యాస్త్ర•శ క్తులై యిటఁ దమ,రాజుతో నీయతి•రాజుచెంత

తే. వాస మొందిరి గురుకార్య•వాంఛఁజేసి, వీరినందఱిఁ జూడు ము•ర్వీశ యనుచుఁ
బ్రణిధు లారాజవరునకుఁ•బలికి రనుచు,వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. భారతీదేవిచే•భాష్యము మెప్పించి, యేతేరఁగా నీయతీంద్రుఁ జూచి
పూజించి శిష్యుఁడై•పొలుపారుఘనుఁడు రా,మానందయోగీంద్రుఁ•డరుగుదేర
ద్వాత్రింశదాయుధ•ధరులు, లూర్ధ్వరేతస్కు•లు•యోగరతులు
ఘనపీతమృత్తికా•కల్పితచ్ఛిద్రోర్ధ్వ•పుండ్రులు శూరులు•భూరిభుజులు

తే. నతనిశిష్యులు వీరంద•అరుగుదెంచి, గురునితోడుత యతిపతిఁ•గూడి రనుచుఁ
బ్రణిధు లారాజమౌళికి•బలికి రనుచు వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. వీరు నాగా లని•పేరు గాంచినవారు, వీరినివాసముల్•విను మిలేశ
శ్రీపురుషోత్తమ•క్షేత్రసాలగ్రామ,చారుపుష్కరహరి•ద్వారములును
నైమిశాటవి నర•నారాయణాశ్రమ, కాశి గయా ప్రయా•గ త్రివేణి
వరచిత్రకూట గో•వర్ధన గోకుల, ధన్యబృందావన•ద్వారవతులు

తే. మధుర గంగయు యమునయు•మహదయోధ్య
హరికి సిరి కిష్ట మౌవేంక•టాద్రి యనుచు
భూపతికిఁ జెప్పి రాగూఢ•పురుషు లనుచు
వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. శ్రీహరిగుణములు•క్షితిరేణువులు మింటి,చుక్క లన్నియు లెక్క•కెక్కునేని
యీనిత్యచేతను•లెన్నంగఁబడుదురు, వీరివర్తనముల•తీరు వినుము
కలనైన గురుదాస్య•కల్యాణకాంక్షచే, శుష్కతృణంబు గాఁ•జూతు రితర
మరిషట్కజయముచే•నలరారు చుండియు, గురునికార్యములందుఁ•గోరరసువు

తే. లఖిలసాధనధారులు•నమలమతులు. వీరివాసస్థలంబును•వినుము మీఁద
ననుచుఁ జారులు వచియించి•రతనికనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. యదుగిరి నారాయ•ణాద్రి సత్యవ్రత, వీక్షారణ్య•సింహగిరులు
సరసరంగస్థలి•చంపకాటవి ధన్వి•పురము శ్రీముష్ణము•గరుడనగము
కురుకతిరుక్కురుం•గుడి యనంతపురంబు,తోతాద్రిఘటికాద్రి•భూతపురియు
నలరు భక్తారామ•మళహరికిరుమల, పాండురంగము కూర్మ•భద్రగిరులు

తే, వేగవతి తామ్రపర్ణి కా•వేరి మఱియు, దివ్యదేశంబులును బుణ్య•తీర్థములును
వీరి కిర వని చెప్పి రా•చారు లనుచు, వాదిభీకరగురుఁ డనె, మోదమలర.

సీ. వీరు వచ్చినపని•తీరు మే మెఱుఁగము, చెప్పఁగా వినలేదు•పేనలందు
మాట లే మందువు•మాబోఁటివారి కా,యతిచక్రవర్తిస•భాంతరమున

విన్నంతి కన్నంత, వినిపించితిమి గాని, మిథ్యఁ జెప్పఁగలేదు, మేర దప్పి
కాన వాగ్దోషముల్, గణుతింపకమనేత్ర, భూతులమగుమమ్ముఁ, బ్రోవుమనుచు

తే. జాప లతినమ్రులై మ్రొక్క, సత్య మనుచుఁ, బరబలోద్ధతికథనోత్థ, పరిభవంబు
నోర్చి తల యూఁచి రాజూర, కుండె ననుచు, వాదిభీకరగురుఁ డనె, మోదమలర.

వ. అని పల్కు వారలమాటలు విని రా జాత్మగతంబున.

సీ. సన్న్యాసిగతిఁ దోఁచు, చక్రహస్తుఁడె కాని, యతిమాత్రుఁడే యితఁ, డరసిచూడ
నని తనమది నెంచి, యామేడ దిగి, మణివిచిత్రాస్థాన, మంటపమున
హాటకరత్నపిం, హాసనాసీనుఁ డై, పేరోలగం బుండి, బింక మలర
సాటిరాజులు మంత్రి, సత్తములు పురోహి, తులుగురువులు ప్రకృ, తులు వినంగ

తే. వీరసమ్మయరసకృతుత, పికృతులాత్మ, ధైర్యమునఁ గ్రమ్మిమందస్మి, తమునమోము
చెలువుగులుకంగ రాజిట్లు, పలికెననుచు, వాదిభీకరగురుఁ డనె, మోదమలర.

సీ. భిక్షురా జొక్కఁడు, భీమపరార్ధసం, ఖ్యాతసద్రథహయ, గజభటాది
మహితసైన్యములతో, మనపట్టణము, జుట్టి, విడిసినాఁ డీవొడ్డ, వింత వినుఁడు
బాఁపనతబిపి యీ, పగిది ముట్టడిఁ జుట్టఁ, గారణ మేమియుఁ, గానఁబడదు
గాన మీమీబుద్ధి, కల్పనాబలమున, మంచియుపాయ మూ, హించుఁ డొకటి

తే. యతులషాడ్గుణ్యచతురుపా, యములదండ, నీతిఁదెలియంగమీరతి, నిపుణులంచుఁ
బలికె సభ్యుల కాభూమి, భర్త యనుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర.

సీ. రాజుమాటలు విని, రక్కసులట్ల వి, జృంభించి సభలో వ, జీరులందుఁ
గొంద ఱిట్లని పల్కి, రందఱ మేటి కీ, బాఁపనసన్న్యాసి, బలము గెల్వ
మఱియొకఁ డనియేను, మద్బాణవృష్టి నీ, విచ్చపుబాఁపల, మచ్చుమాపి
రాజుల నందఱ, రణములోఁ దునుమాడి, దాసరవాండ్రపెం, దలలఁ దఱిగి

తే. యుటిమిబైరాగులనుబోరఁ, దఱిమియుద్ధ, భూమిమృత్యువుకొకపాన, భూమిఁజేసి
గెలిచివచ్చెద నిదె యని, పలికెననుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర.

సీ. చెలఁగి పేర్వేఱ వ, జీరు లి ట్లని పల్కి, రాజున కిట్లు హుం, రావు లనిరి
సన్న్యాసితోఁ బోరు, సర్వార్థములఁ బాపు, నదిగాన నొకయుపా, యంబువినుఁడు
దేశము లన్ని జ, ప్తి సేయ రాజులు, గొలిచెద రీనిన్ను, గురుని మాని
బాఁపలవృత్తులఁ, బాపినఁ జెడుదురు, బైరాగు లుందరు, భైక్ష్య ముడుపఁ

తే. గొండపాలెము లన్నియుఁ • గొల్లగొనినఁ, గోయరాజులు వినుతురు, గురునినంత
వెడలు నీయతి యొకఁ డని • నుడివి రనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. పీఠుజాదాలందుఁ • బెద్ద లొకొంద ఱ, ద్వైతులు పలికి రా• ధరణిపతికి
నాకాశ మొక టయ్యు • నది జలకలశము, నందు బహుత్వముఁ • జెందుపగిది
వస్తు వొక్కటి యయ్యు • విస్తులానాద్యవి, ద్యోపాధిచే భేద • మొంది తానె
బాధ్యబాధకతాది • బహుభావములఁ జెందుఁ, గాన నీమెల్ల యుఁ • గల్లయగును

తే. నిజ మెఱింగిన సుఖమును • నివ్వటిల్లు, ననుచుఁ బలికిన విని కొంద • ఱందుఁ దత్వ
వేత్త లి ట్లని రద్ధరా • విభున కనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. తెరమీఁదిబొమ్మలఁ • దీరుగా నాడించి, తనదునాటకసూత్ర • ధారిపగిది
మాయ యన్యవనిక • మఱుఁగున నందఱి, హృత్పద్మముల జగ • దీశుఁ డుంచి
యీభూతములఁ దన • కిష్ట మైనట్లుగా, భ్రమణ మొందించును • బహువిధముల
మనయత్న మఫలము • మహిఁ తేశ్వరాజ్ఞచేఁ, గా నున్నయర్థము • గాకపోదు

తే. కానియర్థము లేమియుఁ • గావు గాన, సతని యందు భరన్యాస • మర్హ మనుచుఁ
జెప్పి రారాజునకుఁ గొంద • ఱప్పు డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అంతఁ బకీరులం • దర్హణీయులు కొంద, ఱిట్లని రాయన • నీశ్వరునకుఁ
గంటిమి వింటిమి • తొంటిసన్యాసుల, పీఠ్రభుత్వముఁ గాన • మెవ్వరికిని
సంగ మేమియు లేని • సన్న్యాస మేడ చి, త్తక్షోభకరణ మీ • ధ్వజిని యేడఁ
గాన సన్న్యాసిలిం • గములు దాల్చినవొడ్డ, యతిగానియితఁడు స • న్న్యాసి గాఁడు

తే. కపటయతితోడనైనను • గలహ మొంద, రాదు రాజునకంటివా • రణము సల్పఁ
బంపు మమ్మని తిరి గిట్లు • పలికి రనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఘనదేవగిరిమహా • కాళకేదారగం, గాద్వారకాశిగో • కర్ణవాసు
లున్నతవిగ్రహు • లూర్ధ్వరేతస్కులు, ద్వాత్రి-శదాయుధ • ధరులు భస్మ
సంచయోద్ధూళిత • సర్వగాత్రులు దిగం, బరులు జటాజూట • భారధరులు
సకలవైష్ణవరిపుల్ • శైవసన్న్యాసులు, వర్షాశనములకై • వచ్చినారు

తే. వారి మాతోడఁ బంపిన • వారు మేముఁ, గలిసి వైరులఁ జెండాడి • కపటయతిని
బట్టి తెచ్చెద మని వారు • పలికి రనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. కడు విమర్శి పక • కార్యముఁ జేసెనా, చేటు వాటిల్లు నే • మేటి కైనఁ
గాన విచారించి • కార్యము చేసెడు, ఘనునిఁ దానె వరించుఁ • గలిమివెలఁది

యనుచు భాజీలుప ॥ల్కినవయోక్తుల విని, సరదార్లు పలికిరి ॥ శౌర్య మలర
నీతు లన్నియు రణ ॥ భీతులకే కాని, శూరుల కేటి కీ ॥ సుద్దు లన్ని

తే. దురమునకుఁ బంపు భుజముల ॥ దురద దీఱ, నఱికివై చెదమరులను ॥ నాథయనుచు
నలుక దళుకొత్త మఱియును ॥ బలికి రనుచు, వాదిభీకరగురుఁ డనె ॥ మోద మలర.

సీ. ఆసేతుహిమవన్న ॥ గామహీమండల, సామ్రాజ్య మేలుభూ ॥ స్వామి వీవు
నవలక్షచాపభృ ॥ న్నాధుఁ డౌవీరప్ర, తాపరుద్రునిచెఱఁ ॥ బాపుబలివి
బిచ్చపుబాఁవలు ॥ బీదరాజులు గొల్వ, భిక్షుఁ డొక్కఁడు వచ్చి ॥ బీర మొప్ప
రాజదేవేంద్ర నీ ॥ రాజధానికిఁ జుట్టు, ముట్టడించిన నెత్తి ॥ మొట్టినట్లు

తే. గాదెయింకేలనయవాక్య ॥ గౌరవములు, మనవిగై కొమ్ము సెలవిమ్ము ॥ మాకుననుచు
నలుక దళుకొత్తమఱియును ॥ బలికి రనుచు, వాదిభీకరగురుఁ డనె ॥ మోద మలర.

సీ. గండశైలము లెత్తి ॥ కందుకంబుల నాడు, బాహువుల్ కండూతి ॥ పాలు చేసి
యని సేయ కుండుట ॥ యర్హము గాదది, గానఁ బంచుము మమ్ముఁ ॥ గలహకేళి
కనిశ మాయుధశక్తి ॥ కర్చమాత్రమె కాని, పోరోగిరపుఁదిండి ॥ పొసఁగలేదు
గాన శత్రులఁ ద్రుంచి ॥ ఘనభూతభేతాళ, కూశ్మాండగోమాయు ॥ ఘూకకాక

తే. గండభేరుండముల కెల్ల ॥ గాఢతృప్తిఁ, జేసెదము రక్తమాంసావ ॥ సిద్ధి ననుచుఁ
బడమిఁతేనికి సరదార్లు ॥ నుడివి రనుచు, వాదిభీకరగురుఁ డనె ॥ మోద మలర.

సీ. మఱియుఁ గొందఱుశూర ॥ మానులు మదగర్వ, పర్వతారూఢులై ॥ పలికి రిట్లు
మమ్ముఁ బంపుము రాజ ॥ మార్తాండ ఖండనం, బునకెవ్వరేల మ ॥ ద్భుజబలమున
రథముచే రథము గు ॥ ఱ్ఱముచేత గుఱ్ఱము, గజముచే గజము నీ ॥ ల్గంగ నడిచి
ముష్టినిష్ఠురఘాత ॥ ములఁ దలప్రహతులఁ, బదజానునిహతుల ॥ భటులఁ జంపి

తే. శూరమానుల రాజుల ॥ పే రడంచి, పోర దాసరిబాఁపల ॥ బీర మడఁచి
వచ్చెద మటంచు వారు వా ॥ క్రుచ్చిరనుచు, వాదిభీకరగురుఁ డనె ॥ మోద మలర.

సీ. రా జభిజ్ఞుం డయ్యు ॥ రాజధర్మం బని, మంత్ర మొనర్చిన ॥ మంత్రు లిట్లు
తమతమబుద్ధికిఁ ॥ దగినట్లు వేర్వేఱ, ఘనశూరవాదముల్ ॥ గడపినంత
విని తనమనమున ॥ వీరు దూర మెఱుంగ, రని తలంచి నిజాన్వ ॥ యప్రదీప
మైనవాని నయాన ॥ యాతికోవిదుఁ బర ॥ మార్థవేత్తను దన ॥ యంతికమున

తే. నున్నవాని కఫీ రను ॥ పిన్నవాని, నన్న నీ కేమి దోఁచిన ॥ దన్న నాతఁ
డానరేంద్రున కీరీతి ॥ ననియె ననుచు, వాదిభీకరగురుఁ డనె ॥ మోదమలర.

సీ. అర్కేందుదిక్పాల•కాంశములను రాజు, జనియించు ననియును • శార్ఙ్గపాణి
గాకున్న నరపతి • గాఁ డనియును శాస్త్ర,వేత్తలు చెప్పఁగా • విందుఁ గాన
నవని సాక్షాద్విష్ణు • వగుసార్వభౌముఁడ, వీఁ వెఱుంగవియర్థ • మేమి లేదు
నీయాజ్ఞ నైనను • నే నెఱింగినయంత, చెప్పెద నది కృపఁ • జిత్తగింపు
తే. మనుచుఁ బుంభావ మొందిన•హరిపదాబ్జ,భక్తి గలుగుకఫీరుఁ డ•రక్తిశాలి
బహునయోక్తుల సభ కిట్లు • పలికెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. అత్యంతదుర్జ్ఞేయ • మైనరాజనయంబుఁ. దెలియు టరిది యెట్టి•దిట్ట కైనఁ
దెలిసెనా యది మదిఁ • దొలఁగకుండ ధరించి, సందియపడక ని•శ్చకము లుడిగి.
సమయముఁజూచి ని•జస్వామికెఱిఁగించు, వాఁడెపో సన్మంత్రి•వరుఁడు పుడమిఁ
దెలిపి హితోక్తులఁ • బలుకక నృపతికి, మంచిమాటలనాడు • మధ్యముండు
తే. నట్టినీతి యెఱుంగక • యఖిలవేత్తృ,తాభిమానము గలవాఁడె • యధమమంత్రి
యని కఫీరుఁడు రాజున • కనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ముఖ్యకార్యములందు •మొదటిమంత్రినిగూడి, భూపతిమంత్రంబుఁ • బొసఁగఁజేసి.
తేలినయర్థము • పాలింపవలెఁ గాని. సాహసకృత్యముల్ • సలుపరాదు
సాహసప్రియులైన • న•శత్తక ప్రహ, స్తమహోదరేంద్రజి•త్ప్రభృతు లెల్ల
నరవానరులఁ దాఁకి • నాశమొందరె మును, శలభము లగ్నిలో • నమసినట్లు
తే. గాన స్వపరబలాబల•జ్ఞాన మరసి. సామదానాదులను రాజు • సలుప మేలుఁ
జెందు నని యక్కఫీరుఁడు • చెప్పె ననుచు. వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. భరతవర్ష క్షితి•పాలు రందఱు మును, వొదిఁగి నీయాజ్ఞలో • నుందు రిపుడు
మనజాతినృపతులు•మఱియు హూణులు దక్కఁ, దక్కినన్నృపులెల్ల • లెక్కలేని
చతురంగబలములు • నమరూ్చకొని వచ్చి, యుండి రిచ్చట నీత్రి • దండియాజ్ఞ
మఱియుఁ గడిందిపో•టరులగుంపుల కెల్ల, సంఖ్యయెవ్వఁ డెఱుంగు•స్వామిదక్క
తే. నిట్టిబలములు గొలువఁగా • నిచట నున్న
యితఁడు సన్న్యాసిమాత్రుఁడే • యెంచి చూడ
నని వచించె కఫీరుఁ డా•ఘనున కనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ కైజీతముల కైనఁ • గట్టుబళ్ళకు నైనఁ, గొలుచుపోటరు లిట్టు • గొలువరెందు
జీవితాశలు మాని • చెంది రామునిఁ గొల్చు, వానరుల ట్లున్న•వారు వీర

లారాముఁ డిలక్ష్మి•హార్యులై నారు గాఁ.బోలఁ గాకున్న నీ•పొలఁతి యెట్లు
సంధవించును భువి • సన్న్యాసిమాత్రున, కదిగానఁ బ్రత్యక్ష•హరి యితండు

తే. మనపుర గ్రామవిషయోప•వనములందు, నితఁడు చేసినయపకృతు•లేమి గాన
మని వచించెను నృపతి క•య్యనఘుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. శక్తిత్రయము గల్గు•సార్వభౌముఁడ వీవు. జితకాశు లీనీవ•జీరు లెల్ల
నిట్టిసీ వీయతి • కెదురెత్తి చని పోరి గెలిచితివా యేమి • కీర్తిగలుగు
గెలు పబ్బదాయె నా•గెలి దప్పదు గాన, సన్న్యాసితోఁ బోరు • సలుపఁ గూడ
దమ్మహాత్మునితలం • పరసి చూచినమీఁద, నాతఁడు యుద్ధభి•క్షార్థి యైనఁ

తే. బోరవచ్చును గా కున్నఁ•బూజచేసి, యతనియిష్టము సమకూర్చి • యనుపవచ్చు
ననుచుఁబల్కెను నృపతిక•య్యనఘుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. కర్తిగ ద్దెతెంచి • కను మోహరించిన, గురువులతోనైన • దురము దగును
గురువుల కెదిరించి•దురమొనర్చిరిగాదె, కురుపితామహుఁడు ఫ•ల్గునుఁడుముందు
గూఢాపకారిని • గురువును విశ్వరూ•పాఖ్యుని ద్రుంచఁడే • యమరవిభుఁడు
పాండవమధ్యము • బవరాన గెల్వఁడే, స్వతనూభవుఁడు బభ్రు•వాహనుండు

తే. వేయిమాట లింకేటికి • వేగ నొక్క•మంత్రి నవిచిన స్వామి•మనకుఁ దెలియు
ననిన విని రాజు సభ్యుల•కనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. చారులవల్ల నా•సంయమీంద్రునిసాధు•భావ మెల్లను మాకు • బయలుపడెను
సౌధాగ్రముననుండి • సాక్షాత్కరించితి, మమ్మహాత్మునిఁ దద్బ•లాతిశయము
నారాయణుఁడు జగ•న్నాథుఁ డీయతిరూపి, యైనవాఁ డఖిలలో•కావనార్థ
మని మాకుఁ దోఁచిన•యర్థమే యీ కథి•కుఁడు చెప్పెఁ గావున•రూఢమిదియె

తే. యనుచుఁ బలికిన రాజున • కానభాంత•రాళసంస్థితు లభ్యస్త•రాజనీతు
లొప్పఁగా నొక్కమఖుమాటఁ•జెప్పిరనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. ముందయోధ్యవసిష్ఠ•మునిసూక్తి రామభూ•కాంతునిమాటతోఁ • గలసినట్లు
హరిసభాంతరమునం • దారామునూక్తితో, హనుమదుక్తులు చెలు•వందినట్లు
లీకథీరుఁడు పల్కు•హితవచనంబులు, మీసూక్తితో నైక్య•మై భజించె
నిరువురవాక్యము • లేకార్థకము లైన, నదియె ప్రామాణిక • మర్థ మగుడు

తే గానఁదగువారిఁ బంచిత•త్కాంక్షితంబుఁ, దెలిసి సమకూర్చినను మేరు•ధీర మనకు
పేమ మగునని సభ్యులు • చెప్పిరనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఈరీతి నిర్ణయ • మేర్పరించినపిదప, మంత్రులఁ బంపంగ • మదిఁ దలంచి
పండితరాయని • భగవంతరాయని. రావించి యిట్లని • రాజు పల్కె
మీరుమా కాప్తులు • మిత్రులు మంత్రులు. బాహుదృగ్భూతులుఁ • బండితులును
గానఁ బంపెద మిమ్ముఁ • గడువేగచని యాయ,తీంద్రుని యభిమత•మెఱిఁగివచ్చి

తే. మాకుఁ దెలియంగఁ బలుకుఁడీ • మర్మమడిగి, యనుచుఁ బంచిన వారిప్పు•డతులమ
యతిశిఖామణిసన్నిధి•కరిగి రనుచు, వాదిభీకరగురుఁడనె•మోద మలర. [తులు

సీ. ద్విజులు మహారాష్ట్ర•దేశీయు లశ్రాంత,గోబ్రాహ్మణార్థాను • కూలమతులు
వారవాణోష్ణీష • వరహారకుండలా., గదకంకణోర్మికా • కల్పధరులు
కటిబంధపటితాతి • పటుకటారాంచితు, లఖిలపురాణశా•స్త్రార్థవిదులు
మంత్రు లాయిర్వురు•మణిశిబికల నెక్కి, తగుపరిజనులతోఁ•దరలి వచ్చి [జేసి

తే. సంయమీంద్రునిఁబొడగాంచి • స్వశుభగోత్ర, నామముఁ జెప్పుచునువంద•నములఁ
యతనియనుమతిఁగూర్చుండి • రచట ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. అంతఁ బండితరాయఁ • డర్ఘ్యోపహారము, లర్పించి కేల్మోడ్చి • యనియె నిట్లు
లెచటనుం డిచ్చోటి • కేతెంచితిరి మీరు, లీరాజుతోఁ బని • యేమి మీకు
శిష్యుల మగుమాకుఁ•జెప్పంగఁ దగు నెట్టి, గుహ్యమైననుజగ•ద్గురుఁడ వీవు
వేదవైదికధర్మ•విస్ఫూర్తికై హరి, వ్యాసదత్తాత్రేయు • లైనయట్లు

తే. పరమవైదికధర్మముల్ • బయలుపఱప నీస్వరూపముఁ జెందెను • నిక్కమనుచు
భాష్యకారుల కామంత్రి•పలికె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. భగవంతరాయఁడు•భక్తితోఁ జేమోడ్చి. యంత యతీంద్రుని•కనియె నిట్లు
బౌద్ధపాషండాది•బహువిధదుర్మతాం,తర్ధ్వాంత మణఁపఁగాఁ•దలఁచి శౌరి
మింట సూర్యునిగతి•మేదినిపైఁ దాను, సంయమిరూపియై•సంచరించుఁ
గానఁ గన్నులవిందు•గా నిన్ను నారాయ,ణాత్మునిఁ గనుఁగొంటి•మయ్య నేఁడు

తే. మేము ధన్యుల మైతిమి•మీయభీష్ట,మానతిచ్చిన సల్పెద•మనుచుఁ బలుక
యతిశిఖామణి వారికి•ట్లనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర

సీ. తావు మా కలరంగ•ధామ మచ్చటనుండి, యాదవగిరికడ•కరుగుదెంచి
యచటి కచ్చోటినుం•డేగుదెంచితిమి మా. కెవ్వరితోఁ బను•లేమి లేవు
సద్గుణములుగల•సార్వభౌముఁడు గాన, నీనృపుఁ గనుఁగొన•నిచ్చ పొడమె
సారవిచారులు•సాధువిధేయు లీ,ధరణీశునకు హిత•కరులు మీరు

తే. గానమాయాప్పితములున్న•కరణిమీకుఁ,జెప్పితిమి వేగచనియిట్లు•సేయుఁడంచుఁ
బలికియతిరాజు వారిని•బనిచె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. కన్నులపండువు•గా యతీంద్రునిఁ జూచి, యాతనితో మాట•లాడి వాణి
సఫలతఁ జెందించి•సద్భక్తి ముమ్మాఱు, వంచన మార్చి యా•నంద మొంది
యవ్వేటినుం డమ్మ•హాత్ముని వీడ్కొని తమరాజుకడ కేఁగి•తగినయట్లు
వినయము లొనరించి•వేడ్క సన్మంత్రు లా•యిరువురు యతిపతి•యాప్పితార్థ

తే. మంత నరపతి కెఱిగింప•నతఁడు సంత•సించి వారికి బహుమతిఁ•జేసి సంశ
యంబు లన్నియు విడిచి యి•ట్లనియెననుచు. వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. నయనగోచరుఁ డగు•నారాయణుఁడె కాని, కర్మందిమాత్రుఁడు•గాఁ డితండు
మనహం దనుగ్రహ•మొనరింప మనపురి, కేతెంచినాఁ డితం•డెంచిచూడఁ
గావున మీ రేఁగి•కడువేడ్క నమ్మ•హాత్ముని మనయింటికిఁ•దోడుకరండు
పొం డని మరల నా•పండితరాయని, భగవంతరాయనిఁ•బంచె నృపతి

తే. తాను యతిపతి కెదురేఁగ•దలఁచినిలిచె, నంత సచివులు వారిద్ద•ఱరిగి తిరిగి
చూడ్కు లలర యతీంద్రునిఁ•జూచిరనుచు. వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. ఆయతీంద్రునికి సా•ష్టాంగప్రణామముల్, సేసి యాసచివులు•చెప్పి రిట్లు
రామానుజార్య మా•రాజు మీయడుగునె, త్తమ్ములఁగనుఁగొనఁ•దలఁచిమిమ్ము
దోడుకరమ్మని మమ్ముఁ•దోరమ్ముగాఁ బంపెఁ, గాన విచ్చేయుఁడీ•కరుణతోడ
నని వారు ప్రార్థింప•యతిరాజు దత్పురి, కడ కేఁగ సమకట్టి•కదలినంతఁ

తే. దగువజీరుంతో రాజ•ధాని వెడలి, ఢిల్లియేకిమీఁదు పురజను•లెల్లఁ దన్ను
మెచ్చ యతిరాజు కెదురుగా•వచ్చెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. బాలార్కమండల•ప్రభల నంబరమట్లు, తనమేనిరుచుల న•ద్ధరణి మెఱయఁ
దనచుట్టు సూరులు•తగ భజించుటఁజేసి, పరవాసుదేవుని•భావ మమర
యతిశత్తై కాంతిసా•హస్రసంస్తులచేఁ, దనయతీంద్రత్వమ్ము•జను లెఱుంగ
సకలచేతనులను•స్వవశులై యునికిచేఁ, దనయమానుషశక్తి•ఘనత కెక్క

తే. సుఱుఁటు లిరువంకలను సూరి•వరులు వీవ ధవళతరమైనయాతప•త్రంబునీడ
వచ్చె యతిరాజు ద్రష్టలు • మెచ్చననుచు. వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. మఱియుఁగొందఱుబుధు • ల్మకరతోరణబిరు, దాంకముల్చేఁబూని • యరుగమొగిని
మఱికొంద ఱాశ్రితుల్•మణివేత్రపాణులై, ప్రజల నందఱఁ బరం•పరలుదీర్పఁ

గరఘంటికాళంఖ•కాహళంబులు మ్రోయ, వేణువీణాగీత•విభవ మొప్ప
స్వామి పరాకు హె•చ్చరిక శ్రీరంగరా, జవిజయధ్వజ యతి•సార్వభౌమ

తే. భారతీశోకనాశన • బహుపరాక, టనుచుఁ గొందఱు ముందఱ • వినుతి సల్ప
వచ్చె యతిరాజుసుజనులు • మెచ్చ ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఆమ్నాయములు శిష్యు•లై వెంట నేతేర, వచ్చుదత్తాత్రేయ•పరమయోగి
కతిభక్తిఁ గార్తవీ•ర్యార్జునుం డెదురేఁగు, గతి నెదుర్కొని యతి•పతిని జూచి
సద్భక్తి మ్రొక్కిడి • సకలోపచారముల్, సేసి యి ట్లని ధరా•ధీశుఁ డనియె
సకలశుభంబులు • సమకూడె మీశుభా, గమనంబుచే మాకుఁ • గలుష ముడిగె

తే. మీరు నిస్పృహులై నను•మీయనుజ్ఞ, నొక్కపనిఁజేయ వేడుక•చిక్కె మాకు
నిష్టమెఱిఁగింపుఁ డనియె ఢి•ల్లీశుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. ఆరాజువినయో క్తు•లాలించి యతిరాజు, హర్షించి మఱుమాట•లతని కనియె
నరనాథ నీసద్గు•ణంబులు విన్నట్లు, నీయెడఁ గనఁబడె • నేఁడు మాకు
మును కాకరుద్రుని • ముక్కంటిగాఁ జూచి, భీతిల్లుతల్లికిఁ • బ్రీతితోడ
స్వముఖపద్మమునందు • శంఖచక్రములను, జూపి తద్భయ మెడఁ•బాపి తీవు

తే. రాజమాత్రుండవే రాజ•రాజ నీవు, సలుపుసత్కారముల మది • సంతసించె
మఱియు వినుమనిపల్కె న•మ్మాన్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. ధరణీశ మా కిష్ట•దైవత మగునొక, హరివిగ్రహము భవ•దాలయమున
నున్నది దానిమా • కొసఁగుమంతకు మించ, నేపదార్థములయం • దిచ్ఛ మాకు
లే దన్న రాజు స•మ్మోదించి మామంది,రములు మీపాదాబ్జ•రజముచేతఁ
బావనంబులు చేసి•భవదభిమత మగు, హరివిగ్రహముఁగొని • యరుగుఁ డనిన

తే. సంయమీశ్వరుఁ డందుకు • సంతసించి, యమ్మహారాజుతోఁబురి • కరుగుదేరఁ
జూచి రందఱు యతిరాజ•సూరి ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. నరసార్వభౌముఁ డా•గురుసార్వభౌముని, నయనాగ్రపథమున • నడచి యరుగఁ
బట్టణ మంతయు • బహువిధాలంకార, పూర్ణమై దేవేంద్ర•పురిని గేర
వీణావిపంచికా•వేణుమృదంగాది, నాదతాళోచిత • నాట్య మొప్పఁ
బంచమహావాద్య•పటహభేరీశంఖ, కాహళధ్వని కాండ•ఘటము నిండ

తే. సూతమాగధవందులు • ప్రీతిఁ బొగడ, రాజపథమున సంయమి•రాజు చనుచు
జనులకన్నులపండువు • సలిపె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. బహువిధోపాయన•పాణులై సజ్జను, లడుగునెత్తమ్ముల • కర్చ సేయ
రంగుగా ముత్యాలు • రచియించి పౌరపు,ణ్యాంగనల్ మంగళ•హార్తు లియ్యఁ
బ్రాసాదజాలరం,ధ్రములచే సేవించి, సతులుకొందఱు సుమాం•జలులు సల్పఁ
గరుణాకటాక్షవీ•క్షణముల నందఱ, లక్షించి యాపుర•లక్ష్మిఁ గాంచి

తే. విస్మయముఁజెంది ఢిల్లీశు•వినయమునకు, సంతసించుచు యతిలోక•చక్రవర్తి
యమ్మహారాజుగృహమున•కరిగెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఇతఁడచే మునురాచ•యింతిఁ బూనిన బ్రహ్మ,రాక్షసోత్తమునకు•మోక్షదాత
యితఁడచే యలవేంక•టేశ్వరునకు మును, శంఖచక్రము లిచ్చు•సద్గురుండు
ఇతఁడచే మును కూర్మ•పతిని బ్రతీచీన,ముఖునిఁగాఁ ద్రిప్పిన•మునివరుండు
ఇతఁడచే మునుభాష్య • మింపొంద రచియించి, భారతిమెప్పించు • భవ్యమూర్తి

తే. యితఁడచే రంగరాజున • కిష్టమంత్రి, యితనిఁదలఁచిన సమకూడు•నిహపరంబు
లని పరస్పర మనుకొని•రతివ లనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. మనరా జితని కిట్లు • వినయ మొనర్చిన, మన మూర కుండరా • దని తలంచి
పారసీకతురుష్క•పల్లవయవనహూ,ణాదులౌ మ్లేచ్ఛులు • యతివిభునకు
మ్రొక్కిడిమక్కువఁ•జిక్క రాజాజ్ఞచేఁ,దొలఁగి శ్రేణులుదీర్చి • కొలుచుచుండ
నింద్రాయుధద్యుతు • లీనుమహాధన,రత్న సంఘటితతో•రణము దాఁటి

తే. యామభేరీఘటీఘంటి•కాలయములఁ, గడచి ప్రజల హజారము•కడను నిల్పి
యంతయతిరాజు మితశిష్యుఁ•డయ్యెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఆరాజు మితశిష్యుఁ • డైనయతీంద్రునిఁ, దోడ్కొని చనువేళఁ • దోఁచె నతఁడు
ప్రతికూలమతులకుఁ • బ్రళయార్కబింబము, గతి భక్తులకు హరి•కరణిఁ దోఁచె
న ట్లాగుబొద్వహుఁ • డరిగి యంతస్సభా,మంటప మధ్యస్థ•మణివితర్దిఁ
జిత్రమృదుస్ఫార•వేత్రాసనమునందుఁ, గూర్చుండి యున్నయ•గ్గురుని విష్ణు

తే. బుద్ధి రత్నసుమాదులఁ•బూజఁజేసి, చాలఁబ్రియవాక్యములఁ జెప్పి • సత్కరించి
భక్తి నారాజరా జిట్లు • పలికెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఔరంగజేబు ముం•దఖిలదైవతవిగ్ర,హములఁ దెప్పించి యా•యాలయమునఁ
జెఱఁబెట్టినాఁడ యా•చెఱ విడిపింపంగ, నెవ్వఁడుఁ దలఁపలే • దింతవట్టు

విష్ణుఁడో శేషుఁడో • విహగనాయకుఁడొ సూ • త్రవతీశుఁడో యో • త్రి • దండినాథ
నీస్వరూపముఁ జెంది • నేఁడు మాగృహమున • కీపనికై వచ్చె • నిది ధ్రువంబు

తే. అట్లు గాకున్నఁ గలనైన • నన్యుఁ డిటకు, నేఁగుదెంచునె యూపవి • కెంచి చూడ
నని యతీంద్రునకనియె న • య్యధిపుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అదె చెఱసాల మీ • రం దేఁగి మీవిగ్ర • హంబుఁ గైకొనిబస • కరుగుఁ డనినఁ
జని చెఱసాలలో • సకలవిగ్రహముల, నరసి చూచిన యాదవా • ద్రిపతికిఁ
దిరుమేనికాంతిచే • దీప్తైన విష్ణువిగ్రహ మొక్కటైనను • గననికతన
రామప్రియుఁడు గాన • రాఁడాయె నని మదిఁ, గుందుచువచ్చి య • గ్గురువరుండు

తే. స్వజనసంవృతుఁడై స్వని • వాసమొంది. స్వప్నగతుఁడైన యదుగిరి • స్వామిసూక్తి
సంస్మరించుచు నుండెనా • స్వామి యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అంత సాయంతన • హరిశాసనముఁ దీర్చి, జలధిగట్టున రామ • చంద్రునట్లు
కాళిందికడ మృదు • కాషాయచేలముఁ, బఱచినకుశశయ్యఁ • బవ్వళించి
కలలోనఁ గనిపించి • పలికిననీసూక్తి, సత్యము గా కున్న • శక్తి కొక్క
కొఱఁత వచ్చును గాదె • గోవింద యదుగిరి, నాథ రామప్రియ • నలిననేత్ర

తే. నీవు గనఁబడవైతివి • నేఁడు మాకుఁ, జేయఁగలకృత్య మెట్టిదో • చెప్పు మింక
నని తలంచుచునిద్రించె • నార్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ అంత రామప్రియుం • డారాత్రి యతిరాజు, కలలోనఁ దోఁచి యీ • కరణిఁ బలికె
గురువర నీకు నేఁ • జెఱసాలలోఁ గనం, బడనైతి ననుచింతఁ • బాయు మచటి
కేను వాకిండ్లు దాఁ • టేఁగి యంతఃపుర, మణిమయప్రాసాద • మందిరమునఁ
బగడంపుఁగోళ్ళను • బసిఁడిపట్టెలఁ జూడఁ, దగుహంసతూలికా • తల్పమునను

తే. మోహనాంగిని సుల్తాను • ముద్దుపట్టిఁ, గూడి వేడుకతోఁ గ్రీడ • లాడుచున్న
నన్నుఁ గొనుమని పలికెనా • వెన్నుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

శా. సత్యశ్రీయదుశైలనాథకథిత • స్వప్నార్థసంభావితా
ప్రీత్యత్యద్భుత భావికార్యకలనా • భృత్య ప్రియాపావనా
సత్యజ్ఞానసుఖస్వరూప నృహరీ • స్వామిత్వసంస్థాపనా
నిత్యజ్ఞానఘనా నిరస్తకుహనా • నిష్కామ రామానుజా. 87

క. రామప్రియపరితోషక, భీమభటరథేభతురగ • భీకరసేనా
భూమఘువనేశపరివృత, రామానుజ యోగిరాజ • రాజ మహాత్మా. 88

మాలినీవృత్తము. సరసలసదపాంగా • సత్త్వయుక్తాంతరంగా
పరిమితమృదుభాషా • పాపపాథోధిశోషా
విరచితహరికార్యా • వేదవిత్పద్మసూర్యా
గురుజలవిధిచంద్రా • గుప్తమంత్రా యతీంద్రా.

గద్యము. ఇది శ్రీభగవద్రామానుజ కరుణాకటాక్షకలిత కవితావైభవ పరవాది భయంకరాచార్యాభిమతచ్ఛాత్రాపస్తంబసూత్ర కణ్వసగోత్ర పవిత్రోభయకవిమిత్ర వేంకటకృష్ణార్యపుత్ర విబుధవైష్ణవవిధేయ కేశవనామధేయప్రణీతంబైన యాచార్యసూక్తిముక్తావళి యను మహాప్రబంధంబునందు మధ్యమభాగంబున స్వప్న దర్శనంబును ఢిల్లీప్రయాణారంభంబును నిత్యసైన్య సమాగమనంబును జతురంగ బలాన్వితుండై యతీంద్రుండు ఢిల్లీపురంబునకుఁ దరలి విచ్చేయుటయు నప్పురిఁ జెంది ముట్టడించి యమునాతీరంబున స్వసైనికులతో వసియించుటయుఁ జారులు చెప్ప నా వృత్తాంతంబు రా జెఱుంగుటయు రాజప్రేరితులయిన గూఢచారులం బట్టి దండనాధుండు యతిభూపతికిఁ జూపుటయు లక్ష్మణయోగీంద్రుండు స్వసైన్యంబులం జూపి వారిని వెడలంబంపు మనుటయు రాజు తనచేతం బ్రేషితులయిన గూఢచారులవలన సంయమీంద్రుని సైన్యప్రాభవం బెఱింగి మహోన్నత ప్రాసాదం బెక్కి నిరీక్షించుటయు నారాజున కాచారులు యతీంద్రుని సేనావైభవం బెఱింగించుటయు ఢిల్లీశ్వరుండు ప్రాసాదంబు దిగి వచ్చి యాస్థానమంటపంబుఁ జెందుటయు, నతండు తన సభాసదులతో మంత్రం బొనర్చుటయు వజీరులు మొదలయిన సభ్యులు శూరాలాపంబులఁ బలుకుటయుఁ గఫీసు మొదలయిన నయజ్ఞుల నీతివాదంబులును రా జాప్తమంత్రుల నిరువురం బంచి యతిస్వామి వృత్తాంతం బంతయు నెఱుంగుటయు ఢిల్లీశ్వరుండు తగిన వజీరులతో యతీంద్రు నెదుర్కొని సత్కరించి తన గృహంబునకుఁ దోడ్కొని చనుటయు న మ్మహీశుండు తన గృహంబున యతీంద్రు నర్చించి మీ యభీష్టవిగ్రహంబుఁ గైకొమ్మని విన్నవించుటయు నగ్గురువరుండు చెఱసాలయందు రామప్రియుండు గనంబడ కున్న నిజపరివారంబుతోఁ దన శిబిరంబుఁ జెందుటయు గురుం డారాత్రి స్వప్నంబునఁ గనంబడు హరిసూక్తిచే రామప్రియుం డున్నతా వెఱుంగుటయు నన్నది నవమోల్లాసము.

— 0 —

శ్రీమతే రామానుజాయ నమః



# ఆ చా ర్య సూ క్తి ము క్తా వ ళి

## మ ధ్య మ భా గ ము

---

### ద శ మో ల్లా స ము

క. యమునాకృతావగాహన, యమలచ్చిద్రోర్ధ్వపుండ్ర • యలినీలశిఖా
విమలోపవీత యతివర, కమనీయతర త్రిదండ•కాషాయధరా. 1

వ. అవధరింపుము. 2

సీ. అట్లు స్వప్నముగాంచి•యల్లనమేల్కాంచి, హరిసూక్తిఁదలఁచుచు•యమున కరిగి
నీరాడి కాల్యముల్•నెఱవేర్చి రాజును, గనుఁగొని పల్కె నీ•గతి యతీంద్రుఁ
డస్మదీప్సితవిగ్ర•హము యుష్మదంతఃపు•రమునందె యున్నది • రాజరాజ
దాని మా కియ్యంగఁ • దగు నన్న విని వేగ, చని తన యవరోధ•సదన మరసి

తే. ప్రాణపదమైన తనముద్దు•పట్టి హంస•తూలికాతల్పమునను ద•త్కేళి కైన
ప్రతిమనీక్షించి రా జిట్లు•పలికె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. మాయమ్మ యీబొమ్మ•మన కుంప రా దమ్మ, హిందూలబొమ్మ నీ•కెందు కమ్మ
మానికంబులచేత • మనయమాములమంచి•బొమ్మలఁ దీర్పించి • పొనఁగ నిత్తుఁ
జదలమానికమట్లు • చందమామను జేసి, యమర నిప్పించెద • నాతుకొమ్మ
కారానిబొమ్మతోఁ • బోరామి నీ కింత, గారాదు నామాట • గారవింపు

తే. మమ్మరో నీవు వేఁడిన•సొమ్ము లిత్తు, బొమ్మ ని మ్మని సుల్తాను • బుజ్జగించి
ప్రాణపద మైన సుతకిట్లు • పలికె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. పడుకఅవింతలు • బైల్పడ నెలకొల్పు, కల్యాణమయదీప•కళిక యనఁగ
ననిశముఁ దనకోర్కు•లన్నియు సమకూర్పు, వచ్చి తోఁచినకల్ప•వల్లి యనఁగ
ధార్మికుం డని తల్చి • తనయింటఁ గనఁబడు•నక్షీణసామ్రాజ్య•లక్ష్మి యనఁగఁ
దనయింట నెప్పుడుఁ • దనయగాఁ జూపట్టు, స్వవిరాజదుత్సాహ • శక్తి యనఁగ

తే. మదిఁ దలంపఁగఁ దగునక్కు•మారిఁ జూచి, బొమ్మ నిమ్మని సుల్తాను•బుజ్జగించి
మధురసూక్తుల నడిగె•నీమాడ్కి ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. పూర్ణచంద్రునిఁబోలు•ముఖపద్మమున దర,స్మిత మమృతపుజాలు • చెలువుగులుక
మంతనంబునఁ దన•మగని సొంపుఁ దలంచి, మాటిమాటికిఁ దన,మది సుఖింప
రతిరహస్యము లన్ని • రామప్రియునికడఁ, జదివినప్రౌఢిమ • సందడింప
సిగ్గు నిగ్గులఁ దేర • శృంగార మలరంగఁ, దనసెజ్జపజ్జఁ జే•తనపుఁబసిఁడి

తే. బొమ్మగతి నిల్చి యాముద్దు•గుమ్మ కేలుఁ,దమ్మి నొసటను గీలించి,తండ్రి కిట్లు
భక్తితో నొక్కమఱుమాట•పలికె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. సర్వజ్ఞ యీబొమ్మ•సాటిబొమ్మలు లేవు, గాన నీబొమ్మపైఁ • గాంక్ష పొడమె
నేబొమ్మ లేమిటి • కీబొమ్మ నాకడ, నుండనిచ్చిన సుఖ • ముండె దేను
బలుమాయ నేఁ బల్కఁ • బాడిగా దీప్రాణ,పదమైన ప్రతిమ పే • వదలఁ జాల
నని పుత్రి మ్రొక్కిడ•నందు కొడఁబడి, వాత్సల్యవివశుఁ డై • వచ్చి తనదు

తే. సఘను మింట నభోమణి • సరణి నొప్పు
సంయమీంద్రుని పొడగాంచి • చతురమధుర
పటువచోక్తుల రా జిట్లు • పలికె ననుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 7

సీ. యతిరాజ మీ విగ్ర•హంబు మాయంతఃపు,రమున నున్నది యది•రాదు మీకు
నతఁడు మీదైవత • మాయెనా మీర లి,చ్చటనుండి పిలిచిన • జరగి వచ్చి
మీకడ నిల్చెనా • మీరు గైకొనుఁ డని, రా జన నాయతి•రాజు పలికె
క్షోణీశ యతఁ డున్న•చోటికి మేము రాఁ,దగునేని వచ్చి మా•దైవత మగు

తే. నతనిరావించుకొనిపోదు•మనినన్నృపతి, యతివరేణ్యునిఁదనదు శు•ద్ధాంతమునకుఁ
దొడుక చనియెను బరమసం•తుష్టి ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఆరాజుతోఁ గూడి•యంతఃపురముఁ జొచ్చి, యందుసుందరమణి•మందిరమున
వెండిగుబ్బలిమీఁద • విద్యుల్లతను గూడు, నీలజీమూతముఁ • బోలువాని
శేషతల్పమున లం•క్ష్మిలోలుఁ డై యొప్పు, భగవంతుఁ డని నమ్మఁ • దగినవాని
ధవళతరచ్ఛాయ•నవహంసతూలికా,శయ్యపై దేవితో • నెయ్య మొప్ప

తే. నున్నరామప్రియునిజూచి•యుత్సహించి, యతనిపదుకలు మొగసాల•యందయుండి
పిలిచె నిట్లని యతిరాజు•ప్రీతి ననుచు, వాదిభీకరగురుఁ డనె• మోదమలర.

సీ. నష్టసేవధి తన • నయనగోచర మైన, సంతసించెడు ధన•స్వామిపగిది
దేశాంతరమునందుఁ•జిరముగా వసియించు, తనపుత్రుఁ గనుగొన్న•తండ్రికరణి
నమృతముఁ గన్నజు•ధార్తునికై వడిఁ, జంద్రునిఁ బొడగన్న•జలధిమాడ్కి
రామప్రియునిఁ జూచి•ప్రేమతోనుప్పొంగి, నిన్నుఁగన్నులఁగంటి•మన్న నేఁడు
తే. నిన్ను నెడఁబాసియదుగిరి•చిన్నఁబోయి, యున్న దది గాన రమ్మన•న్గన్నతండ్రి
యనుచుయతిరాజుమఱియు ని•ట్లనియెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. భానుబింబము లేని•పగటిచందంబున, రేఱేని నెడఁబాయు•రేయిపగిది
భవదీయపురి నిన్నుఁ • బాసి జొత్తిల్లదు, రామభూపతి లేని • రాష్ట్రమట్లు
కల నీవు గనిపించి • పలికినపలుకులు, కల్లగా వాయెనా • యుల్ల మలర
రమ్ము రామప్రియ • నెమ్మి నామాటఁ గై•కొమ్మి యీపెన్నత•నమ్ము మాని
తే. లక్షణాఢ్యను యదుగిరి•లక్ష్మినిచ్చి, పెండ్లిచేసెద నీ వింకఁ ( బెద్దతనము
దెచ్చుకొమ్మని గురుఁడు వా•క్రుచ్చె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. జన్మాంతరమునందు • నైదోఁ డితండు మా. కీయర్చయం దిప్పు•డెనపి చూడ
శ్వశురుండు సన్మంత్రి•శాలికుం డార్యుఁ డీ.పంతు పిల్చినఁ బోక•యుండ రాదు
మంతనంబున నన్ను • మరుకేళికలఁ దేల్చు, నీమోహనాంగి నే • నెట్లు విడిచి
చనియెద నిది రథ•సంధి సంధిలెఁ గదా, యని తనమనమున • మనన మొంది
తే. పరమధర్మముగురుపద•భక్తియనుచు, మదిని నిశ్చయమొంది రా•మప్రియుండు
తాను యతిరాజుకడ కేఁగఁ•దలఁచె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. తల్పమధ్యమునుండి • ధరణిపై కుఱికిన, ముజ్జగంబులు తన•బొజ్జఁ గదల
మణినూపురంబులా•మ్నాయము ల్మొరయంగ, గంటలమొలనూలు • గల్లుమనఁగఁ
గుండలంబులకాంతి • మండలం బొకపొడ్డ, మండనంబై యిల్లు • నిండి మెఱయ
మొల్కనవ్వులచిన్ని•మోముముద్దులుగుల్క, దనరత్నమకుటము•తళుకులొత్తఁ
తే. బంచవార్షికబాలుని•పగిది వచ్చి, యతిశిఖామణికుడితొడ • నధివసింపఁ
జూచి యక్కజపడె రాజ•సోముఁడనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. అంత రామప్రియుఁ • నాహ్లాదమయుఁ జూచి, యొప్పుగాఁ గౌఁగిట•నప్పళించి
శిరము మూర్కొని చిన్ని•చెక్కిళ్ళ దువ్వుచుఁ, బెన్నిధిఁ గన్నట్టి•పేదపగిది
యతిపతి హర్షింప • నప్పుడు యతిరాజ, సంపత్కుమారుఁ డీ•స్వామియనుచుఁ
దిరునామ మొక్కటి • దేశికేంద్రు లొనర్ప, నదిసుత యిప్పటి • కైన నతని

తే. కదియె తిరునామ మయ్యె న॰ ద్యుతివరేణ్యుఁ
డతని వీడ్కొని తనబస ॰ కరిగి యందుఁ
జింత దిగనాడి సౌఖ్యముఁ ॰ జెందె ననుచు
వాదిభీకరగురుఁ డనె ॰ మోద మలర.

సీ. సకలగుణాధారు ॰ సమ్మోహనాకారు, సంపత్కుమారు నం॰దద్విహారుఁ
బ్రాణాధికప్రియుఁ ॰ బతి నెడఁబాసి కం,దర్పునిబాణవే॰దనలఁ జెంది
క్షణమొక్కయుగముగా॰జరుపుచుఁ బటముపైఁ, బ్రాణేశుబ్రాసిత॰త్పాదపద్మ
ముఁకు నర్చించి త॰న్మూర్తి కన్గవత్రోవ, భావ మొందించి కె॰మ్మోవి యాని

తే. యతనికౌఁగిలిఁ జెందిన॰యట్లు కొంత,తడవు చింతించి విరహాగ్ని॰తాపమడఁచు
నంగనామణి యమ్మోహ॰నాంగియనుచు, వాదిభీకరగురుఁ డనె ॰ మోద మలర.

సీ. రాత్రి చెల్వప్పిళ్ళ॰రాయఁ డేతెంచెనా, యమునకు జాతర ॰ లాచరింతు
సంపత్కుమారుతోఁ ॰ సల్లాప మబ్బెనా, వేంకటేశుని కూర॰విందు చేతు
రామప్రియునితోడ ॰ రతికేళి గల్గెనా, పాండురంగని కుత్స॰వం బొనర్తు
మగిడి నామగనితో ॰ మదనోత్సవము లన్ని, సమకూడెనా దేవ॰సమితిఁగొల్తు

తే నని తలంచుచు నెమ్మది ॰ నతనుబాణ,వేదనల కోర్వఁజాలక ॰ ఖేద మొందు
నంగనామణి యమ్మోహ॰నాంగియనుచు, వాదిభీకరగురుఁ డనె ॰ మోద మలర.

సీ. అమ్మ నీనెమ్మొగ ॰ మల రారు చుండు ము, న్నకలంకపూర్ణసు॰ధాంశునట్లు
నీహారవృత మైన॰నె త్తమ్మిచాడ్పున, ముఖమారుతావృత॰ముకురమట్లు
పొలుపార దిప్పుడు॰లలిత హూకెమ్మోవి, వేఁడియూర్పుల సోఁకి॰వాడి యుండెఁ
గేతకీదళముపైఁ ॰ గిసలయంబుకొలందిఁ, జెక్కుటఁ జేఁ జేర్చి ॰ చింతపడఁగఁ

తే. గారణంబేమొ చెప్పుమీ॰కమలనేత్ర, యని మృదూక్తుల నమ్మోహ॰నాంగి కిట్లు
ప్రాణప్రద మైనయొకచెలి ॰ పల్కెననుచు, వాదిభీకరగురుఁ డనె ॰ మోదమలర.

సీ. చెలియపల్కులు విని ॰ చింతించి యించుక, తడవున కిట్లని ॰ తరుణి పల్కెఁ
జిన్నరహస్యముఁ ॰ జెప్పెద చెలి యది, బైల్పుచ్చఁదగదు నా॰ప్రాణ మాన
చెఱసాలనుండి సుం॰దరతర హరివిగ్ర,హంబు నేఁ దెచ్చి శ॰య్యాలయమున
మణిమయాసనముపై॰మహనీయశయ్యపైఁ, దూఁగుటుయ్యేలలపై॰రాగమొప్ప

తే. నుంచి దివ్యాంబరములఁ గ॰ట్టించి మంచి,పూలదండలు నవరత్న॰భూషణంబు
లంచితంబుగ నర్పింతు ॰ ననియె ననుచు, వాదిభీకరగురుఁ డనె ॰ మోదమలర.

సీ. క్రీడింప ని ల్లోకనాఁడు రాతిరి నీల, మేఘంపుఁజాయలఁ మేనివాఁడు
మస్తకంబునరత్న, మకుటంబుగలవాఁడు. మొలకనవ్వుఁ ముద్దు, మోమువాఁడు
కరుణారసముఁ జిల్కు, కనుదోయి గలవాఁడు, కరధృతశంఖచ, క్రములవాఁడు
మకరకుండలహార, మంజీరములవాఁడు, బంగారుచాయల, పటమువాఁడు

తే. భువనసమ్మోహనాకార, పురుషుఁడొకఁడు. గానఁబడియెను నాకన్నుఁ గవకునెదుట
నని చెలికిఁ జెప్పెనమ్మోహ, నాంగి యనుచు. వాదిభీకరగురుఁ డనె, మోదమలర.

సీ. రుచిరదరస్మిత, భ్రూవిలాసకటాక్ష. మధురోక్తులను నన్ను, మంచితనము
చేసి మన్మథకేళి, కాసించి యధరామృ, తం బాని పరిరంభ, ణం బొనర్చి
నన్నుఁ గౌఁగిటఁ జేర్చి, నామానధన మెల్లఁ, జూఱఁబుచ్చినలోక, సుందరుండు
గురుఁడు పిల్చిన నన్ను, విరహానలముపాలు, చేసిపోయెనిఁ కేమి, సేతునకట

తే. మగువ మగవారినమ్మంగఁ, దగునె వారి, మాట లన్నియు వడగండ్ల, మూటలరయ
నని చెలికిఁ జెప్పె నమ్మోహ, నాంగి యనుచు, వాదిభీకరగురుఁ డనె, మోదమలర.

సీ. ఈసాధ్విదురవస్థ, నేమి చూచెద నని, యరిగెనో యన సూర్యుఁ, డస్తమించె
నంత సంధ్య చెలంగె, నపరదిగంగ నా, భరణనానామణి, ప్రభ యనంగఁ
దనవైరిగ్రుంకిన, ధ్వాంత మల్లన దోఁచె, జారకామినులు త, స్కరులు మెచ్చ
విరహిణులను గామ, వేదనపా ల్సేయ, రాత్రి వర్తిలెఁ గాళ, రాత్రి యనఁగ

తే. నంత నమ్మోహనాంగి యే, కాంతమునను, గంతుకరముక్తనిశిత లఁ, తాంతబాణ
బాధఁ జెందుచుఁ జెలి కిట్లు, పల్కెననుచు, వాదిభీకరగురుఁ డనె, మోదమలర.

సీ సఖి నన్ను నాతండ్రి, సంపత్కుమారునిఁ, దక్క నన్యుల కియ్యఁ, దలఁచె నేని
నాప్రాణనాథుని, నామ మేఁ దలఁచుచుఁ, దపమొంది విరహోగ్ర, దహనశిఖల
దేహ మాహుతిఁ జేసి, దేహాంతరముఁజెంది, తాపము లన్నియు, ధరణివిడిచి
జీవితేశునిఁ జెంది, శ్రీపదాబ్జములకు, నర్చసేయుచు సుఖ, మనుభవింతు

తే. నిక్క మీమాట నీయాన, నీరజాక్షి, యని చెలికిఁ దెల్పి యమ్మోహ, నాంగి మదన
బాణసంహతి సంతాప, పడియె ననుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర.

సీ. సరసపద్మదళంబు, లురముపైఁ బఱపిన, వాడుఁ జన్గవకొన, వేఁడి సోఁకి
మహదుష్ణనిశ్శ్వాస, మారుతపంక్తిచే, ఘనహారవల్లికల్, కందువాఱుఁ
గలితనీలోత్పల, కర్ణపూరంబులు, బాష్పధారల నార్ద్ర, భావ మొందు
పరసరంభాదళాం, చత్తాళవృంతాని, లము దోఁచు గ్రీష్మాని, లంబుపగిది

తే. మదనుఁ డాతీర్థపాదుఁడై • మండలీకృ,తేక్షుచాపంబు చేఁబూని•యింతిపైసి
దెప్పరపుఁబూవుఁదూపుల • గుప్పె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. సతి ప్రతిపద్గత•చంద్రరేఖయుఁబోలె, స్థితకళామాత్రావ•శిష్ట యగుచు
స్మరశరానలహా•సంతప్తహృదయ యై, గురుశీతశైవల•గుచ్ఛతతుల
సితబిసకిసలయ•చ్ఛేదమాలికలచే, సరసచందనపంక•చర్చికలను
హిమజలసేవచే • హిమవాలుకామయ, ధూళిపాళీసము•ద్ధూళనములఁ

తే. చంద్రకాంతశిలాతల•శయనములను, గాంతరంభార్ద్రదళతాళ•వృంతములను
గడపె నారాత్రి కొండొక•కాల మనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. సౌధాగ్రవిలసిత•చంద్రశాల సఖీజ,నావృత యై యుండి • యాలతాంగి
నిండుచంద్రునిఁ జూచి • నెచ్చెలి కీరీతిఁ, జంద్రోపలంభోక్తి•శతము నుడివెఁ
బాలవెల్లిని దొల్లి• హాలాహలము లెం, డపిరసితజ్వాల • లై జనించెఁ
గబళించె హరుఁడాద్య•గరళ మన్యవిషంబు, వేల్పులెందఱుఁదిన్న•వృద్ధిఁజెందుఁ

తే. గాన నిర్మల మైనది • గాదు పుడమి, నెట్టిపాపముఁ జేసిరో•యింతి పాంథు
లనుచువాక్రుచ్చె నమ్మోహ•నాంగి యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. విరహిణీమారణా•విర్భూతదురితపం, కకళంకుఁ డౌమహో•కలుషి వీఁడె
హాలాహలప్రవ•యానలంబునకు సై,దోడుగాఁ బుట్టుమా•తుకుఁడు వీఁడె
చండభాస్కరకర•జ్వాలావళులతోడఁ, గూడిన దుర్నిరీ•క్ష్యుండు వీఁడె
బడబానలము తాను • బాధోధిసరిపొత్తు, సలుపుచుండెడు పాప•జాతి వీఁడె

తే. రాహుదంష్ట్రాగ్రవిషమయ•దేహి వీఁడె, యత్రిపిత్రువనికొలువి ద•య్యంబు వీఁడె
యని చెలికిఁబల్కె నమ్మోహ•నాంగి యనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. జలధిలో మున వీఁడు • జనియించువేళ మం,దరగిరి వడి వీనిఁ • దాఁకె నేని
గ్రహణకాలమున స్వ•ర్భానుండు కబళించి, తృప్తుఁ డై గ్రద్దన • ద్రేఁపెనేని
శర్వుండు చేతివి•షముఁ దిని వీనిని, నాలుక రుచిఁ జెంద • నమలె నేని
యసితపక్షం బను•నపమృత్యు వైన సీ.పాపకర్ముని రూపు•మాపె నేని

తే. కుంభభవుఁ డబ్ధితోఁద్రావి • కూడవీని, విడువఁడే నింత పొసఁగునే•విరహిజనుల
కికట విధి యరి యని దేవి•యనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. చెలులార యొకమాటఁ • జెప్పెద వినరమ్మ, వెన్నెలబయలికి • వేగ యొక్క
మించుటద్దముఁ దెచ్చి • యుంచుఁడీ చంద్రుండు, చోరుఁడాయద్దముఁ•జొచ్చినంత

వంచన సేయక • పొం చుండి చిక్కని, కోలచే వ్రేయుఁడీ • గుఱు తడంగ
మణిపంజరములలో • మన ముంచి పెంచిన, రమ్యకేకీచకో•ర వ్రజంబు

తే. విడువుఁడీవీనివెన్నెల•వేగ క్రోలుఁ, గుంభభవుఁ డబ్ధి నొక్క గ్రుక్క•గ్రోలుకోలఁది
ననుచు వా క్రుచ్చె నమ్మోహ•నాంగియనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. మనకర్ణపూరత•మాలపల్లవములు, చంద్రునిలో మృగ•శాబమునకు
మేపుద మమ్మ యా•మృగము దా వర్ధిల్లి, మండలం బంతయు • నిండిమాపు
విరహిణీహత్యకు • వెఱవనిపాతకి, ద్విజరాజటే వీఁడు • తెలిసి చూడ
రాహువక్త్రగుహాంత•రాళాంధతమములోఁ, దిరిగెడు మొఱఁగుడుఁ•బురుగు వీఁడు

తే. వీని కేటికి మన మింత • వెఱవవలయు, నని మనోజశరవ్యధ • నాలతాంగి
మగిడి చంద్రునిఁ బల్కెనీ•మాడ్కి ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. కలశాబ్ధి నీజన్మ•కారణ మమృతము, కౌస్తుభమణి లక్ష్మి•కల్పతరువు
కామధేనువు శ్వేత•గజరాజ ముచ్చైశ్శ్ర•వంబు తోఁబుట్టువుల్•వరుస నీకు
హైమవతీభర్త • కవతంస మీ విట్టి, విభవయుక్తుఁడ వయ్యు • విరహిజనుల
వలరాజుతోఁగూడి • చలపట్టి బాధింప, ధర్మువు గాదు సు•ధామయూఖ

తే. యని శశిని దూఱి యమ్మోహ•నాంగి మింట
దూరగతుఁ డైనచంద్రుని•దూఱఁ గూడ
దనుచు హృద్గతు స్మరుఁ దూల•నాడె ననుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 30

సీ. మన్మథ విరహిణీ • మారణదోషంబు, హరుని క్రోధాగ్నిగాఁ • బరిణమించి
నిన్ను భస్మముఁ జేసె • నీ వంతటనె పోక, క్రూరగ్రహంబవై • గుండెగాల
మైతివి విరహుల • కక్కటా హరి సిరి, యేమహాస్త్రమున ని • న్నిట్లు గనిరొ
బ్రహ్మయు నీ విట్టి•పాతకి వని యెంచి, కుసుమబాణములఁ జే•కూర్చె నీకు

తే నవియుఁ జాల నొసంగక • యైదె యిచ్చె, నంతకెఱగమ్ము లిట్టట్టు•లై తపించు
నని మరునిదూఱె నమ్మోహ•నాంగియనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. త్రిభువనమోహనో•దితపాతకంబుచే నతనుమహాభూత • మైతి వీవు
విరహమలీమస•దురవస్థ గలవారిఁ, గాని పూనవు కలి•కలుష మీవ
సతి యగురతిదేవి • సౌభాగ్యమహిమచేఁ, బలుమఱుఁ జచ్చియు • బ్రతికి తీవ
యెల్లజగంబుల•నేఁచితి చాలదా, మరణ మొందియుఁ బుష్ప•శర దురాత్మ

తే. ఘోరనారాచముల నీక • కుసుమశరము
లిచ్చె బ్రహ్మయు నీక్రౌర్య • మెఱిఁగి యంత
కింత చేసితి వనియె న•క్కాంత యనుచు
వాదిభీకరగురుఁ డనె • మోదమలర. 32

సీ. ఆనందమయు లైన•యాదిదంపతుల నె•మ్మదిలో జనించిన • మహిమ గల్గి
యిట్టి దుష్కృత్యము • లేల చేసెద విది, ధర్మవు గాదు కం•దర్ప నీకు
మది నెడఁబాయఁడ•స్మత్స్వామిసంపత్కు•మారుఁడు మార యా•కారణమున
నీ ప్రయత్నము లెల్ల • నిష్ఫలంబులు గాని, నెఱవేఱ విచ్చోట • నిజము మదన

తే. యనుచుఁ గామోపలంభో క్తు•లాడికంటఁ, గూఁకకేమియుఁగానక • తాఱి సురభి
పుష్పదామాద్యలంకార•పూర్తి యుడిగి, హరిహరీయనివగచె నా•తరుణియనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఈపూర్ణచంద్రిక • లీవసంతారామ, మీరత్నవేదిక • లీవిచిత్ర
రమ్యపంజరగత•రాజకీరశుకాది, మధురభాషణము లీ•మణివిమాన
చంద్రశాలానర్ఘ్య•శయ్యాసనాదు లీ•క్రీడాద్రు లీవల్ల•కీరవములు
రమణఁ జెల్వొప్పిళ్ళ•రాయఁ డేతెంచి న్•గూడెనా యివి సుఖ•క్రీడ కగును

తే. తెలియ రాఁడాయె విభుఁ డేమి • సేయుదునని, కలితకలకంఠకాకలీ•కలరవంపు
సొంపు పెంపార నేడ్చెనా•సుదతి యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. అదె శంఖ మదెచక్ర • మని మిన్నుఁజూపున•ట్లదె విభుఁడేతెంచె•ననుచు లేచుఁ
జెక్కిటఁ జేదమ్మిఁ • జేర్చి చింతించును, మ్రొక్కును సొక్కు ను•లిక్కిపడును
జెలువుఁడా ర మ్మని•చీరును బ్రేమతోఁ, గటకటా విధి యెంత•కఠినుఁ డనును
బతిరూపు మదిఁ జూచి • పకపక నగు నది, గనరాకపోయినఁ•గరము వగచుఁ

తే. జంద్రకాంతవితర్దిపై • శయన మొందు, మగిడి లేచి చరించు ను•న్మత్తపగిది
నంగనారత్న మమ్మోహ•నాంగి యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అంతట నిజకేళి•కారామసరసర, సాలపల్లవసమా•స్వాదమత్త
కోకిల లన్ని యా•గుబ్బుగాఁ బడి కుహూ, యని పంచమముఁ బల్క • నాలకించి
యుల్లంబు జల్లన • నొల్లఁబో నప్పల్ల•వాధర మూర్ఛిల్ల • నాళి యొకతె
చల్లెను గొజ్జెంగ•జల మొకయలివేణి, చందనం బలఁదెఁ గు•చంబులందుఁ

తే. దాళవృతఁబుచేఁ ద్రిప్పెఁ • దరుణి యొకతె
య ప్రిశితలములఁ బుప్పొడి • యద్దె నొకతె
సాధ్వికి ట్లుపచారముల్ • సలిపి రనుచు
వాదిభీకరగురుఁ డనె•మోదమలర. 36

సీ. పద్మాక్షి కన్నీరు • పన్నీటఁ దుడువుము, కదళీదళంబుచేఁ • గాంత వీవు
కనకవల్లి రచింపు • కర్పూరతిలకము, మందయాన యలందు • చందనంబు
వలిపెంపుఁజెంగావి • చలువగట్టు శుభాంగి, యురమున బిసహార • ముంచుసుమతి,
కల్యాణి మేను చెం•గల్వతేకుల నొత్తు, కమ్మనిపూఁదేనె • కలికి చిలుకు

తే. మొత్తు మఱచేతులను నాఁచు•గుత్తు లర్వి
హంసి వెల్లిదమ్మిపుప్పొళ్ళ • నంఘ్రితలము
లొత్తు మని పల్కి రాళు ల•న్యోన్య మనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. సహచరీజను లిట్లు • సంభ్రమోక్తులఁ బల్క, నక్కలకలరవ • మాలకించి
రమ్యకన్యాంతఃపు•రమునఁ గోలాహల, మే మని తలిదండ్రు • లిరువు రడుగ
నాప్తసఖీజన • మక్కన్యయభిమత, మెటిఁగింపఁ దెలిసి ధా•త్రీశ్వరుండు
తనదేవితో వచ్చి • కనుఁగొని తనముద్దు,పట్టి కి ట్లొకమాటఁ • బలికెఁ బ్రీతి

తే. నమ్మ హిందూలదైవత • మైనబొమ్మ, వారు చేకొనిపోయిన • వగవ నేల
ననినఁ గన్నియ తండ్రి కి•ట్లనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. క్షితిని బ్రత్యక్షదై•వతములు తలిదండ్రు, లట్టిమీహితవాక్య • మమృతసదృశ
మైనను నాచిత్త • మాబొమ్మపై మర్లు,కొన్నది తిరుగ దిం • కెన్నఁటికిని
నావిగ్రహాకార • మైనవాఁ డరయంగ, నారాయణుఁడె కాని • నరుఁడుగాఁడు
నాప్రాణప్రద మైన,నాథుఁ డాతఁడె మహా,త్మా న న్నతని కీయఁ • దలఁప వేని

తే. దక్షకన్యక యోగాగ్ని • దాహ మొంది, హరునిఁ జెందినగతినేను•హరినిజెందు
దాన నని పల్కె నక్కన్య•తండ్రి కనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అట్టి గారాబంపుఁ • బట్టిపల్కులు విని, హర్షచింతాన్వితుం • డై నృపుండు
సామి నీయిష్టము • సమకూర్చునని కూఁతు, నుచితమృదూక్తుల • నూఱడించి
చని తనమేడలో • శరదిందుచంద్రికో,జ్జ్వల హంసతూలికా•శయ్యయందు
శయనించి నిద్రింప • సంపత్కుమారుండు, కలలోనఁ గనిపించి • పలికె నిట్లు

తే పద్మ సీపుత్రి హరి యేను • బాలికవలి
ఏపు గాపున నీసుత • నిమ్ము మాకు
సంధించుము మాసు మని పల్కె • శార్ఙ్గి యనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ సిరిసుఁ తాయతిరాజ•సంపత్కుమారుఁడా. యతిసార్వభౌమున • కనియె నిట్లు
తెల్లవాఱిన సేఁగి • ఢిల్లీశు నడిగి నా. యిల్లాలిఁ దోడ్కొ ర•మ్ముల్ల మలర
దాని నేఁ బాసి యు•ర్ధక్షణం బైనను. సౌఖ్య మొందనుజామీ•సంయమీంద్ర
కాన న న్నద్దేవి•కడ కైనఁ బంపు నీ.కోడలి నిట కైనఁ • దోడితెమ్ము

తే. రెంటిలో నొక్కపని సేయ • కుంటి వేని
తపసి నై యుందు యాముస • తటమునందు
సత్య మని పల్కె గురున కా•స్వామి యనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర

సీ. ఈహరిప్రియ నెంతొ•యేఁచితి నని శశి. వెఱచినట్లు పరాద్రి•మఱుఁగుఁజొచ్చెఁ
బ్రియునిదుర్దశఁ జూచి • భీతిఁ జెందినగతిఁ. గలువలు తారలు • తెలివిఁదొలఁగెఁ
బద్మినికై రవి • పంచినదూతియో. యన నొప్పెఁ దూర్పున • నరుణకాంతి
త్వర మోహనాంగి చె•ల్వప్పిళ్ళరాయనిఁ. బ్రీతిఁగూర్చెదుపరం•జ్యోతియనఁగఁ

తే. బొడమె నుదయాద్రి నాప్నాయ•మూర్తి యంత
మోహనాంగియు నల్లన • మూర్ఛఁ దెలిసి
పతిపరాయణ యై యుండె • భక్తిననుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 42

సీ. అంత ఢిల్లీశ్వరుం • డల్లన మేల్కాంచి. యర్హకృత్యంబుల • నాచరించి
సంయమీంద్రునిదాయఁ•జనఁదలంచినయంత. యతిరాజు మేల్కాంచి•యమునకరిగి
కాల్యకృత్యము లన్ని • గావించి వేగ చె•ల్వప్పిళ్లరాయని•వాంఛితంబు
సమకూర్పఁ దలఁచి యా•క్ష్మాపాలుకడ కేఁగఁ. జూచి ప్రత్యుత్థాన•మాచరించి

తే. ప్రణతిఁ గావించి యర్చించి • భక్తిఁ దనదు
రత్నమయ మైనయంతఃపు•రమున కధిపుఁ
డమ్మహాత్మునిఁ దోడ్కొని • యరిగె ననుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 43

సీ. స్ఫటికంపుగోడలు • పగడంపుసోపాన,ములు వజ్రకుట్టిమ,భూతలములు
చారుగారుత్మత • స్తంభగుంభితమణి,మంటపవేదికా•మందిరములు
లంబమానేంద్రనీ•ల వ్రాతమౌక్తిక, జాలకీలితము లౌ•మేలుకట్లు
రత్నపంజరగత•రామనామామృతాస్వాద తల్పర•కీర•శారికలును

తే. రత్నశింజానమంజీర•రమణిసలము, నలరుచున్నట్టి నమ్మహా•నాగగృహముఁ
జొచ్చె సుత్రానుతో యతి•సూర్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. అంత యతీంద్రుఁ డ•య్యవనీశుఁ దర్పించు,హాటకరత్నమే•త్రాసనమునఁ
గూర్చుండినంత న•గ్గురునకుఁ గేల్మోడ్చి, యారాజు తనస్వప్న • మంతఁ దెలుప
నమ్మహాత్ముఁడు విని • హర్షించి కొనియాడి. యప్పార్థివేంద్రున • కనియె నిట్లు
పాలవెల్లికి హరి,పగిదిఁ జెల్వపిళ్ల,రాయఁడు నీ కల్లుఁ • డాయె నింకఁ

తే. బరమకల్యాణి నీముద్దు•పట్టి నతని
కిమ్ము విఘ్నమ్ము లన్ని పోఁ•జిమ్ము పెద్ద
యశముఁ గొమ్మని పల్కె న•య్యార్యుఁ డనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 55

సీ. రాజేంద్రుఁ డాయతి•రాజుసూక్తుల విని, హర్ష మొంది తలంచె • నాత్మ నిట్లు
అల్లుఁడు బొమ్మ వి•య్యంకుఁడు బాఁపన,సన్న్యాసి యీపెండ్లి • సలుపుటెట్లు
చుట్టంబు లీపనిఁ • జూచి యే మందురు, తల్లియుల్లము నుల్ల•సిల్లు టెట్లు
వచ్చి యిచ్చుటకిఁ జె•ల్వపిళ్లరాయఁడు, గనిపించి కన్నియ•కరముఁ బూని

తే. పెండ్లియాడిన మా కతి•ప్రీతి యగును, నీశుసంకల్ప మెట్టిదో•యెఱుకపడద
యని తలంచుచునుండె న•య్యధిపుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. సర్వజ్ఞుఁ డాయతి•చంద్రుఁ డారాజున, కానందియముఁ బాప • నాత్మఁ దలఁచి
యక్రూరునకుఁ దొల్లి•హరిమాడ్కి స్వస్వరూ,పముఁ జూపఁ జూచె న•ప్పార్థివుండు
వేయిమస్తకముల • వెలయుఫణికముల, బెళుకుల దెసలెల్లఁ • దళుకు లొత్త
మకరకుండలహార•మకుటాంగదోర్మి నీ,లాంబరకాంచీగు,ణాద్యశేష

తే. భూషణాంచితు నొకమహా•పురుషుఁ గాంచి
యూరుపేరిని సంపత్కు•మారు శుద్ధ
సత్త్వవిగ్రహుఁ గాంచె భూ•జాని యనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. సుందరసుకుమార•సురుచిరదివ్యమం,గళమూర్తిఁ గని మ్రొక్కి • కడు నుతించి
సందియంబులు మాని,స్వతనయకడ కేఁగి కమలగాఁ దోఁచు న•క్కన్యఁజూచి
కడు సంతసించి య•క్కన్నియఁ దోడ్కొని, వచ్చి చెల్వప్పిళ్ల• కిచ్చె నృపతి
యల్లుని నక్కన్య•తల్లి గన్గొని మ్రొక్కి, నిరుపమానందసం•భరిత యయ్యె

తే. నాదిదంపతు లాయిర్వు • రట్లు గలియఁ, దల్లిదండ్రులయుల్లము • లుల్లసిల్ల
సిరులు సొంపారఁగాఁ బెండ్లిఁ•జేసిరనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. మూఁడంజలులు దివ్య•ముక్తాఫలము లెత్తి, యొకరిశిరఁబుపై•నొకరు గుప్పి
పసిఁడిపూవులదండ • భర్తకంఠమునందు, రంగుగా నమ్మోహ•నాంగి యునిచె
రమణఁ జెల్వప్పిళ్ళ•రాయఁడు మౌక్తిక,హార ముంచెను మోహ•నాంగిమెడను
అట్లు చెల్వప్పిళ్ళ • కర్పించి యామోహ,నాంగిని దలిదండ్రు • లతిముదమునఁ

తే. జూచుచున్నంత యతిరాజ•సూరి యెప్ప,టట్లు గనిపించె నక్కన్య•యట్లుదోఁచె
దేవి నృపుఁ డది కలయట్లు•దెలిసి రనుచు. వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. రత్నజాంబూనద•రజతధనౌఘము, లతిమృదుక్షౌమ ది•వ్యాంబరములు
నవరత్నఖచిత నా•నావిధాభరణమ్ము, లురుచిత్రకంబళా•స్తరణములును
జామరమణిమయా•సనతల్ప దాసదా,సీధేనుశతములు • చెలులగుములు
కర్ణాటరాజ్యము • గజరథాశ్వభటౌఘ, మాత్మజ కవి యన్ని•యరణ మిచ్చి

తే యనుఁగుఁగోడలు నీ కిది • హరికిఁ బత్ని
యనుచు యతిభూపతికిఁ జెప్పి • యప్పగించె
ధార్మికుం డగుసులతాను • ధన్యుఁ డనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 50

సీ. బహుధనంబులచేత • భక్తితో యతిపతి, నర్చించి పంచె న•య్యధిపుఁ డంత
పెల విందు పోయివ•చ్చెద నని మ్రొక్కెడి,యడిగిన నమ్మోహ•నాంగిఁ జూచి
తలిదండ్రు లిరువురు • తగినట్లు దీవించి, యమ్మ ని న్నెడఁబాపి • యరనిమేష
మైన సహింపలే • మన సుత యి ట్లనె, హరితోడ నేను మీ•యక్షిపథముఁ

తే. జెంది కనిపించెదను మీరు•చింతమాని, యుండుఁడని తల్లిదండ్రుల•నూఱడించి
భర్తకడ కేఁగఁదలఁచె న•ప్పడతియనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. రాజసేవకు లంత • రత్నమయం బైన, యందలం బొక్కటి • యచట నునుప
నురుకృపఁ జుట్టాల • నూఱడించుచుఁ బిత్రు,గేహమంతటఁ గటా•క్షించివచ్చి

యావాహనం బెక్కి • యద్దేవి విచ్చేయ, దేవతాదుందుభుల్ • దివిని మొరసెఁ
గురిసెఁ బూవులవాన • ధర నృత్తగీతమం,గళవాద్యవాదిమా•గధకలోక్తి

తే. రవము లింపార మొగి యతి•రాజు నడవఁ
దండ్రి చుట్టాలు వెనువెంటఁ • దగిలి కొల్వ
శుభద నక్కన్య నందఱుఁ • జూచి రనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ప్రాసాదజాలరం•ధ్రములఁ గన్గొని సతుల్. పూలుగుప్పుచుఁ గన్యఁ•బొగడిరిట్లు
పాలవెల్లికి ముద్దు•పట్టి యై సిరి పుట్టి, శ్రీహరియురమునఁ • జెందె ముందు
త్రేతాయుగంబున • సీత యై యాలక్ష్మి, శ్రీరామభద్రు భ•జించె మరల
మహి ద్వాపరమునభీ•ష్మకపుత్రియై రను, మగిడికృష్ణునకగ్ర • మహిషియయ్యెఁ

తే గలిని నీరాజకన్య యై • కాంక్షదీఱ, మహిషియయ్యెను సంపత్కు•మారశౌరి
కని పరస్పర మనుకొని•రతివ లనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. రమణీయపటకుటీ•రముఁ జొచ్చి యద్దేవి. యందు మాణిక్యసిం•హాసనమునఁ
గూర్చుండినంత స•ద్గురుశిరోమణి యిదె, యమ్మ వీబొ మ్మని • యప్పగింప
నాయమ్మ యాబొమ్మ • నతిముదమ్మునఁ గొని, కౌఁగిటఁజేర్చి యం•కమునమంచి
పసిఁడిడోలికలలో•పల హంసతూలికా•తల్పమునందుఁ దాఁ • దగినయట్లు

తే. మారసుకుమారు సంపత్కు•మారుఁ గూడి
పరమసుఖ మందఁ దత్పాద•పద్మములను
గురునిసైనికు లతిభక్తిఁ • గొలిచి రనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 54

సీ. యతిరాజుతోఁ గూడ • నరుగుదెంచినసూరి, జనులకు నృపులకు • సైనికులకు
బహుమతు లొనరించి • పైన మొక్కటి చని, యల్లునిఁగూఁతును•నప్పి వచ్చి
కలకాల మాదంప•తులఁ దలంపున నిల్పి, సుల్తానుభక్తితోఁ • జూచుచుండె
నంత యతీశ్వరుం • డాదంపతులతోడఁ, దనబలంబులఁ గూడి•తరలి త్రోవఁ

తే. గ్రమముగాఁ గొన్నిదినములఁ • గడపి వచ్చి
సకలకల్యాణవాద్యఘో•షము చెలంగ
సిరుల కిర వైనయదుగిరిఁ • జెందె ననుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. నయ మొప్పఁగాఁ దిరు • నారాయణపురోప,వనముల బలములు • వాసమొంద
నాదివ్యదేశస్థు • లంద ఱెదుర్కొని, సేవింప వారల•సేమ మడిగి [లఁబొగడఁ
యార్యులు కనుమ్రోల•నామ్నాయములసూత, వందిమాగధులు పా•ర్శ్వము
బటహకాహళశంఖ • పంచమహావాద్య, వేణువీణానృత్త • వివిధగీత

తే. కలితరవములు బ్రహ్మాండ • ఘటము నిండఁ
దారయుతుఁ డైనసంపత్కు•మారుతోడఁ
జొచ్చె నప్పురి లక్ష్మణ • సూరి యనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర 56

సీ. కన్నులపండువు • గా ధన్యు లందఱు, కని మ్రొక్క వీధులు • కలియఁ దిరిగి
వచ్చి కోవెలఁ జొచ్చి • తెచ్చినస్వామికి, సంప్రోక్షణాదులు • చక్కఁ జేసి
రామప్రియుని యతి • రాజసంపత్కుమా,రుని బుధు లెల్లను • రూఢిఁ బొగడఁ
నారాజపుత్రికి • యాదవగిరిలక్ష్మి, యని యొకతిరునామ • మాచరించి

తే. వరుస నారాయణునియుత్స•వముల కెల్ల, నధిపతినిజేసిరామప్రి•యాఖ్యహరిని
యతిశిఖామణి కృతకృత్యుఁ•డాయెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. సరసుని యతిరాజ•సంపత్కుమారుని, యదుగిరిలక్ష్మిని • నతనిసతిని
జారువిగ్రహుఁ దిరు•నారాయణునిఁ జూచి, బహుమతిఁ జేసి భూ•పతులఁ బంచి
దివ్యదేశములందు • దృఢభక్తిజీవితా,శలు మాని మాయాజ్ఞ • సలుపుకతన
వరదుఁడ నైతి మీ•వాంఛిత మెఱిఁగింపుఁ, డని నిత్యులకు గురుఁ • డానతీయఁ

తే. గలితకల్యాణితీర్థావ•గాహనంబుఁ, జొచ్చి శ్రీహరికోవెలఁ • జూచుటయును
నడిగితిమి వరము లని వారు•నుడివిరనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఏఁడాది కొకపరి • మూఁడుదినంబులు, కల్యాణిలో నవ•గాహ మార్చి
హరిమందిరముఁ జొచ్చి•యాదవాద్రీశునిఁ, గనుఁగొనుఁడనియతి•కాంతుఁడనిన
నాఁటనుం డిపటి కై•ననుఁ బ్రతివర్షము, నిత్యులు కల్యాణి•నీట మునిఁగి
తైలామ్లఫలశాలి•తండులంబు లొసంగి, యదుగిరీశుని జూచి • యరుగనవియు

తే. గురునిజన్మర్క్షమునఁ బుళో•గిర మొనర్చి
స్వామి కర్పింతు రి ట్లింత • సలుప రేని
క్రిములు గన్పించి కల్యాణి • సమయు ననుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

అట నిత్యపక్షమా॰సాయనహాయన, పల్లవోత్సవముల • బాగుపఱిచి
సంపత్కుమారుని • సన్నిధిఁ దీర్ఘప్ర,సాదములను సాధు • జనులతోడ
ననుభవించ టమీఁద • యదుగిరికోవెల, కాణాచికారుల • ఘనుల నేఁబ
దిరువురఁ బిలిపించి • హితపంచసంస్కార,ము లొనర్చి వారికి • ముఖ్యములగు

తే. దాస్యనామము లొసఁగి త్రి॰దండపాణి
కరుణ సంపత్కుమారుకైఁ॰కర్యములను
వారివారికిఁ దగ నిచ్చె • వరుస ననుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అచటఁ జెల్వప్పిళ్ళ॰నర్చించుపను మఱ,మొకటిఁ గట్టించి యం॰దుండి స్వపద
సంశ్రితులైనయా॰చార్యులు యతులును, సాతానివైష్ణవుల్ • సత్త్వరతులు
కొత్తెపమ్మలు తన్నుఁ • గొలువంగ వారిని, మాల్యదీపారోప • మార్జనాది
కైంకర్యములు కొన్ని॰గావింప నియమించె, నిత్యమిచ్చట నుండు॰నిర్మలాత్మ

తే. కులకు మా కున్నగురువృత్తి • గలుగనేర్చు
నలరఁ బురి తిరునారాయ॰ణాఖ్య ననుచు
నుడయవరు చెప్పి యచ్చట • నుండె ననుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. మఱియును మోహనాంగియు యదుగిరిలక్ష్మియు బీబీనాంచారనని శుభాభిధానంబులు గలఢిల్లీశ్వరునిపుత్త్రి నిజవివాహమహోత్సవానంతరకాలంబునందుఁ దల్లిదండ్రులచే ననుజ్ఞవడసి యంతఁ జతురంగబలసమేతుం డై నిజసహోదరుండును నపరిమితాత్మీయబలసమన్వితుం డగుసంయమిసార్వభౌముండును దనతోడ నేతేరఁజనివని యాదవాచలసమీపంబున రత్నమయం బగునిజదివ్యచతురంతయానంబునందు స్వకీయదివ్యస్వరూపంబు ధరియించి యప్రాకృతదివ్యమంగళవిగ్రహం డగుసంపత్కుమారునితోడం గలిసి విలసిల్లుచుఁ జర్మచక్షుష్కులగు ప్రాకృతజనులకుం జూపడ దయ్యె నప్పు డయ్యతీంద్రుండును దదీయాశ్రితులును నాఢిల్లీశ్వరునికుమారుండును బరమాశ్చర్య బును జెంది యాదవాద్రికిఁజనిరంత సంయమీంద్రుండు సంపత్కుమార సంప్రోక్షణానంతర కాలంబునం దర్చారూపిణి యగునద్దేవిని రామప్రియ శ్రీపాదసాన్నిధ్యంబునం బ్రతిష్ఠించి తత్సహోదరుని బహువిధంబుల సత్కరించి పంపనతం డాదంపతులంజూచి హర్షించిగురువరునిచే ననుజ్ఞాతుం డై ఢిల్లీపురంబునకేతెంచి తండ్రినిం గాంచినిజసహోదరి

వృత్తాంతం బంతయు నెఱింగింపనతండు హర్షశోకాన్వితుండై యభిజ్ఞుంచే బోధింతు దైవైర్యం బవలంబించి యతీంద్రునికడకు బహుధనంబుఁ బంపి సంతసించు చుండెనమ్మహావైభవంబంతయు నెఱింగి సుల్తానునకు ముద్దుపట్టియగు కబీరుదాసుం డనునొక మహాత్ముండు యాదవాచలంబున కేతెంచి భగవద్రామానుజ మునీంద్రుం గాంచి నమస్కరించి యతనియనుమతిచే నిజసహోదరీసహితుం డగుసంపత్కుమారుని భజించి శ్రీరామానుజయోగీంద్రునియాజ్ఞచే శ్రీరంగంబునకుం జనుదెంచి యందుశ్రీరంగనాథుని భజించి భక్తిపూర్వకంబుగా ననేక విధంబుల సన్నుతించి మోక్షంబిమ్మని యర్థింప నద్దేవాదిదేవుం డతనికిం బ్రసన్నుండై వత్సా! ఇద్దివ్యదేశంబున నేను ప్రపన్నమోక్షప్రదానైకదీక్షితుండనై యున్నవాఁడను. శ్రీపురుషోత్తమక్షేత్రంబునందుఁ బతితపావనదీక్ష యొనర్చియుండితిని. ఇట్లు సల్పుటకుం గారణంబేమని యంటివేని వివరించెద. సావధానచిత్తుండవై వినుము. మచ్చక్రసంబంధంబు లేక చేతనుల కపవర్గం బొసంగ నని నియమంబు చేసితిం గావున నిద్దివ్యదేశంబునందుఁ బంచసంస్కారపరులగు ప్రపన్నులకు ముక్తియిచ్చెదను. అప్పురుషోత్తమ క్షేత్రంబునందు మచ్చక్రదర్శనంబుచే నెట్టి పతితులకైన నిశ్శ్రేయసం బొసంగెద. మచ్చక్రోపహతుల కెచ్చోటనైన మోక్షంబు సమకూర్చెదం గాన నీవా నీలాద్రికిం జని యందు నిత్యనివాసం బొనర్చితివేని యందు నీ యభీష్టంబు సిద్ధించు నని మిగుల నాదరించి యనుప నతండు భగవదాజ్ఞ శిరసావహించి యద్దేవదేవునిచే ననుజ్ఞాతుండై చని చని మార్గమధ్యంబునఁ గళింగదేశాధీశ్వరునిచే నర్చితుండై చనుదెంచి నీలాచలంబునందు సుభద్రా బలభద్ర సమేతుండై బ్రహ్మదారుస్వరూపుండైన శ్రీ జగన్నాథునిం గాంచి సాష్టాంగ ప్రణామం బాచరించి బహుభంగుల వినుతించి యాస్వామికిం ద్రికాలంబులందు శ్రీమాల్యకైంకర్యోచితంబుగా నొక యారామంబు రచియించి తదభివృద్ధి తత్పరుండై యుండెను. అంత నొక్కనాఁ డతని స్వప్నంబున నద్దేవుండు తన్నుం బొడ సూపి నీకు మోక్షం బొసంగెదనన్న దేవా భవత్పుష్పవనపాలకునకు ముక్తి యొసంగవలయునని ప్రార్థింప వాఁ డతి చపలచిత్తుండు గాన మఱియొక జన్మంబున వానికి మదీయలోకం బిచ్చెద. వాని చిత్తచాంచల్యంబు నీకుం బ్రభాతంబునం దెలియంబడునని యానతిచ్చి యంతర్హితుండై చని యొక బలాయరూపంబు ధరియించి యత్యంతతీక్ష్ణశృంగాగ్రంబులచే నప్పుష్పవనం బంతయు భగ్నం బొనర్పం జూచి యతిరోషభీషణాకారుండై యవ్వనపాలకుండు లోహవేష్టితంబగు దృఢతరదండంబుఁ గొని నిర్దయుండై తదీయావయంబు లన్నియు భగ్నంబు

లగునట్లు తఱిమి యడవ నమ్మహిషం బంతర్హితం బయ్యెను. అంత నుషఃకాలంబునందుఁ గఫీరుదాసుం దల్లన మేల్కాంచి నీలాద్రినాథునిం దలంచి కాల్యకృత్యంబులఁ గావించి భగవదాలయంబుల కేతెంచిన నద్దేవుండు రుధిరార్ద్ర సర్వగాత్రుండై తన్నతనికిం గనిపించి భగవత్ప్రియూన పుష్పవనపాలకుని కృత్యం బిదియని తెలిపి మఱియొక జన్మంబునం దవ్వనపాలకుని కపవర్గం బిచ్చెదనని యాదరోక్తుల నూఱడించి యతనిం బంచె. మఱియొక వాసరంబునందు గోధూమ చూర్ణంబుచే భక్ష్యవిశేషంబులు రచియించి నిజాలయంబునం దుంచి ఘృతశర్కరార్థంబుగాఁ బణ్యవీధికిం జనుదెంచిన సమయంబున నీలాద్రినాథుండు సారమేయ స్వరూపంబు ధరియించి యం దొకభక్ష్యంబుఁ గొనిపోవుచుండం జూచి యతండు దేవా! శుష్కభక్ష్యం బారగించితివేని నీకుం గుక్షిబాధ వాటిల్లుం గావున, నాయం దనుగ్రహంబుచే మదర్పితాజ్యశర్కరతోడం గూడ నాభక్ష్యం బారగింపు మని ప్రార్థించుచు నతిద్రుతగతి నతని వెనువెంట నంటి యేతెంచుచున్న యద్భక్తాగ్రణిం గని యతని సముద్రతీరంబునకు రావించి యచట శంఖచక్ర గదాధరుండై కిరీటాదినూపురాంత దివ్యభూషణ భూషితుండై శ్యామసుందర సుకుమార దివ్యమంగళ విగ్రహుండై లక్ష్మీసమేతుండై నిజరూపదర్శనం బిచ్చి యమ్మహాత్మునకు మోక్షం బొసంగి పౌరులకా వృత్తాంతంబంతయుఁ దెలిపి నిజమందిరంబుఁ జొచ్చి సుఖంబుండెను. అంత నప్పౌరజనంబులు పెంపుగా గుంపులు గూడి సముద్రతీరంబున కేతెంచి ఢిల్లీశ్వరునకుం బ్రియపుత్రుండైన యక్కఫీరుదాసు కళేబరంబు వీక్షించి విస్మయముఁ జెంది విధ్యుక్త ప్రకారంబుగా నతనికిఁ జరమసంస్కారంబు లొనరించి తన్మహోదధి సమీపంబున స్వర్గద్వారంబు కడ నతని యాశ్రమం బిప్పటికైనను సర్వజననయనగోచరంబై యుండునంత ఢిల్లీశ్వరుం డావార్త విని నిజపుత్ర పుత్రీవిశ్లేషంబు సహింపలేక పెద్దయుం బ్రొద్దు పరితపించి విద్వజ్జనులచే బోధితుండై చిత్తస్వాస్థ్యంబు లభియించి ధన కనక వస్తువాహనాది బహుద్రవిణంబులచే నిజపుత్రీసమేతుం డగు సంపత్కుమారునికిం బ్రీతిగా శ్రీరామానుజయోగీంద్రు నర్చించి స్వమందిరంబునం దానందించుచుండె నని కొందఱభిజ్ఞు లానతిత్తు రనుచు శ్రీ వాదిభీకరగురుం డస్మదీయ జిహ్వాగ్ర సింహాసనాసీనుండై యానతిచ్చెనంత. 62

సీ. మఱియుఁ దొల్లి సనత్కుమారుండు సత్యలోకమునుండి యానందఘనవిమాన
గతుని నారాయణుఁ గృతయుగంబునఁ దెచ్చి, రేవి నిగ్గిరిఁ బ్రతిష్ఠించుకతన

నారాయణాద్రి యీ•నగమయ్యెఁ ద్రేతదు, త్తాత్రేయయోగీంద్రుఁ•డాగమములు
శిష్యులై కొలువంగఁ • జెంది యీ వేదపు,ష్కరిణీతటంబున • సతతవేద
తే. సంతతాధ్యయనాదులు•సలుపుకతన, వేదగిరి యని యీయద్రి • విదితమయ్యె
నని యతీంద్రుఁడు శిష్యుల•కనియె ననును, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. ద్వాపరాంతమునందుఁ • దగినట్లు హరినిందు, శ్రీరామకృష్ణు ల•ర్చించుకతన
యాదవాచల మని • యమరుఁబే రీయద్రి, కనియతీంద్రుఁడు పల్క•విని సమస్త
బుధు లిట్లు పలికిరి • పుడమి నీయచగిరి, హరియర్చనము జీర్ణ • మైన మరలి
యుద్ధరించి యతీంద్రుఁ•డురుభక్తిసంపత్కు,మారుఁ బ్రతిష్ఠించి•మహిమ మెఱయ
తే. నిత్య మఖిలోత్సవంబులు • నెఱపుకతన, యాదవాద్రికి యతిశైల•మనెడు నామ
మలరె నని పల్క రయ్యార్యు•లంద ఱనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

శా. శ్రీరామానుజయోగిరాజ నిజపు•త్రీభూతరామప్రియా
పారావారగభీర యాదవగిరి•ప్రాసాదమధ్యస్థ ల
క్ష్మీరామాకుచకుంభకుంభదురుకా•శ్మీరాంచితోరస్థల
స్ఫార శ్రీహరిపాదపల్లవ నమ•స్యాసక్త భక్తప్రియా. 65

క. చండపాషండదుర్మత, ఖండనవజ్ర త్రిదండ•కరకమల శిఖా
మండలమండన వక్షో,మండల యజ్ఞోపవీత • మహనీయగుణా. 66

మాలినీవృత్తము. కృతవిజయపవిత్రా • కేశవాచార్యపుత్రా
హృతసతభవపాశా • హృష్టకర్ణాటదేశా
ధృతినియమితమారా • దీప్తసంపత్కుమారా
ప్రతిపదహరిగేయా • భాసతీభాగధేయా. 68

గద్యము. ఇది శ్రీ భగవద్రామానుజ కరుణాకటాక్ష కలితకవితావైభవ పరవాది భయం
కరాచార్యాభిమత ఛాత్రాపస్తంబసూత్ర కణ్వసగోత్ర పవిత్రోభయకవిమిత్ర
వేంకటకృష్ణార్యపుత్ర విబుధవైష్ణవవిధేయ కేశవనామధేయ ప్రణీతంబైన
యాచార్యసూక్తిముక్తావళి యను మహాప్రబంధంబునందు మధ్యమభాగంబునఁ
బ్రభాతంబునకు ననుష్ఠానంబు దీర్చి యతీంద్రుండు ఢిల్లీశునిఁ గటాక్షించి మా
యభీష్ట దైవతవిగ్రహంబు మీ యంతఃపురమున నున్నది దాని నిప్పింపుమని
యడుగుటయు రాజు తన పుత్రీతల్పంబున నా హరివిగ్రహంబుఁ జూచి యిమ్మని
కూఁతు నడుగుటయు నమ్మోహనాంగి యా హరివిగ్రహం బియ్యనని తండ్రికి

విన్నవించుటయు రాజు మీరు ప్రార్థించిన వచ్చెనేని మీ విగ్రహంబుఁ గొనిపొండని యతీంద్రుని నంతఃపురంబునకుఁ దోడ్కొని చనుటయు నగ్గురుశిఖామణి మోహనాంగి తల్పంబుపై రామప్రియునిఁ గనుంగొని పిలుచుటయు న ద్దేవాదిదేవుండు బాలకరూపంబు ధరియించి వచ్చి యతిస్వామి కుడితొడయందుఁ గూర్చుండుటయు సంయమీంద్రుం డబ్బాలకునకుఁ జెల్వప్పిళ్ళయని తిరునామం బొనర్చుటయు గురుం డాహరిని గొని నిజనివాసంబునకు విచ్చేయుటయు నమ్మోహనాంగి ప్రియుండైన హరిని విశ్లేషించి స్మరదశలచే నార్తిఁ జెందుటయు మంతనంబునఁ ద న్నడిగిన యొక ప్రాణసఖికి సంపత్కుమారునితోఁ దా ననుభవించిన రతిరహస్యం బెఱింగించుటయుఁ జంద్రోపాలంభంబును మన్మథ దూషణంబును నమ్మోహనాంగి మూర్ఛిత యై మరల సంజ్ఞఁ జెందుటయు న క్కోలాహలరవంబు విని తలిదండ్రు లేతెంచి యక్కన్నియ నూఱడించుటయు నారాత్రి రాజునకు స్వప్నంబునఁ గనిపించి చెల్వప్పిళ్ళ తన యభీష్టం బెఱింగించుటయు న ద్దేవాదిదేవుండు తన మనోరథంబు గురుని కెఱింగించుటయు మఱునాఁడు సంయమీంద్రుండు కాలోచితకృత్యంబులఁ దీర్చి యమ్మహీపాలు నీక్షించుటయు సంతసించి యా రాజదేవేంద్రుండు గురుశిఖామణిని గన్యాంతఃపురంబునకుఁ దోడ్కొనిచనుటయు లోకాపవాదభీతిచే సందియపడు రాజేంద్రునకు యతీంద్రుండు నిజస్వరూపంబుఁ జూపుటయు నమ్మోహనాంగి కల్యాణోత్సవంబును నక్కన్నియ సంయమీంద్రుని నివాసంబున సంపత్కుమారునితో సంశ్లేషించి సుఖించుటయు యతీంద్రుండు స్వసైన్యంబులంగూడి యా దంపతులతో యాదవాచలంబుఁ బ్రవేశించుటయు నందు సంపత్కుమారునకు సంప్రోక్షణం బాచరించి ప్రతిష్ఠించుటయు నద్దేవితోడ నద్దేవదేవునకుఁ గల్యాణాది మహోత్సవంబులు గావించుటయు సర్వభూపతులను బహుమతి పురస్సరంబుగా వారివారి దేశంబుల కరుగుటకు నాజ్ఞాపించుటయు నిత్యచేతనులకు వరంబిచ్చుటయు నేఁబదియువురు కోవెల కాణాచికారుల మగిడి సంస్థాపించుటయు నిజాశ్రితుల కందఱకుఁ దగిన కైంకర్యంబులు నియమించుటయు యతిరాజమఠ నిర్మాణంబును గఫీరుదాసుని చరిత్రంబును యాదవాచలమాహాత్మ్య కథనంబు నన్నది దశమోల్లాసము.

—o—

శ్రీమతే రామానుజాయ నమః



# ఆచార్యసూక్తిముక్తావళి

## మధ్యమభాగము

---

### ఏకాదశోల్లాసము


శ్రీమన్నారాయణగిరి
భూమేద్ధసనత్కుమార • పుణ్యవిమాన
స్థేమస్థాపితహరిపద
తామరసహృదంబుజా త్రి•దండధరకరా. 1

వ. అవధరింపుము. 2

సీ. శ్రీయాదవాచల•శ్రీపతియాజ్ఞచే, బౌద్ధాలయంబైన • పద్మగిరికిఁ
జని యందు బౌద్ధాది•శాస్త్రపుస్తకతతి, యగ్ని కాహుతిచేసి • యతులశక్తిఁ
గలుగానుగుల వారి•విలయముఁ జెందించి, మరల యాదవగిరి•మఠముఁ జెంది
యందుఁ బండ్రెండు హా•యనములు వసియించి. శ్రీభాష్య మాశ్రిత•చేతనులకుఁ

తే. బలుకుచుండంగ శ్రీరంగ•పదమునుండి
యప్పు డొకవైష్ణవోత్తముఁ • డరుగుదెంచి
గురునిఁ గనుఁగొని మ్రొక్కెడెఁ • గూర్మిననుచు
వాడిభీకరగురుఁ డనె • మోద మలర. 3

సీ. ఆవైష్ణవునిఁ జూచి • యాదరించి యతీంద్రుఁ, డెం దుండి వచ్చితి • రిచటి కనిన
శ్రీరంగధాముని•చెంతనుం డిచటికి, వచ్చితి ననియె నా•వైష్ణవుండు
రంగేశుచెల్వము • రంజిల్లుచున్నదా, కొఱఁత చెందక యని • గురుఁడు పల్కె
వరగుణ దేవర•వారు లేనికొఱంత, గాని రంగశ్రీకి • గ్లాని వేఱు

తే. గాన మని వైష్ణవుఁడు పల్కె • ఘనుఁడు గురుఁడు
తొల్లి చోళునికడ కేఁగు•దూరదర్శి

యైనకూరేశవృత్తాంత • మడిగె ననుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అడిగినగురున క•య్యాఖ్యుఁడు కూరేశ,వృత్తాంత మె ట్లని • విన్నవించె
రాజభటులు వేగ • ర మ్మనఁ గూరేశ,గురుఁడు పూర్ణాఖ్యునిఁ • గూడి యరిగి
చోళునిఁ గనవాఁడు•చూచి వ్రాయుము శివా,త్పరతరం నా స్తియ,న్వచన మనిన
శ్రుతులు పురాణముల్•స్మృతు లితిహాసము,లన్నియు గుమిగూడి•యఖిలదైవ

తే. తోత్తముండు మహాయోగి•సత్తముండు,శౌరి నారాయణుం డని•చాటెననుచుఁ
బలికెఁ గూరేశుఁడనియె నా•ప్రాజ్ఞుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. చాఁచెనొక్కఁడు తన•చరణాంబుజము దాని, భక్తితోఁ గడిగెను • బ్రాజ్ఞుఁ డొకఁడు
తలఁ దాల్చె నొక్కఁడా•జలములఁ బ్రీతితో, వారియం దధికుఁ•డెవ్వాఁడు నీవె
యరసి చూడుము నృపా•యది గాక గజరాజు,మొఱయిడె నేమని•మొఱ్ఱ యాల
కించి యేతెంచి ర•క్షించె నాతని నెవ్వఁ, డని యని నెమ్మది • నరసి చూచి

తే. యధికుఁడెవ్వాఁడొ వేల్పుల•యందు దెలియు,మని వచించెను గూరేశుఁ,డవనిభర్త
కనుచు వాక్రుచ్చెగురున క•య్యాఖ్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. శూలికైనను దమ్మి•చూలి కైనను జన్మ,నాశముల్ సెప్పు నా•మ్నాయవితతి
సర్వతోముఖములౌ•సఫలహేతువులచేఁ, దత్త్వము దెలియంగఁ•దలఁచి మొఱసి
నారాయణునికంటె • వేఱొక పరతత్త్వ, మేర్పరింపంగ లేఁ • డెట్టికృతియు
నది గాన నీవృథా•యాసము వల దని, బహువిధంబులఁ గూర•పతి వచింపఁ

తే. జోళుఁడామాట విని కూర•సూరిమణికి, నలుక మదిఁ బెన్గ ని ట్లని•పలికె ననుచుఁ
బలికె నావైష్ణవుఁడు యతి•భర్త కనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. వక్తపు దొడ్డవి•ద్వాంసుఁడ వది గాన, నొగిఁ జెప్పెదవు గొంటె•యుక్తు లిట్లు
మాకేటి కీమాట • లాకుపై నీవు మే,మన్నవాక్యము వ్రాసి•యడుగు మనుచు
నాకు గంటముఁ జేతి•కా నృపుఁడిడ శివా,త్పరతరం నా స్తి య•న్వచన మొక్క
పంక్తిగా వ్రాసి యా•పంక్తి వెంటను 'ద్రోణ, మస్తి తతః పర'•మ్మనుచు వ్రాసి

తే. యిచ్చిననుజూచియాయర్థ•మెఱిఁగి యలిగి, చోళుఁ డిట్లనెఁ గూరేశ•సూరికనుచుఁని
బలికె నావైష్ణవుఁడు యతి•భర్త కనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

- ప్రభు వని మాపట్ల•భయముఁ జెందక యితం, డవహసించి ఛలోక్తి• యాకుపై
వ్రాసె వీరిని దృష్టి • దీసి పంపుం డని, భటతతి కాక్షత్ర•బంధుఁ డనిన

నీవు మహావీర•శైవుఁడ వీనిన్నుఁ, జూచినచూడ్కులఁ • గాంచ ననుమఁ
గన్నులు రెండును • ఘనసఖా గ్రములచేఁ, జీల్చివై చెను గూర•శేఖరుంఘు

తే. పెరియనంబికి నద్దశ•జరపి భటులు, వారిఁ బురి దాఁటఁ బంచి రా•వరుసననుచుఁ
బలికె నావైష్ణవుఁడు యతి•భర్త కనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. అటమీఁద వా రిర్వు • రత్తుళాయమ్మతోఁ, జెలికదూరము చనఁ • జేనిగట్టు
దాఁటి పో లేక వే•దనఁ జెంది యానంబి, శ్రీకూరపతితొడ • శిరముఁ జేర్చి
యాత్మజతొడపయి • నంఘ్రిపద్మము లుంచి, పవళింపఁ గని వారు• పలికి రిట్లు
స్వామి దేవరవారు • జనన మొందిననాఁట,నుండి కోవెల బాసి•యుండ లేదు

తే. గాననట కేఁగఁదలఁచితి•రేనిమిమ్ముఁ, దొడుకపోయెదమని వారు•నుడివిరనుచుఁ
బలికె నావైష్ణవుఁడు యతి•భర్తకనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

. కూరేశ్వరునిఁ దన•కూఁతును గనుఁగొని, పరమగురుం డిట్లు•పలికె మరలఁ
జరమకాలం బని•యెఱిఁగి కోవెలఁజెంది, విడిచితినేని యీ•యొడలి నచటఁ
బరమపదముఁ జెందఁ•బెరియనంబియుముందు, కోవెల కేఁగెనా • కొలఁదిమనము
రంగధామముఁ జెంది • యంగము వదలినఁ, గాని వైకుంఠము•గలుగదనుచు

తే. వైష్ణవులుశంకపడుదురు,వసుధనింక, ననిగురుఁడుపల్కిమగిడియి•ట్లనియెననుచు
బలికెనావైష్ణవుఁడు యతి•భర్తకనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. గురుకృపచే న్యస్త•భరులకు మొదటనే, సిద్ధమౌమోక్షముఁ • జెందుటకును
గాలము దేశముఁ • గాంక్షింపఁ దగ దని, శ్రీమహాపూర్ణులు • చెప్పి రిట్లు
క్ష్మాగతాష్టోత్తర•శతదివ్యదేశము, లాళవందారిది•వ్యాంఘ్రిపద్మ
యుగ్మమే మా కని•యొక్కట ధ్యానించి, తత్పాదుకాద్వయిఁ•దలనుమడిని

తే. నక్కననుజేర్చి గురునిపై•మక్కువలర, నాళవందారిదివ్యాంఘ్రు•లందెననుచుఁ
బలికెనావైష్ణవుఁడు యతి • భర్తకనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. కూరేశుతో నంతఁ•గొండఱు వైష్ణవు, లచ్చోటఁ గూడి పూ•ర్ణార్యులకును
సాధుమతబ్రహ్మ • మేధసంస్కారముఁ, జేసి యాకూరేశు • వాసి నొక్క
తొట్ల నెక్కించి సం•తుష్టితోడ వహించి, దుష్టబాధలు లేని•త్రోవ రాత్రు
లందుఁ దోడ్కొనిచని • యత్తుళాయమ్మతో, శ్రీరంగధామముఁ•జేర్చి యతని

తే. యాజ్ఞఁ జెందియథేచ్ఛవా•రరుగనిండ్ల, కత్తుళాయమ్మ కూరేశుఁ•డరిగిరనుచుఁ
బలికెనావైష్ణవుఁడు యతి•భర్తకనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అంతఁ గూరాధిపుఁ • డక్కటా పూర్ణార్యు, తిరుమేనిభంగి నీ,దేహ మేల
పోదాయె ననివాల • ఖేదించి యొకనాఁడు, పాణిపద్మములచేఁ • బండుకొనుచుఁ
గోవెలకడ కేఁగ • దేవాలయముద్వార, పాలకు లతనికిఁ • బలికి రిట్లు
లెంబెరుమానారు•సంబంధు లెవ్వరు, కోవెలఁ జొచ్చిపోఁ • గూడ దీవు

తే. నతనిసంబంధి వైతివా • యరుగు మగిడి
యట్లు గా కున్న గుడిఁ జొరు • మనిరి వార
లని యతీంద్రుని కనియె న•య్యార్యుఁ డనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఎంబెరుమానారు•సంబంధి వైనను, జ్ఞానాధికుండవు • గాన నీవు
కోవెలఁ జొరు మని•కొంద ఱన్నను విని, వీనుల మూసి యా•జ్ఞాని యనియె
నెంబెరుమానారు•సంబంధ ముడిగి యా,నంబెరుమాళ్ళ నె•న్నఁటికి మేము
సేవింప నొల్లము•భావింప నెంబెరు,మానారుసంబంధ • మూనవలయు

తే. మాదుజ్ఞానాధికత్వము • మంటఁ బెట్టి, కాల్పనాయనిపల్కి య•గ్ఘనుఁడుచనియె
నని యతీంద్రున కనియెన•య్యార్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. ఆవైష్ణవునిసూక్తు•లాలించి దుఃఖించి, పెరియనంబికిఁ దొలి•గురువరునకుఁ
బదపడి తిరుచూర్ణ•పరిపాలనము తిరు,వధ్యయనాదిక • మాచరించి
కూరేశునకు దృష్టి•కొఱఁత చెందెనుగదా, యనియతిపతి గుంద•నార్యు లనిరి
సామి కూరేశుఁడు•సేమముగాఁ దిరు,మేనితో నున్నాఁడు•గాన యిట్లు

తే. కూరనాథునకై చింత•గూడ దనుచు, నార్యులన్నయథాపూర్వ • మాశ్రితులకుఁ
బలుకు చుండెను యతిపతి • భాష్యమనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఉర్వి ధనుర్జ్యేష్ఠ • నుదయించి యామునా, ర్యాంఘ్రిపద్మ ములు • నాశ్రయించి
యమ్మహాత్మునికృప • నఖిలవేదాంతర, హస్యార్థము లెఱింగి • యతివరునకు
న్యాసవిద్య యొసంగి • యతిపతిరక్షకై, చోళభూపతిసభఁ • జొచ్చి యచట
నారాయణుఁడు జగ•న్నాథుండుపరతత్త్వ, మతనికంగములన్యు•లమరులనుచు

తే. శుద్ధసిద్ధాంత మొనరించి • చోళనృపతి, నీతశారీరబాధఁ ద్ర•ణీకరించి
పూర్ణగురుఁడాత్మగుర్వంఘ్రిఁ•బొందెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

పెరియనంబి—త.శ్లో॥ ధనుర్జ్యేష్ఠాసముద్భూతం యామునాఙ్ఘ్ర్యబ్జసంశ్రయమ్।
యతీన్ద్రప్రథమాచార్యం మహాపూర్ణ మహం భజే॥

సీ. రుచిరసద్వైశాఖ•రోహిణిజనియించి• కల్యాణగుణముల•కలిమి వెలసి [గాంచి
యామునాచార్యది • వ్యాంఘ్రిపద్మము లాశ్ర• యించితత్కృపమంచి • హితముఁ
మంత్రరాజము చర•మశ్లోకతాత్పర్య• మెంబెరుమానారు • కెఱుకపఱిచి
పరమపదంబున • కరుగఁ దలంచిన• గోష్ఠీపురీపూర్ణ•గురుని( జూచి

తే. సన్నిధిస్వాములందఱు•సాఁగిమ్రొక్కి• చిత్తమున మీతలంపెద్దొ•చెప్పుఁడనిన
నాశ్రితుల కిట్లు పలికెన•య్యాశ్యుఁడనుచు• వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. దివ్యమౌచక్రవర్తితనూజుమదిలోన• శల్య మయ్యెను నొక•శకునిచరిత
మని పల్కి నిర్భరుఁ•డై తిరుకోట్యూరి•నంబి యామునపద•నలిన మొందెఁ
బక్షిపా పైనప్ర•పన్నపరిత్రాణ• సరణి చాల దటంచు • జాలిపడిన
స్వామి రంజిలుతలం•పేమి వేఱొకటి మా•కని గురూక్తులకర్థ•మనుచుఁ దెలిసి

తే. జ్ఞాననిధియైనతెర్కయా•ళ్వానుతోడఁ• గలిసిగురునకుఁజరమకై౦•కర్యములను
సన్నిధిస్వాము లందఱు•సలిపి రనుచు• వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

తిరుకోట్టియూరినంబి-త.శ్లో॥ వృషభేరోహిణీజాతం యామునార్యపదాశ్రయమ్।
గోష్ఠీపూర్ణం యతీన్ద్రస్యద్వితీయంగురు మాశ్రయే॥

పెరియతిరుమలనంబి-త.శ్లో॥ చైత్రే స్వాతీసముద్భూతం శ్రీరామాయణబోధకమ్।
వన్దే శ్రీశైలపూర్ణార్యం తృతీయం యతిరాడ్గురుమ్॥

తిరుమాలెయాణ్డాన్-త శ్లో॥ మాఘేమఖాయాంసంభూతంద్రావిడామ్నాయబోధకమ్।
తురీయార్యం యతీన్ద్రస్య మాలాధరగురుంభజే॥

తిరువరంగప్పెరుమాళ్-త.శ్లో॥ ద్రావిడామ్నాయచరమోపాయదం యతిశాసితుః।
జ్యేష్ఠాయాం వృషభే జాతం వన్దే శ్రీరఙ్గదేశికమ్॥

తిరుకచ్చినంబి-త శ్లో॥ మృగశీర్షోదితం కుమ్భే యతిరాజోపకారకమ్।
శ్రీకాఞ్చీపూర్ణ మనఘం వరదైకాన్తినం భజే॥

వ. అంత నట యతిరాజు విజమఠంబుననుండి యాశ్రితులకు వేదాంతరహస్యార్థంబు
లఁ దెలుపుచు నొక్కనాఁడు మారొన్నిల్లామారుడిచ్చిరియాండాననునొక మహాత్ము
వైష్ణవు రావించి మీరు శ్రీరంగధామమునకు విచ్చేసి యందుఁ గూరేశుని క్షేమం
బరసి యచ్చటివిశేషంబు లన్నియుఁ దెలిసి వచ్చి మా కెఱింగింపుఁడని పంచె
నంత.

సీ. అపుడు మారుధిసిరి•యాండాను యతిపతి. యాజ్ఞచే నరిగి కొ•న్నహములకును
శ్రీరంగపద మొంది • శ్రీవత్సచిహ్నమి•శ్రులఁ జూచి ప్రణమిల్లి • పలికె నిట్లు
స్వామి దేవరవారి• సేమము దెలిసి ర• మ్మని నన్నుఁ బంచెను • యతివరేణ్యుఁ
డన విని హర్షించి • యతని యతీంద్రుఁగాఁ• దలఁచి పూజించి వి•న్నవించుచుండు

తే. కూరపతి యాదవాద్రిని • గురుఁడు సలుపు
దివ్యచరితములను మాకుఁ • దెలుపు మనిన
నతని కవి యన్ని చెప్పె న•య్యార్యుఁ డనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర

సీ. ఆండానువల్ల ని•జాచార్యవృత్తాంత• మెఱిఁగి హర్షించి కూ•రేశుఁ డనియె
భువనములకుఁ బ్రాణ•భూతుఁడౌ యతిరాజు• మేలుగానుండుచే • చాలుమాకుఁ
గన్నులుమాత్రమే•గాసిఁ జెందినవి మా కిది యెంతమాత్రమీ• యికమలందు
నని పల్కి కూరేశుఁ • డనుప మారుధిసిరి• యాండాను చోళుఁ డ•త్యంతపాపి

తే. మెడనుబొడమినవ్రణమున•గడుసుక్రిములు• చాలఁబడిబాధఁబెట్టినఁ • జచ్చెననుచు
వీను లలరంగఁ బ్రియవార్త• వినియెననుచు• వాదిభీకరగురుఁ డనె• మోద మలర.

సీ. కూరేశు వీడ్కొని • కోవెలనుండేఁగి• సురనిమ్నగను గొన్న•చోళపురముఁ
జొచ్చి చోళుఁడు మెడ•పుచ్చిచచ్చెనటంచుఁ• బురివినఁబడుచోళు • మరణవార్త
వీనుల కింపుగా • విని సంతసించె మా•రుధిసిరియాండాను • రుచిరబుద్ధి
నమ్మంగియమ్మాళు • నచ్చటఁ గని మ్రొక్కి• యతనితో శ్రీయాద•వాద్రికరిగె

తే. గళము పుచ్చుటచేఁగ్రిమి•కంరుఁడనుచు• నామమాచోళునకునయ్యె•నాఁటనుండి
సజ్జనద్రోహి కెట్లగు • సౌఖ్య మనుచు• వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అంతట నొకనాఁ డ•హమ్మఖంబున యతి• స్వామి కల్యాణిపు•ష్కరిణికడను
సంశ్రితజనులతో • స్నానసంధ్యాద్యను• ష్ఠాన మొనర్ప నా • సమయమునను
మారుధియాండాను•మాన్యుఁ డౌనమ్మంగి• యమ్మాళువచ్చి యా•యతివరునకుఁ
బ్రణతు లొనర్చి త•త్పాదాబ్జములు తమ• భాస్వదానందబా•ష్పములఁ దడిపి

తే. యాత్మనేత్రాంబుజములచే • నర్చఁ జేసి• కేలుఁదమ్ములఁ దలలపైఁ • గీలుకొలిపి
భక్తిఁ గొనియాడి పలికి రీ•పగిది ననుచు• వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. కుశలియై యున్నాఁడు • కూరనాధగురుండు• రంజిల్లుచున్నాఁడు • రంగపతియు
ఖలుఁడుచోళుఁడుకుత్తు•కను బట్టువ్రణములోఁ• బురుగులుపడ మెడ • ముఱిగిచచ్చె

నని వాప పల్కిన • విని చాల హర్షించి, వారిఁ గౌఁగిటఁ జేర్చి • గారవించి
దూరదేశమునుండి • మీర లేతెంచి యీ, ప్రియవార్తలను విని•పిచుకతనఁ

**తే.** దగినప్రత్యుపకారము•ద్వయము దక్క, వేఱు లే దని యతిపతి•వారి కపుడు
మంత్రరత్నముఁ జెప్పెను•మగిడి యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

**సీ.** అన్వర్థ యయ్యెఁ గ•ల్యాణియం దీప్రియ•వార్త వింటిమి వీరి•వలన మే మ
టని పల్కి యటమీఁద • నాశ్రితజనులతో, నద్రిపై కెక్కి•ది•వ్యాలయమునఁ
బద్మాసహాయునిఁ • బ్రహ్లాదవరదుని, సుందరనృహరిని • జూచి మ్రొక్కి
క్షితిని హిరణ్యక•శిపుఁ ద్రుంచి భక్తోప•మా భూతుఁ బ్రహ్లాదు • మనిచినట్లు

**తే.** మహిని గ్రిమికంఠచోళుని•మచ్చమాపి, కూరపతిఁ బ్రోచితివి భద్ర•గుణసముద్ర
యనుచునరహరిఁబొగడెన•య్యార్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

**సీ.** సన్నిధిఁ దీర్థప్ర•సాదముల్ గైకొని, నరహరి వీడ్కొని • తిరిగి యరిగి
నరముఖనుత తిరు•నారాయణునిఁ గన, సంపత్కుమారుని•సొంపు జూచి
చేమోడ్చి వినుతించి•సెల విచ్చిననుబోయి, వచ్చెదనని యతి•వరుఁడు పలుకఁ
గలకాలమిచటమా • కను మోలనేయుండు•మని శౌరిపలుకన•య్యార్యుఁడనియె

**తే.** మునుపు శ్రీరంగముననుండు•మనివిధించి, మగిడియిట్లనుచేమన్న•మాధవుండు
కోవెలకు నేఁగ సెలవిచ్చె•గురునకనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

**సీ.** అటఁ బ్రయాణోన్ముఖుం•డై యతీంద్రుం డేఁబ•దిర్వురుసూరుల•కిట్టు లనియె
మీర లందఱు తిరు•నారాయణునకుఁ జె•ల్వప్పిళ్ళ కర్హకా•లములయందు
సకలకైంకర్యముల్ • సలుపుచు నుండుఁడీ, మమ్ముఁ దలంపున•మఱవ కెప్పు
డని సంయమీశ్వరుఁ•డాన తిచ్చిన విని, యాయేఁబదిర్వు రి•ట్లనిరి గురున

**తే.** కస్మదీప్సితదైవత • మయిననిన్ను, విడిచి యిట నుండు టే మని • విన్నవింప
యతిశిఖామణి వారి కి•ట్లనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

**సీ.** అర్థించితిరి గాన • నర్చాకృతి ధరించి, యుండెద మీయిష్ట • మొసఁగ నిచట
నని పల్కి శిల్పశా•స్త్రాభిజ్ఞు నొక్కనిఁ, బిలిపించి యార్యుఁడు • పలికె నతని
కస్మదాకృతితుల్య • మైనబింబముఁ జేసి, తె మ్మన్న నాశిల్పి • దెచ్చియిచ్చె
నం దాత్మశక్తిలో•నణుమాత్ర ముంచిన, నావింబ మనియె ని • ట్లందఱికిని

**తే.** నవని నీసంయమీంద్రుని • యపరమూర్తి, నేనిచటమిమ్ము రక్షింప • నిలిచినాఁడ
మున్నఁడీ యనె బింబము•నెమ్మి ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. యాదవాచలవాసు•లంద బాసూక్తుల వీనుల కింపు గా•వినిసుఖింప
మదిలోన సంపత్కు•మారునిఁ దలఁచినఁ,బుత్రవాత్సల్య ము•పొంగ గురువి
కడు గామ దై తోఁచు•రంగేశుని. దంద్రిని దలఁపఁ ద్రి•దండపాణి
కామ దొక్కడుగుగా•నరుగఁ దలం పగుఁ. బితృవత్సలత్వము•పెనఁగ మదిని

తే. నిట్లు కొన్నిదినంబుల•కేఁగుదెంచి, రంగధామము గని యతి•రాజుమ్రొక్కి
చెలఁగి కావేరితీర్థముఁ•జెందె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. కావేరితీర్థావ•గాహనం బొనరించి, యుచితక్రియలు సల్పి•యున్న తన్ను
నచ్చోటివైష్ణవు•లతిభక్తి•సేవింపఁ, గరుణించి వారితోఁ•బురముఁ జొచ్చి
ముఖ్య మౌరంగేశు•ముఖమంటపముఁ జెంది, జోహారుచేసి లోఁ•జొచ్చిమెచ్చి
శ్రీరంగధాముని•శేషశయానుని, శ్రీభూమినీళాది•సేవ్యచరణు

తే. దివ్యసుందరసుకుమార•దీప్తదేహు, శంఖచక్రగదాఖడ్గ•శార్ఙ్గధరుని
గాంచి గురుఁడు సుఖించి నుతించెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. కన్నులపండువు•గాఁ దన్ను సేవించి, యలరారుయతిపతి•కనియె శౌరి
ఖలచోళకృతబాధ•గాపిఁ జెందితి వీవు, కాలము దప్ప దే•ఘనునికైన
నని రంగపతి పల్క•విని సంయమీంద్రుండు, విన్నాణముగ నిట్లు•విన్నవించె
స్వామి మీ రిట శేష•శయ్యపైఁ బవళించి, యోగనిద్రారతి•నుండుకతన

తే. నీతు లె ట్లగు నుభయ•విభూతులందు, ననుచుఁ బల్కనయతిరాజు•నవధరించి
బహుమతులొసఁగె శ్రీరంగ•భర్తయనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. శఠకోపతీర్థప్ర•సాదనిర్మాల్యముల్, తిరువాలవట్టము•దెచ్చి యియ్య
స్వీకరించి భజించి,చేదమ్మిగవ మోడ్చి, వెన్నుని వీడ్కొని•వెడలి వచ్చి
కోవెల వలగొని•గోపురప్రాకార,మణిమయమంటప,మందిరములఁ
దిరువీధులను బుష్ప•తరుశాఖలను బిక,శారికాకీరము•యూరములను

తే. విమలహేమమణిద్వార•వేదికలను, జూచుచును వచ్చి కూరేశ•సూరివరుని
యింటిముంగిటి కేఁగెయ•తీంద్రుఁ డనుచు,వాదిభీకరగురుఁ డనె • మోద మలర

సీ. కూరనాథుఁడు తన•గురుఁ డగుయతిపతి, కెదు రేఁగుదెంచి య•హీనభక్తి
ధరణిపై సాష్టాంగ•దండప్రణామంబుఁ, గావింప యతిరాజు•కరుణఁజూచి
గ్రుచ్చెత్తి కౌఁగిటఁ•గూర్చి యోవత్స నీ, కక్కటాదృష్టి లే•దాయెననుచు
బహుదుఃఖపడిన నే•భాగవతునిబొట్టు, వెక్కిరించితినో యీ•వికృతిఁ గంటి

తే. ననుచుఁ గూరేశుఁ డన విని•యయ్య నీవు
నట్టివాఁడవు గా విడి•యస్మదీయ
పాపఫల మని యతిరాజు•పలికె ననుచు
వాదిభీకరగురుఁ డనె•మోద మలర

సీ ఇట్లూఱడించి కూ•రేశుని వీడ్కొని, యచటివైష్ణవులతో•నరిగి తనదు
మఠమొంది యందుల•క్ష్మణమునితాఁబోయి.వచ్చినక్రమమెల్ల•వైష్ణవులకుఁ
దెలుపుచునుండఁ ద•ద్దేశీయవైష్ణవు. లందఱు నచ్చోటి•కరుగుదెంచి
చూపు కూరాధిప•సూరికి లేవాయె, పెరియనంబియుఁ జెందెఁ•బరమపదము

తే. స్వామిసంకల్ప మి ట్లుండె•సంయమీంద్ర
కంటి మీవిన్ను నేఁటికి•మంటి మనుచు
మంచిమాటల నిట్లు వ•చించి రనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. ఆసమయంబునఁ జోళకృతభాగవతోపద్రవంబునకు దుఃఖించుచున్న సంయమీం-
ద్రునకు వ్రణక్షారన్యాయంబున దుష్టకృతభగవదుపద్రవవార్త వినఁబడియె నంత.

సీ. సిరి దొలంగినతిల్ల•చిత్రకూటమునుండి, గోవిందరాజులు•తావు దొలఁగి
తిరుపతిఁ జెంది సు•స్థిరత నున్నాఁ డని, విని గురుఁ డచటికి•వేగ వచ్చి
యతనిఁ బ్రతిష్ఠించి•యంజనాద్రీశునిఁ, గని మ్రొక్కి వరదునిఁ•గాంచిమగిడి
చెందె రంగము ముందు•చెప్పితి మీసంప్ర•దాయమామీఁదఁ ద్రి•దండపాణి

తే. కూరనాథునిఁ బిలిపించి•కూర్మి నీవు, వరదరాజును బొగడు మ•వశ్యమనుచుఁ
జెప్పియతని నొడంబడఁ•జేసె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. అంత స్వదృష్టిలాభార్థంబు సంయమీంద్రునిచే నియమితుం డై కూరనాథ-
గురుండు స్వాచార్యాజ్ఞం దలం దాల్చి వరదరాజస్తవం బాన తీయం దలంచె.

శ్లో॥ స్వస్తిహస్తిగిరిమస్తశేఖర స్సంతనోతుమయి సంతతం హరిః। నిస్సమాభ్య-
ధికమభ్యధత్తయం దైవమౌపనిషదీసరస్వతీ, అని యుపక్రమించి, శ్లో॥ నీలమేఘ-
నిభమఞ్జనపుఞ్జశ్యామకున్తలమనన్తశయం త్వామ్। అబ్జపాణిపద మమ్బుజనేత్రం నేత్ర-
సాత్కురు కరీశ సదా మే॥ అనియెడి యీ శ్లోకంబునందు సదా దర్శనయోగ్యం
బగునప్రాకృతదివ్యవిగ్రహదృష్టి నీదాసునకనుగ్రహింపవలయునని విజ్ఞాపనంబు-
సేయ నారాత్రి యమ్మహాత్మునిస్వప్నంబున.

సీ. కాలమేఘముఁబోలు•నీలదేహమువాఁడు. కరుణారసముఁజిల్కు•కనులవాఁడు
హాటకరత్నకి•రీటశిరమువాఁడు, మొల్కనవ్వులు గుల్కు•మోమువాఁడు
శ్రీవత్స కౌస్తుభ•శ్రీయుతోరమువాఁడు, కనకాంబరము మొలఁ•గల్గువాఁడు
పంచాయుధస్ఫుర•ద్బాహుశాఖలవాఁడు, పొడసూపియొక మహా•పూరుషుండు

తే. నేను గరిగిరివరదుండ•నీయభీష్ట•మియ్య వచ్చితిఁ గూరేశ•యిష్ట మడుగు
మనినఁ గూరేశుఁ డతనికి•ట్లనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. అప్రాకృతం బైన•యాత్మీయదివ్యమం•గళవిగ్రహంబు నా•కన్నుఁగవకుఁ
గనఁబడుఁ గాక నీ•కరుణచే నేవేళ. నని మ్రొక్కి ప్రార్థింప•నమ్మతించి
యద్దేవతావిభుం • డంతర్హితుం డయ్యె. నంత మేల్కాంచి కూ•రాధిపుండు
నానందభరిత స•ర్వాంగుఁడై సుప్రభా•తం బైనఁ గాలోచి•తక్రియలను

తే. జేసి యాస్తుతి సంపూర్తిఁ•జేసి వ్రాసి, వరదరాజస్తవం బాత్మ•గురునికడకుఁ
దెచ్చి ప్రణమిల్లి స్వప్నముఁ•దెలిపె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఆస్తుతి వినిపింప • నంతయు విని గురుం, డాకూరనాథున • కనియె నిట్లు
నిందాపదృష్టిలో • నీ వెప్పటట్లుండ. వాంఛించి నీచేత • వరదరాట్స్త
వంబుఁ జెప్పించి త•త్ఫలము నే నేమియుఁ, గాన నైతిని గానఁ • గరిగిరీశు
కడ కేఁగి యాహరి•కమ్రమౌళి నీస్తుతి, వచియింప నీదృష్టి • వచ్చు మగిడి

తే. యనుచుఁ బల్క యతీశ్వరుఁ•డచటనుండి, తానె కూరాధిపతికిఁ గై•దండ యిచ్చి
తోడుక చనియెను గరిగిరి•కడకు ననుచు. వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. కరిగిరిపై కెక్కి • వరదునిసన్నిధి. గురుఁడు గన్గొనఁ గూరు•కులగురుండు
స్తోత్రము చెవులకు • సొంపుగా వినిపింప. నంతయు విని హరి • సంతసించి
యభిమత మిచ్చెద • నడుగు మన్నను గూర•పతిరమాభర్తకుఁ • బలికె నిట్లు
నే లభించుఫలంబు • నెమ్మి నాలూరాను•కి మ్మన్న వరదుఁడు • సమ్మతించె

తే. నప్పుడొక్కరితో మాట•లాడుచుండి, యతివరుఁడు వారిసూక్తుల • నాలకింప
కంతమీఁదట విని యిట్టు•లనియె ననుచు. వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. వరద సర్వజ్ఞ మ•ద్వాంఛిత మెఱిఁగియు, నాయెడ నీ విట్లు • సేయఁ దగునె
కూరశేఖర నీకుఁ • గూడునాయింత స్వా•తంత్ర్యము నాయొప్పి•తంబు దెలిసి
యని పల్కి చింతించు•యతిశిఖామణిఁ జూచి, కరిగిరివరదుఁ డీ•కరణిఁ బల్కె
నను వినుఁ బొడగన • నయనము లిచ్చితి. యతిరాజ యీకూర•పతికి ననిన

తే. యంతఁ గూరేశుఁ డాహారి॰యవయవముల
సౌమ్ము లివి యవి యని కేలఁ ॰ జూపి గురువి
గాంచి తల్లక్షణముల వంచించె ననుచు
వాదిభీకరగురుఁ డనె ॰ మోద మలర. 44

సీ. అంత సంతసమొంది,యాహారిపీడ్కొని, మగిడి రంగముఁజెంది,మఠమునందుఁ
గూరేశునకుఁ గృప ॰ గోదగాథాతిశ,యార్థ మానతి యిచ్చు ॰ నవసరమున
రమ్యమౌ నారున,రంబొళి లనుపాట, కర్థ మెఱింగి య ॰ ట్లాచరింప
నళగరితిరుమల ॰ కరిగి ఘృతప్లుత, పాయసనవనీత ॰ భాండశతము

తే. శౌరి కర్పించి విల్లిపుత్తూరి కరిగి, వడపెరుంగోయిలుడయాను,వరదుఁ గాంచి
గోదఁ గనిమ్రొక్కె యతిరాజు॰కూర్మిననుచు, వాదిభీకరగురుఁ డనె ॰ మోదమలర.

సీ. అద్దేవికోవెల ॰ నణ్ణా యనుచుఁ బిల్చి, బహుమతు లొనరించి ॰ పంచినంతఁ
దిరునగరికిఁ జను॰గురుని శఠారిని, గని మ్రొక్కి పొగడి త॰త్కరుణఁ జెంది
తిరిగి రంగేశుఁ ద॰ద్దేవినిగనిమ్రొక్కి, స్వమఠ మొంది సుఖించు॰సమయమునను
యతిరాజునకు నైన॰యంతేనివాసులు, క్షేమంకరులు వారి ॰ నామధేయ

తే. ములు జగత్త్రియపాప ని॰ర్మోచనములు, నఖిలవైష్ణవలోక క॰ర్ణామృతములఁ
దెలియఁ బలికెదనే విన్న॰కొలఁది ననుచు, వాదిభీకరగురుఁ డనె ॰ మోద మలర.

వ. అమ్మహాత్ముల దివ్యనామక్రమం బెట్టి దనిన.—

1. కూరత్తాళ్వా౯, 2. మాడభూషియాళ్వా౯, 3. గోమఠత్తాళ్వా౯, 4. శట్టలూరిశిరియాళ్వా౯, 5. అనందాళ్వా౯. 6. నిడాధూరాళ్వా౯, 7. అరణప్పురత్తాళ్వా౯, 8. నెయ్యుండాళ్వా౯, 9. ఉక్కలాళ్వా౯. 10. వేదాంతియాళ్వా౯, 11. నడువిలాళ్వా౯, 12. పిళ్ళప్పిళ్లైయాళ్వా౯. 13. మిళహాళ్వా౯, 14. కారంజియాళ్వా౯. 15. ఈణ్ణియాళ్వా౯. 16. కోయిలాళ్వా౯, 17. తిరుక్కోవలూరాళ్వా౯, 18. తిరుమోహూరాళ్వా౯, 19. అకలంకనాట్టాళ్వా౯, * ముదలియాండా౯, 2. పెరియాండా౯. 3. సిరియాండా౯, 4. అమ్మంగియాండా౯, 5 మారుధిప్పెరియాండా౯, 6. మారొన్నిల్లా మారుధిసిరియాండా౯, 7. సోమాసియాండా౯, 8. కందాళైయాండా౯, 9. ఈశ్వరాండా౯, 10. ఈణ్ణియాండా౯, 11. కురంజిపూరిసిరియాండా౯, 12. ఆళవందారాండా౯, 13. అయ్యరాండా౯. *1కిండాంబియాచ్చా౯, 2. సిరియాచ్చా౯, 3. కణ్ణియనూరిసిరియాచ్చా౯, 4.

కొంగిలాచ్చా౯, 5 ఈచ్చంబాడియాచ్చా౯, 6. ఎన్నాచ్చా౯, 7. అయిప్పిళ్లై యాచ్చా౯, 8. తూప్పిర్‌ప్పిళ్లైయాచ్చా౯,* 1. అరుళాళప్పెరుమాళెంబెరుమానార్, 2. తొండనూర్నంబి 3. మరుధూర్నంబి, 4. మళపూర్నంబి. 5. కొట్టనంబి, 6. కురువినంబి 7. తిరుక్కురుంగుడినంబి, 8. వంగిపురత్తునంబి. 9. ముకుంబ నంబి, 10. శ్రీపరాంకుశనంబి, *1. శ్రీపరాంకుశభట్టర్, 2 వరుందరుంబెరు మాళ్‌భట్టర్, 3. అళగియమణవాళభట్టర్, 4. శ్రీపరాశరభట్టర్, 5. శ్రీవేద వ్యాసభట్టర్, 6. శిరుప్పుళిదేవరాజభట్టర్, 7. తిరువరంగభట్టర్, 8. గోవింద భట్టర్. 9 నంబియూరిల్ శ్రీరంగరాజభట్టర్, 10. ఉళ్లూరిల్‌పెరియభట్టర్, 11. వరుందరుంబెరియపెరుమాళ్‌భట్టర్, *1. శట్టంబల్లిజియ్యర్, 2. ఈచ్చంబాడిజ య్యర్ 3 తిరువేంగళంజియ్యర్, 4. కులశేఖరజియ్యర్, 5. ఆళ్‌కొండుపల్లి జియ్యర్ 6 తిరుమళిశైజియ్యర్ 7. సాలగ్రామజియ్యర్, 8. తిరుప్పుళింగుడి జియ్యర్, 9. శ్రీగోవిందజియ్యర్, 10. తిరుమాలిరుంజోలైజియ్యర్. 11. తిరు ముట్టంజియ్యర్, 12 తిరునెన్నూరుజియ్యర్, 13 తిరువడందైజియ్యర్, *1. తిరు నారాయణపురత్తరయర్, 2. పెరుమాళ్‌కోయిల్‌వరుందరుంపెరుమాళరయర్. 3. రాజనారాయణప్పెరుమాళరయర్, 4. తిరువరంగప్పెరుమాళరయర్, 5. తిరు వేంగళత్తరయర్, 6. తిరువాయ్‌మొళియరయర్, 7. పిళ్లైత్తిరునరయూరరయర్. 8. తిరుక్కురుంగుడియరయర్, 9. తిరునగరియరయర్, 10 తిరుక్కణ్ణపురత్త రయర్, 11. తిరువనంతపురత్తరయర్, 12. రాజమహేంద్రప్పెరుమాళరయర్ 13. విల్లిపుత్తూరరయర్, * 1. ఆళుల్‌కొండుఅమ్మంగియమ్మాళ్, 2. ముకుంబయ మ్మాళ్, 3. పరిత్తిక్కొల్లైయమ్మాళ్, 4. ఉక్కలమ్మాళ్, 5. కొట్టియమ్మాళ్* 1. హరీతకులతిలకరాన ఆసూరిప్పెరుమాళ్, 2. కిళాంబిపెరుమాళ్. 3. అమ్మంగి పెరుమాళ్, 4. మునిప్పెరుమాళ్, 5. పట్టినిపెరుమాళ్. 6. వడమునిపెరుమాళ్, *1. తిరుమలైనల్లా౯. 2. ఎంబార్, 3. కరాంజిసోమయాజియార్, 4. పెరియ కోయిల్‌వళ్లలార్, 5. అలంకారవేంగడవర్, 6 తిరుక్కురుహప్పిరా౯పిళ్లా౯, 7. ఆరుకాట్టిపిళ్ళా౯, 8. రామానుజపిళ్ళా౯, 9. తిరునగరిప్పిళ్ళా౯, 10. గోమ శత్తియ్యర్, 11. వైత్తమానిధిశిరయయ్యర్, 12. పెరియయ్యర్, 13. అణియ రంగత్తముధనార్, 14. కుమాండూరశయపల్లి, 15. కుమాండూరిపిళ్లై, 16. నంబి కురుందేవర్, 17. అంబత్తిరువురీయెంబెరుమా౯శెల్వపిళ్లై, *చాత్తాధవర్‌కళిల్, 1. కులశేఖరప్పెరుమాళ్‌దాసర్. 2. పట్టర్‌పిరా౯దాసర్, 3. పహవెల్లిదాసర్,

4. శ్రీవిల్లిపుత్తూర్‌దాసర్, 5. శ్రీనారాయణదాసర్, 6. శ్రీగోవర్ధనదాసర్, 7. తిరువళుధివళనాడుదాసర్, 8. శ్రీరామానుజదాసర్, 9. పిళ్ళైయొరంగావెల్లిదాసర్, 10. వండర్, 11. శొండర్, 12. రామానుజవెళ్ళైక్కారల్, *సత్తైత్తుముదలికళ్ మువ్వురితిరునామములు, 1. తిరువరంగదాసర్, 2. తిరుమాలిరుంజోలైదాసర్, 3. వానమామలైదాసర్, *కొంగిల్‌ముదలికళ్ మువ్వర్, 1. అళగియమణవాళదాసర్, 2. తిరువేంగడదాసర్, 3. పేరరుళాళదాసర్, * తిరుమళిల్‌కొత్తత్తుముదలిక్క మువ్వరు, 1. యతివరచూడామణిదాసర్, 2 యతిరాజదాసరు, 3. ఇళయాళ్వార్‌దాసర్,* పాండ్యనాట్టిల్ ముదలికళ్ మువ్వరు, 1. మహిళలంగాలదాసర్, 2. శ్రీశఠకోపదాసర్. 3. పిళ్ళైతిరువాయిమొళిదాసర్, *స్థానత్తారిల్, 1. సేననాథబ్రహ్మరాయర్, 2. వీరసుందరబ్రహ్మరాయర్, 3, జగన్నాథబ్రహ్మరాయర్, 4 వీరరాఘవబ్రహ్మరాయర్, పిళ్ళైయుడైందయుడయార్ తిరువంజనమెడుక్కుంతుయ్యమునివేళం, శ్రీభండారంకావల్, 1. తిరువరంగమాళికైయరయర్, 2. ఆండవర్, 3, అరియవర్, 4. అముధుపడియారిప్పర్, *అమ్మమార్‌కళిల్, 1. తిరువనందపురత్తమ్మై, తిరువాట్టాత్తమ్మై, 3. తిరువణ్బరిశారత్తమ్మై 4. మున్నినాల్‌కోయల్‌ప్పారుత్తమ్మై, 5. తిరునరయూరమ్మై, 6. తిరుక్కణ్ణపురత్తమ్మై.7.తిరుప్పదిశ్రీకార్యంశెయ్యుమమ్మై, 8. ఆండాడమ్మై,*1. నాయకత్తేవియార్, 2. ఉయ్యప్పెరుందేవియార్, 3. పెరిమపెరుందేవియార్, 4. సిరియపెరుందేవియార్, *శ్రీపెరుంబూదూరితిరువరంగంతిరుక్కోడందయిల్ తూయ్యవాయిరంకొంగిల్, 1. పెరియపిరాట్టియార్, 2. అత్తుళాయమ్మై, 3. అమ్మంగి 4. కూరత్తాండాళ్, 5. దేవకీపిరాట్టియార్, 6. యతిరాజవల్లియారు, 7. పంగయచ్చొల్లియార్ 8. పొన్నాచ్చియార్, 9. యన్నిళైవంచియారు, 10. చూడికుడుత్తాళ్, 11. తిరుప్పావైపాడినాళ్. —అమ్మహాత్మలయందు(జతుస్సప్తతిసింహాసనస్థితులగునాచార్యపురుషులెవరన్న.—కూరత్తాళ్వాన్. 1. ముదలియాండాన్, 2. అరుళాళప్పెరుమాళెంబెరుమానార్, 3. కిడాంబియాచ్చాన్, 4. తిరుమలనల్లాన్ 5. అనందాళ్వాన్ 6. ఎంబార్, 7. ఆళవందార్‌కుమారర్ శొట్టనంబి. 8. పెరియనంబికుమారర్‌పుండరీకర్, 9. తిరుక్కోట్టియూరినంబికుమారర్ తెక్కాళ్వాన్, 10. తిరుమాలైయాండాన్‌కుమారర్ సుందరత్తోళుడయాన్, 11. పెరియతిరుమలనంబికుమారర్ రామానుజంబిళ్ళై, 12. తొండనూర్నంబి. 13. మళధూర్నంబి, 14. మళవూర్నంబి, 15. తిరుక్కురుంగుడినంబి, 16. కురువనంబి, 17. ముడుంబ

నంబి. 18. శ్రీపరాంకుశనంబి. 19. వడుహనంబి. 20. వంగిపుర త్తినంబి. 21. పిళ్లతిరుమలనంబి. 22. పిళ్లైప్పిళ్ళయాళ్వా౯. 23. విదాధూరియాళ్వా౯. 24. యంగళాళ్వా౯. 25. శట్టలూరిశిరియాళ్వా౯. 26. ఈణ్ణిప్పిళ్లయాళ్వా౯. 27. నెయ్యుండాళ్వా౯. 28. మిళహాళ్వా౯. 29. మారుధిప్పెరియాండా౯. 30. ఈశ్వరాండా౯, 31. జియ్యరాండా౯, 32. శిరుప్పళ్లిదేవరాజభట్టర్, 33. ఉళ్లూరిపెరియ పెరుమాళ్భట్టర్. 34 శ్రీరంగరాజభట్టర్. 35. ఉక్కలాళ్వా౯. 36. పరిత్తిక్కొల్లైయమ్మాళ్. 37. అమ్మంగియమ్మాల్. 38. నడివిలాళ్వా౯. 39. గోమఠత్తాళ్వా౯, 40. తిరుక్కోవులూరాళ్వా౯, 41. తిరుమోహూరాళ్వా౯, 42. వేదాంతియాళ్వా౯. 43. కోయిలాళ్వా౯, 44. అరణపురత్తాళ్వా౯, 45. కొంగిలాచ్చా౯, 46. ఈచ్చంపాడియాచ్చా౯, 47. కణ్ణియనూరిసిరియాచ్చా౯, 4 . శట్టంబల్లిజియ్యర్. 49. ఈచ్చంపాడిజియ్యర్. 50. తిరువెళ్ళరజియ్యర్. 51. ఆళ్కొండపల్లిజియ్యర్. 52. తిరునగరప్పిళ్లై. 53. కరాంజిసోమయాజియా౯. 54, అలంగారవేంగడవర్. 55 నంబికురుందేవర్. 56. పిళ్లయుడందుడయార్. 57. తిరుక్కురుహప్పిరా౯పిళ్లా౯. 58. పెరియకోయిల్‌వళ్లలార్. 59. తిరుక్కణ్ణపురత్తాచ్చా౯, 60. ఆసూరిప్పెరుమాళ్. 61 మునిప్పెరుమాళ్. 62. అమ్మంగిప్పెరుమాళ్.63. కుమాండూరియళయవల్లీరామానుశప్పిళ్లై. 64. మారొన్నిల్లామారుధిచ్చిరియాండా౯, 65. సోమాసియాండా౯. 66. ఈణ్ణిప్పిళ్లైయాండా౯. 67. పెరియాండా౯. 68. కురంజిపూరంజియ్యరాండా౯. 69. అమ్మంగియాండా౯. 70. ఆళవందారాండా౯. 71. కిళాంబిప్పెరుమాళ్. 72. ఆరుకాట్టిప్పిళ్లా౯. 73. పిళ్లతిరునారాయణపురత్తరయర్. 74. ఈక్రమంబుగాన ప్రశతిసంయమీంద్రులచేఁ జతుస్సప్తతిసింహాసనస్థితు లగునాచార్యపురుషులచే నేకాంతిద్వాదశసహస్రంబులచే నసంఖ్యాతు లగుసాతనిసానుఁడచే శతత్రయసంఖ్యాకు లైనకొత్తెపమ్మలచే నగణితంబు లయినరాజసమూహంబులచే నిరంతరసేవ్యమానశ్రీపాదారవిందుం డగు సంయమిసార్వభౌముని కనవరతంబు కూరత్తాళ్వాను ముదలియాండాను నేళాధూరాళ్వాను నవలంబనదండస్థానాపన్నులై యుందు రరుళాళప్పెరుమాళెంబెరుమానారాచార్యనియోగంబున భగవదారాధనంబు సలుపుదురు కిళాంబిప్పెరుమాళును గిళాంబియాచ్చానును దిరుమడపల్లికైంకర్యనిర్వాహకులై యుందురు వడుగనంబి యభ్యంజనంబునఁ గైంకర్యంబు సేయుచుండును గోమఠచ్చిరియాళ్వాను శ్రీపాదుకాసమర్పణోత్థానకైంకర్యనిరతులై యుందురు పిళ్లైయొరంగావెల్లిదాసర్ కైదండ

యొసఁగుదు రమ్మంగి క్షీరసక్తుసమర్పణంబుసేయు చుందురు ఉక్కాళమ్మాళ్ తిరువాలవట్టకైంకర్యంబులు సలుపుచుందురు ఉక్కాళాళ్వాణ్ భక్తపాతోర్థ్రిత్తానకైంకర్యంబు సేయు చుందురు మారుధియాండాణ్ తిరుక్కావేరీకైంకర్యంబు సలుపుచుందురు మారొన్నిల్లామారుధిచ్చిరియాండాణ్ మఠంబునకుఁ దండులసూపశాక ఘృతక్షీరదధ్యాదిసమర్పణ రూపకైంకర్యసక్తులై యుందురు తుయ్యముని తిరుమంజనకైంకర్యంబుసేయుచుందురు తిరువరంగమాళిగై యార్ శ్రీభండార కైంకర్యాసక్తులై యుందురు వండరుం శుండరుం రాజసేవాలబ్ధం బగుధనంబుఁ దెచ్చి శ్రీమఠకైంకర్యంబునకు సమర్పింతురు రామానుజవిళక్కాకల్ తిరుమేని సంరక్షణతత్పరులై యుందురలంకనాట్టాళ్వాణ్ ప్రతిపక్షనిరసనాసక్తబుద్ధులై యుందు రీక్రమంబున నిత్యకైంకర్యపరులగునిమ్మహాత్ములయందు వడుగనంబి యతీంద్రునితిరువడిత్తామరలే ప్రాప్యప్రాపకంబు లని విశ్వసించి తదీయశ్రీపాదుకలే నిరంతరం బారాధించుచుందు రట్టియెడ నొక్కనాఁడు

సీ. సంయమీంద్రునితోడ • జరుగుచుఁ ద్రోవలో,వాఁక యడ్డం బైన • వడుగనంబి
కంఠప్రమాణోద•కము దాఁటుచును దన,శిరమునఁ బెరుమాళ్ల • తిరువగూడ
పై యతీంద్రునిదివ్య•పాదుకాద్వయ ముంచి,దరిఁ జెందఁజూచి త్రి•దండపాణి
వడుగా యి దేమన • వడుగనంబియుఁ బల్కె,నీస్వామి నాతఁ•నిలిచి యున్న

తే. నిఁక నాయిష్టదైవత • మెచటికేఁగు,ననిన నిదియొకయధికార•మనుచుఁ దలఁచి
గురుఁడు కరుణించి యతనితో•జరిగెననుచు,వాదిభీకరగురుఁడనె•మోదమలర

శా. రాకాచంద్రముఖారవింద పరిపూ•ర్ణస్వాంత విజ్ఞాతస
శ్లోకప్రాక్తనదేశికేంద్రవిభవా • శుద్ధస్వభావ స్తవా
వైకుంఠాశ్రిత సేవ్యపాదకమలా • వాదీంద్రతూలానిలా
శోకధ్వాంతదివాకరా శుభకరా • సుశ్లోక రామానుజా. 49

క. శ్రీకర భక్తవశీకర, భీకరసంసారగహన•భేదకురారా
ప్రాకటతత్త్వవిచారా, శ్రీకేశవపుత్ర సూరి•సేవ్యచరిత్రా. 50

మాలినీవృత్తము. నిగదితహరిపద్యా • నిర్మలస్వాంతవేద్యా
విగళితభవపాశా • వేదమార్గప్రకాశా
యగణితగుణధామా • యాశ్రితాంభోజసోమా
జగదఘదమిచంద్రా • సత్త్వసాంద్రా యతీంద్రా. 51

గద్యము. ఇది శ్రీభగవద్రామానుజకరుణాకటాక్షకలితకవితావైభవ పరవాదిభయంకరాచార్యాభిమతచ్ఛాత్రాపస్తంబసూత్రకణ్వస గోత్రపవిత్రోభయకవిమిత్ర వేంకటకృష్ణార్యపుత్ర విబుధవైష్ణవవిధేయకేశవనామధేయప్రణీతంబైనయాచార్య సూక్తిముక్తావళి యనుమహాప్రబంధంబునందు మధ్యమభాగంబునఁ బద్మగిరిప్రవేశంబును బౌద్ధవిజయంబును మగిడి యతీంద్రుండు యాదవాద్రిం బ్రవేశించుటయు నందుఁ బండ్రెండుహాయనంబులుండుటయు శ్రీరంగధామంబునుండియొక వైష్ణవుండరుగుదెంచి యతీంద్రునకుఁ గూరేశువిజయం బెఱింగించుటయుఁ బంచాచార్య చరమవార్తాశ్రవణంబును మారొన్నిల్లామారుధిచ్చిరియాండా నను దేశికోత్తమునిఁ గోవెలకుఁ బంచి యతనివలనఁ గల్యాణిపుష్కరిణీ తీరంబునందుఁ గూరేశునిపేమం బెఱింగి క్రమికంఠునిమరణవార్త వినుటయు యాదవాద్రినివాసులైన శ్రీవైష్ణవులచేఁ బ్రార్థితుండై యతీంద్రుండద్దివ్యదేశంబునందుస్వకీయార్చాబింబప్రతిష్ఠాపనంబు సేయించుటయుఁ దిరునారాయణస్వామిచే ననుజ్ఞాతుండై యతీంద్రుండు శ్రీరంగధామంబుఁ జెందుటయు రంగధామునకు యతీంద్రుండు మంగళాశాసనం బొనర్చి శ్రీవత్సచిహ్నమిశ్రుల నాదరించుటయు నమ్మహాత్ముండు గురుని యోగంబున వరదరాజస్తవంబొనర్చి స్వప్నంబున వరదునిఁ గాంచుటయుఁ గూరేశసహితుండై యతీంద్రుండు కరిగిరి కరిగి వరదునిసన్నిధి వరదరాజస్తవంబుఁ జదివించుటయు నద్దేవదేవుండు మెచ్చి నాలూరానుని కపవర్గంబును గూరేశునకు దివ్య దృష్టియొసంగుటయు మగిడిశ్రీరంగంబుఁ జెంది యచటనుండి యళగరితిరుమల కరిగి యందుగోదాదేవిమనోరథంబీడేర్చుటయు నచటనుండి శ్రీవిల్లిపుత్తూరికిం జనివడపెరుంగోయిలుడయానునకు మంగళాశాసనంబుఁ జేసి గోదాదేవిని భజియించిన నద్దేవియుఁ గోవెలయణ్ణాయని యతీంద్రునిఁ బిలిచి యతనికి బహూమతు లొనర్చుటయు యతీంద్రుని తిరువడిత్తామర లాశ్రయించిన మహాత్ములదివ్యనామంబులుచెప్పుటయు నాంధ్ర పూర్ణప్రభావోపక్రమంబు నన్నది యేకాదశోల్లాసము.

—: ౦ :—

శ్రీమతే రామానుజాయ నమః



# ఆ చా ర్య సూ క్తి ము క్తా వ ళి

## మ ధ్య మ భా గ ము

---

### ద్వాదశోల్లాసము

 రంగపతిపదాంబుజ
సారంగ శుభాంతరంగ • సాత్త్వికవిద్యా
పారంగత సంయమికుల
సారంగ సదంతరంగ•సరసిజభృంగా. 1

వ. అవధరింపుము. 2

సీ. ఉడయవ రొకనాఁడు • వడుగనంబికిఁ దన,తళిగ ప్రసాదము • దయ నొసంగ
రెండుచేతులఁ బట్టి • నిండారుభక్తి నా,తం డారగించి హ• స్తములఁ దలను
దుడుచుకొన్నను యతి•ధూర్వహుం డది చూచి,హస్తముల్ గడిగికొ• మ్మన్ననట్లు
చేసి యామనునాఁడు • శ్రీహరిగూడిఁ జెంది, స్వగురుండు భగవత్ప్ర•సాదమియ్య

తే. నదిభుజించి కరద్వయ•మపుడె కడుగ, నార్యుఁ డేమిది యన్న మీ•యాజ్ఞయనిన
నతనినిష్ఠకు ముద మందె•నార్యుఁ డనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. తిరువీథు లేతెంచు•హరిఁ గన నొకనాఁడు, వడుగనంబినియతి•వరుఁడు పిలువ
నీస్వామిఁ గన నేఁగ • నాస్వామికై కాఁచు, పాలిది పొంగిపో • వా మహాత్మ
యన్నఁ దద్గురుభక్తి • కార్యుఁ డక్కజపడి, మఱియొక్కప్పుడుపెరు•మాళ్ళసేవ
కరిగి రంగేశుని•యక్షిసౌందర్యముఁ, గను మన్ననానంబి • గాంచి మగిడి

తే. గురునిదశుకొత్తుకన్నులఁ • గోరి చూచి
యస్మదార్యామృతముఁ గన్న • యక్షియుగళ
మన్య మేమియుఁ గన నొల్ల • దాయె ననుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 4

సీ. తనయింటికొకనాఁడు • తన్నుఁ గన్గొనఁ దొంటి, చుట్టాలు వచ్చినఁ • జూచి వారి
అన్నపానాదుల • మన్నించి పంచి, యా, మఱునాఁడు తా నున్న • మందిరమున
వారు ముట్టినయట్టి•వస్తువు లన్నియుఁ, బరిహరించి స్వకీయ•భవన మంత
యలికించిపూయించి•యాంధ్రపూర్ణార్యుఁడు, చనుదెంచితానెదా • శరధియింటఁ

తే. బెరటఁబడి యున్నభాండముల్ • పెక్కు దెచ్చి
క్రొత్తఁ బెట్టించెఁ దొల్లింటి • కులమువారి
పొత్తుభాగవతుల కెట్లు • పొసఁగు ననుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 5

సీ. మేలునాట వెలుంగు•మిధిలసాలగ్రామ, నగరియం దొకనా యో•నర్చి యందు
భక్తితో గురుని శ్రీ • పాదతీర్థం బుంచి, యతని శ్రీపాదుక • లచట నిలిపి
కొమరొప్పఁ బై నొక•కోవెలఁ గట్టించి, నిత్య మర్చించుచు • నిఖిలలోక
పావనం బాచార్య•పాదతీర్థం బది, యారగించుచుఁ గాల • మట్లు గడపి

తే. వడుగనఁబి నిజచ్ఛాత్ర•వరులజూచి, నలుపుఁడీపూజయిచ్చోట • సతతమనుచుఁ
జెప్పి యార్యపదాబ్జముల్ • చెందె ననుచు. వాదిభీకరగురుఁడనెఁమోద మలర.

సీ. ముందు శ్రీశఠకోప•ముని వేంకటేశున, కఖిలకైంకర్యము • లాచరింపఁ
బ్రార్థించె నిప్పుడీ•పను లన్నినెఱవేర్పఁ, గలసాత్త్వికుఁడు మాకుఁ • గలిగెనేని
యాతఁడే యస్మదీ•యస్వామి యని యతి, పతి వైష్ణవులు వినఁ • బలికె నంత
శ్రీమదనంతదే•శికమణి లేచి సా,ష్టాంగప్రణతిఁ జేసి • యనియె నిట్టు

తే. లాజ్ఞ యిచ్చినఁజని వేంక•టాద్రిపతికి.నిత్యకైంకర్య మొనరింతు • నిక్కమనిన
యతివరుఁడుపంచెనయ్యనం,•తార్యుననుచు. వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. చని వేంకటేశుని • గని మ్రొక్కియతనికి, సకలకైంకర్యముల్•నలుపు చుండి
హరికిఁ దా నొనరించు•తిరునందనవనంబు, చెంతల నొకదొడ్డ•చెరువుఁ ద్రవ్వఁ
దలఁచి యారంభించి • తానెత్రవ్వుచు నుండ, దారకుల్ గర్భిణి•తనదుదేవి
మంటితట్టలు మోయ • మాయావి వేంకటా, చలభర్త భక్తవా•త్సల్యజలధి

తే. యర్భకాకృతి నాబాలు•రందుఁ దోఁచి, తట్ట లెదు రందుకొనివేగ•తానెతెచ్చి
కట్టపైఁ గుమ్మరించును • గరుణ ననుచు. వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. అలపి మెల్లన మును • పరుగుదెంచెద రిప్పు, డేతెంచెదరు వేగ • మే మిది యని
యడిగిన గురున కి • ట్లనిరివా రొక దార, కుఁడు తట్టలెదు రందు•కొనియెఁ గాన

వేగ వచ్చితి మని • వీఁడె వాఁ డని చూపఁ • జూచి పల్కెననంత • సూరి యిట్లు
మాయబాలకుఁడ వై • మావృత్తికిటు లేల, యొడిఁగట్టుకొంటివీ•వాంఛగలిగె

తే. నేని వేఱొకతట్టఁ జేఁ•బూని మట్టి, మోయు మన్ననుగనిపింపఁ • డాయెఁదన్ను
భక్తవశ్యుండు వేంకట•భర్తయనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర. 9

సీ. ఒకనాఁడనంతార్యుఁ • డురుతరతులసికా, వనములో దళములఁ•దునుముచుండఁ
గర మొకసర్పము • గఱచిన నీరాడి, యెద గురునిఁదలంచి • యెప్పటట్లు
విరులదండలఁ గూర్ప • విని పిలిపించి లక్ష్మీశుఁడు నీతలం • పేమి యనినఁ
గఱచినభుజగము•ఘనమైన దాయెనా, విరజలో నీరాడి•హరిని గొలుతుఁ

తే. గఱవఁబడ భోగి కొకవాసి•గలిగెనేని, నీదుకోనేటనీరాడి•నిన్నె కొలుతు
నని హరికిఁబల్కెనయ్యనం•తార్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. తిరువయోధ్య కనంత•గురుఁడు సంశ్రితులతో, విచ్చేయువేళ శ్రీ•వేంకటేశు
దివ్యప్రసాదపా•థేయముఁ గొనిపోయి, యలసి యాత్రోవలో•నారగింపఁ
దలఁచి చాలఁబిపీలి•కలఁ బ్రసాదమునందుఁ, జూచి యిట్టు లనంత•సూరి పలికె
నిత్యసూరులు వీరు•నిత్య మాయద్రిపై, వాసిగా సుఖపడు•వారు గాన

తే. వేగ మీ రీ ప్రసాదము•వేంకటాద్రి, నుంచి రండని శిష్యులఁ•బంచ వార
లట్లు చేసిరి విజదేశి•కాజ్ఞ ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. ఒకనాఁడనంతార్యుఁ•డొంటిమైమణిమంట, పమునందుసురభిపు•ష్పములఁగూర్ప
హరి పిల్వఁ బంచిన•నతఁడు చలింపక, కుసుమదామము లన్ని•గూర్చి తెచ్చి
యర్పించిననుగని•యాజ్ఞ మీఱితివేమి, యనిహరియడుగ న•య్యార్యుఁడనియెఁ
బరువు దప్పినవిరుల్•పరిమళింపవు నీది, యాన మీఱిన భీతి•వీనికేమి

తే. యిరువురము సంశ్రయించితి•మిగ్గిరీంద్ర, మస్మదార్యాజ్ఞమీపని•కైనవీని
కాజ్ఞ పనిచేమియనియెన•య్యార్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. శ్రీరంగమున నిట్టి•శిష్యులతోఁ గూడి, సంయమీంద్రుఁడు గోష్ఠి•సలుపుచుండ
గురునకుఁ జెప్పక•కూరేశుఁ డొకనాఁడు, రంగేశుఁజూచియు•ప్పొంగిపొగడి
యతఁడు ప్రసన్నుఁడై•యభిమత మిచ్చెద, వేఁడుకొమ్మనగూర•విభుఁడుపలికె
నీప్సితార్థము మున్నె•యిచ్చితి వది గాన, మగిడి నిన్నర్థింపఁ•దగునె యనిన

తే. నేఁడు గురునాన నీయాన•నీవు గోరి, కొమ్ము మఱియొక వర మిత్తుఁ•గూరనాథ
యనిన హరి కిట్టుకూరేశుఁ•డనియెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. భవదనుభవనిత్య•బలవద్విరోధి యీ, ప్రకృతిబంధముఁ బాపి•భవదుదార
సతతానుభవము నొ•సంగు మన్ననుహరి•యదిదక్క వేఱొక్క•టడుగుమనిన
నంతకంటె మఱొక్క•టడుగ నొల్లదుమది, యన్న రంగేశుఁడు•హర్ష మొంది
నీకు నీవారికి•నీవారివారికి, నపవర్గ మిచ్చితి•నని వచించి

తే. చారుశఠకోపతీర్థప్ర•సాదమూల్య, చందనము లాలవట్టము•సత్కరించి
బహుమతియొనర్చికూరేశుఁ•బంచెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అర్చిరాదికగతి•కగ్రిమశృంగార, మట్లాయలంకృతి•యలర వచ్చి
మనికిపట్టుకుఁ బోక•మరియొకచోనున్న, కూరేశుకృత్యము•గురుఁ డెఱింగి
కాషాయచేల మా•కాశంబునకు నేఁగఁ, జిమ్మిత్రిదండముఁ•జేతఁ బూని [యె
యాడుచుండఁగఁజూచి•యార్యులందఱుస్వామి, యేమిదియనసంయ•మీంద్రుఁడని

తే. వింటి మొకదొడ్డశుభవార్త•వీనులలర, నదియునెదియన్నఁజెప్పెద•నాలకింపుఁ
డనియె యతిరాజు నిజసంశ్రి•తాళికనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ శౌరి కూరేశుని•సంబంధసంబంధి, జనులకు మోక్ష మొ•సంగె నరయ
మాకు సంబంధ మా•మాన్యునితోనుండుఁ, గావునమోక్షమే•కలుగు ననుచు
సంతసించెద నని•సంయమీంద్రుం డన, నార్యు లందఱు విని•హర్ష మొంది
సచ్ఛిష్యునకు సదా•చార్యున కొకతార, తమ్యము లే దని•తలఁచి రవ్వ

తే. డంతఁ గూరేశగురునకై•చింతపడుచు, నమ్మహాత్ముని గనుఁగొన•యతివరుండు
వైష్ణవౌఘముతోఁ గూడ•వచ్చె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. చనుదెంచి కూరేశుఁ•గని గురుఁ డనియెనీ, కర్హ మాననుఁ బాసి•యరుగననుచు
నామాట విని యమ్మ•హాత్ముఁ డూరకయున్న, నాశయమే మని•యార్యు లడుగ
సూరులు మును చను•వారిపిమ్మటివారి, కెదు రేఁగుమర్యాద•యె దుఁగలదొ
యానిత్యభూతిమ•ర్యాద గీడ్పడ కుండ, ముందఱ చేరి య•దుందు నేని

తే. మిమ్మెదుర్కొనవచ్చునా•మీఁదనినన, నచటిక్రమ మేమి యిదియొక•యద్భుతంపు
నిష్ఠ యని పల్కె సంయమి•నేత యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. గురుఁడంతఁగరుణచేఁ•గూరేశుచెవియందు, ద్వయమూఁదసూరులీ•వైన మేమి
యన మీ రెఱుంగ రీ•యవని రాకొమరుని, వదనము కర్పూర•వాసనలను
విడిచిన జిహ్వాగ్ర•వింపనివగిది నీ, యధికారిమోము ద్వ•యాక్షరములఁ
బరిమళింపక యున్న•వరట గట్టురసజ్ఞ, యనిమూఁపు నిమురుచు•హస్తమునను

తే. ప్రాణభూతుని నిన్నెడఁబాసి యెట్లు, జీవితంబు ధరింతు న,న్నీవు కూడఁ
దోడుక చనుమని యతిపతి,నుడివెననుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర.

వ. అని యిట్లమ్మహాత్మ్ముని విశ్లేషంబునకు సహింపనోర్వక పెద్దయుంబ్రౌద్ధత్యం తార్తింజెంది సంశ్రిత విశేషాసహిష్ణుండును వైష్ణవకులాలంకరిష్ణుండు నగునయ్యతివిష్ణుండు శ్రీవత్స చిహ్నమిశ్రుల నుద్దేశించి వత్సా!శ్రీవైకుంఠంబున దివ్యరత్నమయ శతసాహస్ర స్తంభగుంభితంబును సమకాలసముదితానేక బాల భాస్కర ప్రభావిభా సమానంబు నగుదివ్యాస్థానమంటప మధ్యభాగంబునందు రజతాచలశిఖరంబునం బొడమి లెక్కకళ్యంబులైన చక్కని క్రొక్కారు మెఱుంగులం గలపి మెలపి విలసితం బగుసజలజలద మండలంబు వోలిక దివ్యయోగ పర్యంకగతంబును నిజఫణామణి మండల సంతత దేదీప్య మానని౽పమానమహామణి ప్రభాపటల ప్రభాస మానదశదిశావకాశం బగుశ్రీ మదనంత మహాభోగి భోగవతల్పంబునం బ్రసారితస వ్యపదార విందుడును గుంచిత దక్షిణ శ్రీపదార విందుండును జానున్య స్తస వ్యేతర పాణిపల్లవుండును నాగభోగవిన్య స్తసవ్యకరకమలుండును ననవరత విరాజమాన దివ్యరత్న మయకిరీట చూడామకరకుండలగ్రైవేయహార కౌస్తుభకేయూరకటకోర్మి కాకటిసూత్ర పీతాంబర శింజానమంజు మంజీరాద్య పరిమితదివ్య భూషణభూషితుండును వైజయంతీ వనమాలాలం కృతుండును లక్ష్మీసంలక్షిత విశాలవక్షస్స్థలభ్రాజ మానశ్రీవత్సలాంఛనుండును శంఖచక్రాది దివ్యాయుధదీప్య మానదీర్ఘ వృత్త భుజభూషితుండును శ్రీభూనీళాది దేవీసహస్రంబులతో విలాసంబులం దగిలిక్రీడించు భక్తత్రాణపరాయణుం డైననారాయణుని పురుషదృష్టి చిత్తాపహారియగురూపౌదార్యాది కల్యాణగుణగణం బతిశయంబున నిన్నాకర్షించు చున్నది నేనేమి సేయంగలవాఁడ నప్పరమపద నాథుండును దద్దివ్య లోక నివాసులేమి భాగ్యం బొనరించిరో పుడమి నిచ్చోట యోగనిద్రారతి నున్న శ్రీరంగనాథుండును నిద్దేశవాసులు నేమిపాపం బొనర్చిరో తెలియంజాల నని పలికి మహాఫలానుభవంబునకుం జనుకృతార్థులకుఁ జిత్తవైకల్య నిమిత్తంబులగు వికలోక్తు లాడం జనదు గావున వత్సా పరమపదంబునకుం బొమ్మని వీడుకొలిపి గాఢాలింగనం బొనర్చి ప్రేమ విహ్వలితసర్వావయవుండై యున్నసమయంబున,

శ్లో॥ యో నిత్య మచ్యుతపదామ్బు జయుగ్మరుక్మ వ్యామోహత స్తదితరాణితృణాయ మేనే। అస్మద్గురోర్భగవతోఽస్యదయైక సిన్ధో రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే॥ అని యిట్లు తీర్థతనియ విన్నవించి యామెంబెరు మానారుతిరువడి త్తా మరలు తిరునేత్రంబుల శిరంబున నురంబున నాని శ్రీపాదతీర్థంబుఁ జేర్చి యమ్మ

హాత్ముని శ్రీహస్తంబుచే గ్రహించి త్రివారం బారగించి పర్వకాలంబున నమృత కిరణ కౌముదీజుష్టంబగుదు గ్దాబ్ధిచందంబునఁ బరమానంద భరితసర్వాంగుండై యుప్పొంగి శ్రీవత్సాంక మిశ్రుండు కృతాంజలి పుటుండై స్వాచార్యునిం బంచి కతిపయదూరం బనుగమించి యతనిచే ననుజ్ఞాతుండై సాష్టాంగంబుగా సేవింప ననుగ్రహించి యతీంద్రుండు నిజనివాసంబునకుం జనియె నంతఁ గూరేశుండు నిజగృహంబునకుంజని దేవీరత్నంబు నీక్షించి నీతలంపెట్టిదనిన నాసాధ్వి స్వామీ దేవరవారి చిత్తానువర్తియై మదీయస్వాంతం బుండుఁగాని యన్య మెఱుంగ నేరదని విన్నవించి సేవించి పాంజలియైయున్న యద్దేవి వినయోక్తు లకు హర్షించి శ్రీపరాశరభట్టారకుని శ్రీరామప్పిళ్ళనుం బిలిచి వత్సకులారా శ్రీరంగనాథుండును శ్రీరంగనాయకియు విచ్చేసియుండ మీకుం గొఱంత లేవియు సంభవింపవు శ్రీరంగరాజాను గ్రహంబున జనియించి వర్ధిల్లు చున్నార మతండే మాకు రక్షకుం డనితలంచి యుండక యెంబెరుమా నారుతిరువడిఘళే తంజ మని విశ్వసించి యుండవలయును. భవజ్జనని యైనయీసాధ్వికి విధేయులై యుండి శ్రీ మహాభాగవతులయందుఁ ద్రివిధకరణంబులచే వించుకైన నపరాధ మాచరిం పక వారియం దనురక్తి సలుపవలయునని యానతిచ్చిన నిజశ్రీపాదంబులయం దును సాష్టాంగదండ ప్రణామం బాచరించి దుఃఖించుచున్న కుమారుల నిరువురం గ్రుచ్చి యెత్తి తన శ్రీహస్తంబున నమ్మహాత్ములకన్నీరు దుడిచి మీరు ప్రకృతి సంబంధమే ప్రధానంబు గాఁదలంచి దుఃఖించితిరేని యెంబెరుమానారు సంబం ధంబు దూషించినవార లగుదు రాత్మ సంబంధంబుఁ దలంచి క్లేశించితి రేని నుఱుఁగుపఱుప నశక్యం బగుమ దీయసంబంధం బెఱిఁగి స్వస్థచిత్తులై యుండం దగు నని యక్కుమారుల నిరువుర నూఱడించి పుళ్ళ పుళ్ళ యాళ్వానను మహాదేశికునియూరు ప్రదేశంబున శిరంబుంచి స్వదేవీరత్నం బయిన యాండా ళమ్మ యూరుభాగంబున శ్రీపాదపద్మములుంచి యెంబెరుమానారు తిరువడిత్తామరలే ధ్యానించుచుఁ బరమపదంబునకుం జనియెనంత సంయమి శేఖరుం డావార్త విని వేగ విచ్చేసి కూరేశకుమారులగు శ్రీవ్యాసపరాశరభట్టారకుల నూఱడించి కూరే శున కంతిమకైంకర్యంబుసేయ నియమింప జ్యేష్ఠపుత్రుండగు శ్రీపరాశర భట్టార కుండు తిరుమాలయుఁ దిరుప్పరివట్టంబును జాత్తుపడి మొదలగు కోవెలపరికరం బులతో నచ్చటి శ్రీవైష్ణవ బృందంబు రావించి, శ్లో॥ సర్వకర్మాణి సూత్రేణ గాయత్ర్యా వైష్ణవేన చ। నారాయణానువాకేన స్నాపయే త్త్రితయం సుతః॥ అన్న ప్రకారంబుగా నక్కూరేశ గురునకుఁ దిరుమంజనంబు సమర్పించి కేశవాది

నామంబుల ద్వాదశోర్ధ్వ పుండ్రంబులు ధరియించి యలంకరించి శ్రీచూర్ణ పరిపాలనంబు గావించి యాచరమ విగ్రహంబు విమానంబునం దుంచి బ్రహ్మవిదగ్రేసరులగు శ్రీవైష్ణవులు వహింపఁ బంచమహావాద్యంబులతోఁ దోడ్కొని చనితిరుక్కావేరీ గర్భంబునందుంచి. శ్లో॥ కేశవార్పితసర్వాఙ్గం శరీరం మఙ్గళావహమ్। సర్వథానద హేద్విప్రో బ్రహ్మమేధవిధిం వినా॥ అనుశాస్త్ర క్రమంబున భగవద్దాసులగు ముముక్షువులు తిరుమేను విడిచిన నచ్చరమ విగ్రహంబు బ్రహ్మమేధ సంస్కారంబు దక్కవేఱొక్క విధిచే సంస్కరింపం దగదు గావున. శ్లో॥ బ్రహ్మమేధమితిప్రోక్తం మునిభిర్బ్రహ్మతత్పరైః। మహాభాగవతానాం హి కర్తవ్యోవిధిరుత్తమః॥ అనుహారీ తస్మృత్యుక్త క్రమంబున శ్రీమహాభాగవతోత్తముండగు శ్రీవత్సాంక మిశ్రుని బ్రహ్మమేధ సంస్కారవిధిచే సంస్కరించి యామీఁదనవశ్య కరణీయంబులగు కృత్యంబుల శాస్త్రోక్త క్రమంబుగా ననుష్ఠించి యంతట సంయమీంద్రునిఁ దదీయులగు మహాత్ములను నిజగృహంబునకుఁ దోడ్కొనివచ్చి. శ్లో॥ నాతః పరతరం తీర్థం వైష్ణవాంఘ్రిజలాచ్ఛుభమ్॥ తేషాం పాదరజః పుణ్యం గఙ్గామపిపునాతిహి॥ అని శాస్త్ర ప్రసిద్ధం బగుమహావైభవంబుగల శ్రీమహాభాగవత శ్రీపాద తీర్థంబర్థించి స్వీకరించి. శ్లో॥ శుభాదౌ ద్విజవర్యైశ్చ సర్వసంపచ్ఛుభావహమ్। సహస్ర శాఖాధ్యయనం కారయేద్వైది కోత్తమః॥శ్లో॥ అశుభాన్తే విశేషేణద్రావిడీ బ్రహ్మసంహితా। అధ్యేత వ్యాద్విజవరై రాశౌచమంనాశనీ॥ అనియు. శ్లో॥ వృద్ధావాదౌ క్షయేచాన్తే ద్రావిడీ బ్రహ్మసంహితా। అధ్యేత వ్యాద్విజవరై రాద్యా గీతసహస్రికా॥ అనియు బ్రహ్మాండ పురాణంబునం జెప్పంబడుం గావునఁ దిరువాయి మొళియను దివ్యప్రబంధం బనుసంధించి పుష్పాంజలి యొనర్చి చాత్తుగావించి. శ్లో॥ యథా తుష్యతి దేవేశో మహాభాగవతార్చనాత్। తథానతుష్యతే విష్ణు ర్విధివత్స్వార్చనా దపి॥ అనుశాస్త్ర క్రమంబుగా శ్రీమహాభాగవతతదీయారాధనం బాచరించి వారలకు సకలసత్కారంబు లొనరించి కృతార్థుం డయి యుండె నంత ॥ కూరత్తాళ్వారితిరునక్షత్రతనియను.—పుష్యమాసంబున హస్తనక్షత్రంబు గావున. శ్లో॥ మకరే హస్తనక్షత్రే సర్పనేత్రాంశసమ్భవమ్। శ్రీమత్కూరకులాధీశం శ్రీవత్సాఙ్క ముపాస్మహే॥శ్లో॥ అగ్ర్యం యతీంద్ర శిష్యాణా మాద్యం వేదాన్తవేదినామ్। శ్రీ పరాశరభట్టార్యమ్మహోపకృతి మాశ్రయే శ్లో॥ శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యో నమ ఉక్తిమధీమహి। యదుక్తయ స్త్రయీకణ్ఠే యాన్తిమఙ్గళసూత్రతామ్॥ అని యాశ్రితు లిట్లు తనియనులు విన్నవించి రంత.

సీ. మరునాఁడె యెంబెరు • మానారు చనుదెంచి, భట్టరయ్యను జెట్ట • బట్టి తోడుక
చని రంగభర్తయా • స్థానమంటపమునఁ, బ్రణమిల్లి శ్రీరంగ • పతిని దాపి
సేవించి యద్దేవ•దేవుని శ్రీపాద, పద్మముల్ సూపెన • బ్బాలకునకు
భట్ట రా శ్రీ పాద • పాద పద్మములను జూచి, హర్షింప నతని కి • ట్లనియె శౌరి

తే. వత్స మీతండ్రి లేఁ డని • వగవ వలదు, నన్నె మీతండ్రిగా మది•నమ్మియుండు
మనుచు వాక్రుచ్చెహరి భట్ట • రయ్యకనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. మత్పుత్రుఁ డని యభి • మానించి హరీంద్ర, తీర్థ మిప్పించి సం • దియము దీఱ
మహి రంగరాజాభి • మానపుత్రుం డని, ఖ్యాతుఁ డౌన ట్లను • గ్రహముఁ జేసి
యున్న శ్రీహరిఁ జూచి•యుడయవ రనియె దీ, ర్ఘాయు విమ్మి వె యీ•యర్భకునకు
విద్యఁ జెప్పెదనన్న • వినియు నూరకయుండి, బహుమతు లొనరించి•పంచెశౌరి

తే. యంత భట్టరు నెంబారు • కప్పగించి, విద్యఁ జెప్ప నియోగించి • వేగ వచ్చి
మఠమునం దుండె నాజగ • న్మాన్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

వ. అయ్యవసరంబున సంయమీంద్రుండు నిజపదాబ్జా శ్రితులగుదాశరథ్యాదిమహా దేశికులకు భగవద్విషయంబు ప్రసాదించు చుండె నట్టియెంబెరుమానారు ప్రభావంబు బయల్పుచ్చు మహాత్ము లెవ్వ రన్న వివరించెద శ్రీరంగనాథుఁడును శ్రీవేంకటేశుండును గరిగిరివరదుండునుయాదవాద్రీశుండును నళహరిస్వామియుఁదిరుక్కురుంగుడినంబియు శ్రీశఠకోపసూరీంద్రుండును శ్రీమన్నాథమునివరుండును శ్రీయామునాచార్యవర్యుండును బెరియనంబియుఁ దిరుక్కోట్టియూరినంబియుఁ దిరుమలనంబియుఁగూరమాలాధరగురుండు నాళ్వార్తిరువరంగప్పెరుమాళరయరను మహాదేశికుండును మఱియు నెంబెరుమానారుతిరువడిఘ ళాశ్రయించిన చతుస్సప్తతిసింహాసనాధిపతులును బ్రహ్మరాక్షసుండునుమూకవైష్ణవుండును మొదలయినస్వామిస్వాములు వీరియందు విభూతిద్వయం బుడయవరులకు స్వాధీనంబుగా నొసంగుకతన శ్రీరంగధాముండుయతీంద్రప్రభావ ప్రకాశకుం డయ్యె నీ సంబంధిసంబంధుల కెవరి కేది లిఖితంబు వ్రాసి పంపించిన మోక్షం బిచ్చెద నని ప్రతిజ్ఞ యొనర్చినకారణంబున శ్రీ వేంకటేశుండును రామానుజమాహాత్మ్య ప్రకాశకుం డయ్యె మఱియును. 22

సీ. దేశికోత్తములతోఁ • దిరుమల కేఁగుచు, యతిరాజు మార్గమ • ధ్యమునవిల్వఁ
దుంబయాఱ్కొండయం • దొక్కగోపాంగన, దివ్యదధ్యాజ్యముల్ • దెచ్చి యిచ్చి

యారగించినమీఁద • యతిపతిఁ గని దధి, క్రయ మడిగిన యతి • రాజు కృపను
వరదార్య యీగోప • వనితకు శ్రీపాద, తీర్థప్రసాదముల్ • దెచ్చి యొసఁగు

తే. మనిన వరదార్యుఁ డార్యాజ్ఞ • న ట్లొనర్పఁ, బాదతీర్థప్రసాదాను • భవముచేత
జ్ఞానవతియయ్యె నాగొల్ల • చాన యనుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర.

సీ. ఇను మొకరసమున • హేమించుపగిది శ్రీ, పాదతీర్థము సోఁకి • పాపజాతి
స్వస్వరూపజ్ఞాన • సంపన్నయై పల్కె, నీకు సద్గురునకు • నెయ్యి పెనఁగు
కలిగిన ట్లిచ్చితిఁ • గాని తత్క్రియ మేటి, కపవర్గ మిమ్ము మ • హాత్మ యనిన
వేంకటేశుఁడు దక్క • వేఱొకఁ డెట్లిచ్చు, మోక్ష మంచును శేష • మూర్తి పలుక

తే. నతఁడు నీమాటవిను నని • యార్యు లనఁగ, వింటిగావున నతనిపేరింట నొక్క
లిఖిత మిమ్మని యడిగెనా • లేమ యనుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర.

సీ. సర్వజ్ఞ వేంకట • శైలనాయక సత్య, సంధ నీసమయము • సంస్మరించి
యీ గోపసుందరి • కిమ్ము మోక్షం బని, లిఖిత మార్యుఁడు వ్రాసి • లేమ కియ్య
నా లేఖఁ గైకొని • యతిరయంబున వచ్చి, కొండపై కెక్కునా • గోపసాధ్వి
కేడుకొండలరాయఁ • డెదురుగా నేతెంచి, యాలిఖితముఁ జూచి • యాదరించి

తే. మోక్షమిచ్చెనునాగొల్ల • ముద్దియకును, గాన యతిరాజమహిమ ప్ర • కాశకుండు
వేంకటేశ్వరుఁడయ్యె నీ • విధమున నని, వాదిభీకరగురుఁ డనె • మోదమలర, 25

సీ. స్వప్నములో యాద • వప్రకాశునకు, యతిపతిసంబంధి • వై తరింపు
మనుచుఁ జెప్పినకత • యజ్ఞమూర్తి వచించు, తర్కమునకుఁ బ్రతి • తర్కమొదవఁ
దడఁబడి పొగడు త్రి • దండికి గనఁబడి, శ్రుతిఁ దెల్పి జయ మిచ్చు • కతనఁ గంచి
వరదుఁడు యతిరాజ • వైభవ మెఱిఁగించె, నట్లు యాదవగిరి • హరియుఁగలను

తే. దోఁచి యతిపతిరమ్మని • తోడుకపోయి, మహినినతనికిసంపత్కు • మారుఁడయ్యెఁ
గాన విదితముఁ జేసెఁ ద • ద్గరిమ నను, వాదిభీకరగురుఁడనె • మోదలమలర. 26

వ. అళగరిస్వామి సంయమీంద్రుని ప్రభావం బెఱింగించిన తెఱం గెట్టి దనిన వివరించెద నొక్కయవసరంబున నద్దివ్యదేశవాసి యై లోకరక్షకుం డగుపుండరీకాక్షుం డెంబెరుమానారుసంబంధు లగువారి కరుళప్పాడిడ నాయిండే ననుచు శ్రీవైష్ణవులు నిటలతటఘటితాంజలిపుటు లగుచు విచ్చేయఁ బెరియనంబితిరువంశంబునం దవతరించిన స్వాములు కొందఱు రా కున్న నాళౌరి వారినుద్దేశించి మీరలు మదీయాజ్ఞోల్లంఘనంబు సేయుటకుఁ గారణం బేమి తెలుపుం డనిన

దేవా యతీంద్రుఁ డస్మద్వంశాలంకారభూతుం డయినమహాపూర్ణార్యులశిష్యుం డు గావునఁ దత్సంబంధంబు ప్రధానంబు చేసి మీరు పిలిచితిరి గావున నమ్మహాత్ముని కాచార్యవంశ్యుల మగుటంజేసి పవిత్రక యుంటిమి గావి వేఱొకతలంపు న లే దని వారు విజ్ఞాపనం బొనరించిన విన నవధరించినయళగరిస్వామియు దశరథవసుదేవాదిరాజసత్తములు నాయందుఁ బుత్రప్రపత్తిఁ జేసినవిధంబున నున్నది మీ రెంబెరుమానారునం దొనర్చినశిష్యప్రపత్తి యని యాన తిచ్చి మఱియొకనాఁడు కిడాంబియాచ్చా ననుదేశికేంద్రునిఁ గటాక్షించి మీ కభిమతం బగునొకపద్యంబుఁ బఠియింపు మనిన నతండు, శ్లో॥ అపరాధసహస్రభాజనం పతితం భీమభవార్ణవోదరే। అగతిం శరణాగతం హరే—అని యాశ్లోకంబు వచించిన నెంబెరుమానారు సకలచేతనులకు గతి యై యుండ మీ కిట్లు వచింప నర్హంబు గా దని యాన తిచ్చెం గావున నళగరిస్వామి యతీంద్రునిప్రభావప్రకాశకుం డయ్యె మఱియును దిరుక్కురుంగుడినంబియు శ్రీపరాంకుశయోగీంద్రుండును శ్రీమన్నాథమునివరుండును శ్రీయతీంద్రునిమాహాత్మ్యంబు ప్రకటితంబు గాఁ జేసిన క్రమం బెట్టి దనిన, 27

సీ. కోరి తిరుక్కురుం•గుడినంబి యతి రాజు, నాశ్రయించి రహస్య••మరసెఁ గాన
బైల్పుచ్చె గురునిప్ర • భావ మట్లు శఠారి, తనమానసమునఁ ద్రి • దండపాణి
శాంతు భవిష్యదా • చార్యు నేత్రోత్సవ, శ్రీకరు సాక్షాత్క • రించి మించి
కండో మనుచుఁ బాడెఁ • గాన యతీంద్రుని, దివ్యప్రభావంబు • తేటపఱచె

తే. శఠజిదాత్తభవిష్యదా • చార్యవిగ్ర, హార్చచేఁ దెల్పెసంయమీం • ద్రాతిశయము
నెల్లవారికినాథము • నీంద్రుఁ డనుచుఁ, వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 28

వ. అట్లాభవిష్యదాచార్య విగ్రహంబు నాథపద్మాక్ష రామయామునార్యాది దేశికులచేఁ గ్రమార్చితంబై శ్రీరంగంబునందు భగవద్రామానుజచరమవిగ్రహసన్నిధానవర్తియై యుండు నని శ్రీ మహాపూర్ణ దేశికోత్తముం డిమ్మహాత్మునిమహిమ యెల్లవారికి దెల్లముగా నెఱింగించిన తెఱం గెట్టిదనిన. 29

సీ. దాశరథ్యార్యాది • దేశికోత్తములతోఁ, గూడి మహాపూర్ణ • గురునియింటి
కెంబెరుమానారు • లేఁగుదెంచినఁ జూచి, పెరియనంబియు లేచి • ప్రేమతోడ
ధరణిపై సాష్టాంగ • దండప్రణామముఁ, గావించి మిగుల స • త్కార మొదవఁ
జూచియిట్లనియెఁ ద • త్పుత్రయత్తుళాయమ్మ, యయ్యమీశిష్యుఁడు • యతివరేణ్యుఁ

తే. డితని కిట్లాచరించితి • వేమి యనిన, హరికి ముం దుద్ధవాక్రూరు • లట్లు గురుఁడ
నైతి నీతని కనియె న • య్యార్యుఁ డనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. కావెరిలో నవ • గాహన మొనరించి, వైష్ణవౌఘముతోడ • వచ్చుచుండఁ
దిరువీథిలో యతి • దేవుఁ డనుఁగొని, స్వగురుఁడు భక్తితోఁ • జాఁగి మ్రొక్క
నతఁడు సాష్టాంగ్రహ • మంజలిఁ గావించి, చన స్వామి దే మని • స్వాములడుగ
నార్యుతలంపున • కర్హ మదే యని రాజు పల్క న • య్యార్య లతని

తే. కాతలం పెట్టిదో చెప్పు • మనిన వారి, కస్మదాచార్యు లాయర్ధ • మాన తియ్య
నర్హ లని పంచె వారిన • య్యార్యుఁ డనుచు, వాదిభీరగురుఁడనె • మోదమలర.

సీ. పూర్ణార్యుఁజూచి యా • బుధజను లెల్ల మోదిచ్చి, సంశయమడుగ నా • సభ్యుఁడనియె
యామునార్యుఁడు వైష్ణ • వాన్వితుఁ డై వచ్చు, చున్నట్లుదోఁచిన • నుదయవరుల
భక్తి మ్రొక్కితి, నాళవందారుపి, మ్మట నార్యపూర్తి ల • క్ష్మణమునీంద్రు
లకుఁ గల్గిన ట్లన్యు • లకు లే దనుచుఁ జెప్పి, సచ్ఛాత్రునకు సదా • చార్యునకును

తే. వాసి లే దనిగురుఁ డెంచి • వరకుమారుఁ, బుండరీకాఖ్య సంయమి•భూమిపతికి
శిష్యుఁగాఁ జేసిమోదముఁ • జెందెననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

వ. తిరుక్కోట్టియూరినంబి యీయతిక్షితీంద్రునివైభవంబుఁ దెలిపినక్రమం బెట్టి
దనిన. 33

సీ. తిరుమంత్ర మొక నాఁడు • దేశికుల్ వినుచోట, గోష్ఠి గహనపూర్ణ • గురువరుండు
పిలిపించి యరసి యా • భిక్షుభూపాలుని, పరసమృద్ధికి మెచ్చి • పరమకృపను
మాపాలియెంబెరు•మానారె ర మ్మని, పిలిచి కౌఁగిటఁ జేర్చి•ప్రీతిఁ జెంది
మహిలోన నెంబెరు • మానారె దర్శన, మని మనశాస్త్రముల్ • వ్యవహరించు

తే. ననుచు శ్రీవైష్ణవుల కెల్ల • నానతిచ్చెఁ, గాన యతిరాజవిభవ ప్ర • కాశకుఁడన
నమ్మహాదేశికుం డ్వరి • నయ్యెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర. 34

సీ. గోవిందమిశ్రులు • గురునికై పఱచి యా, వరపుష్పె ముమ్మాఱు • పొరలి లేచి
నిలిచిన సంయమి • నేత కటాక్షించి, తిరుమలనంబికిఁ • దెలుప నతఁడు
పిలిచి గోవిందమి • శ్రుల కిట్లు పలికెను, గతి యెద్ది గురుతల్ప • గామి కనుచు
నరకమే గతి యని • గురుని కాతఁడు పల్క, నిష్ఫల చేసితి • వెఱిఁగి యెఱిఁగి

తే. యనుచుగురుఁడానతిచ్చిన•నాలకించి, సత్త్వనిధియైనయెంబారు•సద్గురునకు
మగిడియొకమాట పల్కెనీ • మాడ్కినసుచు, వాదిభీకిరగురుఁడనె • మోదమలర.

సీ. చీమ కుట్టక గడ్డి • చిగ్రుపల నొరయక, తిరుమేను పొన్నుపై • మెఱయు చుండ
దేవరవారు ని • ద్రించిరఁ జాలును, వీఁడు దుర్గతి కేమి • వెఱవఁ డనుచు
నెంబా రనినసూక్తి • కెంబెరుమానారు, హర్షింప నతని కి • ట్లనియె నంబి
యయ్య శ్రీరామాయ • ణార్థముఁ దెలియుము, నొక్క సంవత్సర • మ్మంటి విచట

తే. నీకుఁ దగువస్తువొకటియ్య • లేక పోతి, నను మ జింతింపగుడునక • య్యతివరుండు
వినతి చే సిట్లు దా • న్న • పంచె ననుము, వాదిభీకరగురుఁ డనె • మోదమలర,

సీ. స్వామి మీసన్నిధి • సకలవస్తువులందు, దాసున కొక టియ్యఁ • దలచి తేని
ఘనఘుని నెంబారు • నంబుఘారాపూర్వ, మడిగేని కిమ్మని • యతివరేణ్యుఁ
డడిగిన నాతని • కాతిరుమలనంబి, యెంబారు నొసఁగి య • తీశభాసు
రా ఘ్రిపద్మములందు • నాత్మతనూజు రా, రామానుజార్యాదుల • నాశ్రయింపఁ

తే. జేసెఁగావున సంయమి • క్షితిమహేంద్రు, వైభవము తేటపఱిచెను • వైష్ణవులకు
నమ్మహాత్మునిఁ దలఁచెద • నాత్మననుము, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. మఱియుఁ దిరుమలయాండాను త్రిదండమండలేశ్వరుని ప్రభావంబుఁ దెలియ వివరించినక్రమం బె ట్లన్న నక్కూరమాలాధరగురుండు యతీంద్రునకుఁదిరువాయ్మొళికర్థం బాన తిచ్చు చున్నసమయంబున యఱియక్కాలత్తుళ్ళే యనుపాశురంబు ప్రస్తుతంబైననప్పాట కొకయర్థం బమ్మాలాధరగురుండు వచింప యతీంద్రుఁడు డపకారస్మృతివిషయంబు గా మఱియొకయర్థంబుఁ జెప్పిన విని తిరుమాలెయాండా నిట్టివిశ్వామిత్రంబురచింప నేర్చిననీకుఁ సంప్రదాయార్థంబులువినఁబని యేమి యని యుపరితనగ్రంథంబుఁ జెప్పక చాలించిన మఱికొన్నిదినంబులకు గోష్ఠిపూర్ణుండు విచ్చేసి రంగపతికి మంగళాశాసనం బొనర్చి మాలాధరదేశికేంద్రునిఁ గని సముచితసంస్కారం బొనరించి యమ్మహాత్మునిచే సమర్చితుండై సముచితాసనంబునం గూర్చుండి యమ్మాలాధరగురుండు దెలుప నతీతవృత్తాంతం బంతయుఁ దెలిపి యగ్గురూత్తము నుద్దేశించి మహాత్మా మన మిరువురమాళవందారుసన్నిధిని తిరువాయ్మొళియర్థం బెఱుంగు చుండ యఱియక్కాలత్తుళ్ళే యనుపాట ప్రస్తుతం బైన నప్పాశురంబునకు యామునాచార్యుండు మన మిరువురమునాకర్ణింప నొకయర్థంబుఁ బ్రసాదించె నంతట మీ రాచమనార్థంబు విచ్చేసితిరి కావున రెండవయర్థంబు మీచే శ్రుతంబు గాదయ్యె నప్పుడే నాయర్థంబు విని యుండితి యతీంద్రుం డస్మచ్ఛ్రితం బయినయర్థంబె యుపన్యసించె నీయతీంద్రున కాళవందారునెమ్మదిం దోఁచినయర్థంబేకాని వేఱొక

యర్థంబు ప్రసిద్ధంబుగాదు గావున నీయర్థంబు ప్రామాణికతమంబని యొప్పందగు నదియునుంగాక సాందీపనికడఁ గృష్ణుం డధ్యయనం బొనర్చినట్లుగా దెయీ యతీంద్రుఁడు మీకడఁ దిరువాయ్మొళియర్థం బాకర్ణించుటయని తిరుక్కోట్టి యూరినంబి వాక్రువ్వ విని విస్మయం బంది తిరుమాలెయాండా నాసంయమీం ద్రునిం జూచి యతీంద్రానీవొక్కనాఁ డైన నాళవందారుతో సంభాషించియె ఱుంగవమ్మహాత్మునితిరువుళ్ళంబున నున్నయర్థంబెల్లెఱింగితివన్న యతీంద్రుండు కరకమలంబులు మోడ్చి యద్దేశికేంద్రు నుద్దేశించి మహాత్మాయామునాచార్యవర్యున కేనేకలవ్యుఁడఁ గానో యని యాన తియ్య విని హర్షించి యదియొకయవతార విశేషం బని నిశ్చయించి భక్తిపూర్వకంబుగా సాష్టాంగదండప్రణామంబుగావించి మహాత్మునితిరువడిత్తామరలయందు సుందరత్తోళుడయా ననునిజకుమార శేఖరు నాశ్రయింపఁజేసెంగావునఁ దిరుమాలెయాండాను సంయమీంద్రునివిభవంబు ప్రకాశింపంజేసెనింక నాళ్వారుతిరువరంగప్పెరుమాళరయరు యతీంద్రునివిభ వంబు బైల్పుచ్చినక్రమం బెట్టి దనిన యతీంద్రుం డాఱుమాసంబులు తిరువరంగ గురునిదివ్యభవనంబు వసియించి తిరువాయ్మొళి మొదలైనదివ్యప్రబంధంబు లధికరించుచు సకలవిధకైంకర్యంబులు నలుపుచుండి యొక్కనాఁ డభ్యంజనం బొనర్చి యతిసౌరభ్యయుక్తం బగుసుకుమారతరహరిద్రాచూర్ణంబున నుద్వర్తనం బొనర్ప నత్యంతహర్షయుక్తుం డై యగ్గురుండు వత్సా నన్నును నాసర్వంబును స్వాధీనంబు గాఁ జేసికొంటి వని సుప్రసన్నుండై పంచమోపాయనిష్ఠ యుప దేశించి తిరువాయ్మొళియరయరనునిజకుమారకునయ్య తీంద్రునిశ్రీపాదాబ్జంబులం దాశ్రయింపంజేసెం గావునఁదిరువరంగగురుండు సంయమీంద్రునివైభవం బెల్ల వారికిం దెల్లమి గాఁ జేసె మఱియును బ్రహ్మరాక్షసుండునుమూకబాలకుండును యతిస్వామితిరువవతారక్రమంబెఱింగించిన తెఱంగెట్టి దనిన. 38

సీ. నీకడఁ జదువుచు • నిత్యసూర్యగ్రణి, యున్నాఁడు లక్ష్మణ•యోగి యతఁడు
మమ్ముక్తికారణ•మహిమాఢ్యుఁ డని యాద వప్రకాశకునకు • విప్రరాక్ష
సుఁడు చెప్పెఁ గావునఁ, బుడమి యతీంద్రుని, విభవ మెఱింగిరి • వివిధజనులు
కంచిలో ముం దొక•పంచవార్షికమూక, బాలుఁ డేఁడాది గ•న్పడక మగిడి

తే. యెల్లవారికిఁ గనఁబడి•యిచట శేషుఁ, డవతరించెను లక్ష్మణ•ఖ్యాతి ననియెఁ
గానమూఁగయుఁదెలిపెఁ ద, గ్గరిమ ననుచు,వాదిభీకరగురుఁ డనె,మోదమలర.

వ. మఱియునమ్మహాత్మునిశ్రీపాదాబ్జంబులా శ్రయించినమహాదేశికులతనిప్రభావంబు బైల్పుచ్చినప్రకారంబెట్టిదనిన వివరించెద వకుళగనంబి యాచార్యపదంబుదయ

వరులకే ముఖ్యవాచకం బగుటం జేసి యెంబెరుమానారుతిరువడిగళే తంజ మని యానతిచ్చె మఱియును గణ్ణియనూరిసిరియాచ్చాన్ సచేలస్నానపూర్వకంబుగా నార్తిచే నవసన్నుండై దివ్యాజ్ఞఁ బెట్టి యెంబెరుమానారు తిరువడిగళేశరణమ్మని యుండుఁ డని యాశ్రితుల కుపదేశించె నరుళాళప్పెరుమాళెంబెరుమానారు శ్రీయతీంద్రునియాజ్ఞచేఁ దమతిరువడిత్తామర లాశ్రయించినయాచ్చానునకు ననంతాళ్వానునకుఁ దొండనూర్నంబికిమరుధూర్నంబికిని హితోపదేశం బొనర్చియుదయవరొకపిచ్చికమెడఁ దాళఫలంబు గట్టినగతి యిట్లొనరించితిరిమీరలెం బెరుమానారు తిరువడిగళే శరణమ్మని నమ్మి యుండుఁ డని యానతిచ్చెఁ బిళ్ళపిళ్లయాళ్వాన్ తన్నాశ్రయించినయెళిపిలాళ్వా నాభిజాత్యాదిమదంబుచేగర్వించి మనోవాక్కాయకర్మంబులచేఁ బరుల నిరాకరించు చుండ నెఱింగియొకపర్వ కాలంబునఁ దదీయకరణత్రయం బాచార్యదక్షిణగాఁ దనకతనిచే ధారాదత్తంబుఁ జేయించుకొని శ్రీమహాభాగవతులయం దానుకూల్యైకరసుండవై యుండుమని నియమించిన నతం డట్లాచరింప నశక్తుండై యొకవివిక్తస్థలంబాశ్రయించి యస్మదాచార్యులయెడ నార్ద్రాపరాధి నైతినని దుఃఖింపఁ దెలిసి యమ్మహాత్ముం డేతెంచి వత్సా నీకు దుఃఖపడఁ గారణం బేమి యనియడుగఁ దనమనోగతం బైన యర్థం బతం డాయాచార్యున కెఱుకపఱుప విని యద్దేశికేంద్రుం డతని నుద్దేశించి రాజదండభయంబుచేఁ బరుల విషయంబుగాఁ గాయికాపరాధంబు మనుష్యునకు సంభవింపనేరదు. శ్లో॥ యదీచ్ఛసి వశీకర్తుం జగదేకేన కర్మణా। పరాపవాదసస్యేభ్యో గాశ్చరన్తీర్నివారయ ॥ అనియెడున్యాయంబునఁ బరాపవాదవాక్యంబులుడిగియుండు మింక మానసాపరాధంబు లుదయించె నేని యనుతాపంబుఁ జెంది భగవద్రామానుజవరణారవిందంబులే శరణంబని యధ్యవసించితివేని యాయధ్యవసాయంబు. శ్లో॥ జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతేర్జున। నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే॥ అనియెడుభగవదుక్తిక్రమంబుగా మానసికాపరాధంబుల నశింపఁ జేయు ననియానతిచ్చి నిజనివాసంబునకుం జనియె నంత నతండు స్వగురూపదిష్టక్రమంబునఁ గాలంబుజరుపుచుఁ గృతార్థుం డయ్యె మిళహాళ్వానొక్కనాఁడు ఛందోమయుండైన గరుత్మంతునియంశంబుచే నవతరించిన దాశరథిసూరిపురందరునితో శాస్త్రవాదంబు సేయ నుత్సహించిన మనము శపథం బొక్కటి చేసికొనియెద మని మొదలియాండా నాన తియ్యఁ బరాజితుండు జేతను వహించుటే శపథం బని యతండు పలుకనీయర్థంబు సమీచీనం బని దాశరథిసూరి యంగీకరించి విశిష్టాద్వైతపక్షం బవలంబించి బలవత్ప్రమాణ

తర్కశతంబుల నుడువ నవి యన్నియును వధియించి బహువిధంబుల ఖండించి యబాధితబహుప్రమాణతర్కసహస్రంబులుపన్యసించి సిద్ధాంతంబు స్థాపింప నతండు ప్రత్యుత్తరముఁ జెప్పఁలేక 'విజితోఽస్మి' యని నిజభుజస్కంధపీఠంబున వైనతేయుండు విష్ణునిగతి వహించి కొంతదూరంబు చనియలసి మహాత్మా భవదీయశ్రీపాదంబు లాశ్రయించెద నన్నుంగరుణింపుమని ప్రార్థింప 'సాధవో దీనవత్సలాః' అనియెడు న్యాయంబునఁబరమకారుణికుండైన యవ్వాధూలకులాలంకరిష్ణుండును డిగ్గి యతనిం దోడుకొని చని యెంబెరుమానారుతిరువడిత్తామరలాశ్రయింపంజేసి యిమ్మహాత్ముని శ్రీపాదపద్మంబులె ప్రాప్యప్రాపకంబులని విశ్వసింపు మని విధించె నెంబారు శ్రీపరాశరభట్టారకార్యు నుద్దేశించి వత్సా నీవు శ్రీరంగరాజున కభిమానపుత్రుండ వనియు శ్రీవత్సచిహ్నమిశ్రుల కభిమతసుతుండ వనియు సమస్తవేదవేదాంగవేదాంతాదిపారంగతుండ వనియును మదిఁదలంచి ప్రమాదంబుఁ జెందక సర్వదేశకాలావస్థలయందు నెంబెరుమానారు తిరువడిగళే శరణ మ్మనుచు నమ్మి యుండు మిదియె పరమహితం బని యానతిచ్చె శ్రీపరాశరభట్టారకుం డొకసమయంబున నంజియ్యరు నీక్షించి నీవు వేదాంతి యనువిఖ్యాతనామధేయంబుఁ గలవాఁడ వని మ మ్మాశ్రయించితి వనియు మా కాచార్యదక్షిణగా బహుద్రవ్యం బర్పించితి వనియు మోస మొందక సర్వకాలంబులయందు శ్రీరామానుజ పదాంబుజంబులే శరణ మని విశ్వసించి యుండు మని యుపదేశించె నంజియ్యరు నంబిళ్ళనుం గటాక్షించి లోకాచార్యుండ వని పేరు గాంచితి వనియుఁ దిరువాయ్మొళికి వాఖ్యానం బొనర్చితి వనియును స్వకీయాతిశయంబుఁ దలంచి పరాకుపడి యుండక నీ వెంబెరుమానారుతిరువడిగళే శరణ మ్మనినమ్మియుండు మని యాజ్ఞాపించె మఱియొకనాఁడు నంబిళ్ళ శివక్కరప్పిళ్ళకడం జని యొక వైష్ణవగృహంబున నిద్రించి యాశివక్కరప్పిళ్ళకై దండగొని మగిడి చనుచున్నసమయంబునం దొకవైష్ణవుండు తద్గృహద్వారవేదికయందు శయనించి త్రోవ కడ్డంబుగా శ్రీపాదంబులు సాఁచి సుఖసుప్తుం డై యున్న వీక్షించి పాదంబులు ముడుచుకొమ్మని శివక్కరప్పిళ్ల పలుక నంబిళ్ళ విననవధరించి భగవదనుగ్రహంబుచే నిఖిలాజ్ఞాననివర్తకం బై ననిరతిశయనిర్మలజ్ఞానంబు లభించి శ్రీ పరాంకుశమునీంద్రుండు శ్రీమహాభాగవతవిషయంబు గాఁ దిరుత్తాళ్వణంగి యని యానతీయ నీవట్లనం దగునా యని యతనిహస్తంబు పరిత్యజింప నతండు శివక్కర యనుతనయగ్రహారంబునకుం జని యందుఁ గొన్నిదినంబులు గురుండుతన్నుఁ బరిహరించె నింక నేనేమి సేయం గలవాఁడ

నని యనుతపించుచుఁ దిరిగి నంబిళ్ళసన్నిధి కేతెంచి సాష్టాంగ ప్రణామం
బాచరించినిటలతటఘటితాంజలిపుటుండై మహాత్మా యుభయనదీ మధ్యస్థవరకర
గృహీతరజ్జుయంత్ర ప్రక్షిప్తపాషాణం బానదీనిర్ఝరమధ్యదేశంబునం గూలు
పోలికభవదీయపాణి పల్లవత్యాగవేగంబున సంసారసాగరమహా ప్రవాహంబునం
బడితి నింక నీదాసచేతనున కేమిగతి యని యత్యార్తుండై విన్నవింప 'క్షమా
సారాహిసాధవః' అనియెడి న్యాయంబున క్షమాసముద్రుండైన యద్దేశికేంద్రుండు
తదీయాపరాధంబు క్షమియించి యింక నెల్లప్పుడు యతీంద్రశ్రీపాదపద్మంబులే
యుపాయోపేయంబులుగా నమ్మియుండు మనుచు నియోగించె నెంబెరుమానారున
కభిమానపుత్రుండైన శ్రీకురుకేశగురుండు పిరిభుత్తూ రనునగ్రహారంబునకుం
జనుదెంచిన వేదశాస్త్రపారంగతుండైన సోమాసియాండానద్దేశికేంద్రునికడఁ
బ్రేమపూర్వకంబుగా శ్రీభాష్యం బధికరించినపిమ్మట నక్కురుకేశగురుండు
మగిడి చనుచుండఁ గొంతదూరంబతనిన మగిడించి మహాత్మా యడియేని
కొక పరమహితం బుపదేశించి నీవు భాట్టప్రాభాకరాదిశాస్త్రంబులయందు
సర్వజ్ఞుండ వనియు శ్రీభాష్యప్రవర్తకుండ వనియు నీ వాసిఁ దలంచి ప్రమా
దంబుఁ జెందక సర్వకాలంబులయందు సంయమీంద్రుని చరణారవిందంబులే
శరణం బని విశ్వసించి యుండు మని విధియించెగోమఠత్తాళ్వార్ తమ
సన్నిధియందు కాకంపాటియాచ్చాంబిళ్ళ యాదరపూర్వకంబుగా శ్రీభాష్యం
బధికరించి యొకహితంబు దాసున కనుగ్రహింపు మనివేఁడుకొనిన నతం
డతనికి నెంబెరుమానారుతిరువడిగళే శరణం బని విశ్వసించి యుండు మని
యుపదేశించె నంగళాళ్వా నొక్కంపాడియాచ్చాంబిళ్లనుం జూచి యార్యసత్త
మా శ్రీరంగనాథుండు నీయెడఁ గోపం బుంచినవేళ నీమది నేమి తలంచితివని
యడుగ నెంబెరుమానారుతిరువడిగళే శరణం బని విశ్వసించి యుండితి నని యు
తం డతని కానతిచ్చె నెళాధూరియమ్మా ళాత్మీయశ్రీపాదంబు లాశ్రయించినవన్ని
రువురుశ్రీవైష్ణవులు తనసన్నిధిని శ్రీభాష్యం బధికరించిభక్తిరూపోపాయంబును
సాపాయం బని విన్నవింప వారికిఁ బ్రపదనం బుపదేశించిన నది దుష్కరం బని
వా రని నట్లాయె నేని యెంబెరుమానార్ తిరువడిగళేశరణంబని యధ్యవసించి
యుండుఁ డని యానతిచ్చె నడివిలాళ్వాన్ తిరునారాయణపురంబున కరిగియుండు
వంగిపురత్తాచ్చి మొదలైన భాగవతోత్తములకు శ్రీభాష్యంబు ప్రసాదింప వారి
యర్థంబు గ్రహింపలేమనిన శ్రీభాష్యప్రవక్త యయిన యెంబెరుమానారు తిరు
వడిగళే శరణం బని నమ్మి యుండుఁ డని యానతిచ్చె శ్రీవేదవ్యాస భట్టార

కుండు యాదవాద్రికిం జనియందు శ్రీరామానుజముని సన్నిధానంబుననేఁ బదిర్వు రునూరులకు శ్రీభాష్యార్థం బుపన్యసింప వారీయర్థంబు భాగీరథీప్రవాహంబుగ తిదు రవగాహం బని విన్నవింప నట్లాయె నేని మనకుం గులదైవతంబైన యెంబెరు మానార్ తిరువడిగళే శరణం బని నమ్మి యుండుం డని యానతిచ్చె నడివిల్ తిరువీధిప్పిళ్ళ భట్టారకుండును దనయాశ్రితుల కట్లుపదేశించె వడుగనంబి యెంబెరు మానారు తిరువడిగళేశరణ మనియు నంబెరుమాళ్ తిరువడిగ ళేశరణ మనియు ననుసంధించు కూరేశదాశ రథ్యాదులనుం జూచి యిరుకరయ రని వాక్రుచ్చె విట్లు భగవద్భాగవత ప్రకటీకృత ప్రభావుండైన సంయమి సార్వభౌమున కసం ఖ్యేయ భగవద వతారంబులందు రామకృష్ణాద్యవ తారంబులకుఁ బ్రాధాన్యంబు గలుగుకొలఁది హారవల్లియందు నాయకరత్నంబునకుంబోలెఁ బూర్వాపరాచార్య మధ్యంబునఁ బ్రాధాన్యం బవ్యాహతంబై విలసిల్లుఁగావున నుత్తారకత్వ విశిష్ట కృపామాత్ర ప్రసన్నా చార్యుండైనయ మ్మహాత్ముని విషయంబు గాఁజేయు కైంకర్యంబు పరమప్రాప్యం బగునది గాన నగ్గురుశిఖామణి యర్చితుండై సంత పించెనేని యష్టోత్తర శతదివ్య దేశావిష్కృత దివ్యమంగళ విగ్రహుండగు శ్రీమన్నారాయణుండా రాధితుండై మిగుల సంతోషించు 'చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరమ్' అని యెడున్యాయంబుగా భగవద్రా మానుజచరితం బం తయు నెవ్వఁడెఱుంగునస్మ దాచార్యాను గ్రహంబుచే బుద్ధి గోచరం బైనయంత యాక్రమంబుగా విన్నవించితిం గావున బాలకులకల భాషణంబుల వినియుల్ల సిల్లు తల్లిదండ్రుల గతిశమ దమక్షమా వాత్సల్యాది కల్యాణగుణ భూషితులగు శ్రీమహాభాగవతులు విననవధరించి వాగపరాధంబులు క్షమియించి యీదాసచేతను నియందను గ్రహంబు సేయం దగుదురు మఱియును. 40

సీ. అంతటనొక్కనాఁ•డాసంయమీంద్రుండు. తనమానసమునందుఁ•దలఁచెనిట్లు
మర్త్యుండ నూతేండ్లు•మనెనేని పూర్ణాయు. విరువదియేండ్లుమా•కెక్కువయ్యె
నరుచి యీసంసృతి•యందు జన్మించెను, నీపదాబ్జంబుల•నీడ నన్నుఁ
జేర్చుకొమ్మని యతి•శేఖరుండు ప్రపత్తి, సలిపిన శ్రీరంగ•శాయి సుప్ర

తే. సన్నుఁడై యిట్లు పల్కెను•సంయమీంద్ర, కాలమానముజో లేమి•మనుఁడ పీవు
తడ విచట నుండు మనిహారి•నుడివెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. ఆర్తిచే యతిపతి•యారంగపతిఁజూచి, యర్థింప నతఁ డిష్ట•మడుగు మనిన
సదయ నాసంబంధి•సంబంధులకు నిమ్మ, నే లభించుపదంబు•నీరజాక్ష

యని యడిగిన హరి,యావర మిడి నేఁటి, కేశవనాఁడు సీ,వీశరీర
ముడిగి నన్నొందుమా,యుడయవరేయని, బహుమతు లొనరించి,పంచినంత

తే. సంయమీంద్రుఁడు చనుదెంచి,స్వమఠ మొంది
సకలహితములు సన్నిధి,సాత్త్వికులకుఁ
జెప్పె మూఁడువినంబులు,చెంద ననుచు
వాదిభీకరగురుఁ డనె, మోద మలర.

సీ. ఆహితోక్తులు విని,యార్యులు భయపడి, స్వగురు విశ్లేషము,సైఁప లేక
యాత్మయాత్రయు దేహ,యాత్రయుఁజాలించి, యుండఁదలంపఁద్రి,దండపాణి
దెలిసి వారికి నాన,తిచ్చె నిట్లనుచును, మీరు దల్చినపని,సూరులార
యాచరించితి రేని,యస్మదీయాచార్య, పరమదేశికుల శ్రీ,పాద మాన

తే. యస్మదన్వయ ముడిగి శ,రారిమతియుఁ, గలఁచి సూరులగోష్ఠికిఁ,గాక క్రింది
పడుదు రని వారి కార్యులు,పలికిరనుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర.

సీ. గురునిసూక్తులు విని,వెఱచి దేశికులింక, మాకేమిగతియన్న,మాన్యుఁడనియెఁ
బదపడి మొకఁడుప్ర,పన్నుఁడైనను నీశ్వ, రాయత్తమగుఁ దదీ,యాత్మయాత్ర
దానికి వగవ గఁ,దగదు దుఃఖించెనా, యాత్మార్పణముమిథ్య,యగునుధ్రువము
ఆత్మకర్మాధీన,మగుదేహయాత్రయు, వగవ రా దందుకు,వగచె నేని

తే. వాఁడు నాస్తికుఁడగునని,వరకృపావి, ధేయుఁడగులక్ష్మణార్యుండు,దెలుపఁ దెలిసి
భక్తి గురునకు వారిట్లు,పలికి రనుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర.

వ. యతీంద్రా యీశ్వరాధీనం బైనయాత్మ యాత్రయందుఁ గర్మాయత్తంబగు దేహ యాత్రయందుఁ జేతనున కన్వయంబు లే దని యాన తిచ్చితిరి యింక వీనికిఁ గాలయాపనం బెట్టి దనిదేశికేంద్రు లడిగిన వారి కమ్మహాత్ముం డి ట్లనియె మహా యత్వ బుద్ధిమాని పరమప్రాప్యం బగుభగవత్కైంకర్యంబు నందన్వయించి యుండవలయు నక్కైంకర్యం బెట్టిదనిన వివరించెద శ్రీభాష్యంబధికరించి ప్రవ చనం బొనర్చుటయు నట్లు సేయ నశక్తుం డాయె నేని శ్రద్ధా పూర్వకంబుగా శ్రీశఠకోప సూక్తు లధికరించి ప్రవర్తింపం జేయుటయు నందుల కశక్తుండాయె నేని శ్రీరంగాది దివ్యదేశంబులయందు నిత్యనివాసం బొనర్చి జాత్యాశ్రయ దుష్ట నిమిత్తంబులగు పదార్థంబులం బరిత్యజించి పరిశుద్ధంబులగు ద్రవ్యంబులు సం గ్రహించి యందు భగవంతునకుఁ బ్రీతిపూర్వకంబుగా నారాధనంబు సేయుటయు

నదియుఁ జేయ నోపఁ డేని సార్వకాలంబు మంత్ర రత్నార్థ మననంబుఁజేయుట
యు నట్లొనర్పం జాలం డేని శ్రీయాదవాచలంబునం దొక్కకుటీరంబు నిర్మించు
కొని యందు వసించుటయు నట్లు సేయం జాలఁ డేని వీఁడుమదీయుండని యభి
మానంబు గలుగు జ్ఞానాధికుండైన యొక్క శ్రీవైష్ణవుని యభిమానంబునం దొదిఁగి
వర్తించుటయు నట్లు ప్రవర్తించు నధికారులకు ముం దెఱింగి వర్తింపం దగు
విషయంబులు మూఁ డమ్మూఁడు విషయంబు లెట్టివి యనిన విశదపఱచెద నను
కూలాత్మలు ప్రతికూల ప్రాణులు ననుభూయచేతనులు నిమ్మువ్వురియం దను
కూలు రెవ్వరన్న శ్రీవైష్ణవులు ప్రతికూలు రెట్టివా రన్నభగవద్ద్వేషు లనుభూయు
లెవ్వరన్న సంసారులను కూలాత్మలం జూచినఁ జందనకుసుమతాంబూలంబుల
మహనీయ పూర్ణ చంద్రికను మలయమారుతంబును నభిమత విషయంబునుం
గన్న చందంబునంజూచి సంతసింపవలయుఁ బ్రతికూల ప్రాణులంజూచిన సర్పా
గ్నివిషాదుల కొలందిఁజూచి వెఱచి దూరంబు గావర్తింప వలయునను భూయులం
జూచినఁ గాష్ఠలోష్టాదుల తెఱంగున నుపేక్ష పూర్వకంబుగాఁ దృణీకరించి
వర్తింప వలయు ననుభూయు లనుకూలించి రేని వారల కాత్మజ్ఞానం బుపదేశించి
యనుగ్రహంబు సలుప వలయుఁగా కున్నవారిని గటకటా యని కృపాదృష్టి నవ
లోకింప వలయు నిట్లొనర్చుటకుం బ్రతిబంధకం బర్థకామప్రావీణ్యం బని తన
మది నెఱుంగ వలయు నర్థకామపరవశుండై శ్రీవైష్ణవులఁ గని యాదరింప కున్న
సార్వభౌముం డగురాజు తాఁగనుంగొన్న పుత్రు నవమానించి నం గనలుచందం
బున సర్వేశ్వరుండు సంగరం బఱుగునర్థ కామంబుల నిమిత్తంబుగాఁ బ్రతి
కూలుర నాదరించిన సార్వభౌముం డగురాజేంద్రుని మహిషి యొడిగట్టి భైక్ష్యం
బెత్త రాజున కపద్యావహంబు గావున నాసార్వభౌముండలిగినట్లు సర్వేశ్వరుం
డతిక్రుద్ధుండగు నర్థకామార్థసిద్ధికై యనుభూయుల నాదరించిన వరరత్నంబునకు
వరాటకంబునకు వాసిగనంబడనట్లు తనకుదయుంచిన నిర్మలజ్ఞానంబు చెడుం
గావున వీనిని మహోపకారుం డగుహరియాచరింపఁ డనినిజాశ్రితు లైనయద్దేశి
కేంద్రులకు సంయమీంద్రుం డాన తిచ్చె నంత,

సీ. శ్రీరంగనాథుని,చెంతకు భట్టార, కార్యునిఁ దోడ్కొని,యరిగి మొదటఁ
దిరుమాల శఠకోప,తీర్థప్రసాదాది, బహుమతు లన్నియు,భట్టరయ్య
కిప్పించి పిదప య,తీంద్రుఁడు తాఁ గొని, దర్శనస్థాపన,దక్షుఁ డీతఁ
డిఁకమీఁద నని దేశి,కేంద్రుల కెల్లను, బల్కి భట్టరు కిట్లు,పల్కె వత్స

తే. మేలునాఁటను వేదాంతి•మేటిపండి, తుఁడు గలఁ దతనిదర్శన,మార్వహాని గఁ
జేయు మీ వని యతిపతి•చెప్పె ననుచు. వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. కృప భట్టరార్యుల•కేలూతఁ బూనక, సాత్త్వికౌఘముతోడ•స్వమర మొంది
శ్రీమదర్చన మార్చి•శ్రీవైష్ణవుల కెల్ల, శ్రీపాదతీర్థము•చెంద నిచ్చి
యఖిలవైష్ణవజను•లారగించినమీఁద, దాశరథ్యార్యాది•దేశికులకు
నార్యులఁ గొందఱు•నప్పగించి పదంబ్రుము, లాన మీ రవివేక,మాచరింప

తే. వలదు మమ్మొడఁబాసిన•వగపుఁజెంది, యనుచు లక్ష్మణయోగీంద్రుఁ,డానతిచ్చి
తనదువిభవముఁ జాలింపఁ•దలఁచె ననుచు, వాదిభీకరగురుఁ డనె,మోద మలర.

సీ. అర్చక పరివార,కాదిరంగేశ్వర, కైంకర్యపరు లంతఁ,గాంచి గురునిఁ
జేమోడ్చి యున్నంత•శ్రీయతీంద్రుఁడు వారి, కంజలి గావించి•యనియె నిట్లు
మాయపరాధముల్•మదిఁ గల్పఁబోకుఁడీ. మాకు రంగేశుని•మాఱు మీర
లని పల్కు-యతిపతి•కనిరి వా రిట్లని, యఖిలాత్మ జీవాతు•లైనమీరుఁ

తే. దప్పు లెట్లగు మిమ్ముఁ బాసి•ధరణి నింక
బ్రతికెదము మేము జీవచ్ఛ•వంబు లనఁగ
ననుచు దుఃఖింప నార్యుఁ డి•ట్లనియె ననుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర.　　48

సీ. కలిహడం డిల కలం,కారభూతుం డగు, శ్రీరంగపతి మీకు,సేమ మొసఁగ
యోగనిద్రాసక్తి•భోగిరాట్ఛయనుఁ డై, యున్నాఁ డతని కింక•యోగ్యకాల
ములయందుఁ గైంకర్య•ములుసేయుచును మది, మమ్ముఁదలంపుచు,నెమ్మినమ్మి
యుండుఁడీ యని చెప్పి•యుడయవ రాత్మవి, శ్లేషధీయవులైన•చేతనులకుఁ

తే. బలికె ని ట్లని భయపడ,వలదు మిమ్ముఁ, బ్రోవ సర్వాత్మకుండ నై,నే వసింతు
నిచటననిపల్కె-నాసంయ,మీంద్రుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. పూర్ణదేశికపదాం•భోజముల్ శిరమునం, దురముపై నక్షిబా•హువుల నద్ది
యామునగురుపద,తామరసంబులు, ధ్యానించుచును మది • యతివరుండు
ఎంబారుతొడపైని•నింపొంద శిరముంచి, యాంధ్రపూర్ణులతోడ•నంఘ్రులుంచి
కరపద్మముల మోడ్చి•కరుణాకటాక్షవీ, క్షణసుధ నాశ్రిత•సస్యములను

తే. దడిపి కనుమోడ్చి తిరుమేను•విడిచి వెడలి, సర్వచేతనరక్షైక•సాంద్రశక్తి
శేషుఁ డై రంగధామునిఁ•జెందె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. స్వవియోగ మోర్వంగఁ•జాలనిబుధులకై, యలరాముఁడర్చాత్ముఁ•డై యట్లు
వాసుదేవత్యక్త•భాసురాంగము బ్రహ్మ•, దారు వై నీలాద్రిఁ•దనరినట్లు
రామానుజార్యచ•రమవిగ్రహము రంగ, పతికడ నర్చగాఁ•బరిఢవిల్ల
నలభూతపురి వేంక•టాద్రి యాదవగిరి, శ్రీరంగములయందు•శ్రీయతీంద్రుఁ

తే. డాదిమధ్యాంతిమార్చాత్ముఁ•డై వసించె, ధరణి నిప్పటి కైనను•ధన్యులైన
వారు సేవింపఁ గలవారు•వారి ననుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర.

సీ. తలఁపఁ బంచాశదు•త్తరనవశతశక, విభవవత్సరచైత్ర•విమలషష్ఠి
గురువారమున భూత•పురి నార్ద్రఁ గేశవ, క్షితిదేవునకుఁ గాంతి•మతికిఁ బుట్టి
చేతనరక్షకై •క్షితి నూటయిరువది, సంవత్సరము లుండి•శకము వేయు
డెబ్బదియేండ్లచే•రీవిగా విలసిల్లి, మతివిభవతపస్వి•మాసమునను

తే. దశమి శశివారమున నార్ద్ర•తారయందు, శేషమూర్తియతీంద్రుఁడ•శేషరక్షఁ
జేసి శ్రీరంగధామునిఁ•జెందె ననుచు, వాదిభీకరగురుఁ డనె, మోదమలర.

వ. తదనంతరవృత్తాంతం బెట్టి దనినఁ జరమోపదేశ నియమనచరమతదీయాను వర్తనాదిశేషధర్మజ్ఞానానుష్ఠానంబులు పరమాచార్యం డగు శ్రీయామునాచార్యవర్యునకే యర్థతమంబులు సంసారిస్థితియం దరుచిని వేదనంబును దదనుగుణంబుగా భగవత్పాదారవిందంబు లాశ్రయించి తదుపదిష్టచరమార్థనిశ్చయాత్మక జ్ఞానంబు కలిగి యుండవలయు నని యుపదేశించుటయుఁ జరమకాలపర్యంతంబు స్వాభిమానాంతర్గతుల కుపకారార్థంబుగా వృత్తివిశేషం బానతిచ్చుటయుఁ జరమదశయందు స్వాభిమతచరమాధికారస్పర్శవిశేషంబును బూర్వాపరగురుపరంపరాహారయష్టిమధ్యగతనాయకరత్నం బగు శ్రీరామానుజమునీంద్రునకే చెల్లుంగానఁ దదీయదివ్యచరితంబు శ్రీరామకృష్ణచరిత్రంబులమాడ్కి శ్రీవైష్ణవులకు సదానుసంధేయం బగు. 52

మొదలియాండాన్-త. శ్లో॥ చైత్రే పునర్వసూజాతం యతిరాజపదాశ్రయమ్।
వాధూలకులధౌరేయం వన్దే దాశరథిం గురుమ్॥

తీర్థ-త. శ్లో॥ పాదుకే యతిరాజస్య కథయన్తి యదాఖ్యయా।
తస్య దాశరథేః పాదౌ శిరసా ధారయా మ్యహమ్॥

తిరుక్కురుహప్పిరాన్ బిళ్ళాన్‌తనియను.

శ్లో॥ విఖ్యాతో యతిసార్వభౌమజలధేశ్చన్ద్రస్సమత్వేన యః
శ్రీభాష్యేణ యదన్వయాస్సువిదితా శ్శ్రీవిష్ణుచిత్తాదయః।

వ్యాఖ్యాం భాష్యకృదాజ్ఞయోపనిషదాం యో ద్రావిడీనాం వ్యథా
త్పూర్వం తం కురుకేశ్వరం గురుపరం కారుణ్యపూర్ణం భజే॥

కిడాంబియాచ్చాన్ తనియను.

శ్లో॥ శ్రీవిష్ణుచిత్తచరణాంబుజసంశ్రయాయ, చేతోమమస్పృహయతేకిమతఃపరేణ।
నోచేన్మమాపియతిశేఖరభారతీనాం, భావః కథంభవితుమర్హతి వాగ్విధేయః॥

సదాధూరియాళ్వాన్ తనియను.

శ్లో॥ యస్మిన్పదంయతివరస్యముఖాత్ప్రతీతంనిష్కామమేవవిదధేనిగమాన్తభాష్యమ్।
తస్యైవతం భగవతఃప్రియభాగినేయం వన్దే గురుం వరదవిష్ణుపదాభిధానమ్॥

సోమాసియాండాన్-త. శ్లో॥ నౌమి లక్ష్మణయోగీన్ద్రపాదసేవైకసాధనమ్।
శ్రీరామం క్రతునాథార్యం శ్రీభాష్యామృతసాగరమ్॥

నడివిలాళ్వాన్-త. శ్లో॥ యేన ప్రోల్లసతే నిత్యం గార్గ్యవంశమహోమ్బుధిః।
మన్మహే తు సదా చిత్తే మధ్యమార్యం కళానిధిమ్॥

అరుళాళప్పెరుమాళ్-త. శ్లో॥ కార్తికే భరణీజాతం యతీన్ద్రాశ్రయ మాశ్రయే।
జ్ఞానప్రమేయసారాభివక్తారం వరదం గురుమ్॥

అనంతాళ్వాన్-త. శ్లో॥ చైత్రే చిత్రాసముద్భూతం రామానుజపదాశ్రయమ్।
వన్దే శ్రీమదనన్తార్యం కల్యాణగుణసాగరమ్॥

శ్లో॥ అఖిలాత్మగుణావాస మజ్ఞానతిమిరాపహమ్।
ఆశ్రితానాం సుశరణం వన్దేఽనన్తార్య దేశికమ్॥

యాచ్చాన్. త. శ్లో॥ యో వై వైష్ణవ శేషత్వపర్యన్తం పరమాత్మనః।
శేషత్వ మాతనో జ్ఞేయం యజ్ఞేశం తం సమాశ్రయే॥

వడుగనంబి-త. శ్లో॥ రామానుజార్యచరణప్రవణం పరదేవవత్।
పరిపూర్ణ మహం వన్దే పరజ్ఞానపయోనిధిమ్॥

డెబ్బదినలుగురు సింహాసనస్థులసముదాయ-తనియన్లు

శ్లో॥ రామానుజార్యశ్రుతిమౌళిభాష్య మర్థం రహస్యత్రవిదశ్రుతేర్చ।
సంప్రాప్య తే నైవ గురూకృతాస్తాన్ భజే చతుస్సప్తతిపీఠసంస్థాన్॥

వ, మారొన్నిల్లామారుధిచ్చిరియాండాన్ తనయంతిమదశయందు సర్వేశ్వరుని సంశ్రి
తవాత్సల్యంబు దలంచెనేని చేతస్సునకు దుఃఖింపం బనిలేదు-తనసుకృతదుష్కృ
తంబులు దలంచెనా యించుకైనను సుఖింపఁ డని యానతిచ్చె. ౦4

త, శ్లో॥ జ్ఞాతుం కూరకులాధిపం క్రిమిగళాత్ప్రాప్తాదం ప్రేషిత
శ్రీరామానుజేన కోసలపతిం దృష్ట్వా తదీయస్థితిమ్।
ప్రత్యాప్తస్త్వరయాపరాన్తకపురాత్కల్యాణవాపీతటే
యోఽసౌ మారుతి రిత్యశంసి విబుధైస్తస్మై నమః కుర్మహే॥

వ. మఱియుఁ ధనుర్దాసుండు చరమకాలంబున మూఁడు జన్మంబులందుఁ దనకుమహాపరాధం బొనర్చినశిశుపాలదంతవక్త్రులను దనపదంబునకుం జేర్చుకొనియె నట్టి భగవంతుం డనంతజన్మంబులందు ఘోరాపరాధంబు లొనరించినన న్నెట్లు విడుచు ననియె నీసూక్తికిం దాత్పర్యంబుసమాశ్రయణంబునకు ముందు తానాచరించిననిఖిలాపరాధంబు లుపహారంబు లై యీశ్వరస్వీకారంబునకు హేతుభూతంబు లని యెఱుంగ వలయు-శ్రీధనుర్దాసుండును దనయవసానకాలంబున శ్రీవైష్ణవులనందఱినిం బిలిపించి తదీయశ్రీపాదతీర్థం బుజ్జీవించి యపరాధక్షమాపణంబుఁ జేసికొని మదీయవిశ్లేషంబు సహింపలేక యవివేకం బొనరింపవల దని పొన్నాచ్చియారున కాజ్ఞాపించి శ్రీరామానుజశ్రీపాదంబులఁ దనశిరంబుననురంబునందిరునేత్రంబులం దుంచుకొని యమ్మహాత్ముని దలంచుచుఁ దిరునాటికింజనియెనంతఁ దద్దేవి యగుపొన్నాచ్చియారును దద్విశ్లేషజనితదుఃఖంబు సహించుకొనిద్వారసమ్మార్జన ప్రోక్షణరంగవల్లీ ప్రభృతినానావిధాలంకారంబులు స్వగృహంబునకుం గావించి శ్రీయతీంద్రుండును శ్రీమహాభాగవతులును నిత్యస్నానం బాచరించు కావేరీతీర్థఘట్టంబునకుం జని యం దవగాహనంబుఁ జేసిమంత్రరత్నం బనుసంధించుచుఁ దీర్థఘటంబెత్తుకొనివచ్చి యచ్చరమవిగ్రహంబున కభిషేకం బొనర్చి శ్రీవైష్ణవులతోడం గూడి శ్రీచూర్ణ పరిపాలనం బొనర్చికోవెలనుండి కొనివచ్చు తిరుమాల తిరుప్పరివట్టము మొద లగు భగవచ్ఛేషభూతమంగళద్రవ్యంబులచే శ్రీవైష్ణవాలంకారంబు లాచరించినఁ దచ్ఛేషభూత శ్రీచూర్ణాదిదివ్యద్రవ్యంబులు స్వాము లందఱు అంగీకరించి తదీయభవ్యచరమవిగ్రహంబు దివ్యవిమానంబునం దుంచి యతీశ్వరు లేకాంతు లాచార్యపురుషులాదిగాఁ గల శ్రీమహాభాగవతులు నూత్తందాది యనుసంధించుచుఁ గొనిపోవుచుండ నప్పొన్నాచ్చియారును నతని దివ్యవిమానంబు చూపడుదనుక ద్వారప్రదేశమునం దుండి కృతాంజలిపుటయై

సేవించుచు నది కనఁబడ కున్న నమ్మహాభాగవత విశ్లేషజనిత సంతాపం బోర్వ లేక మోహంబుఁ జెంది పుడమిం బడి తిరుమేను విడిచి తిరునా డలంకరించె నంత నా వృత్తాంతం బెఱింగి స్వామి లందఱును మగిడి విచ్చేసి యాసత్యవతికి శ్రీచూర్ణ పరిపాలనాదిచరమకృత్యంబు లొనరించి యప్పిళ్లైయొఱంగావెల్లి దాసుని శేడం గూడఁ దిరుప్పళ్ళి యొనర్చి రని సంప్రదాయప్రసిద్ధంబు. 55

ధనుర్దాసుని-త-శ్లో॥ జాగరూకధనుష్పాణిం పాణౌ ఖడ్గసమన్వితమ్।
రామానుజస్పర్శవేదిం రాద్ధాంతార్థప్రకాశకమ్॥

శ్లో॥ భాగినేయద్వయాయాతభాష్యకారభయాపహమ్।
రంగేశమఙ్గళం కుర్వన్ ధనుర్దాస మహం భజే॥

వ. నంబితిరువళుధినాదాసుం డాత్మీయచరమదశయందుఁదనవిశ్లేషంబు సహింప లేక దుఃఖించుచు జాంఘ్రిపద్మ సంబంధి నొక సాత్త్వికునిం జూచియోమంద ప్రజ్ఞా ప్రాప్తం బైన కాలం బుపేక్షించి యస్మదాచార్యుం డగు శ్రీపరాశరభట్టారకా ర్యునివేదాంతవ్యాఖ్యానవైఖరీస్వనం బాకర్ణించుచున్నఁదదాకర్ణన ప్రతిబంధకం బుగా నేల యేడ్చెద వని యాన తిచ్చెం గావునఁ దదీయాభిప్రాయంబున సదా చార్యవ్యాఖ్యానవచనస్వారస్యాసక్తి యుపవర్గప్రాప్తిసుం దరుచిఁ బుట్టి మ నవి ప్రాజ్ఞులచేఁ దెలియం దగు మఱియును పిళ్ళతికుఱవపిరశనాట్టరయరు తమయంతిమ సమయంబునందుఁ గ్లేశింప నిజనాన్ని ధ్యవర్తులగుస్వాములందఱు పరస్పరముఖా వలోకనంబు సేయ నమ్మహాదేశికుండు వారియభిప్రాయ బుఁ దెలిసి ప్రాజ్ఞులారా సంసారిచేతనుల ప్రభూతదుఃఖంబుఁ దలంచి వచ్చితిఁ గాని వేఱేమియు వీనికిదుః ఖకారణంబు లే దని యెట్లంటి రేని సకృత్ప్రణామరూపం బగు ప్రపత్తిరూప సులభోపాయంబుచే నత్యంతహేయసంసారంబు బాసి పరమపురుషార్థలక్షణదు ర్లభమోక్షంబు లభియించెద మని యెఱుంగక యధోగతియందుఁ బడుదు రని దుఃఖించితి నని స్వాభిప్రాయంబు దెలిపె నాసూక్తి యాలకించి వారందఱు మి గులసంతసించిరిగానఁబరదుఃఖాసహిష్ణుత్వంబును బరసమృద్ధైక్య ప్రయోజనత్వం బు నీ రెండును శ్రీవైష్ణవుల కసాధారణధర్మంబు లని తెలియ వలయుమఱియు శ్రీరామానుజపదచ్ఛాయా భూతుం డగుగోవిందమిశ్రుండు స్వకీయగురుచరమా వసరంబునందుఁ దదనుగ్రహంబుచేఁ దదీయదివ్యశ్రీపాదపద్మయుగంబు శిరసావ హించి యమ్మహాత్మునియాజ్ఞచేఁదత్ప్రసాదలబ్ధార్థ విశేషంబులు గొన్ని శ్రీపరాశర

భట్టారకార్య ప్రముఖమహాదేశికులకుం బ్రతిపాదించుచుఁ గొన్నిదినంబు లుండి నిజాచార్య విశ్లేషజనితార్తి సహింపలేక తల్లినిం బాసిన స్తనంధయశిశువుమాడ్కి మిగుల దుఃఖించుచు నొక్కనాఁడు శ్రీరంగరాజశ్రీపాదసన్నిధికిం జని తద్దివ్యమంగళవిగ్రహం బాపాదమస్తకం బనుభవించి ప్రేమపూర్వకంబుగా నతని సన్నుతించి యతనియనుగ్రహంబుచేఁ దద్దివ్యతీర్థ ప్రసాదాదిబహుమతి లభించి మోక్షలక్ష్మీ ప్రాప్తికై యతనిచే ననుజ్ఞాతుండై తద్దివ్యవిమానంబునకుం బ్రదక్షిణ ప్రణామంబులాచరించి శ్రీరామానుజముఖద్వారంబుకడ కేతెంచి యచటం గూరనాథప్రణీతంబగు నా నిత్యమచ్యుత త్యాదిశ్లోకంబులం బఠించి భక్తి పూర్వకంబుగా సాష్టాంగ ప్రణామం బాచరించి స్వకీయమఠంబున కరుగుదెంచి యందు భగవదారాధనంబు గావించి పెరియభట్టరు మొదలగు శ్రీమహాభాగవతుల శ్రీపాద తీర్థంబుజ్జీవించి వారలారగించిన పిమ్మట భగవద్భాగవతశేషంబగు ప్రసాదలేశంబు స్వీకరించి పద్మాసనంబు రచియించి శ్రీవైష్ణవులఁ గొందఱినిం బరాశరభట్టార్యున కప్పగించి కరకమలంబులు ముకుళించి తిరునేత్రనిమీలనంబొనరించి ధ్యానారూఢనిజాచార్య దివ్యమంగళ విగ్రహంబుఁదలంచుచుఁ బరమపదంబలంకరించె నంత శ్రీపరాశరభట్టారకుం డాచార్య విశ్లేషంబుచేఁ బెద్దయుంబొద్దు దుఃఖించి స్వాములు కొంద ఱూఱడింప ధైర్యం బవలంబించి తదీయానుజుం డగు సిరియగోవిందగురుని శ్రీహస్తంబుచే బ్రహ్మమేధవిధానంబున ఖననాదియతిసంస్కారంబులు చేయించి యగ్గురునకుం దిరువధ్యయనమహోత్సవంబు సలిపె శ్రీవకుళభూషణ నాథ యామునయతీంద్రప్రముఖపూర్వాచార్యు లందఱు కాలతత్త్వ స్థితిపర్యంతం బాశ్రితచేతనసంరక్షణార్థంబు గాలీలావిభూతి నలంకరించి యుండుటు గాన పెద్ద లందఱు వారికిఁ దీర్ఘదివసం బాచరింప రిది పరమరహస్యం బని శ్రీవాదిభీకరుం డానతిచ్చె. 56.

శ్లో॥ పుష్యే పునర్వసూజాతం వన్దే గోవిన్దదేశికమ్।
రామానుజపదామ్భోజద్వన్ద్వప్రవణమానసమ్॥
రామానుజపదచ్ఛాయా గోవిన్దాహ్వానపాయినీ।
తదాయత్తస్వరూపా సా జీయాన్మద్విశ్రమస్థలీ॥

సీ. శ్రీభూతపురనాథ • సేవ్యేభగిరినాథ, రాజద్వశీకృత • రంగనాథ
వేంకటాచలవాస • వేదవిన్నుతదాస, రమణీయతరహాస • రవివికాస
భవ్యగుణాధార • పరమతత్త్వవిచార, యదుగిరీశశరీర • యదువిహార
కల్యాణ నిభకాయ • ఖండితహరిమాయ, కరుణావిధేయ • సత్కవిసహాయ

తే. సంయమీశ్వర లక్ష్మణా•చర్వధుర్య. కూరరాడ్దాశరథ్యాది•గురుసమర్చి
తాత్మపదపద్మములఁ(జూప•వయ్యయనుచు. వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

శా. శ్రీమద్రంగపతిప్రధానసచివా • శ్రేయోనిదానోత్సవా
నామోచ్చారణమాత్రపాపహరణా • నారాయణప్రీణనా
కామక్రోధభవాంధకారతపనా • కల్యాణసంస్థాపనా
హైమప్రోల్లసితత్రిదండకర భ• క్తారామ రామానుజా. 58

సుగంధివృత్తము. బాలసూర్యవిగ్రహా ప్ర•పన్నభూర్యనుగ్రహా
ఫాలభాసురోర్ధ్వపుండ్ర • బ్రహ్మసూత్రమండితా
నీలలోలసచ్ఛిఖా వి•నీతసత్త్వవత్సఖా
శాలితారుణోత్తరీయ•శర్మదా యతీశ్వరా. 59

మాలినీవృత్తము. సకలభువనపాలా • సాధుహృత్పద్మలోలా
వికసితనిజకీర్తీ • విస్ఫురచ్ఛేషమూర్తీ
సుకవినుతచరిత్రా • శుద్ధగాంగేయగాత్రా
ప్రకటితహరికార్యా • భవ్యరామానుజార్యా. 60

గద్యము. ఇది శ్రీభగవద్రామానుజకరుణాకటాక్షకలితకవితావైభవ పరవాది భయంకరాచార్యాభిమతచ్ఛాత్రాపస్తంబసూత్ర కణ్వసగోత్ర పవిత్రోభయ కవిమిత్ర వేంకటకృష్ణార్యపుత్ర విబుధవైష్ణవవిధేయ కేశవనామధేయ ప్రణీతంబయిన యాచార్యసూక్తిముక్తావళి యనుమహాప్రబంధంబునందు మధ్యమభాగంబున శ్రీమదాంధ్రపూర్ణమాహాత్మ్యంబును శ్రీమదనంతగురుప్రభావంబును శ్రీవత్సాంకమిశ్ర చరమవైభవకీర్తనంబును శ్రీపరాశరవ్యాసభట్టారకులను శ్రీరంగనాథుండు పుత్రస్వీకారంబుఁ జేయుటయు శ్రీరంగరాజ శ్రీపరాంకుశనాథయామునప్రముఖ భగవద్భాగవతాచార్యసముదాయంబు శ్రీయతీంద్రునివిభవంబు బైల్పుచ్చుటయు భగవద్రామానుజచరమహోత్స ప్రదర్శనంబును దాశరథ్యాది దివ్యసూరిచరమసూచనంబు నన్నది సర్వంబును ద్వాదశోల్లాసము.

ఆచార్యసూక్తిముక్తావళి మధ్యమభాగము ముగిసెను.

—o—

శ్రీమతే రామానుజాయ నమః



# ఆచార్యసూక్తిముక్తావళి

## ఉత్తరభాగము

---

### ప్రథమోల్లాసము

శ్రీభూనీళావిలస
త్స్వాత్రిభవయుతరంగరాజ • రంజితహృదయా
జ్ఞా భువనయతివిభూషణ
శ్రీభూతపురీనివేశ • శ్రితకూరేశా. 1

వ. అవధరింపుము. 2

### భట్టరువారి ప్రభావము.

శ్రీపరాశరభట్టరు-త. శ్లో॥ వైశాఖమాస్యనోరాధాజాతం భట్టార్యదేశికమ్।
గోవిన్దయతిపాదాబ్జచఞ్చరీక మహం భజే॥
శ్రీపరాశరభట్టార్య శ్శ్రీరఙ్గేశపురోహితః।
శ్రీవత్సాఙ్కసుత శ్శ్రీమా న్శ్రేయసే మేస్తు భూయసే॥

సీ. శ్రీపరాశరగురు•శేఖరుం డంత శ్రీ,రంగధామమున మెఱుంగు మీఱ
దర్శనస్థాపన•దక్షు( డై సాత్త్విక, సంఘముతో గోష్ఠి•సల్పు చుండ
నటు( దీర్ఘవాసిబ్రా•హ్మణు( డొక( డేతెంచి. యద్దేశికుని( జూచి,యంజలించి
యాసూరియుభయవే,దాంతగోష్ఠీపూర్తి, కాశ్చర్య మందుచు,నతని కనియె

తే. మేలునా(టను మీవంటి•మేటిపండి, తుండు వేదాంతి యని యొక(•డుండు ననుచు
భట్ట రామాట విని యిట్లు•పలికె ననుచు, వాదిభీకరగురు( డనె • మోద మలర.

సీ. బాడబ నీయున్కి•పట్టిల నేనా(ట, నెచటి కేతెంచితి•విచటి కేమి
పనికి వచ్చితివి యా•పండితుం దేపాటి, వక్తయై యేశాస్త్ర•వాదకేళి

లందు మత్తర్కశా•స్త్రాహతిని సహించు, నతనిబుద్ధిప్రతి•భాదు లెట్టి
వని భట్ట రన విని,యావిప్రుఁ డతనికి నాదుదేశము మేలు,నాఁడు తీర్థ

తే. యాత్ర సేయంగ వచ్చి రం•గాధిపతిని, గాంచి వినుఁ గన నిచటి కే•తెంచినాఁడ
ననుచువాక్రుచ్చిమఱియుని•ట్లనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. అమ్నాయములయందు,నతఁడు రుద్రసముండు, కాణాదపాణిని•గౌతమోక్తి
శాస్త్రములందుఁ ద•త్త్వదృశుఁ డంత స్తంత్ర, మంతయుఁ గేళిగృ•హం బతనికిఁ
బాతంజలామృత•పానమత్తుఁ డతండు. వేదాంతవిద్యావి•విక్తబుద్ధి
వాగీశ్వరునిమాడ్కి•వక్తృబుద్ధిప్రతి, భాదుల హెచ్చెవ్వఁ•డతనికంటె

తే. ధరణి నాతనితోఁ బోటి•ఁగినధీరుఁ, డెవ్వఁ డీనన్నుఁ దక్కబు•ధేంద్ర యనుచు
భట్ట రాలింపఁ బల్కె నా•దట్ట యనుచు వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. అంతఁ బరాశరభట్టారకుం డవ్వేదాంతి నిజయించి దర్శనోన్ముఖునిఁ గాఁ జేయం దలంచి యావిప్రు నుద్దేశించి శ్రీరంగంబునందు భట్టరని యొక ప్రబలవిద్వాంసుండు గలం డతండు నీతోడం దర్కింప నుత్సహించి యున్న వాఁడని వేదాంతికిం దెలియఁ బల్కు మనుచు నుచితసత్కారం బొనరించి పంపఁ నతండమ్మేలు నాఁటికిం జని యందు వేదాంతినిం గాంచి నమస్కరించి యిట్లనియె. 6

సీ. ప్రాజ్ఞ పరాశర•భట్టారకుం డను, పండితేంద్రుఁడు చో•ళమండలమునఁ
గనకాపగాదివ్య•గర్భస్థితం బగు, శ్రీరంగ మనుమహా•క్షేత్రమందు
నున్నాఁడు నీవాసి•విన్నాఁడు నీతోడ, విన్నాణముగ వాద•విలసితంబు
సేయఁ గలం డని•చెప్పిన వేదాంతి, విని విస్మయముఁ జెంది•వేగ వోయి

తే. శాస్త్రములు భట్టరేమేమి•చదివినాఁడొ, తెలిసిరమ్మని మగిడియా•ద్విజునిఁబనుప
నతఁడు శ్రీరంగపదమున•కరిగెననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. ఆజన్నిగట్టు భ•ట్టార్యునిఁ గని మ్రొక్కి, యతనికి వేదాంతి•యన్నమాట
లన్నియుఁ జెప్ప న•య్యార్యుఁ డాకర్ణించి, మోమునెత్తమ్మిని•మొలకనవ్వు
చంద్రబింబమునందుఁ•జవిజాలుపోలికఁ, దళుకొత్త నతనికిఁ•బలికె నిట్లు
దండితిరుక్కురుం•దాండహం తిరునెడుం, దాండహ మనెడువి•ద్యలను రెంట

తే. నధిక మొందితి నేను వే•దాంతికంటె, నన్యవిద్యలు దీటు మా•కతని కనుచు
భట్ట రని యాద్విజోత్తముఁ•బంచె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. వేగ నావిప్రుఁ డా•వేదాంతికడ కేఁగి, యప్పరాశరభట్టు•రానతిచ్చు
శ్రీసూక్తు లన్నియుఁ•జెప్పిన విని యతం డక్కజపడి తన•యాత్మ యందు
వేదశాస్త్రశ్రౌత•వివిధపురాణేతి, హాసస్మృతులయందు•నఃసిచూడ
నీశబ్దములు రెండు•నెచ్చటఁ గనఁబడ, వీపదంబుల కర్థ•మిఁచు కైనఁ

తే. దెలియ లేనైతి నని మదిఁ•దేటఁ దొలఁగి, షణ్మతస్థాపనాచార్య•శబ్ద మెట్లు
చెల్లె నిఁక మాకు నని చింతఁ•జేసెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. పరఁగఁ బరాశర•భట్టారకుం డంత, సంయమీంద్రుఁడు తమ•చరమదశను
మహిని వేదాంతి న•స్మద్దర్శనాంతర్గ, తాత్మునిఁ గాఁ జేయు•మనుచుఁ జెప్పెఁ
గాన తచ్ఛాసన•కైంకర్య మొనరింతు, నని తలంపున నెంచి•హరిని గాంచి
వినుతించి వేదాంతి•విజయార్థ మై వీని, కాజ్ఞ యిమ్మని వేఁడ•హరి యతనికిఁ

తే. బుత్ర తావకజిహ్వాగ్ర•మున వసింతు, వాద మొందిన నప్పర•వాది నీకు
శిష్యుఁ డగుఁ బోయి రమ్మని•చెప్పె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

వ. ఇట్లు శ్రీరంగనాథుండు శ్రీపరాశరభట్టార్యుని కాజ్ఞాపించి నిజాలయాధికారికి స్వప్న
గతుం డై యిట్లనియె. 11

సీ. మహి రంగపతి క•మానపుత్రుఁడు పరా, శరభట్ట రని యెల్ల•జను లెఱుంగ
మద్దివ్యభూషణ•మణిమయచతురంత, యానసితాతప•త్రాదు లన్ని
భట్టరు కర్పించి•పంచుమా యతని మే, ల్కాఁటి కంచు రమావ•ధూటివిభుఁడె
యాన తిచ్చి యదృశ్యుఁ•డై నపిమ్మట గుడి, యధికారి మేల్కాంచి•హరిఁ దలచి

తే. కాల్యములఁ దీర్చి యేతెంచి•కని పరాశ, రార్యవయ్యుని జైత్రయా•త్రానుకూల
వేష మొనరించి పంచెను•వేడ్కననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. ద్వాదశాంగములందు•ధవళోర్ధ్వపుండ్రముల్, శ్రీచూర్ణరేఖలు•చెన్నుమీఱఁ
గమనీయనవరత్న•ఖచితతప్తసువర్ణ,వరకిరీటముప్రభ•శిరము మెఱయ
మకరకుండలనద్ధ•మణిగణకాంతిమం, డలము చెక్కులమీఁదఁ•జెలువుగులుక
హారాంగుళీయకే•యూరకంకణకటి, సూత్రద్యుతులు మేన•సొబగు మీఱ

తే. క్షౌమసంవ్యానపరిధాన•శాలి యైన, యప్పరాశరభట్టార•కార్యుఁ డొప్పఁ
జోళరాడ్యామునార్యుని•లీల ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. మాన్యులు కొనియాడ•మాణిక్యశిబికాధి, రూఢుఁడై కూరేశ్వ•రునిసుతుండు
చనువేళఁ బాండుర•శతశలాకచ్ఛత్ర, మార్యుఁ డొక్కఁడు పూనె•నతని కెలన

ధవళచామరము లాఁతవి కిరుగడలను, వీచు చుండిరి బ్రహ్మ•వేత్త లిరువు
రగ్రభాగమున వే•శ్యాంగన లాడిరి, కొందఱు పలికిరి•గుణకథాళు

తే. అమితదుందుభిముఖ్యవా•ద్యములు మొరసెఁ, బరఁగఁగస్తూరిరంగని•పగిదివేడ్కఁ
జూచి రద్దేశికేంద్రుని•సుజను లనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. అట్లద్దేశిక సార్వభౌముండు శ్రీరంగధామంబు విడిచి ప్రతీచీనమార్గంబునం జనుచు. 15

సీ. మార్గమధ్యమునందు•మహనీయసురభినా, నాపుష్పఫలద్రుమ•నగవరముల
శరభసింహవ్యాఘ్ర•చమరాదిమృగకీర్ణ, బహుళధాతువిచిత్ర•పర్వతముల
నాశ్రమగ్రామాగ్ర•హారపట్టణముల, సంపుల్లపద్మకా•సారములను
బుష్కరిణుల బహు•పుణ్యస్రవంతులఁ, జూచుచుఁ జని చని•సూరివరుఁడు

తే. రాజదుద్యానలక్ష్మీపు•రంబుకడను, గమలకైరవకల్హార•ఘనసుగంధ
కలితకనకాపగను బొడ•గాంచె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర

వ. అప్పు డప్పరాశరభట్టారకార్యుం డేతెంచినాఁ డని విన నవధరించి భగవద్రామానుజప్రియశిష్యుం డగు శ్రీమదనంత దేశికుం డెదు రేఁగుదెంచి శ్రీకావేరీతీరంబున నక్కూరేశాభిమత పుత్రునిం గాంచిన నమ్మహాత్ముండయ్యార్య సత్తమునకు సాష్టాంగదండ ప్రణామం బాచరించి పాణిపల్లవంబులు ముకుళించి ప్రహ్వుండై యున్నం గటాక్షించి యనంతార్యుం డక్కూరేశగురుని కుమారునిం బ్రేమపూర్వంబుగా గాఢాలింగనం బొనరించి కూరకులప్రదీపా వీవతిసుకుమారుండవు జననంబు మొదలుగాఁ బ్రవాసకష్టంబు లెఱుంగవు దుర్గమంబైన యిగ్గిరిగహన ప్రదేశంబున కేల విచ్చేసితి వని యాదరపూర్వకంబుగా నడిగినఁ దొల్లి యెంబెరుమానారు వేదాంతిని మద్దర్శనాంతః ప్రవిష్టునిఁ గాఁ జేయు మని యానతిచ్చెం గావున శ్రీరంగరాజానుజ్ఞాతుండ నై వచ్చితి నని విన్నవింప నాకర్ణించి యగ్గురువరుం డప్పరాశరభట్టారకుని స్వమందిరంబునకుం దోడ్కొని వచ్చి మిగుల సత్కరించి పరిజనసహితుండగు నప్పరాశరభట్టారకున కాతిథ్యం బు గావించిన నాహారీతకులతిలకుండు ప్రహృష్టాంతరంగుండై యనంతాళ్వానుతోడం గూడి లక్ష్మీపురాపరనామధేయం బగునాసిరి భేత్తూరు విడిచి తిరునారాయణపురంబునకుం జనుదెంచి.—శ్లో॥ యాదవాద్రిం జిగమిషా యేషాం కేషాంచ విద్యతే। తేషాం దేశే యమభటా నాగచ్ఛన్తి కదాచన॥ అనున్యాయంబున నెట్టివారైన యాదవాద్రికిం జన నిచ్చగించి రేని వారిదేశంబునందు మఱచి యైన యమకింకరులు సంచ

రింప నొల్ల రట్టిమాహాత్మ్యంబు గలిగి—శ్లో॥ సహస్రశిఖర స్సోయం సాక్షాచ్ఛేషాత్మకో గిరిః। వైకుణ్ఠాదపి యత్రాహం రమయాసహితోరమే॥ అనియెడు పురాణవచనంబుచే శ్రీవైకుంఠక్షీరసాగరాదినిజావాసస్థానంబులకంటె శ్రీమన్నారాయణునకు నిత్యక్రీడామందిరం బై శేషస్వరూపం బై, శ్లో॥ వైకుంఠవాసినస్సర్వే శేష శేషాశనాయః। తిర్యక్స్థావరజన్మాని శ్రయన్తేయదు భూధరే॥ అను ప్రమాణంబుచేఁ జేతనాచేతన రూపంబులు దాల్చి యాశ్రయించున నంతగరుడవిష్వక్సేనాది నిత్యసూరుల కాటపట్టయి యున్న శ్రీయాదవాచలంబుఁ జెంది ముక్తపురుషుండు శేషతల్పారోహణంబు సేయు భావనచే నమ్మహాద్రికిం జని యందు శ్రీకల్యాణ పుష్కరిణియం దవగాహనంబు గావించి కేశవంద మరిత్యాది శ్రీశఠకోపదివ్య సూరిప్రణీత ద్వాదశగాథలనుసంధించుచు శ్రీమూర్ణ రేఖాంచితంబులగు ధవళతరద్వాద శచ్ఛిద్రోర్ధ్వ పుండ్రంబులులలాటాదిద్వాదశాంగంబులయందు ధరించి విచ్చేయుఁదద్దివ్య దేశవాసులగువ్విపంచాశద్దేశికోత్తములు శ్రీశఠకోపంబుఁ బురస్కరించుకొని యనేక కల్యాణవాద్య ఘోషంబుతో నెదుర్కొనినం జూచి భక్తితోడం బ్రణమిల్లి యాశఠకోపంబు శిరసావహించి యప్పురంబుఁ జొచ్చి తిరువీధి ప్రదక్షిణం బాచరించి భగవన్మందిరంబు డాసి చతురానన గోపురంబునకుం జేమోడ్చి బలిపీఠంబుకడ సాష్టాంగ ప్రణామంబుఁ జేసి శ్రీభాష్యకారుల సన్నిధి కేతెంచి యోనిత్యమచ్యుతేత్యాదిశ్లోకం బనుసంధించి భక్తితోడం బ్రణామంబు లొనర్చి తదీయతీర్థ ప్రసాదా దు లన్నియు లభించి మించి యద్దివ్యాలయంబునకుం బ్రదక్షిణంబు సేయుచు—శ్లో॥ పశ్చా దపి విమానస్య ప్రాకారాన్తరమధ్యతః। సుదర్శనశ్చ లక్ష్మీశ్చ వర్తేతే సర్వకామదౌ॥ అను ప్రమాణంబునఁ దద్విమాన ప్రతీచీన భాగంబునఁ బ్రాకారంబునకంతః ప్రదేశంబున మణికీలితతప్తచామీకర విలయంబు లందుల్లసిల్లుచున్న సుదర్శనస్వామిని యదుగిరి లక్ష్మివిం జూచి శ్రీమదనంత విమానంబునకుం గేల్మోడ్చి ముఖమంటపంబున కరుగుదెంచి యందు సాష్టాంగ ప్రణామంబుఁజేసి యచటఁ బరాంకుశ పరకాలాది దివ్య సూరుల భజియించి రామప్రియుని సన్నిధికిం జని సుల్తాను ముద్దుపట్టితోడం గూడ నాసంపత్కుమారునిఁ గన్నులపండువు గాఁ గనుంగొని తద్దివ్య మంగళవిగ్రహం బాపాదమస్తకం బనుభవించి యచటఁదీర్థ ప్రసాదాదు లుజ్జీవించి వెల్వడి శ్రీవిష్వక్సేనుల కడకుం జని యతనిం గొనియాడి ద్వారపాలకుల యనుమతిచే గర్భగృహంబుకడ కరిగి యందుఁ దిరునారాయణస్వామిని గన్నులారం గని శ్రీవిష్ణుచిత్తోక్త మంగళాశాసన గాథాదశకంబుఁ జదువుచు మంగళాశాసనం

బొనర్చి తదనుగ్రహంబుచేఁ దిరుమాలెయుఁ దిరుప్పరివట్టంబుఁ దీర్థకబు శ్రీశఠకోపంబును గ్రహించి యతనిచే ననుజ్ఞాతుం డై భగవన్మందిరంబు వెల్వడి వచ్చి శ్రీమదనంత దేశికునితోడం గూడ వేదాంతి యున్న గ్రామంబున కనతి దూర ప్రదేశంబుఁ జెంది యందు జయజయ శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యా జయోభయవేదాంతాచార్యా జయశ్రీవత్స చిహ్నమిశ్రాభిమతసుతా జయ శ్రీరంగ రాజకుమారా జయశ్రీరంగ నాయకీకమలాలాలిత దివ్య మంగళవిగ్రహా జయాదిమ బ్రహ్మ సహోదరా జయశ్రీ రంగనాథ కృపాలబ్ధ బ్రహ్మరథాధిరూఢా జయాభంగ మహోత్తుంగ పతంగపుంగవతురంగారూఢవీరనారాయణ బిరుదాంకా జయ పక్షద్వయ ప్రపన్నకూటస్థా జయాభేద్య శైవస్తంభవిదారణా జయ హారీన్వయ పయః పారావారరాకాసుధాకరాజయ పరమవైదికలోకాగ్రేసరా జయ పరవాది మదహస్తి పంచాననా జయ శ్రీపరాశరభట్టారకా అని యాశ్రితులు తనబిరుదులం బొగడుచుండ శంఖభేరీమృదంగవేణు వీణాపటహకాహళాది కళ్యాణవాద్య ఘోషంబులు చెలంగ రత్నమయశిబికారూఢుండై యుభయపార్శ్వంబుల శ్వేత చామరతాళవృంతాదులు వీవనమూల్యరత్న ఖచితకోటీరహార కేయూరకటకాంగుళీయ కటిసూత్ర దివ్యమాల్యానులేప నక్షౌమోత్తరీయపరిధానాద్య లంకృతుండై ముక్తాతపత్రచ్ఛాయ నేతెంచుసమయంబున. 17

సీ. ఇరువురబ్రాహ్మణు•లేతెంచి యచటికి, భట్టార్యుఁ గని మ్రొక్కి•పల్కి రిట్లు
లెచటనుం డిచటికి•నేతెంచితిరి మీర, లని యడిగిన వారి•కతఁడు పల్కె
శ్రీరంగ మనుమహా, క్షేత్రమునం దుండి, వేదాంతి నీక్షించి • వాద మొంద
వచ్చితి మని యన • వా రిట్లు పల్కిరి. యిట్టివేషముతోడ • నెట్లు మీర

తే. లతనిగృహమున కేతెంచి • యతనిఁగాంచి. శాస్త్ర వాదంబు సల్పంగ • శక్తు లనిన
భట్ట రి ట్లని వారికిఁ • బల్కె ననుచు. వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. విప్రప్రవరులార • వేదాంతికడ కేఁగ. నద్ద మే మని వారి • నార్యుఁ డడుగఁ
దద్బహిర్ద్వారవి • తర్దులందుఁ దదీయ. శిష్యప్రశిష్యు లి • క్షీణమతులు
వాక్పతితో నైన • వాదింపఁ గలవారు. దండిగాఁ బండితు • లుండి యెట్టి
వక్తల నైనను • వడిసుళ్ళ, బెట్టించి. దొమ్మి చేసి జయించి • తొలఁగఁ ద్రోతు

తే. రట్టిచోటికి మీ రిట్లు • లరుగఁ దగునె. యొక్క బలవదుపాయము • దక్కననుచు
బ్రాహ్మణులు భట్టరయ్యకుఁ•బల్కి రనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర

సీ. ఆయుపాయం బెద్ది • యని భట్ట రడిగిన, బ్రాహ్మణు లతనికిఁ • బల్కి రిట్లు
విత్తవంతుఁడు గాన • వేదాంతి యన్నస, త్రం బిడి తద్వీమ • ర్శమున కొక్క
మండపంబున నాఱు • మతములకై యొక, యాసనం బుంచి యం • దధివసించు
నాతని కడ కేఁగ • నన్యయోగము లేదు, సత్రాశికై వడిఁ • జనుట దక్కఁ

తే. గాన నీ వింక సత్రాశి • కరణి నరిగి, యతని గను మని బాడబు•లనిన నాల
కించి భట్టరు కడు సంత • సించె ననుచు, వాదిభీకరగురుఁ డనె, మోదమలర. 20

సీ. ఊరికి దవ్వుల • నుద్యానవనమునం, దాత్మీయపరికర • మంత నిల్పి
శ్రీమదనంత దే • శికునితో నీర్కావి, వలిపంబు మొలఁ గట్టి • జిలుఁగుపుట్ట
మొకటి వక్షంబునం • దునిచి కేల్దమ్మియం, దుదపూర్ణ కలశంబు • కుదురుపఱచి
సత్రభుగ్జనులతోఁ • జని వార లన్నస, త్రముకడ కేఁగిన • దా నచటికిఁ

తే. జనక వేదాంతి యున్నట్టి • శాలకడకు, నప్పరాశభట్టార్యుఁ • డరుగఁ జూచి
పలికె వేదాంతి యతని కీ•పగిది ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. దారకయన్న స • త్రపుఁద్రోవ యదె చను, మని యతం డన విని, • యమ్మనీషి
కన్నభిక్షార్థమై • యరుగుదెంచినవాఁడఁ, గా నని యబ్బుధా • గ్రణి వచింప
నాతఁ డేభిక్షయం • చడుగ నయ్యార్యుఁడు, వాదభిక్షం బి మ్మ • వశ్య మనిన
సత్రాశి యైనను • జదు విను మం తైనఁ, గలవాఁ డితం డని • తలఁచియాతఁ

తే. డెట్టిపండితుఁడైన నా • యెదుటనుండి, శాస్త్రములయందు వాదము • సలుపజాల
డితఁడు సాహసికుం డని • యెంచె ననుచు, వాదిభీకరగురుఁ డనె• మోదమలర.

వ. అట్లా వేదాంతి తన తలంపునం దలంప మత్తమాతంగాధిష్ఠిత మందరాద్రిప్రస్తం బుపైకిం జౌకళించునకుంఠిత కంఠీరవంబుచాడ్పునఁ దద్విద్వదుషితం బగుమహోన్నత మంటపమధ్యంబున కతిరయంబున నేతెంచి నిజపాణిపల్లవస్థితం బగు జలకలశంబు నీర్కావిపావడంబుఁ జుట్టి స్వస్తికాసనాసీనుం డై నిజ తేజోమండలంబున రోదసీకుహరంబు నిండి యుల్లసిల్లుచుండ వేదాంతశాస్త్రోపన్యాసంబున కుత్సహించు నగ్గురుకుమారకునిం జూచి తొల్లి యొకతీర్థవాసి బ్రాహ్మణునిచే మాకుం దెలుపంబడు పరాశరభట్టారకుండ వీవాకో యని యడుగ నాతం డౌనన నద్దూరదర్శియు నిజాసనంబువిడిచి ప్రత్యుత్థానం బొనరింప నిట్లేల చేసితి వని భట్ట రనిన నిన్ను జయించితి నేనియు నీయాసనంబుపైఁ గూర్చుండనర్హుండ నయ్యెద నట్లు గాకున్న నీషద్దర్శనాసనంబుతో మాకుం బ్రయోజనంబుగనఁ

బడదని వక్కాణించి యమ్మహాత్మునియెదుట సుఖాసనాసీనుండయి యున్నయమ్మ నీషిశ్రేష్ఠునిం గాంచి హర్షించి యా శ్రీరంగరాజాభిమానపుత్రుం డస్మద్వాక్యం బులు కొన్ని ముందఱ నాకర్ణింపు మని పల్కి ప్రావృట్సమయసముద్వేలోల్లోల మహోత్తుంగ తరంగరంగద్గంగా తరంగిణీ ప్రవాహంబు తెఱంగున నుప్పొంగు వాకౌఘంబుచేఁ బ్రసంగం బుపక్రమించి ప్రత్యక్షానుమానోపమానశబ్దాది ప్రమా ణంబు లన్నియు విశిష్టబోధజనకంబులుగావున నిర్విశేషచిన్మాత్రబ్రహ్మబోధ జనకంబులుగానేరవు నిర్గుణశ్రుతు లన్నియు హేయగుణరాహిత్యంబుఁ జెప్పుం గావున బ్రహ్మం బనంతకల్యాణగుణాకారంబు తత్త్వమస్యాద్యద్వైతవాక్యంబు లన్నియు విశిష్టాద్వైత పరంబు లిది సిద్ధాంతం బని చెప్పి స్వోక్తార్థోపపాదనసమ ర్థంబుగాన బాధితబలవత్తర్క ప్రమాణసహకృత గ్రంథసహస్రం బుపన్యసింప విని యావేదాంతియు నా గ్రంథం బంతయు ననువదించి ఖండించి స్వరాద్ధాంత స్థాపకబహుతర్క ప్రమాణజటిలంబుగాన పరిమిత గ్రంథం బుపన్యసించెనట్లన్యో న్య గ్రంథఖండననిర్వహణపూర్వకంబు గా హరి హరియును గిరి గిరియును గరికరి యుం బోరుతీరునఁ గర్మానుష్ఠానస్వావకాలంబులు దక్కఁ దక్కినయవసరంబు లందుఁబరస్పరజిగీషచే బ్రహ్మతర్క ప్రమాణశస్త్రచ్ఛటలం బ్రబలవాదాహవం బొనరించు వారికిం దొమ్మిదివాసరంబులుగడచెనంత శ్రీవత్సచిహ్నమిశ్రసుతుండు మహావాతసముద్భూతతుంగతరంగ పార్వణసముద్రంబుమాడ్కి విజృంభించి య బాధితంబు లైన బహుయుక్తి ప్రమాణంబు లుపన్యసింపం గనుంగొని పరమా శ్చర్యరసాబ్ధిమగ్నుం డై ప్రత్యుత్తరంబు వచింపం దోఁచక మహాత్మ శ్రీరంగ నాథుండు భవద్రూపంబున వచ్చి నన్ను జయించెంగాన మన్మానసంబు మిగుల సంతసించె నింక వీనిని నిజచ్ఛాత్రునిఁ గా స్వీకరించి యనుగ్రహింపు మని య కృత్రిమప్రేమ ప్రేరిత మనస్కుం డై నిజ పాదపద్మ సమీపంబునందార్తుండై సా ష్టాంగ ప్రణామంబు చేసి లేవకున్న యావిద్వచ్ఛేకరునిం గటాక్షించి ప్రహర్షించి గ్రుచ్చి యెత్తి కౌఁగిటం జేర్చి సుధామధురోక్తుల నూఱడించి యతనికిం పంచ సంస్కారంబు లొనరించి యర్థపంచకం బుపదేశించి యాకారత్రయసంపత్తి యంగలుగఁ జేసిన నవ్వేదాంతియును భాగవతోత్తముండై నిజాచార్యుండైన యప్పరాశరభట్టారకు నమూల్యరత్నా భరణామూల్య లేపనాంబరాదులచే నలంక రించి బహుధనం బర్పించినం బ్రహర్షించి యగ్గురు సార్వభౌముం డతనిం జూచి వత్సా సర్వకాలంబులందు శ్రీవైష్ణవనిష్ఠాగరిష్ఠుండ వై తదీయారాధనంబు స ల్పుచు శ్రీపరాంకుశ పరకాలాదిదివ్యసూరి ప్రణీతదివ్య ప్రబంధంబులన్నియు నధి

కరింపు మని యానతిచ్చి తన్మందిరంబు వెల్వడి యనంతాళ్వానులతోడం గూడ విచ్చేయు చున్న నతం డమ్మహాదేశికుని వెనువెంటం జని గ్రామబాహ్యారామంబునం దమ్మనీషి భాషాపతి మహాటోపంబుఁ జూచి విస్మయంబుఁ జెంది ప్రహృష్టాంతరంగుండై యుండె నంత. 28

సీ. వెల లేని మానికం • బులు గీలుకొల్పిన, తపనీయమకుటముఁ • దల ధరించి
మహనీయమణినద్ధ • మకరకుండలములు, శ్రీకారములఁ బోలు • చెవుల దాల్చి,
ఘనరత్న తరళము • క్తాహారములఁ గంబు, గళమునఁ గీలించి. కాంచనాంగ
దంబుల భుజమున • ధరియించి కరములం, దుజ్జ్వలకటకము • లూని వ్రేళ్ళ

తే. దివ్యదూర్మికలను గూర్చి • దివ్యవస్త్ర, కలితకటితటి నవరత్న • ఖచితకనక
భవ్యకటిసూత్ర ముంచెను • భట్ట రనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. తిరుమేనియం దట్ల • దేదీప్యమాననా, నానిస్వమాభర • ణములఁ దాల్చి
శుద్ధ కాంచనమణి • శోభితశిబికయం, దెక్కి యా విద్వన్మ • హేంద్రుఁ డరుగ
ధవళాతపత్ర మా • తనిమస్తకంబుపై, వేడ్కతో నొక బ్రహ్మ • వేత్త పూనె
విమలచామరతాళ • వృంతముల్ వీచుచు. నిరుగడలను ధన్యు • లేఁగ నగ్ర

తే. భాగమున మత్తకరిపై న • భంగగరుడ. వీరనారాయణాహ్వాను • విజయబిరుద
సుందరధ్వజ మూనిరి కొంద అనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర 25

సీ. సర్వతోముఖము లౌ•జయశబ్దములతోడ. వివిధవాద్యధ్వని • వియ్యమొంద
భట్టారకార్యుని • పరవాది విజయము, నెల్లలోకములకు • నెఱుకపఱప
నమ్మహాత్మునిసిరి • యంతయు నీక్షించి, తనలోన వేదాంతి • తలఁచె నిట్లు
తొలిజన్మములయందు • దొడ్డతపం బేమి, చేసితినో యిట్టు • వాసి గన్న

తే గురుని,జెందితిఁ బ్రపదన • పరుఁడనైతి, సఫలమయ్యెను మామక•జన్మమనుచుఁ
దలఁచి యతఁడేఁ గెగురుతోఁ•గలిసియనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ, తనవాహనము వెంటఁ • జనుదెంచు వేదాంతి, గురుని నక్కూరేశ•గురుసుతుండు
చూచి యి ట్లనియె నో సూరిసత్తమ నీవు, సర్వజ్ఞుఁడవు గాన • సారెసారె
కేను నీ కెఱిఁగింప • నేల మాయావాద, రతి మాని శ్రీయతి • రాజశుద్ధ
రాద్ధాంతనిర్వాహ • రంజితబుద్ధి వై, సాత్త్వికజనులతో • సంగ మొంది

తే యింటికడ నుండు మిఁక నిలు • మేఁగు మనుచు
గురుఁడు నియమింప నతనికిఁ • గూర్మి మ్రొక్కి

ప్రక్రమముఁ జేసి చనియె నా • ప్రాజ్ఞుఁ డనుచు
వాదిభీకరగురుఁ డనె • మోదమలర. 27

సీ. చనిచని శ్రీపరా • శరభట్ట రీక్షించెఁ, దుంగశృంగసహస్ర • మంగళంబు
సర్వర్తుఫలపుష్ప • శాలిశాఖాగ్రగ్రస్త, పత్రచిత్రరుతాఢ్య • బహునగంబు
సురభిపద్మోత్పల • శోభితహ్రదనదీ, పరమపావనతీర • భాసురంబు
సంత్యాజితాన్యోన్య • జాతివైర మృగంబు సిద్ధదేవర్షివిషేవితంబు

తే. వనహుతాసనముఖదోష • వర్జితంబు, నైనయదుగిరిపైనృహ • ర్యక్షనిలయ
రంజితద్వారమణిగోపు • రంబు ననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర. 28

వ అంత నప్పరాశరభట్టారకుం డయ్యాదవాద్రిని డాసి యప్పర్వతోపరిభాగంబున
కుం జని యందు. 29

సీ. స్ఫటికవజ్రోపల • స్థగితగోపుర యుత, ప్రాకారపరిఖాది • పరివృతంబు
సూర్యచంద్రవతంస • శుభరత్న కీలిత, ప్రాసాదమాలికా • భాసురంబు
ధన్యనానాజనా • ధారరథ్యా రాజ, వీథిసమృద్ధిమ • ద్విపణికంబు
సురభిపద్మాకర • సురుచిరదీర్ఘికా, రమ్యపుష్కరిణీవి • రాజితంబు

తే. హరివిహారసమంచితో • ద్యానశతము, భూరినారాయణాహ్వయ పురముఁ జూచి
శ్రీపరాశరసూరి హ • ర్షించె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర. 30

వ. అంత నత్తిరునారాయణ పురంబునం దొక్కయెడ నిజపరివారంబు నిల్పి శ్రీమదనంతదేశిక ప్రముఖ శ్రీమహాభాగవతులం గూడి యమ్మహాద్రియం దనవరతవిరాజమానంబులును శ్రీనారసింహ వరాహసీతారుణ్యజ్ఞానాశ్వత్థ పంచమహాభాగవత శ్వేత మృత్పాకర పరిధానశిలాభిధానంబు లగుసప్తక్షేత్రంబులు సేవించి వేదపుష్కరిణియు దర్భతీర్థంబును బలాశతీర్థంబును వేదవతీమహానదియును వైకుంఠగంగాతీర్థంబును నారాయణతీర్థంబునుమైత్రేయకుండంబునని యెడుసప్త తీర్థంబులనవగాహించి యేతత్తీర్థమధ్యగతయగుతిరుకల్యాణియందవగాహనం బాచరించి తత్కాలోచితకృత్యంబు లొనరించి తొంటిచందంబున భగవత్సేవయొనర్చి యద్దేవదేవుని వీడ్కొని నిజపరివార పరివృతుండయి యచటినుండి సిరిభేత్తూరికేతెంచి యందు శ్రీమదనంత దేశికుని నిల్పి యమ్మహాత్మునిచే ననుజ్ఞాతుండై యాలక్ష్మీపురంబు విడిచి ప్రయాణక్రమంబునఁ గొన్ని దివసంబులకు మగిడి శ్రీరంగధామంబు జెంది యందుఁ గవేరకన్యా ప్రవాహంబునందు నీ రాడి తత్పమయో

చితకృత్యంబు లన్నియుఁ గావించి యచటి కెదు రేఁగుదెంచిన శ్రీరంగవాసుల నందఱు నాదరించి స్వకీయపరిచ్ఛదసమేతుండై యద్దివ్యదేశవాసులతోడం గూడ భగవన్మందిరంబు జొచ్చి శ్రీరంగనాథుని సేవించి తదనుగ్రహంబుచే దదీయ తీర్థశఠకోపప్రసాదాదు లన్నియు లభించి మిగుల నానందించి తదీయాజ్ఞఁ బడసి యమ్మహా భాగవత వ్రాతంబుతో నాత్మీయదివ్యభవనంబునకరుగుదెంచితల్లికిం బ్రణమిల్లి యద్దేవిచే ననుగృహీతుం డై నిజాశ్రితులతోడం గూడి వేదాంత కాలక్షేపం బొనరించుచు సుఖం బుండె నా సమయంబున. 31

సీ. వేదాంతి మేల్నాఁట • సాదరంబుగఁ దదీ, యారాధనము సల్ప • నతనియింటికి
కధ్వశ్రమార్తులై • యాఁకొని యొక్కనాఁ, డిరువురువైష్ణవు • లేఁగుదెంచి
యతనిభార్యలఁ జూచి , యన్నమర్థించిన, నన్నము లే దని • యనృత మాడి
వేదాంతి నీ రాడ • విచ్చేసినాఁ డతఁ, డున్నచోటికిఁ జనుఁ • డన్నలార

తే. యనుచుఁ దత్పతు లిర్వు రి•ట్లలిగి పలుక,విని క్షుదాతురు లై వారు•వేగయతనిఁ
జూచి యావార్తఁజెప్పి రా•సూరి కనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. భార్యలదౌష్ట్య మా•భాగవతులు దెల్పఁ, దెలిసి వేదాంతి స్వ•ధిష్ణ్య మొంది
యావైష్ణవుల సర•సాన్నపానాదుల, సంతుష్టులను జేసి • సాఁగఁ బంచి
పత్నీయుగంబుతో • భాషింప నొల్లక, యతివివిక్తస్థల • మాశ్రయించి
పూర్వతపఃఫల•పూర్తి బ్రాహ్మణుఁడ నై , షడ్దర్శనాచార్య•సంజ్ఞఁ జెంది

తే. కాలపూర్వాపరలోభము • గాలఁ దన్ని, యన్నదానముఁ జేసితి • నని తలంచి
మఱియుఁదనలోనఁబలెక్కె నీ•మాడ్కిననుచు. వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

వ. మఱియు సర్వోపకారక్షమం బగుగృహస్థాశ్రమం బవలంబించి తర్పణరూపంబగు ఋషియజ్ఞంబును స్వాధ్యాయరూపంబగు బ్రహ్మయజ్ఞంబు నౌపాసనవైశ్వదేవాంగ బలిరూపంబగు భూతయజ్ఞంబు నతిథిభోజన స్వరూపంబగు నృయజ్ఞంబును బిత్రుద్దేశకృతకర్మాత్మకం బగుపితృయజ్ఞంబు నివిహుతాహుతాప్రహుతప్రాసిత బలిదానాపర నామధేయంబులయి పంచమహాయజ్ఞంబు లనంబడు. - శ్లో॥ అహన్యహనియేత్వేతా నకృత్వాభుఙ్క్తే స్వయమ్। కేవలం మలమశ్నన్తి తే నరానాత్రసంశయః॥ తస్మాత్స్నాత్వా ద్విజోవిద్వాన్కుర్యాదేతాన్ దినేదినే। తతోన్యథాతుభుఞ్జానో ప్రాయశ్చిత్తీయతే ద్విజః॥ అను నానుశాసనికపర్వ వచనంబులచే నేవిప్రులైనఁ బ్రతివాసరం బీపంచయజ్ఞంబు లాచరింపక భుజించిరేని యాద్విజు లభక్ష్యభక్షకు లగుదురు గావునఁ బ్రాజ్ఞుండగు బ్రాహ్మణుండు స్నాతుండై యిప్పంచ మహా

యజ్ఞంబు లొనరింపవలయు నట్లు సేయఁదేవి ప్రాయశ్చిత్తార్థం బగు నని చెప్పం బడుం గాన నిదియుఁ దక్కిన వైదికక్రియలన్నియు నల్పుచుండియు ధనయౌవన మదంబుచేఁ గామాంధుండనై నివృత్తిధర్మంబులఁ దలంపక యిరువురుభార్యలం గలసిమెలసి మదనతంత్రపరాయణుండనై కొన్నిరాత్రులు జరుపుచున్న సమయంబున సర్వచేతన సంరక్షణార్థంబుగా శ్రీరంగధామంబునందు శేషతల్పంబుపై యోగనిద్రారతిం బవళించియున్న భగవంతుఁడగు శ్రీరంగనాధుండు — శ్లో॥ సాక్షాన్నారాయణో దేవః కృత్వా మర్త్య మయీంతనుమ్। మగ్నానుద్ధర తేజస్తా న్కారుణ్యాచ్ఛాస్త్రపాణినా॥ ఆచార్యస్స హరిస్సాక్షాచ్చరరూపీ నసంశయః॥ అనియెడు ప్రమాణంబున శ్రీపరాశరభట్టారకార్యస్వరూపంబు ధరియించి "వత్సం గౌరివధావతి" యనుక్రమంబుగా గోవత్సన్యాయంబున వీని నన్వేషించుచు విచ్చేటికేతెంచి మహానుగ్రహంబుచే శాస్త్రహస్తంబుల సాఁచి సంసారసముద్రమగ్నుండ నగు నన్నుద్ధరించి నివృత్తిధర్మైకతత్పరునిం గావించి తదీయారాధనం బాచరింపు మని నియమించి మగిడి శ్రీరంగంబునకు విచ్చేసె. నే నిట్టివాఁడనై యుండియు,— శ్లో॥ బలవా నింద్రియగ్రామో విద్వాంస మపికర్షతి॥ అనియెడు న్యాయంబున క్షుద్రతముండనై సంశయంబుల కావర్తంబును నవినయంబులకు భవనంబును సాహసంబునకుఁ బట్టణంబును దోషంబులకు సన్నిధానంబును గపటశతంబుల కాకరంబును నప్రత్యయంబులకు క్షేత్రంబును స్వర్గద్వారంబునకు విఘ్నంబును నరకపుంజంబునకు ముఖంబును సర్వమాయాప్రకాండంబునకుఁ గరండంబును బ్రాణిలోకంబునకుం బాశంబునై విద్యుల్లత లచాంచల్యంబును నతి నిశితంబులగు శస్త్రంబుల తీక్ష్ణతయు గరుడానిలశైఘ్ర్యంబునుం గలిగి స్వసృష్టిసమృద్ధికై బ్రహ్మనిర్మితంబై చతుర్దశభువనంబు లాక్రమించి యున్న స్త్రీయంత్రం బెఱింగి యెఱింగియు నెఱుక చెడి లుబ్ధక ప్రసాదిత జాలంబునం గీలుకొను బాలమృగంబు పోలిక ననాద్యవిద్యాసంచితా పరిమిత పుణ్యాపుణ్యరూపకర్మపాశబద్ధుండనై కాలవేగవివశుండనై యాయోషిద్యంత్రంబునందు నియంత్రితుండనై తి నదియునుం గాక దేవమనుష్యతిర్యక్స్థావరవిలక్షణుండనై జ్ఞానానందామలత్వాది గుణాకరుండనై భగవచ్ఛేషభూతుండనై యుండియు, - శ్లో॥ నాదత్తే కస్యచిత్పాపం నచైవ సుకృతం ప్రభుః । అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః॥ అనియెడు గీతోక్తక్రమంబుగా క్షణక్షరణ స్వభావాచేతన దేహాత్మాభిమానరూపా జ్ఞానతిమిరతిరోహిత స్వస్వరూపుండనై జాత్యంధుండు పురస్థితవస్తు వీక్షింప లేనికరణిఁ దత్త్వహిత పురుషార్థ రూప పరార్థవిమర్శనంబు సేయనేరక వార్షికవాహినీ ప్రవాహ

మానాహీన ఫేనసంబంధతృణకాష్ఠప్లవంబుకైవడి సంతతకూటమిగతింగూడి స్థూల జలూకాజాలంబు రక్తపానంబొనరించుమాడ్కి సంపత్కాలంబున సర్వస్వాపహార కంబై విపత్సమయంబునం దరక్షకంబైన బాంధవాభాస సముదాయంబుతో సహ వాస బుఁ జేసితి నింక. - శ్లో॥ జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః। తేషా మాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్॥ అను గీతోక్తన్యాయంబున నస్మదాచార్యప్రసాదలబ్ధస్వరూపజ్ఞాన ప్రదీపంబుచే సర్వానర్థమూలకారణం బయిన పూర్వోక్తాజ్ఞానాంధతమంబుఁ బాసి గురుకృపాతిశయంబుచే విషయవైరాగ్య నిశిత శరాగ్ర బుచే నయ్యోషాయంత్రంబు భేదించి నిర్గమించి మరలి వైతండికవేగవ ద్భవార్ణవబంభ్రమ్యమాణ భయంకర మహావర్తంబునం బడి చెడక సన్న్యసించి స్వదేశిక సాన్నిధ్యంబుఁ జెంది తత్కైంకర్యంబు సల్పుచు సుఖం బుండెద నని నిశ్చయించి యేకాంతమందిరంబు వెల్వడి వచ్చి శ్రీరంగయాత్రార్థం బుద్గమించినం జూచి శరీరసంబంధు లడ్డగింప వారి సమ్మతిచే నున్న ధనంబంతయు మూఁడు భాగంబు లొనరించి స్వభార్యలిరువురకు రెండంశంబు లొసంగి స్వాచరిత తదీయారాధన ప్రతికూలంబును నవ్యభోగ్యతారూపంబునకు విరోధియు నగు విహిత విషయంబుఁ బరిత్యజించి శాస్త్రోక్తక్రమంబుగాఁ దురీయాశ్రమంబుఁ బరిగ్రహించి యవశిష్టధనభారంబు లన్నియుఁగూడఁ దరలించుకొని మితపరిజనంబుతో స్వగ్రామంబు విడిచి శ్రీరంగాభిముఖుండై చనిచని లక్ష్మీపురాపరనామధేయంబు గల యాసిరిభేత్తూరుఁ జెంది యందు 34

సీ. విద్వద్వరేణ్యుఁ డా• వేదాంతవేద్యుఁడ, శ్రీమదనంతదే• శికునిఁ జూచి
వాఁగిలఁబడిమ్రొక్క• సజ్జనాగ్రణి యతం, డతనిఁ గౌఁగిటఁ జేర్చి• యాదరించి
మాన్యభోగము సౌకు• మార్యముకలిమియు, జ్ఞాన మక్రోధము• శమముదమము
సత్యము శీలము • శౌచము గురుభక్తి, యానృశంస్యము మొద • లైనమేలి

తే. గుణము లన్నియు నీతోడఁ• గూర్మి సల్ప, సాహసముఁజేసి నీవిట్లు• సన్న్యసించి
కష్టపడ నేటి కనిపల్కెఁ • గరుణననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. చెమటపట్టినవేళ • విమలోదకములయం, దవగాహనముఁజేసి • యాఁకలైన
సమయమునందుఁ బ్ర• సాపడ భట్టరు, చరణాబ్జయుగళమే • శరణ మనుచు
నమ్మినవైకుంఠ• నాథునిసభ నిన్నుఁ, దొలఁగఁ ద్రోసెడివారు • గలరె యనుచుఁ
బలికి యనన్యప్ర• పన్ను నివ్వేదాంత, వేద్యుని బ్రహ్మాని• వీఁపు ద్రువ్వి

తే. వత్సతిరుమంత్రమునఁబుట్టి • ద్వయమునందు. మించివర్ధిల్లుమనుచు దీ•వించివంచె
నార్యసేవితుఁ డయ్యెనం•తార్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అట్లమ్మహాత్ముని•యాజ్ఞ లభించి వే•దాంత వేద్యమనీషి • యచటనుండి
కదలి యతిద్రుత•గతి నేఁగుదెంచి శ్రీ•విరజభావనను గా•వేరి దాఁటి
ముక్తుఁడు వైకుంఠ•మునకుఁ జేరుకొలంది, శ్రీరంగధామముఁ•జెంది యందు
భక్తిఁ బరాశర•భట్టారకార్యునిఁ• గస్తూరిరంగని•కరణిఁ గాంచి
తే. ధనసమూహము మనమును • దత్పదార
విందములయందు నర్పించి • వేడ్కఁ మ్రొక్కఁ
జాల హర్షించె నాగురు•స్వామి యనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర 37

సీ. భట్టరు తనపాద•పద్మములందుఁ బ్ర•ణామము సల్పు స•న్న్యాసి నతని
గ్రుచ్చెత్తి కౌఁగిటఁ • గొనుచు నంజియ్యరే. కుశలమా నీ కని • గూర్మినడుగ
నాఁటనుండి యతఁడు•నంజియ్యరని మూఁడు•జగములయందుఁ బ్ర•శస్తిఁగాంచి
యద్దేశికునికడ • నతులవేదాంత ర•హస్యము లన్నియు • నధికరించి
తే. యమ్మహాత్మునిసన్నిధి • నణునిమేష•మైన నెడఁబాయనొల్లక • యతఁడె పరమ
దైవతం బని నెమ్మదిఁ • దలఁచె ననుచు. వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. భట్టార్య నొకనాఁడు • ప్రణమిల్లి యడిగెను. నంజియ్య రీ రీతి • నయమెలర్ప
శౌరి యాచంద్రపు•ష్కరిణీచెంత ననంత• పర్యంకతలమునఁ • బవ్వళింప
నేమినిమిత్తమో • యెఱిఁగింపు మన విని. యమ్మహాదేశికుఁ • డతనిఁ జూచి
నలఁగి యోనారాయ•ణా కావుమని కరి• మొఱ్ఱఁబెట్టినమీఁద • మునుపు సరసి
తే. కడకుఁ జనుదెంచె నేమొఱ • యిడకమున్నె
కరుణ ననుఁ బ్రోవఁ జంద్రపు•ష్కరిణిచెంతఁ
బవ్వళించెను హరి యని • పల్కె ననుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 38

సీ. మఱఁగుగా నాదునె•మ్మదినున్నయర్థము• విన్నుండిబయలొండె • నేఁటికనుచుఁ
దనగురుఁ డనిన డెం•దమునందు వేదాంత•వేద్యుఁడుంచెను బ్రహ్మ•వేత్త లెల్ల
హరి యొనర్చిన సక•లావతారములు మ•మ్ముద్ధరించుట కని • యుల్లములను
గణుతించుచుందురు • గాని యస్మద్దేశి•కుఁడు మాకు నొప్పెనీ•కొలఁదిననుచు

తే. మఱియు నొకనాఁడు భట్ట రా॰మాన్యతముని
యూరుతలమున శయనించి ॰ యురగశయ్య
శ్రీనివాసునివగిది ని॰ద్రించె ననుచు
వాదిభీకరగురుఁ డనె ॰ మోద మలర. 40

సీ. తనదేశికుని సుఖ॰తరనిద్ర కేమియు, భంగము రాకుండ ॰ భక్తి మీఱ
నంగ మంగముపైని ॰ నసియాడనీయక, యద్రియట్లు డె వే॰దాంతవేద్యుఁ
డార్యు లాతనిఁజూచి,యక్కజపడి మెచ్చి, యాభావ్యవిషయమై ॰ యతనిమాడ్కి
విశ్చలస్వాంతులై ॰ విఖలకైంకర్యముల్, సేసి రేని స్వరూప॰సిద్ధి గలుగు

తే. శిష్యులకు నని తమతమ॰చిత్తములను, దలఁచి రాభట్టరంత ని॰ద్రను దొలంగి
యాత్మశిష్యునిగురుభక్తి॰ కలరెననుచు, వాదిభీకరగురుఁ డనె ॰ మోదమలర

వ. మఱియు నొకసమయంబున. 42

సీ. శ్రీపరాశరసూరి ॰ సేతువుకడ కేఁగి, శ్రీధనుష్కోటిఁ దీ॰ర్థీకరించి
తిరిగివచ్చుచు నొక॰దినమునఁ ద్రోవలో, భూరికాననమునఁ ॰ బ్రొద్దు గ్రుంక
పాధిరుక్కుడి యను॰పల్లె నొక్కెడ నొక, యేనాదివానింటి ॰ కేఁగుదేరఁ
గటికిచీఁకటి దోవఁ ॰ గనలేక మనయింటి, పఁచ కేతెంచి రీ॰బాఁపనయ్య

తే. లిట్టివారికిఁ జోటు నే ॰ నియ్యకున్న, మంచి వాటిల్ల దంచుఁ ద॰లంచివాఁడు
స్థలముఁ జూపించె వారి కఁ॰దటికి ననుచు, వాదిభీకరగురుఁ డనె ॰ మోదమలర.

సీ. తమభక్ష్యవస్తుజా॰తము లేమి లేకుండఁ, జేసి యిల్లొక్కటి ॰ శీఘ్రమొసఁగి
ఖట్వ మొక్కటి బాగు॰గావించి యిచ్చిన, భట్టరందు వసించి ॰ భావమునను
మనవైభవ మెఱింగి ॰ మన కిట్టి సత్క్రియ, సల్ప లేదీ వన॰చరవరుండు
ఖ్యాతికై వీఁ డిట్లు ॰ గావింప లే దస్మ,దుపకృతిఁ జెంది యి॰ట్లుపచరించి

తే. నాఁడుగాఁడు మఱే మన॰నాగృహంబుఁ, జెందువారి నుపేక్షింపఁ॰జెల్లదనుచు
నిట్లొనర్చెను వీఁడని ॰ యెంచెననుచు, వాదిభీకరగురుఁ డనె ॰ మోద మలర.

సీ. మర్త్యమాత్రున కభి॰మాన మిట్లుండిన, నంశ్రితవిషయమై ॰ స్వామి కస్మ
దీయాభిమ్యానము ॰ నేయ మిఁతిం తని, చెప్ప శక్యమె యని ॰ చింతఁ జేసి
వి-త లే మిచ్చట ॰ వినిపింపు మని భట్ట,రడుగ నావ్యాధుఁడు ॰ నుడివె నిట్లు
సామి నే వేఁటకై ॰ చని కాని నొకకొండ, ముచ్చుపిల్లను బట్టి ॰ తెచ్చుచున్నఁ

తే. గనుల నీ దూర నడరి నా, కన్ను మొగిని, దల్లి మ్రొక్కెడ దయ దాని పిల్ల నెడలి
వచ్చి తేనింటికనివాఁడు, పల్కెననుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర.

వ. అట్లప్పరాశరగురుం డక్కరాతవరుని కవికరంపుఁ బలుకుల కంరి నంజియ్యరు నుద్దేశించి వత్సా 'మామేకం శరణంవ్రజ' యని యక్కొండ ప్రమ్ముప్పిల్ల కొక్క రుపదేశించినాడు కాడు. 'అరిః ప్రాణా న్పరిత్యజ్య రక్షితవ్యః కృతాత్మనా' అను న్యాయంబునఁ దన శత్రుండైన శరణాగతుం డాయెనేని బుద్ధిమంతుఁ డైనవాఁడు తనప్రాణంబులైన విడిచి వానిం గావవలయునని యివ్వనచరునకైన నొక్క రుపదేశింపలేదు గాన దేశకాలాది నియమంబు లేక యవ్యవధానంబుగాఁ బ్రపదనం బెట్టివారికైన ఫలించు నిది ప్రమాణసిద్ధంబని యానతిచ్చి యారాత్రి సుఖంబుగా నిద్రించి ప్రభాతంబైన మేల్కాంచి గురుపరంపరఁ దలంచి నిజపరివారంబుతో శ్రీరంగంబున కరుగుదెంచి నిజనివాసంబునం దాత్మచ్ఛాత్ర వర్గంబునకుఁ దొంటి చందంబున నుభయవేదాంత రహస్యార్థంబుఁ దెల్పుచు సుఖంబుండె నయ్యవసరంబున. 46

సీ. చోళభూపతి వీర సుందరబ్రహ్మరా, యఁడు రంగనాథ ర, మాధిపతికిఁ
బ్రాకార మొక్కటి, రచియించుచున్న పి, ళ్ళప్పిళ్ళ సూరియా, లయమునడుమ
నడ్డముగాఁ దోఁప, నది పడఁగొట్టించి, కట్టింపఁ దలఁప నా, కలుషవార్త
భట్టరు విని వచ్చి, పరకాలముని తొల్లి, భక్తాంఘ్రిరేణుల, భవన మడ్డ

తే. మైనఁ గునిఁ బెట్టి కట్టించె, నట్లు నీవు, సలుపు మార్యులమంగళా, శాసనంబు
హరికిఁ గా పగువేఱుగా, దనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె, మోదమలర.

వ. అంతఁ జోళసామ్రాజ్యలక్ష్మీ మదోన్మత్తుండగు వీరసుందరబ్రహ్మరాయ నృపాలుండు సూ॥ ఆచార్యవదాచార్యపుత్రేవృత్తిః॥ అనియెడు శాస్త్రార్థం బాచరింపక స్వాచార్యపుత్రుండైన యప్పరాశరభట్టారకుని పరమహితామృతంబు గులుకుపలుకు లాత్మదోషవశంబున వేఁడిములుకులపోలిక ననహ్యంబులై తోఁచిన మిగుల నలిగి యా మహాదేశికునియాజ్ఞ నతిక్రమించి మహావాతనిర్ధూత దగ్ధపటన్యాయంబున భాగవతాపచారాగ్నిదగ్ధుండు భగవన్నిగ్రహ ఝంఝామారుతాతివేగంబునఁ బ్రణష్ట స్వరూపుండై చెడునని సజ్జనులవలన వినియు నట్లు పేయనొల్లక పిళ్ళప్పిళ్ళ యాళ్వా నను మహాభాగవతుని మందిరంబును మచ్చుమాపి ప్రాకారంబు గట్టించి యప్పరాశరసూరి కత్యంతోపద్రవంబులు సల్పుచున్న నగ్గురుశిరోమణియు, శ్లో॥

త్యజే దవృత్తికాం భూమిం వృత్తిం సోపద్రవాం త్యజేత్। త్యజే త్పాపిష్ఠ రాజా న మ్మాయాబన్ధూ న్పరిత్యజేత్॥ అను వచనార్థంబుఁ దలంచి పాపిష్ఠతముం డైన యారాజును దదధ్యుషితప్రదేశంబుతో విడిచి తిరుక్కోట్టియ్యూరను ద్రవిడనామంబు గల గోష్ఠీపురంబునకు విచ్చేయుచు మార్గమధ్యంబునందు వడగాడ్పుచే సుడివడి యొక వృక్షచ్ఛాయ నాశ్రయించి తన యంతేవాసులయందుఁ దన యంతరంగచ్ఛాత్రుఁడగు వేదాంతవేద్యుం డీషద్దూరగతుండై వచ్చుచుండ నంజియ్యారే యని యుచ్చైస్స్వరంబునఁ బిలువ నతం డాలకించి యతి త్వరితగతి నేతెంచి క్షుత్పిపాసార్దితుండైన స్వాచార్యునిం జూచి వ్యధితాంతఃకరణుండై శ్రీరంగరాజ భుక్తావశిష్టంబును బావనత్వ భోగ్యత్వాదిగుణ సంపన్నంబునమృతోపమానంబును నైన దధ్యోదనంబును నతిశీతలతీర్థంబులు సమర్పింప నారగించి యమ్మహాత్ముండు విగతాధ్వశ్రముండై స్వాచార్యుం డివ్విభూతియందు వర్తించుకాలంబు నందయను వర్తనవిశేషంబులం దదీయకైంకర్యంబులు సలుపవలయు ననియెడు శాస్త్రార్థంబుఁ దెలిపి యిమ్మహాత్ముం డిట్లు నన్ననుసరించుచున్నవాఁడని తన మనంబునఁ దలంచి ప్రహృష్టాంతరంగుండై కొన్ని యర్థవిశేషంబు లతని కుపదేశించి స్వపరిజనులతోడం గలసి గోష్ఠీపురంబుఁ బ్రవేశించి యందొక్క నివేశంబునందు వసియించె నంత. 48

సీ. అంతట నొక్కనాఁ, డమ్మహాత్మునిఁ జూచి సాత్త్వికుం డొకఁ డిలఁ, జాఁగిమ్రొక్కి-
తిరువృత్తమున కర్థ, మెఱిఁగించి యది సంత, యొప్పుగా వీనికిఁ, జెప్పు మనిన
నంజియ్యరే రంగ, నాథునిఁ బాసిన, నాఁ డాది నేఁటికై, నను మదీయ
సర్వేంద్రియంబులు, శక్తిహీనము లయ్యెఁ, గావునఁ దిరువృత్త, మీవె యితవి

తే. కానతిమ్మని గురుఁ డన, నతఁ డతనికి నున్నయట్లర్థ మెఱిఁగించి, యొక్కసారి
సంత చెప్పెను దిరువృత్త, మంత యనుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర.

వ. అంత మఱియొక వాసరంబునం దప్పరాశరగురుండు తన మానసంబున శ్రీరంగక్షేత్రంబును శ్రీరంగనాథునిం దలంచి తదేకాంతస్వాంతుండై, శ్లో॥ పూగీకణ్ఠద్వయసరసస్నిగ్ధ నీరోపకణ్ఠామన్తర్మోదస్తిమిత శకునానూదిత బ్రహ్మఘోషామ్। మార్గేమార్గే పథికనివహై రుఞ్ఛమానాపవర్గాం పశ్యేయం తాం పున రపి పురీం శ్రీమతీం రఙ్గధామ్నః॥ పూగీకంఠదఘ్న మధురస్నిగ్ధ నీరోపకంఠంబును నంతర్మోదస్తిమితశకునానూదిత బ్రహ్మఘోషంబును బ్రతిమార్గ సమాగత పథికనివహోంఛమానాపవర్గంబును నగు శ్రీరంగనాథ రాజధానీరత్నంబును మఱియు, శ్లో॥ కస్తూరీ

తిలకోర్ధ్వపుణ్డ్రకలితం కర్ణాన్తలోలేక్షణం కిఞ్చిద్విస్మిత కోమలాధరపుటం ముక్తా కిరీటోజ్జ్వలమ్। పశ్యన్మానస పశ్యతోహరతరం పర్యాయపఙ్కేరుహం శ్రీరఙ్గాధిపతేః కదానువదనం సేవేయభూయోప్యహమ్ ॥ కస్తూరీతిలకోర్ధ్వ పుండ్రంబును గర్ణాంతలోలలోచనంబులును మందహాస మధురాధరపుటంబును ముక్తారత్న కిరీటోజ్జ్వలంబును బశ్యన్మానస పశ్యతోహరతరంబును బర్యాయపద్మంబు వగు శ్రీరంగనాథుని తిరుముఖమండలంబును మరల నెన్నఁడు సేవించెదనని యీ రెండు శ్లోకంబుల నానతిచ్చి యార్తిపడుచున్న సమయంబున. 50

సీ. ఆసురప్రకృతి యొ • నావీరసుందర, బ్రహ్మరాయఁడు యమ • పట్టణమున
కతిథియై చనెనని • యప్పరాశరసూరి, శిష్యులు విని మదిఁ • జింత మాని
యాత్మోత్తరీయము • లంబరమున కెగఁ, జిమ్మి పట్టుచుఁ గేలుఁ • దమ్ము లెత్తి
యాడుచుఁ బాడుచు • నరిగి భట్టరుతల్లి. యైనయాండాళమ్మ • కమ్మహీశు

తే. మరణవార్త యెఱింగింప • మదిఁ గలంగి
తనగృహముఁ జొచ్చి వాకిటి • తలుపు మూసి
చాల నెలుఁగెత్తి యేడ్చె నా • సాధ్వి యనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 51

సీ హర్షించువేళ నీ • యార్తి యే మనుమ వా, రడుగ నాండాళమ్మ • యబ్బుధాళి
కాళ్వానుసంబంధి • యయ్యు నీవీరసుం • దరుఁడు భట్టరుకడ • దారుణాప
చారముఁ జేసి ప • శ్చాత్తాప మైనను, జెందక మరణముఁ • జెంది ఘోర
కాలకింకరపాశ • కర్షణతర్జన, తాడనాదుల దప్పి • దండధరుని

తే. యుగ్రమార్గగతిక్లేశ • మొందిచెంది, యతనియానతి బహువిధ • వ్యధలఁ బొందె
ననుచు వగచితి నని చెప్పె • నప్పు డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అంతఁ బిళ్లప్పిళ్ల • యాళ్వానుసూరి గో • ష్ఠీపురంబునకు వి • చ్చేసి యందు
భట్టార్యు సేవించి • ప్రమదంబు నిండార, నారాజమృతవార్త • నానతియ్య
నద్దేశికేంద్రుఁడు • హర్షించి యతనితో, నాశ్రితతతితోడ • నచటినుండి
వచ్చి శ్రీరంగముఁ • జొచ్చి రంగేశునిఁ, గన్నులపండువు • గా భజించి

తే. సన్నుతులుచేసి తీర్థప్ర • సాదముఖ్య • బహుమతులఁగాంచి యాత్మీయ • భవనమొంది
యుల్ల మలరంగ మ్రొక్కెడె • దల్లికనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. అంతట నమ్మణి•యాళ్వా ననెడిసూరి, దూరదేశమునుండి • చేర వచ్చి
భట్టార్యుఁబొడగాంచి•ప్రణతిఁగావించి యీ, యాత్మకెయ్యదితంజ • మనిననతఁడు
హరినెఱుంగుట తంజ•మదియెట్టి దనఁ దదీ.యుల నెఱుంగుటయది•యొరసిచూడఁ
బరమభాగవతుల • భగవత్స్వరూపులఁ, గాఁ దలఁచుట యింత•కంటె వేఱు

తే. శరణమేమనిపల్క నా•సాత్త్వికుండు, నిదియె పరమార్థమని మది•నెంచి మగిడి
యమ్మహాత్ముని వీడ్కొని•యరిగె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర,

సీ. న్యగ్రోధబీజము•నందు వటంబట్లు, ప్రణవమున దు శ•బ్దవ్రజంబు
నరణిఁ దదీయ శే•షత్వసంపదయందు, సకలార్థలాభము • సంభవించు
నని మదిఁ దలఁచుచు • నమ్మణియాళ్వాను, చనినపిమ్మట నొక్క•సమయమునను
విలసితవిభవుఁడు • వీరశిఖామణి, వల్లరాయఁడు వచ్చి యుల్ల మలర

తే. నప్పరాశరభట్టార•కార్యుఁ జూచి, నయ మెలర్పంగ సాష్టాంగ•నతి యొనర్చి
భక్తి నద్దేశికుని కిట్లు • పలికె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. రాజకృత్యముల న•రక్షణం బైనను, దెఱపి చిక్కదు మదిఁ • దెలివి లేదు
భట్టరే భగవంతుఁ • డిట్టినామన మున్కి•పట్టుగా నుండు ను•పాయ మొకటి
యాన తిమ్మని నృపుఁ • డడిగిన దక్షిణ•సింధుతీరమున నీ•చిత్త మునిచి
తేటగా లోదృష్టి • మాటిమాటికిఁ జూడ, నాఁటినాఁటికి నల•వాటుపడుచు

తే. నాటప ట్టగు నీమది • హరికి ననుచు, నమ్మహాత్ముఁడు చెప్పఁ ద•దాశయంబుఁ
దెలియ లేఁడాయె నానర•దేవుఁ డనుచు. వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. అ ట్లవ్వాక్యంబుల కాశయంబుఁ దెలియలేక డోలాయమాన మానసుండగు
రాజేంద్రున కద్దేశికేంద్రుం డిట్లనియె. 57

సీ. వరఁగ డెబ్బదికోట్ల•ప్లవగగోలాంగూల, భల్లూకయూథాధి•పతులు గొల్వ
నబ్ధి కిద్దరి నొక•యమృతసముద్రము, కరణిఁ దమ్మునితోడ • గలసి యుండి
యద్దరి నరవాన•రాదిభక్షకుఁ డైన, రాక్షసేశ్వరుఁ డుండ • రణమునందు
నేన యారావణు • నిరసించెదను నేనె, కుంభకర్ణాదులఁ • గూల్తు ననుచుఁ

తే. బగలు బీరంపుఁ బలుకులఁ • బలికి రేయి, నిద్రఁ జెందెడుమర్కటా•నీకపతుల
స్వామి రక్షించు ననియె నా•సఖ్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

వ. ఆ రక్షణప్రకారం బెట్టిదనిన. 59

సీ. ఇది రాక్షసులభూమి • యిందు వీ రందఱు, శాఖామృగంబులు•స్వామి యనుచు
నమ్మి నాయెడ భర•న్యాసంబుఁ జేసి ని,ర్భీతులై రాత్రి ని•ద్రించి రిట్లు
రజనీచరులవల్ల • రక్షించెదను వీరి, నని యెంచి బాణబా•ణాసనాది
సాధనంబులఁ దాల్చి • సౌమిత్రితోడ రా,ఘవుఁడు కోదండదీ•క్షాగురుండు

తే. హరిబలంబులచుట్టును • దిరిగి ప్రోచు, నతనిశరచాపములె తంజ•మనుచు మదిని
దఁ(పుమని భట్టరతనికిఁ • బలికెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర

సీ. ధృతిఁ ద్రిభువనవీర•దేవరాయనృపాలుఁ, డొకదినంబున సభ•యుక్తతముని
భట్టార్యుఁ బొడగాంచి•ప్రణతిఁ గావించి మా,మందిరమున కొక•మాఱు మీరు
వచ్చి పొం డనుచు నా•క్రుచ్చిన విని యమ్మ,హాత్ముఁ డారాజున • కనియె నిట్లు
శరణాగతత్రాణ•బిరుదాంకితుఁడు హరి, నన్నుఁ జే విడిచిన•నాఁటి కైన

తే. నతనిదివ్యాలయపుఁ బంచ•టరుఁగు విడిచి రాజభవనవితర్దికి • రాము నమ్మ
టంచు భూపతికనియె న,య్యార్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. భువనత్రయేశుఁడు • పురుషోత్తముఁడు దేవ,దేవుఁడు హృదయైక•భావనీయుఁ
డాత్మపదప్రదుఁ • డామ్నాయవేద్యుఁడు, నారాయణుఁడు నిజ•నాథుఁ డుండఁ
గతిపయ గ్రామాధి•కారి నల్పార్థదు, గర్భజన్మాద్యార్తి•కలితదేహ
నొకపురుషాధము • నుర్విలో సేవకై, వెదకుచు ను-టిమి • వెఱ్ఱివాం(ఛ

తే. మైతిమని కుందుదురు కవు•లాత్మయందుఁ, బరమతత్త్వవిదగ్రణి•భట్ట రవని
కాంతునామాడ్కి నను చేమి•వింతయనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. కోవెల కరిగి యా•గ్గురువరుం డొకనాఁడు, స్వామిసన్నిధికి నా•సక్తి నేఁగ
నమ్మహాత్మునిరాక•యర్చకుఁ డెఱుఁగక, యతనిపైఁ గలుషవా•క్యములఁ బల్కి
నామాటకు నెదు•రాడఁ బూనినతన, యాశ్రితునకు భట్ట • రవియె నిట్లు
పలుమాఱు వత్స మ•త్పాపము లన్ని నే, హరికిఁ జెప్పిన సాక్షి•నతఁడు గోరె

తే. శౌరికడ నేఁటి కీతఁడు • సాక్షియయ్యె, నిట్టియుపకారిపైఁ గోప•మేల నీకు
ననుచు శిష్యున కీరీతి • ననియె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. శ్రీపరాశరగురు•శిష్యరత్నము సోమ,యాజి వైష్ణవుఁ డొకఁ • డరుగుదెంచి
స్వగురునిఁ గని మ్రొక్కి • స్వామి నీనికి శ్రీమ,దారాధనక్రమం • బాన తిమ్మ
టంచుఁ బ్రార్థింప న•య్యార్యుఁ డాచార్తున, కుడయవరుల నిత్య • మొసఁగిరంత
స్వాచార్యపీడ్యాని•యతఁ డింటికరిగి యా,క్రమముగా భగవదా•రాధనంబు

తే. సంతతముయామమాత్రము•సల్పుచుండి, కొన్నిదినములకేతెంచి • గురునిమరలఁ
గాంచి రెన్నాళ్ళు తత్పూజఁ•గాంచె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. అద్దేశికేంద్రుం డాచరించు తిరువారాధనక్రమం బెట్టిదనిన. 65

సీ. నిర్మలోదకముల • నీరాడి ధౌతవ,స్త్రయుగంబు ధరియించి • ద్వాదశోర్ధ్వ
పుండ్రంబులను దీర్చి • పూర్వదేశికపంక్తి, దలఁచుచుఁ దిరుమణి•త్రావళములఁ
దాల్చి తత్కాల్యకృ•త్యమొనర్చి పెరుమాళ్ల,కారగిం పొనరించి • యాప్రసాద
మార్యులతో నమ్మ•హాత్ముఁడు సాపడి, భగవద్గుణానుభ•వంబు సల్పి

తే. నట్టినిజగురునాసోమ•యాజిచూచి, స్వామి విన్నప మొక్కటి•సలుపవలయు
నభయ మిచ్చినఁ జేసెద•ననియె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. వత్సక వెఱపేల • వాక్రుచ్చుమా నీ వి,వక్షితం బని యార్య•వర్యుఁ డనిన
నడియేని కొకజాము • తడ వగునట్లుగా, నారాధనక్రమ • మానతిచ్చి
యతిలఘుక్రమముగా•హరి కర్చ మీరు చే,సితి రది యే మని•శిష్యుఁ డడుగ
వేదశాస్త్రములందు • వెదకిన నీ కింత,కంటెఁ దక్కువవిధిఁ • గాన నైతిఁ

తే. గాన నీ కిటు చెప్పితిఁ • గపట ముడిగి, యరసి చూచిన మా కిది•యైన సలుప
సత్త గనఁబడ దనియె నా•సభ్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. జ్ఞానానుగుణముగా•ఛాత్రుల కుపదేశ, మాచార్య లొనరింతు • రందుకతనఁ
గొంచెగిత్తకు గుది•కొయ్య గట్టినమాడ్కి, స్రగ్గంధయోషాది•సక్తుఁ డైన
యతనికి సర్వేంద్రియము లచ్యుతార్చకు, నగునట్లు లాక్రమ•మార్యుఁడొసఁగె
భగవదేకాంతి యా•భట్టార్యుఁ డస్మద్వి,ధోజ్జీవనార్థమె • యుచితకర్మ

తే. మాచరించెను గాకున్న • నతని కేల, కర్మములజోలి యాశుభా•కారభరితు
నమ్మహాత్మునిఁ దలఁచెద • నాత్మననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. అంత నొక్కవాసరంబున నప్పరాశరదేశికేంద్రు నొక చేతనుఁడు గాంచి నమస్కరించి శ్రీవైష్ణవు లితరదేవతల ననుసరింపకుండుట కేమికారణం బనియడుగఁ బ్రమాణవిరోధం బున్నయెడఁ గదా సందేహం బుదయించు నీయర్థంబునందుఁ బ్రమాణంబులకుఁ బరస్పరవిరోధంబు లేనికతన సందియంబు వాటిల్ల దది యెట్లంటివేని సత్త్వ ప్రచురులను రజస్తమః ప్రచురు లనువర్తించుట విడిచి వారలు వీరి నెట్లను వర్తింతురు కావున నాలయస్థిత దేవతాంతరంబులను గుణదోషజ్ఞానంబుచే శ్రీవైష్ణవు లనుసరింప రని గురువరుం డాన తిచ్చె మఱియును. 6

సీ. పరమపావన మైన•భట్టార్య శ్రీపాద, తీర్థ మాతని కేమి•తెలియ కుండఁ
దల్లి యాండాళమ్మ•తచ్ఛిష్యవరునిచేఁ, జేర్పించి నిత్యము•స్వీకరించు
నాకృత్య మొకవైష్ణ•వాగ్రణి దెలిసి యో, యమ్మ నీకే మిది•యర్హ మవిన
నన్యులకడ నున్న•హరితన కైనట్లు, తనయింటఁ గలుగు శ్రీ•ధరుఁడు తనకు

తే. దీర్ఘయోగ్యుఁడు గాకున్న•దివ్యబోధ, ఘనులు మతశిష్యులునుదీర్థ•కరులు గారె
యనుచు వ్రాసిచ్చె నద్దేవి•యతని కనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. మఱియొక వాసరంబునందు రజస్తమః ప్రచుర దేవతా రాధనతత్పరుం డై నయొక స్వర్ణ కారుండు నిజభుక్తావ శిష్టంబైన చూర్ణం బొక నాగవల్లీ దళంబునం దుంచి శ్రీరంగనాథుమంటప స్తంభంబునం దొక్కెడం జెక్కి చనినఁ దన్మంటపావలోక నకౌతూహలంబునంజేసి యభినవయౌవనసుందర సుకుమారశరీరుండును భట్టార్య శ్రీపాదాశ్రితుండును నగునొక భాగవతకైంకర్య కుమారుం డేతెంచియందు విహ రించుచు నాచూర్ణంబు గనుంగొని భగవన్మందిర స్థితంబుగావున భాగవత శేషం బుగాఁ దలంచి పరిగ్రహించి తాంబూలచర్వణం బాచరించి తదనుభవంబుచే రజ స్తమోదూషిత స్వాంతుండై నటవిటగాయకులం గూడి యొకదినంబునంద పూర్వ వయోరూప విలాసభాసమాన యగునొక దేవదాసిని జూచి మోహించి తత్సంగమంబపేక్షింపశ్రీపరాశరగురు చరణసరసీరుహంబు లాశ్రయించిన యద్దేవదాసీ రత్నంబు మహాత్మానీవు పెరియభట్టార్యుని సంబంధివి నేను నీతోడం గూడిన నాపై నద్దేశికేంద్రుం డలిగినమత్స్య రూపంబు నశించుం గావున నగ్గురు వరునితో సంబంధంబుఁ బాపికొనివచ్చితివేని నీతోడంగూడి విహరించెద నని పలుక నాలకించి తదీయదర్శనీ యావయవాసక్త చిత్తుండై యతిత్వరితగతినే తెంచి నిజాచార్యునిం జూచి యిట్లనియె. 71

సీ. భట్టార్య నీతోడ•బనిలేదు మా కింకఁ, జనియెద నెందైన•సత్య మనుచుఁ
బరుగెత్తఁ గనుఁగొని•పరమకారుణికుఁ డా, భట్టార్యుఁ డతనికి•బలికె నిట్లు
వెంగలి వైనన్ను•విడిచినప్పటి కైన, వత్సక నిన్ను నే•వదల ననుచు
బలవంతు లగుభాగ•వతుల నిర్వురఁ బంచి, పట్టి తెప్పించి యా•భట్ట రతని

తే. గాఢసంశ్లేష మొనరించి•గారవించి. రమ్యబోధ మొనర్ప వి•రక్తిఁ జెంది
భక్తి నతఁ డాత్మగురునెడ•బాయఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. పల్లకిలో నెక్కి•భట్టార్యుఁ డొక్కనాఁ, డరుగంగ నంబియ్య•రతని కెఱుక
పడకుండఁ దత్పృష్ఠ•భాగమునం దుండి, యాందోళికాదండ•మంసమునను

బూనుచు నడుగులు•పుడమిపైఁ దడఁబడ, నిడి నడచినఁ దన•యొడలు గదల
భట్టరెఱింగి యా•పల్లకిలో నుండి, యుర్విపై గుప్పున•నుఱికి యతనిఁ

తే. గౌఁగిటను జేర్చి కరుణతో•గారవించి, సౌమ్య యతివేషమున కిట్టి•సాహసంపుఁ
బని విరుద్ధము సత మని•పల్కె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. అట్లుపలుకు చున్న యాచార్యునిసూక్తు లాకర్ణించి యతఁ డతని కిట్లనియె 74

సీ. స్వామి తావకదాస్య•సామ్రాజ్యసంసిద్ధి, కంతరాయము గృహ•స్థాశ్రమంబు
యతివేష మనుకూల•మనుచు నెంచితిఁ గాని, యిది విరుద్ధం బని•యెఱుఁగనైతిఁ
గాన దేవరవారి•కైంకర్యమునకు వి, ద్వేషి యౌనీయతి•వేష మేల
యని తనమోఁకాల•నాని త్రిదండము, విఱువఁ బూనినఁజూచి•వేగ గురుఁడు

తే. వత్స నంజియ్యరే యిట్టి•పని యొర్పఁ, దగదు నీకని వారించి•దాంతు శాంతు
నతనిఁ దనవెంటఁ దోడ్కొని•యరిగెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. భట్టరు శ్రీమహా•భాగవతవ్రాత, పరివృతుఁ డై యొక•వాసరమున
వేదాంతవాక్యార్థ•వివరణ మొనరింప, నం దొకవైష్ణవుఁ•డస్మదీయ
పుణ్యాతిశయముచేఁ•బొడగంటి నీగోష్ఠి, నన పిరియాచ్చానుఁ•డతనిగుఱిచి
శౌరినిర్హేతుక•జాయమానకృపాక, టాక్షవీక్షణముచే•నక్షయర్ధిఁ

తే. జెందుఁ బ్రపదవపరుఁ డని•ముందు మీర, లాన తిచ్చితి రిప్పు డి•ట్లనుటదగునె
యనిన నూరకయుండె న•య్యార్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. రంగనాథుఁడు దక్క•రక్షకుఁ డన్యుఁడు, గాఁ డని తలఁచి స•గము దొలంగి
బాహ్యోపవనమునఁ•బారుదేవళములో, పలఁ జొచ్చి కాష్ఠము•పగిది నుండి
కాళబత్తుఁ డొకండు•కడునిష్ఠ మూఁడుప, వాసము లొనరించి•శ్రీసఖుండు
రేయారగించిన•పాయసం బతనికిఁ, దెచ్చి యిచ్చు నొరుండు•దెలియకుండఁ

తే. దంత్రిచేసినపని దయఁ•దనయుఁ డెఱిఁగి. నట్లుభట్టార్యుఁడాకృత్య•మాత్మఁ దెలిసి
సంతసించెను దనమది•సతత మనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అంతటఁ గొన్నాళ్ళ•కాకాళబత్తుఁడు, పరమపదంబున•కరిగె ననుచు
సంశ్రితు లనఁ బరా•శరసూరి విని దర, స్మిత మొనరించి ల•క్ష్మీసఖునకు
తళిహ మోయఁగఁ బుట్టు•తలనొప్పి నేఁటికిఁ, దీఱెనా యన నది•దెలియలేక
యాశ్రితు లడుగరం•గాధిపుఁడాఱుమా, సములనుండియుఁ బాయ•సం బతనికిఁ

తే. బరమకృప రాత్రి యిడు నని• భట్ట రనిన, నతనిసర్వజ్ఞతకు విస్మ•యమ్ముఁజెంది
వారు మ్రొక్కిడి పొగడి రా•హూరి నమచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

వ. మఱియు నద్దివ్యదేశమునందు శ్రీరంగనాథు దెవ్వరికైన ముక్తియొసంగెనేవి వార లప్పరాశరభట్టార్యునకుఁ దమ్ముం బొడసూపిచనుచుండుటంజేసియొక్కనాఁడ రుణోదయ కాలంబునం దమ్మహాత్ముఁ డనుష్ఠానార్థంబుగాఁ దిరుక్కావేరికింజనుచు సుప్రసన్న సూర్యాయుత ప్రకాశమానం బగుదివ్య విమానంబు నభోభాగంబునం బొడగాంచి యున్నంత నొకసారమేయం బతండు వీక్షింపు చుండ స్వశరీరంబు విడిచి స్వకీయ ప్రభాపటల ప్రకాశితదశదిశావకాశస్వరూపంబుతో నవ్విమానం బెక్కి శ్రీవైకుంఠపురంబునకుఁ జనియె నమ్మహాత్మునుం గటాక్షించి శ్రీరంగ నాథు నుద్దేశించి కేలుఁదమ్ముల ముకుళించి -

శ్లో॥ నజాతు పీతామృతమూర్ఛితానాం నాకౌకసాం నన్దనవాటికాసు।
రఙ్గేశ్వర త్వత్పురమాశ్రితానాం రథ్యాశునా మన్యతమో భవేయమ్॥

అనుశ్లోకంబున నమృతపానమూర్ఛితు లగుదేవతలనందనవాటికల నివాసం బొక్క నాఁటి కైన దాసునికిం బ్రసాదింప వలదు శ్రీరంగరాజ భవత్పురం బాశ్రయించినరథ్యాశ్వవర్గంబునం దన్యతమంబ నయ్యెద నని ప్రార్థించెనంత. 80

సీ. పెంపుగాఁ గుమతులు•గుంపులై యేతెంచి, భట్టార్యుతో శాస్త్ర•వాదమొంద
నసహాయశూరుఁ డౌ•నలరామభద్రుండు, ఖ`దూషణాదిరా•క్షసుల నొచ్చ
కరణి సహస్రము•ఖంబు లౌతర్క•శ, స్త్రములచే వారి నం•దఱను గెలిచి
జనకాత్మజను రామ•చంద్రుఁ డొందినయట్లు, జయలక్ష్మి నప్పరా•శరగురుండు

తే. కలిసివిలసిల్లుచుండె రంగ•స్థలమున, నంతఁ బ్రతివాదు లపజయ•మంది కుంది
తత్ప్రతారణ మొనరింపఁ•దలఁచి రనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

వ. ఆవంచనక్రమం బెట్టి దనిన. 82

సీ. మంత్ర బలైకని•యంత్రితం బగుదొడ్డ, ఫణి నొకఘటములోఁ•బట్టిపెట్టి
ఘటమున కొకఖండ•వటము వాసెన గట్టి భట్టార్యునకు మ్రోల•భాండమునిచి
యిందులోఁగలవస్తు•వేమి చెప్పుమటంచుఁ, బ్రతివాదు లడుగ నా•భట్టగురుఁడు
ధవళనవాతప•త్రం బొక్కటం దున్న, యది యనఁ దెలిగొడు•గందుఁ జూచి

తే. విస్మయావిష్టచిత్తులై•విమతు లతని, సఫలవాక్ఛక్తిఁ గని రంగ•శౌరి యతఁడె
యనితలఁచిమ్రొక్కివీడ్కొని•యరిగిరనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మరల.

వ. అంతఁ దిరువరంగత్తముధనా రొకదినంబున భట్టార్యు నుద్దేశించి మహాత్మానీ వక్కూరేశగురున కౌరసపుత్రుండ వమ్మహాదేశికుండు విద్యవలన నన్నుఁ బుట్టించెఁ గాన మజ్జన్మం బభ్యర్హితం బని మదుక్త వాచకంబుగాఁ జెప్పుమనియొక వైష్ణవునిం బంచిన నతం డేతెంచి యగ్గురుని కట్లు విన్నవించిన నతండువినియా సందేశ వాక్యం బతిసమీచీనంబ యైనను తా నిట్లనుసంధించుటం జేసిస్వరూపానుచితఁబుగాఁ దోఁచంబడు నని యానతిచ్చె మఱియు నొక వాసరంబునందు శ్రీరంగ నాథుం డొక దివ్యమంటపంబునందు నిజపరివార వృతుండై యొడ్డోలగంబున్న సమయంబున శ్రీపరాశరభట్టార్యుండు తిరువాలవట్టంబు సమర్పించుచున్న పంశ్రితులకు సంధ్యావందనకాలం బతిక్రమించె నని విన్నవింపనమ్మహాదేశికుండును.-

శ్లో॥ మత్కార్మ కుర్వతాం పుంసాం యది కర్మ విలుప్యతి।
తత్కార్మ తే ప్రకుర్వన్తి త్రిసఃకోట్యో మహర్షయః॥

అవియెడు భగవన్ముఖోదితవచనంబుచేఁ దదీయకైంకర్యైకనిరతులగువారికి సంధ్యావందనాదికర్మమై కల్యదోషంబు సంభవింప దని పల్కె మఱియు నొకసమయంబున శ్రీరామానుజాచార్య దివ్యాజ్ఞచేఁ దిరుక్కురుహప్పిరాన్పిళ్ళా నాన తిచ్చిన యాఱాయిరప్పడి భట్టరువా రానంజియ్యరునకుం బ్రసాదింప నతండు సంశయంబు లేమియు లేకుండ నధికరించి స్వాచార్యాజ్ఞచేఁ దిరువాయ్ మొళికి నవసహస్రసంఖ్యాతం బగువ్యాఖ్యానం బొనరించి యర్థక్షణం బైన నమ్మహాదేశికు నెడఁబాయక తత్కైంకర్యంబు సల్పు చుండెనంత. 84

సీ. కల్యాణకర మైన, కౌశికద్వాదశి, నాఁడు రంగక్షమా, నాయకుండు
దేవీసమేతుఁ డై, దివ్యతరాస్థాన, మంటపమధ్యస్థ, మణివితర్ది
దివ్యసింహాసన, దేదీప్యమానాష్ట, దళపద్మకర్ణికా, తలమునందుఁ
బేరోలగం బుండి, ప్రీతి నాకర్ణింప, సూరు లందఱు వివి, చోద్య మంద

తే శ్రీపరాశరగురుఁడు కౌ, శికపురాణ, మమృతరస మొల్క దివ్యభా, వార్థములను
గులుకుపలుకులు దళుకొత్తఁ, బలికె ననుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర.

సీ. పెద్దయుఁగాల మా, పెరియభట్టార్యుని, క్షితిసర్వచేతనో, జ్జీవనార్థ
ముంపఁగా వలసియు, నుచితకథాశ్రవ, ణాహ్లాదపారవ, శ్యమ్ముఁ జెంది
శఠకోపతీర్థప్ర, సాదాదిబహుమతి. సేయించి యగ్గురు, శేఖరునకుఁ
బల్కె రంగేశుఁడు, వత్స ని న్మెచ్చితిఁ, బరమపదంబున, కరుగు మనుచు

తే. వంత సద్గురుఁ డాసూక్తులాలకించి, హర్ష మొంది నిజాశ్రితులార్తిఁ జెంద
ననునయోక్తుల వారి కిట్లనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. పుత్రులారా యీవిభూతి విభూతి మ, ద్భాగ్య మి ట్లున్నదివగవ మీకుఁ
బని లే దనుచుఁ బల్కి ప్రణమిల్లి రంగేశ, నీపదంబున కేను నేఁడచనుచు
దివ్యకస్తూరికాతిలకోర్ధ్వపుండ్ర మీ, లలితశుభ్రభ్రూవిలాస మిట్టి
మందస్మితాస్యమీమధురాధరోష్ఠమీ, కనుదోయిసొబ గందుఁగాన నేవి

తే. పట్టివైకుంఠపుర మొక్కటట్టు పెల్ల, గించుకొని వత్తు నీకడకంచితముగఁ
బంత మిది యని పల్కె నాభట్ట రనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. భట్టార్యునకు నిజాభరణపీతాంబర, స్రగ్దామచందనచామరాది
బహుమాన మొనరించిబ్రహ్మరథం బెక్కి, చను మని శ్రీరంగశౌరినుతువ
నవ్విమానం బెక్కియార్యసత్తములతో, నపరాశరగురుఁడరుగువేళ
బ్రహ్మఘోషముతోడబహువిధకల్యాణ, వాద్యఘోషం బొప్పవారవనిత

తే. లాడి పాడుచు నుండ నయ్యార్యవరుఁడు, రంగధామునికై వడిరాజవీధిఁ
దిరిగి నిజమందిరమున కేతెంచె ననుచు, వాదిభీకరగురుఁడనె మోదమలర.

వ. అట్లు భగవదను గ్రహప్రాప్తచరమాలం క్రియాలంకృతుం డైన యగ్గురువరుం
డాబ్రహ్మ రథం బుడిగి యప్పరివారంబుతో నిజగృహంబుఁ జొచ్చి యందు 89.

సీ. తల్లికి సాష్టాంగదండప్రణామంబు, సల్పినఁ జూచి యాసాధ్వి పుత్ర
యానందమయలోకమందుమా యనుచు దీ, వించిన నతఁడు వచించె నిట్టు
లమ్మరో యీదాసుఁదర్శించినది యదే, యని పల్కి శ్రీహరికర్చఁ జేసి
యద్దేశవాసు లానఖిలవైష్ణవులకు, సాపడఁ బెట్టించిచాఁగి మ్రొక్కి

తే. ఫాలతలమున నిజపాణిపల్లవంబు, లుంచి గోవిందగురునిఁ దలంచి యతని
పాదపద్మములను జెందెభట్ట రనుచు, వాదిభీకరగురుఁ డనెమోదమలర.

వ. అంత.	91

సీ. తల్లి యేతెంచి యాతనయుని వీక్షించి, నెమ్మోము చెక్కులువివిరిశిరముఁ
దివిరి కన్నులనీరుదేక పుత్రునిమహా, దైశ్వర్యమునకుఁ దాహర్ష మొంది
దివ్యదప్రాకృతదివ్యమంగళతర, మూర్తివై వైకుంఠమునకుఁ జేరి
మాతండ్రి యీశిరుమామణిమంటప, మున శేషపర్యంకమున వసింపు

తే. శ్రీసఖుని నీవు చెందిన, శేషి యతఁడు, శిరముమూర్కొని కౌఁగిటఁ, జేర్చినిన్నుఁ
గూడి సుఖపడుఁ బొమ్మని, వీడెననుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర.

సీ. అంతట నంజియ్య, రాదిగాఁ గలశిష్య, లంద ఱార్తి వహించి, యరసి తెలిసి
పెద్దలచరమము, పెండ్లితో సమ మను, లౌకికవార్తక, ల్యాణి యనుచుఁ
దలఁచి భట్టార్యుని, తమ్ముఁ డౌవ్యాసభ, ట్టార్యునిచే నమ్మ, హాత్మునకును
బ్రహ్మమేధాద్యుత్స, వం బంత సేయించి, వ్యాసగురుం డట్టు, లాచరించె

తే. ఘోరమనియేడ్వఁగనితల్లి, పుత్ర నీవు, భ్రాతృసుఖ మొర్వవైతివి, జ్ఞాతివగుట
ననినఁ దపోర్వమనియెన, య్యార్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె, మోదమలర,

సీ. ఆచార్యకైంకర్య, యాగావభృథ మార్చి, మును కిడుకొనివచ్చి, మూలనున్నఁ
బెరటివాకిటినుండి, బిసబిస నేతెంచి, మరమునం దొక్కెడ, మఱుగుఁ జెంది
యున్నవేదాంతిని, గన్నులఁ గనుఁగొని, యార్యు లిదే మని, యనఁ గనతఁడు
క్రొత్తవితంతు వే, కొలఁదిని వర్తించు, నట్లు నేఁ డే నుంటి, ననియె నంత

తే. రంగనాయకితో రంగ, రాజశౌరి, తనదుపుత్రునిఁ బరమప, దంపువార్త
విన్నదాసులు వినిపింప, వినియె ననుచు, వాదిభీకరగురుఁడనె, మోదమలర,

సీ. తమ కభిమానపు, త్రకుఁ డైనభట్టార్య, నాదంపతులు పాసి, యార్తిఁజెందఁ
పద్మనీలోత్పల, పత్రంబులను హిమ, కణములకై వడిఁ, గనుల వెంట [ములు
బాష్పబిందువులొల్కఁ, బలుమాఱు వెచ్చని, యూర్పులఁబుష్పమా, లోత్కర
వాడఁగా నీరాడి, పరచు మును కిడి, యుపవాస మాదిన, ముండి రంతఁ

తే. బదిదినంబులు గడచిన, పిదప నమ్మ, హాత్మసోదరుఁ డైనట్టి, వ్యాసగురుఁడు
వారి నిరువుర వీక్షింప, వచ్చె ననుచు, వాదిభీకరగురుఁ డనె, మోదమలర.

వ. అట్లేతెంచి. 96

సీ. వ్యాసభట్టారకుం డాపురాతన దివ్య, దంపతులను రంగ, ధా మగతుల
సేవించి తనయార్తి, చిందఱ వందఱై, చెడ బడలిక మాని, కడు నుతింప
వారు ప్రసన్నులై, వత్స నీవింక మీ. యన్న చన్నాఁ డని, చిన్నఁబోకు
మున్నాఁడు మిన్నంది, కన్నాఁడు మారుపు, మన్నాఁ డతండింక, మహికిరాఁడు

తే. తల్లిదండ్రులమై మేము, దనరు చుండ, నేమి నీకుఁ గొఱంతగు, నిందు నందు
ననుచుఁ బల్కిరి వారిర్వు, రతని కనుచు, వాదిభీకరగురుఁ డనె, మోదమలర.

వ. అట్లు శ్రీరంగనాయికామనోహరుం డతని మృదు మధురగంభీరాను వయోక్తులం
నూఱడించి. 98

సీ. పెరియభట్టరుకు ము • న్పరిధవమెయ్యది. యర్హ హా నది యెల్ల • నతవితమ్ముఁ
డగువ్యాసభట్టార్యు • కర్పింప నతఁ డొంది, రంగు మీఱఁగ బ్రహ్మ • రథమునెక్కి
సాత్త్వికుల్ తనవెంట • స్వస్తి చెప్పుచుఁ జన, నృత్తగీతరవంబు • నింగినెరయ
బహువిధమంగళ వాద్యఘోషం బొప్పఁ, జనుదెంచి నిజశుభ • సదన మొంది

తే. తల్లి నీక్షించి మ్రొక్కిడి • తన గృహమున, దర్శనము నిర్వహించుచుఁ • దనరుచుండె
నతని నెమ్మదిఁ దలఁచెద • ననిశ మనుచు. వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. శ్రీపరాశరగురు • శేఖర గోవింద, సంయమిచ్ఛాత్ర యం • చచ్చరిత్ర
వివిధవిద్వజ్జన • విరచితనుత పాత్ర. మహితరంగేశాభి • మానపుత్ర
కూరకులాధీశ • గురుకుమార సుమేరు, ధీర సారాగమ • స్థిరవిచార
యుష్మదీయ చరిత్ర • మున్నట్లు దెలిసి వ, క్కాణింప శక్యమా • కవుల కైన

తే. దేశికులు చెప్ప విన్నంత • దెలిసినంత, తేటపఱచితి బాలుర • తెలివి కిట్టి
సాహసం బోర్వుమోక్షమా • సార యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

శా. పూర్వార్వాగ్గురుపంక్తిహార గమణీ • భూతాఖ్యపూర్గాగ్రిమణీ
దుర్వారాఘతమిస్ర బాలతరణీ • దుఃఖార్త చిన్తామణీ
సర్వానర్థజుషద్భవాబ్ధితరణీ • సర్వజ్ఞ చూడామణీ
చార్వాకాదిమదేభదారుణసృణీ • సద్భిక్షులోకాగ్రణీ. 101

క. శ్రీద పరాశరగురువర, వేదావ్యాసాద్యవినుత • విశ్రుతచరితా
గోదాగ్రజ రామానుజ, యాదవగర్వాపహార • యదుశైలవరా. 102

మాలినీవృత్తము. వ్యవసితపురుషార్థా • వ్యాసనాజ్ఞేశ్చితార్థా
భువనసుజనవేద్యా • పుండరీకాక్షహృద్యా
కవిజన పరితోషా • ఖండితాశేషదోషా
చ్యవనరహితమూర్తీ చక్రవాళాంతకీర్తీ. 103

గద్యము. ఇది శ్రీ భగవద్రామానుజ కరుణాకటాక్షకలితకవితావైభవ పరావాది భయంకరాచార్యాభిమతచ్ఛాత్రాపస్తంబసూత్రకణ్వసగోత్ర పవిత్రోభయకవిమిత్ర వేంకటకృష్ణార్యపుత్ర విబుధవైష్ణవవిధేయ కేశవనామధేయ ప్రణీతం బైన యాచార్య సూక్తిముక్తావళి యను మహాప్రబంధంబునం దుత్తర భాగంబున

వేదాంత సూరి విజయంబు నతండు సన్న్యసించి గురుకులవాసం బొనర్చుటయు ధనుష్కోటిఁ దీర్థీకరించి మగిడి విచ్చేయు చుండ శ్రీపరాసరగురున కొకవనచరుం డుపచరించుటయు నగ్గురునకు వానితో జరిగిన సంవాదంబు నద్దేశికుండు మరల నిజ నివాసంబుఁ జెందుటయు వీరసుందర బ్రహ్మరాయఁ డపచారపడుటం జేసి పెరియ భట్టాచార్యుండు గోష్ఠిపురంబునఁ గొన్నిదినంబు లుండి యా రాజుకాలంబు జరిగిన పిమ్మట మరలి శ్రీ రంగంబుఁ బ్రవేశించుటయు నగ్గురుం డమ్మణియాళ్వా రను సాత్త్వికునకుం బరమార్థంబుఁ దెలుపుటయు వీరశిఖామణివల్ల రాయని కయ్యార్యుండు తత్త్వబోధం బొనర్చుటయు నమ్మాహాత్ముండు త్రిభువన దేవవీర రాయని వాక్యంబు నిరాకరించుటయు నర్చకుని కలుషవాక్యంబు లయ్యార్యుండు సహించుటయు సోమయాజి యగు వైష్ణవున కా బ్రహ్మవిత్తముండు శ్రీమదారా ధనక్రమం బుపదేశించుటయు దేవతాంతరభజన నిషేధంబును భాగవత శ్రీ పాద తీర్థవైభవంబును దుష్టవస్తుస్వీకారదోషభూయస్త్వంబులు సదాచార్య పరి గ్రహ ప్రాబల్యంబును నాచార్య కైంకర్యాతిశయంబును నిర్హేతుకజాయమాన భగవత్కటాక్షవ్యతిరిక్త పుణ్యాతిశయ నిషేధంబును కాళబత్తుని ముక్తిక్రమం బును భట్టార్యుని సర్వజ్ఞత్వ ప్రశంసయు నగ్గురుని వ్యక్తృత్వ విభవంబును బర వాది భంజనంబును దదీయవాక్శుద్ధిప్రసిద్ధియు శ్రీరంగామృత గురుసందేశవాక్యం బు స్వరూపానుచితం బనుచుభట్ట రెంచుటయు భగవత్కైంక ర్యాధికంబును భట్టార్యుని సన్నిధి నంజియ్యరాఱాయిరప్పడి యధికదించుటయుఁ దదీయాజ్ఞచేఁ దా నొంబదునాయిరప్పడి యానతిచ్చుటయు నప్పెరియ భట్టార్యుని చరమమ హోత్సవంబును నన్నది ప్రథమోల్లాసము.

—:o:—



శ్రీమతే రామానుజాయ నమః,

# ఆచార్యసూక్తిముక్తావళి

## ఉత్తరభాగము

---

### ద్వితీయోల్లాసము

శ్రీ వేదాంతి గురూద్వహ
భావాంబుజరాజహంస, పారమహంస్య
శ్రీ విలసిత రామానుజ
పావనతరదివ్య నామ, భక్తారామా.

వ. అవధరింపుము.

### నంజియ్యరుగారి ప్రభావము

నంజియ్యగారి తిరు-త. శ్లో. ఫాల్గునోత్తర ఫల్గున్యాం జాతం వేదాన్తినమ్మునిమ్।
శ్రీ పరాశరభట్టార్య పాద రేఖామయం భజే॥
నమో వేదాన్తి వేద్యాయ జగన్మఙ్గళహేతవే।
యస్య వాగమృతాసారపూరితం భువనత్రయమ్॥

సీ. పెరియభట్టార్యుని, పిమ్మట దర్శన, స్థాపనమునకుఁ ద్రి, దండపాణి
యెఁబెరుమానారె, యితఁ డాయెఁ గాఁబోలు, ననఁదగునంజియ్య, రార్యునాజ్ఞ
నొగిఁ దా నొనర్చిన, యొన్బదునాయిర, ప్పడి పట్టెఁడాకుల, పై లిఖింప
బడి యున్న నది చూచి, బాగు మీఱఁగ నిది, వ్రాయఁ గల్గినధీర, వరుఁడుపుడమి

తే. నెవ్వఁ డేర్పడు నని మది, నెంచి తనకు, నంతరంగతరచ్ఛాత్రు, నడుగ నతఁడు
పలికె నాత్మీయగురున కీ, పగిది ననుచు, వాదిభీకరగురుఁ డనె, మోదమలర. 3

సీ. వసుధలో నంబూరి వరదరా జని పేరు, గలవాఁడు పంచసం, స్కారపరుఁడు
సంఖ్యావదగ్రణి, శాంతుఁడు మేధావి, లిపు లెఱింగినవాఁడు లేఖకుండు

నగువిప్రుఁ డొకఁడు హే • మాపగాదక్షిణ, తీరమునందుండి • దినదినంబు
నరుదెంచి యిందు వి • ద్యార్థి బాలకులకు. శాస్త్రపారముఁ జెప్పి • జరగుఁదిరిగి

తే. యాతఁ డీ గ్రంధ మీ • యాజ్ఞఁ బడసి వ్రాసి యర్పించి దేవర • వారి కృపకుఁ
బాత్ర మగునని పల్కె నా • ఛాత్రుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఆమాట లాలించి • హర్షించి యగ్గురుం, డాతని రావింపు • మన నతండు
వరదరాజును జూచి • గురుఁడు రమ్మనె నన. నతఁడు సంతోషించి • యరుదెంచి
వేదాంతి వేద్యుని • వీక్షించి వందన, మాచరించి యనుగ్ర • హంబు గాంచి
యలి గావించి • యతనికన్మోగి నున్న, గురుఁడు కటాక్షించి కుశల • మడిగి

తే. వత్స నీ వొక గ్రంధము • వ్రాసి చూపు, మనిన వినిపద్య మొక్కటి • యతఁడువ్రాసి
చూపినను జూచె నా ద్వివ్య • సూరి యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. అట్లా గ్రంధంబుఁ గటాక్షించి యగ్గురువరుం డవ్వరదరాజు నుద్దేశించి. 6

సీ. వ్రాలు ముత్తియముల • జాలుఁ బోలును గాని, బాలక వైష్ణవ • శ్రీలు నీకుఁ
జాలవు గావున • శరవైరిసూక్తుల, వ్యాఖ్యాన మిది వ్రాయ • నర్హ మగునె
ఫాలోర్ధ్వపుండ్రము • బాహూల తిరు చిహ్నములు వైష్ణవత్వ సం • పూర్తి కగునె
యని యాన తియ్య నా • ర్యావర్తదేశీయ, షట్సహస్రద్విజ • చక్రవర్తి

తే. కణ్వవంశామృతాబ్ధి రా • కాసుధాక, రుండు నంబూరివరద రా • ట్పండితుండు
ప్రణతుఁడై యగ్గురున కిట్లు • పలికెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఆచార్యసత్తమ • యడియేవి కేరీతి. భువి వైష్ణవత్వ సం • పూర్తి కలుగు
నట్టి క్రమం బీవె • యాచరించిన ధన్య, తముఁడు వీఁ డగు మీకు • దాసలాభ
మగు నని తెలివికిఁ • దగునట్లు నంబూరి, వరదరాజమనీషి • పలుక గురుఁడు
పంచసంస్కారార్ధ • పంచకాకారత్ర, యాంతి మోపాయాదు • లైనహితవు

తే. లన్ని కృపచేసి యా గ్రంధ • మంత యతని, కాత్మపతిరూఢ మగునటు • లానతిచ్చి
వత్స లిఖియింపు మిది యని • పలికె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. అట్లగ్గురువరుం డా గ్రంధంబు లిఖియింపు మని విధించుట మహాప్రసాదం బని
తలంచి యమ్మహామేధావి నిజగురున కిట్లనియె. 9

సీ. ఆర్య దాసునియగ్ర • హా మ్మునకుఁ జని, యందుండి యీ గ్రంథ • మందమొప్ప
వ్రాసి తెచ్చెదను దే • వరవారిసన్నిధి, కని పల్క వరదుఁ డ • య్యాఖ్యనాజ్ఞ

నొంబదినాయిర • మొకయ లేఖముతోడఁ, గైకొని చని యేటి • కడను రెండు
పుస్తకంబులు నిజ • మస్తకంబునఁ దాల్చి. యుత్తరీయంబుచే • నొగి బిగించి

తే. కట్టి కావేరిలోఁ జను • కాలమునను. గ్రొత్తజల మేఁగుదెంచినఁ • గొంతదూర
మీఁతనీ రానియందతఁ • డీదె ననుచు. వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. అప్పు డాశ్రితవాత్సల్యపరాయణుం డగు నారాయణుండు తన కాత్మభూతుండైన యవ్వరదరాజాభిధాన దివ్యసూరి విలక్షణమేధా ప్రతిభాద్యార్య గణనీయ గుణగణం బెల్లవారికిం దెల్లమిపఱుపం దలంచె నయ్యవసరంబున. 11

సీ. నీలాభ్ర ముదయించి • నింగి సూర్యునిఁ గప్పెఁ. జీఁకటి దృష్టిఁ జీ • కాకుపఱప
క్షణములో నయ్యేటి • జల ముబ్బ నీఁదర • గాడ్పులు నలుదెసల్ గ్రందుకొనఁగ
నమితగంభీరోద • కావర్త భీకరౌ, ఘమునందు ఘనతరం • గములు పొడమి
ధారునఁ దాఁకినఁ దనతలపుస్తక, ద్వయ మేటఁ బడిన న • వ్వరదసూరి

తే. యలమృకండుసుతుండు లీ • యాబ్ధిఁ గడచి, నీలశైలేశుదయ నొక • కూలమొందు
పగిది హరికృప నొకమిట్టఁ • బట్టె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. అంత. 13

సీ. మేఘ మొక్కటి యైన • మింటఁ గన్పడ దయ్యె, సుప్రకాశంబయ్యె • సూర్యబింబ
మనుకూలవాయువు • లల్లనల్లన వీచెఁ, గావేరి యెప్పటి • కరణి నుండె
నప్పు డావరదరా • జాభిధానమనీషి. యతిరహస్యస్థలి • నాశ్రయించి
యఖిలలోకోజ్జీవ • నార్ద మస్మద్గురుం, డాన తిచ్చిన గ్రంథ • మంత యేటఁ

తే. ద్రోచితిని నక్కటా గురు • ద్రోహి నైతి. నిట్టి యపరాధ మొనరించి • యెట్లుతిరిగి
గురునిఁ గనియెద నని గోడు • గుడిచె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. అట్లార్తిచేఁ గుంది • నతనికి హరికృపఁ, దెలివి మించిన నార్తి • దొలఁగె నంత
నస్మద్గురుండు ముం • దాన తిచ్చిన గ్రంథ మంత లిఖించెద • నని తలంచి
యలిఖిత మార్జించి • యందు గ్రంథము వ్రాసి. పదుకు కొనిపోయి • గురునకియ్య
నతఁ డది వీక్షించి • యందుఁ గొన్ని విశేష ములు చూచి లెక్కించి • మొదటికన్న

తే. గ్రంథనవశతి యధికముఁ • గని యిదేమి. యనిన భయపడి భక్తితో • నంజలించి
గురుని యాచించె నభయము • వరదుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

## నంబిళ్ళగారి వైభవము

నంబిళ్ళగారి-త. శ్లో॥ కార్తికే కృత్తికాజాతం వేదాన్తిపదసంశ్రయమ్।
కలయామి కలిధ్వంసదానం జ్ఞానామృతార్ణవమ్॥

వెఱవక చెప్పుమా • వరద యున్నట్లు నీ,వని గురుఁ డాతని • కభయ మీయఁ
జాఁగి మ్రొక్కిడి ముందు • జరగిన వృత్తాంత. మంత శిష్యుఁడు చెప్ప•నాలకించి
నంజియ్య రాతని • నంబిళ్ళ యో యని. హర్షించి కౌఁగిట • నప్పళింప
నాఁటనుండి యతండు • న బిళ్ళ యని తిరు. నామముఁ గాంచె నీ•భూమి నంత

తే. దాస్యనామము కలివైరి•దాసుఁ డనుచుఁ. జేసి సకల హితంబులు • చెప్పియతనిఁ
దనదుసన్నిధి నుంచెఁ ద్రి • దండి యనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. నంజియ్య రర్థక్ష • ణం బైన న.బిళ్ళ, నెడఁభాయ కతనికి•హితముఁ దెల్పి
న ట్లతం డయ్యార్య • నరనిమేషం బైనఁ, బాయక తత్పదా • బ్జములఁ గొలుచు
న ట్లుండి నంబిళ్ళ • యార్యున కిట్లనెఁ, బ్రాజ్ఞ యుపాయాంత•రముల కరయఁ
బలు ప్రమాణంబులు • గలవనుష్ఠాతలు, చాల నుందురు ఋషి • చ్ఛందసమితి

తే. యంగవిన్యాసకరతల•న్యాసములును, బహువిధంబులు గలవు ప్ర•పత్తికవియుఁ
గొంచె మేమని యతఁడు శం•కించె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

వ. అట్లు పలుకుచున్న శిష్యరత్నంబుపలుకు లాలకించి యగ్గురువరుం డతని కిట్లనియె.

సీ. ఇరువురు జతగూడి•యేఱుదాఁటఁగ నందు, మోస మొందియొకండు • మునిఁగెనేని
యన్యుండు చేయిచ్చి•యతని నద్దరిఁ జేర్చు.టకుఁ బ్రమాణాపేక్ష•యొకటిగలదె
విను మైనఁ జెప్పెద•శ్వేతాశ్వతరముఖో. పనిషత్తులందుఁ బ్ర•పత్తి గలదె
సంసారులందు య•జ్వలు కొంచె మైనట్లు, నల్గు రేగురులు స•న్న్యాసు లైన

తే. పగిది నందఱు ప్రపదన•పరులు పుడమి,న్యాసవిద్యకు సరుదు ఋ•ష్యాదికంబు
ననుచునఁబిళ్ళయనియె న•య్యార్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. వైష్ణవుఁ డెట్లుండ • వలె నని నంబిళ్ళ. యడిగిన నంజియ్య • రనియె నిట్లు
వత్స వైష్ణవుఁ డైన•వాఁ డుర్వి నర్చావ.తారమునందె స•ద్భక్తి గలిగి
తనదారపుత్రపౌ•త్రకులందుఁ గలప్రీతి. శ్రీవైష్ణవులయందుఁ • జేర్పవలయు
భాగవతులు తన్నుఁ • బరుషవాక్యంబులఁ, బలికిరా యోర్చి త•త్పాదపద్మ

తే. ములకుమ్రొక్కిడవలె గాని•యలుగరాదు.వసుధవైష్ణవుఁడిట్లుండ•వలెనటంచు
నార్యుఁ డన విని నంబిళ్ళ•యలరె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. భవ్యశారీరక • భాష్య మార్యునికడ, సద్భక్తి నంబిళ్ళ • చదువు చున్న
నొకనాఁడుతిరుబోన•మొనరించి సంశ్రితుల్, గురునికెఱింగింపఁ•గూర్మి నతఁడు
హరికర్పసల్పుమా•యనుచునంబిళ్ళ కా•నతియియ్యనమ్రుఁడై•యతఁడు భగవ
దారాధనక్రమ•మడియేని కేమియుఁ, దెలియ దం చనిన న•ద్దేశికుండు

తే. శ్రీద్వయోత్తరవాక్యముఁ•జెప్పిశౌరి కర్ఘ్యపాద్యాదులర్పించి • యారగింపు
సేయుమని ప్రీతి నతనికిఁ•జెప్పెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. విగ్రహంబులు చాల•పిలపిల్లు చుండెనా, యారగిం పేరీతి•నాచరింపఁ
దగు నని నంబిళ్ళ•తనగురు నడిగిన సర్వమంగళమూర్తి•శాలిపదము
శ్రీద్వయోత్తరవాగ్వి•శేషణంబుగఁ జెప్పి, యారగిం పొనరింప•నర్హమనుచు
నంజియ్య రన విని•న బిళ్ళ మరలియు, హరియవతారము•లవని నేల

తే. నల్పెననిపల్కెభక్తాప•చారపటల•, జంపుటకు ధాత్రి నుదయించెఁ•జక్రపాణి
యనుచు నంబిళ్ళకనియెన•య్యార్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. స్వామి భాగవతాప•చార మెట్టిది యని, నంబిళ్ళ యడుగ నా•న్యస్తభరుఁడు
భాగవతులఁ జూచి•ప్రకృతిమంతులు వీరు, తమతోడ సములని•తలఁగుపెద్ది
యదియెపో భాగవ • తాపచార మటంచుఁ బలికిన నంబిళ్ళ • దెలిసి మరలి
భగవద్గుణానుభ•వం బెట్టి దని యన, విషయాంతరము లన్ని • విడిచి చేయు

తే. భగవదనుభవమెయ్యది•పరఁగనదియె, భగవదనుభవ మనఁబడు•జగతిననుచు
జియ్యరతనికిఁ గరుణతోఁ•జెప్పె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. ధృతినూఱుమాఱులు • తిరువాయిమొళి కర్థ మానతిచ్చెను పిళ్ళ•కార్యవరుఁడు
చెన్నుమీఱ శతాభి•షేకము లతనికిఁ, జేసి నంబిళ్ళయు • వాసి కెక్కెఁ
బెరియవాచ్చాంబిళ్ళ•పిళ్ళలోకియపెరు, మాళ్ళజియ్యరు యిూణ్ణి•మాధవుండు
శ్రీకృష్ణపాదదే•శికుఁ డాదిగాఁ గల, వైష్ణవోత్తములెల్ల•వచ్చి యంత

తే. నాశ్రయించిరి నంబిళ్ళ•యంఘ్రియుగము, భద్రదీపోదితప్రదీ•పంబుపగిదిఁ
బృధ్విగురునకు మించెనం•బిళ్ళయనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. అతనియాశ్రితులయం•దాచార్యులే పర, దైవతం బనుచు దే•దమున నమ్మి
వెలయుపిన్భళహర్ష•పెరుమాళ్ళజియ్యరు, తన తిరుమేనుస్వా•స్థ్యము దొలంగ
నాప్తుల నిరువుర•నంతేనివాసులఁ, బిలిపించి వారిని•ప్రీతిఁ జూచి
ఆళిమళచ్చంచకు•మనియెడుతిరువాయి, మొళి యనుసంధించి•మురవిరోధి

తే. పాదపద్మములందుఁ బ్రపత్తి సల్పుఁ, డనుచుఁ జెప్పిన వార లట్లావరి ప
నతనిదేహ మనామయమయ్యె ననుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

సీ. వైష్ణవుల్ గొంద ఱావార్త నాకర్ణించి, నంబిళ్ల నీక్షించి నతి యొనర్చ
జ్ఞానవయోవృద్ధిశాలి పిన్బళహరాఁ, పెరుమాళ్ళజియ్యరు పృథివి దాసు
బలునాళ్లు మనలఁ బ్రపత్తి సేయించినాఁ, డతనిభావంబేమొ యార్యతెలియు
మనివారలనవిని యతఁడు పిన్బళహరాఁ, పెరుమాళ్ళదేశికుఁ బిలిచియాతఁ

తే. డాలకింపఁగ నచటిబుధాళిఁ జూచి, మీరు మీ మీ మనీషానుసారముగను
నతనిభావముఁ దెల్పుఁడీ యనియెననుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

వ. అట్లు నంబిళ్ళ సూక్తు లాలించి యద్దేశికేంద్రులు తమతమమనీషార్థం బుపన్య
సింప నిశ్చయించి వేర్వేఱ నిట్లనిరి 27

సీ. సకలశాస్త్రములందు సర్వజ్ఞుఁ డగుపిళ్ళ, యెంగళాళ్వా నార్యపుంగవుండు
శ్రీరంగనాథుని సిరియందు సంగము, విడువలేఁ డితఁ డని నుడివె నంత
మాన్యుఁ డమ్మంగియమ్మాళ్ నుబుధమౌళి, నంబిళ్లగోష్ఠిని నయ మెలర్ప
గన్నవానికి రుచి గల్గునా దేశవి, శేషమునం దైన సిద్ధ మనుచు

తే. మధురమృదుభాషఁ బల్కె నమ్మంగిపెరియ, మొదలియారను దేశికముఖ్యుఁ డంత
నొప్పుమీఱఁగ నొకసూక్తిఁ జెప్పెననుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

సీ. పెరియభట్టరు ముందు పరమపదంబున, కరుగు మందును హరి యానతియ్యఁ
గస్తూరికాతిలకంబు నెమ్మోమును, గరుణారసముఁ జిల్కు కన్నుదోయి
యందు నీమెదఁ గాన నైతినా వైకుంఠ, పుర మొక్కతట్టెల్లఁ బెఱికి తొల్లి
తిరువడి యోషధిగిరిఁ బోలెఁ జేఁదాల్చి, తిరిగి నీకడ కేఁగుదెంతు ననియె

తే. నిమ్మహాత్మునితాత్పర్య మిట్టి దనుచుఁ, దోఁచె దాసుని కనియె నాదూరదర్శి
ప్రీతిఁ దత్సూక్తు లాలించె పిళ్ళయనుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

వ. అట్లు తత్సూక్తు లాకర్ణించి నంబిళ్ళపిన్బళహియ పెరుమాళ్ళ జియ్యరు నుద్దేశించి వత్సా యిద్దేశికోత్తము లానతిచ్చిన సూక్తులన్నియు భవదభిప్రాయంబును సరించిన వాయని యెఱుఁగ నమ్మేధావి తిలకంబందొక యర్థంబైనను మదీయ తాత్పర్యానుగుణంబు గాదని తోఁచంబడియె నని విన్నవింప నావార్తలాలకించి తిరునారాయణ పెరుమాళరయ రితఁడు తా నుపక్రమించిన కైంకర్యంబు పరిపూర్ణంబు గావలె నని తలంచె ననియె నంత నంబిళ్ళపిన్బళహియ పెరుమాళ్ళ జియ్యరున కిట్లనియె.

సీ. నీయభిప్రాయము నే నెఱింగితి దానిఁ, దెలిపెద నని పిళ్ళ పలికె నంత
స్వామి దేవరవారు సర్వజ్ఞులైనను, విను మేసె యది మీకు విశదపఱతు
నభ్యంజనస్నాన మాచరించినమీఁద, ధౌతవస్త్రయుగంబుఁ దాల్చి మీరు
స్నానశాలఁ జరింప జయ్యన తిరుముఖ, మండలమునపంచి మౌక్తికములఁ

తే. బోలుఘర్మోదలవములు పొడమసురఁటి, వీచుచు గొన్నినాళ్లుండ వేడ్కపుట్టఁ
జేసి తిట్లని పల్కె నా శిష్యుఁ డనుచు, వాదిభీకరగురుఁడనె మోదమలర.

వ. అట్లు పిన్బళహరాన్ పెరుమాళ్ళజియ్యరు తన యభిప్రాయంబుఁ దెలుపనంబిళ్ళ నిజ సంశ్రితులతోడ నతని యాచార్య నిష్ఠకు సంతసించె నంతపిన్బళహియ పెరు మాళ్ల జియ్యరు స్వదేశికునింజూచి మహాత్మా స్వరూపోపాయ పురుషార్థంబు లెట్టి వని యడుగ శేషత్వంబు స్వరూపంబు ప్రపత్తి యుపాయంబు. కైంకర్యంబు పురుషార్థంబు అని యగ్గురువరుం డాశిష్య రత్నంబున కుపదేశింప నతండాకర్ణించి యగ్గురువర్యు నుద్దేశించి దేవా దాసునకు మఱియొక విధంబుగాఁ దోఁచుచున్నది యెట్లంటిరేని భవదీయ పాదారవిందంబులం దనవరతదాస్యం బాచరించుచు ధన్యతముల ననుసరించి వారికిఁజేయు కైంకర్యం బడియేవికి స్వరూపం బమ్మహాత్ముల యభిమానంబు దాసున కుపాయంబు వారిముఖోల్లాసంబు వీనికిఁ బురుషార్థం బని తోఁచె నని విన్నవించిన విన నవధరించి యతనిభాగవత నిష్ఠకుఁ బ్రహర్షించె నంత శ్రీరంగ రాజ గోష్ఠీతుల్యం బగునంబిళ్ల గోష్ఠివైభవంబుఁ గనుంగొని సహింపక కందాడతోళప్ప రహూయా పరుండై యుండె నంత నొక్కదినంబున.

సీ. వాధూలకులదుగ్ధవారాశిరాకాసు. ధాకరుండైనకందాళముదలి
యాండాను కాత్మజుండైనకందాడయాం, డానుకు సుతుఁడుదృఢవ్రతుండు
తోడప్ప రన సూరిధూర్వహుం డొకనాఁడు, కోవెలకేతెంచి దేవదేవు
మధుసూదనునిఁ గాంచి మంగళాశాసన, మాచరించి నిజాలయమున కరుగు

తే. వేళ నంబిళ్ల శ్రీవైష్ణవాళితోడ స్వామిసన్నిధి కేతేర సత్త్వనిధిని
నమ్మహాత్మునిఁ జూచె తోడప్ప రనుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

సీ. రంగనాథునిపాద రాజీవములకడ, నంబిళ్ల వీక్షించి నయముఁ దొలఁగి
కడువేఁడిములుకుల కరణి వీనుల కస, హ్యము లౌదురుక్తి సహస్రములను
తోడప్ప రన విని తోషింపకయు స్వామి, లావార్తఁ దద్దేవి కాన తియ్య
నకటకటా యెంత యన్యాయవార్తనే, వింటి వీప్రొద్దని వెఱఁగుపడుచు

తే. నలిగి గృహకృత్యముల మాని॰యతనిదేవి, దివ్యభూషణములఁదీసి॰శేటఁబాసి
చీఁకటిలు సొచ్చి పవళించెఁ॰జింత ననుచు, వాదిభీకరగురుఁ డనె ॰ మోదమలర.

సీ. అంతఁ గోవెలనుండి॰యరుగుదెంచి నిజాల, యమునందు తోడప్ప॰రాత్మసతిని
గానక తొల్లింటి॰కరణి మత్పత్ని నా, కెదురు రాలే దిది॰యేమి యనుచుఁ
జింతించుచును జని॰చీఁకటిగృహములోఁ, గల్యాణమణిదీప॰కళికఁబోలె
విలసిల్లుభార్యను॰వీక్షించి మున్నీవు, నాచెట్టఁ బట్టిన॰నాఁటనుండి

తే. యఖిలధర్మములందు న॰న్ననుసరించి, దైవతంబుగ ననుఁ జూచి॰తరుణి యిప్పు
డలిగి యిట్లుండు టేమని॰యడిగె ననుచు, వాదిభీకరగురుఁ డనె ॰ మోద మలర.

వ. అంత నక్కాంతారత్నంబు భర్తృవాక్యంబు లాలకించి యతని కి ట్లనియె. 36

సీ. అవని శఠారాతి॰యపరావతారము, నంబిళ్ల యని జగ॰న్మాన్యు లనిరి
యమ్మహాత్మునియెడ॰నపచారపడి యను, తాప మొందుట కై నఁ॰దలఁప వైతి
వగ్నిసన్నిధిని మా॰యయ్య మీకీదేహ, మర్పించె యుష్మదా॰యత్త మదియె
యాత్మ యార్యాధీన॰మయ్యెఁ గావున నిప్పు, డతనిపాదాబ్జద్వ॰యంబుఁ జెంది

తే. సుఖము గాంచెద నింక నీ॰జోలి దాసి, కేల నీమేను నీ కిష్ట॰మెట్లొ యట్లు
చేసికొ మ్మని యద్దేవి॰చెప్పె ననుచు, వాదిభీకరగురుఁడనె ॰ మోదమలర

వ. అదియునుం గాక మహాత్మా సర్వజ్ఞుండవు గాన నీవెఱుంగని ధర్మ విశేష బులేదు
శ్లో॥ 'పద్మకోటిశతేనాపి నక్షమామి కదాచన' అను భగవదుక్త న్యాయంబునఁ
బద్మకోటి శతహాయనంబుల కయిన భాగవతాపచారంబు భగవంతుండు క్షమి
యింపఁ డని ముందు మీరానతీయ వినియుండితి మీ రిప్పు డి ట్లాచరించుట
కస్మద్దోషంబె నిమిత్తం బని యద్దేవి యూరకుండె నంత నద్దేశికేంద్రుండు తన
యాత్మలో మొదలియాండానునకు సాక్షాత్పౌత్రుండ నని యాభిజాత్యాభిమానం
బుచే నహంకరించి నంబిళ్లయెడ నిరర్థకంబుగా మహాపరాధంబుఁ జేసితి నని
యనుతాపపడుచు తనదేవిం జూచి యి ట్లనియె. 38

సీ. అభిజనవిత్తవి॰ద్యామదాంధత మీఁదు, గానక నంబిళ్ళ॰గారివిషయ
మార్దాపరాధుఁడ॰నైభయలజ్జలు, మదిఁ బెనంగఁగ నెట్లు॰మగిడి యతనిఁ
గనుఁగొనియెద సాధ్వి॰ఘటక వై నీవు నా, తోడ వచ్చితి వేని॰దురితహరుని
నంబిళ్ళ నీక్షించి॰నాపాప ముడిపెద, ననుచు నాతోడప్ప॰రానతియ్య

తే. దేవిహర్షించి కేలఁ బ్ర-దీప మొకటిఁ, బూని నంబిళ్ళ యింటికిఁ-బోఁ దలంచి
భర్తతో నిల్లు వెల్వడి-వచ్చెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. స్వామిసన్నిధినుండి-సాత్త్వికౌఘముతోడ, నంబిళ్ల తనసద-నంబుఁ జెంది
యావైష్ణవుల నిండ్ల-కనిపి యతీంద్రద్రత్రి, దండాయమానుఁ డౌ-దాశరథికిఁ
బౌత్రుఁడు పరమప-విత్రుఁడు తోడప్ప, రతనియం దపచార-మాచరించు
పాపి యౌవీని కాం-ప్రాజ్ఞునికృప దక్క, వేఱొక్క గతి లేదు-వెదకి చూడ

తే. ననుచుఁ బరితాపపడుచు నా-హార ముడిగి, కట్టుపుట్టమె ముసుఁ గిడి-కదలిరేయి
యతనిగేహంబువాకిటి-కరిగె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. వచ్చి తద్గృహబహి-ర్ద్వార దేహళికడఁ, బడియుండె నంబిళ్ళ-జడువికరణి
నంత నాదంపతు-లచ్చోటి కేతెంచి, యీక్షించి యతని మీ-రెవ్వ రనిన
ఘనుఁడు నంబిళ్ళ యీ-గలివైరిదాసుఁడ, నవి విన్నవింపఁ దో-డప్ప రవియె
బహుదురహంకార-పరుఁడ మూఢుఁడువీఁడు, మనయింటివాకిట-మౌర్ఖ్యమాచ

తే. రించఁబడియున్నవాఁడిట్లు-చంచలాక్షి, చూడుమనుచున దోడప్ప-రాదుమాట
కార్తుఁడై పల్కె నంబిళ్ల-యతని కనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. సర్వజ్ఞ నీవు సా-క్షాత్పౌత్రుఁడవు దాశ, రథి కట్టినీ కప-రాధి నైన
దాసుని కింక నీ-దయ దక్క వేఱొక్క, గతి నీ-కరుణఁ జెందఁ
బడి యుంటి ని ట్లని-పల్కె నంబిళ్లత, త్పాదపద్మములందుఁ-బ్రణతి సల్ప
నతఁడు సంతోషించి-యమ్మహాత్మునిఁ దన, కౌఁగిటఁ జేరిచి-గారవించి

తే. కొందఱికిదేశికుఁడవీవు-ముందు వత్స, యిపుడు జగదేక గురుఁడవై • హెచ్చివేయు
హాయనంబులు మను మని- యనియెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. భూమి లోకాచార్య-నామము చెల్లెను, నంబిళ్ళగారికి-నాఁటనుండి
యంత దంపతు లిర్వు-రమ్మహాత్మునిఁ దమ, వెంటఁ దోడ్కొనిచని-యింటనుంచి
యభ్యంజనోద్వర్త-నాభిషేకము లార్చి, ధౌతవస్త్రము లియ్యఁ-దాల్చియతఁడు
ధవళోర్ధ్వపుండ్రముల్-దాల్చియాజ్ఞయొనర్చి, హరి కర్చ గావించి-యాదరించె

తే. నంతఁ దోడప్పరతనితో-నాగమాంత, గోష్ఠి సల్పుచుఁ గాలము-కొంత జరపి
యతని లాలించి యింటికి-ననిచె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మరల.

వ. అట్లు కందాడతో డప్పరుచే బహుమాన పూర్వకంబుగా ననుజ్ఞాతుండై నిజమం
దిరంబు ప్రవేశించి యంధు సంశ్రితులతోడం గూడి వేదాంతగోష్ఠి యొనర్పుచుఁ

ప్రహర్షించు నంబిళ్లవైభవంబుఁ జూచి పుత్త్రైశ్వర్యంబుఁ గాంచియానందించు
తండ్రిమాడ్కి వేదాంతివేద్యగురుండు ప్రహృష్టాంతరంగుం డగుచు నూఱుహా
యనంబులు గడపి చరమకాలంబు ప్రాప్తంబైన యంతనశక్తిచేఁ బవళించియుం
డఁ గుట్టిక్కొఱయిల్లై యాళ్వా రేతెంచి ప్రణామంబాచరించిమహాత్మా నీవభియుక్త
తముండ వయ్యు నంతిమదశయం దిట్లాడకుండుట యేమియుచితంబు ద్వయమను
సంధింపరాదా యని విన్నవింప ముం దామంత్ర రత్నం బెల్లప్పు డేననుసంధిం
పక యుండితినేని యిప్పుడా ప్రపదన మంత్రంబు మాకనుసంధేయంబే యగును
మనస్స్వాస్థ్యంబును దేహదార్ఢ్యంబును ధాతుసౌమ్యంబునుం గలిగియథేచ్ఛం దిరు
గుచున్న కాలంబునం దన్మంత్ర రత్నానుసంధానంబు మాని కరణపాటవంబు
దప్పిపడియున్న వేళనా యమ్మంత్ర రత్నం బనుసంధించుట వైష్ణవుం డైనవాఁడా
చార్యరుచి పరిగృహీతం బై యనుష్ఠాన ప్రకాశంబైన ద్వయంబర్థాను సంధానపూ
ర్వకంబుగా సర్వకాలంబులందు వచింపవలె నని యగ్గురువరుం డానతియ్య విని
యతండు లజ్జించి నిరుత్తరుండయ్యె నంత నవ్వార్త లాలించి తెర్కాళ్వారుభట్ట
రద్దేశికోత్తమునికిం బ్రణమిల్లి యార్యసత్తమా మీ యపేక్షితం బెయ్యది యాన
తిచ్చిన దాని సమర్పించెద నని ప్రార్థింప నద్దివ్య సూరిశేఖరుండును వత్సా!
యస్మదీయమఠ ద్వారాంగణంబునకు శ్రీరంగనాథుండు విచ్చేసి యడియేనికి సర్వ
స్వదానం బొనర్చిన సేవింప నపేక్షించితినని వాక్రుచ్చిన విని యబ్భట్టార్యుండును
నావృత్తాంతంబు తిరుమలత్తండయాళ్వాని కెఱిఁగింప నతండాయర్థంబు శ్రీరంగ
నాథునకుం దెలుప నద్దేవదేవుం డాశ్రితవాత్సల్య వివశుండు గావున వేగ విచ్చేసి
సంశ్రితసహితుండగు వేదాంతివేద్యునకుఁ బ్రసన్నుండై సర్వస్వదానం బొనర్చిన
నద్దేశికేంద్రుండును సేవించి కృతార్థుం డయ్యె నంత నంబిళ్ళయు నిజాచార్యునకు
సాష్టాంగప్రణామం బాచరించి యొకహితం బానతిమ్మని యడుగ నయ్యార్య
వర్యుండు నీశ్వరుం డీయాత్మ కిష్టవినియోగార్హుండు గాఁడు సర్వేశ్వరున కీ చేత
నుండు యథేష్టవినియోగార్హుం డగునని యెఱుంగుమనుచుఁ బలుక నంబిళ్లయు
సుప్రసన్నమనస్కుండు గాక మౌనం బవలంబించినఁ దెలిసి యగ్గురువరుండు
పుత్రాభవన్మానసగతంబైన యర్థంబు బైల్పుచ్చుమని వచింప సంతసించి నంబి
ళ్లయు దేవా యొకవైష్ణవుండు పరమపదంబున కరిగెనేని యప్పు డచ్చటనున్న
ప్రసన్ను లెట్లుందురని యడుగ నద్దేశికోత్తముండును దృప్తుం డార్తుం డగు
నార్తుండు దృప్తుం డగునని పలికి మఱియు నస్మదాచార్యుండైన భట్టారకుండు
నన్ను నొకనాఁ డుద్దేశించి వత్సా! వేదాంతియని పేరు గలవాఁడను వేదశాస్త్ర బు

లన్నియుం జదివినవాఁడను వక్తలయందు శ్రేష్ఠుండను బహుధనం బాచార్య దక్షిణగా సమర్పించినవాఁడను జిరకాలంబు గురుకులవాసంబుఁ జేసి విశేషార్థంబు లన్నియు గ్రహించినవాఁడనని గర్వించి ప్రమాదంబుఁ జెందియుండక యెంబెరు మానారు తిరువడిఘశేఖరణమ్మని విశ్వసించి యుండుమని యానతిచ్చెం గావున నీవును గురుకులవాసంబుఁ జేసి సూక్ష్మార్థములు భగవద్విషయం బధికరించి నిజాచార్యునకు శతాభిషేకంబు లొనరించితినని ద్రవిడవేదాంతంబులందుఁ బ్రబల పాండిత్యంబు గలవాఁడననియు నహంకారపడక యెంబెరుమానారు తిరువడిఘశేతంజమని నమ్మియుండుమని నియమించి నంబిళ్లు మొదలైన దేశికోత్తముల శ్రీపాదతీర్థం బుజ్జీవించి వార లారగించినపిమ్మట భగవత్సేనాపతి మిశ్రుల యుత్సంగంబునందుఁ దిరుముడి యుంచుకొని పిన్భళహియ పెరుమాళ్ల జీయ్యరు నంకంబుపై శ్రీపాదంబులు సాఁచుకొని ఫాలవిన్యస్తపాణిపల్లవపుటుండై భట్టరు తిరువడిత్తామరల స్మరించుచుఁ దిరునాడలంకరించె నంత నక్కాలిపై రిదాసగురుం డాదిగాఁ గల మహాదేశికులందఱు నాచార్యవిశ్లేషజనిత దుఃఖంబుచే మిగుల నార్తి వహించియున్న సమయంబున నంబిళ్ల తనలోనం దానె తెలిసి యెంబారునకు భట్టార్యుని గతి నంజియ్యరునకు యథాశాస్త్రంబుగా బ్రహ్మమేధసంస్కారం బాచరించి యతిసంస్కార విధిక్రమంబుగాఁ దిరుప్పళ్లి యొనర్చి తీర్థతిరువధ్యయనాది మహోత్సవంబు సల్పె నంతిమదశయందు భగవంతుండు స్వమర ద్వారా జిరంబున కేతెంచి సర్వస్వదానం బాచరించుటయు భగవద్విషయంబు శతావృత్తు లానతిచ్చి శతాభిషేకంబులు కొన నవధరించుటయు నాచార్యానువర్తన ప్రతిబంధక పుత్రమిత్రకళత్రక్షేత్ర ధనదేశవాసాదులన్నియు రుచివాసనలతో విడిచి స్వాచార్యునకు నిత్యనివాసంబగు దేశంబు తనకుఁ బరమప్రాప్యంబని తలంచి యచ్చోటి కేతెంచి తనసత్త నద్దేశికేంద్రునకు శేషపుచ్చి తత్కైంకర్యంబు యాత్రగా నల్పుచు నదియె సత్తాధారకంబని నిశ్చయించి యుండుట యిమ్మహాత్మునకే చెల్లు నని శ్రీవాదిభీకరగురుం డానతిచ్చె నంత. 44

వ. సర్వస్వదానం బెట్టిదనిన. 45

సీ. సర్వస్వదానము • శౌరి చేయుట తన,యొడ లెల్లఁజూపుట • యున్నయట్టు
లాచార్యు లాదాన • మాచరించుట చర,మార్థవిశేషము • లన్ని యిడుట
యాత్మకీశుఁడు నియో•గార్హుఁడు గాఁడంట, ఫలితచేతనునకుఁ • గలుగదనుట
యీశ్వర వినియోగ,మీయాత్మ యనుటయు, ఫలితాభిమానియుఁ • బరుఁడెయనుట

తే. యార్తుఁడతిదృప్తుఁడగుట యిష్టార్థముడిగి, స్వతనురుచిమానిప్రాప్తి నిశ్చయము
చెంది, సంతసించుట యనియె నాసభ్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద
వ. దృప్తుం డార్తుండగుట యెట్టిదనిన. [మలర.

సీ. దృప్తుఁడు తన కిష్టదేహితో నెడఁబాసి, యార్తుఁ డయ్యును శరీరావసాన
పర్యంత మాత్మాంగపటురుచి మానక, తుదిఁగాయ ముడిగిసంతుష్టిఁ గనుట
యని చెప్పి నంబిళ్ల, యమ్మంగియమ్మాళు, పరమపదంబున • కరిగె ననుచు
విని వారియింటికి • విచ్చేయఁ దద్దేవి. సుప్రసన్నాస్య యై • జూత్తిలంగఁ
తే జూచిసన్నిధివైష్ణవుల్ చోద్యమంది, స్వామియిట్లుండు టేమి యీసాధ్వియనుచు
నడుగ నంబిళ్ల వారి కిట్లనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. అమ్మాళు తనకు ముందపకార మొకటైనఁ, జేయలేదది గానఁ • జింత మాని
యతనిఫలావాప్తి • కానందపడియె ని, ద్దేవి యం చనియె న, ద్దేశికుండు
ఒకనాఁడు వైష్ణవుండొకఁ డార్యపద మొంద, నతనిదారసుతాదు లార్తిఁజెంది
నంబిళ్ళపద నళినములందుఁ బడి యేడ్వ, నితని నిప్లేమని • యార్యు లడుగ
తే నిష్టవస్తువు నెడఁబాసి • యిచటనుండ, రోసి యానందలోకము వాసిఁ దెలిసి
దానికై యేడ్చిరనియె నద్దాంతుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఈ యర్థములు రెండు • నిచ్చోట నే యనుష్ఠాన పర్యంతము • సత్త్వజలధి
నంబిళ్ళ చూచి వైష్ణవులతోఁ జని తిరువెళ్ళరులక్ష్మిని • విశదభక్తి
సేవించి తిరిగి విచ్చేయ నభోమణి, పడమటిదెస ప్రేలఁబడియె నంతఁ
గావేరి యుల్లోలకల్లోలమాలికావర్తశతంబుల • వనధిమాడ్కిఁ
తే. బొంగిప్రవహింప మేఘాళి నింగి నెఱయ, నంధతమసౌఘ మంతట నతిశయిల్లె
భూరిదిగ్భ్రాంతి జనులకుఁ బొడమెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. అయ్యవసరంబున. 51

సీ. ఓడయం దొకపైన • నేడఁ జూపడకున్న, రంగరాట్సేవ కారాత్రి చనఁగ
నంబిళ్ల దలఁచి బానలతెప్పపై నెక్కి, సంశ్రితతతితోడ • జరుగుచుండ
భారాతిశయముచేఁ • బ్లవము నష్టటను, మజ్జనోన్ముఖమైన • మదిఁ గలంగి
కర్ణధారుఁడు బోధమనులార మీయందు, నలువురు మువ్వురై • నను విచార
తే. ముడిగి దిగ వేగదరిఁ జేర్తు నుడుప మట్లు, గాకపోయిన మిమ్ము బల్గాసి చెందు
ననిన దిగఁజాల రం దొక్కరై నననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. వారియం దొకసత్త్వ•వతిని వీక్షించి, స్థూలాంగి యీయమ్మ • దొలఁగెనేని
తెప్ప యీనీటిపైఁ•దేలి కూలముఁ జెందు,నని నావికుఁడు పల్క•నార్యులెల్ల
విని యూరకుండ నా•వెలఁది లేచి సమస్త•చేతనోజ్జీవన•హేతు వైన
నంబిళ్ల యిప్పు డీ•నది దాఁటెనా భవ•జలధి దాఁటించు న•న్మద్విధాత్మ

తే. శతము ననిపల్కి జీవితా•శను దొలంగి, యాత్మ నంబిళ్లతిరువడి•యందె నిల్పి
వడి గుభాలున నట్టేటఁ • బడియెననుచు, వాదిభీకరగురుఁ డనె,మోద మలర.

సీ. అక్కటా యీప్రాణి • యస్మదర్థం బేటఁ, బడె నని నంబిళ్ల • బాధపడఁగ
భారము లఘువైనఁ • బ్లవ మల్లనల్లనఁ, దీర మొందినవారు • దిగినయంత
నాపగారయముచే • నాసాధ్వి చని చని, దైవవశంబున • దరికిఁ జేరి
వారివార్తల విని • వచ్చి తీరముఁ జెంది,తివి సూరులార చిం•తింపకుండఁ

తే. డనుచు వాక్రుచ్చి యేతెంచు•నార్యుఁ గాంచి,యిట్లు నేదరిఁజెందుట•కేమిహేతు
వన్న నంబిళ్ళ గురుభక్తి•యనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. అదియునుం గాక. 55.

సీ. ఆచార్యులే దైవ•మనుచు నమ్మినవారి, నేప్రొద్దుఁ బ్రోచుల•క్ష్మీశుఁ డనుచుఁ
బలికి నంబిళ్ల యా•భాగవతులఁ గూడి, నిజగృహంబున కేఁగి • నిత్య మచట
శ్రీలక్ష్మణార్యుల•సిద్ధాంతమే నిర్వ•హించుచు నుండ నా•యింటిపొరుగు
నం దొకసాత్త్వికు • నాలయమునకుఁ ద•త్సబ్రహ్మచారియు • సద్గుణాఢ్యుఁ

తే. డైనశ్రీవైష్ణవుం డొకఁ • డరుగుదెంచి, యుచితవృత్తిని సేవించి•యూఱడించి.
పల్కె నీరీతి నాజ్ఞాన•వతికి ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. చెంది నంబిళ్ల గో•ష్ఠీమంటపమునందు స్వాములుండఁగఁ జోటు•చాలదయ్యె
నర్హణీయుఁడు మన•కాచార్యుఁ డాతఁడు, స్థలము విశాలము • గలదు నీకు
నొకనివేశంబు చో•టొసఁగు మం చతని కీ, వనిన నాసాధ్వి యి•ట్లనియె నతని
శ్రీరంగపదమునం • దెట్టిప్రాజ్ఞులకైన, నొకటింటికైనఁ జో • టొసఁగు టరుదు

తే. గాన మామకగురుపద•కమలములను, జేరుపర్యంత మీస్థల • మేరి కియ్య
ననుచు వాక్రుచ్చె నాసతి•యతని కనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఆమాట విన వచ్చి • యతఁడు నంబిళ్ళకుఁ, దెలిపినఁ దెలిసి య•ద్దేశికేంద్రుఁ
డాసాధ్వి రావించి•యమ్మ నీ కొక్కతె, కింతచో టేల మా•కిందుఁ గొంత

చోటు కాలక్షేప,కూటసమృద్ధికై, యిమ్మని యడుగఁగా • నింతి మగిడి
పరమపదంబులో,పల దాసి కొకనివే,శ మొసంగికొమ్మి యా,స్థల మటంచుఁ

తే. బలుకవైకుంఠనాథుఁడా,పనియొనర్ప,నాఢ్యుఁడనుచునుగురుఁడన,నతఁడు నీకు
వశ్యుఁడగునవిపల్కె నా,వనితయనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. కావున దాసి కా,రా వీవె యిమ్మన, నయ్యార్యుఁ డిచ్చెద • ననుచుఁ బలుకు
మాటమాత్రము విని • మది సంతసింపదు, పరునిపేరిటఁ దాళ,పత్ర మొకటి
వ్రాయించి నీదుచే,వ్రాలుతో నిమ్మన, నఖిలలోకస్వామి • యైనహరికిఁ
గలివైరిదాసుఁడు • పలుకువిన్నప మిది, యీయమ్మక్రయ మిచ్చె,నిదిగ్రహించి

తే. తగినచోటిమ్ము పరమప,దంబునందు, నీమె కని పత్రికను వ్రాసి • యిచ్చెనతఁడు
దానిఁ దలఁదాల్చిచనియె నా • ధన్య యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఆర్యుఁ డాసాధ్వియ,ధ్యవసాయ మీక్షించి, హర్షించి పత్రిక,యందు హరికి
నీవర్ష మీమాస • మీపక్ష మిన్నవ,యహమునం దిన్నవ,యామమునను
ముక్తి యీసతికిమ్ము,మునివంద్య యనివ్రాయ,నడిగొని తనయింటి,కరుగుదెంచి
యాచార్యసన్నిధి • నాప్రొద్దు మఱునాఁడు, చరణాబ్జతీర్థప్ర,సాదసేవఁ

తే. జేసి మూఁడవనాఁడభి,జిన్ముహూర్త, మునను గురుని దలంచుచు,ముక్తిఁగనియె
గురుఁడు వ్రాసినవేళ నా,గరితయనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర

వ. అంత మఱియొక్క వాసరంబునందు. 61

సీ. మనుజుఁ డేయర్థము • మదినిల్పి ప్రకృతిని, బాసి శ్రీవైకుంఠ,పదముఁ జెందు
నాయర్థ మెఱిఁగింపు • మని మహాభారత,భట్టరగ్గురునకుఁ • బలుక నతఁడు
భువి నుపాయోపేయ,ములు శ్రియఃపతి యని తెలిసి తదర్థోప,దేష్టృచరణ
సరసిజంబుల నమ్మి,సంయమీడ్భాష్యోక్త, సిద్ధాంత మతిసమీ,చీన మనుచుఁ

తే. దలఁచి రామాయణోక్తుల,ద్రవిడవేద,వాక్యములఁ బ్రొద్దుపుచ్చెడి,వైష్ణవుండు
తనువు సడలిన హరిఁజేరు,ననియె ననుచు, వాదిభీకరగురుఁ డనె,మోదమలర.

వ. మఱియొక వాసరంబున. 63

సీ. శిష్యులు పాండ్యదే,శీయులు కొందఱు, వైష్ణవు లేతెంచి • స్వగురు వైన
నంబిళ్లగారిని • నయమొప్ప సేవించి, తంజ మెయ్యది యని • దాసులకును

దెలుపు మం చడుగ న•ద్దేశికో త్తముఁడును, దక్షిణాబ్ధితటంబె • తఁజ మవిన
తంజ మచ్చట పైక•తంబులా వనములా, వాడలా మెవి యని • వార లనిన

**తే.** మోమునె త్తమ్మిఁజిఱునవ్వు•మొలకలెత్త, సర్వలోకైకగురుఁడును•సద్గుణాఢ్యుఁ
డైననంబిళ్ళ వారి కీ•ట్లనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర

**సీ.** చక్రవర్తిసుతు డు • సౌమిత్రితోఁ గూడి. హరిబల-బులతోడ • నచటనుండి
రేయి వానరులు ని•ద్రింపఁగా వారితోఁ, గనుమూసి నిద్రించు•కరణిఁ గొంత
దడ వుండి లేచి యా•తమ్ముఁడు దా వెంట, నమ్ము లెక్కించి సై•న్యమ్ము చుట్టి
తిరుగుచుఁ బ్రోమన•ద్దేవునిశార్ఙ్గకో,దండమే తలఁప మీ•కండ యగును

**తే.** నిద్రఁ జెందినవానరా•నీక మట్లు, స్వప్రయత్నము విడిచిన • నన్వశేషి
దానె కాపాడుననియె నా•ధన్యుఁ డనుచు. వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

**వ.** మఱియు నొక్కవాసరంబున 66

**సీ.** నారాయణునిఁ దక్క • వెఱొక్క వేల్పును, గొలువరు వైష్ణవుల్ • గురువరేణ్య
యట్టివా రితరు లౌ•నగ్నీంద్రు లాది గాఁ, గలవిబు-ధుల వైది•క క్రియలను
భజియించు టే మని•బ్రాహ్మణుం డొక్కఁడు. నంబిళ్ళ నడుగ నా•నయవిదుండు
హరి కన్యదేవత • లంగము లనుచు, విశేషశాస్త్రోక్తులు • చెప్పఁ గాన

**తే.** నిత్యనైమిత్తికములందు • నిఖిలదేవ, తార్చ భగవదుపాసన • మగుటఁజేసి
యది విరుద్ధము గానేర•దని యె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

**వ.** అ ట్లమ్మహాత్మునిసూక్తు లాలకించి యావిప్రుం డగ్గురువరు నుద్దేశించి యాచార్య సత్తమానిత్యనైమిత్తికాదికర్మంబులందగ్నీంద్రాది దేవతారాధనంబు సేయుచు నాలయంబులయందుఁ గృతప్రతిష్ఠులైనదేవతల మీరారాధింపకుండుట కేమి నిమిత్తం బని యడుగ నద్దేశికోత్తముండును మంత్రపూతంబులైనయాహవనీయగార్హపత్యదక్షిణాగ్నులు సమస్తద్విజాలకారాధనీయంబులును శ్మశానాగ్నులు పరివర్జనీయంబులునైనయట్లు నిత్యనైమిత్తికాదికర్మంబులఁ బ్రసిద్ధు లగువిలింపులర్చనీయులు దేవళంబులందుఁ బ్రతిష్ఠింపం బడినయన్యదైవతంబు లనర్చనీయంబు లగు నెట్లంటివేని నిత్యాదులయం దన్యదేవతలను భగవచ్ఛరీరబుద్ధిచే నారాధించుటంజేసి తదుపాసనంబు భగవదుపాసనం బగునని విశేషశాస్త్రప్రసిద్ధిగల దాలయప్రతిష్ఠలయందుఁ బరాపరత త్త్వావ్యత్యయంబు సత్త్వతామస పురుషులచే వేదవిరుద్ధాగమమంత్రతంత్రప్రక్రియచే స్వతంత్రబుద్ధిచేతం బ్రతిష్ఠి

తంబులగు దేవతాంతరంబులు భగవత్ప్రీకారబుద్ధిచే నుపాసింపంబడవు గావున హేయంబు లగు నదియునుం గాక సత్త్వగుణాత్యంతవిరోధితమోగుణ ప్రచురుండుగావున రుద్రుండు ముముక్షువులకు దూరతఃపరివర్జనీయుండు మఱియును నిత్యనైమిత్తికాదులయందు నితరదేవతోపాసనం బామ్నాయచోదితం బైనయట్లాలయంబులందు భగవత్ప్రీకారబుద్ధిచే దేవతాంతరంబుల నారాధింప విశేషశాస్త్రవిధి చూపడదు గావున దేవతాంతరవిహిత భగవత్ప్రీకారభూతాలయస్థాన్య దేవతాభజనం బైన ననర్థకం బని యాన తిచ్చె నంత 68

సీ. తొల్లి యొక్కెడ కేఁగి•తూర్ణ మేతెంచుచు, నంబిళ్ళ మార్గము • నడచి యలసి
యొకపల్లెఁ జొచ్చి యం•దుచిత మైనట్టిచో, టమరకున్నను దదు•ద్యానభూమి
శ్యామకోమలపలా•శాకీర్ణశాఖాస,హ్రసపత్త్రిర•వాకులంబు
భవ్యజలాకీర్ణ•పద్మాకరాంతిక, వర్తి మహోన్నత•వటకుటంబుఁ

తే. గాంచితచ్ఛాయలను విశ్రమించి యచట, నచ్యుతారాధనము చేసి•యారగించి
మించి స్వాములతోడ హ•రించె ననుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర,

వ. అప్పు డాశ్రీవైష్ణవు లమ్మహాత్ముల కి ట్లనిరి. 70

సీ. ఛాయాప్రదానాది•సత్కారవిధుల నీ,శాఖి దేవరవారి•సంశ్రితులకు
నధ్వశ్రమముఁ దీర్చి•యాతిథ్య మొనరించె•, గాన భాగవతాగ్ర•గణ్యుఁడొక్కఁ
డేమినిమిత్తమో•యెఱుఁగలే మిమ్మహా•వట మై వసించె నీ•వటమునందుఁ
బ్రకృతిబంధముఁబాపి•పరమపదం బియ్యఁ దగువీయాత్మ కౌ•దార్య మొప్ప

తే. ననుచు సన్నిధివైష్ణవు • లంద ఱైక•కంఠ్య మొప్పార నంబిళ్ళ•గారి నిట్లు
ప్రార్థనలుచేసి రత్యంత•భక్తి ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర,

సీ. నంబిళ్ళగారు వి•న్నప మాలకించి మం,దస్మితం బొనరించి • దయను లేచి
ముదమొప్ప వటమునా•మూలాగ్రమీక్షించి, తనదీర్ఘబాహుదం•డములుసాఁచి
యాలింగనముఁ జేసి•యస్మదార్యానుగ్ర,హంబుచేఁ బరమప•దంబునకును
జను మని పల్కి•యా•స్వాములతోఁ గూడి, శ్రీరంగధామముఁ • జేరి యందు

తే. శ్రీమహాభాగవతులకుఁ•జెన్ను మీఱ, ద్రావిడామ్నాయసూక్త్యర్థ•తత్త్వమనిశ
మొసఁగు చుండెను గనికర•మొప్పననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. నంబిళ్ళ యాలింగ•నం బొనర్చిననాఁడె, యాకు రాలెను మఱ్ఱి•మ్రాఁకు కంత
నావృక్ష మున్మూల • మై నిశీథమునందు, దారుణధ్వనితోడ • ధరణిఁ గూలె

నిర్ఘాతనిష్ఠుర•నిస్స్వనం బది విని, యాపల్లెయం దొక•యవనిసురుఁడు
వెఱచి విస్మయ మొంది, వేశ్మము వెల్వడి, చూడ నం దొకమహా•జ్యోతివెడలి

తే. వేయుచంద్రులరుచిమించి•విన్ను గప్పి, చనినఁ గన్నులఁ జూచి యా•జన్నిగట్టు
చిత్తమలరంగ జనులకుఁ • జెప్పెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

వ. అంత నొక్కనాఁడు తిరువాయ్మొళి యనుసంధించువారిని భగవద్గీతాపారాయణంబు సేయువారలనుం గనుంగొని యె ట్లాదరింపవలెనని నంబిళ్ళ నొక సాత్త్వికుం డడుగ నమ్మహాత్ముం డతని కి ట్లనియె. 74

సీ. ఒకవైష్ణవునియింట • నుత్సవం బగు చున్న, వైష్ణవు లిరువురు • వచ్చి యొకరు
మదమొప్పఁ దిరువాయి•మొళియనుసంధింప, నొకవైష్ణవుఁడు గీత•లుగ్గడింపఁ
జూచి యాగృహమేధి•సుతునకునియమించి, తిరువాయిమొళిపల్కు•దేశికునకుఁ
దళిగకుఁదగుద్రవ్య•తతిసమర్పింపుము, పడెఁడుబియ్యము స్వయం•పాక మిమ్ము

తే. భవ్యగీతానుసంధాన•పరున కనుచు, వాసి యుభయుల కీర్తి•వసుధఁ గానఁ
బడియె ననుచును నంబిళ్ళ•పల్కె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

వ. మఱియొక్కదినంబునఁ బరగోష్ఠియందు శ్రీవైష్ణవుం డెట్లు బహుమతుం డగు నని యొకసాత్త్వికుండు నంబిళ్ళ నడుగ నద్దేశికేంద్రుం డేతదర్థవిషయంబుగా నొక పూర్వవృత్తాంతంబు గల దీప్రశ్నంబునకు నదియే ప్రత్యుత్తరం బగు నది యాకర్ణింపుము. 76

సీ. అఖిలవిద్వత్పూజ్యుఁ • డగుమిళహాళ్వాను పృథివీశునింటను • బెండ్లి యైన
సంభావనార్థము • చని రాజసభయందు, విచ్చేసి యున్నభూ•విభుఁడు చూచి
బహువిధద్రవ్యముల్•పండితుల కొసంగి, యతని కే మియ్యక • యరుగు మనిన
వేదము లెఱుఁగనో•వాదముసేయంగఁ, జాలనో సకలశా•స్త్రములయందు

తే. హేతు వేమి యుపేక్షింప•నిట్లు నన్ను, నని యతం డనవిని నృపుఁ•డనియెనిట్టు
లనుచు నంబిళ్ళ పలికె బు•ధాళి కనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

వ. అట్లు దేశికోత్తమునిసూక్తు లాకర్ణించి రా జతని కిట్లనియె. 78

సీ. సర్వజ్ఞుఁడవు వేద•శాస్త్రములం దెన్న, నార్యవైష్ణవుఁడ వం • చరసి తెలిసి
యి ట్లుపేక్షించితి•నింకఁ జను మని నృపుఁ, డన నమ్మహాత్ముఁడు • హర్ష మొంది
వీర లందఱియందు • విష్ణుదాసుల మని, మ మ్ముపేక్షించుట • మాకు సేమ
మని రాజునకుఁ బల్కి•యాత్మోత్తరీయము, నింగికిఁ జిమ్ముచు•నృత్య మాడి

తే. యరిగె నది గానఁ బరగోష్ఠి యందు దుపేక్ష
యతఁడు బహుమతి యగు వైష్ణవాన్వయులకు
ననుచు నంబిశ్శ పలికె బుధాళి కనుచు
వాదిభీకరగురుఁ డనె, మోద మలర 79

వ. మఱియును 80

సీ. వసుధ దరిద్రుఁడౌ వైష్ణవుఁ డొక్కఁడు, యాచకవృత్తిచే నరిగి యొక్క
పంటకళ్ళములోనఁ బని సేయ నొకఁడట్టు, తఁ పంటకాఁపు దనరఁ జూచి
యరిగరుదిన్ని కరనీ లాలకావళి పాల, తలనాట్యకేళీవిధాన మొదవ
సిగముడి విడి జాఱి చెన్నుగా మూఁపున, నసియాడ నిట్టిసాహసపుఁ జెయ్ది

తే. మాతపంబున కోర్చి సేయంగఁ దగునె
యనుచుఁ బ్రియవాక్యములఁ బల్క నతఁడు మెచ్చె
ననుచు నంబిళ్ళ పలికె బుధాళి కనుచు
వాదిభీకరగురుఁ డనె మోద మలర.

వ. మెచ్చి యతం డతని కే మిచ్చె నని యడుగ వారల కమ్మహాదేశికుం డి ట్లనియె.

సీ. మంచిధాన్యము ద్రోణ మాత్రము వాఁడియ్య, గట్టిగానవి మూట గట్టియతఁడు
గొనిపోవ నొక్కఁడుగనుఁగొని ధాన్యము, నెవ్వఁడిచ్చెనొ వాని నెఱుకపఱపు
మన వైష్ణవుఁడు ధాన్యమాబట్టతలపంట, కాఁపిచ్చె ననవాఁడు కళముఁ జెంది
యావార్తదెఱపను గ్రాకొడిఁదై వాఁడు, కాలదండముఁ బోలు కడిఁదియనుప

తే. కప్లపెనుఁ గోలఁ జేఁబూని కదలి వేగ, తనపదన్యాసములు సోఁకి ధరణియద్రువ
వచ్చె ననిచెప్పె నంబిశ్శ వారి కనుచు, వాదిభీకరగురుఁ డనె మోద మలర.

సీ. దాసరిదాఁపఁడా తరల కవ్వట విలు, నిఱుము దండాహతి నిన్నుఁ గూల్తు
నని వాఁడు పల్కన య్యార్యుఁడు పద్మయు, గంబుపైఁ దుమ్మెదల్ గ్రమ్ముగతిని
నీకన్నుగవ గప్పి నిగనిగ మెఱయుచు, నీలాలకంబులు నృత్తమాడ
నసితదీర్ఘ శిరోరుహములు విముక్తబంధములై కటిస్థలిఁ దాఁకి వ్రేల

తే. వచ్చి నసుఁ జూచి కోపింప వత్స నీకుఁ దగునె దయగలవాఁడవు దాత వనిన
వాఁడు హర్షించెనని పిళ్ళ పల్కె ననుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

సీ. అట్లిచ్చు కపుమాట లతఁ డుగ్గడింప నాకర్ణించి తనమది కాఁక యుడిగి
ప్రీతినాతని వాఁడు పిలుచుటపోయి సొం, పొప్పమూటెఁడు ధాన్య మొసఁగె మగిడి

కపటప్రియో స్తు ఘాతుకుఁ డగుకాఁపు, హర్షించి యతని కిట్లాచరింప
సిరి బోరఁగలవాఁడు శేషియు నారాయణుఁడు తన్ను భక్తిసన్నుతియొనర్చు

తే. ధన్యజనుల కభీష్టప్రదాయకుండు, గాక యె ట్లుండునని సర్వలోకగురుఁడు
పలుక విని సంతసించిరి ప్రాజ్ఞు లనుచు వాదిభీకరగురుఁ డనె మోద మలర.

వ. అంతఁ గొన్నిదిన బుల రాజగద్గురుండు తనతిరుమేనియందుఁ దకునోవు చాత్తు
కొనియున్న సమయంబున.

సీ. వైష్ణవుఁ డొక్కఁడు వచ్చి నంబిళ్ళను, జూచి కేల్మోడ్చి యో శుభగుణాఢ్య
దేశికోత్తమ నీదు తిరుమేను డస్సిన. దే మన నార్యదే వెంద్రుఁ డనియె
గురుకృపచే మంచి గుణ మొక్కటైనఁ జొ ప్పడునేని యామేను బడలునను
జ్ఞానభక్తి విరక్తి శాంత్యాదిగుణములు, మించఁ బ్రకాశింప నంచితాత్ముఁ

తే. డైనయధికారి భగవద్గుణానుషక్త, చింత నుండినమేను శోషించు నమచుఁ
దెలిపె నార్యునిభావము ధీరుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె మోద మలర.

వ. మఱియును 87

సీ. సాత్త్వికుం డొక్కఁడు చనుదెంచి యొకనాఁడు, నంబిళ్ళనీక్షించి నతియొనర్చి
మాన్యమీకారోగ్య మా యని యడిగిన, మల్లయుద్ధముఁ జేయ మదిఁదలంచి
యరిగెదనా నీని కధికతరారోగ్య, మేటికిఁ గోవెల కేఁగి మగిడి
సదన మొందుచు నుంటిఁ జాలునీయారోగ్య. మనుచునగ్గురువరుఁ డానతియ్య

తే. విని ప్రపన్నున కారోగ్య విలసితంబు, గూడ దని యప్పు డాజగద్గురునిభావ
మాత్మలోపలఁదెలిపె నయ్యార్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె మోద మలర.

వ. అట్లు తిరుక్కులిహిన్నదాసగురుం డశక్తుం డై యున్నవిధం బెఱింగి యొక
శ్రీవైష్ణవుం డేతెంచి తదీయశ్రీపాదపద్మంబులకుఁ బ్రణామంబు గావించి యద్దేశి
కోత్తముం డనుభవించు చున్నప్రబలామయజనితశ్రమంబుఁ జూచి వెఱచిన నత
నింగ టాక్షించివత్సా యీదృగ్విధం బైనవాతవ్యాధియస్మదభిమతంబుగావున
నీ విట్లు వెఱచుటకుం బని గానఁబడ దని యాన తిచ్చెం గాన. 89

శ్లో. కృతకృత్యాః ప్రతీక్షన్తేమృత్యుం ప్రియమివాతిథిమ్॥ అనియెడు పంచమవేదోక్త
న్యాయంబునఁ గృతార్థులగువారు ప్రియాతిథినిం జూచినట్లు మృత్యువునుం బ్రతీ
క్షించుచు నుండెదరని యగ్గురువరునకుం దాత్పర్యంబనుచు నెఱింగి యతం డూర
కుండెనంతఁ బిళ్లయెంగళాళ్వా నమ్మంగియమ్మా ళనుసూము లిరువురా వృత్తాం

తం బెఱింగి యేఁగుదెంచి యమ్మహాత్ముని సేవించి యతని కష్టంబుఁ జూచి సహింపలేక పుళ్లయంగళాళ్వా ననుమతిచే యమ్మంగియమ్మాళను సూరిసత్తముం డొక భగవన్మంత్రంబా నంబిళ్లశ్రమ నివృత్తికై పఠింపం దలంప నజ్జగద్గురుం డది యెఱింగి యిది స్వరూపవిరుద్ధంబైన కృత్యంబుమీర లాచరింపవలదని వివారింప వారును భవన్నిమిత్తంబుగా దాసుల మాచరించిన స్వరూపవిరుద్ధం బెట్లగు ననినఁ దిరుమంత్రంబునకు వివరణంబై చరమశ్లోకంబునకు వివరణంబై యున్న ద్వయంబు దక్కఁ దక్కినమంత్రంబు లన్ని పంచాక్షరీసమ బులై ప్రపన్నుల కనాదరణీయంబు లగునని యగ్గురువరుం డానతియ్య నాకర్ణించి వారికవురు యుష్మదారోగ్యలాభంబునకై ప్రపదనం బాచరించెదమని వారువ్వ నదియును స్వరూపవిరుద్ధం బగు నెట్లంటిరేని స్వవిషయవ్యాధి నివృత్త్యర్థంబుగా శరణాగతి యొనర్చిరేని యత్యంత పారతంత్ర్యంబగు తన స్వరూపంబునకు హాని సంభవించుఁ బరవిషయవ్యాధి శాంత్యర్థంబుగాఁ బ్రపత్తిఁజేసెనేని పరాత్పరుండగు భగవంతుని సర్వజ్ఞానసర్వశక్తులకుఁ గొఱంత వాటిల్లుఁ గావున స్వపరవిషయ వ్యాధి విమోచనంబునకై సాధనాంతరానుష్ఠానం బొక్కటియైన సలుపఁగూడదని యద్దేశికేంద్రుం డానతియ్య విని వారికవు రయ్యార్యుని శ్రీసూక్తి విశ్వసించి తదాచరణ ప్రయత్నంబుఁ జాలించియున్నఁ గొన్నిదినంబుల కావాతవ్యాధి విశేషంబు తనంతట శాంతిఁబొందె నంత భగవంతుఁడైన యా సర్వలోకగురుండ రోగదృఢగాత్రుండై తొంటిచందంబున భగవద్విషయం బాశ్రితసంఘంబునకు వక్కాణించుచున్న సమయంబున శ్రీవత్సచిహ్న మిశ్రగురునకుం బౌత్రుండై శ్రీ పరాశరభట్టార్యున కభిమానపుత్రుండగు నడువిల్ తిరువీధిప్పిళ్లభట్టార్యుం డా జగద్గురుని జ్ఞానభక్తివైరాగ్య వైభవంబును భాగవతసమృద్ధియు సర్వలోక పరిగ్రహంబును శిష్యసంపత్తియు నాలోకించి సహింపక యసూయపడుచుండె నయ్యవసరంబున, 90

సీ. అలపరాశరసూరి, కభిమానపుత్రుఁడు, కూరేశపౌత్రుఁడు, గుణపయోధి
మధ్యమవీధి కుమారభట్టార్యుఁడు, దేవీసహాయుఁడై, భావ మలరఁ
గనకడోలిక నూఁగఁ, గావేరి నీరాడి, వచ్చుచు నంబిళ్ళ, వారియింటి
కరిగి యస్మత్పరమాచార్యపుత్రుఁ డీతం డని మ్రొక్క నాతండు చూచి

తే. భద్రమా పిళ్లనీ కనిపల్కఁగాని, యాభిజాత్యాదిగర్వము ననుసరించి
యంజలియు నైనఁ గావింపఁడతనికనుచు, వాదిభీకరగురుఁ డనెమోద మలర.

సీ. బ్రహ్మవిత్తములైన • బహువిధచ్ఛాత్రులు, వెనువెంట నేతేర • వేగ వచ్చి
నిత్య మానంబిళ్ల • నిర్మలభక్తితో, నతనిఁ గన్గొని మ్రొక్కి • యరుగఁ జూచి
యందఱు గని తన • సుందరీమణితోడ, రత్నడోలిక నూఁగు • రాజసాత్ము
నిత నిట్లు గని మ్రొక్కి • నేమికారణ మని, యాత్మసంశ్రితులైన • యార్యులడుగ

తే. నతఁడు మఱుమాటఁ జెప్పక • యాత్మగృహముఁ
జొచ్చి యందు శఠారాతి • సూరిసూక్తి
భావ మాశ్రితులకుఁ దేట • పఱచు ననుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 92

సీ. రంగేశుఁ డొకవాస • రంబున తిరువీధి, విచ్చేయ నంబిళ్ళ • వచ్చి కాంచి
ప్రణతికై సందేహ • పడిన నగ్గురువును, జూచి యదేమని • సూరు లడుగ
నొకదేవినే కూడి • యున్న సద్గురునకు, మ్రొక్కరా దంటిరి • ముందు మీర
లిరుగెలంకులభార్య • లిరువురు గలవాని, కిప్పుడే మ్రొక్కెడ • నెట్లు మీకుఁ

తే. దోఁచునోయని మదిశంక • దోఁచి యిట్లు • సంశయించుచున్నాఁడ • స్వాములార
యనిన లజ్జించి రయ్యార్య • లందఱనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. అట్లు గురువరుం డానతియ్య విని యా భాగవతోత్తములందఱు దేవీసమేతులై నయ్యాచార్యులును దత్పుత్రపౌత్రాదులును శ్రీమన్నారాయణ స్వరూపులని తలంచి మేధావియగు ప్రసన్నుండు నాకిం బ్రణిపాతనమస్కార ప్రియవాక్యముల సంతోషింపం జేయవలయుననుచు నిమ్మహాదేశికునకుం దాత్పర్యంబని యెఱింగి యపరాధ క్షమాపణంబుఁ జేసికొని రంత నంబిళ్ళయు నద్దేవదేవునికి సాష్టాంగ ప్రణామం బాచరించి తత్ప్రసాదలబ్ధ శ్రీశఠకోపమాల్యాది బహుమతి లభించి యనుజ్ఞఁ బడసి నిజగోష్ఠీమంటపముం జెంది యందు ద్రావిడామ్నాయ వ్యాఖ్యాన వైఖరీసమేతుండై సశ్రితులతోడ నానందించుచుండె నంత నొక్కనాఁడు నడువిల్ తిరువీధిప్పిళ్ళ భట్టార్యుండు రాజాస్థానంబునకుం జనుచు మార్గమధ్యంబున నాచార్యదేవుండగు పింబళహరాన్ పెరుమాళ్లుజియ్యరనుం జూచి తోడరమ్మని యతనిం దోడ్కొని చని చోళరాజు సభామంటపంబుఁ గాంచి యందమ్మహీపాలునిచే యథాశాస్త్రంబుగా నర్చితుండై యొక మృదుతర శుభాస్తరణంబునందు నిజసంశ్రితులతోడ విలసిల్లుచున్న సమయంబున బహుశ్రుతుండైన యా రాజసత్తముండా బ్రహ్మవిత్తమునిం జూచి తదీయ విద్యావైదుష్య జిజ్ఞాసచే మహాత్మా
శ్లో॥ ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్॥ అనెడు న్యాయంబునఁ

దనపరత్వంబు బయలుపుచ్చక తన్ను మనుష్యమాత్రునిం గాఁ దలంచు చక్రవర్తి కుమారుండు, శ్లో॥ 'మయాజ్ఞప్తో గచ్ఛలోకాననుత్తమాన్' అని జటాయువున కెట్లు పుణ్యలోకంబు లొసంగెనని యాక్షేపించి వ్యావహారిక పురుషులతోడం గూడి యించుకకాలంబు రాజకృత్యంబులు విచారించుచున్న సమయంబున నా రాజొనర్చిన యాక్షేపంబునకు సమాధానంబు దోఁచక యుబ్భట్టార్యుండు పిండళహరాణ్ పెరుమాళజియ్యరునుం జూచి వత్సా నంబిళ్ళ యీయర్థం బెట్లు నిర్వహించునని యడుగ నతం డద్దేశికోత్తమునకు 'సత్యేన లోకాన్జయతి' అను వచనార్థంబు స్మరింపంజేసె నంత నమ్మూర్భజానియు రాజకృత్యంబు విచారించుకొని యుద్దేశికుని కభిముఖుండై యస్మత్కృతాక్షేపంబునకు సమాధానం బానతిమ్మని యగ్గురువరేణ్యు నడుగ నతండు స్వకీయ సత్యవ్రత విజితంబులై స్వవశంబులై యున్న పుణ్యలోకంబులు చక్రవర్తిసుతుండు జటాయువున కిచ్చెనని సమాధానంబు చెప్ప నాకర్ణించి మిగులం బ్రహర్షించి యా నృపాలసత్తముం డద్దేశికోత్తమునకు ముద్రితాముద్రిత హేమసముదాయంబును నమూల్య రత్నభూషణరాంక వక్షోమాంబరాది బహువిధ ద్రవిణంబు లర్పించిన నద్దేశికసార్వభౌముం డవియన్నియుం గొనివచ్చి యజ్జగద్గురునిం జూచి భక్తిపూర్వకంబుగాఁ బ్రణామంబు గావించి భవదీయగోష్ఠీ సుధాసముద్రంబునందుఁ జిందిన యొకబిందువు రాజసభాస్థానులఁ గెలిచి తెచ్చిన యీ ద్రవ్యంబులన్నియు మీరు పరిగ్రహింపుండని సమర్పించి తదీయ శ్రీపాదపద్మంబు లాశ్రయించి యర్థక్షణంబైన నమ్మహాదేశికుని విశ్లేషింప నొల్లక భజించుచున్న సంతసించి యగ్గురువరుండును బూర్వాచార్యోపదేశ పరంపరా ప్రాప్తంబులై నిజమానసగతంబులై నజ్ఞాతవ్యార్థంబు లన్నియుం దెల్పి భగవద్విషయం బుపక్రమించి యానతిచ్చుచుండె నంత. 94

సీ. దినదినమొక్కొక్క • తిరువాయిమొళి కర్థ, మాజగదాచార్యు • లానతియ్యఁ
బగలెల్ల వినివచ్చి • భట్టరాగ్రంధము, రాత్రులందు లిఖించు • రంగుమీఱ
న ట్లాయిరప్రబం • ధార్థము విని వ్రాయఁ, దగ శ్రీమహాభార • తంబు పగిదిఁ
జాలుసపాదల • క్షగ్రంధ మై యొప్ప, నాపుస్తకము లన్ని • యాత్మగురుని

తే. సన్నిధానమునందుంచి • సాఁగి మ్రొక్కి, యతనియనుమతి కనుమొగి • నధివసింప
నదియుఁదుదముట్టఁజూచెన • య్యార్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. అట్లు నంబిళ్ల కటాక్షించి నడివిల్తిరువీధిప్పిళ్ల భట్టార్యున కిట్లనియె. 95

సీ. భట్టార్య నీవు మా•పటివేళలందు మా,యనుమతి వడయక • యాత్మతంత్ర
తనె శ్రీమహాభార•తం బంతవ్యాఖ్యను, వ్రాపి తెచ్చితి విది • వాసిఁ గనదు
వసుధ శిష్యార్యవ్య•వస్థయు దీనికి, జరగనేరదు గాన • జాగు మాని
పత్రము లన్ని వి•సూత్రములుగఁ జేయు,మని గురుం డన నతం • డట్లొనర్పఁ

తే. గాంచి నంబిళ్ల యతివివి• క్తస్థలంబు, నందుఁ బత్రవ్రజం బుంచి,యందు మించ
మంచి సున్నపునీరుఁ జ•ల్లించె ననుచు, వాదిభీకరగురుఁ డనె• మోద మలర.

సీ అట్లు కొన్నిదినంబు • లరిగినపిమ్మట, గుట్టుగా నొకపుట్ట • పెట్టె నచట
నాపుట్టమట్టి లో•కార్యుఁడు కావేరి, యుదకములం దుంచ • నులగముండ
పెరువాయననెడొక•తిరువాయిమొళివ్యాఖ్య, పత్రములన్నియు•బయలుఁజెంది
యెదురెక్కి యురముపై•నేతేరఁగని యవి,గొనితెచ్చి యుంచి య•గ్గురువరుండు

తే. రమణ శ్రీకృష్ణపాదార్య • రచితమైన, కలితషట్త్రింశసంఖ్య స•ద్గ్రంథమునను
జేర్చరని మామహార్యులు • చెప్పిరనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

వ. తదనంతరం బానంబిళ్ళ తనకుం బ్రియశిష్యుండగు పెరియవాచ్చాంబిళ్ళనుం బిలిచి తిరువాయిమొళికి నీవొక వ్యాఖ్యానంబు సేయుమని నియమింప నతండు శ్రీమద్రామాయణంబుకరణి నిరుపత్తినాలాయిరప్పడి రచియించి య గ్గురునకుం గవిపింప నతండు వీక్షించి సంతసించె నంత శ్రీపాదాపరనామధేయుండగు వడక్కుత్తిరువీధిప్పిళ్ల ప్రతిదినంబు దివాభాగంబులయందు నొక్కొక్క తిరువాయిమొళికి నిజాచార్యుండగు నంబిళ్ల యర్థంబానతియ్య వివి తన మానసంబున ధరించి యా గ్రంథంబంతయు రాత్రులందు లిఖింప శ్రుతప్రకాశికమాడ్కి షట్త్రింశత్సహస్రసంఖ్యాసంఖ్యాత గ్రంథంబైన నా పుస్తకసముదాయంబు నాత్మగురుని సన్నిధినుంచ నతండా గ్రంథ బంతయుఁ గటాక్షించి తనమనంబునం దీ గ్రంథం బతి విస్తృతంబు నతి సంకుచితంబును గాక సర్వాలంకార శోభితంబగు భద్రగజంబు కైవడి సర్వాభియుక్త శ్లాఘనీయార్థ సంపన్నంబై శ్రుతప్రకాశికభంగి షట్త్రింశత్సహస్రసంఖ్యా సంఖ్యాతగ్రంధ బంధురంబై యొప్పుచున్నదని యా వ్యాఖ్యఁ గటాక్షించి మదీయానుమతి లభింపక యిట్లేల లిఖించితివని యొక నెపంబిడి యా గ్రంథంబు పరిగ్రహించి నిజమందిరంబునం దుంచినంత నాయర్థం బెఱింగి యీయుణ్ణిమాధవ ప్పెరుమాళ్లను సూరిసత్తముండు భక్తిమీఱ శ్రీరంగశౌరినిం బ్రార్థింప నతం డర్చకముఖంబుగా నీయభీష్టంబుఁ జెప్పుమనిన శ్రీకృష్ణపాదార్య

విరచితంబగు నీదు ముప్పత్తాఱాయిర గ్రంధంబు శ్రీలోకగురునికడ నున్నయది
దాసునికిం గలుగున ట్లనుగ్రహింపుమని విన్నవింప శ్రీహరియు నట్లొనర్చెదనని
యానతిచ్చి యొక్కనాఁడు సాత్త్వికబృందంబుతో నంబిళ్ల తన్ను సేవింప నేతెరం
జూచి యమ్మహాత్మునకు శ్రీశఠకోపతీర్థప్రసాద పుష్పమాల్య చందనాది బహుమతి
సేయించి యభిజ్ఞసత్తమా నీకడనున్న ముప్పత్తాఱాయిరప్పడి యను తిరువాయి
మొళివ్యాఖ్యానంబు యీయుణ్ణిమాధవప్పెరుమాళు కొసంగుమని యర్చకముఖం
బుగా నాజ్ఞాపింప మహాప్రసాదంబని యద్దేశికేంద్రుం డా భగవదాజ్ఞ శిరసా
వహించి తన కంతరంగశిష్యుండగు నమ్మాధవార్యున కాగ్రంధం బొసంగె నతం
డతని కుమారునికిం బ్రసాదించె నాక్రమంబుగా సంప్రదాయ పరంపరాప్రాప్తంబై
యది యస్మదాది పర్యంతంబయ్యె. మఱియు నొకనాఁ డొకవైష్ణవుం డేతెంచి
నంబిళ్లనుం గాంచి సాష్టాంగప్రణామం బాచరించి కరకమలంబులు ముకుళించి
దాసునికి భగవద్విషయం బానతిమ్మని ప్రార్థింప నయ్యార్యసత్తముం డనుమతించి
నిజచ్ఛాత్రుండై బ్రహ్మవిత్తముండగు నొక మహాభాగవతునిం జూచి వత్సా నీ
వితనికి భగవద్విషయంబుఁ జెప్పుమని యావైష్ణవునిం బనిచిన నతం డతని మంది
రంబునకుం జని యా గ్రంధం బతని కానతిచ్చు సమయంబున నతఁ డాచార్యపు
రుషుండు గావునఁ జిత్రాసనాసీనుండై ప్రసాదిపు మనిన నిట్లు చెప్పుట సంప్ర
దాయసిద్ధంబు గా దని యా సాత్త్వికుండు పలుక నయ్యార్యుఁ డు మగిడి యావృ
త్తాంతం బంతయు నెఱింగింప నా జగద్గురుం డాకర్ణించి నిజశిష్యునిం బిలిచి పుత్రా
వారాచార్యపురుషులు గావునఁ జిత్రాసనంబు విడిచి కూర్చుండరు గాననతని
కిష్టంబగునట్లాగ్రంధంబుఁ జెప్పు మని నియమింప నిజాచార్యానుశాసనమాల్యం
బుఁ దలఁదాల్చియతం డిట్లు చెప్పుచుండఁ బై లుంశొడరొళి యనియెడు తిరువాయి
మొళి ప్రస్తుతం బైనయంత నతం డాభాగవతమాహాత్మ్యంబు వినియాచిత్రా
సనంబు దూరంబుగాఁ బరిహరించి ధరాతలంబునం గూర్చుండి యింతవట్టు భా
గవత వైభవంబు తెలియక యిట్టి మౌఢ్యం బాచరించితి మదీయాపరాధ బు క్ష
మియించి యుత్తర గ్రంధం బనుగ్రహింపు మని ప్రార్థింప నాసాత్త్వికపుంగవుం
డస్మదాచార్యానుశాసనం బిట్టిది తిరిగి నన్నుఁ బిలిపించి భవదభిమత ప్రకారంబుగా
నుత్తర గ్రంధంబు వక్కాణింపు మని గురుం డాజ్ఞాపించె నేని యట్లొనర్చెదనని
పలుక నయ్యాచార్యపురుషుండును మగిడి నంబిళ్ళ కా వృత్తాంతంబు దెలుప నతం
డు మందస్మిత సుందర ముఖార విందుడై పైలుంశుడరొళి యనుతిరువాయి మొళి
ప్రస్తుతం బాయెనోయని యడుగ నతం డౌనన సంతోషించి నిజచ్ఛాత్రునిరా

వించి యుత్తర గ్రంథం బంతయు నితవికిం బ్రసాదించి నెఱవేర్పమని యానతియ్య
నతం డట్లు గావించె నని వాదిభీకరగురుం డానతిచ్చి మఱియు నిట్లనియె. 98

సీ. శ్రీకృష్ణపాద దే • శికునింటి కొకనాఁడు, నంబిళ్ళగారు వై • ష్ణవులతోడఁ
జనుదెంచి యున్నఁ ద • త్సదనగత స్త్రీలు, ప్రణమిల్ల శ్రీకృష్ణ • పాదుపత్ని
యార్ద్రవస్త్రముతోడ • నతని సేవింప నా, నభ్యుఁ డచ్చటివృద్ధ • సతులఁ జూచి
యెవ్వ రీసిన్ని ది • క్లేటి కార్ద్రపటంబు, తోడ మ్రొక్కెడె మాకు • వ్రీడపడుచు

తే. ననియడుగ నంతనొక సాధ్వి•యంజలించి, సిన్నపడుచు సమాచార•మున్నయట్లు
భక్తిదళుకొత్త నీరీతిఁ • బల్కె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర. 99

సీ ఆచార్యచరణ నీ • కభిమతశిష్యుఁడౌ, శ్రీకృష్ణపాద దే • శికుని చెట్టఁ
బట్టిన దీపిన్న • పడుచు ఋతుస్నాన, మార్చి వచ్చెను గాన • నార్ద్రవస్త్ర
యై మీకు మ్రొక్కెడె • నని వృద్ధసతిపల్కఁ. దెలిసి నంబిళ్ళయా • వెలఁదిపిటకు
ర మ్మని పిలిచె క • రమ్మున సతియుద, రమ్ము దువ్వుచును మా • యమ్మ నీవు

తే. కడఁగిననుఁబోలు పుత్రునిఁ•గాంచు మనుచు, బ్రీతిదీవించి దెసల వి•ఖ్యాతినెరయ
నాత్మశిష్యులతో నిటి • కరిగెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర. 110

సీ. శ్రీకృష్ణపాద దే • శికుఁ డాత్మ గురుసూక్తి, తథ్యము సేయంగఁ దలఁచి యంత
మంచిరాతిరి తన • మహిషితోఁ గూడిన గర్భము దాల్చి యా • కమలనేత్ర
యిమ్మగా మాసము • ల్దొమ్మిది గడచినఁ, బూర్ణచంద్రునిఁదోలు•పుత్రు నొకనిఁ
గాంచ న బ్బాలునిఁ • గాంచి సుస్నాతుఁ డై, పురిటిదినంబుల • జరపి తండ్రి

తే. యాత్మసుతునకు లోకార్యుఁ • డనుచుఁ దనదు
గురునితరునామ మొనరించె • గరిమ మీఱ
న త నా వార్త విని యతఁ • డార్యుఁ డనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ, అంత శ్రీకృష్ణపా • దార్యుఁ డేతెంచి ని, జార్యునిఁ గని మొక్కి•యతనియాజ్ఞఁ
గనుమ్రోలఁ గూర్చుండఁ•గని నీ సుతున కేమ, రంగనాథుని పే రొ•నంగఁదలఁచి
యుంటి మాకీవార్త • యొక్కింత యైనను, దెలియఁజెప్పక నామ•ధేయమొకటి
స్వతనూభవున కిట్లు • స్వాతంత్ర్యపడి చేయ, నర్హమా నీ కని • యార్యుఁడడుగ

తే. వెఱచి యే మనఁ డా బ్రహ్మ•విద్వతంసుఁ, డంత నంబిళ్ళ కచ్చటి•యార్యులిట్లు
వేడ్కఁ బ్రత్యుత్తరమువిన్న • వించిరనుచు, వాదిభీకరగురుఁ డనె• మోదమలర.

సీ. స్వామి దేవరవారి చరణాబ్జములయందు, భక్తిచే సుతునకు • భవదుదార
నామ మొనర్చె పీ • న్యాయవిదగ్రణి, గావున మీరు స • త్కరుణ మగిడి
మంచికుమారుఁ డీ • యంచితాత్మున కుద. యించుట కాశీర్వ • దించుఁ డనుచు
నాశ్రితుల్ పల్క న • య్యార్య శిఖామణి, యట్లు దీవింప న • య్యార్యుఁ డింటి
తే. కరిగి మంచిదినంబునం • దాత్మసతిని, గూడగర్భముదాల్చి య • క్కువలయాక్షి
కాల మేతేరఁ బుత్రునిఁ గనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

వ. అట్లు విలసిల్లు చున్న బాలునిం జూచి కృతస్నానుండై వడక్కుత్తిరువీధిప్పిళ్ళసూత్యాశౌచంబు గడపినపిదప నా వృత్తాంతం బాత్మ గురున కెఱింగింప నమ్మాహాత్మ్ముం డాశ్రితవర్గంబుతో నతనిభవనంబున కేతెంచి యద్దారకున కళహియమణవాళ ప్పెరుమాళ్ నైనారని నామంబు గావించి నిజ నివాసంబునకుం జనియె నంత నొక్కనాఁడు. 104

సీ. యావనప్రభుసేన • నమితనానాధన, మార్జించి భోగము ననుభవించి
పంచ సంస్కారసం • పన్నుఁ డొకానొక, పశ్చిమదేశీయ • బాడబుండు
చనుదెంచి శ్రీరంగ • శౌరిని సేవించి, యతనికి రత్న భూ • షాంబరాదు
లర్పించి నంబిళ్ళ • యంఘ్రులఁ గని మ్రొక్కి, యతనికిఁ దళిగకై • యర్థమొసఁగ
తే. రాజసులసొమ్ముఁ గైకొన • రాదటంచు, నెంచియాద్రవ్యమేమి గ్ర • హింపఁడయ్యె
నా జగద్గురుఁ డని చెప్పి • రార్యులనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. బ్రాహ్మణుం డంత • నమ్మహాత్ముని శ్రీమ, హానసకైంకర్య • మాచరించు
శ్రీవైష్ణవునితోడఁ జెలిమి గావించి ర, హస్యముగాఁ దండు • లాదు లన్ని
యర్పింపఁ బక్వము • లవి చేసి యాతఁడు, పిలిచినయంత నం • బిళ్ళ వచ్చి
స్వామి కర్పించి యాసర • సాన్న భక్ష్య భో, జ్యాదు లెప్పటియట్టు • లా గించి
తే. విశ్రుతద్రావిడామ్నాయ • వివరణంబు, సల్పుచుండంగ నాశుద్ధ • సత్త్వనిధికి
వింతగాఁదోఁచె నొక యావు • లింత యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. దృఢతరానుస్మృతి • స్థిరహేతు వగుసత్త్వ, శుద్ధి కాహారైక • శుద్ధి బీజ
మని యుపనిషదుక్త • మది గాన నీవేళ, నాహారశుద్ధి మా • కమర దయ్యెఁ
గాఁబోలు నది మాకుఁ • గలిగెనేని రజోవి, జృంభితమైన యీ జృంభణంబు
పొడమ దంచుచు దన • బుద్ధి విచారించి యా వైష్ణవునిఁ బిల్చి • యనృతముడిగి
తే. నేఁటితళిహక్రమము మాకు • నీవు దెల్పు, మనుచుగురుఁడనసున్నట్ల • యతఁడుపల్క
నతని వరించెఁ దళిహయం • దార్యుఁడనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

వ. అట్లర్ధపారవశ్యంబున గురు ప్రతారణంబు స్వరూపహానికరం బని విమర్శింపలేక సాహసకృత్యం బొనరించిన యా వైష్ణవుని విసర్జించి నిజభార్యల నిరువురం బిలిచి మొదట జ్యేష్ఠ భార్య నుద్దేశించి యిట్లనియె. 107

సీ. నే నెట్లు దోఁచెద, నీ కని యగ్గురుఁడడుగ నయ్యార్యుని, యగ్రమహిషి
నాపాలి శ్రీరంగ, నాథుఁడు గాఁ దోఁచఁ, బడియెద నీ వని, పలుక నాతఁ
డట్లు కనీయసి, నడిగిన నేను మీ, భార్యను మీరు నా, భర్త లనుచుఁ
దోఁచె నా కని యవ్వ, ధూటి పల్కిన విని, ప్రకృతి సంబంధని, బంధనోక్తిఁ
తే. బలికె నీ యింతి స్వస్వరూ, పం బెఱుంగ, దగ్రభార్యకు స్వస్వరూ, పావబోధ
మున్న దని యెంచె నా యభి, యుక్తుఁడనుచు, వాదిభీకరగురుఁడనె, మోదమలర.

వ. అట్లు వర్జించి. 109

సీ. పెద్ద భార్యను జూచి, పెరుమాళ్ళ తళిహకు, నీవె యొనర్పుము, నేఁటినుండి
యనుచు నియోగించి, యనర యౌభార్యను, బైపని సేయంగఁ, బనిచియంత
నగ్రపత్ని బహిష్ఠ, యైనఁ గనిష్ఠ భా, ర్యను దళిహను జేయు, మనుచుఁ జెప్పి
యద్దేవి చేసిన, యన్నాదికం బంత, సొంపుగా హరి కార, గింపొనర్చి
తే. భగవదర్పితమైనను, భావశుద్ధి, లేని స్త్రీ చేతియన్న మ, జ్ఞాన హేతు
వనుచుఁదనమదిఁదల్చె న, య్యార్యుఁ డనుచు, వాదిభీకరగురుఁడనె, మోదమలర.

వ. అట్లు దలంచి యగ్గురువరుం డాయన్నంబు భుజింప నొల్లక యించుకప్రొద్దు చింతించి సకలవేదాంత సారతమార్థతత్త్వ విదగ్రణియు జ్ఞాన భక్తి వైరాగ్య శమదమక్షమాద్యనంతకల్యాణగుణ పరిపూర్ణుండును నుత్కృష్టజనియు నగుపిళ్ళ తిరునరయూర రయర్ దాసుం డనునొక శ్రీ మహా భాగవతోత్తమునిం బిలిపించి తదీయ పాణిపల్లవ స్పర్శనంబుచే నా యన్నంబుఁ బరమపవిత్రఁబుఁ గావించి యారగించి నిజగోష్ఠీమంటపంబుఁ బ్రవేశించి యుం దాశ్రితవ్రాత పరివేష్టితుం డై వేదాంతగోష్ఠీతత్పరుం డై యుండె నంత. 111

సీ. వాసరంబులు కొన్ని, వరుసగా జరగిన, పిదప నయ్యార్యుని, పిన్న భార్య
కమ్మహాత్మునివల్ల, నవతరించెఁ గుమారు, డొక్కండు బాలసూ, ర్యోజ్జ్వలాంగుఁ
డంత జాతాశౌచ, మంతయు జరిగిన, పిమ్మట నంబిళ్ళ, ప్రీతితోడఁ
ధూనియం బిళ్ళను, పావన మగు తిరు, నామ మా శిశువు కా, నర్చె నంత
తే. ఛాత్రుఁ లితఁ డన్న మా కని, సంతసించి, రార్యపుత్రుఁడు బాలకు, డైన నరయ
శిష్యతతికన్నియగు శాస్త్ర, సిద్ధి ననుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

వ. మఱియు నొక దినంబునం దానంబిళ్ళ పింబళకరాం పెరుమాళ్ జియ్యారుమఠంబున కరిగి యం దమ్మహాత్మునితో సంభాషించుచు నుండ శ్రీ వైష్ణవులు కొందఱాచార్య సత్తమా ప్రపన్ను లయినవారికి శ్రీపరాంకుశ పరకాలాదిదివ్య సూర్యులకుం గల యవస్థా విశేషంబు లవశ్యాపేక్షితంబులై యుండ దారపుత్రాన్న పానాద్యపేక్షాపాశ బంధంబులం దగిలియున్న యస్మదాదుల కద్దశావిశేషలాభంబు దుర్లభంబు గావునఁ బ్రాప్యం బెట్లు సిద్ధించునని ప్రశ్నంబు సేయ నద్దేశికేంద్రుండు సంతసించి పుత్రకులారా సదాచార్య విశేష కటాక్షంబుచే భగవత్సంకల్పితం బగు దేహావసానకాలంబున స్థూల ప్రకృతి బంధంబుఁ బాసి ముఖ్య ప్రాణ భూత సూక్ష్మాది విశిష్టంబగు సూక్ష్మ దేహంబుతో స్వకీయానుగ్రహప్రాప్తం బగుమధ్య ధమనీద్వారంబులచే బహిర్నిర్గమనంబు లభింపజేసి యర్చిరాది మార్గంబునందు సర్వలోకోజ్జీవనతత్పరుం డగు భగవంతుండు తొల్లి సుదామాభిధానమాలాకారునికిం బోలె స్వకీయ దివ్యమంగళ విగ్రహంబుఁ బొడసూపి పరభక్తిపరజ్ఞాన పరమపదంబు లొసంగి స్వప్రాప్తి లక్షణమోక్షం బిచ్చు నని సంప్రదాయ ప్రసిద్ధం బని యానతియ్య నాకర్ణించి పరమానందకందళిత హృదయారవిందులై వారందఱు నయ్యార్య పురందరునకు వందనంబు లొనర్చి తత్పాదారవిందంబు లెడఁబాయంజాలక తత్కైంకర్యంబును సల్పు చుండి రంత. 113

సీ. అనఘ కులందఱు • మ్మను పాశురమునకుఁ, బ్రథమపదార్థముఁ బలుకు మనుచు
వేడుకఁ బెరియ కో • విల వెళ్ళలా రనె, డార్యుని న బిళ్ళ • యడుగ నతఁడు
నన్ను దేవరవారి • నంబూరికుడికి శే. షము సేయ నా కగు • సత్కులాప్తి
యనిపల్కె విని యార్యు•లతని తాత్పర్యము, పఁడక్కులము వాని•భక్తకులముఁ
తే. జొచ్చి యాచార్య వంశ్యులొ • సూరివరుల. ననుసరించుచున్న ధ • న్యాగ్రణుల
గులము మంచిది గల దని • తెలిసి రనుచు. వాదిభీకరగురుఁ డనె•మోద మలర

వ అంత. 115

సీ. అవతార మెట్లుండు • ననుచు నంబిళ్ళను, సంశ్రితుఁ డడుగ నా • సద్గురుండు
పాలిదేహము జిహ్వఁ బట్టినయ ట్లుండు. ననిన వార ల దెట్టు • లన్న నాతఁ
డధికారి దుర్లభుఁ • దౌట పాలినయట్టు, లొడలుండు నతఁ డొకఁ•డుండెనేని
యవని వాఁడు ప్రయోజ•నాంతపరుఁ డౌట, ఘనకేశదుష్టాన్న•కబళమట్లు
తే. జిహ్వఁ బట్టినగతి నుండు•శ్రీసఖునకు.ననుచుఁ దనసూక్తి కాళయ•మానతిచ్చెఁ
గాననాడు ప్రపన్నుఁడు • గలుగఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. నంబిళ్ళసంశ్రితుల్ • నయమొప్పఁ బెరియకో•విలవెళ్ళలారును • వేడ్కఁజూచి
యార్య శ్రీవైష్ణవు•లనిపేరు వీరికిఁ, గలిగె నె ట్లది మాకుఁ•దెలుపు మనిన
సిరికి శ్రీహరికిని•వరపుత్రులై యుండ, నెఱుక శ్రీపతి వీరి • కిచ్చుకతన
శ్రీధరు నెఱుఁగుటఁ•జేసి శ్రీమత్పదం•బునఁ బుట్టినందునఁ • బురుషకార

తే. భూత యై సిరి వీరిని•బ్రోచుకతనఁ, గలిగె శ్రీవైష్ణవాఖ్య యీ•ఘనుల కనుచు
నొప్పుగా వారి కతఁ డిట్లు•చెప్పె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. మఱియు నొక్కసమయంబున నిజపదాశ్రితులగు శ్రీవైష్ణవులు నంబిళ్ళనుజూచి మాకుఁ ద-జ మగుహితం బొక్కటి యుపదేశింపుఁ డని యడుగ నతండు వారి కి ట్లనియె. 118

సీ. మహిఁ బ్రపన్నుఁడు మూల•మంత్రార్థమెఱిఁగి ద్వ•యార్థచింతనపరుం•డాయెనేని
యతిశయించును భక్తి•హరియెడ నాతని, కది గల్గెనా తన•యార్యునందు
నతులభక్తి జనించు • నట్టివాఁ డాయెనా, పరమభాగవతుల•పాదపంక
జార్చకుండై దేవ•తాంతరసమునిఁగా, హరిని దలంచి వాఁ • డాత్మగురుని

తే. యంఘ్రిపద్మములే తంజ • మనుచు నమ్మి, యతని కిష్టని యోగార్హుఁ•డై చరించు
ననుచు వారికిఁ దెల్పె న•య్యార్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఆయధికారి శ్రీ•హరిసేవకులతోడ, మైత్రి యొనర్చెనా • మధువిరోధి
కొలఁది నాతనియందు • గురుఁడు వర్తించుని, జాచార్యభాగవ•తాంఘ్రికమల
ములయందుఁ బ్రేమము•గలకృతార్థునియెడ, నాముష్యమనుభవ్యు•లగుటఁజేసి
యాచార్యభాగవ•తాభిమానము దక్కఁ, దంజ మన్యము లేదు•తఱచి చూడ

తే. ననుచు గురుఁడనవినివారు•హర్ష మొంది, వైష్ణవులు విష్ణువున కెట్టి•వారలనినఁ
దిరిగి వారికి గురుఁడిట్లు • దెల్పె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. పంచపాండవు లట్లు • భగవంతునకు నిజ, ప్రాణసమానులు • భాగవతులు
సౌమిత్రిపగిదిఁ గో•సలరాజసుతునకు, బాహుసమానులు • భాగవతులు
జానకిగతి రామ•చంద్ర పదచ్ఛాయఁ, బట్టి చరింతురు • భాగవతులు
నారాయణున కాత్మ•నయన జిహ్వాకల్ప, పాదాబ్జసదృశులు • భాగవతులు

తే. పద్మనాభాంఘ్రిరేఖలు • భాగవతులు, పరునికాయుధతుల్యులు • భాగవతులు
ననుచు వారికిఁ దెల్పెన•య్యార్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

వ మఱియు నావైష్ణవులు సత్కారయోగ్యులనియును సహవాసయోగ్యులనియును సదానుభవయోగ్యు లనియును మూఁడువిధంబులం బ్రవిభక్తులై యుందురు వా రెట్టివా రనిన వివరించెద. 122

సీ. శ్రీనివాసునినామ,చిహ్నముల్ గలవారు, సత్కారయోగ్యులు • సజ్జనులకు
స్వస్వరూపజ్ఞాన,సంపన్ను లగువారు, సహవాసయోగ్యులు • సాత్త్వికులకు
నార్తప్రపన్నులై•హరి సర్వమను వార,లనుభవార్హులువిత్య • మార్యులకును
గరణత్రయముచేతఁ,గలనైన హరియందు, నపచారపడకయ•య్యతులమతుల

తే. సాంద్రసత్కారసాంగత్య,సంతతాను, భవము లుక్తక్రమంబుగా • వారినెఱిఁగి
సలుపుఁ డని వారి కార్యుఁడు•పలికెననుచు, వాదిభీకరగురుఁడనె•మోద మలర.

వ. మఱియును. 124

సీ. బ్రహ్మహత్యకు శిఖా,బ్రహ్మసూత్రోల్లస,ద్బ్రాహ్మణుఁడే చాలు•పగిది విష్ణు
లక్షణంబులె చాలు • నక్షయభాగవ,తాపచారాప్తికి • నరసి చూడ
బ్రహ్మవిత్తము లగు•భాగవతులయెడ, నపరాధపడె నేని • యతఁడు దగ్ధ
పటము గాలికిఁ జెడు•భంగిని భగవన్మ,హోగ్రనిగ్రహమారు•తోరుహతిని

తే. సమసిపో నని ఘోషించు•శాస్త్రమనుచుఁ, బలికియతిరాజదాసుని • భవనమునకు
గురుఁడువిచ్చే సెనాశ్రితుల్•గొలువననుచు, వాదిభీకరగురుఁ డనె• మోద మలర.

సీ. ఆజగద్గురుఁడు శ్రీ• యతిరాజదాసుని, కలిమి కానందింపఁ • గని నిజాంఘ్రి
సంశ్రితు లనఘు యీ•సంతోష మే మని, యడుగ నాకర్ణించి•యార్యవరుఁడు
తనసిరి నా దని • తానె భుజించుట, నరకానుభవ మది • నాకు హరికి
సమ మని భోగించు • టమరేంద్రసుఖ మగు నది విష్ణుదాసుల,కాయె నేని

తే. పరమపద మగుఁ గాన శ్రీ•భాగవతుల, కాయెనీతనిసిరి యని,యాత్మయందు
హర్ష మొందితిననివారి•కనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర,

సీ. సంసారశిఖితప్త•సకలచేతనులను, విమలబోధామృత•వృష్టిఁ దనిపి
తిరుమేనఁ దిరునోవు • ధరియించి యొకనాఁడు, స్వాములశ్రీపాద•జలముఁ గ్రోలి
శ్రీమదర్చ యొనర్చి • శ్రీవైష్ణవుల కార, గింపుఁ జేయించి తా•నింపు మీఱ
స్వీకరించి తదీయ•శేషాన్న మామీఁద, నఖిలభాగవతుల • కంజలించి

తే. మైత్రిపింబళ్ళ్వారా-పెరుమాళ్ళజియ్య, రంకతలమున శిరముంచి • యార్యుఁదలఁచి
పరమపద మొందెనంబిళ్ళ • భక్తిననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అంత సంశ్రితు లంద•ఱాచార్యు నెడఁబాసి. వృత్తి చెడి విలపించి, తెలివిఁ జెంది
యార్యపుత్రుని ధూవి•యంబిళ్ళ నెడుసూరి, నడ నడయించుచుఁ బత్ని • రాంబుజమున
నతనికి బ్రహ్మమే•ధాదికచరమకైం•కర్యము లన్నియుఁ • గడపు మంచ
మధ్యమవీధికు•మారభట్టార్యుఁడు, చెంత పై వారితోఁ • గర్వ మెసఁప

తే. విని తదగ్రజుఁ డైనవా•గ్విజయభట్టు, గలిగి బ్రహ్మవిదగ్రణి•యనుజు నతనిఁ
బరుషతరవాక్యముల నిట్లు•పల్కె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. గణుతింపఁగాఁ బిరు•క్కలిహిన్నదాసుఁడు, శిష్యప్రశిష్యుఁ డీ•క్షితిని మనకు
నతనికి శిష్యకృ•త్య మొనర్చితివి కూర, కులపాంసనుఁడ వని • గురుఁడు పల్కె
నలవిభీషణులను•గులపాంసనుం డని, ప•క్కీర్తికంటుఁడు తొల్లి•పల్కెఁగాదె
యాత్మగుణంబుల • కాటపట్టగుకూర, పతివంశమున కేను • బరమకీర్తి

తే. కరము జగదార్యచరమకైం•కర్య మనుచుఁ, జేసియిట్లు స్వరూపైక•సిద్ధిఁగంటి
నని నిజాగ్రజునకుఁ దమ్ముఁ•డనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. విని తదీయోక్తి వా•గ్విజయభట్టార్యుఁడు, హరికి నావృత్తాంత • మంతిదెలుప
వెన్నుఁ డామధ్యమ • వీధికుమారభ, ట్టార్యునిఁ బిలిపించి • యనఘ నీవు
కూరేశగురుపౌత్ర•కుఁడవు నంబిళ్ళకుఁ, బరమకృత్యము లెట్లు • సల్పితి వన
స్వామి మద్గురుఁ డను • శఠకోపమునియవ•తారము భవ•దాత్మకుండు

తే. నైన నంబిళ్ళవిషయ మే • నాచరించి, నట్టికృత్యము దెల్పెద • నవధరింపు
మనుచు రంగేశునకు భట్టు•రనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. శ్రీధర మూర్తిముం•జేతులు గౌరిగింప, కాని దాసకృత్యము • గురుని కేను
జేయ నర్హుఁడ నయ్యుఁ • జేయక యట్లార్య. శిష్యపుత్రులతోడ•శిరము వపన
మై గురుచరమక్రి•యల నొనర్చితి నిది, వైష్ణవశేషత్వ • పారతంత్ర్య
పాథోధి యగుకూర•పతియింటి కుచితమే. కాని యవద్యము • గాదు దేవ

తే. యనుచునతడనదీర్ఘాదు•లతనికొసఁగి, బ్రహ్మరథవాద్యఘోషాది • బహుమతులను
జేసి పంపించె నతని రం•గేశుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. ద్రావిడశ్రుత్యర్థ•తత్త్వ మెఱుంగుట, జగదార్యసంజ్ఞయు • సాధుగోష్ఠి
పరమపదంబులోఁ • బత్రిక చెల్లుట, యొక్కనంబిళ్ళకుఁ • దక్క నెట్టి
ధర్మము లొరులకు • ధరఁ జూడఁబడ విఁక, ననుచుఁ బల్కిరిపెద్ద•లతనిచరిత
మున్నట్లు వర్ణింప • నోపఁ దేకవియును, విబుధులిపల్లను • విన్నయంత

తే. గ్రంథములయందు నామతి॰గన్నయంత. తెలివి కనుకూలమైనంత॰పలికి తిట్లు
తప్పు క్షమియింప నార్యులు॰తగుదు రనుచు, వాదిభీకరగురుఁ డనె॰ మోద మలర.

సీ. అవని వేదాంతివే॰ద్యార్యసుధాబ్ధిలో, నఖిలవేదార్థసా॰రామృతమ్ముఁ
గొని కాలమేఘము॰కొలఁది నే గురుఁడు వర్షించును గరుణార్ద్ర॰చిత్తుఁడగుచు
నేసూరిసన్నిధి॰నెడఁ బాయకయ బుధుల్, ముక్తిసంసారవి॰రక్తులైరి
శిలవృత్తి నైనను॰జీవించుచును బెద్ద, లే దేశికునిగోష్ఠి॰కిందు నందు

తే. సాటి లేదని తెలిసి యా॰సభ్యుఁబాయ, రట్టిమాధవసచ్ఛిష్యు॰నతులమతిని
ధన్యుఁగలివైరిదాసువిఁ॰దలఁతుననుచు, వాదిభీకరగురుఁ డనె ॰ మోదమలర.

శా. సత్యజ్ఞానసుఖస్వరూపకలనా॰సర్వాత్మసంజీవనా
మర్త్యామర్త్యనిషేవ్యపాదకమలా॰మత్పాపతూలానలా
కృత్యాకృత్యవివేకిలోకవినుతా॰కృష్ణానుభూతిప్రతా
నిత్యానందనిదానసత్త్వవిరజా॰నిర్మోహ రామానుజా. 134

క. కలివైరిదాసగురుమహృ, జ్జలజసుఖాసీన పంచ॰శక్తిమయాత్మా
విలసితమంగళగిరిన్నృహ, రిలసద్గుణజాలలోల॰శ్రీయతిపాలా. 135

మాలినీవృత్తము. దహరగగనసూర్యా॰ధర్మరక్షైకకార్యా
బహుసుగుణకదంబా ॰ భక్తలోకావలంబా
నిహతసకలపాపా ॰ నిర్మలానందరూపా
బహుమతమితభాషా॰భాష్యకృన్నామభూషా. 136

గద్యము ఇది శ్రీభగవద్రామానుజ కరుణాకటాక్షకలిత కవితావైభవ పరవాదిభయంక
రాచార్యాభిమతచ్ఛాత్రాపస్తంబసూత్ర కణ్వసగోత్ర పవిత్రోభయ కవిమిత్ర వేం
కట కృష్ణార్యపుత్ర విబుధ వైష్ణవవిధేయ కేశవనామధేయ ప్రణీతంబైన యాచా
ర్యసూక్తి ముక్తావళి యనుమహాప్రబంధంబునం దుత్తరభాగంబునందు నంజి
య్యరు ప్రభావంబును, నంబిళ్ల దివ్యచరితంబు నన్నది ద్వితీయోల్లాసము.

— o —

శ్రీమతే రామానుజాయ నమః,



# ఆచార్యసూక్తిముక్తావళి

## ఉత్తరభాగము

---

## తృతీయోల్లాసము

శ్రీ క్ష్మానీళానాయక
లక్ష్మీనమంచిత జగద్వి • లక్షణచరితా
సూక్ష్మాత్మ తత్త్వదర్శన
లక్ష్మణమునినామ సూరి• లక్షితధామా 1

### పెరియవాచ్చాంబిళ్ళగారి వైభవము

పెరియవాచ్చాంబిళ్ళత,-శ్లో॥ శ్రావణేమాసిరోహిణ్యాం జాతం యామునదేశికాత్ ।
వాది కేసరిణం వన్దే సౌమ్యజామాతరం మునిమ్ ॥

### వాదికేసరియళహియమణవాళ జియ్యరు తనియను

శ్లో॥ అస్మద్విధపరిత్రాణ ప్రేమప్రద్రాణమానసమ్ ।
వాదికేసరిణం వన్దే సౌమ్యజామాతరం మునిమ్ ॥

వ. అవధరింపుము. 2

సీ. నంబిళ్లపిమ్మట• నయవిదగ్రణి యగు, పెరియచ్చాంబిళ్ల• ప్రీతి నతని
శిష్యులతోఁ గూడి• సిద్ధాంతనిర్వాహ• దక్షుఁ డై యున్న యా• ధన్యుఁ జూచి
మహిని శ్రీగురుపంక్తి• మంత్రరత్నములను, వినిపించుకృతికంబె• విన్నసుమతి
యుద్దేశ్యుఁ డనియంటి• రౌరయమ్మిప్పుడు, పరమసాత్త్వికు లైన• భాగవతులు
తే. చేరి కొలిచెద రది యెట్లు• చెల్లు ననుచు, మహీతమధ్యమవీధి కు• మారభట
రడుగ నయ్యార్యుఁ డతనికి• ట్లనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ఆర్యస త్తమ దురహంకారనిధి యైన, వాఁడఁ గావున వైష్ణవత్వపూర్తి
గలవాఁడ ననుచునుదలఁచెద నాయభి. ప్రాయమున మహానుభావ మఱియు
ముప్పు రాళయముచేముప్పిరిగొన్నట్టి. శ్రీవైష్ణవత్వసంసిద్ధి వీని
యందుఁ జూపడుమన్నదనితలంచు సుధీశ శామణు లంద జీకరణి నంత

తే. శానువర్తనమొనరింపనరుగుదెంతు. రనుచు భట్టార్యునకునమ్మహాత్ముఁ డనిన
విని ప్రహర్షించె నా బ్రహ్మపేత్తయనుచు. వాదిభీకరగురుఁ డనె మోదమలర.

సీ విష్ణునిరీశకువిషయమా మనము త, త్కారుణకు విష యమాయెఱుకవలవు
మని తన్నువైష్ణవు లడిగినఁ బెరియవా, చ్చాంబిళ్ల యప్పు డాస్వాములకును
మది యహంకారముమమతయుఁ జెడకున్న. వెన్నునిరీశకువిషయమగుదు
మది రెండుఁ జెడెనేనియామీఁద విషయ వి, ర క్తినిశ్శేష యుసాసక్తి మించి

తే. శ్రీమహాభాగవతసేవసేయుచున్న. హరికృపకు విషయమగుదు మహర్నిశంబు
ననుచుఁ బల్కెను గనికరమలరననుచు. వాదిభీకరగురుఁ డనె మోదమలర.

వ. మఱియు నొకదినంబునం దభయప్రదరాజార్యా పరాభిధానుం డగుపెరియ వాచ్చాం
బిళ్లనుం జూచి మాకుఁ దంజ మైనహితం బొక్కటి యుపదేశింపుమని కొంద
ఱభిజ్ఞులు ప్రార్థింప నతండు వారి కిట్లనియె. 6

సీ. కలుషితుంచొకఁడట్లు కలుషదమొకటిహ్ర, త్కాలుష్యకరులుర్వి గలరుమఱియు
దెల్పెడివాఁడును దెలిసెడి వాఁడును. దెలిపించుబలియుఁడుఁ గలఁ డొకండు
వా రెవ్వ రన్నను వర్ణింతు జీవుఁ డ. చిత్తు సంసారులు శ్రీగురుండు
దేహి శ్రీశుం డిట్లు తెలిసి వారలయందు, సంసారిజనులతో సంగ ముడిగి

తే. మేనునేననుమతిమాని మించిగురుని. హరిని మదిఁదంజమని నమ్ముఁ డనుచువారి
కానతియొసంగె నభయప్ర దార్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

వ. మఱియు నొక్కవాసరంబునందుఁ బెరియవాచ్చాంబిళ్ల నీక్షించి మహాత్మా పార
తంత్ర్య స్వరూపం బెట్టిదని కొందఱు వైష్ణవు లడుగ నద్దేశికేంద్రుండును స్వస
క్తిని వృత్తిపూర్వకంబుగా సర్వేశ్వరుని సర్వశక్తి యండఁగాఁ గొనిసిద్ధోపాయం
బునందశ్రద్ధ సలుపక విశ్వసించి ప్రాప్యలాభంబునకై త్వరపడుచు నీకీ పార
తంత్ర్యం బగునని యానతిచ్చిన విని వారు ప్రహర్షించి మగిడియునయ్యాచార్య
సత్తము నుద్దేశించి స్వరూపానురూపం బై ప్రాప్యంబు వర్తిల్లనో ప్రాప్యాను
రూపంబై స్వరూపంబు విలసిల్లనో దాసులకు సందేహం బుదయించె దీని నిర్ణ

యింప మీకన్న వేఱొక ప్రాజ్ఞుండు చూడఁబడఁడు గావున నిశ్చయం బానతీయం దగునని యర్థింప సద్గురువరుండును ముముక్షు దశయందుఁ బ్రవదనపరునకు స్వరూపాను రూపంబై ప్రాప్యంబుండు ముక్తదశయందుఁ బ్రాప్యామరూపంబుగా స్వరూపంబు విలసిల్లుచుండు నని వక్కాణింప నాకర్ణించి వారలందఱు సంతోషించిరంత. 8

సీ. వైష్ణవు ల్తద్దేశ • వాసు లిర్వురు కొన్ని, దినము లన్యోన్యమై • త్రిని లభించి
కాలవశంబునఁ • గలహించి యొక్కనాఁ, డొండొరు వెడఁబాసి • యొక్కఁడందుఁ
జనుదెంచి పెరియవా • చ్చాంబిళ్లగారి కా, యితరుని తప్పు లఁ • న్నేర్పరింప
నచటి బుధేంద్రు లి • ట్లనవచ్చునా యితం, డనుచు వాచ్చాంబిళ్ళ • కవిన వతఁడు

తే. వైష్ణవుని తప్పు లెంచెడు • వాని యఘము, దండధరుఁడైనయాయమ • ధర్మరాజు
పరిహరింపఁగ వలెనని • పల్కె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. తప్పు సేయనివాఁడు • ధర నెవ్వఁ డని మారు, తికిఁబల్కె శ్రీరామ • దివ్యమహిషి
యది యొనర్పరు మదీ • యాశ్రితుల్ పేసిరా, యొప్పగునదియని • చెప్పెహరియు
నఘమతులైనను • హరిసేవకులు మాకు, స్వాములే యనుచునా • ళ్వారు లవిరి
యవని నీతనిఁ దక్క • నావైష్ణవునిఁ దప్పు, లెంచెడివారెవ్వ • రెన్నిచూడ

తే. ననుచు నభయదరాజార్యుఁ • డానతిచ్చెఁ, గానఁ బరులందుఁ గల్మషో • ద్ఘాటనంబుఁ
జేయఁ దగదని పెద్దలు • చెప్పి రనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. తగ మహాభాగవ • తప్రభావము నభ, యప్రదరాజార్యుఁ • డానతియ్య
సూరి యొక్కఁడు మధు • సూదనుమహిమ నా, గోష్ఠివాక్రువ్వన • గ్గురుఁ డెఱింగి
మంచి గోఘృతమును • బంచదారయుఁ గూర్చి, పాలుద్రావుచునుండ • లీల నందు
నిఖిలేశవ్రజం • బెత్తివైచిన యట్లు, శ్రీవిష్ణుగుణకథల్ • సెప్ప నదియె

తే. సమయమానీకునని పల్క • శౌరికంటెఁ, దత్పదాబ్జా శ్రితులుమాన్య • తములటంచుఁ
దలఁచి రచ్చోటనున్నట్టి • ధన్యులనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర. 11

సీ. పెరియవాచ్ఛాంబిళ్ళ • పినతల్లి కగ్రిమ, పుత్రుఁ డాచ్చాంబిళ్ళ • బుధనుతుండు
శోకింప నొకనాఁడు • చూచి యిదేమని, యభయదరాజార్యుఁ • డడుగ నాతఁ
డార్య యనాద్యవి • ద్యాకర్మవాసనా, బలమున మగిడి యు • ద్భవపయోధిఁ
బడవైచునో నన్నుఁ • బరుఁడు సర్వేశ్వరుఁ డని దుఃఖపడియెద • ననుచుఁబలుక

తే. నాలకించి తదీయోక్తు • లమృత మధుర, రాజదుక్తుల నభయద • రాజగురుఁడు
పరమకృప నతని కిటులు•పల్కెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. మత్స్యకూర్మవరాహ • మర్త్యకంఠీరవ, వామన భృగురామ • రామభద్ర
రామకృష్ణతురంగ•రాజవాహాది భూ,భారహృద్దివ్యావ • తారములను
జేసిరక్షాపేక్షఁ • జేయుచేతనునకై, యెదురుచూచుచు వత్స • యీశ్వరుండె
యొకని సాధించుట • కూరేలుకృతిగతి, నఖిలజగత్స్వామి • యగుట మనకు

తే. స్వామి యగుటకెకాదె నిర్భరత నుండి, ఘటకవిభవము సాధన•గౌరవంబుఁ
దెలిసి వెలవకు మనియె నా•ధీరుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అతఁ డట్లు దెలుపన•య్యార్యుఁడాచార్యాంఘ్రి, సన్న్యస్తభరతని•శ్చలుఁ డయ్యె
నంత నద్దేశికుఁ • డాశ్రితు లంద ఱు,జ్జీవింప శ్రీవిష్ణు • చిత్తముఖ్య
దివ్యసూరు లొనర్చు • దివ్యప్రబంధము, లన్నిటికిని వ్యాఖ్య • లాచరించి
విమలతత్త్వత్రయ • విపరణాదికరహ, స్యంబు లనేకము • లాచరించె

తే. వాదికేసరి యనునొక • వైష్ణవుండు, శిష్యులకు శాస్త్రపారముఁ • జెప్పుచున్న
సూరివరు నంత నొక్కెడఁ•జూచె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

పీ, ఈ గ్రంథ మెయ్యది • యెఱిఁగింపు మని వాది,కేసరిసూరి యా • కృతికిఁ బలుక
నితఁడక్షరాభ్యాస • మెఱుఁగఁడు కేవల,మూఢుఁ డంచుఁదలంచి • ముసలకిసల
యం బిది యని పరి • హాసపూర్వకముగా, నావిద్వదగ్రణి • యతని కనిన
నామాట నిజ మని•యతఁ డాత్మగురుఁడైన,పెరియవాచ్చాంబిళ్ళ•కెఱుక పఱుప

తే. నతఁడు దరహాస మొనరించి•యార్యముసల,కిసలయంబను నొకకృతి•క్షితినిగలదె
హాస్య మొనరించె నిన్నతఁ•డనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. అపహాస మొనరించె • నతఁ డిట్లు నన్నని, స్పర్ధచే వాదికే • సరిగురుండు
సకల శాస్త్రములందు • సర్వజ్ఞతాప్తికై,స్వగురునిపాదాంబు • జములయందుఁ
బడి లేవకున్నను • బరమకారుణికుఁ డా, పెరియవాచ్చాంబిళ్ళ • ప్రీతి నతని
లె మ్మని తనకేలుఁ • దమ్ములఁ గ్రుచ్చెత్తి, కౌఁగిటిలోఁజేర్చి • గారవించి

తే. యపుడు ముప్పది రెండవ • హాయనమున, నక్షరాభ్యాస మొనరించి • యతనికఖిల
శాస్త్రములఁజెప్పెఁ దనదివ్య•శక్తిననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. రమ్యాభయప్రద • రాజగురుప్రసా,దంబున సకలశా • స్త్రములఁ జదివి
వాదులను జయించి • వాదికేసరియని, యన్వర్థనాముఁడై • యతఁడు ముసల

కిసలయంబని యలం • కృతిరసోల్లసితమౌ, కావ్యమొక్కటిఁ జేసి•గరిమఁబొల్లి
తన్ను వంచించు వి•ద్వాంసున కదిచూపఁ, జూచి లజ్జించునా • సూరి నతఁడు
తే. స్వామి నీవల్ల నేనిట్టి • వాఁడనైతి.ననుచుఁ గొనియాడి మ్రొక్కాడి • యఖిలమడిగి
సన్న్యసించెను శాస్త్రోక్త•సరణిననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. క్షితియందు శ్రీవాది • కేసరి యళహియ, మణవాళయోగినా • మము ధరించి
యార్యుని సేవించి • యతనిసమ్మతినొక, మఠమునందుండి యా • మౌనివఁడు
రమణ పన్నీరాయి•రప్పడి యనువ్యాఖ్య, తిరువాయిమొళికి సు•స్థిరతఁజేసె
దేశికుల్ గని మెచ్చ • దీపప్రకాశిక, రూఢిగాఁ దత్త్వని • రూపణాది
తే. బహురహస్యములొనరించి • భవులకెల్ల, క్షేమకరమైన యధ్యాత్మ • చింతఁజెప్పి
సర్వలోకోపకారము•సల్పెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.　18

## నైనారాచ్చాంబిళ్ళ వడక్కుత్తిరువీథిప్పిళ్ళల ప్రభావము

నైనారాచ్చాంబిళ్లగారి-త. శ్లో॥ సింహగేర్కేతు రోహిణ్యామవతీర్ణమహం భజే।
జ్ఞానాధిరాజ మభయప్రదరాజగురోస్సుతమ్॥

ఈయుణ్ణిమాధవప్పెరుమాళ్-త. శ్లో॥ వరదార్యదయాపాత్రం శ్రీమాధవ గురుం భజే।
కురుకాధీశ వేదాన్త సేవోజ్జీవిత వేదనమ్॥

## పద్మనాథప్పెరుమాళ్-తనియను

శ్లో॥ యోసౌవిగాహ్యవిమలామ్బుళరారిసూరేర్వాణీగణార్థ పరిబోధసుధాపగాయామ్
శ్రీమన్ముకున్ద చరణాబ్జమధువ్రతాయ శ్రీపద్మనాభగురవే నమ ఆచరామః॥

## నాలూరాంపిళ్ళ-తనియను

శ్లో. యఃపద్మనాభగురుతశ్శఠజిన్మునీన్ద్రశ్రీసూక్తి భాష్యమధిగమ్య సమృద్ధబోధః।
తద్దేవరాజగురవే హ్యదిశచ్ఛపూర్వా సంసిద్ధకోలవరదేశిక మాశ్రయే తమ్॥

నమోస్తు దేవరాజాయ చతుర్గ్రామనివాసినే।
రామానుజార్యదాసస్య సుతాయ గుణశాలినే॥

వడక్కుత్తిరువీధిప్పిళ్ళ-తిరు-త. శ్లో॥ శ్రావణేబహుళాష్టమ్యాంస్వాతిజం సద్గుణార్ణవం
వన్దే శ్రీకృష్ణపాదార్యం వరదార్య వదాశ్రయమ్॥

వ. మఱియు నప్పెరియవాచ్చాంబిళ్లకుం బుత్రుం డగునై నారాచ్చాంబిళ్ళ దీపోత్పన్న ప్రదీపంబు మాడ్కిం బ్రకాశించుచు దర్శనప్రవర్తకుండై యుండె నతని మాహాత్మ్యం బెట్టిదనిన వివరించెద. 19

సీ. చదువులన్నియునుసకృ • చ్ఛ్రవణమాత్రమునగ్ర,హించివాదులనుజ • యించిమించి
జ్ఞానాధిరాజసం•జ్ఞ లభించి పౌండరీ, కక్రతు వొనరించి,ఘనతఁ గాంచి
శ్రీరంగరాజదీ,క్షితు లవి పుడమి నం,చత్కీర్తిఁ గని త త్త్వ•సంగ్రహంబు
ము క్తభోగావళి,ముఖ్య మౌశారీర, మాదిగాఁ గలరహ•స్యములు కొన్ని

తే. పరమకృపఁజేసెనై నారు,గురువరుండు, తత్ప్రభావము వర్ణింపఁ•దరమె యెట్టి బుద్ధిమంతులకైన వి•బ్బూమి ననుచు, వాదిభీకర గురుఁడనె•మోద మలర. 20

వ. అదియునుంగాక తొల్లి శ్రీరంగరాజదివ్యాజ్ఞచే నంబిళ్ళ యొసంగిన ముప్పత్తారాయిరప్పడి యనుతిరువాయిమొళివ్యాఖ్యానరత్నంబు యీ యుణ్ణిమాధవగురుండు తనకుం బుత్రుండగు పద్మనాభ ప్పెరుమాళ్ళకుం దెలియంజేసె నయ్యార్యుండును దనకంతరంగవ్ఛాత్రుండై కోవెవరాహనై నారని వేఱొక తిరునామంబుగల నాలూరాం పిళ్లకుం బ్రసాదించె నయ్యభిజ్ఞుఁడును దనకుం బ్రియశిష్యుండై దేవ రాజగురుండనియును నల్లెమహనారనియును దివ్యనామాంతరంబులుగల నాలూరాచ్చాంబిళ్ళ కనుగ్రహించె నమ్మహాదేశికుండును మణవాళ మహామునికి సాక్షాదాచార్యుండైన తిరువాయి మొళిప్పిళ్ళ మొదలుగాఁగల గురువరుల కుపదేశించె నట్లు ముప్పత్తాయిరప్పడి సంప్రదాయపరంపరా ప్రాప్తంబై యస్మదాది పర్యంతం బయ్యె మఱియు నభయప్రదరాజ గురునియనంతరంబ వడక్కు త్తిరువీధిప్పిళ్ల దర్శనంబు నిర్వహించుచునుండఁ గొందఱు సాత్త్వికులాత్మ స్వరూపం బెట్టిదని యడుగ నయ్యాచార్యపాదుండును వారల నుద్దేశించి "ఈశ్వరోహ మహంభోగి సిద్ధోహమ్" అనియెడు నహంకారంబు సమూలంబుగా నిరసించి, శ్లో॥ దాసభూతాస్స్వతస్సర్వే హ్యాత్మానః పరమాత్మనః । నాన్యథాలక్షణం తేషాం బన్ధేమోక్షే తథైవచ॥ అనున్యాయంబుచే నేదశయం దైన దాసోహమ్మనియెడు స్వాభావిక భగవచ్ఛేషత్వంబే యాత్మలకంతరంగ నిరూపకంబైన స్వరూపంబని తెలియ వలయు. భగవచ్ఛేషత్వంబును భాగవత శేషత్వబహిర్భూతం బాయెనేని దేహాత్మాభిమానంబుగతి దుష్టం బగును. భాగవతశేషత్వం బెవ్వనికి సిద్ధించు వానికి సర్వార్థంబులు సంభవించుచు. వేదశాస్త్రంబులు స్మృతీతిహాసపురాణంబు లాచార్య శ్రీసూక్తులును శ్రీవకుళభూషణ మునిప్రముఖ దివ్యసూరి ప్రబంధంబులును

దక్కిన యాగమంబులన్నియు నరసి చూడ నాచార్యాభిమానంబు కంటె వేరొక మోక్షోపాయంబు లేదు. భాగవతా పచారంబుకంటె వితరంబగు ముక్తి విరోధి లేదు. కావునఁ బ్రమాదవశంబుననైన శ్రీమహాభాగవతుల యెడ నపచారపడక జ్ఞానానుష్ఠాన సంపన్నుండగు నిజాచార్యుని యభిమానంబునందొదిఁగి వర్తించుచుఁ బ్రపన్నుండు పరమపురుషార్థ లక్షణభగవత్ప్రాప్తి రూపమోక్షంబు నాయాసంబుగా లభించునని యానతిచ్చి పిళ్ళలోకాచార్యుం డళహియ మణవాళప్పెరుమాళ్ నైనా రనియెడు నిజకుమారులను సమస్త వేదశాస్త్రంబులం దభిజ్ఞులంజేసి దర్శనప్రవర్త కులఁ గావించి కొన్నిదినంబు లుండి యొక్కనాఁడు నంబిళ్ళ తిరువడిత్తామర లంతరంగంబునం దలంచుచు తిరునా డలంకరించె నంతఁ దత్కుమార శేఖరుం డగు లోకాచార్యుండు తన కనుజుండగు నళహియ మణవాళ ప్పెరుమాళ్ నైనారు తోడం గూడి యమ్మహాత్మునకు బ్రహ్మమేధాదిచరమ కైంకర్య మహోత్సవంబు లన్నియు యథాశాస్త్రంబుగా నాచరించి సుఖంబుండె నంత. 21

## పిళ్ళలోకాచార్యులయు అళగియమణవాళప్పెరుమాళ్ నైనారులయు ప్రభావాభి వర్ణనము

### అళహియమణవాళప్పెరుమాళ్ నైనారుతనియను

శ్లో॥ ద్రావిడామ్నాయహృదయం గురుపర్వక్రమాగతమ్।
రమ్యజామాతృదేవేన దర్శితం కృష్ణసూనునా ॥

సీ. అంత లోకగురుండు•నళహియమణవాళ, సూరియు నిరువు రీ•క్షోణిమెచ్చ
రామలక్ష్మణు లట్ల•రామకృష్ణులమాడ్కి, కూరేశగురుపుత్ర•కుల కొలంది
నన్యోన్య సౌభ్రాత్ర•మతిశయిల్లఁగఁ బిన్న,నాఁటనుండియునువి•న్నాణ మొప్ప
నొండొరు లెడఁబాసి•యొక నిమేషంబైన, నుండ రందగ్రజుం•డొనరఁదనకుఁ

తే. బ్రాణపదమును దక్షిణ•బాహుసముఁడు, నైన తమ్మునితో దర్శ•నార్థములను
నిర్వహించుచు విలసిల్లి•నిత్య మనుచు, వాదిభీకర గురుఁడనె• మోద మలర.

వ. అట్లు దర్శనస్థాపనాచార్యుండగు లోకాచార్య గురుం డస్మద్వివిధమందచేత నోజ్జీ వనార్థంబు తత్త్వత్రయంబును రహస్య త్రయంబును నర్థపంచకంబును శ్రీవచన భూషణంబును మాణిక్యమాలయు నవరత్నమాలయు కురుహూరు రత్నమాలయు వార్తామాలయు ముముక్షుప్పడియుఁ బరందపడియును శ్రియఃపతిపడియు యాదృ చ్ఛికపడి యునిగమనప్పడియుఁ బ్రమేయశేఖరంబును నర్చిరాదిగతియుఁ దత్త్వ

శేఖరంబును బ్రపన్న పరిత్రాణంబును నాదిగాఁగలయనేక రహస్యంబు లానతిచ్చి తమ్మునితోడ సుఖంబుగానుండు సమయంబున నమ్మహాత్ముని శ్రీపాదంబులుపరమ సాత్త్వికుండగు కూరకులోత్తమదాసుండును మణల్పాకనంబియును గొల్లిహావల దాసుండును యళహియ మణవాళప్పెరుమాళ్ప్పిళ్ళయును కేట్టారణ్ణయు వేలాం జోలైప్పిళ్ళయును తిరుమలెయాళ్వారు తిరుత్తాయారు మొదలగు కొంద అమ్మ యారుల నాశ్రయించి యద్దేశికేంద్రునిఁ దక్క వేఱొక్కదైవతం బెఱుంగక సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందుం దదీయకైంకర్యంబే పరమపురుషార్థం బుగాఁ దలంచి తత్సన్నిధి నెడఁబాయక సుఖించుచున్న కాలంబునఁ గొంద అస హిష్ణువులైన వైష్ణవచిహ్నాంకితు లమ్మహాదేశికుం డొనర్చిన శ్రీ వచనభూషణ దివ్యశాస్త్రం బెఱింగి శ్రీరంగరాజ శ్రీపాదపల్లవంబుల డాయంజని చేమోడ్చి యిట్లనిరి. 23

సీ. స్వామి శ్రీవచనభూ•షణ మని యొకరహ•స్యముఁ జేసె ధర్మమ•ర్యాద లన్ని
చెఱిపినాఁ డీలోక•గురుఁ డని పిశునో•క్తిఁ, బలికిన విని రంగ•భర్త యలిగి
పిళ్ళలోకార్యునిఁ • బిల్వఁ బంచిన నతం, డంతకు మున్న స్నా•నార్థ మరుగ
నవగాహనార్థమై • యళహియమణవాళ, సూరియుఁ జనుచుండఁ • జూచియతని

తే. నార్య శ్రీరంగరాజ డి•వ్యాజ్ఞయయ్యె, రమ్మనుచు వైష్ణవులు పిల్వ • రంగపతిని
జూచి కేల్మోడ్చి నిలిచె నా•సుమతియనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. అట్లు సాంజలిపద్ముండై నిలిచియున్న యళహియ మణవాళప్పెరుమాళ్ నైనారు గురునిం గటాక్షించి యప్పుండరీకాక్షుం డర్చకముఖంబుగా నిట్లనియె. 25

సీ. ధర నే ననంతావ•తారము లొనరించి, సత్ప్రీతి ధర్మసం•స్థాపనంబు
నాధర్మమర్యాద • లన్నియు మీయన్న, చతురత వచనభూ•షణముఁ జెప్పి
చెడఁజేసె ననివీరు • నుడివి రి ట్లొనరింప, హేతువేమనుచు రం•గేశుఁడడుగఁ
బరమవైదికధర్మ•పదము గాదేని శ్రీ•వచనభూషణ మింక • వసుధ వేయు

తే. విధములను మాసిపోఁగాక•విబుధసేవ్య, యనుచు నైనారుగురుఁడన•హారితదర్ద
మనువదింప నియోగించె•నతని ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. అట్లు భగవంతునిచే నియుక్తుండైన యళహియ మణవాళప్పెరుమాళ్ నైనారు శరకోపముని ప్రకాశిత సహస్రశాఖోపనిషత్సారభూత సర్వజ్ఞలోకగురు నిర్మిత శ్రీ వచనభూషణ దివ్యశాస్త్రార్థంబంతయును సుధామధురాతిగంభీరాశేష విశేషార్థ ప్రతిపాదకహేతు మత్సూక్తి సహస్రసంకలితాచార్య హృదయాహ్వయ ప్రబం

ధంబుచే నిస్సంశయంబుగా ననువదింప విన నవధరించి యమ్మహాత్ముని వక్తృత్వ వైభవంబునకు మిగుల నానందించి, యతనికి శ్రీ శఠకోపతీర్థ ప్రసాదంబులును దిరువాలవట్టంబును నిజనిర్మాల్యంబులైన సుగంధిపుష్పమాల్యంబులును నిజాస్వాదనంబుచేఁ బరమపవిత్రంబైన చందనాద్యనులేపనంబును స్వానుగృహీతంబులైన దివ్యాంబరాభరణాదులన్నియు నొసంగ వియోగించి యతని బ్రహ్మరథారూఢునింజేసి స్వకీయచ్ఛత్రచామరాదు లొసంగి స్వస్తివాచకనృత్తగీతవాద్యాది కల్యాణఘోషంబులతో నపరిమిత శ్రీమహాభాగవత సంఘంబుతోడ నిజనివాసంబునకుఁ బంచి తన కాత్మభూతుండైన శ్రీ లోకగురుని విషయంబుగా ననత్యంబు పలికిన పిసాళివైష్ణవులను జపేటికాప్రహారంబులఁ నవమతులం జేయించి స్వకీయ మందిరద్వారగోపురంబు మార్గ్గాని వెడలద్రొబ్బించె నంత నమ్మహాదేశికుం డవ్వైభవంబుతో స్వభవనాంగణ ప్రదేశంబుం బ్రవేశింప నెఱింగి నిజాగ్రజుండైన లోకాచార్యుం డెదుర్గ్గాని స్వపాదపద్మంబులఁ బ్రణతుండగు తమ్మునిం గ్రుచ్చియెత్తి కౌఁగిటంజేర్చి శిరంబు మూర్కొని పరమానందకందళిత హృదయారవిందుండై వత్సా యస్మదాచార్యులగు శ్రీమత్తాతపాదులు పరమాకాశ బాలభాస్కరుండై విలసిల్లుచున్న పిమ్మట నిన్ను వృద్ధిఁ బొందించుటకు ఫలంబు నేఁడు లభించితినని సంతసించుచు నతనిందోడ్కొని నిజనిలయంబుఁ జెందియందుఁ గొండొకకాలంబు భ్రాతృచ్ఛాత్రవర్గంబుతో భగవద్విషయ కాలక్షేపంబు సల్పుచు గుణానుభవజనిత ప్రీతికారితకైంకర్య విరోధియగు సంసారంబు వర్జించి యథాశాస్త్రంబుగా సోదరునితోడఁ దురీయాశ్రమంబు స్వీకరించియున్న సమయంబున నళహియ మణవాళగురుండును దిరుప్పావు మొదలయిన కొన్ని ప్రబంధంబులకు వ్యాఖ్యానం బొనరించి యచిరకాలంబునఁ బరమపదం బలంకరించె నంతన జ్జగదాచార్యుండును నమ్మహాభాగవత విశ్లేషజనిత సంతాపంబున కోర్వంజాలక వగలంబొగులుచుఁ గొండొకప్రొద్దునకుం దనంతటఁ దెలిసి ధైర్యం బవలంబించి యద్దేశికేంద్రునకు బ్రహ్మమేధాది శ్రీమదధ్యయనాంతంబులగు చరమమహోత్సవంబులన్నియుఁ గావించి కూరకులోత్తమదాసాది నిజాశ్రితవర్గంబుతో భగవద్విషయ కాలక్షేపం బొనరించుచుండ నా సమయంబున మణవాళమహామునుల కాచార్యుండగు తిరువాయిమొళిప్పిళ్ళయు జనకుండగు తిహాళిక్కిడందార్ తిరుణావుడయపిరాన్ తాధరణ్ణరయ్యరును బాల్యదశయం ద జ్జగదాచార్యు నాశ్రయించి రయ్యవసరంబున.

పిళ్ళలోకాచార్యులవారి తిరునక్షత్ర తనియను

శ్లో॥ శ్రీమత్యాశ్వయుజే మాసే తులాయాం శ్రవణోదితమ్।
శ్రీకృష్ణపాదతనయం లోకాచార్య మహంభజే॥

సీ. మధురాపురముఁ దొల్లి•మందాత్ముఁడాకాల, యవనుఁడగణ్య సై•న్యములతోడ
నాక్రమించినగతి • నతితామస తురుష్క•పతి యొకం డశ్వాది•బలము గొలువ
వచ్చి రంగాధిప•ప్రాకారములు కొన్ని, యాక్రమించినఁ జూచి•యచటివారు
రంగశాయికి మాటు • రచియించి తద్బహి•ర్వేదియం దొకవిష్ణు•విగ్రహంబు

తే. నుంచి కస్తూరిరంగని • యుత్తరాత్రు•లందుఁ గైకొని కానల • కరుగుచున్నఁ
గాంచి శ్రీలోకగురుఁడును • గదలె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. గండకవేదండ•ఖడ్గకంఠీరవ, శరభశార్దూలాద్య•సన్మృగంబుఁ
బక్షిరుతాకుల•ఫలపుష్పపల్లవ, ఫలనమ్రశాఖాగ్ర • బహునగంబు
మకరందపాన • ప్రమత్తభ్రమరజుష్ట, పద్మోల్లసత్సరో•భాసురంబుఁ
జిత్రధాతుస్ఫార•శిఖరకులోదిత, భర్మరత్నాకర•పర్వతంబు

తే. దివ్యజలపూరకలిత న•దీశతంబు, ఘోరఝిల్లీరవాకీర్ణ • గురువనంబుఁ
గడిపి కస్తూరిరంగఁడు•గాంచె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. చక్రవర్తిసుతుండు•జనకాత్మజను గూడి, దండకావనములం • దుండఁ గోరి
చనుచున్నఁ జూచి యా•జాయాపతుల కప్పు, డఖిలకైంకర్యము • లాచరింప
సౌమిత్రి చనినట్లు • జగదార్యుఁ డా రంగ•నాథునివెంటఁ గా•నలకుఁ జనియె
నంత రంగేశ్వరుఁ • డభ్రమండలమునం•దర్కుఁడు చౌరుమాడ్కి•నమ్మహోగ్ర

తే. కాననముఁ జొచ్చి జరుగుచుఁ•గన్నుమోల, భవ్యవృత్తిని గైతన•భక్తిసల్పు
దాసులకుఁ జేసె సర్వస్వ•దాన మనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. స్వామికి ముందఱఁ • జనుచున్న లోకార్యుఁ, డావార్తవినివేగ • నరుగుదెంచి
తాను సర్వస్వ•దాన మాదాసచే•తనుల కొనర్చి శ్రీ•ధరునివెనుక
నల్లనఁ జనుచుండఁ • గల్లవాం డ్రొకకొంద, ఱతనికిఁ గపటోప•హారము లిడ
నవి గొనవొల్లక • యార్యుఁడు వారిభా•వ మెఱింగివేవేగ • వచ్చివచ్చి

తే. జ్యోతిషక్కుడియనుచు వి•ఖ్యాతమైన, గ్రామముననున్న శ్రీరంగ•రాజహరిని
గాంచి తత్సన్నిధిని వసి•యించె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. అట్లు లోకగురుండు శ్రీరంగరాజస్వామిసన్నిధిం గొన్నిదినంబు లుచితకైంకర్యం బులు సల్పుచుండి తిరుమేనియందుం దిరునోవు ధరియింపఁ జూచి నిజాశ్రితులు తమకుఁదంజంబగు హితంబొక్కటి యనుగ్రహింపుఁడని ప్రార్థింప వారలకుం దగిన హితంబులు కొన్ని యుపదేశించి తన కంతరంగచ్ఛాత్రుండగు వేలాం జోలైప్పిళ్ళనుం గటాక్షించి వత్సా నీవిచటనుండి తిరువనందపురంబునకుఁ జని శరీరపతనపర్యంతం బద్దేవదేవునిసేవ సేయుచుండుమని నియోగించి జ్యేష్ఠశుద్ధ ద్వాదశియందు నిజాచార్యుండగు శ్రీకృష్ణపాదార్యుని దిరువడిత్తామరల ధ్యానించుచుఁ దదనుగ్రహలబ్ధమధ్యధమనీద్వార నిర్గతుండై యర్చిరాదిక మార్గంబునం జని పరమపదవ్యోమధామం బలంకరించె నంత. 32

సీ. జ్యోతిషక్కుడియందు•జొత్తిల్లుచును గొన్ని, దివసములుండి యా•ద్దేవదేవుఁ
డచటనుండి మనోహ•రారణ్యములయందు, విహరింపఁదనమది•వేడ్కపొడమ
నర్చకపరిచార•కాదిధన్యులు గొల్వ, నిరుగెలంకుల సిరి • ధరయు మెఱయ
స్వస్తివాచనశుభ•వాద్యనర్తనగీత, ఘనరవంబులు జగ•త్కలుష మడఁప

తే. బ్రహ్మరుద్రాదులునుమింటఁ•బ్రస్తుతింప, బూలవానలుగురియంగ•మునులుపొగడఁ
గదలి చనిచని వనగిరిఁ•గనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. పొన్నలు పొగడలు•పోఁకమ్రాఁకులు గున్న, మావులు మొల్లలు•మల్లికలును
జాతీలతలు విర•జాజులు వెల్లచే,మంతులు మాధవీ • మంటపములు
మందారచందన,మాకందమాలూర, లుంగలవంగనా,రంగములును
దులసీవనంబులు • విలసిల్లు నెచ్చోట, వభ్రగంగాదితీ•ర్థాళు లొప్పు

తే. నట్టియళహరి తిరుమల•కరిగి రంగ,రాజు మంగళదేవతా•రమణితోడ
వనవిహారము లొనరించె•వాంఛ ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. శ్రీభూమిసీళాది • సీమంతినీరత్న, మానసమన్మథ•మన్మథుండు
రంగభర్త వనాద్రి•రమ్యస్థలములందుఁ, గొన్నాళ్ళు విహరించి•గురుసమృద్ధిఁ
బొలుపారుమళయాళ • భూములకేతెంచి, దేవీయుగంబుతోఁ • దేజరిల్లఁ
దెలిసి దక్షిణదివ్య,దేశాధిపతులెల్ల, వచ్చి శ్రీరంగాధి•పతినిఁ జూచి

తే. యతనిచే బహుమతిఁగాంచి•యరుగుచుండ, వకుళభూషణముని విని•వచ్చి రంగ
పతిని సాక్షాత్కరించెను • భక్తిననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. శఠకోపముని తన • చరణాబ్జములయందుఁ, జాఁగిలఁబడి మ్రొక్కి • సన్నుతింప
నారంగపతి తన • హస్తాబ్జములు సాఁచి, కుచ్చి కౌఁగిటఁ జేర్చు • కొనుచు నతని
కర్ధాసనం బిచ్చి • యమ్మహాయోగిని, గురుమధురోక్తులఁ • గుశల మడిగి
రుచిమించు విపులవ • స్త్రులపీర మొక్కటి, కలితమౌక్తికరత్న • కవచ మొకటి

తే. బహుమతియొనర్చి పంపన • ప్పరమయోగి, నాథుఁడచ్చటినుండి క • ర్ణాంబియనెడి
యూరికేతెంచి యచ్చోట • నుండెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. అంత రంగేశుఁడు • యాదవాద్రికిఁ జని, యందుఁ గొన్నిదినంబు • లధివసించి
యచటనుం డేతెంచి • యంజనాచలమున, వేంకటేశునియింట • విభవమలర
ద్వాదశాబ్దములు స • మ్మోదింప నంతటఁ, జెంజినుండి వృషాద్రిఁ • జెంది గోప
నాయఁడు వేంకట • నాథుని సేవించి, యందు రంగేశుని • యంఘ్రికమల

తే. యుగముఁ గనుగొని మ్రొక్కిడి • యుక్తవేళ, రంగధామునిఁ జెంజిపు • రంబుకడకుఁ
దోడుకొనివచ్చె మిగులసం • తుష్టి ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. శింజీపురముచెంత • సింగరాయపురాఖ్య, మగ్రహారముఁజేసి • యందుఁ బసిఁడి
కోవెలఁ గట్టించి • గోపనాయఁడు రంగ, పతిని బ్రతిష్ఠించె • భక్తి నచట
నంత శ్రీరంగము • నందు సింగప్పిరా, ననెడువిప్రుఁడు గణ • కాన్వయుండు
యావనవిద్యయం • దతినిపుణుఁడు గాన, నాతురుష్కప్రభు • నాశ్రయించి

తే. మంత్రియై వానితో దొడ్డ • మైత్రిఁజేసి, రంగమందిరగోపురా • రామనగర
సాలములు తొంటిగతిబాగు • సలిపె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. అయ్యవసరంబున, 39

సీ సర్వాంగసౌందర్య • చాతుర్య లావణ్య, యౌవనసౌకుమా • ర్యాభిరామ
న్యాయవర్తిని రంగ • నాథమాణిక్యాభి, ధానయు నగుదేవ • దాసి యొకతె
నద్దివ్యదేశస్థు • లచటఁ గన్గొని యా తు, రష్కబలాబ్ధిలో • రంగపదము
చండవాతక్షుబ్ధ • జలధిమధ్యమునందుఁ, గడు గాసిపడుచున్న • కలముకరణి

తే. నుండెఁగావున నీస్థల • ముద్ధరింపు, మమ్మ నెట్లైన నొకయుపా • యమ్ముఁ జేసి
వసుధ యశమగు నీకని • పలికిరనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ అట్లద్దివ్యదేశవాసులపలుకు లాకర్ణించి శ్రీరంగనాథమాణిక్యాభిధానవేశ్యారత్నంబు
వారల కిట్లనియె. 41

సీ. సజ్జనులార మీ • శాసనంబు మదీయ. శిరమున ధరియించి • చింతమావి
రంగనాథునియను•గ్రహముచేనాబుద్ధి,యందుఁ దోఁచినయుపా•యములఁజవ్ని
వావి నవశ్యము • వంచించి మాపెద, నాపేరు శ్రీరంగ • నాథశౌరి
సన్నిధి పంతతో • త్సవములందుఁ దలంపఁ, దగునట్లు పేయుఁడీ • దయనుమీర
తే. లనుచు వారికి వాకు్రిచ్చి • యంజలించి, దివ్యవేషము ధరియించి • దెసలు తనదు
దీప్తి వెలుఁగొందఁ జనియె న • ద్దేవియనుచు,వాదిభీకరగురుఁడనె•మోదమలర.
సీ. ఆసుందరీరత్న • మల్లనల్లనఁ జని, రంగరాజాస్థాన • రంగగతుని
నసురాంబు నాతురు•ష్కాధిపుఁగనిపిన,యముఁజేసి నిలువ న • య్యవనపతియుఁ
దన్ముఖ మీక్షించి • ధైర్యముఁ జెడియుబ్బెఁ, జంద్రునిఁ జూచిన • జలధిమాడ్కి
నంత నాయింతియు • నతిమనోహరగీత, నర్తనాభినయాది•నైపుణములఁ
తే. దనదరస్మితవిభ్రమో•దారమధుర, సరసపల్లాపముల వాని • స్వవశుఁ జేసి
తనదుమది వేగ వంచింపఁ•దలఁ చెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.
సీ. క్షితి దేవదాసికి • రతి తురుష్కునితోడఁ,గూడదు గాన నఁ•కువలయాక్షి
రాత్రినీతోఁగూడి • రమియింతు నని మాయ,సుద్దులతోఁ గొంత•ప్రొద్దుపుచ్చి
భూనాథ వెల్లగో•పురముపై నెక్కినఁ,జల్లనిమనుగాకు • శ్రమముఁ దీర్చు
సహ్యజాసాగర • సంగమం బగపడు, రచ్చల రాజమా • ర్గములఁ గలుగు
తే. వింత లన్నియుఁ గనులకు • విందు సలుపు,సురతకేళుల కది మంచి • పోటుదావి
పైకిఁ జనియెద మనుచును • బలికెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.
వ. అంత. 45
సీ. ముప్పిరిగొన్నట్టి • మోహముచే వాఁడు, తన్మృదూక్తుల నమ్మి • దానితోడ
వెల్లగోపుర మెక్కి • వింతలఁ జూచుచు. ద్వారముకడను గం • దర్పదర్ప
పారవశ్యముఁ జెంద • వంచించి యదివానిఁ, దూర్పుపీఠిని బడ•ద్రోబ్బఁగాను
బడమటితట్టునఁ • బడి ప్రాణముల మాని. మణిమయదివ్యవి • మాన మెక్కి
తే. యర్చిరాదిక మార్గము•నాశ్రయించి,సురలు కొనియాడఁజనిచని•పరమపదముఁ
జెంది యందు లభించె నా • నంద మనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.
సీ. అంత సింగప్పిరా • యనెడు విప్రుఁడు చెంజి, గోపనాయనితోడఁ • గూడి ఘోర
చతురంగబలముల • సమకూర్చుకొని వచ్చి, యాతురుష్కులసైన్య• మంతమాపి

పింగరాట్పురినుండి • శ్రీభూసమేతుని, రంగనాథునిఁ దెచ్చి • రంగమునను
శకము శతో త్తర • సాహస్రసంఖ్యచే, వెలయుపరీధావి • వృషభమాస

తే. మునఁ బదేడవతిథియందు • మూలభూత, రంగపతికడఁ గస్తూరి•రంగవిభుని
నిలిపి సంప్రోక్షణాదుల • సలిపె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. రామభద్రుఁడు తొల్లి • రావణాదులఁ ద్రుంచి, శ్రీమదయోధ్యాపు•రీవరమున
సీతతోడుత నభి • షిక్తుఁడై రత్నసిం•హాసనాసీనుఁడై • యలరుకరణి
రంగభూపతి యప • రాంతాళి నూటాడి, రంగధామమునందు • రత్నఖచిత
సింహాసనమునందు • శ్రీభూములనుగూడి, యభిషిక్తుఁడై యున్న • యవసరమున

తే. జంగమాజంగమాత్మక • జగము లలరె, స్థలనివాసులు దూరదే • శములబుధులు
వచ్చియాతనిఁ గనిమ్రొక్కి•మెచ్చిరనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. అట్లురంగనాథుండు నిజస్థానంబునం గమ్మఱ ప్రతిష్ఠితుండై ననాఁటనుండి నేఁటి కైనను దనమేను మాని యద్దివ్యదేశం బుద్ధరించిన శ్రీరంగనాథమాణిక్యాభిధాన దేవదాసీరత్నంబునం దనుగ్రహంబుచే నజస్రంబు నిజారాధనోత్సవాదికాలం బులందు శ్రీరంగనాథమాణిక్యతాళ క్కారుళప్పా డని తన్నామం బుచ్చరించి తదీయాన్వయులకుం గుంభనీరాజనాదికైంకర్యంబులు సేయనియోగించి మఱి యును దద్వంశోత్పన్ను లైనవా రెవ్వరైన మృతిఁజెంది రేని వారిచరమసంస్కా రంబులకు శ్రీమహానసాగ్నియు నిజధాన్యకోఠారంబునందు వక్త్రప్రక్షేపణీయ తండులంబు లియ్య నియమించి లోకసంరక్షణతత్పరుండై యుండె నంత. 49

సీ. తనదేశికునిపద • తామరసము లొంచె, జగదార్యుఁ డని విని • చాల వగచి
యతనిపదాబ్జము • లాశ్రయించినశుభా,చార శ్రీశై లేశ•జనని గురునిఁ
బాసి యచ్చట నుండ•రోసి మేనెడఁబాసి, గురుఁ డున్నతావున • కరిగె నంత
బాలు శ్రీశై లేశుఁ • బ్రాజ్ఞునాతనిపిన,తల్లి పోషింప వ • ర్ధిల్లి యాతఁ [డని

తే. దెదుటఁదిరువృత్తమొకనాఁడు • చదువు చున్న,ధన్యుఁ గూరకులో త్తమ • దాసగు
భక్తిఁ గనిమ్రొక్కి యిట్లని•పలికెననుచు,వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. స్వామి యీదివ్యప్ర•బంధార్థమడియని, కానతిమ్మని యతఁ • డడుగ నతఁడు
సద్గురుసంబంధ • సందేహ ముదయింపఁ, జెప్పవచ్చును నీకుఁ • జెప్పెద నని
జాగు గావింప శ్రీ•శై లేశగురుఁ డంతఁ, బినతల్లి కావా ర్త • విన్నవింప
జగదార్యపదపద్మ,సంబంధ మీసీకు, శై శవదశయందె • సంభవించె

తే. ననుచు నాపత్యవతి పల్క • నమ్మనీషి, తెలిసి కూరకులోత్తమ • దేశికేంద్రు
మగుడఁగని మ్రొక్కి పల్కె నీ • మాడ్కి ననుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర.

సీ. ఆఖిలజీవుల నంత • రాత్మయై రక్షించు, నారాయణుం డైన • నయముఁ దొలఁగి
సద్గురుపదపద్మ • సంబంధవిచ్యుతులైనపాతకులపై • నలుగుఁగాని
సుప్రసన్నుఁడు గాఁడు • సూర్యుఁడు గంభీర, జలవినిర్గత మైన • జలజ మెట్లు
పోషించుఁ గావున • భూరిలోకార్యకృపాపాత్ర మైనయీ • ప్రాణి యెడలఁ

తే. బ్రపదన మొనర్పఁ దగునని • ప్రణతిసల్పఁ, దెలిపికూరకులోత్తమ • దేశికుండు
నాదరోక్తుల నతని కిట్లనియె ననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర. 52

సీ. ఆచార్యసంబంధ • మధ్యవసాయము, దెలిపి విశేషార్థ • ములు వచింప
వలెఁగాన ముందట్లు • పలికితి నిప్పుడు, పరమార్థములు నీకు • బయలుపఱతు
నని పల్కి లోకార్యుఁ • డానతిచ్చిన దివ్య, వచనభూషణముఖ • వరరహస్య
ములఁ జెప్పి తిరువాయి • మొళియర్థ మాతిరుక్కణ్ణంగుడిప్పిళ్ళ • కడను జదువు

తే. మనుచు శ్రీశైలనాథున • కానతిచ్చి, ధన్యకూరకులోత్తమ • దాసుఁ డాత్మ
గురునిఁ దలఁచుచు తిరునాటి • కరిగెననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. అంత శ్రీశైలేశుఁ • డతనికిఁ జరమకృత్యములఁ దత్పుతునితో • నాచరించి
ముద మొప్పఁ దిరువాయి • మొళికర్థ మాతిరుక్కణ్ణంగుడిప్పిళ్ళ • కడను వినుచు
మేధావి గావున • మేటిశంక లొనర్ప, సైరింప లేక యా • సాత్త్వికుండు
బుద్ధిమంతుఁడ వీవు • పోయితిరుప్పుళిం, గుడిజియ్య రార్యుఁ గ • న్గొనిన నతఁడు

తే. సందియం బేమిలేకుండ • శరవిరోధి, దివ్యసూక్తుల కర్థము • దెలుపఁ జాలు
నవిన నగ్గురుఁ డచ్చోటి • కరిగె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర. 54

వ. అంత నద్దేశికేంద్రుం డచటి కేఁగుదెంచుటకు ముందుగా నాతిరుప్పుళింగుడిజియ్య
రాత్మగురుశ్రీపాదంబులం జెందె నతఁడు చనినపన్రెండవదివసంబునం దమ్మహా
త్మునకు శ్రీనారాయణబలి యొనర్చుసమయంబునం దాశ్రీశైలేశదేశికేంద్రుండే
తెంచి యమ్మహానుభావునిసేవయైన సంభవింప దాయె నని పెద్దయుం బ్రొద్దుదెం
దంబునం గుందుచున్న దేవరాజగురుం డని పర్యాయదివ్యనామంబుగలనాలూ
రాచ్చాంబిళ్ళ యతనిం గటాక్షించి నీవిచ్చటి కేతెంచినకార్యం బెయ్యదియని
యడిగ నయ్యార్యవర్యుండును దనవృత్తాంతంబంతయునెఱింగింపం దెలిసివత్సా
నీ వీయర్థంబునకుఁ జింతింపవలదు భగవద్విషయంబు మొదలుగాఁ గల విశేష

గ్రంథంబు లన్నియు నీకుఁ దెలియంజెప్పెదననియానతిచ్చి యాగ్రంథంబారంభింప నుద్యోగించు కాలంబునఁ దిరునారాయణపురత్తాయి మొదలైన శ్రీయాదవాద్రినివాసు లావృత్తాంతం బంతయు నాకర్ణించి యద్దివ్యదేశంబునందు నిత్యనివాసం బొనర్చిన యతిపతి దివ్యాజ్ఞపత్రికగా నొక శ్రీముఖంబు కాలక్షేపం బొనర్ప శ్రీశైలనాధునితో మీర లిచ్చటికి విచ్చేయవలె నని లిఖియించి యద్దేవరాజగురునికడకుం బంచిన నద్దివ్యసూరివరుండు నా శ్రీముఖంబు శిరసావహించియా శ్రీశైలేశగురునితోడంగూడి యాదవాచలంబునకుం జనుదేరనాస్థల వాసులందఱెదుర్కొని యద్దేవరాజగురుని ననేకవిధంబుల సన్మానించిన నద్దేశికేంద్రుండును బ్రహృష్టాంతరంగుండై వారలతోడంగూడి యాదవాద్రి పైకిఁజని శ్రీకల్యాణపుష్కరిణియం దవగాహన మొనర్చి శ్రీరామానుజ మునీంద్రుని భజించితదనుమతి లభించి యద్దేవదేవుని గర్భగృహంబునఁ బ్రవేశించియందభినవ తటిల్లతాద్వితయ సముల్లసితంబైన కాలమేఘంబు చందంబునం జూపడు శ్రీభూసహితుండగు నారాయణునింగాంచి కేలుఁదమ్ములు ముకుళించి యనేకవిధంబుల వినుతించి తదనుగ్రహంబు లభించి వచ్చి కనకలతాశ్లిష్టం బగుబాలతమాలంబు పోలిక సులు తాను ముద్దుపట్టితో విలసిల్లుచున్న సంపత్కుమారుని సాక్షాత్కరించి తత్ప్రసాదంబుఁ గాంచి యాలయంబు వెల్వడి విచ్చేసి యొకవివిక్తస్థలంబున నివసించి శ్రీశైలనాధగురునకు ముప్పత్తారాయిరప్పడి ప్రసాదించి యతనితోడం గూడుకొని యాత్మీయ శ్రీగ్రామంబునకుం జనుదెంచి యందు శ్రీశైలేశునకు మఱియు విశేషార్థంబులం దెలుపుచు సుఖించుచుండె నంత 55

సీ. అమ్మహాత్మున కతం, డఖిలకైంకర్యము, లాచరించుచు నుండ, నతఁడు మెచ్చి
నిత్యనిజారాధ, నీయదైవతమైన, గోపాలబాలు న, గ్గురున కొసఁగ
నావిగ్రహముగొని, యతఁడు సంతోషించి, యార్యుని వీడ్కొని, యచటినుండి
కడువేగఁ జని తిరు, క్కణ్ణాంబి యనునూర, వలసగా నున్న శ్రీ, వకుళభూష

తే. ణార్యదేవునిఁ గనిమ్రొక్కి, యలరి మరలి. శ్రీపురికి వారివిచ్చేపు, సేయఁదలఁచి
యప్పురికిఁ దానుముందఱ, నరిగె ననుచు, వాదిభీకర గురుఁ డనె, మోద మలర.

సీ. శ్రీకురుకాపురిఁ, జెంది యందక్కడు, త్తూరాద్యరణ్యము, తుము రొనర్చి
ప్రాసాదగోపుర, ప్రాకారమంటప, రథ్యాచతుష్పథ, రాజవీధు
లారామములు పురో, ద్యానవాపీకూప, పద్మాకరాదుల, బాగుపఱిచి
వలస పోయినస్థల, వాసి వైష్ణవులను, దిరిగి రావించి త, ద్గృహములందు

తే. మంచి శ్రీశైలనాథుఁ డే•తెంచి మగిడి, వకుళభూషణమునిపాద•పద్మములను
బుడమిసాష్టాంగముగ మ్రొక్కి•పొగడెననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. రంగనాథార్పిత•రత్నమౌక్తికనద్ధ, కల్యాణకవచ మం•గమునఁ దాల్చి
లలితకిరీటకుం•డలహారకేయూర, కటిసూత్రకటకోర్మి•కలు ధరించి
స్వసుగంధజితపారి•జాతసుమంబులౌ, పొగడపువ్వులదండ•దగ వహించి
దివ్యనానారత్న•దేదీప్యమానవా,హన మెక్కి శఠవైరి•యచటఁ గదలి
తే. జరుగువేళ మృదంగని•స్స్వాణపటహ, శంఖదుందుభివీణాది•సకలవాద్య
నిస్వనంబులు రోదసి•నిండె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర. 58

సీ. అంత శ్రీశైలేశుఁ•డార్యులు కొనియాడ, వకుళభూషణయోగి•వరుని మరలి
తిరునగరికిఁ దోడి•తెచ్చి యెప్పటిమాడ్కిఁ, దామ్రపర్ణీనదీ•తటమునందుఁ
దింత్రిణీమూలస•ద్దివ్యాలయమునఁ బ్ర, తప్తగాంగేయవి•తర్దినడుమఁ
గాంచనపీఠాభి•కర్ణికపైఁ బ్రతి,ష్ఠించి సంతోషించి•శ్రీశఠారి
తే. దయధరిత్రిని శఠకోప•దాసుఁ డనుచు•ఖ్యాతిఁగాంచి సమస్తకై•కర్యమతని
కాచరించుచు వసియించె•నచట ననుచు,వాదిభీకర గురుఁడనె•మోద మలర.

వ. అంత. 60

సీ. శ్రీశైలనాథుఁడు • శ్రీమదనంతపు,రంబున కరిగి త•ద్రాజవీధి
మణిమయప్రాసాద•మందిరమంటప, గురుతరప్రాకార•గోపురముల
మహిత మహామీన•మత్స్యపుష్కరణీ ప్ర,ముఖతీర్థములు గొన్ని•మోదమలరఁ
జూచుచుఁ జని గుడిఁ•జొచ్చి ప్రదక్షిణమార్చి,యం దనంతాహిశ•యాను హరిని
తే. మూఁడువాకిండ్ల సేవించి•ముదముఁజెందిభక్తిదళుకొత్తఁబొగడి త•త్పాదయుగము
స్వాంతమున నిల్పి వసతికిఁ•జనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

వ. తదనంతరంబా శ్రీశైలనాథుఁడు నారాయణదాసాపర నామధేయుండైన వేలాంజోలప్పిళ్ళకడఁ జరమోపాయవైభవం బెఱుంగుమని తొల్లి కూరకులోత్తమదాసుం డానతిచ్చెం గాన శ్రీ నారాయణదాసావాసంబైన పుష్పోద్యానవనంబునకుం జనిన సమయంబునందు॥ శ్రు॥ ఆచార్యదేవోభవ, దేవమివాచార్య ముపాసీత॥ శ్లో॥ ఆచార్య స్సహరిస్సాక్షాచ్చరరూపీ నసంశయః। గురుర్దేవ పరబ్రహ్మ గురుర్దేవ పరాగతిః। గురుర్దేవ పరాకాష్ఠా గురుర్దేవ పరాయణమ్। యస్మాత్తదుపదేష్టాసౌ తస్మాద్గురుతరోగురుః। యస్యయేనైవగురుణాన్యాయన విద్యాప్రదీయతే। తస్యవైకుంఠ

దుగ్ధాబ్ధిద్వారకా స్వర్వఏవసః। గురోః పాదామ్బుజం ధ్యాయే ద్గురో ర్నామసదా-
జపేత్। గురు మారాధయే న్నిత్యం గురో రన్యం నభావయేత్॥ ఇతి అధ్యాసీన
తురఙ్గవక్త్రి విలసజ్జిహ్వాగ్రసింహాసనా। చాచార్యాదిహదేవతాం సమధికామన్యాం
నమన్యామహే। యస్యాసౌభజశేకదాచి దజహద్భూమాస్వయం భూమికామ్। మగ్నా
నాం భవినాంధవార్ణవ సముత్తారాయ నారాయణః॥ అనెడు శ్రుతిస్మృత్యభియుక్త
సూక్తిప్రామాణ్యంబునం బ్రపన్నుండైనవానికి మంత్ర మంత్రార్థాది పరమార్థోప
దేష్టయైన గురునికంటెం బరమప్రాప్యంబును బ్రాపకంబునైన వేఱొక పరదైవ-
తంబు లేదు గానం దదీయ శ్రీపాదాబ్జయుగంబు ధ్యానంబునకు సుఖావ్రదంబును
నిత్యసమారాధనీయంబును దద్దివ్యనామంబు పరమజప్యంబును కావునం దదన్యం
బేమియు భావింపంగూడదని తలంచి యమ్మహాత్ముం డొక వివిక్తక్షేమతర
ప్రదేశం బాశ్రయించి యందుం జేలాజినకుశోత్తరీయంబైన స్థిరాసనంబుం బ్రతి
ష్ఠించి యందు బద్ధపద్మాసనుండై సమకాయశిరోగ్రీవుండై కరకమలంబులు ముకు
ళించి బాహ్యవిషయంబువలనం బ్రత్యాహృతంబులైన యింద్రియంబులం గామ
క్రోధలోభ హర్షమాన మదమాత్సర్య విషాదరూప మనోమలాష్ట కవి నిర్ముక్తం
బైన యంతఃకరణంబుతోంగూర్చి యా యంతరింద్రియంబు బుద్ధితోడం గీల్కొల్పి
హృత్పుండరీక మధ్యవర్తియగు నిరతిశయ నిర్మలజ్యోతిర్మయంబైన దహరా-
కాశంబునందు సుప్రసన్న సూర్యాయుత ద్యోతమానంబగు నిజాచార్య దివ్యమంగళ
విగ్రహంబు సాక్షాత్కరించి తదనుభవజనిత ప్రేమపరవశ సకలావయవుండై
యన్యంబేమియు నెఱుంగనేరక యున్మనీభావావస్థాపన్నుండై యానందించుచుం
బంచషడహోరాత్రంబులున్నంత శ్రీశైలేశగురుండును దదీయ ధ్యానావసాన సమ
యంబు నిరీక్షించుచుండె నంత నా శ్రీనారాయణదాసుం డద్దివ్యసమాధినిష్ఠని గమ
నించి తిరునేత్రంబులు దెఱచిన యవసరంబున శ్రీశైలనాథుండును నద్దేశికేంద్రు
నకు సాష్టాంగప్రణామంబు గావించి బద్ధాంజలిపుటుండై తనమ్రోల నమ్రుండై
యున్న నప్పరమసాత్త్వికుండును గరుణాకటాక్షవీక్షణంబుల నద్దివ్యసూరి నీక్షించి
భవదాగమనకృత్యం బెయ్యది యని యడుగ నద్దేశికసత్తముండు తన వృత్తాంతం
బంతయు నగ్గురునకు విన్నవింప నాకర్ణించి యబ్భాగవతోత్తముండును శ్రీ వచన
భూషణ ప్రతిపాదిత శ్రీమహాభాగవతానువర్తనాది విశేషధర్మంబులన్నియుం దెలి
పినం దెలిసి యతండు కృతార్థుండయ్యె నంత వేలాంజోలైప్పిళ్ళయుం బ్రాపం
లాభంబునకై త్వరమించినం దిరుమేనుం జాలించెన తట నద్దివ్యదేశంబున్న
గోవెలయం దర్చకు లనంతశయనుండగు భగవంతున కేకాంతంబుగాం దిరువా-

రాధనం బాచరించుచు నద్దేవదేవుని శ్రీపాదపద్మంబులకడ సాంజలిపద్ముండై యా హరినిం గొనియాడుచున్న శ్రీనారాయణదాసునిం అర్చకులా రంజూచి వార లతండు ప్రకృతిబంధవిముక్తుం డైనధన్యతముం డని యెఱుంగనేరక యా వైష్ణవుం డర్చాకాలంబునందు గర్భగృహంబులోఁ జొచ్చివచ్చెనని మిగుల నలిగి కొన్నియవాచ్యంబు లాడి యమ్మహాత్మునిపై నపరాధం బాపాదింపఁ దలంచి గర్భాలయంబు వెల్వడి కవాటంబులు బంధించియున్నంత శ్రీనారాయణదాస శ్రీపాదసంశ్రితులు కొందఱు అచ్చటి కేతెంచి యగ్గురువరునకు శ్రీపూర్ణ పరిపాలనార్థంబు తిరుమాలయు తిరుపరివట్టంబును జాత్తుపొడియు నాభగవదర్పకుల నర్థింప వార లాశ్చర్యపడి యవియన్నియు నావైష్ణవుల కర్పించి యా వృత్తాంతంబంతయు నెల్లవారికిం దెల్లముగాఁ జెప్పిరంత నా శ్రీశైలేశగురుండును శ్రీనారాయణదాసుని చరమకైంకర్య మహోత్సవంబులన్నియు నాచరించి మగిడి కురుకాపురంబున కేతెంచి యందు నమ్మాళ్వారుల కెప్పటియట్ల సకలవిధ కైంకర్యంబు లాచరించుచుండె నంత శ్రీలోకగురుని కభిమత శిష్యుండై కొల్లిహావల దాసుండని ప్రసిద్ధిఁగాంచిన యశోహరుఁడు మణవాళప్పెరుమాళ్ పుళ్ళికిక్కుల్‌క్కూడారంబను గ్రామంబునందుఁ దద్దర్శనంబు నిర్వహించుచుండ మణవాళమహామునికి భవిష్యజ్జనకుండును శ్రీజిహ్వావాగధీశానదాసాపరనామధేయుండునగు తిగళక్కిడందాను తిరునావుడయపిరాన్ తాతరణ్ణరియ్యను సాత్త్విక పుంగవుం డద్దేశికేంద్రునకుం బుత్రికయగు శ్రీరంగనాయకినిం బెండ్లియాడి తొల్లి లోకాచార్య పిళ్ళకడ నశ్రుతంబులైన రహస్యవిశేషంబులు కొన్ని యాతనిసన్నిధి నధికరించియతని లోకగురునిమాఱుగాఁ జూచుచు నయ్యాచార్యవర్యునకు సకలవిధకైంకర్యంబు లాచరించుచుఁ గొన్ని దివసంబులుండి యతనిచే ననుజ్ఞాతుండై తనదేవితోడఁ దిరునగరి కేతెంచి యందు శఠకోప మునీంద్రునకు నిఖిలకైంకర్యంబులు సేయుచు సుఖించుచుండె నంత.

సీ. దినదినం బెప్పుడుఁ • దిరువాయిమొళియందు, శబ్దార్థభావర • సంబు లనుభ
వించుచు నాసొంపు • పెంపారఁ దిరితరి, నిఖిలశాస్త్రములఁ దృ • ణీకరించి
వర్తించుటను దిరు • వాయిమొళిప్పిళ్ళ, యని నిరూపకనామ • మతని కమ్యొ
నమ్మహాదేశికుఁ • డాశరారాతికైం, కర్యమే యాత్రగాఁ • గాల మెల్లఁ

తే. గడపు చుండెను శ్రీకురు • కాపురమున, వైష్ణవాన్వయవారిజ • బాలసూర్యుఁ
డతఁడు హృన్మల తిమిరౌఘ•మణఁచుననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర

శా. శ్రీరాజత్ప్రదమంగళాద్రి శరణా ♦ స్మృత్యర్థనిర్ధారణా
సారాసారవివేకిలోకవినుతా ♦ జ్ఞానప్రదానవ్రతా
ఘోరాపద్వ్యసనాంధకారమిహిరా ♦ గోదాప్రబంధాదరా
పారావారగభీర భావవిరజా ♦ పద్మాక్ష రామానుజా. 64

క. స్ఫారగురుపంక్తిమౌక్తిక, హారతరళదివ్యరత్న ♦ హతకలియత్నా
ధీరోదార గభీరవి, చారా శ్రీశైలనాథ ♦ సన్నుత చరణా. 65

మాలినీ వృత్తము

వరమనమయపోషా ♦ భక్తకల్యాణవేషా, నిరుపమసుఖదానా ♦ నిర్మలోద్గీథగానా
వరవరమునిరూపా ♦ వందితాశేషభూపా, సురుచిరరుచిగాత్రా ♦ శుద్ధహారీతగోత్రా.

గద్యము. ఇది శ్రీభగవద్రామానుజ కరుణాకటాక్షకలిత కవితావైభవ పరవాదిభయంకరాచార్యభి మతచ్ఛాత్రాపస్తంబసూత్ర కణ్వసగోత్ర పవిత్రోభయకవిమిత్ర వేంకటకృష్ణార్యపుత్ర విబుధ వైష్ణవవిధేయ కేశవనామధేయ ప్రణీతంబైన యాచార్యసూక్తి ముక్తావళియను మహాప్రబంధంబునం దుత్తరభాగంబునఁ బెరియవాచ్ఛాంబిళ్ళ వైభవంబును, నైనారాచ్ఛాంబిళ్ళ చరిత్రయు, వడక్కుత్తిరు వీధి ప్పిళ్లె ప్రభావంబును, లోకాచార్య మాహాత్మ్యంబును, దురుష్కోపద్రవవ్యాజంబున శ్రీరంగనాథుని వనగిరివిహారంబును, శ్రీశైలనాథాను భావకథనంబును నన్నది తృతీయోల్లాసము.

—o—

శ్రీమతే రామానుజాయ నమః.



# ఆచార్యసూక్తిముక్తావళి

## ఉత్తరభాగము

---

## చతుర్థోల్లాసము

శ్రీకురుకాపుర శరజి
త్ప్రికటమహిమావబోధ । రంజిత హృదయా
శ్రీకర సంయమివర సు
శ్లోకా శ్రీరంగధామ । లోల సుశీలా. 1

వ. అవధరింపుము. 2

### మణవాళమహాముసుల ప్రభావము

శ్రీశైలేశుని తిరునక్షత్రత-శ్లో. శ్రీశైలేశగురుం లోక దేశికాఙ్ఘ్రిసమాశ్రయమ్।
వృషే విశాఖాసంభూతం వన్దే వరగుణార్ణవమ్॥
నమశ్శ్రీశైలనాథాయ కున్తీనగర జన్మనే।
ప్రసాదలబ్ధపరమ ప్రాప్యకైఙ్కర్యశాలినే॥

మణవాళమహాముసుల. తిరు.త-శ్లో॥ తులాయా మతులే మూలే పాణ్డ్యేకున్తీ పురీవరే।
శ్రీశేషాంశోద్భవం వన్దేరమ్యజామాతరంమునిమ్॥

సీ. శ్రీరంగపతి దన । చిత్తమునందుఁ బ్ర,పత్తి శాస్త్రము తగ్గు । వడియె నింకఁ
దచ్ఛాస్త్రవృద్ధికై । ధరణిరామానుజ, మునితుల్యు నొకసూరి। ముఖ్యుఁగుడఁ
గలుగఁ జేసెదనని। తలఁచి శేషునిఁ దన, క్రేగంటఁ గనఁ దదం। గిత మెఱింగి
యయ్యనంతుఁడు తన। యవతారమున కర్హ, మగు కురుకాపురి। కరిగి యందుఁ

తే. దనకుఁ దిహాళక్కడందారు। తాధరణ్ణ, రయ్య శ్రీరంగనాయకి। యతవిదేవి
తల్లిదండ్రియునని మదిఁ। దలఁచె ననుచు, వాదిభీకరగురుఁ డనె। మోద మలర.

సీ. శేషుఁ డయ్యార్యుని। చిత్తమునందుఁ బ్ర, వేశించి యాబ్రహ్మ। వేత్తవలన
నయ మెలర్పఁగ ఋతు। స్నాతయౌ తద్దేవి, గర్భముఁ జెంద న। క్కమలనేత్ర

నవమాసములు ప్రపూర్ణము లైనపిమ్మట, సాధారణాఖ్యవత్సరమునందు సూర్యుఁడు తులయందు జొత్తిల్ల మూలయం దకళంకపూర్ణ చంద్రాభుఁడైన

తే. బాలు నొక్కని సుగుణాలవాలుఁ గనియె, నంత గోమరకులకలశాబ్ధి యుబ్బె శిశుపదస్పృష్టి నిం గలిచెడియె ననుచు, వాదిభీకరగురుఁ డనె మోదమలర.

వ. తదనంతరంబ తిహాళక్కుడందాఙ్ తిరుణావుడయపిరాఙ్ తాధరణ్ణరయ్యరా సూతికా గృహంబునం దారోపితంబైన కల్యాణదీపంబుమాడ్కి నిరతిశయ నిజ తేజఃపుం జరంజితుండై సంజాతమాత్రుండైన పుత్రునిం గటాక్షించి మహానందకందళిత హృదయారవిందుండై సుస్నాతుండై వచ్చి జాతకర్మం బాచరించి సూత్యాశౌచంబు నివర్తించినపిమ్మట పదునొకొండవ దినంబునందు శ్రీతామ్రపర్ణీతీర్థ సలిలంబులం దవగాహనంబొనర్చి ధౌతవస్త్రంబులం దాల్చి యొక వివిక్తస్థలంబున మృద్వాసన సుఖాసీనుండై గురుపరంపరానుసంధానపూర్వకంబుగా కేశవందమరిత్యాది శ్రీ శఠకోపమునీంద్రప్రణీత ద్వాదశగాథలను సంధించుచు లలాటాది ద్వాదశాంగంబు లందు శ్రీచూర్ణరేఖాశ్లాఘనీయంబులగు శ్వేతమృద్రచిత ద్వాదశోర్ధ్వపుండ్రంబులు ధరియించి యభినవ యజ్ఞోపవీతంబులు ధరియించి గురుజనంబుతో సూతికా నిలయంబునకుఁ బుణ్యాహవాచనంబు సేయించి నృత్తగీతాది మహోత్సవ పూర్వ కంబుగా నక్కుమారరత్నంబున కళహియ మణవాళప్పెరుమాళ్ నైనారని తిరు నామం బొనరించి తత్తత్సంస్కారయోగ్య కాలంబులందు యథాశాస్త్రంబుగా నన్నప్రాశన చౌలోపనయనాది సంస్కారంబులన్నియుఁ గావించి సాంగోపాంగస శిరస్కంబులగు వేదంబులఁ బఠియింపంజేసి శ్రీపరాంకుశ ప్రముఖ దివ్యసూరి ప్రణీతచతుస్సహస్రసంఖ్యాసంఖ్యాత దివ్యప్రబంధంబులన్నియు నధికరింపజేసినఁ దదీయోపకారంబు స్మరించి యళహియమణవాళ నైనాచార్యుండు నమ్మహాదేశికుని విషయంబుగా, శ్లో॥ శ్రీజిహ్వావాగధీశానదాస మమల మశేషశాస్త్రవిదమ్। సున్దర వరముని కరుణాకన్దళితజ్ఞానమన్దిరమ్ కలయే॥ అని యొక తనియను విన్నవించి షోడశవర్షంబులకు షోడశసంస్కార సంస్కృతుండై హానివృద్ధులు లేక షోడశ కళాపరిపూర్ణుండై నిష్కళంకుండై శరత్కాలోదితుండైన రాకాసుధాకరునిమాడ్కిం బ్రకాశించుచున్న యక్కుమారశేఖరునకుఁ దిరుకల్యాణం బాచరించి యమ్మహా త్మునితో సంతసించుచుఁ గొండొక కాలంబు సుఖించుచుండి యొక్కనాఁడు నిజాచార్య శ్రీపాదపద్మంబులం దలంచుచు శ్రీజిహ్వావాగధీశాన దాసార్యుండు పరమపదం బలంకరించె నంతఁ దత్పుత్రుండగు శ్రీమణవాళమహామునియు న

ద్దేశికేంద్రునకు బ్రహ్మమేధాది శ్రీమదధ్యయనాంతంబులగు చరమకైంకర్య
మహోత్సవంబులన్నియు యథావిధిగా నాచరించి తదుత్తరకాలంబున. 5

సీ. అంత శ్రీశైలనా•థార్యుండు దర్శన, స్థాపనమున కింకఁ • దగినధీరుఁ
డెవ్వఁ డేర్పడు నని•యెద విచారింప న, త్తఱి విజమాతుల•స్థాన మైన
శిక్కిల్‌కిడార మహా•శ్రీగ్రామ ముడిగి జ•న్మస్థానమౌ తిరు•నగరి కరిగి
సౌమ్యజామాతృ శ్రీ•శైలనాథుని యం•ఘ్రి,కమలమ్ములను బొడ•గాంచి మ్రొక్కి

తే. కేలుదమ్ములు మోడ్చి క•న్నీర్గ్రిల వినయ,నమ్రుఁడై యున్న శ్రీశైల•నాథుఁ డతని
నాదరోక్తుల స్వాగతం,బడిగె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. అట్లమృతస్యందిసూక్తులఁ గుశలప్రశ్నం బాచరించి 7

సీ. వత్స నీ విచటికి • వచ్చినపని యెట్టి,దనుచు శ్రీశైలేశుఁ • డడుగ నంత
స్వామి దేవరవారి,యనుగ్రహమున నా,లాయిరవ్యాఖ్యా ర•హస్యజాత
మధికరించుట కిట • కరుగుదెంచితి నని, సుందరజామాతృ•సూరి పలుక
నాసూక్తి విని పర•మానందమొంది శ్రీ,శైలేశుఁ డబ్బుధ•చక్రవర్తి

తే. కంతద్రవిడాగమవ్యా ఖ్యా•యారహస్య, భవ్యపరమార్థములనెల్ల•బయలుపుచ్చఁ
దెలిసి కృతకృత్యుఁడయ్యె నా•ధీరుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. సౌమ్యజామాత శ్రీ•శైలనాథునికృప, నఖిలవేదార్థము • లరసి తెలిసి
తన కతండొక పర•దైవతమని నమ్మి, స్ఫురదుపాయోపేయ•ములు తదంఘ్రి
పద్మములే యని • భావించి యతనికి, సకలకైంకర్యముల్ • సలుపుచున్న
నంత శ్రీశైలేశుఁ • డతనిఁ గటాక్షించి, వత్స యీప్రతిపత్తి • వకుళభూష

తే. ణార్యుశ్రీపాదకమలము • లాశ్రయించి, చాల హర్షించు శ్రీయతి•స్వామియందు
సలుపఁదగునని యతనికిఁ • బలికెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. నాఁటినుండి యతండు • నయమొప్ప సంయమి, నాథుని శ్రీపాద•నలినయుగము
గతియు గమ్యంబని • కడు నమ్మియుండును, శ్రీశైలనాథుఁ డా•శ్రీశరారి
పదపద్మములయందుఁ • బరభక్తి మించి త,దాశ్రితపర్యంత • మైనయంతఁ
గురుకాపురమునందుఁ • గోవెలఁ గట్టించి, విలసితయతిరాజ • విగ్రహంబు

తే. ధీరు లలరంగ నందుఁ బ్ర•తిష్ఠఁజేసి, మాడతిరువీధిఁ దీర్పించి•మహిమ మించ
మంచి యధ్యాపకుల నందు • నుంచెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. సౌమ్యోపయంత శ్రీ•సంయమీంద్రునిపాద, పంకేరుహములందుఁ • బరమభక్తి
మించి లో నిముడక • యంచితవాగ్ఝరి•యై వెలువడిన న•య్యార్యభోగ్య
యతిరాజవింశతి • య త్తిరునగరి సం•యమిరాజపరముగా • నానతిచ్చి
స్వగురుఁడై నట్టి శ్రీ•శైలనాథున కది, వినిపింప విని హర్ష•వృద్ధి నతఁడు

తే. తనదు నిత్యార్చనీయ త్రి•దండపాణి, విగ్రహంబియ్య నా బ్రహ్మ•విత్తముండు
సంతసించుచుఁ గొని యర్చ•సలిపెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. యతిరాట్ప్రద ప్రప•ణతఁజేసి యతని కా•యతయతీంద్ర ప్రవ•ణాఖ్య చెల్లె
జ్ఞానభక్తివిరక్తి•సాత్త్వికతాస్తిక•తాధ్యాత్మ గుణగణ • మతనియందు
విశ్రమించినగతి • విలసిల్ల నీక్షించి, సంతోషమంది శ్రీ•శైలనాథ
గురువరుం డతనికిఁ • దిరునందనమునుండి, పనసవార్తాకరం•భాశలాటు

తే. ముఖ్యశాకము లొకనాఁడు • మోద మలర
నసుప నవి చూచి కాంతోప•యంతృసూరి
యార్యుఁ గని యిది యే మని • యడిగె ననుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 12

వ. అట్లడిగిన సుందరజామాతృమునికి శ్రీశైలేశగురుం డిట్లనియె. 13

సీ. అర్చావతారము•నందు ముం దెల్లప్పు, డాసక్తచిత్తుల • మైతి మిప్పు
డార్య నీకంటె మా • కభిమతవిషయము, వెదకి చూచుటకైన • వేఱుకాన
మని గురుఁడన విని • యమ్మహాదేశికుం•డను గృహీతోస్మియం•చతనికనియె
నాశ్రయించినదిన • మాదిగాఁ బంక్తిపా•వనుఁడైన శ్రీమణ•వాళమునికి

తే. దినదినంబును శ్రీపాద•తీర్థ మిచ్చి, స్వసహభోజనశేష ప్ర•సాదములను
బొసఁగ శ్రీశైలనాయకుఁ•డొసఁగుననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ అంత. 15

సీ. ఆర్యవిపంక్తియం • దతఁ డారగించుట, కసహిష్ణులౌ కొంద•ఱార్యు లలుగ
వరవరముని నిజ•గురునేత్రసంజ్ఞచే, వార లాకర్ణింప • స్వముఖపద్మ
జాతసాంగోపాంగ•సశిరస్క సంస్కృత, ద్రావిడశ్రుత్యర్థ•తత్త్వవిషయ
వాక్యమరందప్ర•వాహముఁ గనిపింప, వారు విస్మయమొంది • వాగధీశుఁ

తే. డైన శేషాహిపతి యితఁ • డనుచుఁ దలఁచి, భక్తి మదిఁ బెన్గొనితని శ్రీ•పాదకమల
యుగముఁ బూజించి దోషము•లుడిగిరనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. అంతఁ గాంతోపయంతృగురుండు ముప్పత్తాయిరప్పడి మొదలగు తిరువాయిమొళి వ్యాఖ్యానంబులు తక్కిన దివ్యప్రబంధ వివరణంబులు లోకగురుప్రముఖ పూర్వాచార్యప్రణీత రహస్యవిశేషంబులన్నియు వాచోవిధేయంబులు చేసి సుఖించుచున్న సమయంబున. 17

సీ. అతనికి సుతుఁడొక్కఁ • డవతరించెను జ్వాల,దీపమువలనఁ బ్ర•దీపమట్లు
తనయార్యునాజ్ఞ నం•దారకున కతండు, రామానుజయ్యని • నామ మిడెను
నంత మేషార్ద్రార్క్ష • మావిర్భవింప శ్రీ,శైలేశదేశిక•చక్రవర్తి
యాప్రొద్దు బుధులతో • నారగించుచు సంయ,మీంద్రావతారకై•హేతువైన

తే. మంచిదినమిదిగదయని•మదినిహర్ష, మోహమొందినమణవాళ•మునియు నాయ
హంబవర్ణించె నలర న•య్యార్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. ధర శ్రీపరాంకుశ•దాసాభిధాన మ,హాపూర్ణదేశికు • నాశ్రయించి
యతిరాజు భువనవి•ఖ్యాతిఁ గాంచినయట్లు, శఠకోపదాసు శ్రీ•శైలనాథు
నాశ్రయించి మహాత్ముఁ•డా సౌమ్యజామాతృ,మునిసర్వవైష్ణవ•ముఖ్యుఁడయ్యె
నతఁడు యంతీంద్రాప•రావతారం బని, యర్చింతు రనఘు ల•య్యార్యు నంత

తే. భట్టనాథప్రణీత ప్ర•బంధమునకు, స్వాపదేశంబుగా నొక్క•వ్యాఖ్యఁ జేసె
ఘనుఁడు శ్రీశైలనాథుఁడు • కరుణ ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. కరణత్రయంబుచేఁ • గైంకర్య మారీతి, సలుపుచుఁ గాలము•జరిపెఁ గొంత
ప్రకృతిసంబంధము • ప్రాప్యలాభ ప్రతి,బంధకమని తన•భావమునను
నిశ్చయించి విరోధి•నిర్మోచనమునకై, గురుపదాంబుజములఁ • బరమభక్తిఁ
దలఁచుచు విగ్రహ•దార్ఢ్యము వర్జించి, పొసఁగ ముసుంగిడి • భూతలమునఁ

తే. బవ్వళించెను మదిఁ జింత • పల్లవింప, జ్ఞానభక్త్యాదిజలధ శ్రీ•శైలనాథుఁ
డఖిలచేతనముఖ్య హి•తార్ధమనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అంత శ్రీకాంతోప•యంతృదేశికుఁడు నె,య్యం బొప్ప శ్రీవైష్ణ•వాళితోడఁ
గూడి యేతెంచి య•గ్గురువరేణ్యునిఁ జూచి, సాఁగిలఁబడిమ్రొక్కి•సామి మీర
లిట్లుండుటకు హేతు•వేమన నాతండు, కనుదోయి నుష్ణాశ్రు•కణము లొలుక
వత్స యీకలిదావ•వహ్నియం దీజగ, మ్మెంద దశఁ జెందునో • యింక ననియు

తే. ద్రావిడామ్నాయములకెల్ల • ధరణి నెవ్వఁ
డగుఁ బ్రవర్తకుఁ డిఁకమీద • ననియు మదిని

జింత పొడమెను మా కని, చెప్పె ననుచు
వాదిభీకరగురుఁ డనె, మోద మలర. 21

వ. అట్లున్న యగ్గురుసూక్తు లాకర్ణించి యళహియమణవాళముని యద్దేశికేంద్రున కిట్లనియె, 22

సీ. సర్వగీర్వాణశా,స్త్రము లేమి నుడువక, ద్రవిడోపనిషదర్థ,తత్త్వబోధ
కలనముచే నాదు,కాలము గడపెద,నని వరవరముని, యానతియ్య
మాటమాత్రమె విన్న,మదిసంతసించునా, యనుచు శ్రీశైలేశుఁ,డనిన నతఁడు
స్వామి దేవరవారి,చరణాంబుజములాన, చేసెద నిట్లింక, చింత మానుఁ

తే. డనుచుఁ దత్పాదపద్మము,లందుఁ బ్రణతి,సలుప శ్రీశైలనాథుఁడు,సంతసించి
తిరిగి యతనికి హితమిట్లు, దెలిపెననుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర.

సీ. అక్కాలగలవేళ, నన్యశాస్త్రవిచార, పరుఁడవై యతిరాజ,గురువరునకు
సంతుష్టిగా నొక్క,సారి శ్రీభాష్యము, చదివి రామానుజా,చార్యులకును
నాకును బ్రీతిగా, నాలాయిర ప్రబం,ధములు తద్వ్యాఖ్యలు, తద్రహస్య
ములు వచించుచు నిజ,ముఖ్యశిష్యులకును, జెప్పుచుఁ బూర్వదే,శికులమాడ్కి

తే. మంగళాశాసనము రంగ,మందిరునకు,హరికిసల్పుచు నందుండు,మని విధించి
పలికె నతనికి శ్రీశైల,భర్తయనుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర.

వ. అంత. 25

సీ. ఆశ్రితజనుల న,య్యళహియ మణవాళ,ముని కప్పగించి స,మ్మోద మలర
వత్సకులార యీ,వరవరమునిని మా,మాఱుగా నెంచుఁడీ, మదిని మీర
లనుచు వారికిఁ బల్కి, యారమ్యజామాతృ, మునిముఖవైష్ణవ, ముఖ్యపాద
తీర్థ ముజ్జీవించి, దివ్యలోకార్యాంఘ్రి, కమలముల్ దలఁచుచుఁ, గాయముడిగి

తే. పరమపద మొందె వైశాఖ, బహుళపక్ష, సంగతాష్టమియందు శ్రీ, శైలనాథ
దేశికేంద్రుఁడు మనపాలి,దేవుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె,మోద మలర.

సీ. సౌమ్యజామాత్రాపి, సంశ్రితులందఱు, గురుని విశ్లేషించి, కొంతదడవు
దుఃఖించి మదితేట, దొలఁగక తద్దివ్య, మంగళాకృతి తమ, మానసములఁ
నిలిపి యాశ్రీశైల, నేతకు బ్రహ్మమే, ధాదిసంస్కారము, లాచరించి
తత్ప్రతిభావమునకుఁ, దగునట్లు శ్రీమద, ధ్యయనోత్సవముఁజేసి, యఖిలభాగ

తే. వతుల కభిమతమృష్టాన్న • పానసురభి, పుష్పచందనతాంబూల • భూరిధనము
లొసఁగి తృప్తియొనర్చి రిం•పొసఁగననుచు,వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. శ్రీశైలనాధార్య • శేఖరకరుణైక, పాత్రుఁ డంచద్జ్ఞాన • భక్తముఖ్య
కల్యాణగుణమణి • గణనిధిసాధు స, న్నుతియ తింద్రప్రవ • ఋండు రమ్య
జామాతృగురుఁడు శ్రీ • శఠకోప పరకాల, భట్టనాధాదిక • పరమయోగి
తతియందుఁదత్ప్రబం • ధములయందట్లుత ద్వ్యాఖ్యాకృదాదిమా • ర్యాళియందు

తే. శ్రీశ్రియఃపతులందును • జిత్త మునిచి, నమ్మయాళ్వారులను దిరు•నగరియ దు
నుచితవేళలఁ జూచుచు • నుండె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. అట్లు విలక్షణప్రమాతృప్రమాణప్రమేయంబులం దాసక్తమనస్కుండై తిరునగరియం దళహియమణవాళముని దర్శనంబు నిర్వహించుచున్న సమయంబునఁ దదీయమాహాత్మ్యం బాకర్ణించి యళహియవరదగురుండును నేన మొదలియారణ్ణరును మొదలుగాఁగల మహాదేశికు లేతెంచి తదీయశ్రీపాదపద్మంబు లాశ్రయించి రంత దళహియవరదగురుండత్యంత విరక్తుండై సర్వసంగపరిత్యాగం బొనరించి యధాశాస్త్రంబుగా సన్న్యసించి శ్రీరామానుజ జియ్యరని తిరునామంబు ధరియించి యద్దేశిక శిఖామణికిం బాదచ్ఛాయాపన్నుండై యుండెనయ్యవసరంబున.

సీ. వరవరముని తన • గురుఁడు చెప్పినయట్లు, శ్రీరంగవాసము • సేయఁ దలఁచి
కారిసూనుని•గని మ్రొక్కి వినుతించి, యతనియాజ్ఞ లభించి • యచటినుండి
తనసంశ్రితులతోడఁ • దరలి యల్లన చని, శ్రీవిల్లిపుత్తూరిఁ • జేరి యందు
శ్రీవిష్ణుచిత్తుల • సేవించి తత్పుత్రి, యగుమాడికుడుతది • వ్యాంఘ్రిఁ బొగడి

తే. వడపెరుంగోయిలు డయాను • నడుగుఁదమ్మి
దోయిఁ గని మ్రొక్కి భక్తి సం • స్తుతి యొనర్చి
యతని వీడ్కొని మెల్లన • నరిగె ననుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 30

సీ. మార్గమధ్యోల్లస•న్మధురవైరి దివ్యదే, శములందు మంగళా • శాసనంబు
గావించుచును జని • కావేరినదిచెంత, ప్రాకారసప్తక • పరివృతంబు
శ్రీరంగధామముఁ • జెంది చెంగట నున్న, కావేరియం దవ • గాహనంబుఁ
జేసి సుఖాసనా•సీనుఁడై ద్వాదశ, చ్ఛిద్రోర్ధ్వపుండ్రముల్ • చెలువు మిగులఁ

తే. దత్తదంగములందులఁ, దాల్చి కేశ, వాదిమూర్తులఁ దలఁచి కా • లార్హవిధులఁ
దీర్చి యప్పురిఁ జొచ్చె నా • ధీరుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ప్రత్యక్షవైకుంఠ • పదమగు శ్రీరంగ, ధామమునందు ను • దారరత్న
భవనమహోన్నత • ప్రాసాద సౌధహ, ర్మ్యపరంపరా మనో • హరములైన
వీధులందు విశిష్ట • వేషధారుల రంగ, నాధపాదాబ్జ ప్ర • ణామపరుల
న్యాయవిత్తమనర • నారీజనులఁ జిత్ర, విపణివస్తు సమృద్ధి • వేడ్కఁ జూచి

తే. హర్ష మొందుచు శ్రీజగ • దార్యపదము, లాశ్రయించిన కేటూరి • యణ్ణగారి
యింటికడ కేఁగు నద్దేశి • కేంద్రుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అట్లు కేట్టూరణ్ణ • రాలయాంతరమున, కరిగి శ్రీకాంతోప • యంతృగురుఁడుఁ
స్వాచార్యసముఁడైన • యతనికి సాష్టాంగ, నతి సేయఁజూచియ • న్నయవిదుండు
యతిశిఖామణియ ప • రావతారం బితం, డని ప్రీతి నయ్యార్యు • నాదరించి
యతనికి శ్రీరంగ • పతిని గన్పింపంగఁ, దనమానసమునందుఁ • దలఁచి యపుడు

తే. రంగరాణ్మందిరమునకు • రంగరాజ, భట్టు రధికారిగాన త • ద్భవనమునకు
నతనిఁ దనవెంటఁదోడ్కొని • యరిగెననుచు, వాదిభీకర గురుఁడనె • మోద మలర.

వ. అంత శ్రీరంగనాథా పరనామధేయుండగు తిరుమలత్తంద భట్టార్యుండా బ్రహ్మవిత్తముల నిరువురం గనుంగొని ప్రత్యుత్థానాభివందనాసనప్రధానాదుల నర్చించి సభాసీనులై యున్న వారియం దివ్వరవరముని నుద్దేశించి మహాత్మా యొక్క పాశురంబునకు నిజాచార్యులవలన మీ విన్నక్రమంబుగా నర్థంబు వక్కాణింపు మని పలుక నాకర్ణించి సౌమ్యజామాతృ మునివరుండును శ్రీవత్సాంక మిశ్రప్రభావ ప్రతిపాదకంబైన యొక్క గాథావిశేషంబునకు స్వసిద్ధాంతాను గుణంబుగా సహస్రవిధంబుల నర్థం బుపన్యసింపఁ బ్రేమపూర్వకంబుగా నాలకించి యభ్భట్టార్యుండితండు భగవంతుండగు రామానుజముని యపరావతారంబుగాని సామాన్యుండు గాఁడని తలంచి స్వాగతం బడిగి ప్రియవాక్యంబుల నాదరించి తదీయాభి మతంబు కేట్టూరణ్ణగా రానతిచ్చినం దెలిసి భగవత్సేవార్థంబుగాని జాశ్రితుల నిరువుర వారి తోడఁ గూడఁబంచిన నమ్మణవాళ మహాముని యు నభ్భాగవతసత్తములతో భగవన్మందిరంబునకుం జనియె నంత. 34

సీ. మణవాళముని రంగ • మందిరాంతరమున, యతినాధుఁగని మ్రొక్కి • యభినుతించి
శఠకోపమునిపదా • బ్జముల భక్తిభజించి, శ్రీరంగనాయకి • సేవఁజేసి

మండపంబులు తిరు • మటపల్లియును జూచి, బతిపీఠమున్నచోఁ • బ్రణుతిపలిపి
యంతఃప్రదక్షిణ • మాచరించుచుఁ బ్రణ, వాకృతి శ్రుతిశిఖ • రాంచితంబు

తే. నగువిమానమునకు మ్రొక్కి•యవలసైన్య, పతికిఁ జేమోడ్చిగరుడునిఁ•బ్రస్తుతించి
ప్రణతిఁ గావించెముఖమంట•పమున ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. జయవిజయులకు నం•జలిఁ జేసి వారల, యనుమతిఁ బడసి గ•ర్భాలయమున
రంగేశుసన్నిధి•రమ్యమాణిక్యన, ద్ధసువర్ణసైకత• స్తంభయుగముఁ
గడచి యనంతభో•గశయాను శ్రీభూమి, నీళాదిసీమంతి•నీలలామ
కాముకు శ్రీరంగ•ధాము నాపాదమ, స్తకము నమూల్యర•త్నప్రదీప్త

తే. కాంచనాభరణాంగము•ల్కన్నులారఁ, గాంచిపల్లాండఁ బాడిత•త్కరుణఁజెంది
యతులితానందమొందెన•య్యార్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

వ. అట్లుశఠరిపు మణవాళప్పెరుమాళ్ళనిదివ్యనామంబుగల శ్రీరంగరాజశౌరికి మంగళాశాసనం బొనర్చినంబెరుమాళ్ళనుతిరునామంబు ధరించిన కస్తూరిరంగని సన్నిధి కేతెంచి. 37

సీ. ఇరుగెలంకుల సిరి • ధరయును గలవాని, రమ్యకిరీట•రంబువాని
దివ్యకస్తూరికా•తిలకఫాలమువానిఁ, గరుణారసముఁ జిల్కు•కనులవానిఁ
గాఁచనకోరకా•కారనాసికవాని, మొలకనవ్వులముద్దు • మోమువాని
మకరకుండలదీప్తి•మత్కర్ణములవాని, ధన్యచక్రాద్యాయు•ధములవానిఁ

తే. గలతరత్నవిభూషణాం • గములవాని, సఖిలదివ్యోత్సవాదుల • కైనవాని
హరిని సేవించిపొగడె న•య్యార్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

వ. ఇట్లు దదీయస్తుతి ప్రసన్నుం డైనదేవాదిదేవుం డమ్మహాత్మున కి ట్లనియె. 39

సీ. వత్స నాననికిఁగా•వలసి ని న్నిలఁ గురు, కాపురంబున ముందు • గలుగఁజేసి
నేఁ డిట రావించి • నిన్నుఁ గన్నులఁ జూచి, సంతసంచితి నని • సామి పలికి
శఠకోపతీర్థప్ర•సాదాదిబహుమతి, నతనికిఁ జేయించి•యనుప నతఁడు
శౌర్యనుగ్రహ మయ్యె•స్వామి నీకృప వీని, కని యణ్ణరార్యున • కానతిచ్చి

తే. యతనితోఁ దద్గృహంబున•కరిగె నంతఁ, దశిహస్తై భట్ట రతనికిఁ•దండులాది
బహువిధద్రవ్యములు ప్రీతిఁ • బనిచెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. అణ్ణరార్యునియింట • నాపదార్థము లన్ని, పచనము సేయించి • ప్రాజ్ఞు నతని
భగవదర్చార్హమై • ప్రార్థింప నయ్యార్యుఁ, డ ట్లొనర్చినయంత , నతనితోడ

సావడి శ్రీసౌమ్య•జామాతృముని పూర్వ,గురుపంక్తిగుణకథల్ • కొంతకాల
మతఁడు వక్కాణింప • నాలించి యతనితో, నార్యులఁ జూచుచు • నరిగిలోక

తే. గురువిమందిరమున నుండి•కొన్నిగడియ, లతనిచరితములను విని•హర్ష మొంది
మరలి తానున్న తావున•కరిగె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అంతట నొక్కనాఁ • డళహియమణవాళ, గురుఁడురంగేశుఁ గ•న్గొనిన నతఁడు
తిరువాలవట్టము • తీర్థము తిరుమాల, శఠకోప మభయహ•స్తమును సురభి
చందనంబు మహా ప్ర•సాదము మొద లగు, సన్మాన మతనికి • సలిపి వత్స
యాదేహపాతము • యామునయతిరాజ, గోవిందముఖపూర్వ•గురువు లట్లు

తే. మామకంబైనయీరంగ•ధామమునను, సంతతావాసమొనరించి•సాత్త్వికులకు
నతులతత్త్వ మెఱింగింపు•మనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె• మోద మలర.

సీ. రంగేశుఁ డట్లను•గ్రహ మాచరించిన, హర్షించి కాంతోప•యంతృగురుఁడు
హరియాజ్ఞఁదలఁదాల్చి•యందువాసమొనర్చి, యచ్చోటఁగలరహ•స్యములనరసి
చేకొని యవి కటా•క్షించి జీర్ణోద్ధార, మాచరించినయంత • నమ్మహాత్మ
వానమామలయతి•వరుఁడు గన్గొని దేవ, యుత్తమనంబియు•ద్వృత్తుఁడగుచు

తే. రంగభర్తకు తళిహయా•రాధనాదు, లన్ని తగ్గించె నాతని• యంతమునకుఁ
బ్రపదనము సేయఁ దగునని•పలికె ననుచు, వాదిభీకరగురుఁ డనె• మోద మలర.

సీ. వరవరగురుఁడు త•ద్వాక్య మాకర్ణించి, మోమునఁ జిఱునవ్వు • మొలకలెత్త
సుందరవరదార్యుఁ • జూచి మహాత్మ నీ, వుత్తమనంబిని • నుచితనియతిఁ
గొమరొప్ప మన కను•కూలునిఁగాఁ జేయు,మనినియమించితా•హరినిఁగూర్చి
ప్రపదన మొనరింప • భక్తి నుత్తమనంబి, తనకు విధేయుఁడై • తనరె నంత

తే. రంగనాథపదాంబుజా•రాధనాది, బహుళకైంకర్యజాతము • బాగుపఱచి
తాను దిరుమల కరుగంగఁ • దలఁచెననుచు, వాదిభీకరగురుఁ డనె• మోద మలర.

వ. అట్లు దలంచి, 45

సీ. రంగనాథునిఁ జూచి • మంగళాశాసన, మతిభక్తిఁ దఱకొత్త • నాచరించి
యతనిచే బహుమతు • లంది యాజ్ఞ లభించి, వెలువడియాత్మని•వేశమొంది
కదలి సంశ్రితులతోఁ • గనకాపగానదిఁ, గడచి మార్గస్థిత•గ్రామములను
దాఁటి పుష్పలతావృ•తద్రుమగుల్మము, విగతపరస్పర•ద్వేషమృగము

తే. జలజపరిమళమిళిత కా•సారకులము, నిత్యసూరినిషేవ్యము • నీలివసముఁ
జూచె శ్రీసౌమ్యజామాతృ•సూరియనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. అమ్మహావనంబున. 47

సీ. పరకాలముని యెందుఁ•బ్రాకారములుగొన్ని, గట్టి-చిహరికిఁగైం•కర్యమొదవె
నెందుఁ దపంబొంది•యిందిర పతికంటె, సర్వస్వతంత్రయై • జనులఁ బ్రోచు
నాసీనయౌ లక్ష్మి • నస్వతంత్రునిగతి, నిలిచి కొల్చుసితాబ్జ•నేత్రుఁ డెందుఁ
బాతకం బెడఁబాసి•భవుఁడెందు భక్తితోఁ, బుండరీకాక్షుని•పూజఁ జేయు

తే శ్వేతగిరి యని పుడమి వి•ఖ్యాతమెద్ది, భట్టనాథార్యుఁ డెద్దానిఁ•బ్రస్తుతించె
నట్టితిరువెళ్లరను జూచె•నార్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ ఆదివ్యదేశము•నందుఁ గల్యాణర,త్నాంచితప్రాకార•పంచకంబు
సేవించి బుధులతోఁ • గోవెల వలగొని, బలిపీఠ మీక్షించి • ప్రణతి సలిపి
భక్తితో ముఖమంట•పమునఁ బ్రణామముఁ,జేసి గర్భగృహంబుఁ•జెందియందు
శ్రీమదబ్జాసనా•సీనయౌ పంగయ,చ్చొల్లి తాయారను • జూచి పొగడి

తే. యాసిరికిఁ జెంత నిలఁబడి•యతివిధేయుఁ, డైనశెందామరక్కణ్ణ•ననెడుహరిని
జూచి కొనియాడె నద్దివ్య•సూరి యనుచు, వాదిభీకరగురుఁ డనె• మోద మలర

సీ. ఆదిమదంపతు • లైనయాసిరి హరి, యతనికి బహుమతు • లాచరించి
పనిచిన నగ్గురు•పరమేష్ఠి సంశ్రిత,సహితుఁడై వేంకట•శైల మొంది
స్వామిపుష్కరిణిలో • స్నానముఁ గావించి, శ్రీవరాహస్వామి•సేవఁ జేసి
శేషాద్రినాథుని•శ్రీమందిరముఁ జెంది, బలిపీఠికడ మ్రొక్కి•ప్రక్రమంబుఁ

తే. జేసి నారాయణాచల•శిఖరమునకుఁ, బ్రణతిఁగావించి యేతెంచి•రత్నఖచిత
ధన్యచాంపేయదేహళి • దాఁటె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. అంత మేయా నను•హరిని గన్గొని మ్రొక్కి, బంగారుతలుపుల•బావికడను
శ్రీమహానసలక్ష్మి•సేవ నానందించి, కల్యాణమంటప•గరిమఁ గాంచి
యానందనిలయది•వ్యవిమాన మీక్షించి, చాఁగిలఁబడిమ్రొక్కి • జరగి వచ్చి
సూత్రవతీశునిఁ • జూడ్కులార భజించి, తొట్టితీర్థంబుబిం•దువులఁ గ్రోలి

తే. భాష్యకారులఁగనిమ్రొక్కి•ప్రస్తుతించి, యోగనృహరికిఁజేమోడ్చి• యుచితసరణిఁ
దిరిగి ముఖమంటపముఁజెందె•ధీరుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ రుచిరవేదమయుండు • రుద్రానుకీర్తిశుఁ, డగుఖగపతికి జో•హారుఁ జేసి
ముఖమంటపమునందు • ముఖ్యసాష్టాంగప్ర, ణామముఁ దీర్చి స•న్మాననీయు
లగుజయవిజయుల • కంజలిఁ జేసి, త•త్సమ్మతి సన్నిధి•సదన మంది
యందనంతాదిసూ•ర్యగ్రణులను జూచి, చేమోడ్చి వజ్రంపు•శిలలు మెఱయ

తే. నతులకులశేఖరార్యదే•హళినిదాఁటి, సౌమ్యజామాతృమునివృష•శైలనాథుఁ
గన్నులకు విందుగాఁబొడ•గాంచెననుచు. వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. సౌందర్యలావణ్య•సౌకుమార్యౌజ్జ్వల్య, సౌగంధ్యసౌష్ఠవ • సద్గుణాఢ్య
మతనిపాదాదిమూ•ర్ధాంతదివ్యాంగసం,స్థానము దివ్యభూ•షణవితాన
మాకల్పభూతది•వ్యాయుధవర్గము, శ్రీదేవి నురముపైఁ • జెందఁ జూచి
యాఁకొన్నవాఁడు పి•ష్టాన్నముఁ గన్నట్లు, పెన్నిధిఁ గనుఁగొన్న • పేదపగిది

తే. నిస్తులానందపరిపూర్ణ•నిఖిలగాత్రుఁ, డగుచుఁగొనియాడితదనుగ్ర•హములభించె
సౌమ్యజామాతృదేశిక•చంద్రుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. అమ్మహాదేశికు • నంజనాద్రీశుఁడు, కరుణఁ గటాక్షించి • గారవించి
తిరువాలవట్టము • తీర్థము శరకోప, మభయహస్తము చంద•నాదిసకల
బహుమతుల్ సేయించి•పనుప నయ్యార్యుఁడు, తిరుమల దిగివచ్చి • దేవదేవు
సుందరతిల్లగో•విందరాజును మంగ•ళాశాసనముఁ జేసి • యచటినుండి

తే. యరిగి ఘటికాద్రివరహరి • కంజలించి, జరిగి రమణీయగృధ్రపు•ష్కరిణిచెంత
విజయరాఘవహరిని సే•వించె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. జరిగి యచ్చటనుండి • సత్యవ్రతక్షేత్ర, రాజిత కాంచీపు•రంబుఁ జెంది
యందు శ్రీకరిగిరి•యందుఁ బెరుందేవి•తాయారు నీక్షించి • తగ నుతించి
పరమకారుణికునిఁ • బరముని వరదునిఁ, గన్నులార భజించి • సన్నుతించి
తదనుగ్రహంబుచేఁ • దత్తీర్థశరకోప, చందనమాల్య ప్ర•సాదముఖ్య

తే బహుమతి లభించి మును యతి•భర్త నెందుఁ
దిరువరంగార్యునకు నిచ్చె • వరదుఁ డట్టి
మంటపముఁ జూచి మ్రొక్కె న•మ్మాన్యుఁ డనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. హస్త్యద్రినాథుని•యనుమతిఁ గొని వేగ, శ్రీభూతపురికి వి•చ్చేసి యందుఁ
గేశవస్వామిని • వాసిఁ గన్గొని మ్రొక్కి, యతిరాజు నీక్షించి • యభినుతించి.

దాశరథ్యాఖ్య త•త్పాదుకాద్వయిఁ దలఁ,దాల్చి తీర్థముఁ బ్రసా•దము లభించి
యతులమౌ శ్రీభాష్య•మధికరించుట కాజ్ఞఁ,బడసి కొన్నాళ్లందుఁ•గడపిమగిడి

తే. కంచికేతెంచి వరదునిఁ•గాంచి పొగడి, యంచితంబుగ నందు వ•సించిభాష్య
మధికరింపఁ దలంచె న•య్యార్యుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. అరసి ముఙ్ఞ యతిపతి • కన్నపానీయాదు, లర్పించుగురుదత్తుఁ • డగుకిడాంబి
యాచ్చాన్కులంబునం•దవతరించుకిడాంబి, నయనారుసూరియా•మ్నాయ సర్వ
శాస్త్రార్థములయందు • సర్వజ్ఞుఁడనియెంచి, యతనిసన్నిధిభాష్య•మధికరించి
యచటఁగన్పడు రహ•స్యములుబ్రాయించికై,కొనిన యనారాఖ్య•గురునిహరిని

తే. గూర్మి వీడ్కొనిచని తిరు•క్కోవలూర, శ్రీత్రివిక్రము నాదిసూ•రిత్రయంబుఁ
జూచి హర్షించె మణవాళ•సూరియనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఆదేహళీపురీ•హరిని శ్రీభూతకా,సార మహాయోగి•సత్తములను
వరుసగా వినుతించి • వారిచే బహుమతిఁ,గాంచి సంశ్రితులతోఁ • గదలి వేగ
శ్రీరంగధామముఁ • జెంది యందు భుజంగ,రాజశయాను శ్రీ•రంగరాజ
శౌరిని బొడగాంచి • సన్నుతులొనరించి, యతనిచే బహుమతుఁ•డై తదాజ్ఞ

తే. నాత్మనిలయముఁ జెంది యం•దార్యగోష్ఠి, జరపుచును వేళదప్పక • శౌరిసేవ
సల్పుచుండెను వరవర•స్వామి యనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. హరికి మహోత్సవ • మగుచున్న నొక్కనాఁ, డమ్మహాదేశికుం • డచటి కరిగి
విషయాంతరములందు•విముఖములగు తన, సకలేంద్రియంబులా•స్వామియందు
సక్తములై జన్మ•సాఫల్యమొందఁ దా, హర్షించుచుండు న•య్యవసరమున
జ్ఞాతిసూతకవార్త • శ్రవణపథంబునఁ, బడిన నుత్సవ మెడఁ•బాయలేక

తే. పరితపించుచు స్వామిసే•వావిరోధి, సకలదోషైకపదము సం•సార మనుచుఁ
దలఁచి యచ్చటనుండక•తొలఁగెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. సబ్రహ్మచారి యౌ•శరకోపయతికడ, కరిగి భక్తిఁ బ్రణామ • మాచరించి
స్వామి త్రిదండకా•షాయముల్ దాసుమీకిమ్మని ప్రార్థింప • నెమ్మి నతఁడు
సమ్మతించిన యధా • శాస్త్రక్రమంబుగాఁ నతనిసన్నిధిఁ దురీ • యాశ్రమంబుఁ
గైకొని యతిరాజు • కరణి నొంపారె న,య్యశహియమణవాళ • యతివరుండు

తే. నంత శ్రీశైలనాధుని • కాఖ్య యైన, మహితశఠకోపదాసనా • మం బతనికిఁ
జేసెఁ గృపయొప్ప శఠకోప • జియ్యరనుచు, వాదిభీకరగురుఁడనె • మోద మలర.

వ. అట్లాశ్రమ స్వీకారంబొనర్చి శ్రీసౌమ్యజామాతృయోగీంద్రుండు నిజాచార్యుండగు తిరువాయ్మొళిప్పిళ్లకుం బరాంకుశ ప్రసాదలబ్ధంబగు శరకోపదాస నామధేయంబు ధరియించి తన కాశ్రమ ప్రదాతయగు శరకోప జియ్యరనుమతిచే భగవత్సన్నిధానంబునకుం జనిభట్టనాథోక్తగాథాక్రమంబుగా మంగళాశాసనం బాచరించి ప్రాంజలియై నిలిచియున్నం గటాక్షించి మృదుమధురగంభీరోక్తుల నాదరించి శ్రీరంగనాథుం డమ్మహాత్మునకు శ్రీశరకోపతీర్థప్రసాదాదిబహుమతి సేయించి యళహియమణవాళ జియ్యరని తిరునామం బొసంగి యస్మదీయుండైన యీ యళహియమణవాళ యోగీంద్రుని వల్లవరాయని మఠంబునందుం బ్రవేశింపంజేయు మనుచు నుత్తమ నంబికి నియోగింపనాసాత్త్విక సత్తముండా బ్రహ్మవిత్తముని నుపనిషద్ఘోషభూషిత నృత్తగీత మహావాద్యఘోషంబుతో నమ్మఠంబునకుం దోడ్కొనిచని యద్దేశికేంద్రునిచే ననుజ్ఞాతుండై యథేచ్ఛంజనియె నంత నవ్వరవరయోగిధుర్యుం డయ్యార్యవర్యులతో నందు సుఖస్థితి నుండె నంత.

సీ. వానమామల యతి•వరుఁ డామఠంబున, కతిదృఢావరణాదు•లమరఁ జేసి
తిరుమలయాళ్వారి•తిరునామమిడి యసం,కుచితకాలక్షేప•కూట మొకటి
గట్టించి లోకార్య•కాలయాపనమంట,పస్థలి మృత్తిక•భక్తిఁ దెచ్చి
శ్రీశైలనాథ దే•శికనామ మంటపం, బంత నామట్టిచే•నలికి పూసి

తే. విపులతరభిత్తితలముల • వేడ్కనందుఁ,బూర్వగురుపంక్తినాలేఖ్య • ములలిఖించి
మించ గురునకుఁ బ్రీతిఁ గా•వించెననుచు, వాదిభీకర గురుఁడనె•మోద మలర.

సీ. అమరాలంకార•మళహియమణవాళ,యోగి కటాక్షించి•యుల్లమలర
భ్రాతృభావ మెఱింగి•బహువిధంబులఁ దొల్లి, పర్ణశాల యొనర్చు•పరమభక్తు
సౌమిత్రి వీక్షించి•చక్రవర్తిసుతుండు, కౌఁగిటఁ జేర్చుక • గారవించు
కరణిఁ దోతాచలా•గారసంయమిచంద్రు, నాశ్లేష మొనరించి•యాదరించి

తే. యందు మృద్వాసనాసీనుఁ•డై వసించి, యఖిలవేదాంతసారార్థ•మాశ్రితులకుఁ
దెలుపుచుండెను యతిరాజు•కొలఁది ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. ద్రావిడామ్నాయార్థ•తత్త్వనిరూపక, వ్యాఖ్యావచనభూష•ణాదివేద
శిఖరరహస్యాళి•చేఁ బ్రొద్దు పుచ్చుచు, నళహియమణవాళ•యతివరుండు
విమలప్రసన్నసా•విత్ర్యర్థతత్త్వమె, యనుభవించుచున్న•యతనికడకు
వచ్చి శ్రీపరవస్తు•భట్టనాథాఖ్య సం,యమి తత్పదాబ్జము•లాశ్రయించి

తే. యతనిసన్నిధి వేదాంత•మరసితెలిసి. సకలదాస్యము లతనికి•సలుపుచుండి
తత్పదచ్ఛాయనెడఁబాయఁ•దలఁపఁడనుచు, వాదిభీకరగుఱుఁ డనె•మోద మలర.

వ. అదియునుం గాక.

సీ వాధూలగోత్రుఁడౌ•వరదనారాయణ, గురుఁడు తన్మాహాత్మ్య•మెఱిఁగి వచ్చి
యభిజనవి త్తవి•ద్యాభిమానము మాని. యితని కంతేవాసి • యయ్యె నంత
సకలదిగంతవి•శ్రాంత యౌౕతత్కీర్తిఁ. జెవులార విని సంత•సించి మించి
బహుసంఖ్యవైష్ణవుల్•బహుదేశములనుండి, శ్రీరంగధామముఁ•జెంది యందు

తే. సౌమ్యజామాతృమునిపదా•బ్జాతయుగళ, మాశ్రయించి కృతార్థత•నందిరంత
వచ్చె నచ్చటి కొకపర•వాది యనుచు. వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. చిన్మాత్రమై నిర్వి•శేష మౌ బ్రహ్మము. సత్య మసత్య మీ•సకల మనుచుఁ
బలుకుతర్కోక్తుల•నన్యసించుచు వాఁడు. హేతువాదముసేయ•నిచ్ఛయి-ప
సర్వజ్ఞుఁ డయ్యును • స్వగురుసన్నిధిఁ దాను, సలిపినశపథము • సంస్మరించి
వాని నుపేక్షించి • వరవరముని పీఁఠు, విర్థలప్పనికడ • విద్యఁ జదివె

తే. నతఁడెప్రత్యుత్తరమువీని•కానతిమ్ము, నను చుఁబిలిపింపనయ్యార్యుఁ • డరుగుదెంచి
యలిగి యావాది కిట్లని•పలికె ననుచు. వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. ఏమిరా నీవు మా•యింటఁ జెప్పినపనిఁ, జేసి శాస్త్రము లభ్య•సించి వచ్చి
యిచట నీవిద్వన్మ•హేంద్రునికనుౕమోలఁ. బదరు చున్నా విటు•పాటుఁదప్పి
నీ వేడ గురు వేడ • నీకుఙ్బదు వేడ. నీగురువైదుష్య • మేడ నవిన
భీతప్రభీతుఁడై • బిసబిస వాఁ డేఁగ. నావిర్థలప్ప న•య్యార్యుఁ డాత్మ

తే. మరమునం దుండు మని పల్క • మహిషిదధియుఁ
బర్యుషిత మన్న మిటఁ జెంద•బడుదుఁ గాన
యుఁడ నని పోయె నయ్యభి•యుక్తుఁ డనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ వాధూలగోత్రుం డగువిర్ధలార్యుం డట్లు గురుసన్నిధి విన్నవించి నిజనివాసంబున
కుం జనియె నంత.

సీ. మనకు విధేయుఁడై • మనతోడ పాటుగా. నుండఁ గల్గినదండి•పండితుండు
మన కెవ్వఁ డగు నని • మణవాళముని యనఁ. బరవాదిమదకరి•భంగదక్షుఁ

దణ్ణగా రనుచుఁ బ్రఖ్యాతుఁ డౌవిద్వచ్ఛిఖామణియొకఁ డలకాంచి నుండు
నని శిష్యు లన విని యార్యుఁడు చేవ్రాల, శ్రీముఖం బొక్కటి చెన్ను మీఱ

తే. వ్రాసి పంపించుటకు ముందు వాసి మిగులఁ, గరిగిరీశ్వరుఁ డాయణ్ణగారికలను
గానఁబడి పల్కె నతనికీ కిరణి ననుచు, వాదిభీకరగురుఁ డనె మోద మలర

సీ. ద్రవిడాగమార్థబోధకుఁడు మా కేగురుం, డగు నని తలఁచెద, వనము నీవు
యతిశేఖరుని యపరావతారం బగు, వరవరమునికడ కరిగి యచట
ద్రవిడోపనిషదర్థతత్త్వ మెఱుఁగుమా, యని పల్కి కనఁబడఁ డయ్యె వరదుఁ
డార్యుఁడు మేల్కాంచి యష్టక్రియలు సల్పి, గురుపదంబున కేఁగఁ గోరియున్న

తే. యప్పుడిరువురువైష్ణవు లరుగుదెంచి, గురుని శ్రీముఖమియ్యఁ గైకొని యతండు
చాల హర్షించి యాలేఖఁ జదివె ననుచు, వాదిభీకరగురుఁ డనె మోద మలర.

సీ. ఆయార్యుఁ డాలిఖితార్థమంత గ్రహించి, యావైష్ణవులఁ జాల నాదరించి
కరిగిరీశుఁడు తన కలలోనఁ గనఁబడి, చెప్పిన యర్థము సిద్ధ మయ్యె
నని సంతసించుచు నావైష్ణవులతోడ హస్త్యద్రినాథుని యాజ్ఞఁ బడసి
యధ్వమధ్యస్థదివ్యస్థలంబులయందు, శౌరికి మంగళాశాసనంబు

తే. భక్తితోఁ జేసి శ్రీరంగపదముఁ జెంది, దివ్యకావేరిజలమునఁ దీర్థమాడి
ధౌతదివ్యాంశుకంబులఁ దాల్చె ననుచు, వాదిభీకరగురుఁ డనె మోద మలర.

సీ. ద్వాదశాంగములందు ధవళోర్ధ్వపుండ్రముల్, శ్రీచూర్ణరేఖలు సిరులుగులుక
ధరియించి కేశవందమ రనుతిరువాయి, మొళిఁ జదువుచుఁ గేలు మోడ్చి పూర్వ
గురుపంక్తిఁ దలఁచి శ్రీహరియాజ్ఞఁ జెల్లించి, యచ్చోటనుండె ముం దార్యునాజ్ఞఁ
దనకడ కేతెంచు ధన్యు లిర్వురుఁ జని, వరవరమునుల కావార్తఁ దెలుప

తే. నమ్మహాత్ముఁడు విని చాల హర్ష మొంది, యణ్ణగారికి మీరెదు రరిగి యతనిఁ
దోడి తెం డనిపలికె సద్బుధుల కనుచు, వాదిభీకరగురుఁ డనె మోద మలర.

సీ. ఆసూక్తి విని తదీయాశ్రితు లందఱు, హర్షించి తనపాలి కరుగుదేర
నణ్ణగా రావైష్ణవాగ్రణులను జూచి, యభ్యుద్గమప్రణామాదిపూజ
గావించి యబ్బుధౌఘముతోడఁ గోవెల, కరిగి ప్రదక్షిణ మాచరించి
ఘనబలిపీఠముకడ మ్రొక్కి లోఁ జొచ్చి, ఫణిరాజశయ్యపైఁ బవ్వళించి

తే. యున్న శ్రీరంగనాథునిఁ గన్నులారఁ, గాంచి యంజలిరచియించి కడునుతించి
మించ దదనుగ్రహంబు లభించె ననుచు, వాదిభీకరగురుఁ డనె మోద మలర.

సీ. దివ్యకస్తూరికా • తిలకఫాలస్థలు, నంబెరుమాళ్ళను • నయనములకు
విందు గా సేవించి • వినుతించి త త్తీర్థ, శఠకోపమాల్య ప్ర•సాదముఖ్య
బహుమతిఁ బడసి య•బ్భాగవతాళితో, మణవాళమాముని•మఠముఁ జెంది
యం దమ్మహాత్ముని•యంఘ్రిపద్మములకు, దీర్ఘ ప్రణామముఁ • దీర్చి యతని
తే. విస్ఫుగవ మ్రోలనిజకర•కమలయుగము, మోడ్చినమ్రతదళుకొ త్త • మోదమలర
నుండె దుర్వాదితిమిః మా• ర్తండుఁ డనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. అంత సౌమ్యజామాతృయోగీంద్రుం డావిద్వన్మహేంద్రునిం గటాక్షించి తనసన్ని ధిం గూర్చుండ నియమించిన.

సీ శ్రీమదార్యునియాజ్ఞ • శ్రీవత్సకులకల, శాబ్ధిరాకాచంద్రుఁ • డై నయణ్ణ
గారు తత్సన్నిధిఁ • గరపద్మముల మోడ్చి. కూర్చుండి వినఁగ న•గ్గురువరేణ్యుఁ
డప్పు డొన్నంతేవు • మనియెడు తిరువాయి మొళిప్రవేశమునందు • మొదట
సరసజన్మాద్యధి•కరణార్ధ మంత యు,పన్యసించిన విని • వత్స వంశ [నుండి
తే. వర్ధనుఁడుసంశయముమాని•వరవరార్య. పాదపంకేరుహములందుఁ•బ్రణతిసలిపి
హర్ష మొప్పార నతని కీ•ట్లనియె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ శిష్యునిఁగా వీనిఁ • జేకొని ద్రవిడోప, నిషదర్థ మీవె వీ•నికి వచింప
నర్హుఁడవనుచు న•య్యణ్ణగా రన సౌమ్య,జామాతృముని మేము•సాధువులము
ప్రబలతర ప్రతి•వాదిభయంకర, బిరుదాంకితుఁడ వీవు • పృధివియందు
నిట్టిమే మిట్టినీ • కెట్లు ద్రావిడవేద, త త్త్వ మెఱింగింపఁ • దగుదు మనిన
తే నమ్మహాదేశికునిసూ క్తు • లాలకించి, భక్తి దళుకొ త్త నతనికిఁ•బ్రణతి సలిపి
యస్మదన్వయకరుఁ డిట్టు•లనియెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. పరగోష్ఠులను బ్రతి•వాదిభయంకరుఁ, డని ప్రసిద్ధుఁడ నై తి • నార్యపర్య
యునఘవైష్ణవగోష్ఠు•లందుఁ దద్దాసవి,ఖ్యాతిఁ గాంచితి బుధ•కధితచరిత
యడియేని కీయాహ్వ•యములు రెండును గల,వని యణ్ణగా రన•విని గురుండు
కడు సంతసించి సం•స్కారపంచకముఖ, హితముల నతనికి • నేర్పరింప
తే. నతనిసన్నిధి ద్రవిడవే•దాంత మంత, నధికరించి తదీయాంఘ్రు • లనిమేష
మైననెడఁబాయనొల్లఁ డ•య్యార్యుఁడనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ. అట్లనువ ర్తించునణ్ణగారి నుద్దేశించి యవ్వరవరమునీంద్రుండు వత్సా ప్రతిపక్ష పక్షవిక్షేపణ పూర్వకంబుగా స్వపక్షంబైన విశిష్టాద్వైతంబు నిర్వహించుచు నస్మ

త్సన్నిధి నుండుమని విధించి యతనికన్వర్థంబగు శ్రీవైష్ణవదాసనామంబె స్వరూప నిరూపకదాస్యనామంబుగా ననుగ్రహింప నావత్సకులాలంకరిష్ణుఁడును నగ్గురువ శేషిసన్నిధి ముప్పత్తారాయిరప్పడి మొదలుగాఁగల స్వరూపగ్రంథంబు లన్నియు నధికరించి యతిరాజునకుం దొల్లి కూరకులనాథుని చందంబున నవ్వరవరమునులకుం దద్వ్యాఖ్యానానుకూల సాహాయ్యంబొనరించుచుఁ దదీయదివ్యాంఘ్రిచ్ఛాయాపన్నుండై యుండె నంతఁ బూర్వాశ్రమంబునం దమ్మణవాళమునికిం బుత్రుం డగురామానుజాచార్యునకు దీపోత్పన్నదీపంబుగతి నొకపుత్రుం డవతరింప నబ్బాలకున కయ్యాచార్యవర్యులు డళహియమణవాళప్పెరుమాళ్ నైనారని యాచార్యదివ్యనామంబుఁ గావించి మఱియుం గొండొకకాలంబునకు శ్రీవిల్లిపుత్తూరను దివ్యదేశంబుఁ బ్రవేశించి యందు వడపెరుంగోయిలుడయాననుశ్రీయఃపతి కనిశంబు మంగళాశాసనంబు సేయుచు వసియింప నయ్యార్యునకు మగిడి యొకకుమారుం డుదయింప నతం డాశిశువునకు నామధేయం బెయ్యది యనియడిగిరంత నుమ నిరువురువైష్ణవుల నవ్వరవరమునికడ కనుప వార లేతెంచి యగ్గురువరునిం గాంచి ప్రణామం బాచరించి యావృత్తాంతం బంతయు విన్నవింప నతం డాలకించి శ్రీవిల్లిపుత్తూరియం దుదయించినబాలకున కద్దివ్యదేశనిర్వాహకుం డగుశ్రీవిష్ణుచిత్తులదివ్యనామంబు దక్కఁ దక్కిననామధేయం బర్హంబుగాదనియా నతీయనబ్భాగవతులిరువురావృత్తాంతం బారామానుజార్యుని కెఱింగించిన నతం డా దారకునకు పెరియాళ్వారయ్యరని తిరునామంబు గావించి యన్నప్రాశన చౌలోపనయనాది వేదోక్తకర్మంబులన్నియుఁ దత్తత్కాలంబులు దప్పనీయక యథాశాస్త్రంబుగా నొనర్చె నంత నుపనీతులగు నబ్బాలకులిరువురధీత సాంగోపాంగామ్నాయులై శ్రీరంగంబున కరుగుదెంచి యం దమ్మణవాళమహామునుల నాశ్రయింప నమ్మహాత్ముండు వారిరువుర నాత్మీయ కరుణాకటాక్ష వీక్షణంబుల నీక్షించి యాయిరువురికిం బంచసంస్కారార్థపంచకాకారత్రయ చరమపర్వనిష్ఠాది సమస్తహితంబు లొనరించె నందగ్రజుండైన యళహియ మణవాళప్పెరుమాళ్నైనారుడు దేశికుండు సర్వకాలంబులయం దమ్మహాత్మునకు సకలవిధ కైంకర్యంబు లొనర్చుచుఁ దత్పాదచ్ఛాయాపన్నుండై యుండం జూచి మిగుల హర్షించి యవ్వరవరమునీంద్రుం డతని దర్శనస్థాపకునిగా ననుగ్రహించె నంతఁ దద్దేశవాసులగు శ్రీవైష్ణవులు తమతమపుత్రుల కద్దివ్యనామం బొనర్చి యాచార్యపాత్రుండగు నద్దేశికేంద్రుని విషయంబుగా. శ్లో॥ అస్మాసువత్సలతయా కృపయాచ భూయః స్వేచ్ఛావతీర్ణమివ సౌమ్యవరం మునీన్ద్రమ్। ఆచార్యపాత్రమభిరామ వరాభి

ధాన మస్మద్గురుం గుణనిధిం గురుమాశ్రయామః॥ అని శ్లోకంబొక్కటి విన్నవించి రంత సౌమ్యజామాతృగురుండును దమకుఁ దిరువవతారస్థలంబగు తిరునగరికి విచ్చేయం దలంచి శ్రీరంగరాజశౌరికడకుం జని యద్దేవదేవునకు మంగళాశాసనం బొనర్చి తత్సన్నిధిం దీర్థశ్రీ శఠకోపాది సన్మానంబుల లభించి యతనిచే ననుజ్ఞాతుండై నిజాశ్రితులతోడఁగూడి శ్రీ కురుకాపురంబునకుం జనుచు స్వాచార్యావతారస్థానంబై కుంతీపుర నామధేయంబగు కొందిహా యను శ్రీగ్రామంబునందు దినత్రయంబు వసియించి మార్గవశోపస్థిత దివ్యదేశంబులందుఁ దత్తద్దివ్యనామంబులు గల భగవద్విగ్రహంబులకు మంగళాశాసనం బొనర్చుచుఁ బరచ్చూరుమార్గంబున వచ్చి తత్తద్గ్రామవాసులందఱు తమ శ్రీపాదపద్మంబు లాశ్రయింప వారికిం బంచసంస్కారాది సకలహితంబు లొనరించి వారినిం గృతార్థులం గావించి యచటినుండి చనుదెంచి శ్రీ తామ్రపర్ణీతీరంబునందు శ్లో॥ వైకుంఠనాథ విజయాసనభూమిపాల దేవేశ పఙ్కజవిలోచన చోళనాట్యాః। నిక్షిప్తచిత్తమకరాయతకర్ణపాశౌ నాథ। నమామి వకుళాభరణేన సార్ధం॥ అనియెడు న్యాయంబునఁ బరమపదంబుచుట్టు కేశవాది చతుర్వింశతి వ్యూహాధిష్ఠిత సాంతానిక దివ్యలోకంబుల పగిదిఁ గమలకర్ణికచుట్టు విలసిల్లుచున్న దళంబులపోలికఁ దిరునగరిం బరివేష్టించి చూపడుచున్న దివ్యదేశంబులంబొడగాంచి యద్దివ్యదేశాధిపతులకు మంగళాశాసనం బాచరించి శ్రీకురుకాపురీ ప్రాంతంబునకుం జని తిరుతామ్రపర్ణియందు శంఖతీర్థోదకంబులయం దవగాహనంబుచేసి శ్రీచూర్ణరేఖాలంకృతంబులగు ధవళ ద్వాదశోర్ధ్వపుండ్రంబులు ధరియించి తత్కాలోచిత భగవచ్ఛాసనంబులఁ జెల్లించి తద్దివ్యదేశవాసులగు శ్రీమహాభాగవతులంద ఱేతెంచి తమ్ము సేవింప వారిం గృపాపాంగనిరీక్షణంబుల నీక్షించి కుశలప్రశ్నం బొనర్చి బహువిధంబుల ననుగ్రహించి వారితోడం గూడి యప్పురీరత్నంబుఁ జొచ్చి యందు శ్రీభాష్యకారుల సేవించి యథామతి వినుతించి యతనిచే ననుగృహీతుండై తదీయాజ్ఞచే వెల్వడి వచ్చి ప్రపన్నజనకూటస్థుండగు శ్రీశఠకోపయోగీంద్రుని భజియించి శ్రీమధురకవి ప్రణీతప్రబంధంబుచేఁ బొగడి శ్రీమధురకవినామాభిరామంబగు తదీయ శ్రీపాదుకాద్వయంబుఁ దలఁదాల్చి తత్తీర్థప్రసాదంబు లుజ్జీవించి తదీయాజ్ఞఁ బడసి శ్రీశైలనాథార్య దివ్యభవనంబునకుం జని యందమ్మహాదేశికున కనవరతారాధనీయుండైన నాయల్ ధల్వనని దివ్యనామంబు గల గోపాలబాలకునకు మంగళాశాసనంబుఁ జేసి యద్దేశికేంద్రుండు ముందు తన కనుగ్రహం బాచరించిన స్థలంబునకు భక్తిపూర్వకంబుగా సాష్టాంగప్రణామం బాచరించి విజమరంబునకుం జనుదెంచి యం దాశ్రి

తులకు భగవద్విషయం బానతిచ్చుచు సుఖంబుగా వసించియున్న సమయంబున నద్దివ్యదేశవాసు లేతెంచి తమ శ్రీపాదంబు లాశ్రయించినవారికి సకలహితోపదేశం బొనరించి యాచార్యహృదయాఖ్య రహస్యరత్నంబున కర్థంబు దెలుపుచుండ నందొక్కచో 'జ్ఞానచతుర్థిగళిరి యివే యానందషష్టిగళుక్కుడయ' మిత్యాది వాక్యార్థంబు యథావస్థితంబుగా నుపస్థితంబు గాకున్న సర్వజ్ఞుండును దేవరాజాపరనామధేయుండు నగు తిరునారాయణ పురత్తాయను దేశికేంద్రునివలన నా వాక్యార్థంబుఁ దెలియం దలంచి నిజపరివారవృతుండై యతని కావాసంబగు తిరునారాయణపురంబునకుం జనుచున్న మార్గమధ్యంబునఁ దాను మనోరథించిన తీర్థంబు తన్నెదుర్కొన్న చందంబున నగ్గురుశిరోమణి తన కెదురేఁగుదెంచిన నతనింగాంచి భక్తిపూర్వకంబుగా సాష్టాంగప్రణామం బాచరించి స్వాగతం బడిగి యతనిచే సమ్మానితుండై తిరునగరి కతనితో మగిడి యేతెంచి యతని సన్నిధి నాచార్యహృదయ తాత్పర్యంబంత యున్నయట్లెఱింగి యథావిధి నతనిం బూజించి శ్లో॥ ఆచార్యహృదయ స్యార్థాస్సకలాయేన దర్శితాః। శ్రీశానదాసమమలం దేవరాజం సమాశ్రయే॥ అని తద్విషయంబుగా నొక్కతనియను విన్నవించె నంత నద్దేవరాజగురుండును శ్రీవకుళభూషణ శ్రీపాదసేవాసంసక్త మానసుండై యద్దివ్యదేశంబునం గొండొకకాలంబు వసియించె నయ్యవసరంబునఁ దదీయవైభవాసహిష్ణులగు వైష్ణవులు కొందఱు కురుకాపురంబునందు దేవరాజగురుం డాచార్యపదంబుఁ జెందెనని యొక నెపంబిడి తదీయగృహస్థిత సమస్త వస్తుజాతంబు సంపత్కుమారుని శ్రీభాండాగారంబునందుఁ జేర్చియున్న సమయంబున నమ్మహాత్ముండు మగిడి యాదవాద్రికేతెంచి యావృత్తాంతంబంతయు విని నవధరించి, శ్లో॥ యస్యానుగ్రహమిచ్ఛామి తస్యవిత్తం హరామ్యహమ్॥ అనియెడు న్యాయంబున శ్రీయాదవాద్రీశుండు మదనుగ్రహైక తత్పరుండై యస్మదీయంబగు సమస్త వస్తుజాతంబుఁ బరిగ్రహించె నదియునుంగాక, శ్లో॥ భార్యాపుత్రశ్చ దాసశ్చత్రయ ఏతే వశేస్మృతాః। యత్తే సమధిగచ్ఛన్తి యస్యైతే తస్యతద్ధనమ్॥ అనియెడు ధర్మశాస్త్రక్రమంబునఁ దద్దాస్యైకపటుండనైన వీని ధనంబు తయు గ్రహింప నర్హత ముండని తన యాత్మలోఁ దలంచి ప్రహృష్టాంతరంగుండై తన కాచార్యప్రసాద లబ్ధంబైన జ్ఞానప్పిరాననియెడు గృహార్చా విగ్రహమాత్రంబు పరిగ్రహించి తక్కిన వస్తువులన్నియు దేవదేవునకర్పించి పరమవిరక్తుండై శ్రీరంగనాథునకు భక్తాంఘ్రిరేణు మునీంద్రునిపగిది శ్రీవిల్లిపుత్తూరియందు నెలకొన్న శ్రియఃపతికి భట్టనాథయోగీంద్రునికరణి శ్రీయాదవాద్రీశున కశ్రాంతంబు తిరుమాల్య కైంకర్యంబు సలుపుచుండె నంత.

సీ. సుందరజామాతృ•సూరి సంశ్రితులతోఁ, గురుకాపురమున స•ద్గోష్ఠి నున్న
నభిజనవిత్త వి•ద్యామదాంధులు కొంద, ఱాసురప్రకృతు ల•య్యవసరమున
నత్యసూయాపరు•లై వచ్చి యొక్కనాఁ, డరుణోదయము వేళ • నతనిమరము
దహియింప నది రామ•దామోదరాధిష్ఠి,త ప్రవర్షణపర్వ•తంబు ముందు

తే. మగధరాజభటార్పితా•మంద ఘోర, పావకజ్వాలలను గాలు•వగిది నున్న
లేచి యాయూరివా రెల్లఁ•జూచి రనుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. అంత శ్రీకాంతోప•యంతృయోగీంద్రుఁ డ,స్మత్ప్రభావంబేమి•మనుజులెఱుఁగ
రెల్లవారికి నేఁడు • తెల్లముగా నాదు,మూర్తి గాన్పించి యీ•ముగ్ధజనుల
నస్మదార్యపదాంబు•జాసక్తచిత్తులఁ, జేసి కృతార్థులఁ • జేయుదు నని
జలనిర్గమద్వార•సరణి సూక్ష్మమహియై, వెలువడి తొల్లి యా•వలువనాసఁ

తే. బూర్వ మంగుష్ఠమాత్రుఁడై • పొడమి యచల,దేహుఁడైనట్టి యాది వ•రాహశౌరి
కరణి వర్ధిల్లి మిన్నెల్లఁ • గప్పెననుచు, వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

సీ. మహనీయ నిజఫణా•మండల మణదీప్తి, గగనభాగంబెల్లఁ • గప్పి మెఱయ
వేయిమోముల రెండు•వేలజిహ్వలఁబొల్చు, పూత్కారవాతాళి•భువన మలమఁ
బాదాదిమూర్ధాంత • బహుభూషణప్రభల్, సకలమోహధ్వాంత • శాంతిసలుపఁ
గైలాసగిరిఁచుట్టుఁ • గ్రమ్ముకాలాబ్దము, గతి నీలచేలము • కటి వెలుంగ

తే. బ్రహ్మరుద్రాదిదేవతల్•ప్రస్తుతింపఁ, దనదుశేషస్వరూపముఁ • దాల్ప నతనిఁ
జూచి వినుతించి రాయూరి•సుజనులనుచు, వాదిభీకరగురుఁడనె•మోద మలర.

సీ. సూరిసంస్తుతులచే•సుప్రసన్నాత్ముఁడై, మణవాళముని తొంటి•మాడ్కినుండి
మరము దహించు స•మస్తజంతువులను, సీత యారాక్షస•స్త్రీలకొలఁదిఁ
గరుణించి కొన్నాళ్ల • గడచినపిమ్మటఁ, దత్పుత్రు లేతెంచి • తనపదాంబు
జము లాశ్రయించిన•సర్వాపరాధముల్, క్షమియించి పంచసం•స్కారముఖ్య

తే. హితము లొనరించి వారల•నిండ్లకనిపి, సారతమమైనశాస్త్రము•సాత్త్వికులకుఁ
జెప్పుచును నిత్యమచట వ•సించె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. అయ్యవసరంబున నమ్మణవాళయోగీంద్రుని మహావైభవం బాకర్ణించి యద్దేశాధిపతి యేతెంచి యమ్మహాత్ముని పదాబ్జంబు లాశ్రయింప నయ్యార్యవర్యుం డమ్మహీజానికి సకలహితంబులొనరించి శరకోపదాసుండని దాస్యనామంబొసంగిన నతండు కృతార్థుండై తిరునగరియందు శ్రీశరకోపయోగీంద్రునికిం బ్రీతిగా కాలమేఘాఖ్య

మంటపంబొక్కటిఁ గట్టించి తిరువీధులన్నియు సమస్తప్రాణి సందర్శనీయంబులుగాఁ దీర్పించి పుష్పోద్యానవనంబులకుం బ్రవర్ధకంబులగు నీటికాల్వలేర్పఱచి యళహియమణవాళ నామాభిరామంబై మనోజ్ఞరత్నఖచితంబైన కమనీయకాంచన మంటపంబు సృష్టించి సర్వకాలంబులందు సకలవిధకైంకర్యంబు లాచరించుచుండె నంత నక్కాంతోపయంతృదేశికేంద్రుం డప్పరాంకుశమునీంద్రుని వీడ్కొని కురంగనగరాపరాభిధానంబగు తిరుక్కురుంగుడికిం జని యం దొక్కచోట నివసించియున్న సమయంబున తిరువేంగడముడయానను బ్రాహ్మణుం డొక్కఁడేతెంచి యగ్గురువరునిం గాంచి భక్తిపూర్వకంబుగా సాష్టాంగప్రణామం బాచరించి మహాత్మా యెల్లనిలింపులయందు హరిహరి హిరణ్యగర్భులయెడఁ బ్రాధాన్యంబు సమంబుగా శాస్త్రసిద్ధంబై యుండ నీ ముప్వురియందు నారాయణుం డధికుండని మీరనుటకుం గారణ-బెయ్యది యని యడుగ నయ్యుగ్రజన్ము నుద్దేశించి, శ్లో॥ బ్రహ్మాద్యాస్సకలాదేవా మనుష్యాః పశవస్తథా। విష్ణోర్మాయా మహావర్త మోహాన్ధతమసావృతాః॥ ఆ బ్రహ్మస్తమ్బపర్యన్తా జగదన్తర్వ్యవస్థితాః। ప్రాణినః కర్మజనిత సంసారవశవర్తినః॥ అనియెడు న్యాయంబున బ్రహ్మాది సకలదేవతలును మనుష్యపశుప్రభృతులైన చేతనులును విష్ణుమాయామహావర్త మోహాంధ తిమిరంబుచే నావృతులై యుండెదరు మఱియు నా బ్రహ్మస్తంబ పర్యంతంబు జగదంతర్వర్తులగు సమస్తప్రాణులు స్వకీయసుకృత దుష్కృతకర్మజనితంబైన సంసారంబునకు వశవర్తులై యుందురట్టి సంసారులయందు ముఖ్యులగు బ్రహ్మరుద్రులలో శ్లో॥ తతఃక్రోధపరీతేన సంరక్తనయనేనచ। వామాఙ్గుష్ఠనఖాగ్రేణ ఛిన్నం తస్యశిరోమయా॥ ఇత్యాదిన్యాయంబుచే నొకనిమిత్తవశంబునం గ్రోధపరీతుండును సంరక్తనయనుండునగు రుద్రునిచే బ్రహ్మతల గొట్టంబడియె, శ్లో॥ యస్మాదనపరాధస్య శిరశ్ఛిన్నం త్వయామమ। తస్మాచ్ఛాప సమాయుక్తో కపాలిత్వం భవిష్యసి॥ ఇత్యాది పురాణోక్తక్రమంబుగా రుద్రుండు బ్రహ్మచే శపియింపంబడి కపాలగ్రస్తకరతలుండై పరమపతివ్రతాపాణిపల్లవార్పిత భైక్ష్యస్పర్శంబుచేఁ గాని నాకీ బ్రహ్మశాపరూపమహాపాపంబు నివర్తింపనేరదని తనయాత్మలోఁ దలంచి భిక్షార్థంబు ముజ్జగంబులఁ దిరుగుచుఁ గరకపాలమోక్షంబు గానక దుఃఖింపుచుఁ బరిశ్రాంతుండై వారాణసీక్షేత్రంబుఁ జెంద నందు భక్తత్రాణపరాయణుండైన, నారాయణుండు లక్ష్మీసమేతుండై యొక గృహమేథిచందంబున స్వదృష్టిగోచరుండైన యంతఁ దదీయనిరవధిక నిరతిశయ తేజోమండలంబు వీక్షించి యితండు మదనుగ్రహార్థం బిచ్చట సాన్నిధ్యంబొనర్చిన శ్రీమన్నారాయణుండు గాని గృహస్థమా

త్రుండగు దని శివుండు తనతలంపులో నిశ్చయించి, శ్లో॥ తదా నారాయణ శ్శ్రీ మాన్ మయాభిక్షాం ప్రయాచితః విష్ణుప్రసాదా త్సుశ్రోణి కపాలం తత్సహ స్రధాస్ఫుటితం బహుధాయాతం స్వప్నలబ్ధధనం యధా॥ ఇత్యాది పురాణోక్త క్రమ బుగా నప్పురాణదంపతుల భైక్ష్యం బర్థింపఁ బరమకారుణికుం డగు నారా యణుం డతనికి శ్రీదేవిచేత భైక్ష్యంబుఁ బెట్టింపఁ దదీయపాణిపల్లవార్పితభైక్ష్య స్పర్శంబుచేనక్కపాలంబుచేయువిధంబుల వ్రక్కలై పుడమింబడి స్వప్నలబ్ధధనం బుకరణిం జూపడదయ్యె నంత గిరీశుండు శాపవినిర్ముక్తుండై మిగుల సంతోషించి పరతత్త్వప్రకాశకంబులగు వేదాంతవాక్యంబులం బ్రస్తుతింపనద్దేవదేవుఁడు ప్రస న్నుండై యతనికి స్వకీయంబైన శ్రీరామషడక్షరీమంత్రం బుపదేశించి మహాత్మా నీవీమంత్రంబు సర్వకాలంబు జపించుచు నిజదేవీసహాయుండ వై యిచ్చట నిత్య నివాసం బొనరించి యీ క్షేత్రంబునఁ బంచక్రోశమధ్యంబునం దెట్టిపాపిష్ఠిప్రాణి కైననంత్యకాలంబునం దీమంత్రం బుపదేశించితివేని వాని కేను ముక్తి నొసంగె దనని వరం బిచ్చెఁగాన యిప్పటికైన నాక్షేత్రంబునఁ బ్రాణంబులు విడుచుచేత నులు శివకృతరామమంత్రోపదేశార్థంబుగా దక్షిణకర్ణంబు పై కెత్తుకొని పం చత్వంబుఁ జెందుదురు కావున "కాశీ మరణాన్ముక్తిః" అనియెడు న్యాయంబున నస్మదన్వయులు దక్కఁ దక్కినవారు కొందఱు మరణార్థంబాక్షేత్రంబున కరుగు దురీ వృత్తాంతంబుస్కాందోత్తరభాగంబునఁ బ్రయాగమాహాత్మ్యంబునందును శ్రీరామసంహితయందును బ్రసిద్ధంబు కావున భగవత్పరతంత్రు లగు బ్రహ్మరుద్రు లతనికంటె నధికులు గా రది గాన వా రిరువురికి వేదాపహారగురుపాతకదై త్యపీడాద్యాపద్విమోచనుండును సకలశ్రుతిస్మృతీతిహాసపురాణాది సరస్వతీఘోషు ష్యమాణజగజ్జన్మాదికారణత్వసర్వాంతర్యామిత్వసర్వనియంతృత్వసర్వరక్షకత్వస ర్వశక్తిత్వసర్వజ్ఞత్వసత్యసంకల్పత్వశుద్ధసత్త్వమయత్వనిఖిలహేయ ప్రత్యనీకకల్యా ణైకతానత్వనిరుపాధిక నిఖిలవిధబంధుత్వనిస్సమాభ్యధికత్వాది శుభలక్షణోపలక్షి తుండు నగు శ్రీమన్నారాయణుండు సర్వాధికుం డని యస్మదీయసిద్ధాంతంబు స ర్వలోక ప్రసిద్ధంబని యగ్గురుశిఖామణి యానతీయ నాకర్ణించియద్దరాదేవుండా చార్యసత్తమా యిట్లు నిస్సమాభ్యధికుండైన శ్రీమన్నారాయణుండు శ్రీరామ చంద్రుం డై యవతరించి రావణవధజనిత బ్రహ్మహత్యారూపమహాపాపనిబర్హణా ర్థంబు శివలింగప్రతిష్ఠాపనంబొనర్చి శివలింగ ప్రతిష్ఠాతయనిపురాణ ప్రసిద్ధంబైన నామధేయం బేల లభించెనని యడుగ నమ్మణవాళమహామునీంద్రుం డావిప్రునిం జూచి వత్సా యీవృత్తాంతంబు శ్రీరామాయణప్రోక్తంబు గాదు పురాణాంత

రోక్తం బంటివేని వేదవేద్యుండు దశరథాత్మజుం డై యవతరింప, శ్లో॥ వాల్మీకి రభవ ద్బ్రహ్మా వాణీ వా క్తస్యరూపిణీ॥ అనియెడుపురాణవచన ప్రామాణ్యంబున బ్రహ్మాంశసంభూతుం డగుప్రాచేతసునివలన వేదరూపసరస్వతి శ్రీమద్రామాయణాభిధానేతిహాసరత్నం బయ్యె నది గాన యితిహాసశ్రేష్ఠం బైన శ్రీమద్రామాయణంబుకంటె నతిదుర్బలంబై నయొక తామసపురాణంబునందుఁ బ్రతిపాదిత బైన యర్థంబు సాత్త్వికులకాదరణీయంబుగా దదియునుంగాక విశ్రవః ప్రజాపతివలనఁ బ్రదోషకాలంబునం గైకసియనురాక్షసియందు జనియించినవాఁడుగాన రావణుండు కేవలరాక్షసుండును, శ్లో॥ దయాసత్యంచ శౌచంచ రాక్షసానాం నవిద్యతే॥ అనియెడు న్యాయంబున దయాసత్యశౌచవిహీనుండును దేవర్షిసాధుజనాత్యంత కంటకుండును బరదారసహస్రాపహర్తయును గావునఁ బరమాతతాయియు, శ్లో॥ ఆతతాయిన మాయాన్తం హన్యాదేవావిచారయన్। నాతతాయివధేదోషో హన్తుర్భవతి కశ్చన॥ అనియెడుమను వచనంబుచే రణరంగంబునఁ దన్నెదుర్కొని యనేక విధంబులం బోరుచున్న మహాపాతకి యైనయారాక్షసుని సర్వలోక హితార్థంబుగాఁ దెగటార్చిన సర్వస్వామియైన రఘుస్వామికి బ్రహ్మహత్యారూప దోషం బెట్లు పాటిల్లు నదియునుం గాక శాపోపహతు లగుస్వకీయద్వారపాలకులు స్వశత్రుభూతరావణకుంభకర్ణాఖ్యరాక్షసు లై రి గాన వారల కారాక్షసదేహంబులం బాపుట యనుగ్రహంబు గాని విగ్రహంబు గా దట్లాయెనేని లింగ స్థాపనంబునకుం బ్రయోజనం బేమంటివేని యర్జునవ్యాజంబున సుయోధనాది దుష్టక్షత్రియుల నందఱం దునుమాడి గోబ్రాహ్మణాదిహితంబునకై ధర్మరాజునుం బ్రతిష్ఠించి శ్రీకృష్ణుండు యుధిష్ఠిర ప్రతిష్ఠాత యని ప్రసిద్ధంబైననామ బు లభించినమాడ్కి శ్రీరామభద్రుండును త్రిభువనహితచికీర్షచేఁ దై త్రిలోక్యపావన స్వకీయసేతురూపమహాతీర్థపరిపాలనార్థంబు తత్సమీపం బునందుస్వభక్తుండైన శివునిం బ్రతిష్ఠ సేయించి యానామంబుఁ జెందిననతని పరత్వంబునకేమికొఱంత సంభవించు నదియునుం గాక, శ్లో॥ త్వం హి రుద్రమహాబాహో మోహనార్థం సురద్విషామ్।పాషణ్డాచరితం ధర్మం కురుష్వ సురసత్తమ॥ తామసాని పురాణాని కథయస్వచ సాంప్రతమ్। మోహనానిచశాస్త్రాణికురుష్వచ మహామతే॥ ఇత్యాదిపాద్మవచనోక్తక్రమంబుగా భగవదాజ్ఞచే వృషధ్వజుండు నిజయోగ శక్తి వైభవంబున దుర్వాసోగౌతమకాత్యాయనాది మహర్షుల నావేశించి శైవశాక్త గాణాపత్యకాపాలపాశుపత పాషండాద్యనేక దుర్మత ప్రతిపాదక పురాణశాస్త్రంబులం గల్పించి తానును భస్మోద్ధూళన రుద్రాక్షవలయకపాలాస్థిమాలికా

ధారణశ్మశానవాస దిగ్వసనాద్యమంగళాచార బులం గైకొనిదేవానీయాజ్ఞ చేజం భరముచి ప్రముఖాసురమోహనార్థంబుగా నిట్టి తామసవేషంబు ధరించిన నాకు జగన్మాన్యత్వం బెట్లు గలుగనేర్చు నని విన్నవింప, శ్లో॥ అహమ ప్యవతారేషు త్వాం చ రుద్ర మహాబల।తామసానాం మోహనార్థం పూజయామి యుగేయుగే। మతమేతదవష్టభ్య పత ఏవ నసంశయః ॥ ఇత్యాదిపాద్మపురాణోక్తక్రమం బుగా సర్వలోకరక్షకుం డైన పుండరీకాక్షుం డప్పార్వతీ పతినింజూచి మహాత్మా మదాజ్ఞచే నిట్లొనర్చిననీకుం బ్రసన్నుండ నైతిఁ దామసజనమోహనార్థంబు రామకృష్ణాద్యవతారంబులయందు ని న్నర్చించెద మదీయరామషడక్షరీ మంత్రజపంబుచేఁ బరమపవిత్రం బగుభవదీయహృత్కమలకర్ణికాపీఠ మధ్యంబున నిత్యసాన్నిధ్యం బొనర్చెదఁగాన యిట్టి తామసవేషధారణంబునకు సంశయింపవలదు నిన్ను నే నారాధించితినేని, శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః । స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే॥ అనియెడు న్యాయంబున శ్లో॥ మోక్షప్రదాతా సర్వేషాం విష్ణురేవ నసంశయః ॥ ఇత్యాదివిశేష ప్రమాణంబులను విశ్వసించి మదేకపరాయణు లగుముముక్షుచేతనులు దక్కఁ దక్కిన జనులందఱు మత్ప్రదర్శితమార్గం బనువర్తించి నిన్నతిభక్తితో భజింపుచుందు రని వరం బిచ్చెనుఁ గావేరీతీరంబున గాయత్రీశిలా సమీపంబునందు స్వసంకల్పకల్పితవహ్ని పుష్కరిణ్యుత్తరదక్షిణతటంబులయందు శ్రీరామలక్ష్మణాభిధానుం డగునారాయణుఁడు శివలింగస్థాపనంబుఁ జేసి యర్చించె నత్తీర్థ సమీపంబునందు బ్రహ్మహత్యానివృత్తికై ప్రాయశ్చిత్తం బేల యొనర్చుకొనియె నంటివేని, శ్లో॥ నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన। నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి॥ యదిహ్యహం నవర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః॥ మమవర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః ॥ ఉత్సీదేయు రిమేలోకా నకుర్యాం కర్మచే దహమ్। సఙ్కరస్య చ కర్తాస్యా ముపహన్యా మిమాః ప్రజాః॥ సక్తాః కర్మణ్యవిద్వాం సో యథా కుర్వన్తి భారత। కుర్యాద్విద్వాం స్తథా సక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్॥ అనియెడు గీతాన్యాయంబుచే భగవంతుం డైనను స్వరూపజ్ఞానసంపన్ను లగుభాగవతులైనను లోకసంగ్రహార్థంబు కర్మం బాచరింపవలయుఁ గాన రాజర్షిశ్రేష్ఠుండైన దశరథచక్రవర్తికిం బుత్రుండై యవతరించిన శ్రీరామభద్రుం డగస్త్యాదిబ్రహ్మర్షిప్రార్థనచే హిరణ్మయగోగర్భ ప్రవేశమహాదానాదు లొనరించి దేవేంద్రునకుం దొల్లి వృత్రబ్రహ్మహత్యానివృత్తికారణంబైన గాయత్రీశిలయందు జగజ్జన్మాదికారణ నిత్యనిరవధిక నిరతిశయనిస్సమాభ్యధికస్వశక్

యదివ్య తేజోవిశేషోపాసన ప్రతిపాదకంబైన గాయత్రీమంత్రంబులోకశిక్షార్థంబు
జపించెఁ గావున, "పవిత్రాణాం పవిత్రం యో మఙ్గళానాంచ మఙ్గళమ్ ।
దైవతం దేవతానాంచ" ఇత్యాదిపంచమ వేదోక్తక్రమంబుగాఁ బరమపావన పర
మకల్యాణదివ్యమంగళవిగ్రహుండై పరమదైవతం బైన శ్రీరఘుస్వామికి దో
షంబు లేదు మఱియును. శ్లో॥ నమాం కర్మాణి లింపన్తి నమే కర్మఫలే స్పృ
హా॥అనియెడు గీతోక్తక్రమంబుగా నిస్స్పృహుండు నకర్మవశ్యుండు నగు శ్రీరా
మాభిధానవిష్ణువును ఫలకాము లైన యింద్రాదులు వృత్రాదిబ్రహ్మహత్యా ఫ
లంబుఁ జెందినట్లు రావణహననదోషంబుఁ జెందఁజాలదు—అదియునుంగాక ॥
పార్వతీ, శ్లో॥ మన్నాథ జగతాంనాథ సర్వజ్ఞత్వం మహేశ్వర । త్వత్ప్రసాదా న్మ
యాజ్ఞాతం ధర్మశాస్త్ర మనుత్తమమ్॥ ప్రాయశ్చిత్తంతు పాపానాం శ్రుతం సర్వ
మశేషతః। బ్రహ్మహత్యాదిపాపానాం నిష్కృతిం వక్తుమర్హసి॥రుద్రః శ్లో॥శృణు
దేవి ప్రవక్ష్యామి గుహ్యాద్గుహ్యతరం మహత్ । సనత్కుమార విఘ్నేశసంవాదం
పాపనాశనమ్॥ ఉపవిష్టం గణాధ్యక్ష మేకాన్తే ప్రణిపత్య సః । సనత్కుమారః
పప్రచ్ఛ సర్వధర్మవిదాం వరమ్॥సనత్కుమారః,శ్లో॥భగవన్ సర్వధర్మజ్ఞ సర్వవి
ఘ్నవినాశక । ద్విజహత్యాహరం ధర్మం వక్తు మర్హసి మే ప్రభో ॥ భవద్వినాస్య
ధర్మస్య వక్తానాస్తి జగత్త్రయే॥వినాయకః, శ్లో॥ సాధుపృష్టం త్వయా బ్రహ్మన్
సర్వలోకోపకారకమ్ । మయాచిరకృతం కర్మస్మారితం భవతానఘ పురాహంగజ
రూపేణ జాతః పర్వతసన్నిభః। మత్తో వృక్షాన్ సముత్పాట్య మునిహింసాం
సమారభమ్॥ తదామయా మునిగణా హింసితా బహవో బలాత్ । హాహా
కారో మహా నాసీ ద్బ్రాహ్మణానాం సమంతతః॥ తదాహత్యాసహస్రేణ వేష్టితః
పతితో స్మ్యహమ్।నిస్సంజ్ఞం మృతతుల్యం మా మైక్షద్దేవః పితా మమ॥ ఆరా
ధ్యజగతా మీశంరామం సర్వహృదిస్థితం । ప్రత్యక్షమకరోద్దేవైరావృతోరఘు
నన్దనః॥ తదా ప్రోవాచ భగవాన్ శ్రీరామః పితరం మమ । ప్రసన్నోస్మి మహా
దేవ కిం మాం ప్రార్థయసే ప్రభో॥ దాస్యామి యదభీష్టంతే త్రిషులోకేషు దుర్ల
భమ్॥ఈశ్వరః, శ్లో॥ ద్విజహత్యాసమావిద్ధ మమాపుత్ర మిమం ప్రభో । నిష్పా
పం కురు దేవేశ యద్యస్తి మయి తే దయా ॥ తథేత్యుక్త్వా తదాతేన దయయా
వీక్షితోస్మ్యహమ్ । తత్క్షణాల్లబ్ధచైతన్యో నిర్మలజ్ఞానబృంహితః ॥ బహుభిర్గద్యప
ద్యైశ్చ స్తుత్వాతం ప్రణతోస్మ్యహమ్। తదా మామాహ సప్రీత శ్శ్రీరామ
శ్శరణాగతమ్॥ శ్రీరామఉవాచ ॥ ద్విజహత్యాసహస్రస్య ప్రాయశ్చిత్తం వదామితే।
యన్మన్నామసహస్రం వాహత్యాకోటిభిదుత్తమమ్ ॥ ఇతి మహ్యందదౌరామః

స్వస్యనామసహస్రకమ్ । తస్యగ్రహణమాత్రేణ నిష్పాపో౽స్మి తథైవహ॥ త దాది సర్వదేవానాం పూజ్యోస్మి మునిసత్తమ। త్వమప్యేతదధీయానో రాఘ వస్యమహాత్మనః । నామ్నాంసహస్రంలోకేషు ప్రఖ్యాపయ మహామతే ॥ అని తత్త్వ సంగ్రహరామాయణంబునఁ గిష్కింధాకాండంబునందుఁ జతుర్దసర్గోక్త శ్రీరామ సహస్రనామస్తోత్రంబునం దుపోద్ఘాతోక్తప్రకారంబుగా గిరికన్యనిజభర్తనుం జూచి దేవానీయనుగ్రహంబుచే ధర్మశాస్త్రంబులు దెలిసితి బ్రహ్మహత్యాదిమహా పాతకప్రాయశ్చిత్తంబు దెలుపుమని ప్రార్థింప రుద్రుం డద్దేవిం జూచి సనత్కు మారవిఘ్నేశసంవాదం బొక్కటి గల దిది నీప్రశ్నంబునకుఁ బ్రత్యుత్తరంబగు నది వివరించెద నాకర్ణింపుము ముం దొక్కనాఁడు సనత్కుమారుండు దేతెంచి వినాయకునింగాంచి నమస్కరించి బ్రహ్మహత్యాప్రాయశ్చిత్తరూపధర్మం బుపదే శింపుమని యడుగ నగ్గజాననుం డాసనత్కుమారు నుద్దేశించి మహాత్మా భవ త్కృతసమీచీన ప్రశ్నశ్రవణంబుచే మదాచరితం బైనచిరంతనదుష్కర్మంబొ క్కటి యిప్పు డస్మదీయస్మృతివిషయం బయ్యె దాని వర్ణించెద సావధానచిత్తుం డవై వినుము తొల్లిమదీయజననీజనకు లిరువురువిలాసార్థంబుగఁ గరేణుకరీంద్ర స్వరూపంబులు ధరియించి యొకపుణ్యారణ్యంబునందుఁ గ్రీడించుచున్నవారివలన మహాగిరిమాత్రప్రమాణమత్తమాతంగశరీరుండనై జనియించి మహోద్రేకంబున మేఁ దెలియంగక నిరపరాధు లైనమునీంద్రులఁ బెక్కండ్రవధించి బ్రహ్మహత్యా సహస్రపరివేష్టితుండనై సంజ్ఞాహీనుండనై మృతప్రాయుండనై పడియున్న నెఱింగి యస్మద్గురుం డైనహరుండు సర్వాంతర్యామియు సర్వలోకేశ్వరుండు నగు శ్రీరామభద్రు నతిభక్తినర్చింప నద్దేవాదిదేవుండు సుప్రసన్నుండై సర్వగీర్వాణ పరివృతుం డై మజ్జనకునకు దృష్టిగోచరుండై దేవా నీ విట్లు నన్నారాధించుటం జేసి మిగుల సంతోషించితి నెట్టిదుర్లభవరంబైన నీ కొసంగెద నీ యభీష్టం బు వేఁడుమని యానతీయ విని సంతసించి మజ్జనకుండు మహాత్మా నాయెడ నీకుదయ గలదేని పార్వతీపుత్రుం డైన యిబ్బాలకునిం బాపవిముక్తునిం జేసి బ్రదికింపుమని ప్రార్థింప నప్పరమ పురుషుం డు స్వకీయకరుణాకటాక్షవీక్షణంబుచే నన్నుం గటా క్షింప సంజ్ఞ లభించి తదనుగ్రహప్రాప్తవిశుద్ధబుద్ధిపరిబృంహితుండనై యనేక గద్యపద్యంబుల నతనిం గొనియాడి తత్పాదారవిందంబులయందు సాష్టాంగ ప్రణామం బాచరింప శరణాగతుండ నైననన్నుం గరుణించి యద్దేవదేవుండు వత్సా బ్రహ్మహత్యాప్రాయశ్చిత్తాత్మక బును మఱియు నానాహత్యాకోటివిఘటకంబు నగుమన్నామసహస్రంబు నీ కుపదేశించెదనని చెప్పి యట్లనుగ్రహింపఁ దత్ప్రి

సాదలబ్ధతదీయసహస్రనామపారాయణంబుచే విముక్త నిఖిలమహాపాతకుండనై సర్వదేవర్షి పూజ్యుండనైతి నానామసహస్రంబు నీవధికరించి త్రిభువనంబులం బ్రవర్తింపంజేయుమని వక్కాణించెం కావున నోదేవీనీవును మంత్రాత్మకంబైన శ్రీరామనామసహస్రంబునం దొక్కొకనామంబు సర్వపాపవినాశనంబునై సహస్రనామపారాయణ ఫలప్రద బును సర్వైశ్వర్యప్రదాయకంబును గాన సర్వకాలంబులయందు శ్రీరామనామంబు జపించుచుండుము మఱియు నెంతవట్టు శ్రీరామనామపంచాననధ్వని వినంబడదు తావత్కాలపర్యంతంబు మహాపాతకమత్తగజంబుల మదోద్రేకంబు చెల్లు రామనామశ్రవణానంతరకాలంబున నక్కలుషంబు లన్నియు నిర్మూలంబు లగునని రుద్రుండు తన దేవికిం దెలిపెం గావున నెవ్వాఁడక్కైలాసపతికిం దత్పుత్రునకు బ్రహ్మహత్యానివర్తకుం డయ్యె. శ్లో॥ సేతుం దృష్ట్వావి ముచ్యన్తే బ్రహ్మహత్యాదిపాతకైః॥ అని సేతుమాహాత్మ్యోక్తక్రమంబుగ యదీయసేతుబంధంబు నిరీక్షించి మానవులు బ్రహ్మహత్యాదిపాపవినిర్ముక్తులగుదురు. శ్లో॥ రామనామ తవ జాతు జపన్తః పామరాశ్చ వితరన్తి భవాబ్ధిమ్॥ అనియెడు న్యాయంబునం బామరులైనను యదీయరామనామంబొకసారియైన జపించి సంసారసముద్రంబు దాఁటుదురు. శ్లో॥ మనోదగ్ధం పరస్త్రీభిర్జిహ్వా దగ్ధాపరాన్నతః। హస్తౌ పరిగ్రహా ద్దగ్ధౌ కుత స్సిద్ధి ర్వరాంగనే॥ అని సిద్ధనాగార్జున తంత్రోక్తక్రమంబుగాఁ బరస్త్రీపరాన్నపరద్రవ్య ప్రతిగ్రహాగ్నిచేఁగరణత్రయంబు దగ్ధం బయ్యెఁ గావున. శ్లో॥ రామేతి వర్ణద్వయ మాదరేణ సదాస్మరన్ముక్తిము పైతి జన్తుః। కలౌ యుగే కల్మషమానసానా మన్యత్ర ధర్మే ఖలు నాధికారః॥ అనియెడు న్యాయంబునం గలికాలంబునందుఁ గలుష చిత్తులగు మనుష్యుల కితర ధర్మానుష్ఠానయోగ్యత చాలదు గాన యెవ్వానిదివ్యనామం బెల్లప్పుడనుసంధించు చేతనుండు నిర్వాణంబుఁజెందునట్టి పరమపావన పరమకల్యాణప్రాకృత దివ్యమంగళ విగ్రహుండగు శ్రీరామభద్రునకుం బాపంబుగలదని ప్రతిపించు పాపాత్ముల పాపంబులకుఁ బారంబులేదు వారి జన్మంబులు నిరూపణీయంబులని యగ్గురువరుండాన తియ్యనాకర్ణించి యార్యసత్తమా "హరిగ్ంహరం తమ్॥" ఇత్యాదిశ్రుతివాక్యంబు "హరింనృసింహం హరన్తం సంహరన్తం విశ్వేశానం రుద్రం దేవా అనునయన్తి" అని యన్వయించిన శరభరూపియగు రుద్రునిచే నరకేసరికిఁ బరాజయంబు సుస్పష్టం బగుఁ గావున విష్ణున కాధిక్యంబెటు సంభవించునని యావిప్రుం డడుగ నతనిం జూచి గురువరుండు వత్సా, శ్లో॥ ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్। బిభేత్యల్పశ్రుతాద్వేదో మామయం ప్రత

రిష్యతి॥ అనియెడు న్యాయంబున వేదంబు వీఁడునన్ను వంచింపఁగలండని యల్ప శ్రుతునివలన భయపడుఁ గాన యితిహాసపురాణాదులచే వేదార్థంబు నిర్ణయింప వలయుఁ గానశంకరమధ్వ విద్యారణ్య భగవద్రామానుజ పరాంకుశ భట్టార్యాదు లైక కంఠ్యంబుగాఁ దమ తమ భాష్యాదిగ్రంథంబులయందు ప్రమాణంబుగాఁ బరి గ్రహించిన, శ్లో॥ బ్రహ్మాణ మిన్ద్రం రుద్రంచ యమం వరుణమేవచ। నిగృహ్య హరతే యస్మా త్తస్మాద్ధ రిరిహోచ్యతే॥ అనియెడు పురాణవచనో క్తక్రమంబుగా బ్రహ్మేంద్ర రుద్ర యమవరుణాదిదేవతలను నిగ్రహించితనకువశవర్తులఁగాఁజేయు కతన హరినామంబు విష్ణునకు యౌగికరూఢంబై చెల్లునట్టి నృసింహునకు శరభ రూపియగు రుద్రునిచేఁ బరాభవంబెట్లు సంభవింప నేర్చు నదియునుం గాక యీశ్రుతికి నీవుచెప్పిన యర్థంబు బహుప్రమాణవిరుద్ధంబది యెట్లంటివేని విశద పఱచెద సావధానచిత్తుండవై వినుము తొల్లి శ్రీమదఖిల నిగమాగమనిగదిత నిజ కథాసుధాప్రవాహావగాహన ప్రక్షాళితా శేషదోషసాధుసమూహ పరిత్రాణ పరాయ ణుండును బరమపావన పరమకల్యాణ విష్ణువాసుదేవనారాయణాద్యభిధానుండునుజగ ద్విత్రాసకసుత్రామామిత్ర పక్షవిక్షేపణ దక్షాక్షీణ వైష్ణవతేజః కాయాదరావ బోధిత తసాధువాక్ప్రతిష్ఠాపనాంగీకృతా సురవరాయసన భాస్తంభ విజృంభిత స్వావిర్భా వుండును దప్తచామీకర ప్రచండతరనయనవిస్ఫురచ్ఛవిచ్ఛటా కేసరవిసరవిజృంభి తాననవికటదంష్ట్రా రాళభయంకరకరవాలచలదుగ్రజిహ్వా స్తబ్ధోర్ధ్వకర్ణ మహా ద్భుత గిరికందరవ్యావృత్తాస్యనాసా విరాజితా భ్రంలిహ మహోన్నత కాయుండును బృధుపీవరాదీర్ఘ గ్రీవోరు మధ్యస్థలతను మధ్యవిరాజితుండును రాకాసుధాకరకర నికరగౌరతనూరుహవ్యాప్తి సముద్దీప్తుండును భక్తరక్షణప్రాప్తుండును బ్రతిభట విఘటన పటురటచ్చక్రాబ్జ గదాఖడ్గము సలహలకులిశాద్యనేక దివ్యాయుధ విభ్రాజ ద్భుజాభిరాముండును నుద్దామదైత్యస్తోమభీమ తమ నిజధామభూముండును మహార్హ మణిఘృణిప్రభాసిత దశదిశావకాశానర్ఘ కోటీరగ్రైవేయక మకరకుండలహార కేయూ రాంగద కౌస్తుభకటకోర్మికా కాంచిదామోదర బంధనపీతాంబర శింజానమంజుమంజీ రాద్యపరిమితదివ్యభూషణభూషితుండును నిరంతరచింతనతపస్సమాధినిష్ఠాగరిష్ఠ సనకాదిమునిజనమనఃకమలకర్ణికాసమారాధిత సుందరచరణారవిందుండును మహా నందకందళిత హృదయారవిందుండును జరాచరసంతాపనసంతత ప్రతాపోద్దీపిత హిరణ్యకశిపు రక్షోవక్షఃకవాటోత్పాటనాసంకుచితకుంచికాయమాన నఖరశిఖరుండు నగు శ్రీనృసింహదేవుండు దైత్యహనన సమయసముద్భూత స్వకీయకోపానలాఖిల జ్వాలాకలాప పరివృతుండై ప్రళయానలంబుపగిదిఁ జరాచరదుర్నిరీక్ష్యుండై బ్రహ్మా

రుద్రేంద్రాది దేవతలచే బహువిధంబులం బ్రార్థింపంబడియును బ్రసన్నుండు గాక యున్న యవసరంబున వేల్పులు కొందఱు తదీయాపూర్వాత్యద్భుత దురంత దుస్సహతేజః ప్రపంచ ప్రతాపంబున కోర్వంజాలక మూఢచేతనులై యొక నిరర్థకోపాయం బాలోచించి రుద్రునిం జూచి దేవా సింహంబునకు శరభంబు విరోధి నీవు తద్రూపంబు ధరియించి యీ నరకేసరి నెదుర్కొంటివేని యితఁడు శాంతుం డగునని ప్రార్థింప, శ్లో॥ తతః క్షణేన శరభో నాదపూరితదిఙ్ముఖః। అభ్యాశమగమ ద్విష్ణో ర్వ్యోనదద్భైరవస్వనమ్॥ తమభ్యాశగతం దృష్ట్వా నృసింహ శ్శరభం రుషా। జఘాన నిశితై రుగ్రైర్నఖై రేవ వరాయుధైః॥ నిహతే శరభే తస్మిన్ రౌద్రే మధు నిషూదనమ్। తుష్టువుః పుణ్డరీకాక్షం దేవా దేవర్షయ స్తథా॥ అని యాగ్నేయపురాణంబునఁ జత్వారింశదధ్యాయోక్త క్రమంబుగా శంభుండు శరభరూపంబు ధరించి నిజనాదపూరితదిఙ్ముఖుండై యద్దేవదేవుని డాసి ఘోరతరనాదం బొనర్చినం జూచి శ్రీనృసింహదేవుండును నిశితనిజనఖాగ్ర వరాయుధంబులచే నతనిం జీఱివైచిన దేవతలు దేవఋషు లాశ్చర్యంబుఁ జెంది యద్దేవాదిదేవునిం బ్రస్తుతించిరి మఱియును, శ్లో॥ తౌ యుధ్యమానౌ తు చిరం వేగేన బలవత్తరౌ। న్యశమం జగ్మతు ర్దేవౌ నృసింహ శరభాకృతీ॥ తతః క్రుద్ధో మహాకాయో నృసింహో భీమ విక్రమః। సహస్రకరజానత్ర తస్యాత్రేన్యవేశయత్॥ పతితం భీమ మత్యుగ్రం గతాసుం ద్రష్టు మాగతాః। ఋషయో దేవగన్ధర్వా యత్ర శేతే హతో హరః॥ తం దృష్ట్వా పరమం జగ్ము ర్విస్మయం తే దివౌకసః। ప్రశశం సు స్తథా కర్మ నారసింహ స్యచాద్భుతమ్॥ ఇత్యాది పాద్మపురాణోక్తక్రమంబుగా నృసింహ నఖాగ్రంబులచేఁ జీల్పఁబడి గతప్రాణుండై పడియున్న శరభరూపియగు హరునింజూచి మిగుల విస్మయంబుఁ జెంది మహర్షి దేవగంధర్వాదు లంద ఱద్దేవాదిదేవుని యత్యద్భుత పరాక్రమం బనేకవిధంబులం బ్రశంసించి రదియునుంగాక, శ్లో॥ హంతు మభ్యాగతం రౌద్రం శరభం నరకేసరీ। నఖై ర్విదారయామాస హిరణ్యకశిపుం యథా॥ ఇత్యాది గారుడపురాణంబునం దష్టనవతితమాధ్యాయోక్త క్రమంబుగాఁ దన్ను వధింప నెదుర్కొన్న శరభరూపియగు రుద్రునింజూచి నృసింహుండు నిజనిశిత నఖాగ్రంబులచే నతని హిరణ్యకశిపునిమాడ్కిం జీల్చివైచె. మఱియును, శ్లో॥ నికృత్తదాహూరు రావజ్రకల్పముఖై ర్నఖైః। మేరుపృష్ఠే నృసింహేన శరభ స్సహసాపతత్॥ ఇత్యాది నృసింహపురాణోక్తక్రమంబుగా నరకేసరిచే వజ్రకల్ప ముఖంబు గు నిశితనఖంబులచే శరభరూపుండగు శివుండు విదారితబాహూరు శిరస్కుండై [illegible]ండై మేరుపృష్ఠంబునం బడియె నదియునుం గాక,

క. శ్లో॥ తత స్స్ఫురన్త మాదాయ రుద్రం శరభరూపిణమ్। విదదారనఖై స్తీక్ష్ణై ర్హిరణ్యకశిపుంయథా॥ ఇత్యాదివామనపురాణోక్త క్రమంబుగా నృసింహుండు నిజనిశితనఖాగ్రంబులచే హిరణ్యకశిపుని పగిది శరభరూపి యగురుద్రునిం జీల్చివైచె మఱియును. శ్లో॥ నమస్తేస్తునృసింహాయలక్ష్మీ స్తుతిజితకృతే। యత్క్రోధాగ్నౌపురారౌద్ర శ్శరభ శ్శలభాయితః॥ ఇత్యాదిపురాణాంతరోక్తక్రమంబుగా నెవ్వనిక్రోధాగ్నియందు రౌద్రం బగుశరభరూపంబు శలభంబయ్యెనట్టి నరకేసరికిం జేమోడ్చెద నని దేవర్షి సంఘంబు గొనియాడె నదియునుం గాక. శ్లో॥ బ్రహ్మవర్మశిరఃపట్ట దిక్పాలోర్ధ్వాజ్ఞభూషణః। ద్వాదశార్క-శిరోదామరుద్రవేష్టైకనూపురః॥ అనన్తాయుధదోర్దణ్డో నృసింహో వీరభద్రజిత్॥ ఇత్యాదిపాద్మపురాణంబున ముఖ్యసహస్రనామోక్తక్రమంబుగా నృసింహుండు వీరభద్రుని జయించె నదియునుం గాక, శ్లో॥ నచక్షుపఞ్చాననమష్టపాదంపక్షద్వయాఢ్యం ఘననీలగాత్రమ్। స్ఫురన్మహాతీవ్రసహస్రహస్తం సహస్రశస్త్రం శరభస్వరూపమ్॥ కరా దాదాయప్రత్యేకం ముఖచఞ్చుపుటద్వయమ్। వ్యదారయన్నృసింహస్తం హిరణ్యకశిపుం యథా॥ తస్యకఙ్కా-శకేనైవనగాకారేణనారద। జయకేతుం దణ్డముచ్చం చకారనరకేసరీ॥ ఇత్యాద్యుత్తరకూర్మపురాణోక్తక్రమంబుగాఁ జంచుపంచక యుక్తపంచాననుండునుఁ నష్టపాదుండును బక్షద్వయాఢ్యుండును నీలమేఘనిభాకారుండునుస్ఫురన్మహాతీ వ్రసహస్రశస్త్రధరసహస్రహస్తుండు నగుశరభాత్మకరుద్రునిం జూచి నిజకరాగ్రంబులచే వేఱువేఱ యతని ముఖచంచుపుటంబులు గ్రహించి హిరణ్యకశిపునిపోలికనితనిం జీల్చివైచి నృసింహదేవుండు పర్వతాకారం బైన తదీయకంకాళాస్థిచే మహోన్నతంబైనజయధ్వజదండంబు సేయించె నిట్లనేకపురాణంబులయందు నరకేసరిచేశరభస్వరూపుండైన రుద్రుండు హతుం డయ్యెనని యుదాహరింపఁబడెఁగాన "హరిగ్ం హరం తమ్" ఇత్యాదితైత్తిరీయోపనిషద్వాక్యంబునకు నీవు చెప్పినయర్థంబయుక్తంబు రెండుమూఁడుశైవపురాణంబులయందు శరభుచే నృసింహునకుఁ బరాజయంబుని రూపింపఁబడ్డ దంటివేవి బహుసాత్త్వికపురాణవిరుద్ధంబు లైనయాతామసపురాణంబులు ముముక్షువుల కనాదరణీయంబులు కావున న్రాశ్రుతికి "విశ్వేశానం రుద్రహరంతం హరిం నృసింహం దేవా అనునయంతి'' అని యీయర్థంబు పురాణ మహర్షులచే నిర్ణీతంబయ్యె 'బహూనా మనుగ్రహో న్యాయః' అని యీయర్థంబనేక సాత్త్వికపురాణానుగృహీతంబు గావున ముముక్షుజనుల కుపాదేయత

మజగాప్రనశ్రీనృసింహునిచే శరభరాజమం బసంకుచితఘంటాఘోషాయమానం బైనసిద్ధాంతం బని విశ్వసింపుమని యగ్గురువచనం డానతియ్యా విని యద్ధరామరుం డట్లు పరాత్పరుం డగుహరి నెల్లవా రేల యర్చింప నొల్ల రనిన, శ్లో॥ కలౌ జగత్పతిం విష్ణుం సర్వస్రష్టార మీశ్వరమ్। నార్చయిష్యన్తి మైత్రేయపాషణ్డోపహతా జనాః॥ అంతశ్శాక్తం బహిశ్శైవం సభామధ్యేతు వైష్ణవమ్। కలౌ కష్టాః ప్రవర్తన్తే పాషణ్డోపహతా జనాః॥ అనున్యాయంబునం బాషండోపహతచిత్తు లా శ్రీహరి నర్చింపనొల్లరని యగ్గురుండననతండు పాషండు లెట్టివారనిమఱియునడుగ నాద్విజు నుద్దేశించి॥ పార్వతీ-శ్లో॥ పాషణ్డినాన్తు సల్లాపం వర్జయే దితియత్త్వయా। ఉక్తం మమేహ భగవన్ గర్హితావతి గర్హితమ్॥ తే యాదృశా మమాచక్ష్వతైర్లిఙ్గైశ్చిహ్నితా భువి॥ రుద్రః॥ అన్యం దేవం పరత్వేన వదన్త్య జ్ఞానమోహితాః। నారాయణా జ్జగన్నాథా త్తేవై పాషణ్డినస్స్మృతాః। ద్వేష్టారో విష్ణుభక్తానాం యేచావైష్ణవసంశ్రయాః। పాషణ్డిభిశ్చ సంయుక్తా స్తేవై పాషణ్డినస్స్మృతాః। కపాలభస్మాస్థిధరా యేహ్యవైకలిఙ్గినః। ఋతేవనస్థాన్ యేచాన్యే జటావల్కలధారిణః॥ అవైదికక్రియోపేతా స్తేవై పాషణ్డినస్స్మృతాః। శఙ్ఖచక్రోర్ధ్వపుణ్డ్రాదిచిహ్నైః ప్రియతమైర్హరేః। గర్హితాయేద్విజాదేవి తేవై పాషణ్డిన స్స్మృతాః॥ సత్త్వశాస్త్రోక్తమాచారం యస్తు నాచరతే ద్విజః। సపాషండీతివిజ్ఞేయ స్సర్వలోకేషు గర్హితః॥ స్వతంత్రః కురుతే యస్తు కర్మవేదోదితం మహత్। వినావై భగవత్ప్రీత్యా సవై పాషణ్డ ఉచ్యతే॥ సమస్తయజ్ఞభోక్తార మవిదిత్వాచ్యుతం హరిమ్। ఉద్దేశ్య దేవతామైవ జుహోతిచ దదాతి యః। స పాషండీతి విజ్ఞేయ స్స్వతంత్రో వాపి కర్మసు। యస్తు నారాయణం బ్రహ్మరుద్రాద్యై ర్దైవతైః సహ। సమత్వేనైవ వక్ష్యేత స పాషణ్డీ భవే ద్యథా। అవస్థాత్రితయే యస్తు మనోవాక్కాయకర్మభిః। వాసుదేవం నజానాతి సపాషణ్డీ భవేద్ద్విజః। కిమత్ర బహునోక్తేన బ్రాహ్మణా యేప్యవైష్ణవాః। తేవై పాషణ్డినోజ్ఞేయా స్సర్వలోకేషు గర్హితాః। అవైష్ణవాస్తు యేవిప్రాశ్చణ్డాలా దధమాస్స్మృతాః। తేషాం సంభాషణ స్సర్శాన్ ప్రమాదేనాపి వర్జయేత్। ఏవం శ్రుత్వా తు సాదేవీ శంకరేణాపి భాషితమ్। విస్మయం పరమం గత్వాపునః ప్రోవాచ భామినీ। భగవన్పరమం గుహ్యం పృచ్ఛామి సురసత్తమ। మయిప్రీత్యా సమాచక్ష్వ సంశయో వర్తతే భృశమ్। కపాలచర్మభస్మాస్థిధారణం శ్రుతిగర్హితమ్। యత్త్వయాధార్యతే దేవగర్హితం కేన హేతునా। స్త్రీచాపల్యేన దేవేశ పృచ్ఛామి త్వాం మహామతే। మహానుభావకథితం నకర్తవ్యం మహేశ్వర,

త్వయాచరిత మిత్యేతద్వక్తవ్యం నక్వచి త్ప్రభో। అకర్తవ్య మపి ప్రశ్నం వక్తు మర్హాసి మేప్రభో। ఇతి దేవ్యాహరః పృష్టో రహస్యే జనవర్జితే। ఉవాచ పరమం గుహ్యం యద్యదాచరణం స్వకమ్॥ రుద్రః॥ శృణు దేవి ప్రవక్ష్యామి యద్గుహ్యం పరమాద్భుతమ్। నవక్తవ్యం త్వయా కచ్చిజ్జనేషుకథితం మయా। అపృథక్త్వ శరీరత్వాద్వక్ష్యామి తవ సువ్రతే। నముచ్యాద్యా మహాదైత్యాః పురా స్వాయంభువాన్తరే। మహాబలపరీవారా మహావీర్యా మహౌజసః। సత్త్వకర్మరతా శ్శుద్ధా స్సర్వపాపవివర్జితాః। త్రయీధర్మయుతా స్సర్వే భగవద్భక్తిసంయుతాః। నిర్జిత్య సకలాన్ దేవా నవ్యాహతపరాక్రమాః। పదాని తేషాం జగృహుర్బల వీర్యమదాన్వితాః తతో దేవగణా స్సర్వే భగ్నా ఇంద్రపురోగమాః। విష్ణో స్సమీప మాగమ్య భయార్తాశ్శరణం గతాః। తమాహుర్దేవదేవేశం ప్రణిపత్య జనార్దనమ్॥ దేవాః ॥ దేవదేవ మహాదైత్యై ర్జమ్భాసురపురోగమైః । స్వంస్వం స్థానం పరిత్యజ్య భవన్తం శరణం గతాః॥ అజేయా స్సర్వదేవానాం తపో నిర్ధూతకల్మషాః । త్వమేవ తాన్ మహాదైత్యాన్ జేతు మర్హాసి కేశవ ॥ ఇత్యాకర్ణ్య హరి ర్వాక్యం దేవానామభయార్థినామ్ । తానవధ్యా న్విదిత్వా మా ముావాచ పురుషోత్తమః॥ శ్రీభగవాన్॥ త్వంచ రుద్ర మహాబాహో మోహనార్థం సురద్విషామ్। పాషణ్డాచరితం ధర్మం కురుష్వ సురసత్తమ॥ తామసాని పురాణాని కథయస్వచ సాంప్రతమ్ । మోహనానిచ శాస్త్రాణి కురుష్వచ మహామతే॥ మయి భక్తాశ్చ యేవిప్రాభవిష్యన్తి మహర్షయః। త్వచ్ఛక్త్యాతా న్సమావిశ్య కథయస్వచ తామసాన్॥ కాణాదం గౌతమం శక్తి ముపమన్యుంచ జైమినిమ్। కపిలంచైవ దుర్వాసం మృకండుంచ బృహస్పతిమ్॥ భార్గవం జామదగ్నించ దశైతాం-శ్చ మహామునీన్।తవశక్త్యా సమావిశ్య కురుష్వ జగతోహితమ్॥ త్వచ్ఛక్త్యావిష్టా నివిష్టాస్తే తమసోద్రిక్తయా భృశమ్। తామసాస్తే భవిష్యన్తి క్షణాదేవ నసంశయః॥ కథయన్త్యేవతేవిప్రా స్తామసానిజగత్త్రయే । పురాణాని చ శాస్త్రాణి త్వత్పరత్వేన బృంహితాః॥ కపాలభస్మ చర్మాస్థిచిహ్నా న్యమరపూజిత । త్వమేవ ధృత్వాతాన్ లోకాన్ మోహయస్వజగత్త్రయే ॥ తథా పాశుపతం శాస్త్రం త్వమేవ కురు సువ్రత । కఙ్కాళశైవపాషణ్డమహాశైవాదిభేదతః॥ అవలమ్బ్యమతం సమ్యగ్వేద బాహ్యాద్విజోత్తమాః । భస్మాస్థిధారకా స్సర్వేభవేయు స్తేనసంశయః॥ త్వాం పరత్వేనవక్ష్యన్తి సర్వశాస్త్రేషు తామసాః । తేషాం మతమధిష్ఠాయ సర్వేదైత్యా స్సదానవాః॥ భవేయుస్తే మద్విముఖాః క్షణాదేవ నసంశయః। అహమప్యవతారేషు త్వాంచ రుద్ర మహాబల॥ తామసానాం మోహనార్థం పూజయామి

యుగేయుగే। మత మేత దవష్టభ్య పత న్త్యేవ నసంశయః॥ త చ్ఛ్రుత్వాహంయ థోక్తం తం దేవదేవేనభామిని । సముద్విగ్నమనా దీనో బభూవాత్ర వరాననే॥ నమస్కృత్వా పరం దేవ మ్బ్రువం పరమేశ్వరమ్ । త్వయాజ్ఞప్త మిదం దేవక రోమి యది భూతలే॥ ఆత్మనాశాయ మే నాథ భవిష్యతినసంశయః । నశక్యంహి మయాకర్తు మేతత్కృత్యం మయాధునా॥ త్వదాజ్ఞాచ నహోల్లంఘ్యా వద కిం చోత్తరం మమ । ఏవ ముక్తోమయా దేవ స్సమాభాష్యచ మాం పునః॥ నాత్మ నాశాయ తే వత్స భవేదిత్యాహ మాం హరిః । దేవతానాం హితార్థాయ కురుష్వ వచనం మమ॥ తవాప్యుజ్జీవనోపాయం కథయామి సురోత్తమ। నిత్యం జప న్నహోరాత్రమ్మమనామసహస్రకమ్ ॥ హృదయే మాం సదా ధ్యాయన్ జప న్మన్త్రమ్మమావ్యయమ్। షడక్షర మ్మహామన్త్రం తారకబ్రహ్మముచ్యతే। యే భజన్తిహి మాం భక్త్యా తేషాం ముక్తి ర్నసంశయః । ఇన్దీవరదళశ్యామం పద్మ పత్రాయతేక్షణమ్॥ శఙ్ఖాసిశార్ఙ్గాబ్జధరం సర్వాభరణభూషితమ్ । పీతవస్త్రం చ తుర్బాహుం జానకీప్రియవల్లభమ్॥ శ్రీరామాయ నమశ్చైతదుచ్చార్యంమన్త్ర ముత్తమమ్। సర్వదుఃఖహరం హ్యేత త్పాపినామపిముక్తిదమ్॥ ఇమం మన్త్రం జప న్నిత్య మ్మఙ్గళ స్త్వంభవిష్యసి । భస్మాస్థిచర్మభిర్యత్తు సంభూతమశుచిత్వయి॥ మఙ్గళం తద్భవే ద్వత్స మన్మన్త్రోచ్చారణాచ్ఛుభాత్ । త్వచ్చిత్తాన్నా పయాస్యామి సదా సర్వసురోత్తమ ॥ మదన్యదేవతాభక్తి ర్నజాయేత తపోధన । మనసైవాచర హృదిమాం నాథం పురుషోత్తమమ్॥ మదాజ్ఞాం కురు మత్ప్రీత్యా సర్వమేతచ్ఛు భంతవ।ఇతి సందిశ్యమాం దేవో విససర్జమరుద్గణాన్।విసృష్టాస్తేన తేదేవా ని వృత్తా మాం సమాయయుః । తతో మాం ప్రార్థయామాసుర్దేవా ఇంద్ర పురోగ మాః॥ శీఘ్రంకురు హితం దేవ యథోక్తం హరిణాధునా। దేవతానాంహితార్థా యవృత్తిం పాషణ్డినాం భువి॥ కపాలచర్మభస్మాస్థిధారణం తత్కృతం మయా।తా మసానిపురాణాని యథోక్తం విష్ణునామమ॥ పాషణ్డశైవశాస్త్రాణియథోక్తం కృ తవానహమ్ । మచ్ఛక్త్యావై సమావిశ్యగౌతమాదిద్విజానపి॥ వేదబాహ్యాని శా స్త్రాణిసమ్యగుక్తం మయానఘే।ఇమం మతమవష్టభ్య మాం దృష్ట్వా సర్వరాక్ష సాః॥ భగవద్విముఖా స్సర్వే బభూవు స్తమసావృతాః। భస్మాస్థిధారణం కృత్వామ హోగ్రతమసావృతాః॥ మామేవ పూజయామాసురాత్మస్వచ్ఛందనాదిభిః । మత్తో వరప్రదానాని లబ్ధ్వాబలమదోద్ధతాః ॥ అత్యన్తవిషయాసక్తాః కామక్రోధమదా న్వితాః। సత్త్వహీనాస్తు నిర్వీర్యా జితాదేవగణైస్తథా॥ సర్వకర్మపరిభ్రష్టాః కాలేయా న్త్యధమాంగతిమ్। యే మే మత మవష్టభ్య చరన్తి పృథివీతలే॥ తే

సర్వే ధర్మరహితాయాస్యంతి నిరయం సదా।ఏవం దేవహితార్థాయ వృత్తింవేదవిగర్హితామ్॥ విష్ణోరాజ్ఞాం పురస్కృత్య కృతం భస్మాస్థిధారణమ్ । బాహ్యాచిహ్న మిదం దేవి మోహనార్థాయవైద్విషామ్ । అన్తరే హృదయే నిత్యం ధ్యాత్వాదేవం జనార్దనమ్ । జపేవై సతతం మంత్రం తారకబ్రహ్మవాచకమ్॥ సహస్రనామసదృశం విష్ణో ర్నారాయణస్యతు। షడక్షరం మహామన్త్రం రఘూణాం కులవర్ధనమ్॥ సర్వదై వసదాదేవి సదానందసుధాప్లుతమ్। సుఖమాత్యన్తికం బ్రాహ్మ్య మశ్నామి సతతం శుభే॥ ఏతత్తే సర్వమాఖ్యాతం త్వయాపృష్టం శుభాననే। కిమన్యచ్ఛ్రోతు మిచ్ఛాస్తితత్ప్రీతా పరిపృచ్ఛ మామ్॥ పార్వతీ॥ తామసానిచ శాస్త్రాణి సమాచక్ష్వ మమానఘ । సంప్రోక్తానీహ యైర్విప్రై ర్భగవద్భక్తివర్జితైః॥ తేషాం నామాని క్రమశో మమాచక్ష్వ సురేశ్వర॥ రుద్రః॥ శృణు దేవి ప్రవక్ష్యామి తామసాని యథాక్రమాత్ । తేషాంశ్రవణమాత్రేణ పాతిత్యం జ్ఞానినా మపి॥ ప్రథమం హిమయాప్రోక్తంశైవం పాశుపతాదికమ్। మచ్ఛక్త్యా వేశితైర్విప్రైస్సంప్రోక్తాని తతః పరమ్। కాణాదేనతు సంప్రోక్తం శాస్త్రం వైశేషికం మహత్ । గౌతమేన తథాన్యాయం సాంఖ్యేన కపిలేనవై॥ ధిషణేన తథా ప్రోక్తం చార్వాకమతిగర్హితమ్। దైత్యానాం నాశనార్థాయ విష్ణునా బుద్ధరూపిణా॥ బౌద్ధశాస్త్ర మసత్ప్రోక్తం నగ్ననీలపటాదికమ్ । మాయావాదమసచ్ఛాస్త్రం ప్రచ్ఛన్నం బౌద్ధ ముచ్యతే॥మయైన కథితం దేవి కలౌబ్రాహ్మణరూపిణా। అపార్థంశ్రుతివాక్యానాం దర్శయఞ్లోకగర్హితమ్॥ కర్మస్వరూపత్యాజ్యం య దత్రవై ప్రతిపాద్య తే।బ్రహ్మణః పరమం రూపం నిర్గుణం వక్ష్యతే మయా॥ సర్వస్య జగతోప్యత్ర మోహనార్థం కలౌ యుగే। వేదార్థవ న్మహాశాస్త్రమ్మాయావాద మవైదికమ్॥ మయైన వక్ష్యతే దేవి అసతాం నాశకారణాత్। ద్విజన్మనా జైమినినా వేదశాస్త్ర మపార్థతః ॥ నిరీశ్వరేణ వాదేన కృతం శాస్త్రం మహత్తరమ్।శాస్త్రాణీమాని గిరిజే తామసాని నిబోధమే ॥ ఇత్యాది పద్మపురాణోక్తక్రమంబుగా హైమవతి తనపతినిం జూచి వేవా యత్యంతగర్హితంబగు పాషండసల్లాపబు వర్జింపుమని చెప్పితి రాపాషండు లెట్టివారు వారిచిహ్నంబు లెట్టివని యడుగ రుద్రుండు దద్దేవి నుద్దేశించి యోకళ్యాణీ యెవ్వరేని యజ్ఞానమోహితులై సర్వజగదేకనాథుం డగునారాయణునికంటె నితరదేవత లుత్కృష్టు లని చెప్పుదురు వారును విష్ణుభక్తులం జూచి ద్వేషించువారును వైష్ణవవ్యతిరిక్తుల నాశ్రయించువారును బాషండులతో సాంగత్యం బొనర్చువారును గపాలభస్మాస్థిధరులును వైదికచిహ్నంబులు లేనివారును వానప్రస్థులు దక్క జటావల్కం

బు లెవరు ధరియింతురు వారును నవైదికసంవత్సరయుక్తులైనవారును భగవం తునకుం బ్రియతమంబు లైనశంఖచక్రోర్ధ్వపుండ్రాదిలాంఛనంబులు లేనిబ్రా హ్మణులును సాత్త్వికశాస్త్రోక్తసదాచారం బాచరింపనియత్యంతగర్హితద్విజు లును భగవత్ప్రీత్యర్థంబు సేయక కేవలస్వాతంత్ర్యంబు వహించి మహత్తరంబు లగువేదోదితకర్మంబు లెవ్వ రొనరింతురు వారును స్వవశీకృతబ్రహ్మరుద్రేంద్రాది దేవుం డగునచ్యుతుని సర్వయజ్ఞభోక్తనుగా నెఱుంగక కర్మంబులయందు స్వ తంత్రులై తత్తదుద్దేశ్యదేవతలకే యాహుతు లొసంగువారును శ్రీమన్నారా యణాఖ్యం బైనపరబ్రహ్మంబును బ్రహ్మరుద్రేంద్రాదిదేవతలతో సమానంబుగా నెవ్వరు భాషింతురు వారును నెవ్వ రవస్థాత్రయంబునందు మనోవాక్కాయక ర్మంబులచే శ్రీవాసుదేవునిఁ దెలియంజాలరు వారును నింక వేయుమాట లేటికి విష్ణుభక్తులు గానిబ్రాహ్మణులును సర్వలోకగర్హితు లగుపాషండులు భగవద్భక్తి లేనిబ్రాహ్మణు లధమాధములు ప్రమాదవశంబున నైన వారితోడి సంభాషణం బును దత్సందర్శనాదికంబును ముముక్షుచేతనుల కత్యంతనిషిద్ధం బనిశంకరుండు వాక్రువ్వ నాకర్ణించి శర్వాణి యత్యంతవిస్మయంబుఁ జెంది స్వప్రాణనాథుం డగుభూతనాథు నుద్దేశించి దేవా భవదుక్తపాషండలక్షణంబులు విని మదీయ హృదయంబు సంశయగ్రస్తంబయ్యె నొకపరమరహస్యం బడిగెద నాయెడ నీకుం గలప్రీతిచే నారహస్యార్థంబు నాకుం దెలుపుమా గుహ్యం బెయ్యది యంటివేని యవధరింపుము శ్రుతిగర్హితం బగుకపాలచర్మభస్మాస్థిధారణంబు నీ వొనర్చుట కుం గారణం బేమి స్త్రీచాపల్యంబుచే ని న్నడిగెద నని రహస్యస్థలంబున స్వకీయ ప్రేయసిచేఁ బ్రశ్నంబు సేయంబడి యద్దేవుం డద్దేవి నుద్దేశించి యోదేవీ నాకు నీ వర్ధశరీరం బగుటంజేసి నీకీపరమరహస్యంబుఁ దెలిపెద నెవ్వరికీయర్థం బెఱిం గింపఁదగదు తొల్లి స్వాయంభువమన్వంతరంబునందు నముచిజంభాదిదైత్యేంద్రు లందఱు మహత్తరతేజోబలవీర్యసమన్వితులై పరమభయంకరచతురంగవాహి నీసహితులై సాత్త్వికకర్మనిరతులై సర్వపాపవివర్జితులై వైదికకర్మాసక్తచిత్తులై భగవద్భక్తిపరాయణులై సమస్తదేవతల జయించి బలవీర్యమదసమన్వితులై తత్తద్దేవతాస్థానంబు లన్నియు స్వవశంబులుగాఁ బరిగ్రహించిన వేల్పులందఱు నిజస్థానంబులు విడిచి విష్ణుసన్నిధికిం జని భయార్తులై తదీయపదారవిందంబులు శరణొంది దేవా జంభనముచిప్రముఖదానవులచేఁ బరాజితుల మై యస్మదీయ స్థానంబుల విడిచి మాకుం బరమగతి వగునిన్ను శరణొందితిమి తపోనిర్ధూతపాత కులై మా కజేయు లగునద్దైతేయుల నీవ జయింపఁదగుదు వని ప్రార్థింప నభ

యార్థు లగువారినార్తుల విని యార్తత్రాణపరాయణుం డైననారాయణుండు సత్కర్మనిరతులును స్వభక్తులు నగువారు తన కవధ్యు లని తనతలంపులోఁ దలంచి నన్నుం బిలిచి సురసత్తమా దేవశత్రుసమ్మోహనార్థంబుగాఁ బాషండాచరితం బగుధర్మం బాచరింపుము తామసపురాణంబు లొనరింపుము మోహనశాస్త్రంబులం గల్పింపుము మద్భక్తు లగుకాణాదగౌతమశక్త్యుపమన్యుజైమిని కపిలదుర్వాసోమృకండుబృహస్పతిభార్గవరామమహర్షులఁ బదుగురను నీశక్తిచే నావేశించి యుక్తక్రమంబుగా జగద్ధితం బాచరింపుము భవచ్ఛక్తిసమావిష్టు లగునమ్మహర్షులు తమోగుణోద్రిక్తమనస్కులై భవత్పరత్వోపబృంహితంబు లగుతామసపురాణశాస్త్రంబుల నిర్మింతురు నీవు సర్వగీర్వాణపూజితుండ వయ్యును గపాలభస్మచర్మాస్థిముఖలక్షణంబులు ధరించి జగత్త్రియంబునం గలదైత్యదానవరాక్షసులను దదంశసంభూతు లైనవారిని మోహమొందింపు మదియునుం గాక పాశుపతకంకాళశైవపాషండమహాశైవాదిభేదభిన్నంబు లగుమోహనశాస్త్రంబుల నిర్మింపుము బ్రాహ్మణోత్తములు వేదబాహ్యం బైనయీమతం బవలంబించి భస్మాస్థిధారులై తమోగుణప్రధానులై నీవ పరతత్త్వంబనివక్కాణించుచుండు రిట్టిద్విజశ్రేష్ఠులమతం బవలంబించి సమస్తదైత్యదానవులు నాయెడ విముఖు లగుదురు నేనును రామకృష్ణాద్యవతారంబులయందుఁ దామసజనసమ్మోహనార్థంబుగా ని న్నర్చించెద నిట్లు మత్ప్రదర్శితమార్గం బనుసరించినజను లధోగతులం బడుదు రీయర్థంబునందు సంశయంబు లేదనుచు న న్నుద్దేశించి దేవాదిదేవుం డగు నారాయణుండు పలికినవార్త లేను విని సముద్విగ్నమనస్కుండనై దీనమానసుండనై యతనికిం బ్రణామం బాచరించి దేవా భవదుక్తం బైన యీయర్థం బాచరించితినేని సందియంబు లేకుండ మదీయస్వరూపంబు నశించుఁ గావున నీకృత్యంబు నాకుం జేయ శక్యంబు గాదు భవదీయశాసనం బనుల్లంఘనీయంబు గావున నిర్ణయించి యొకప్రత్యుత్తరంబు నీవ వచింపఁదగును నని నేను బలుక భగవంతుండును సర్వదేవతాహితార్థంబుగా మదీయవచనం బవలంబింపుము నీ కీఁక నుజ్జీవనోపాయంబుఁ జెప్పెద నది యెట్టి దంటివేని నిత్యం బహోరాత్రంబు మదీయరామనామసహస్రంబు జపించుచు యుష్మదీయహృదయకమలకర్ణికాపీఠమధ్యంబున నిందీవరదళశ్యామంబును బద్మపత్త్రాయతేక్షణంబును శంఖచక్రగదాశార్ఙ్గాసిపద్మధరంబును సర్వాభరణభూషితంబును బీతాంబరావృతకటితటంబును గల్పశాఖోపమానసువృత్తాయతసుందర చతుర్భుజంబును జానకీసమాశ్లిష్టవామపార్శ్వంబు నగుమదీయప్రాకృతదివ్యమంగళవిగ్రహంబు

ధ్యానించుచు సర్వదుఃఖహరంబు నుచ్చారణమాత్రంబుచే నెట్టిపాపిష్ఠులకైన ముక్తిదాయకంబును దారకబ్రహ్మాభిధానంబు నగు శ్రీరామాయ నమ యనియెడి యస్మదీయషడక్షరీమంత్రంబు జపించుచు విశుద్ధకల్యాణదేహుండవు గాఁగలవు మఱియు ను సమంగళం బగు భస్మాస్థిచర్మాదిధారణంబును మదీయమంత్రోచ్చారణ ప్రభావంబుచే శుచితమం బగును సకలకాలంబులయందును భవన్మానసంబున దెడఁబాయక వసించెద నాయెడ నీ కనవరతభక్తి యుదయించుఁ గాన మదీయ శాసనం బాచరింపు మెల్లకార్యంబులయందు నీకు శుభం బగు నని యాజ్ఞాపించి వేల్పుల విసర్జించి దేవా భగవదుక్తం బగునర్థంబు వేగ నీ వొనరింపుమని ప్రార్థింప సర్వగీర్వాణహితార్థంబుగాఁ బాషండాభిమతం బగు కపాలచర్మభస్మాస్థిధారణంబుఁ జేసితి భగవదుక్తక్రమంబుగా మదీయయోగశక్తి ప్రభావంబుచే దుర్వాసోగౌతమకాత్యాయనాది బ్రాహ్మణోత్తముల నావేశించి వేదబాహ్యంబులగు శైవపాషండాదితామసశాస్త్రంబుల రచియించితి నిట్టి నన్ను వీక్షించి యీ మతం బవలంబించి దైత్యదానవరాక్షసప్రముఖదుష్టప్రాణులు కేవలతామసులై భస్మచర్మాస్థిధారులై నన్నుద్దేశించి యుగ్రవ్రతంబు లొనరించి బహువిధంబుల నన్నారాధించి నావలనఁ దమయభీష్టంబులం బడసి బలవీర్యమదోద్ధతులై యత్యంత విషయాసక్తులై కామక్రోధాదిదోషదూషితాంతః కరణులై యించుకైన సత్త్వగుణంబు లేక నిర్వీర్యులై దేవగణంబుచే నిర్జితులై యంతిమకాలంబు నంధతమగతింబడి చెడుదురు పుడమియం దెవ్వరేని యీనామతం బాచరింతురు వారు ధర్మరహితులై నిరయంబునం బడుదు రీప్రకారంబుగా భగవదాజ్ఞచే వేదవిగర్హితంబైన యీ మతంబు దేవహితార్థంబుగాఁ బరిగ్రహించితినో దేవీ దేవశత్రుసమ్మోహనార్థంబుగా ధరించిన బాహ్యచిహ్నంబు లివి నాయంతరంగంబునందు దేవదేవుండగు జనార్దనుని ధ్యానించుచు రఘుకులవర్ధనంబును సహస్రనామ ఫలదంబును సంతతాహ్లాదకరంబును దారకబ్రహ్మాఖ్యంబునునగు శ్రీరామషడక్షరీ మంత్రంబు జపించుచు బ్రహ్మాను భవజనిత పరమానంద కందళితహృదయారవిందుడనై యున్నవాఁడ నిట్లు నీ వడిగినయర్థంబు నిస్సంశయంబుగా నీకుందెలియం బలికితినింక నేమి విన నిశ్చయించెద వాయర్థంబు వర్ణించెదనని రుద్రుండు పలుక రుద్రాణీయు భగవచ్ఛక్తి వివర్జితులగుబ్రాహ్మణులచే నిర్మితంబులైనతామస శాస్త్రంబుల నామంబు లన్నియుఁదెలుపుమని యర్థింప జ్ఞానవంతులకైనఁదన్నామ శ్రవణమాత్రంబుచేఁ బాతిత్యంబు సంభవించునట్టి తామస శాస్త్రంబుల వాక్రుచ్చెద నాకర్ణింపుము. తొల్లి శైవపాశుపతాదిమతంబులు కొన్నినేనె నిర్మించితి మదీయ

శక్త్యావిష్టులగు విప్రులచే రచియింపంబడ్డశాస్త్రంబుల తెఱంగెఱింగించెదఁ గాణాద ముని వైశేషిక శాస్త్రంబును గౌతముండు న్యాయశాస్త్రంబును గపిల మహాముని సాంఖ్యంబును ధిషణుం డత్యంత గర్హితంబైన చార్వాకమత బును దైత్యదానవ నాశనార్థంబు బౌద్ధరూపియగు విష్ణు డసత్తమంబైన నగ్నత్వ నీలపటధారణాది ప్రతిపాదక బౌద్ధశాస్త్రంబును నిర్మించిరి కలియుగంబునందొక బ్రాహ్మణరూపంబు ధరియించి ప్రచ్ఛన్న బౌద్ధమాయావాదనామంబులుగల యసచ్ఛాస్త్రంబులనే నిర్మిం చెద నాశాస్త్రంబునం దామ్నాయంబుల కపార్థంబు వర్ణించెద లోకగర్హితంబగు కర్మస్వరూప త్యాగంబు విధించెద జీవేశ్వరుల కైక్యంబుఁ జెప్పెద బ్రహ్మ స్వరూపంబునకు న్నైర్గుణ్యంబు వక్కాణించెద నిట్లు దుష్ట నిగ్రహార్థంబుగా లవై దికంబైన మాయావాదశాస్త్రంబు నేనె వ్రాక్రుచ్చెద మఱియు జైమిని యను బ్రాహ్మణుండు నిరీశ్వరవాదంబను మహత్తరశాస్త్రం బొక్కటినిర్మించునో దేవీ యీ శాస్త్రంబు లన్నియుఁ దామసంబులుగా గ్రహింపుమని రుద్రుం డద్దేవి నుద్దే శించి వచియించెనని గురుండా విప్రునకుం దెలిపి మగిడి యప్పుడ మివిలింపు నుద్దే శించి వత్సా భవిష్యత్పురాణంబునం జతుశ్చత్వారింశ దధ్యాయంబునందును వరాహపురాణంబునం దేక సప్తతి తమాధ్యాయంబునను నాదిత్యపురాణంబునఁ ద్రయస్త్రింశదధ్యాయంబునందును బ్రాజాపత్యస్మృతి యందునువిజ్ఞానేశ్వరీయంబు నందును బరాశరసంహితయందును నారదీయబ్రహ్మాండ గారుడవామనాది పురా ణంబులయందును నీతామసశాస్త్రోత్పత్తి క్రమంబు ప్రపంచితంబై యున్నది. మఱియును. శ్లో॥ విజయం కాణకీణేచ సుప్రభేదంచ వాధుళమ్। మకుటం కామికం చిత్త్యం వీరనామాగమం తథా॥ చన్ద్రజ్ఞానం శర్మయుక్తం సన్థానం పారమేశ్వ రమ్। ప్రోద్గీతం మజ్జువత్ సూక్ష్మం విమలం చిత్ప్రియం తథా॥ నిశ్వాసం లలితం బిమ్బంభవనంతు జగత్థిరమ్। ఛాయం యోగం జ్ఞానపుంజ మనలం త్వసితం తథా॥ అష్టా వింశతిశాస్త్రాణిశైవా నీమాని పార్వతి॥ అనియెడు న్యా యంబున నానురసమ్మోహనార్థంబు హరిహరాదులచే సృజియింపం బడ్డ శాస్త్రం బులు విజయంబును గాణంబును గిణంబును సుప్రభేదంబును వాధుళంబును మకు టంబును గామికంబును జిత్త్యంబును వీరనామాగమంబును జంద్రజ్ఞానంబును శర్మయుక్తంబును సంధానంబును బారమేశ్వరంబును, బ్రోద్గీతంబును మంజు వంతంబును సూక్ష్మంబును విమలంబును జిత్ప్రియంబును నిశ్వాసంబును లలి తంబును బింబంబును భవనంబును జగత్థిరంబును ఛాయంబును యోగంబును జ్ఞానపుంజంబును నవలంబును నసితంబు నని యష్టావింశతి నామంబులు గలిగి

దైత్యదానవ రాక్షసులకడఁ బ్రసిద్ధంబులై యుండుఁ గావున, శ్లో॥ అనన్తపారం బహువేదితవ్యం మల్పశ్చ కాలో బహవశ్చ విఘ్నాః। యత్సారభూతం తదుపాసితవ్యం హంసోయథా క్షీరమివామ్బు మిశ్రమ్॥ అనియెడు న్యాయంబున ననంతంబైన శాస్త్రంబు చిరకాల వేదితవ్యతబు జీవిత కాలం బల్పతమంబు విఘ్నంబుల సంఖ్యాకంబులు కావున రాయంచ నీరయుక్తంబైన క్షీరం బేర్పరించి యనుభవించు కరణి ముముక్షుచేత నుండు భగవత్స్వరూప రూపగుణ విభూతివిస్తార ప్రతిపాదకంబగు సారతమసాత్త్విక శాస్త్రంబెఱింగి పరిగ్రహింపవలెనని గురుం డనవిని యావిప్రుండు దేవా శంఖచక్రోర్ధ్వపుండ్రాది విష్ణులాంఛన ధారణంబునకుం బ్రమాణం బేమి యని యడుగ నయ్యార్యవర్యుండా విప్రు నుద్దేశించి "పవిత్రంతే వితతం బ్రహ్మణస్పత" ఇత్యాది శతపథబ్రాహ్మణ వాక్యంబును "పవిత్రమిత్యగ్నిః, అగ్నిరైవసహస్రారః" ఇత్యాది సామవేద ప్రసిద్ధమై త్రావరుణశాఖోక్తియు "చక్రంబిభర్తివ పుష్రప్రతప్తమ్" ఇత్యాద్యాథర్వణవేదోక్తియు "నిచిక్షేపసువర్ణ మభిద్యమానం మధ్యేబాహు మదధత్సుదర్శనమ్" ఇత్యాది బృహదారణ్య వాక్యంబును "ప్రతేవిష్ణో రజ్జచక్రేపవిత్ర" ఇత్యాది ఋగ్వేద ప్రథిత పుష్కల సంహితోక్తి ప్రపంచంబును "అగ్ని నావైహోతారః-చక్రం పాంచజన్యమ్" ఇత్యాద్యాథర్వణవాక్యజాతంబును "తప్తం చక్రం ద్విభుజేధార్యమ్" ఇత్యాదికాత్యాయ నోపనిషత్సూక్తియుం దప్తచక్రాది భగవల్లాంఛన ధారణంబునకుం బ్రమాణంబుగా గ్రహింపు మింకఁ దత్తదర్థోప బృంహణంబులగు స్మృతీతిహాస పురాణవాక్యంబు లుపన్యసించెద దత్తావధానుండవై వినుము, శ్లో॥ సౌవర్ణం రజతం తామ్రం కాంస్య మాయసమేవచ। చక్రం కృత్వాతు మేధావీ ధారయేత్తద్విచక్షణః॥ ద్వాదశారంతు షట్కోణం వళిత్రయసమన్వితమ్। హరేస్సుదర్శనం నిత్యం ధారయేత్తద్విచక్షణః॥ ఇత్యాది పాంచరాత్రాగమంబునందు శ్రీనారదోక్త క్రమంబుగా సువర్ణరజత తామ్రకాం స్యాయసంబులయందన్యతమ లోహంబుచేఁ జక్రంబుఁ జేయించి మంత్రపూతాగ్నితప్తంబైనయాచక్రం బాచార్య శ్రీహస్తంబుచే మేధావి ధరింపవలయు, శ్లో॥ అగ్నితప్తం పవిత్రంచ ధృత్వావై బాహుమూలయోః॥ త్యక్త్వా యమపురం ఘోరం యాతి విష్ణోః పరంపదమ్॥ ఇత్యాది బ్రహ్మాణ్డోక్త క్రమంబుగా మంత్రాగ్ని తప్తంబులగు సుదర్శనపాంచజన్యంబులు భుజమూలంబుల ధరియించి యమపుర ప్రాయంబులైన యితర లోకంబులఁ బరిత్యజించి ముముక్షు చేతనుండు వైష్ణవంబగు పరమపదంబుఁ జెందు, శ్లో॥ లీలయాపి లిఖేద్యస్తు బాహుమూలే సుదర్శనమ్। కులకోటిం సము

ద్ధృత్య నగచ్ఛేత్పరమాంగతిమ్॥ ఇత్యాదివామన పురాణోక్త క్రమంబుగాఁ నెవ్వఁ డేని విలాసార్ధంబైన భుజమూలంబుల శంఖచక్రంబులు లిఖించిన స్వకులజాతచే తనకోటి నుద్ధరించివాఁ డుత్తమగతికిం జను, శ్లో॥ దారయే ద్విష్ణు భక్తస్తు చక్రం బాహౌతు దక్షిణే। వామేతు శఙ్ఖరాజానం వైష్ణవం పద మాప్నుయాత్॥ అని మార్కండేయ పురాణోక్త క్రమంబుగా విష్ణుభక్తుండైనవాఁడు కుడిభుజంబునఁ జక్రంబును వామభుజంబున శంఖంబును ధరియించి వైష్ణవస్థానంబు లభించు, శ్లో॥ చక్రాదిధారణం పుంసాం పరసంబన్ధసూచనమ్। పాతివ్రత్యనిమిత్తం హివల యాది విభూషణమ్॥ ఇత్యాది కూర్మపురాణోక్త క్రమంబుగా మగువలకు మాంగ ళ్యాదివిభూషణ సముదాయంబుపాతివ్రత్యద్యోతకంబైన గతిఁబురుషులకుం జక్రాది ధారణంబు పరాత్పరుండైన నారాయణుని సంబంధంబునకు సూచకంబగు, శ్లో॥ సుదర్శనేన యస్యాఙ్గం లాఞ్ఛితంతు భవేత్సదా। దేహేతస్య వసేన్నిత్యం శ్రియా యుక్తస్స్వయం హరిః॥ చక్రాయుధాఙ్కితం దృష్ట్వాయ మోఽపిహృదిశఙ్కితః॥ ప్రణామం దూరతః కృత్వా విష్ణుభక్తం విమత్సరమ్॥ చక్రాఙ్కితాయ విప్రాయ విష్ణుభక్తాయ ధీమతే। భిక్షామాత్రప్రదానేన వైష్ణవీం గతి మాప్నుయాత్। వహ్ని తప్తేన చక్రేణ బాహుమూలేతు లాఞ్ఛితాః। సర్వ పాపాని నస్తీర్యభవిష్యన్తీ శ్వరోపమాః॥ అగ్నితప్తేన చక్రేణ బాహుమూలేతు లాంఛితః॥ రౌరవాత్కుల ముద్ధృత్య విష్ణులోకే మహీయతే॥ ఇత్యాది బృహన్నారదీయోక్త క్రమంబుగా నెవ్వానిశరీరంబు సుదర్శనాఖ్యచక్రంబుచే లాంఛితం బగువాని దేహంబునందు లక్ష్మీసమేతుండై విష్ణుండు నిత్యనివాసం బొనర్చుఁ జక్రాయుధాంకితుండై విమత్సరుండైన విష్ణుభక్తునిం జూచి యముండును దనమానసంబున భయంబుఁ జెంది యతనికిం బ్రణామం బాచరించుఁ జక్రాంకితుండును విశుద్ధబుద్ధియు విష్ణు భక్తుండునగు విప్రునకు భిక్షామాత్ర ప్రదానంబుచే గృహమేధి వైష్ణవపదంబుఁ జెందు సమస్తప్రాణులు మంత్రపూతాగ్నితప్తంబగు సుదర్శన చక్రంబుచేబాహు మూలంబులందు లాంఛితులై సర్వపాపాస్పదంబగు సంసారసముద్రంబు దాఁటి శ్రీమన్నారాయణ సాయుజ్యంబుఁ జెందుదురు మంత్ర పూతాగ్నితప్తంబైన చక్రంబుచే భుజమూలంబునందు లాంఛితుండైన వాఁడు రౌరవంబను నరకంబు వలన స్వకులం బుద్ధరించి విష్ణులోకంబునందు సుఖించు, శ్లో॥ పశుపుత్రాదికం సర్వం గృహోపకరణానిచ। అఙ్కయేచ్ఛఙ్ఖ చక్రాభ్యాం నామకుర్యాచ్చ వైష్ణ వమ్॥ స్త్రీ మూసహైవ కర్తవ్యం గృహస్థస్య విధానతః। సంస్కారపంచకం తేన భవేత్స్వధర్మచారిణీ॥ తాపాదిపంచ సంస్కారా గృహస్థస్య యథావిధి। ఆచార్యేణ

ద్వయంకార్యం స్వగృహోక్త విధానతః॥ ఇత్యాది శాండిల్య స్మృత్యుక్త క్రమం బుగా గృహస్థుండు పశుపుత్రాదికంబును గృహోపకరణంబులును శంఖచక్రాంకితంబులుగాఁ జేసి విష్ణు నామాభిధానంబులం జేయవలయు నిజపత్నీ సమేతుండైన గృహమేధికియథా శాస్త్రంబుగా నాచార్యుండు సంస్కారపంచకం బాచరింపవలయు, శ్లో॥ ప్రథమం తాపసంస్కారం పావనం మునిభిస్స్మృతమ్। సర్వాశ్రమేషు వసతాం స్త్రీణాంచ ద్విజసత్తమ॥ అగ్నితప్తేన చక్రేణ బాహుమూలేతు లాంఛితాః। తేయాన్తి పరమం స్థానం పునరావృత్తి వర్జితమ్॥ అగ్నినైవతు సన్తప్తం చక్ర మాదాయ వైష్ణవమ్। దాహయే త్సర్వవర్ణానాం విష్ణుసాలోక్య సిద్ధయే॥ దక్షిణేతు భుజేవిప్రోబి భృయాద్వై సుదర్శనమ్। సవ్యేతు శఙ్ఖం భృయాదితి బ్రహ్మవిదో విదుః॥ చక్రాఙ్కితాయ విప్రాయస్వభోజ్యాన్నం దదాతియః। తదన్నం మేరుతుల్యం స్యా దశ్ను తేదివిదేవవత్॥ ఇత్యాది పారాశర్యస్మృత్యుక్త క్రమంబుగా బ్రహ్మచర్యాద్యాశ్రమస్థులగు పురుషులకును స్త్రీలకును భుజమూలంబులయందుఁ బరమపావనంబైన తప్త చక్రాదిధారణం బవశ్య కర్తవ్యంబు పరమస్థానప్రాపకంబునగుఁ జక్రాంకితుండగు విప్రున కెవ్వఁడేని స్వభోజ్యాన్నం బర్పించు నాయన్నంబు మేరుతుల్యంబగు నతండు దేవలోకంబునందు సకలభోగంబు లనుభవించు, శ్లో॥ అఙ్కయేచ్ఛఙ్ఖ చక్రాద్యై రాత్మనో బాహుమూలయోః। కళత్రవత్సభృత్యేషు పశ్వాదిషు చ సర్వదా॥ ఇత్యాది పద్మపురాణోక్తక్రమంబుగాఁ దప్తచక్రాది భగవల్లాంఛనంబుల స్వబాహుమూలంబుల ధరియించి నిజపుత్రకళత్రభృత్యపశ్వాదుల కట్లొనర్పవలయు, శ్లో॥ చక్రాఙ్కిత భుజాస్సర్వే ప్రహ్లాదేన ధ్రువేనచ। విభీషణేన బలినా రుక్మాఙ్గదశుకేనచ॥ మాన్ధాత్రాహ్యమ్బరీషేణ మార్కండేయ ముఖైర్బుధైః। శఙ్ఖాదిచిహ్నితై స్సర్వైర్దేహం కృత్వాచ పుత్రక॥ ఇత్యాది స్కాంద ప్రసిద్ధ బ్రహ్మనారాయణ సంవాదోక్తక్రమంబుగా శంఖచక్రాదిచిహ్నిత నిజభుజులగు ప్రహ్లా దౌత్తానపాది విభీషణ బలిరుక్మాంగద శుకమాంధాత్రం బరీష మార్కండేయ ప్రముఖ బుధాగ్రణులచే సమస్తజనులుం జక్రాంకితులైరి మఱియును, శ్లో॥ ఋషయ స్సిద్ధగన్ధర్వాః పాతాళే పన్నగేశ్వరాః। వహ్నౌతప్తం హరే శ్చక్రంశఙ్ఖం చైవ విధానతః। ధారయన్తి ముదాయుక్తా వృత్రస్యవధకాఙ్క్షిణః। తస్మాత్త్వమపిరాజేన్ద్ర కురుకృష్ణాయుధాఙ్కితమ్। స్వదేహం నిజసంగ్రామేహ్యజయ్య స్త్వంభవిష్యసి॥ ఇత్యాది పృథుప సత్కుమార సంహితోక్తక్రమంబుగా ఋషులు నణిమాదియోగ సిద్ధులును గంధర్వులును బాతాళంబునఁ బన్నగేంద్రులును వృత్రవధాకాంక్షులై యథాశాస్త్రంబుగా వహ్నితప్తంబులగు

శంఖ చక్రంబుల సంతోష పూర్వకంబుగా నిజభుజమూలంబుల ధరింతురు. కావున రాజేంద్రా నీవును శంఖచక్రాంకిత బాహుమూలుండ వైతివేని రణరంగంబునందు శత్రువుల కజయ్యుండ వగుదువు. శ్లో॥ వైష్ణవా మునయ స్సర్వే విష్ణు చక్రేణ ముద్రితాః। తేషాం దర్శనమాత్రేణ మహాపాతక నాశనమ్॥ అతిపాప ప్రసక్తోఽపి విష్ణు చక్రాంకితస్యతు। పాదోదకం పిబేద్యస్తు సర్వపాపైః పముచ్యతే॥ ఇత్యాది విష్ణురహస్యోక్తక్రమంబుగా విష్ణుచక్ర ముద్రితులై వైష్ణవులైన మనన శీలుర దర్శనమాత్రంబుచే మహాపాతకంబులు నశించు నత్యంత పాతక ప్రసక్తుండైనను విష్ణు చక్రాంకితుని పాదోదకంబుఁ గ్రోలెనేనిసర్వపాపవిముక్తుండగును. శ్లో॥ చక్రాఙ్కితస్య విప్రస్య పాదప్రక్షాళితం జలమ్। పీత్వాపాతక సాహస్రైర్ముచ్యతే నాత్రసంశయః॥ యస్మిఙ్ తీర్థేకృత స్నానావైష్ణవాశ్చక్రలాఞ్ఛితాః। తస్మిన్‌స్నానం ప్రకుర్వీత విష్ణుసాలోక్య మాప్నుయాత్॥ చక్రాఙ్కితస్య సామీప్యే తపః కుర్యా త్ప్రయత్నతః। స్నానం దానం జపోహోమం తత్సర్వం చాక్షయం భవేత్॥ శరీరం దృశ్యతే యస్య విష్ణు చక్రేణ లాఞ్ఛితమ్। గఙ్గాజల సమం మన్యే దేహం తత్పాప వర్జితమ్॥ విష్ణు చక్రాఙ్కితో విప్రో భుంజానోపి యత స్తతః। నలిప్యతే న పాపేన తమసేవ ప్రభాకరః॥ చక్రాఙ్కితభుజం విప్రం యోభూమ్యామభి వాదయేత్। లలాటే పాంసు సంఖ్యాని విష్ణులోకే మహీయతే॥ అవిద్యోవాసవిద్యోవా శఙ్ఖచక్రోర్ధ్వ పుణ్డ్రధృత్। నృణాం హన్తి సమస్తాఘంతమ స్సూర్యోదయో యథా॥ విష్ణుచక్రాఙ్కితం విప్రమేక రాత్రంతు వాసయేత్। విష్ణులోక నివాస స్తు పూజ్య ఏవ న సంశయః॥ ఇత్యాది హారీతస్మృత్యుక్తక్రమంబుగా మానవుండు చక్రాంకితుండగు విప్రునిపాద ప్రక్షాళనోదకంబుఁ గ్రోలి పాతకసహస్రవినిర్ముక్తుడగు నీ యర్థంబున సంశయంబు లేదు చక్రలాంఛితులగు వైష్ణవులే తీర్థంబునం దవగాహనంబుఁ జేయుదురాతీర్థంబునం గృతస్నానుండైన వాఁడు విష్ణుసాయుజ్యంబు లభించుఁ జక్రాంకితుండైన వాని సమీపంబునఁ బ్రయత్నపూర్వకంబుగాఁ జేయంబడు తపస్స్నానదాన జపహోమనములు దాయంబక్షయంబగు నెవ్వని శరీరంబు విష్ణు చక్రలాంఛితంబై చూపడుఁ బాప వర్జితంబైన యద్దేహంబు భాగీరథీతీర్థ సదృశంబుగాఁ దలఁపఁదగు. విష్ణు చక్రాంకితుండగు విప్రుం డెచట భుజించియుఁ దమఃపటలంబుచేఁ బ్రభాకరునిమాడ్కిఁ బాపంబుచే స్పృశియింపంబడక యుండుఁ జక్రాంకితుండగు విప్రునిం జూచి పుడమిపై సాష్టాంగ ప్రణామం బెవ్వఁ డాచరించువాఁడు స్వలలాట సక్తపరాగ సమసంఖ్య సంవత్సరంబులు విష్ణులోకంబున సుఖించు నవిద్యుండైననుసవిద్యుం

డైనను శంఖచక్రోర్ధ్వపుండ్రంబులు ధరియించిన వాఁ డుదయించిన సూర్యుం డంధకారంబుఁ బాపినట్లు తన్నుం గనుఁగొన్న వారి సమస్త పాపంబులు పరిహరించు విష్ణు చక్రాంకితుండైన విప్రునిఁ దన గృహంబునం దొక దినంబైన నుంచి యుపచరించినవాఁడు విష్ణులోకంబున నిత్య నివాసంబుఁ జెంది పూజ్యుం డగు సంశయింపఁ బనిలేదు. శ్లో॥ శరీరే యస్య కస్యాపి దృశ్యతే వై సుదర్శనమ్। తస్మైకుర్వీత పక్షీన్ద్ర నమస్కారా న్ప్రయత్నతః॥ అభ్యంగనాది భుక్త్యన్తం యః కరోతి సమాహితః। చక్రాంకితాయ విప్రాయ విష్ణుసాలోక్య మాప్నుయాత్॥ ఇత్యాది విష్వక్సేనసంహితోక్తక్రమంబుగా నెవ్వాని శరీరంబు నందు సుదర్శనచక్రలాంఛనంబు పరిదృశ్యమానంబగు వానికిం బ్రయత్న పూర్వకంబుగా నమస్కారంబు లాచరింపవలయు. స్వస్థచిత్తుండై యే పురుషుండైనఁ జక్రాంకితుండగు బ్రాహ్మణున కభ్యంజనాది భోజనాంతోపచారంబు లొనరించు వాఁడు విష్ణుసాయుజ్యంబుఁ జెందునని విహగేంద్రు నుద్దేశించి విష్వక్సేనుం డానతిచ్చె. శ్లో॥ సగోత్రమపి య శ్శ్రాద్ధే చక్రాంకిత భుజం చరేత్। రౌరవాత్కుల ముద్ధృత్య విష్ణులోకే మహీయతే॥ ఇత్యాది మోక్షధర్మోక్తక్రమంబుగాఁ జక్రాంకితుండును సగోత్రుండునగు విప్రునైన శ్రాద్ధకర్మంబునం దెవ్వఁడు నియమించు వాఁడు రౌరవాఖ్య నరకంబువలన స్వకులం బుద్ధరించి విష్ణులోకంబున సుఖించు. శ్లో॥ కృష్ణాయుధాఙ్కితో మర్త్యో యత్ర యత్రావతిష్ఠతి। శ్మశాన మపిత త్తీర్థం కింపునః పుణ్యభూమయః॥ కిం కరిష్యన్తి లోకేస్మిన్ ప్రయాగ మరణాదికమ్। చక్రాంకన శరీరస్య గృహే ముక్తిః కరేస్థితా॥ యస్యాన్తకాలే దేహేతులాఞ్ఛితం జాయతే హరేః। దృష్ట్వా తన్తుభయం యాన్తి యమేన సహకిఙ్కరాః॥ చక్రాఙ్కితభుజో యస్తు శ్మశానే మ్రియతే యది। ప్రయాగేయా గతిః ప్రోక్తా సాగతి స్తస్య నారద॥ చక్రాంకితాయ విప్రాయ కన్యాదానం కరోతి యః। పరమానన్ద మాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్॥ విష్ణు చక్రాంకితం దృష్ట్వా యోభ్యుత్థాయ కృతాంజలిః। స స్వం కులం సముద్ధృత్య విష్ణులోకేమహీయతే॥ చక్రాంకిత భుజాయేతు పఙ్క్తిమధ్యేతు భుంజతే। సాపఙ్క్తి స్స్వర్గలోకేచ దేవపఙ్క్తిషు పూజ్యతే॥ శఙ్ఖచక్రాంకితం విప్రం దృష్ట్వా యోహ్లాదితో భవేత్॥ పరమంపద మాప్నోతి కింపున స్త్వైహికం ఫలమ్॥ చక్రాఙ్కితస్య నామాని యఃపఠే ద్భక్తిమా న్నరః। సర్వపాతక నిర్ముక్త స్సయాతి పరమంపదమ్॥ విష్ణుచక్రాంకితో విద్వాన్ యస్మిన్ దేశే వసేత్సుఖమ్। సదేశో మత్ప్రియః పుణ్యోవైష్ణవానాంమమప్రియే॥ ఇత్యాది పద్మపురాణోక్తక్రమంబుగాఁ జక్రాం

కితుం డగుమర్త్యుం డెచ్చటనుండు నా ప్రదేశంబు శ్మశానం బైనను బవిత్రం బగునతండు పుణ్యభూములయందు వసించెనేని యాస్థల ప్రభావం బెంతన వచ్చు మనుజుండు ప్రయాగమరణాదికంబునకై ప్రయత్నం బేల సేయవలయు. వాఁడు చక్రాంకితుం డాయెనేని యతనికపవర్గంబు కరతలామలకంబగు నెవ్వని కంతకాలంబునఁదైన భగవల్లాంఛనంబులు సంభవించు వానిం జూచి యమ భటులు యమునితోడంగూడ భయంబుఁ జెందుదురు. చక్రాంకితుండైనవాఁడు పితృకాననంబునందైన మృతిఁబొందెనేని ప్రయాగమరణంబువలనఁ గలుగుగతి వానికి సంభవించుఁ జక్రాంకితుం డైన విప్రునకుఁ గన్యాదానం బెవ్వఁ డాచరించువాఁడు పరమానందమయం బగుపరమపదంబుఁ జెందు విష్ణు చక్రాం కితునిం జూచి యెవ్వఁడేని ప్రత్యుత్థానాదికం బాచరించువాఁడు స్వకులం బుద్ధరించి విష్ణులోకంబున సుఖించుఁ జక్రాంకితభుజు లేపంక్తిమధ్యంబున భుజింతు రా పంక్తి స్వర్గలోకంబున దేవపంక్తులయందుఁ బూజింపంబడు శంఖచక్రాం కితుం డగువిప్రునిం జూచి యెవ్వఁ డానందించు వాఁడు పరమపదంబుఁ జెందు వాని కైహికఫలంబును గైముతికన్యాయసిద్ధంబు భక్తిమంతుడగునే నరుండైనఁ జక్రాంకితునినామంబులు పఠించును వాఁడు సర్వపాతకనిర్ముక్తుండై పరమ పదంబుఁ జెందు విష్ణుచక్రాంకితుం డగుపండితుం డేదేశంబునందు సుఖంబుగా వసించు నద్దేశంబు వైష్ణవులకును నాకును బ్రియంబగు, శ్లో॥ యో నరో మమ భక్తస్తు దివ్యచిహ్నై ర్నిధారయేత్। శ్వపాకో వాథ గోఘ్నో వామమలోకంనగ చ్ఛతి॥ ఇత్యాది భవిష్యత్పురాణోక్తక్రమంబుగాశ్వపాకుండైనను గోఘ్నుండై నను మద్భక్తుండై మదీయదివ్యచిహ్నంబులఁ దాల్చెనేని వాఁ డస్మదీయంబగు లోకంబునకుం జనును, శ్లో॥ నారాయణాయుధై ర్నిత్యం చిహ్నితో యస్య విగ్రహః। పాపకోటిశతం దగ్ధం తస్మిన్దృష్టేభవేత్సదా॥ శంఖచక్రోర్ధ్వపుండ్రా దిధారయే ద్యాస్తుబ్రహ్మణస్సదా। శ్రాద్ధాదిసర్వకర్మార్హ ఇత్యుక్తంకిమతః పరమ్॥ ఇత్యాదిబ్రహ్మాండపురాణోక్తక్రమంబుగా నారాయణాయుధంబుచేనెవ్వాని విగ్ర హంబు చిహ్నితంబగుఁదదంగద్రష్టలకుఁ బాతకకోటిశతంబు దగ్ధంబై చను శంఖ చక్రోర్ధ్వపుండ్రాదిభగవల్లాంఛనంబుల ధరించిన బ్రాహ్మణుండు శ్రాద్ధాది సర్వ కర్మంబులం దర్హతముండగును, శ్లో॥ భుజే చక్రం ద్విజాతీనాం శిరశ్చక్రంతు దైవతమ్। అచక్రద్విజదేవానాం పూజాదానంచ నిష్ఫలమ్॥ ఇత్యాదిశిల్పిశాస్త్రోక్త క్రమంబుగా ద్విజాతులకు భుజంబున దేవతలకు శిరస్థలంబునఁ జక్రధారణంబు ప్రసిద్ధంబది లేనిద్విజదేవతలకుఁ జేసినదానంబు నర్చనంబును నిష్ఫలంబగు.

శ్లో॥ చక్రాంకితభుజాః కేచి ద్యత్రయత్ర వసంతిహి । యోజనాని తథాత్రీణి, మమక్షేత్రంవసుంధరే ॥ అశ్వమేధసహస్రస్య వాజపేయశతస్యచ । తత్ఫలం శ్రూయతే తస్య మదీయాయుధధారణాత్ ॥ నివసన్తి మహాత్మానోయత్రచైకాన్తినోదిజ్వాః । దేవాదేవర్ష యో నిత్యం తద్దేశం పర్యుపాసతే॥ ఇత్యాదివరాహపురాణోక్తక్రమంబుగాఁ జక్రాంకితభుజు లగువా రెందెందు వసింతుర ద్దేశం బంతట యోజనత్రయపర్యంతంబు మదీయక్షేత్రం బగు మదీయాయుధ ధారణం బొనరించినవానికి నశ్వమేధసహస్ర ఫలంబును వాజపేయశతఫలంబును సమకూడును. మహాత్ము లగు నేకాంతు లెచ్చట వసింతురు దేవఋషు లాస్థలంబె డఁబాయక నివసింతురని శ్రీవరాహదేవుండు భూదేవి కానతిచ్చె శ్లో॥ బ్రాహ్మణైః క్షత్రియైర్వైశ్యై శ్శూద్రైశ్చ కృతలక్షణైః । అర్చనీయశ్చ వన్ద్యశ్చ నిత్యముక్తైస్స్వకర్మసు ॥ ఇత్యాది భీష్మపర్వోక్తక్రమంబు గా ధృతవిష్ణులక్షణులై నిత్యముక్తు లగు బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులచే భగవంతుం డర్చనీయుండును వందనీయుండు నగును. శ్లో॥ అష్టాక్షరవిద స్సర్వేత ప్తచక్రాంకితాస్తథా । సేవకా వాసుదేవస్య తద్దైవ నటనర్తకాః॥ అన్యేచవైష్ణవాస్తత్ర సర్వే చక్రేణిలాంఛితాః॥ ఇత్యాది లింగపురాణోక్తక్రమంబుగా నష్టాక్షరవిదులునుద ప్త చక్రాంకితులును వాసుదేవసేవకులు నగు సమస్తచేతనులు వైష్ణవు లనంబడుదురు, శ్లో॥ యేషాం చక్రాంకితం గాత్రం శూద్రేష్వపిచ దృశ్యతే। తేవై స్వర్గస్య నేతారో౽బ్రాహ్మణా భువి దుర్లభాః॥ ఇత్యాది స్కాందపురాణోక్తక్రమంబుగా శూద్రులయం దైన నెవ్వరిగాత్రంబులు చక్రాంకితంబులై యుండు వారు స్వర్గనేతలును బ్రాహ్మణులును, శ్లో॥ వినా యజ్ఞోపవీతేన వినాచక్రస్యధారణాత్। వినాద్వయేనవై విప్రశ్చణ్డాలత్వ మవాప్నుయాత్ ॥ విప్రుండు యజ్ఞోపవీతచక్ర ధారణద్వయంబులతో వినాభూతుండాయెనేని చండాలత్వంబుఁ జెందు, శ్లో॥ సల్లాపా ద్దర్శనా ద్దానాద్యజనా ద్వన్దనాదపి । చక్రాంకితస్య విప్రస్య విష్ణుసాయుజ్య మాప్నుయాత్ ॥ ఇత్యాదిపాద్మోక్తక్రమంబుగాఁ జక్రాంకితుం డగు విప్రునిం జూచి యతనితో సల్లాపం బొనర్చినను నతనికి దానంబు జేసినను నతని నారాధించిన నతనికి నమస్కరించినను మనుజుండు విష్ణుసాయుజ్యంబుఁ జెందు. శ్లో॥ కృష్ణాయుధాఙ్కితోభూత్వాపితృ కార్యంకరోతియః । తత్సర్వం ప్రతిగృహ్ణాతి గయాయాంతు గదాధరః । కృష్ణముద్రాంకితో యస్తు దైవం పిత్ర్యం కరోతియత్ । నిత్యం నైమిత్తికం తత్తత్ప్రత్యహంచాక్షయం భవేత్ ॥ చక్రాఙ్కితభుజో భుఙ్క్తే యస్యాం పఙ్క్తౌ ద్విజోత్తమః । పునాతి సక

లాం పఙ్క్తిం గఙ్గేవోత్తరవాహినీ ॥ శ్రాద్ధకాలే న చాయాన్తి భీతా రాక్షస దానవాః । శంఖం చక్రం గదాం పద్మం దృష్ట్వా కృష్ణస్య విగ్రహే॥ ఇత్యాది సనత్కుమారసంహితోక్తక్రమంబుగా నెవ్వండేని కృష్ణాయుధాంకితుండై శ్రాద్ధకర్మం బొనరించుఁ దత్కర్మం బంతయు గయయందు గదాధరుండు ప్రతిగ్రహించు నెవ్వండేని కృష్ణముద్రాంకితుం డై ద్వైవంబును బిత్ర్యంబునునై మిత్తికంబు నాచరించు నది యంతయుఁ బ్రత్యహం బక్షయం బగుఁ జక్రాంకితుం డగుద్విజోత్తముం డేపంక్తియందు భుజించు నా పంక్తి నంతయు నతం డుత్తరవాహిని యగుగంగ భంగిఁ బవిత్రం బొనర్చు శ్రాద్ధకాలం బునఁ గర్తృభోక్తృవిగ్రహంబులయందు శంఖచక్రాది భగవల్లాంఛనంబులం జూచి రాక్షసులు దానవులు నచటికేతేర వెఱతురు. శ్లో॥ చక్రాంకితభుజం దృష్ట్వా యస్తుతం నాభివాదయేత్। తిర్యగ్యోనిశతంప్రాప్య విష్ఠాయాం జాయతే క్రిమిః॥ యజ్ఞో దానం తపోహోమో భోజనం పితృతర్పణమ్। చక్రలాంఛన హీనస్య విప్రస్యవిఫలం భవేత్॥ తీర్థస్నానఫలం నాస్తి భూగోదానఫలం తథా। అవైష్ణవస్య విప్రస్య సర్వం శశ్వ ద్వినశ్యతి। రూపలావణ్యసంయుక్తా మహావంశోద్భవా ద్విజాః। అవైష్ణవాన శోభంతే నిర్గంధాఇవ కింశుకాః॥ విద్యావినయసమ్పన్నా విశాలకులసమ్భవాః। విష్ణుభక్తివిహీనాయే చణ్డాలసదృశాఃస్మృతాః॥ ఇత్యాది భవిష్యత్పురాణోక్తక్రమంబుగా నెవ్వండేని చక్రాంకితభుజునిం జూచి యభివాదనంబు సేయకుండు వాఁడుతిర్యగ్యోనిశతంబుఁ జెంది నీకృష్ణతమక్రిమిజన్మంబు లభించు. మఱియును జక్రలాంఛనహీనుండైన విప్రునకు యజ్ఞదానతపో హోమభోజనపితృతర్పణంబుల నిరర్థకంబు లగును. మఱియు నవైష్ణవుండగు విప్రునకుఁ దీర్థస్నానభూగోదానాది సకలపుణ్యఫలంబులు సారెసారెకు నశించు రూపలావణ్యసంపన్నులు మహాకులీనులు నగుబ్రాహ్మణుల వైష్ణవులైరేని నిర్గంధంబు లగుపలాశపుష్పంబులపగిదిఁ బ్రకాశింపరు. విద్యావినయసంపన్నులు విశాలకులసంభవులు నైనవారైనను విష్ణుభక్తి లేకుండిరేని చండాలసదృశు లగుదురు. శ్లో॥ సర్వభూతదయాయుక్తం వైష్ణవం ద్వేష్టియోనరః। సచణ్డాలో మహాపాపీ రౌరవం నరకం వ్రజేత్॥ ఇత్యాది హరివంశ ప్రసిద్ధ రుద్రవాక్య క్రమంబుగా నెవ్వండేని సర్వభూతదయాయుక్తుం డగువైష్ణవుని ద్వేషించునో వాఁడు మహాపాపియై సద్యశ్చండాలత్వంబుఁజెంది రౌరవాఖ్యనరకంబునఁబడు. శ్లో॥ వినా యజ్ఞోపవీతేన వినా చక్రస్యధారణాత్। వినా ద్వయేన వై విప్రశ్చణ్డాలత్వ మవాప్ను

యాత్॥ శఙ్ఖ చక్రోర్ధ్వపుణ్డ్రాదిరహితో బ్రాహ్మణాధమః। సజీవన్నేవ చణ్డాల స్సర్వకర్మబహిష్కృతః॥ ఇత్యాదిపారాశర్యస్మృత్యుక్తక్రమంబుగా యజ్ఞోపవీతం బును ద్వయమంత్రంబును శంకచక్రోర్ధ్వపుండ్రాది భగవల్లాంఛనంబులును లేని విప్రుం డధమాధముండై సర్వకర్మబహిష్కృతుం డగును. శ్లో॥ అచక్రధారిణో విప్రాః సర్వకర్మసు గర్హితాః। అవైష్ణవత్వ మాపన్నా నరకం యాన్తి నిశ్చయమ్॥ చక్రచిహ్నాదిరహితం ప్రాకృతం కలుషాన్వితమ్। అవైష్ణవంతుతం దూరాచ్ఛ్వ పాకమివ సంత్యజేత్॥ ఇత్యాదిహారీతస్మృత్యుక్తక్రమంబుగాఁ జక్రధారణంబు లేక వైష్ణవులగాక యున్నభూసురులు సర్వకర్మగర్హితులైన రకంబునం బడుదురు. చక్రాదిచిహ్నంబులు భగవద్భక్తియు లేక కలుషాన్వితుండైన కేవలప్రాకృతునిం జూచి శ్వపాకునిగతి దూరంబుగాఁ బరిత్యజింపవలయు. శ్లో॥ సల్లాపా ద్దర్శనా ద్దానా ద్యజనా ద్వందనా దపి। చక్రాంకితస్య విప్రస్య విష్ణుసాయుజ్య మాప్ను యాత్॥ తద్దైవచక్రహీనస్య పూజనా ద్వందనా దపి। వైష్ణవో నిరయం యాతి యావదాభూతసంప్లవమ్॥ అచక్రధారీయో విప్రశ్శ్రుతిస్మృతిసమన్వితః। త్యజేచ్చం డాలభాణ్డస్థం తం విప్ర మమృతంయథా॥ ఇత్యాదిపద్మ పురాణోక్తక్రమంబుగాఁ జక్రాంకితుం డగువిప్రునిసల్లాపదర్శనాదికంబు విష్ణుసాయుజ్య ప్రదంబట్లు వైష్ణ వుండు చక్రహీనునిఁ బూజించినను నమస్కరించినను బ్రళయపర్యంతంబు నిర యంబునఁ బడు నేవిప్రుండైన శ్రుతిస్మృతిసమన్వితుండై చక్రలాంఛనరహితుం డాయె నేనియతండు చండాలభాండస్థామృతంబు పోలికఁ బరిత్యాజ్యుం డగు. శ్లో॥ శ్రీకృష్ణచక్రాంక విహీనగాత్రం శ్మశానతుల్యం పురుషోఽథనారీ। దృష్ట్వా నరస్తన్ముపతే న్నవాసాస్స్నాత్వాసమర్చేద్ధరిమంగనిత్యమ్॥ చక్రచిహ్నవిహీ నంతు యశ్శ్రాద్ధే భోజయిష్యతి। వ్యర్థం భవతి తత్సర్వం నిరాశాః పితరోగతాః॥ ఇత్యాదినారదీ యోక్తక్రమంబుగా స్త్రీపురుషు లెవ్వరైన శ్మశానతుల్యంబగు శంఖ చక్రాదిభగవల్లాంఛనరహితశరీరంబుఁజూచి రేనిసచే లస్నానం బాచరించి హరి స్మరించి హరిఁ బూజింపవలయుఁ జక్రాదిహరిచిహ్నంబులు లేనివిప్రుని శ్రాద్ధకర్మంబునం దెవ్వఁడు భుజింపంజేయు వాఁ డొనర్చిన యాశ్రాద్ధంబంతయు వ్యర్థంబగుఁ బితృ దేవతలు నిఃస్పృహులై చనుదురు. శ్లో॥ అచక్రధారిణం విప్రం య శ్శ్రాద్ధే భోజ యిష్యతి। రేతోమూత్రపురీషాది పితృభ్య స్సప్రయచ్ఛతి॥ తస్మాచ్చక్రం విధానేన తప్తంవై ధారయేద్ద్విజః। ఇత్యాది శ్రుతిభిః ప్రోక్తం విష్ణోశ్చక్రస్యధారణమ్। తస్మా చ్చక్రాదిసంస్కారాః కర్తవ్యామునిసత్తమ। చక్రలాంఛనహీనేన కృతం కర్మచ నిష్ఫలమ్॥ ఆచార్యోవిధివత్కుర్యాచ్చక్రపుణ్డ్రాదిసత్క్రియామ్। పుర

తోగ్నిం ప్రతిష్ఠాప్య స్వగృహోక్తవిధానతః॥ ఇత్యాది పారాశర్యస్మృత్యుక్త క్రమంబుగా నెవ్వాఁడు శ్రాద్ధకర్మంబునందుఁ జక్రాదిభగవల్లాంఛనంబులు లేని బ్రాహ్మణు భుజియింపంజేయువాఁడు పితృదేవతలకు రేతోమూత్రపురీషాది ప్రదుం డగుంగావునఁబూర్వోక్త క్రమంబుగా శ్రుతిస్మృతీతిహాసపురాణాది సకలశాస్త్ర ప్రసిద్ధం బగుత ప్తచక్రాంకనంబు వేదవిదాచార్య శ్రీహస్తంబుచే లభించి ముముక్షుచేతనుండు కృతార్థుండై పరమపదంబుఁ జెందు. వింకనూర్ధ్వపుండ్ర ధారణంబునకుం బ్రమాణంబు ఉపన్యసింతు నాకర్ణింపుము. "ధృతోర్ధ్వపుండ్రమ్" ఇత్యాదికఠవల్లియు "ధృతోర్ధ్వపుండ్రః" ఇత్యాది మహోపనిషద్వాక్య ప్రపంచం బును 'హరేఃపదాకృతి' మిత్యాద్యథర్వ వేదవాగ్విస్తరంబును "కిం పవిత్రాణాం పవిత్ర" మిత్యాది "నాసాదికేశపర్యంత మూర్ధ్వపుండ్రం విష్ణోఃస్థితస్య పదద్వ యాకృతీ" త్యాద్యంతకాత్యాయనోపనిష ద్వాక్యజాతంబును బ్రమాణంబులు. మఱియుస్మృత్యాదిక ప్రమాణంబుల వినుము. శ్లో॥ ఊర్ధ్వపుణ్డ్రస్యమాహాత్మ్యం వక్ష్యామిశుభదర్శనే। ధారణా దేవముచ్యేత భవబంధా ద్విమూఢధీః॥ ఏకాంతినో మహాభాగా స్సర్వే మమహితే రతాః। సాన్తరాళం ప్రకుర్వీత ఊర్ధ్వపుండ్రం పదాకృతి॥ పుండ్రాణాం ధారణార్థాయ గృహ్ణీయాచ్ఛ్వేతమృత్తికామ్। శ్రీరంగే వృషభాద్రౌచ శ్రీకూర్మేయాదవాచలే॥ ప్రయాగే నారసింహాద్రౌ వారాహేతులసీ వనే। ద్వారవత్యాంశుభేరమ్యే వాసుదేవహ్రదేతథా॥ సిన్ధుతీ రేచవల్మీకే హరిక్షేత్రే విశేషతః। విష్ణోఃపాదోదకం యత్రప్రవాహయతినిత్యశః॥ గృహీత్వా మృత్తికాం భక్త్యా విష్ణుపాద జలైస్సహ।ధృత్వాపుణ్డ్రాణిచాఙ్గేషు విష్ణుసాయుజ్యమాప్నుయాత్। లలాటే కేశవం ధ్యాయే న్నారాయణమథోదరే॥ వక్షస్థలే మాధవంచ గోవిందం కణ్ఠకూబరే। విష్ణుంచ దక్షిణే కుక్షౌబాహౌచ మధుసూదనమ్॥ త్రివిక్రమంస్కంధదేశే వామనం వామపార్శ్వకే। శ్రీధరం వామబాహౌతు హృషీ కేశంతుక న్ధరే॥ పృష్ఠేతు పద్మనాభం చత్రికే దామోదరం న్యసేత్। తత్ప్రక్షాళనతో యేనవాసు దేవేతి మూర్ధని॥ తత్తత్పుండ్రాణి తస్మాత్రీర్ధ్యాత్వామంత్రేణధారయేత్। లలాటే భుజయుగ్మేతు పృష్ఠయోః కంఠకూబరే॥ ధారయేదూర్ధ్వపుండ్రాణి చతురఙ్గుళ మానతః। కుక్షౌతత్పార్శ్వయోః ప్రోక్తమాయతంతు దశాఙ్గుళమ్॥ బాహ్వోర్వక్షస్థలే పుణ్డ్రమష్టాంగుళముదాహృతమ్। ఏవం ద్వాదశపుం డ్రాణిబ్రాహ్మణస్సతతంధరేత్। ఆన్తరాళేషు సర్వేషు హరిద్రాంధారయేచ్ఛ్రియమ్॥ ఇత్యాది పద్మపురాణోక్త క్రమంబుగా శివుండు తనదేవి నుద్దేశించి యొకల్యాణి యూర్ధ్వపుండ్రమాహాత్మ్యం బుఁ జెప్పెద వినుము. సర్వభూతహితనిరత మతులగు మహాత్ములైన యేకాం

తులు సాంతరాళంబులైన యూర్ధ్వపుండ్రంబులు భగవత్పదాకృతులుగా ధరింపవలయు నట్టియూర్ధ్వపుండ్రంబులుధరించుటకు, శ్లో॥ శ్వేతమృణ్ముక్తిదా ప్రోక్తా పీతావైరాగ్యకారిణీ। రక్తావశ్యకరీప్రోక్తా॥ ఇత్యాదిన్యాయంబున ముక్తిదాయిని యగు శ్వేతమృత్తికసంగ్రహింపవలయుఁ దత్సంగ్రహంబును శ్రీరంగంబున వృషభాద్రియందు శ్రీకూర్మంబునందును యాదవాచలంబునఁ బ్రయాగయందు నారసింహాద్రివివరాహక్షేత్రంబునందుఁ దులసీవనంబున ద్వారవతియందు వాసుదేవహ్రదంబున సింధుతీరంబున వల్మీకంబున హరిక్షేత్రంబున నెచట విష్ణుపాదోదకంబు ప్రవహించు నచ్చటను బ్రసిద్ధంబామృత్తిక గ్రహించి విష్ణుపాదోదకంబుతో ద్వాదశోర్ధ్వపుండ్రంబులుతత్తదంగంబులయందు ధరించినవాఁడు విష్ణుసాయుజ్యంబులభించునట్లుద్వాదశోర్ధ్వపుండ్రంబులు ధరించి లలాటంబునఁ గేశవుని నుదరంబున నారాయణుని వక్షస్థలంబున మాధవునిం గంఠకూబరంబునందు గోవిందుని దక్షిణకుక్షియందు విష్ణువును దక్షిణభుజంబున మధుసూదనుని దక్షిణస్కంధంబున హృషీకేశునిఁబృష్ఠభాగంబునఁ బద్మనాభునిఁ ద్రికప్రదేశంబున దామోదరుని ననంతరంబకరతల ప్రక్షాళనోదకంబుల శ్రీవాసుదేవ దివ్యనామంబుచ్చరించుచు శిరస్థలంబునంజల్లుకొనవలయు ఫాలస్థలంబున స్కంధయుగ్మంబునందుఁ బృష్ఠంబునఁ ద్రికప్రదేశంబునందుఁ గంఠకూబరంబునఁ జతురంగుళ ప్రమాణంబులుగా నూర్ధ్వపుండ్రంబులు ధరియింపవలయుఁ గుక్షియందుఁ దత్పార్శ్వంబులయందును దశాంగుళాయతంబు లగుపుండ్రంబులు ధరింపవలయు బాహువులయందు వక్షస్థలంబునందును నష్టాంగుళ ప్రమాణంబులు గా నూర్ధ్వపుండ్రంబులు దీర్పవలయు బ్రాహ్మణుం డిట్లు ద్వాదశోర్ధ్వపుండ్రంబులు ధరింపవలయు నూర్ధ్వపుండ్రంబుల కంతరాళ ప్రదేశంబులయందు లక్ష్మీస్వరూప హరిద్రాచూర్ణ రేఖలురచియింపవలయు. శ్లో॥ ప్రణవేనైవ మంత్రేణ ముదావైమా మనుస్మరన్। లలాటే ధారయేన్నిత్యం విష్ణుసాయుజ్యమాప్నుయాత్॥ యోనధారయతే మర్త్యోమామకంచిహ్నమీదృశమ్। తం సృజామి దురాత్మానం మదీయాజ్ఞాతిలఙ్ఘినమ్॥ వ్యాళం దృష్ట్వా యథాలోకే దర్దురా భయసంయుతాః। ఊర్ధ్వపుణ్డ్రాఙ్కితం తద్వత్కంప్యన్తే యమకిఙ్కరాః॥ ఊర్ధ్వపుణ్డ్రేణ సంయుక్తో మ్రియతే యస్తుమానవః। చండాలోపి విశుద్ధాత్మా విష్ణులోకే మహీయతే॥ కేవలస్యోర్ధ్వపుణ్డ్రస్య ధారణాదపి మానవః। దేహజైః పాపసఙ్ఘాతైర్ముచ్య తేనాత్రసంశయః॥ ఇత్యాది బ్రహ్మపురాణోక్త క్రమంబుగాఁ బ్రణవమంత్రంబుచే నన్ను స్మరించుచు నెవ్వండు శ్వేతమృత్తికచే లలాటాదిద్వాదశాంగంబులయం దూర్ధ్వపుండ్రంబులు ధరియించును. వాఁడు

మత్సాయుజ్యంబుఁ జెందునేమర్త్యుఁడైన నిట్లు మదీయచిహ్నంబులు ధరింపఁడు మామకాజ్ఞోల్లంఘనం బొనర్చిన యాదురాత్ముని జన్మపద్ధతినిం బడఁద్రొబ్బెద. లోకంబున భేకంబులు కాకోదరంబు నీక్షించి వెఱచినట్లు లూర్ధ్వపుండ్రాంకితునిం జూచి యమభటులు భయంబుఁ జెందుదురు. ఊర్ధ్వపుండ్రధారియగు మానవుండు మృతుఁడైనవాఁడు చండాలుం డైనను బరిశుద్ధాంతరంగుండై విష్ణులోకంబున సుఖించు మానవుండు కేవలోర్ధ్వపుణ్డ్రధారణంబుచే నైన దేహజాతంబు లైన పాపసంఘాతంబులచే విముక్తుం డగు నీయర్థంబునందు సంశయంబులేదు. శ్లో॥ చతురఙ్గుళమూర్ధ్వాగ్రం ద్వ్యఙ్గుళం విస్తృతంమృదా। ద్విజఃపుణ్డ్రం మృజుం సౌమ్యం సాన్తరాళం తుధాలయేత్॥ ఇత్యాది స్కాందోక్త ప్రకారంబుగా బ్రాహ్మణుం చతురఙ్గుళ ప్రమాణోర్ధ్వాగ్రంబును ద్వ్యంగుళ విస్తృతంబును నవక్రంబును సుందరంబు నగునట్లుగా శ్వేతమృత్తికచే సాంతరాళపుండ్రంబు ధరింపవలయు. శ్లో॥ చతురఙ్గుళమూర్ధ్వాగ్రం ద్వ్యఙ్గుళం విస్తృతంమృదా। ద్విజఃపుణ్డ్రం మృజుంసౌమ్యం సాన్తరాళంతుదారయేత్ ॥ ఇత్యాది స్కాందోక్త ప్రకారంబుగా బ్రాహ్మణుండు చతురఙ్గుళ ప్రమాణోర్ధ్వాగ్రంబును ద్వ్యంగుళవిస్తృతంబును నవక్రంబును సుందరంబు నగునట్లుగా శ్వేతమృత్తికచే సాంతరాళపుండ్రంబు ధరింపవలయు. శ్లో॥ చతురఙ్గుళమూర్ధ్వాగ్రం ద్వ్యఙ్గుళం విస్తృతం తథా। మృదా పుణ్డ్రంద్విజఃకుర్యాత్సాన్తరాళ మ్మనోహరం ॥ ద్వ్యఙ్గుళం త్ర్యఙ్గుళం వాపి మధ్యే చ్ఛిద్రం ప్రకల్పయేత్ । ద్వ్యఙ్గుళం పార్శ్వమేకం స్యాదూర్ధ్వపుణ్డ్రస్యలక్షణమ్॥ ఇత్యాదిహారీతస్మృత్యుక్తక్రమంబుగాఁ జతురంగుళంబుల పొడవును బార్శ్వంబులయం దంగుళద్వయమాత్రంబు వెడల్పును ద్వ్యంగుళత్ర్యంగుళ ప్రమాణంబైన యంతరాళంబును గలుగునట్టుగా మనోహరంబైన పుండ్రంబు విప్రుండు ధవళ మృత్తికచే ధరింపవలయు,శ్లో॥ ఆచమ్య ధారయేత్పుండ్రాన్మృదాశుభ్రేణ పూర్వవత్। నాసికామూలమారభ్య కేశాన్తం పరికల్పయేత్। హరిద్రేణతుచూర్ణేన కుఙ్కుమేన సుగన్ధినా॥ ఊర్ధ్వపుండ్రస్యమధ్యేతు లక్ష్మీస్థానంప్రకల్పయేత్ ॥ ఇత్యాది భారద్వాజ సంహితోక్త ప్రకారంబుగా ద్విజుండాచమనం బొనర్చి నాసాదికేశపర్యంతంబు ఫాలస్థలంబున ధవళోర్ధ్వపుండ్రంబులు ధరియించి యవశిష్టైకాదశాంగంబులయం దట్లూర్ధ్వపుణ్డ్రంబులు ధరియించి తదంతరాళంబులయందు లక్ష్మీస్వరూప శ్రీచూర్ణ రేఖలు ధరింపవలయు,శ్లో॥తతోదివ్యంచ హారిద్రంసమ్మోదతులసీదళమ్। మన్త్రేణధార యేచ్చూర్ణంపుణ్డ్రేషుద్వాదశేషుచ।ఊర్ధ్వపుణ్డ్రస్య మధ్యేతు దివ్యచూర్ణంచ ధారయేత్। శ్రీకరంవిజయం పుణ్యంసర్వదోషప్రణాశనమ్॥ఊర్ధ్వపుణ్డ్రస్య మధ్యేతు రజనీచూర్ణ

ము_త్తమమ్। లక్ష్మీ రూపధరం నిత్య మన్యద్రవ్యం నధారయేత్॥ విష్ణురూపేణ సంస్పృష్టంతచ్చూర్ణంశిరసావహేత్।తస్యాశుభాని నశ్య_న్తి పుణ్యమార్గోభవేన్నరః॥ ఇత్యాద్యత్రిస్మృత్యు_క్తక్రమంబుగా మనుజుండు ధవళతరచ్ఛిద్రోర్ధ్వపుండ్రంబుల యందు దివ్యంబును శ్రీకరంబును విజయావహంబును బుణ్యప్రదంబును సర్వదోష ప్రణాశనంబును లక్ష్మీస్వరూపంబు నగు హారిద్రాచూర్ణంబు ధరింపవలయు. మఱి యొక ద్రవ్యంబును ధరింపఁగూడ దిట్లు ధరించినవానికి సమస్తాశుభంబులు నశియించువాఁడు పుణ్యాత్ముఁడగును, శ్లో॥ ఊర్ధ్వపుణ్డ్రం ముదాదాయ సచ్ఛిద్రం సౌమ్యమేవచ। తదలఙ్కారణార్థాయ హారిద్రాం ధారయేచ్ఛ్రియమ్॥ విలోక్యదర్పణం విద్వానూర్ధ్వపుణ్డ్రం మనోహరమ్।కుర్యాదఙ్గుళ మాకాఙ్క్ష్య హారిద్రాచూర్ణసంయుతమ్॥ ఇత్యాదిసనత్కుమారసంహితో_క్తక్రమంబుగావిద్వాంసుండుదర్పణంబవలోకించుచు శ్రీచూర్ణరేఖాలంకృతంబులగుధవళచ్ఛిద్రోర్ధ్వపుండ్రంబులు పూర్వో_క్తక్రమంబుగా ధరింపవలయు. శ్లో॥ న_త్రి పుణ్డ్రం ద్విజైర్ధార్యం పట్టాకారం తథైవచ। నచాన్య దేవతాభ_క్తి రాపద్యపికదాచన॥ బ్రాహ్మణస్యోర్ధ్వపుణ్డ్రం స్యాత్క్షత్రియస్యార్ధచన్ద్రకమ్। వైశ్యస్యవర్తులాకారం శూద్రస్యైవత్రిపుణ్డ్రకమ్॥ ఊర్ధ్వపుణ్డ్రంతు సర్వేషాం ననిషిద్ధంకదాచన।ధారయేత్క్షత్రియాద్యోపివిష్ణుభక్తో భవేద్యది॥ ఇత్యాదిబ్రహ్మరాత్రో_క్త ప్రకారంబుగా విపత్కాలంబునందైన బ్రాహ్మణులకుఁ బట్టాకారత్రిపుండ్రధారణం బునుదేవతాంతరభ_క్తియుఁ బ్రసిద్ధంబుగాదు. బ్రాహ్మణునకు నూర్ధ్వపుండ్రంబును క్షత్రియున కర్ధచంద్ర రేఖయు వైశ్యునకు వర్తులాకారంబును శూద్రునకుఁ ద్రిపుండ్రంబును బ్రసిద్ధం బూర్ధ్వపుండ్రంబును సమ_స్తజనులకు ధార్యంబు గాని నిషిద్ధంబు గాదు. క్షత్రియాదులైనను విష్ణుభ_క్తులైరేని వారికాపుండ్రంబుధ రింపదగును, శ్లో॥ యోవినాచోర్ధ్వ పుణ్డ్రేణయత్కుర్యాత్కర్మవైదికమ్। నిష్ఫలం తస్యతత్కర్మభస్మన్యేవాహుతి ర్యథా॥ ఇత్యాదిమత్స్యపురాణో_క్తక్రమం బుగా నెవ్వాఁ డూర్ధ్వపుండ్రంబు లేక వైదికకర్మంబెద్ది యాచరించు నాక ర్మం బంతయు భస్మాహుతిగతి నిరర్థకం బగును, శ్లో॥ ఊర్ధ్వపుణ్డ్రవిహీనస్తు సన్ధ్యాకర్మసమాచరేత్। తత్సర్వం రాక్షసైర్నీతం నరకంచ సగచ్ఛతి॥ నిత్యం నైమి_త్తికం కామ్యం త్రివిధం శ్రుతిబోధితమ్॥ ఊర్ధ్వపుణ్డ్రవిహీనస్య సర్వంతన్నిష్ఫలంభవేత్॥ ఇత్యాదిహారీతస్మృత్యు_క్తక్రమంబుగా నెవ్వాఁ డూర్ధ్వపుండ్ర రహితుండై సంధ్యాకర్మం బాచరించుఁ దత్కర్మం బంతయు రాక్షసు లపహరిం తురు. వాఁడు దుర్గతిఁ జెందునిత్యనైమి_త్తిక కామ్యభేదంబులచేఁ ద్రివిధంబైన శ్రుతిబోధితకర్మం బూర్ధ్వపుండ్ర రహితుండై యెవ్వఁ డొనరించు వాని కాక

ర్మం బంతయు నిష్ఫలం బగు, శ్లో॥ ఊర్ధ్వపుణ్డ్రిఋజుస్సౌమ్యో లలాటేయస్య దృశ్యతే। చణ్డాలోపి హి శుద్ధాత్మా పూజ్య ఏవ నసంశయః॥ ఇత్యాదిపురాణాం తరోక్తక్రమంబుగా సౌమ్యంబును ఋజుతరంబు నగునూర్ధ్వపుండ్రం బెవ్వాని లలాటంబునం జూపడు వాఁడు చండాలుం డైనను బూజ్యుండు. సంశయంబు లేదు, శ్లో॥ ఏకాన్తినో మహాభాగా స్సర్వభూతహితేరతాః। సాన్తరాళం ప్రకు ర్వంతిపుండ్రంహరిపదాకృతిమ్॥ ఇత్యాదిపద్మ పురాణోక్తక్రమంబుగా సర్వభూ తహితమతులు మహాత్ములు నగునేకాంతులు హరిపదాకారంబులు సాంతరా ళంబులగుధవళచ్ఛిద్రోర్ధ్వపుండ్రంబులు ధరియింతురు. ఈ ప్రకారంబుగా బలవద బాధిత ప్రమాణసహస్ర ప్రతిపాదితంబులగు శంఖచక్రోర్ధ్వపుండ్రాధిభగవల్లాంఛ నంబులు బ్రాహ్మణాదిసమస్తజనుల కవశ్యధార్యంబులని గురుండానతీయ విని య ఘ్యా దేవుండు సంతసించి మహాత్మాభవదనుగ్రహంబున నీయర్థంబులయెడ సంశ యంబు లన్నియు నివర్తించె నింక శ్రీపరాంకుశ పరకాలాది దివ్య సూరులయవ తార రహస్యంబును దదీయదివ్య ప్రబంధమాహాత్మ్యంబు సవిస్తరంబుగా నాన తిమ్మని యడుగ నమ్మణవాళమహాముని యాప్రశ్నంబునకుం బ్రహర్షించి యాద్వి జునుద్దేశించి వత్సా నీవానర్చిన ప్రశ్నంబునకుఁ బ్రత్యుత్తరంబుఁ జెప్పెదవినుము పార్వతీ ॥శ్లో॥ భోనీలలోహిత త్వత్తశ్చాతుర్మాస్యోత్సవశ్శ్రుతః। ముదాసవిస్తరం తత్త్వపూతాహం శాసనాద్ధరేః। ప్రపన్నోత్సవ మద్యా శుతత్త్వతో బ్రూహి మే భృశమ్॥ శృణోమివాసు దేవశ్య కృపయా కౌతుకాద్దృతమ్। శంకరః॥ పురా వైకుంఠనగరే లక్ష్మ్యైసూత్రవతీం ప్రతి। గదితం విష్ణుసంప్రోక్త మితిహాసం పు రాతనమ్॥ ప్రపన్న జనసంత్రాణ పరాయణమనిందితమ్। భోగౌరి శృణువక్ష్యేహం పరమేశాంఘ్రి భక్తితః॥ పూర్వ ముద్వాహకాలే తే హిమాద్రౌదేవవల్లభాః। బ్రహ్మాద్యామునయస్స ర్వేత్రిలోకాంతరవాసినః॥ ఆగతాస్సర్వసన్నాహాస్సన్తుష్ట హృదయాన్తరాః। మయాసహస్థితాస్సమ్య క్సంతుష్టాస్స్వైర్ణగాత్మజే॥ తేషాం సమ్మేళనాద్గాఢాదుత్తరాభూర్న తాభృశమ్। దక్షిణాశావోర్ధ్వ గతాచచాల ధరణీ ద్రుతమ్॥ తాం దృష్ట్వా భీతిసమ్మగ్నా స్సర్వే లోకాశ్చరాచరాః। వైవాహికో త్సవం ద్రష్టు మాగతాస్స్వైర్ణగాత్మజే॥ తతః పితామహం దేవమబ్జజంరుక్మగా త్రకమ్॥ నివేదయామాసు రగ్రే సర్వే శక్రపురోగమాః॥ తతో విధిర్జగన్నాధ మనన్తం పితరం హరిమ్। ఆరాధయామాస యోగా ద్భక్తి పాలితవైభవాత్। అధాచ్యుతాజ్ఞయాప్రాహ లోకశిల్పివరార్యకమ్। విశ్వకర్మాణమాదృత్యముదా పఽమయాశివే॥ బ్రహ్మా॥ త్రిలోకి శిల్పకరణ నిపుణస్త్వం ధురంధరః। దృష్ట్వేదా

నీ మవన్యాయదౌన్నత్యం తత్సమం కురు॥ సర్వలోకోపకారాయ సర్వజీవావనా
యచ। ఉత్థితాయ జగన్నాథ కృపావేషాయ కౌశలాత్॥ తచ్ఛ్రుత్వావిశ్వ క
ర్మాచ కశ్య పారాధితం హరిమ్॥ నత్వాప్రాహ విధింవేగా దుపేన్ద్రాంఘ్రిసమాశ్రి
తః॥ విశ్వకర్మా॥ భూమేర్ద క్షిణ మౌన్నత్యం సమం కర్తుం మహామునిః। కుమ్భ
యోని రగస్త్యస్తుక్షమతే హరిశాసనాత్॥ సర్వజీవభయోపేతాం యమావా
సోపలాలితామ్। దక్షిణాశాం సమీకర్తు మముం త్వం ప్రేరయద్రుతమ్॥ తద్విజ్ఞా
యమునిః క్రోధఘూర్ణితాత్మహృదంతరః। విశ్వకర్మాణ మాలోక్యకోపాత్ప్రో
వాచసత్వరమ్॥ అగస్త్యః॥ భోవిశ్వకర్మన్ భూతేశ పార్వతీ శోభనోత్సవమ్। ద్రష్టుం
నిరీక్ష్యైవ మహంస్తాస్యా మ్యారాధ్య కేశవమ్॥ రచయామి శమీపత్రపుటంస
మ్యగహంస్థితః। తస్మాచ్చిరం సమాయాతైర్మునిభిః ప్రాప్తవాన్ సహ॥ సర్వేషా
మపిలోకానా మన్తరా విప్రియః కృతః। పైశున్యమధునాప్రాప్యత్వం మహద్గర్హి
తోసిమే॥ భోవిశ్వకర్మన్ కిమపిమయా పాపం కృతంత్వయి। వదాధునామమా
గ్రేతు శ్రుణోమ్యాష్యాంత రేదృశమ్॥? ఇత్యేవ మా భాష్యమునిరగస్త్యః కుం
భసంభవః। శశాప విశ్వకర్మాణం సర్వేషాం సన్నిధౌ శివే॥ అగస్త్యః। భోవిశ్వ
కర్మన్ తేశిల్ప విద్యాసఙ్కర జాతిషు। స్థాస్య తేహీనవృత్తిస్తుసంకరాన్వయజీవి
తా॥ విశ్వకర్మాచ తద్బుధ్వా స్వవిద్యా వద్యవేదనః। విద్వణ్ణహృదయస్తూర్ణం
ప్రతిశాపం దదౌమునేః॥ విశ్వకర్మా॥ కుమ్భయోనేభవద్వేద విద్యాద్రవిడ సంహి
తా। భవతాద్భగవద్భక్త పవిత్రీకృత వైభవా॥ క్రుద్ధోశపత్కుంభయోనిం విశ్వ
కర్మానతాననః। కాశ్యపారాధిత హరేస్సం సేవాన ద నిర్మలః॥ తంద్రుష్ట్వామ
తిమాన్ బ్రహ్మసమాశ్వాస్యమునిం తదా। ప్రేపయామాస హరితందక్షిణాం
యమపాలితామ్॥ అగస్త్యోపి శ్రీనివాసం సాష్టాంగం ప్రణిపత్యచ। సంస్మరన్వి
ష్ణునామాని విహ్వలస్తుసమాయయౌ॥ వింధ్య స్యౌన్నత్యమాక్షిప్య దక్షిస్యాం
కమండలుమ్। నిక్షిప్యచక్రేసమతాం భూమే ర్మునివర స్తదా॥ అథాగస్త్యోపి
యోగేనమలయాద్రౌశ్రియః పతిమ్। తప ఉద్దిశ్యచక్రే సౌచిరం హరిపదాశ్రితః॥
తత స్సర్వేశ్వరో దేవశ్శ్రీనివాసో జగన్మయః। మేఘగమ్భీరయావాచాప్రాహా
గస్త్యం మునీశ్వరమ్॥ శ్రీనివాసః॥ అగస్త్యతే భద్రమస్తు తపోమామత్పరోభవ।
త్వద్వేదవిద్యామద్భక్తైః పాలితాస్యాత్పునఃపునః। అనంతగరుడాదీనాంసూ
రీణాం నిత్యయోగినామ్। అంశోద్భూతా మహాభాగా జాయంతేహి మదాజ్ఞయా॥
కాసారో భూతయోగీచ మహదాఖ్యః కృతేయుగే। విష్ణుచిత్తో భక్తిసార స్త్రేతాయాం
కుల శేఖరః॥ భక్తాంఘ్రిరేణు ర్ద్వాపరే మునివాహః పరాంతకః। పరాఙ్కుశః కవిర్మి

శ్రీకలౌ రామానుజో మునిః॥ ఏ తేచాన్యే నిత్యసూరా మద్భక్తా స్సంగవర్జితాః। ప్రపన్నాస్సుర్వ శ్శంఖచక్రచిహ్నితా మన్త్రవిత్తమాః॥ పద్మాక్షతులసీమాలా శ్వేతమృత్పుం డ్రచిహ్నితాః। నిత్యయుక్తానిత్యముక్తా జీవేశపరిశీలకాః॥ అర్చాత్మనావతీర్ణం మా మనంతశయనం పరమ్। సమ్పత్కుమారం సౌందర్యకోమలం దివ్యవర్చసమ్॥ ప్రహ్లాదవరదం దేవంగరుడాద్రిపతిం హరిమ్। అనంత పద్మనాభంచ వేణ్యాదక్షిణకూలగమ్॥ తోతాద్రినాథం నృహరిచక్ర నాభ్యంతరస్థితమ్। నతాంగ విప్రసాక్షిత్వాభవనా ద్భావమాధవమ్। పినాకినీసరిత్తీరవాసినం శేషశాయినమ్। కాళిందీ తీరసంవాసం శ్రీ కృష్ణం రుక్మిణీ విభుమ్॥ ఆనందనిలయం దేవం శ్రీనివాసం చతుర్భుజమ్। నృహరిం ఘటికాద్రీశం ప్రపన్నత్రాణవైభవమ్॥ హృత్తాపనాశనీతీర వాసినం వీరరాఘవమ్। ఆదికేశవ మబ్జాక్షం పార్థసారథి మచ్యుతమ్॥ భక్తిసారాన్తరా పూర్ణం జగన్నాథం జగద్గురుమ్। బ్రహ్మయజ్ఞోద్భవం శ్రీశం వరదం దేవతోత్తమమ్॥ సీతాలక్ష్మణ మధ్యస్థం రఘునాయక ముత్తమమ్। దేవతానీకసంసేవ్యం దేవనాయకమాద్యకమ్॥ గోవిందం చిత్రకూటస్థం త్రిలోకేశం త్రివిక్రమమ్। ఆద్యం విస్మయం శ్వేత వరాహం వంద్రికోపమమ్॥ శార్ఙ్గపాణిం చక్రపాణిం వాసుదేవం శ్రియాసహితం జాపుస్థం నృహరిం రాజగోపాలబాలకమ్॥ మరుద్వృధా మధ్య సంస్థం రఙ్గిణం శేషతల్పగమ్। వనాద్రీశం చమద్భక్తాస్సేవంతే ద్రావిడేషు వై॥ తేషా ముద్గీయమానాం తాంద్రావిడ బ్రహ్మసంహితామ్। వృత్తగద్యాత్మికాం విద్యాంచతుర్వేదమయీం శుభామ్॥ మునే ద్రావిడదే శేషు పుణ్యక్షేత్ర యుతేషుచ। మత్సన్నిధౌ ప్రతిదినే పఠంతి ప్రతివత్సరే॥ ప్రబన్ధపఠనం యత్రతత్ర తత్రాలయేమమ। ఉజ్జీవయంతి తీర్థంచ ప్రసాదం వైష్ణవోత్తమాః॥ ఇత్యేతదుక్త్వా భగవాన్ శ్రీనివాస శ్శ్రియాసహ। తిరోదధేనిత్యముక్త నిత్యసూరిని షేవితః। అగస్త్యోపి ప్రసన్నాత్మా వివరామతప స్తతః॥ భక్తియుక్తః శ్రీనివాస ముపాస్తే మలయాచలే॥ అనుచు బ్రహ్మకైవర్తక పురాణంబున శ్రీమంగళాద్రి క్షేత్రమహాత్మ్య ఖండంబునం దిరువది తొమ్మిదవ యధ్యాయంబునం జెప్పఁబడిన యట్లు దాక్షాయణి తన భర్తనుంజూచి దేవా శ్రీమంగళాద్రి నృహరివాతుర్మాస్యోత్సవంబు నీ వలన విని కృతార్థ నైతి నింకఁ బ్రబన్నోత్సవంబు వినవేడ్క పొడమెఁ దద్వైభవంబు వర్ణింపు మనియడుగ నద్దేవి నుద్దేశించి యొకళ్యాణి తొల్లి శ్రీవైకుంఠపురంబునం దేతదర్థ విషయంబుగా శ్రీదేవి హరి నడిగి తెలిసి సూత్రవతికిం జెప్పిన పురాతనేతిహాసం బొక్కటి గలదు. అది నీ ప్రశ్నంబునకుం బ్రత్యుత్తరం బగు దాని వాక్రుచ్చెద వినుము. పూర్వకాలంబున భవదీయ వివాహ సమయంబు

నందు బ్రహ్మాది దేవతలును సమస్త మునులును సమస్తజనులును హిమాచలంబు న కేతెంచి నాతోడం గూడి సమ్మోదించుచున్న సమయంబున సమ్మేళిత సర్వజన మహాభారంబున కోర్వంజాలక యుత్తర భూభాగంబు గ్రుంగె దక్షిణోర్వీమండలం బూర్ధ్వగతం బయ్యె నంత భూమికంపం బుదయించె నప్పుడు చరాచర భూత జాతంబు లతిభీతిఁ జెంద నింద్రాది దేవతలు పితామహునిం గని మ్రొక్కి భూమండలంబునకు సమత్వం బర్థింప నతండు పెద్దయుం బ్రొద్దు తనకు జనకుం డగునారాయణుని ధ్యానించి నిజయోగ వైభవంబుచే స్వకీయ హృదయకమలకర్ణి కామధ్యస్థితుండైన పుండరీకాక్షుని సాక్షాత్కరించి యతని యనుగ్రహంబుచే నకలం బెఱింగి తదీయాజ్ఞచే సన్నిహితుండైన విశ్వకర్మనుం జూచి వత్సానర్వలోకోపకారార్థంబుగా నిబ్భాగత వైషమ్యంబు సవరింపుమని నియోగింప నతండు చతుర్ముఖు నుద్దేశించి మహాత్మా సర్వభూత భయంకరంబైన యమావాసంబైన దక్షిణ దిగ్భాగంబునం దౌనత్యంబు పాపుటకు నగస్త్య మునీంద్రుడు సమర్థుండు గాని నే శక్తుండఁ గాను గావునఁ దత్కార్య నిర్వాహార్థంబుగా వేగ యమ్మహర్షినిం బనుపుమని విన్నవింప నా వృత్తాంతం బంతయుఁ దెలిసి కలశోద్భవుండలిగివిశ్వకర్మ నుద్దేశించి పార్వతీకల్యాణోత్సవంబుఁ జూచుటకు ననేక మునీంద్రులంగూడి వచ్చి యా యుత్సవంబుఁ గని సంతసించుచు భగవదారాధనం బొనరించి తదీయ ప్రసాదానుభవార్థంబు శకీపత్ర భాజనంబు రచియించుచు నుంటి నిట్టి నాపై బ్రహ్మకడఁ బిశునోక్తిఁ జెప్పుటకుం గారణం బేమి నీకు నేనే మపకారంబుఁ జేసితి నిరపరాధి నగు నాపైఁ బిశునోక్తిఁ జెప్పితివి గాన నీకు శాపం బియ్యక మాననని క్రోధోద్దీపిత మానసుండై భవదీయశిల్ప విద్య విహీనతములగు సంకర జాతుల యందు వర్తించుచు వారికి జీవనోపాయం బగునని శపింప విశ్వకర్మయు స్వవిద్యక వద్యంబు ప్రాప్తంబయ్యెనని నిర్విణ్ణచిత్తుండై రోషాతిశయంబుచేఁ గుంభ సంభవునిం జూచి మునీంద్రా స్వల్పదోషంబునకై నాకు దారుణంబైన శాపం బిచ్చితివి నీకుం బ్రతిశాపం బియ్యక మాననని పలికి భవదీయ వేదవిద్యయు భగవద్భక్తి పవిత్రీకృత వైభవ యగు ద్రవిడ సంహిత యగునని ప్రతిశాపం బిచ్చె నంతఁ బితామహుండు నా వృత్తాంతం బంతయుఁ దెలిసి మృదువాక్యంబుల నగస్త్య మునీంద్రు నూఱడించి దక్షిణ దిగ్భాగంబున కనుప నమ్మహర్షి శ్రేష్ఠుండును శ్రీమన్నారాయణునిం దలంచుచుఁ దదీయదివ్యనామంబు లుచ్చరించుచు నేతెంచి వింధ్యపర్వతౌన్నత్యం బడంచి దక్షిణదిగ్భాగంబు నందొక్కచో నిజకమండలువుంచి భూచక్రం బంతయు సమంబు గావించి మలయాచలంబున కరుగుదెంచి

వేదంబులకుఁ బ్రాప్తంబైన విశ్వకర్మ శాపంబుఁ దలంచి సంతప్తహృదయుండై యమ్మహాద్రియందు శ్రియఃపతినుద్దేశించి చిరకాలంబు తపంబొనరించిన సర్వేశ్వరుం డగు భగవంతుండు ప్రసన్నుండై మునీంద్రా నీకు శుభంబగు ద్రవిడసంహితా రూపంబులగు వేదంబులు సారెసారె కస్మద్భృద్భక్త పరిపాలితంబులగును గావున నీవు చింతింప వలదు మదీయాజ్ఞచే ననంత గరుడ విష్వక్సేనాదినిత్య సూర్యంశంబుల మహాత్ములదయింతురు వారెవ్వరఁటివేని కృతయుగంబునం దవతరించు కాసారభూత మహదాఖ్య యోగీంద్రులు మువ్వురును త్రేతాయుగంబునం దవతరించు విష్ణుచిత్త భక్తి సారకుల శేఖరులు మువ్వురును ద్వాపరయుగంబునం దవతరించు భక్తాంఘ్రి రేణు మునివాహన పరకాల యోగీంద్రులు మువ్వురును కలియుగంబునం దవతరించు శ్రీపరాంకుశ మధురకవిరామానుజ మునీంద్రులు మువ్వురును నీపన్నిరువురుంగాక మఱియుఁగొందఱు నిత్య సూర్యవంశంబులచే నుదయించి మద్భక్తిపరాయణులై సంగవర్జితులై యనన్యప్రపన్నులై శంఖ చక్రాంకితభుజులై మంత్రవిత్తములై పద్మాక్షతులసీవనమాలాలంకృతులై ధవళచ్ఛిద్రోర్ధ్వపుండ్రధారులై నిత్యయుక్తులై నిత్యముక్తులై జీవేశ పరిశీలనతత్పరులై యుభయకావేరీ మధ్యరంగబునఁ బ్రణవవిమానంబునందు శ్రీరంగనాథుని వేంకటాచలంబునం దాన ద నిలయవిమానగతుని శ్రీవేంకటేశుని వేగవత్యుత్తర తీరంబునఁ బుణ్యకోటి విమానంబునందుఁ గరిగిరివరదుని యాదవాద్రియందు సంపత్కుమారునిఁ దిరువనంతపురంబున శ్రీమదనంతశయాను నహోబలంబున గరుడాచలంబునందు హిరణ్యాసురవర్ధనుండును బ్రహ్లాదవరదుండు నగు శ్రీనారసింహుని ఘటికాచలంబున నరకేసరిని హృత్తాపనాశినీతీరంబున శ్రీ వీరరాఘవుని భూతపురియం దాదికేశవునిఁ గైరవిణీతీరంబునఁ బార్థసారథిని మహీసారపురంబున జగన్నాథునిఁ దిరువహీంద్రపురంబున దేవనాయకునిఁ దిల్ల చిత్ర కూటంబునందు గోవింద రాజులను, దిరుక్కోవలూరియందుఁ ద్రివిక్రముని శ్రీ ముష్ణంబున శ్వేతవరాహమూర్తిని గుంభకోణంబున శార్ఙ్గపాణిని జక్రపాణిని దంజాపురంబున నరహరిని మన్నారుకోవెల రాజగోపాలుని వానాద్రియందు సుందర బాహునిఁ గృష్ణాదక్షిణ కూలంబున వైష్ణవాశ్రమంబునందే దోతాచలాపరనామధేయం బైన మంగళాద్రియందుఁ జక్రనాభ్యంతరవర్తియై గుడోదకపానం బొనరించు నృశింహునిఁ మంగభద్రాతటంబున గోష్ఠీవనంబునందుఁ దగుభూషిత గోవింద భట్టారకునకుం బ్రసన్నుండై సాక్షిగా నేతెంచిన భావనారాయణునిఁ బినాకినీరంబున శేషతల్పశయాండగు నుత్తర రంగశౌరిని శ్రీ భద్రాద్రియందు సీతాలక్ష్మణ మధ్యస్థుండైన శ్రీ రఘురామునిఁ గాళిందీతీరం

బున రుక్మిణీ సమేతుండగు శ్రీ కృష్ణుని మఱియు ద్రవిడ దేశంబులంగలదివ్య క్షేత్రం బు లన్నియు సేవించుచు నా యా దివ్యదేశంబులయందు నెలకొన్న నన్ను రమణీ య వృత్తగద్యాత్మకయుఁ జతుర్వేద స్వరూపిణియు నగు నీ ద్రవిడసంహిత దేవగా నంబుచేఁ బాడుచు నానందింపంజేయుదు రాప్రకారంబుగాఁ దచ్ఛిష్యప్రశిష్యు లైన శ్రీ వైష్ణవు లశ్రాంతంబు నుభయకాలంబులయందు మత్సన్నిధి ననుసంధిం తురు. మఱియుఁ బ్రతిసంవత్సరంబునందు నాలాయిరప్రబంధంబుననుసంధింతు రు ఆదిమేప్రపన్నోత్సవం బనంబరఁగు నేయేభగవదాలయంబులయందుఁ బ్ర బంధానుసంధానంబు ప్రపన్నోత్సవపూర్వకంబుగాఁ జేయఁబడునా యాస్థలంబు లన్నియు దివ్యదేశంబులనంబడు నాస్థలంబులయందు శ్రీ వైష్ణవులు తీర్థప్రసాదం బు లుజ్జీవింతు రని మేఘగంభీర భాషణంబుల నానతిచ్చి యగస్త్యమునీంద్రునిం బ్రహర్షింపఁజేసి యద్దేవదేవుండంతర్హితుండయ్యె నంతనమ్మహర్షి శ్రేష్ఠుండును సుప్రసన్నాంతరంగుండై తపంబుడిగియమ్మహాత్ముని దివ్యమంగళ విగ్రహంబు సంస్మరించుచు మలయాద్రియందు సుఖంబుండె నని హరుం డుదాహరించెఁగావు న వేదాపరమూర్తు లగుదివ్యప్రబంధంబులు శ్రీవైష్ణవుల కవశ్యానుసంధేయం బులు మఱియును దత్పరిభావంబు విమము. శ్లో॥ శ్రీసనత్కుమారః॥ భగవన్ భూతిభవ్యేశ భగవత్పార్షదేశ్వర । భక్తేషువర్తమానేషుశరకోప ఇతిస్మృతః॥ మునిశ్రేష్ఠతయావాసౌ శ్రుతపూర్వోమయాధికః । తస్యానుభావం భగవన్నశేష క్తు మర్హసి॥ శ్రీవిష్వక్సేనః॥ వైవస్వతమనౌ ప్రాప్తేహ్యష్టావింశతి కేకలౌ, పంశేవిశాం మునిః కశ్చిద్భవిష్యతి హరిప్రియః॥ అస్తి పాండ్యేషు నగరీ కాంచి ప్ఫ్రినగరీతిహి। తామ్రపర్ణీనదీతీరె సాక్షాద్విష్ణో రతిప్రియా॥ తత్రవైశ్యకులే కశ్చి ద్విష్ణోరంశాంశస భవః । శరకోప ఇతిఖ్యాతోమహాయోగీభవిష్యతి॥ జ్ఞాన విజ్ఞాన పూర్వత్వా త్తినిర్ణిణీమూల మాశ్రితః । బాలఆషోడ శాబ్దాత్తుమూకభావం గమిష్యతి॥ నియోగేన మహావిష్ణో ర్వేదవేదాంగసంహితాం । కరిష్యతిసహస్రేణ గాథాంద్రావిడభాషయా॥ కృపయాతత్ప్రణీతాయా బ్రహ్మవిద్యా మహాత్తరా । అధ్యేతవ్యా ద్విజైర్భూపై ర్వైశ్యైశ్శూద్రైశ్చ సర్వశః॥ శ్రీసనత్కుమారః॥ ద్రావిడానాం చగాథానాం కృతానాం తేనయోగినా । కస్మాత్సా ద్బ్రహ్మవిద్యా త్వమధ్యేతవ్యాకుతస్త్వితి॥ పరం కౌతూహలం దేవశరకోప మునింప్రతి । జాయతే తదశేషేణ భగవన్వక్తు మర్హసి॥ విష్వక్సేనః॥ ఏతాశ్చతుర్విధా గాథా ద్రావిడా వేదసమ్మితాః । కలౌకలౌ ప్రణీయన్తే కృపయాజ్ఞాన యోగిభిః॥ ద్వాప రాన్తే యథా వ్యాసో వదిష్యతిమహామతిః । తద్వదేవతామహగాథాశ్శర కోపః

ప్రణేష్యతితే ॥ అల్పశ్రుతానల్ప మతీనల్పాయుష్యాంశ్చ మానవాన్ । కలౌ సమీక్ష్యవేదానాం బాహుళ్యంచ మహామతిః ॥ శాఖాసహస్రం వేదానాంగా ధారూపం విధాస్యతి । ద్రావిడ బ్రహ్మవిద్యా సాతస్మాదుత్తమహామునే॥ సనత్కుమారః॥ ఏవం చేత్సర్వభాషానుగాథాస్సన్తి సహస్రశః । నరాశ్చబ్రహ్మవిద్యాః స్యుః కథం కేనప్రభోభువి॥ శ్రీవిష్వక్సేనః॥ సమ్యగుక్తస్త్వయాప్రశ్న స్తత్రతత్కారణంశ్రుణు । సంస్కృతస్యయథాసన్తి ద్రావిడస్యాపి భూతలే । అగస్త్యో భగవాన్సాక్షాత్తస్య వ్యాకరణం యథా॥ పాణినీయాను సారేణ మలయాచల సంజ్ఞికమ్ । ఛన్దశ్శాస్త్రానుసారేణ ద్రావిడస్య ప్రబంధతా॥ ద్రావిడస్య ప్రబంధస్యవృత్తానా మపి లక్షణమ్ । ఉత్తమస్య తథాచైవ ద్రావిడస్య మహామునే॥ వేదశాస్త్రానుసారేణ ద్రావిడస్య ప్రబంధతా । ద్రావిడస్య ప్రబంధస్య తస్మాత్సంస్కృతవచ్ఛ్రుతత్॥ సంస్కృతస్య క్రియాయద్వ ద్ద్రావిడస్య క్రియాస్తథా । నిత్యాస్తద్వత్ప్రణీయన్తేమునిభిశ్చకలౌ కలౌ॥ ఇత్యాది మార్కండేయపురాణంబునందు భగవద్ధర్మంబునందు షష్ఠాధ్యాయోక్త క్రమంబుగా సనత్కుమారుండు విష్వక్సేనునింగాంచి నమస్కరించి దేవా వర్తమాన భక్తులయందు శఠకోప మునీంద్రుండు శ్రేష్ఠతముండని విని యుంటి నమ్మహాత్ముం డెచ్చోట నెవ్వరికులంబునం దుదయించి యేయే దివ్యచేష్టితంబు లొనరించెనవి యన్నియు నాకర్ణింపఁగౌతూహలంబు పొడమెఁ గావునఁ దత్ప్రభావంబంతయు నెఱింగింపు మని ప్రశ్నంబు సేయ విని విష్వక్సేనుండును దదీయం బగుసమీచీన ప్రశ్నంబునకు మిగుల సంతసించి మునీంద్రా వైవస్వతమన్వంతరంబునం దిరువదెనిమిదవమహాయుగంబున సంప్రాప్తం బగు కలియుగాది మకాలంబునందుఁ బాండ్యదేశంబునఁ దామ్రపర్ణీతీరంబున శ్రీకురుకాపురంబునందు వైశ్యకులంబున భగవదంశాంశసంభూతుండై శ్రీశఠకోపయోగీంద్రుండు భగవత్ప్రసాదాసాదిత పరభక్తి పరజ్ఞాన పరమభక్తి పరిపూర్ణుండై తింత్రిణీతరుమూలం బాశ్రయించి బాల్యంబు మొదలుకొని షోడశాబ్దపర్యంతంబు మూకభావంబు వహించి యనంతరంబ భగవదాజ్ఞచే సహస్రశాఖోపనిషత్ప్రపంచంబు సహస్రగాథాత్మక యగు ద్రావిడ బ్రహ్మసంహిత గావించునాసంహితయు విష్ణుదాసులగు బ్రహ్మ క్షత్ర వైశ్య శూద్రుల కధ్యయనార్హంబగు నని యానతీయ నాకర్ణించి దేవాయప్పరాంకుశముని కృతంబైన ద్రవిడభాషాత్మక గాథాసహస్రంబు బ్రహ్మవిద్యయై యెట్లధ్యయనార్హంబగు నీవృత్తాంతంబంతయు వినుటకుంగుతూహలం బుదయించెగాన సవిస్తరంబుగా నానతిమ్మని మగిడి యడుగ నాసనత్కుమార నుద్దేశించి యోగిసత్తమా ద్వాపరాంతంబున వేదవ్యాస మునీంద్రుం

దనంతంబులైన వేదంబుల చతుర్విధంబులుగా విభజించి ప్రవర్తింపంజేసినయట్లు క్రిష్ణావతారానంతరభావి యగుకలియుగాదిమ కాలంబున శఠకోప మునీంద్రుం డవతరించి యల్పశ్రుతులల్పమతులల్పాయుష్కులనగు మానవులను వేదబాహ్యంబునం జూచి కరుణార్ద్రచిత్తుండై యామ్నాయశాఖా సహస్రంబు ద్రవిడ గాథాసహస్రాత్మకంబుగా నొనర్చి శిష్యప్రశిష్యముఖంబుగాఁ బ్రవర్తింపఁ జేయుఁ గాన యది బ్రహ్మవిద్య యయ్యెనని సైన్యనాథుండు పలుక నట్లాయె నేని సర్వభాషాత్మకంబులుగా నరులొనర్చిన గాథావిశేషంబుల సంఖ్యాతంబులు గలవనియన్నియు బ్రహ్మవిద్యలుగావలెనని మరల శంకింప విని విష్వక్సేనుండుమునీంద్రా శ్రుతులకు శిక్షావ్యాకరణాద్యంగంబుల ఋషులొనరించునట్లు భగవంతుండైన యగస్త్యమునీంద్రుండు శిక్షావ్యాకరణవృత్త లక్షణాదులన్నియుఁ దానే రచియించెం గాన యది బ్రహ్మవిద్య యగుటకు సంశయంబు లే దదియునుంగాక యామ్నాయంబువగిది స్వతః ప్రమాణంబై యపౌరుషేయంబైన ద్రావిడవేదంబు క్రిష్ణావతారానంతరభావి యగు ప్రతికలియందు విష్ణువున కత్యంతప్రియుండైన శ్రీశఠకోపయోగీంద్రునివలనం బ్రకాశితంబగుఁగాన సాక్షాద్వేదం బగునని భగవత్సేనాపతి యానతిచ్చె మఱియును, శ్లో॥ కలౌ పునః పాపరతానుభూతే సమస్త భూతాశ్రితవత్సలత్వాత్। భక్తాత్మనా విశ్వజనాన్ జుగోపవిశ్వాధి కోవిశ్వమయోహి విష్ణుః॥ అనియెడు న్యాయంబున విశ్వాధికుండును విశ్వమయుండు నగు విష్ణుండు సమస్త భూతాశ్రితవత్సలుండు గాన పాపభూయిష్ఠం బగుకలియుగంబునందు శ్రీశఠకోపాఖ్య భక్త స్వరూపంబు ధరియించి విశ్వజనుల రక్షించు నదియునుంగాక, శ్లో॥ ద్వితీయేతు పరార్ధేతు దినేత్వాద్యేథసప్తమే। మన్వన్తరేవర్తమానేత్వష్టావింశే చతుర్యుగే॥ కలే రాదౌ జన్మయోగీ శఠకోప ఇతిస్మృతః। మద్భక్తోహం భవిష్యామి నేతుం ద్రావిడతాంశ్రుతిః॥ తత్రక్షేత్రేజన్మ భాజా శఠకోపేనయోగినా। ముక్తిం భువిజనాస్సర్వే గమిష్యన్తి కలావపి॥ అనుచు బ్రహ్మాండపురాణంబునందు క్షేత్రమాహాత్మ్య ఖండంబునఁ గురుకాపురీ మాహాత్మ్యంబునందలి ప్రథమాధ్యాయంబున బ్రహ్మ నుద్దేశించి భగవంతుం డానతిచ్చిన యట్లు ద్వితీయ పరార్ధంబునఁ బ్రథమ దివసంబునందు సప్తమంబైన వైవస్వతమన్వంతరంబునం దిరువదెనిమిదవ మహాయుగంబునఁ గలియుగాదిమ కాలంబునందు శ్రుతిని ద్రావిడ భాషాత్మకంబుఁ జెందింప జననంబు మొదలుగా మహాయోగియు మద్భక్తుండు నగు శఠకోపమునీంద్రుండ నై నేనే యవతరించెద నా కురుకాపురీ క్షేత్రంబునం దుదయించిన శ్రీ శఠకోపయోగీంద్రునివలన సమస్త జనులు కలియందైనను ము

_్తికిం జనుదురని భగవంతుం డానతిచ్చె మఱియును, శ్లో॥ శ్రూయతా ముచ్యతే కిఞ్చి ద్రహస్యం మునిస త్తమాః। కాన్తారే తి న్త్రిణీభూత్వా మచ్ఛయ్యా భుజ గేశ్వరః॥ నిర్నిద్ర తి న్త్రిణీశత్వ మేష్యత్యయ మభీష్టదః। నేతుం ద్రావిడతాం వేదా॥త్ర యీ మూ ర్తి సమాగతా॥। మద్భ క్త శ్శఠకోపాఖ్యో భవిష్యతి మ దిచ్ఛయా ఇత్యాది బ్రహ్మాండపురాణంబునఁ జతుర్థాధ్యాయో క్త క్రమంబుగాము నీంద్రులారా మీ కేనొక రహస్యం బెఱింగించెద సావధాన చి త్తులరయివినుండ నుచు మహర్షుల నుద్దేశించి మదీయశయ్యాభూతుఁడై సర్వాభీష్ట ప్రదాయకుం డైన శేషుండు కురుకాక్షేత్రోపవనంబున నిర్నిద్రతింత్రి ణీవృక్షంబై జనియించు నావృక్షంబుకడ వేదంబులు ద్రవిడ భాషాత్మకంబుగా నొనర్ప మద్భక్తుండైన శఠకోపయోగీంద్రుండు మన్నియోగంబుచే నుదయించునని పరమపురుషుం డాన తిచ్చె మఱియును, శ్లో॥ క్రూరేకలియుగే ప్రాప్తేనా స్తికైః కలుషీ కృతే। విష్ణో రథాంశ సంభూతో వేదవేదా న్తత త్త్వవిత్॥ స్తోత్రం వేదమయం కర్తుంద్రావి డ్యా నిజభాషయా। జనిష్యతిసతాం శ్రేష్ఠో లోకానాం హితకామ్యయా॥ సపు మాం త్సర్వశాస్త్రజ్ఞో హ్యన న్తం వేద మవ్యయమ్। సర్వాధికారం ధర్మాత్మా కీ ర్తిష్యతి తతో మునిః॥ క్రూరే కలియుగే ప్రా ప్తే విష్ణోఃకీ ర్తనమేవహి। కథితం సర్వశాస్త్రజ్ఞైర్మునిభి ర్వేదపారగైః॥ తస్మా త్తుపురుష శ్రేష్ఠోభ క్తానామమృతోపమః. త్రియుగత్వాచ్ఛవిప్రేన్ద్రా విష్ణత్వవ్య క్తమూ ర్తిమాన్॥ కలిదోషాభిభూతా నాం ప్రజానాం పాలనాయవై। ధారయిష్యతి తద్రూపం కృపయాపురుషో త్తమః। అధ్యేతవ్యం ద్విజశ్రేష్ఠై ర్వేదరూపమిదం కృతమ్। స్త్రీ భిశ్శూద్రాదిభిశ్చైవ తే షాం ము క్తిః కరేస్థితా॥ ఇట్లు బ్రహ్మాండపురాణంబునం దు త్తర భాగంబున మా ర్కండేయార్జున తీర్థయాత్ర ప్రకరణంబునఁ దామ్రపర్ణీ మాహాత్మ్యంబునందశీతిత మాధ్యాయో క్తక్రమంబుగాఁ గ్రూరం బైన కలియుగంబు ప్రా ప్తంబై నా స్తికు లచేఁ గలుషీకృతం బగుచుండ వేదవేదాంత త త్త్వ వి త్తముండు దక్కిన సకల శాస్త్రంబులయందు సర్వజ్ఞుండు బరమధార్మికుండును సత్పురుష శ్రేష్ఠుండును సం శ్రితుల కమృత స్వరూపుండు నగు శ్రీ పరాకుంశయోగీంద్రుండు వైష్ణవాంశం బుచే సర్వహితార్థంబుగా నవతరించి యనంతం బైన వేదంబు ద్రావిడ భా షచే సర్వాధికారంబుగా రచియించు వేద రూపంబైన యీ దివ్య ప్రబంధంబుద్వి జ శ్రేష్ఠుల కధ్యేతవ్యంబు మఱియు స్త్రీ శూద్రాదులెవ్వ రధికరించిన వారికి ము _క్తికరతలామలకం బగుఁ గలిదోషాభిభూతు లగు చేతనులకు విష్ణు ప్రియకరంబై

నతదీయనామ సంకీర్తనం బింతకంటె వేఱొక్కటి లేదు మఱియును, శ్లో॥ భవ త్యాసాధు కథితం మమాపి హృది వర్తతే। సృష్ట్యాదౌచేత నానాంహి దేహాదీని చ సృష్టవాన్॥ ఏ తైర్మచ్చేయురప్యేతే మత్పాదపరిచర్యయా। అభిసన్ధాయ భగ వా నిత్యేవం భూతభావనః॥ తేచకర్మభి రాత్మీయైః ప్రాచీనైః కష్టమానసాః। తతో దత్తానవయవానీహంతే భోగసాధనాన్॥ అవతారై రనేకైశ్చప్రత్యక్షం ప్రతి చోదితాః। లోకదృష్ట్యా నబుద్ధ్యన్తే దేవమేవేతిమానుషమ్॥ తతశ్చ భగవద్జ్ఞాన విముఖం సంకలం జనమ్। అనుకంపయితుం దేవఃకలికాలే విశేషతః॥ నోశూద్రః పరమః ప్రాజ్ఞో నిర్విశేష మిదంజగత్। ఉజ్జీవయితు మారబ్ధస్సూరీణా మవతార ణాత్॥ ద్రావిడేషు విశేషేణ ప్రభవిష్యన్తిసూరయః। భగవత్కాముకా దేవీతా మ్రపర్ణీతటాదిషు॥ సర్వైశ్వర్యస్వయంసిద్ధా భగవద్జ్ఞాని వైభవాత్। అయో నిజాయో నిజాశ్చ దేవాజ్ఞా పరిపాలకాః। ప్రబుద్ధాః ప్రాకృతజనాన్ ప్రబోధయితు ముద్యతాః। శరీరాదపినైస్పృహ్యం భగవచ్ఛరణార్థినామ్॥ బాన్ధవం విష్ణుభక్తేషు జయభోగ పరాయణాత్। ధర్మార్థైరను పాయత్వం ప్రధయిష్యంత్యురు ప్రభాః।

ఇత్యాది క్రమంబుగా వృద్ధ పాద్మంబున భవిష్యత్పురాణంబున భాగవతా మాహా త్మ్యంబునందుఁ బంచమాధ్యాయంబున భూతభావనుండై నభగవంతుండు సృష్ట్యా దియం దసత్ప్రాయులైన చేతనులం గటాక్షించి దయమానమానసుండై వీరు మత్పాదాబ్జంబు లారాధించి కృతార్థులు గావలెనని తనతలంపులందలఁచి వారికిఁ గరణకళేబరంబు లొసంగ వారును బ్రాచీనాత్మీయకర్మ వాసనలచే దుష్టమన స్కులై భగవద్దత్తంబు లగుకరణ కళేబరంబుల శబ్దాదివిషయభోగసాధనం బులుగాఁ జేయ నది యెఱింగి శ్రీహరియును రామకృష్ణాద్యవతారంబు లొనరించి బోధింప నుద్యోగింప నద్దేవదేవుని మనుష్యునిఁగా నెంచిరి గానిపరమపురుషుం డని తెలియలేరైరి తదనంతరంబ భగవంతుండు సుజ్ఞానవిముఖం బైనయజ్ఞంతు జాతంబు నిరీక్షించి నిత్యసూరులనవతరింపంజేసి తత్కృతబోధంబుచే వారలం బ్రబుద్ధులం జేసెదనని మదినెంచిసూరులనియమింప భగవదాజ్ఞ చేననంత గరుడ విష్వక్సేనసుదర్శన పాంచజన్యాది నిత్యసూరులందఱు కలికాలంబున వీఁడు శూద్రుండు వీ డుత్కృష్టుండు వీఁడుప్రాజ్ఞుండని విశేషవిచారంబు సల్పక యం దఱికిని స్వరూపజ్ఞానంబు బోధించుటకు ద్రవిడదేశంబులయందు శ్రీతామ్రపర్ణి మరుద్వృధాది మహానదీ సమీప ప్రదేశంబులయందు యోనిజు లయోనిజు లగు పరాంకుశ పరకాలకాసారభూత మహదాది మహాయోగులై యవతరింపఁగలరని

సూత్రవతి నుద్దేశించి శ్రీదేవి యానతిచ్చె మఱియు నప్పురాణంబు ద్వాత్రింశద ధ్యాయంబున. శ్లో॥ అధతే కథయిష్యామి శ్రుణుత్వ మిద ముత్తమమ్ । యచ్ఛ్రుత్వాతాం భగవతి భక్తి ర్భవతి శాశ్వతీ॥ తటినీ తామ్రపర్ణీతిపుణ్యాజగతి విశ్రుతా। ముక్తానాం చైవ జననీ ముక్తి దస్యాన వైభవా। తస్యాస్తీ రేస్తినగరీకురుకేత్యురుకాననా । సన్నిధత్తే సదాయత్రశఙ్ఖ చక్రధరోహరిః॥ తత్ర భక్తిచమత్కారీ కారీతిభగవత్ప్రియః । భవిష్యత్యనపత్యో వైభార్యయా భర్తృదేవయా॥ తేన పర్యీక్ష్యమానోపి తపోభిః పుత్రదైర్హరిః । సేనేశం ప్రీతిభావేన స్వభక్తం స నియోక్ష్యతి॥ తతః కలియుగస్యాదౌ వైశాఖ్యాం విశ్వభావనః । విష్ణుభక్తి ప్రతిష్ఠార్థ సేనేశోవతరిష్యతి ॥ శఠకోపాభి ధానశ్చ పుత్రకస్సూత కాత్పరమ్। అనాహారతయాగేహం పితృభ్యాం ప్రాపితో హరేః॥ నపిబ న్నరుదన్నాశ్నన్న బాహూ చరణం క్షిపన్ । హృష్టపుష్టతనుంబాలంతంత్ర నిక్షిప్యతేజనాః॥ చిహ్నితం శఙ్ఖచక్రాద్యైరాయుధైర్మధువిద్విషః। శాయితోబాలపర్యఙ్కే సౌమ్యరత్న పరిష్కృతే॥ వినిద్రతి న్తింత్రిణీమూలే విశాలవిటపోజ్జ్వలే । పితృభ్యాంరక్ష్యమాణోధవర్ధిష్యతి దినేదినే॥ నిర్మాత్రో నిష్పరీషశ్చనిరాహార స్త్వరోదనః। సంభ్రమిష్యతికాలేన పరితోహరిమన్దిరమ్ ॥ సతు బద్ధాసనో మౌనీవృద్ధిగామి ప్రదాయినీ । నిమీలితాక్షియుగళ స్తిమితో వర్తయిష్యతి ॥ ధ్యాయమానోహ్యపి కేశంహృష్టపుష్టాంగసౌష్ఠవః । పద్మాసనం సమాస్థాయపద్మ పత్రనిభేక్షణః॥ పద్మనాభస్య దేవస్య పాదపద్మార్చనే స్థితః । ఇత్థమాషోడశంవర్షకాలంకలిమలాపహమ్ ॥ భగవద్ధర్మ సంహ్లాదభరితః క్షపయిష్యతి।సుజ్ఞానఘనపూర్ణత్వాత్తి న్త్రిణీమూలమాశ్రితమ్॥ బాల ఆషోడశాబ్దాత్తు మూకభావంగమిష్యతి। తత స్తమస్సముద్రాన్తం విచ్ఛేత్తుం తార్క్ష్యవాహనః॥ నేత్రాబ్జమున్మీలయితుంకోటి సూర్యసమప్రభః। శ్రియాసమస్త చిదచిన్నియన్త్రాశ్రీవ్యాప్త వైభవః॥ శఙ్ఖ చక్రధరస్సాక్షాద్దివ్య పీతామ్బరోజ్జ్వలః। కిరీటహార కేయూరకటకాంచిత విగ్రహః॥ కుండలీ కౌస్తుభ స్రగ్వీపురః ప్రాదుర్భవిష్యతి। వేదతుల్యైః ప్రబంధైశ్చభగవద్భక్తి జృంభితైః॥ ప్రవాహైరివ గంగాయాఃపామరాన్వేదయిష్యతి। తథామధురకవ్యాద్యాస్సూరయస్త మ్ముఖోద్యతాన్॥ ప్రబంధాన్ ప్రాప్యవిశదాన్ వదిష్యన్తి కృతార్థకాః। తతోగరుడమారోప్య శరారిం నిజమన్దిరమ్॥ శ్రీ వైకుంఠ మనుప్రాప్య ప్రవేక్ష్యతిని జాంతనుమ్। తతఃకాలేన మహతా వినష్టాం భువి తత్కృతమ్॥ నాథనామామునివరో యోగజ్ఞానమవాప్స్యతి। తతఃకాలే బహూతిథేవినష్టాం విష్ణువర్ధినీమ్ । త్రిదండమండితో దేవో మునిః

ప్రవ్యక్తయిష్యతి। పాషండబహులే లోకేకుదృష్టి జనసంకులే॥ మోహ్యమానా జగతీ విన ష్టేహరిపైభవే। మోహనై రాసురై శ్శాస్త్రైఃకుయుక్తి పరికల్పితైః॥ వేదాంతమార్గానుగతై రన్యైః కుమతిసుందరైః। సిద్ధాంతై ర్వ్యాస్తృతంలోకం పునరుద్ధారయిష్యతి॥ బాదరాయణ సంజ్ఞస్య విశ్రుతస్యమహామునేః। మతం వేదాన్తతాత్పర్యం విశ్రుతం ప్రేక్ష్యభూతలే। త్రిదండధారీ భగవాన్ వేత్రపాణిః ప్రియస్తథా। భక్తానాం భాగధేయేనభువి ప్రాదుర్భవిష్యతి॥ ఇత్యాది పూర్వోక్త పురాణంబునందు ద్వాత్రింశదధ్యాయోక్త క్రమంబుగా సూత్రవతి నుద్దేశించియో దేవీ మఱియునొక చరిత్రంబు చెప్పెద నేచరితం బైన విన్న వారికి భగవంతుని యెడ భక్తి యనుదినంబు వృద్ధిఁజెందు నెట్టంటివేని మజ్జగంబులయందు స్నాన పానంబులచే ముక్తిదాయినియు మౌక్తికంబులకు జన్మస్థాన మనియుఁ బ్రసిద్ధి గాంచిన తామ్రపర్ణియని యొక మహానదిగలదు త త్తీరంబున సమృద్ధకాననంబగు గురుకానగరంబున శంఖచక్రగదాధరుండగు హరి నిత్యసాన్నిధ్యం బొనర్చు నప్ప ట్టణంబున భక్తి చమత్కారి యగు కారిసూరి భర్తృదేవత యగు నిజ భార్యతో నిత్యవాసం బొనరించు. శ్రీ హరి శాసనంబున సేనేశుండు కలియుగాదికాలంబున విశాఖానక్షత్రయుక్త పౌర్ణమాసియందు నతనికిఁ బుత్రుండై యుదయించు శఠకోపాభిధానుం డగు నక్కుమారుం డనాహారుండు గావున జాతసూతకానంతర కాలంబునఁ దల్లిదండ్రులచే హరిమందిరంబుఁ జెందింపంబడు నక్కుమారుండును స్తన్యపానం బొనరింపక యేడ్వక యశనం బొల్లక కరచరణంబులు కదల్పక హృష్టపుష్టతనుండై శంఖచక్రాది భగవల్లాంఛనాలకృతనిజభుజమూలుం డై విశాల విటపోజ్జ్వలం బై నవినిద్రతింత్రిణీవృక్షంబు క్రింద సౌమ్యరత్న పరిష్కృతం బై బాలపర్యంకంబునందు శయనించి తల్లిదండ్రులచే రక్షితుండై వర్ధమాన చంద్రునిమాడ్కి నశ్రాంతంబు వర్ధిల్లు మఱియును నబ్బాలకుండు వత్సరవయ స్కుండై మూత్రపురీషరోదన స్తన్య పానాదులులేక హరిమందిరంబునం దంతటఁ బాఱాడుచు నొక్కనాఁ డ త్తింత్రిణీకోటరంబుఁ జొచ్చియందు బద్ధ పద్మాసనుండై నిమీలితాక్షియుగళుండై హృష్టపుష్టావయవసౌష్ఠవుండై హృదయకమలకర్ణికా మధ్యంబున శ్రీ హృషీకేశునిధ్యానించుచు నిశ్చల మనస్కుండై షోడశవర్ష పర్యంతంబు పరమపురుషాను భవజనిత పరమానందభరితుండై మౌనియైకాలంబు గడపుచుండు నయ్యవసరంబున గరుడవాహనా రూఢుండును గోటిసూర్యసమప్ర భుండును లక్ష్మీసమేతుండును శంఖచక్రాదిదివ్యాయుధ ధరుండును దివ్యపీతాంబ రాలంకృతుండును గిరీటహారకేయూరమకరకుండలకటక కటిసూత్రశింజానమంజు

మంజీరాద్య పరిమితదివ్యభూషణభూషితుండును శ్రీ వత్సకౌస్తుభ వైజయంతీవన మాలాలంకృత విశాలవక్షఃస్థలుండు నగు శ్రీమన్నారాయణుం డమ్మాహాయోగీంద్రునకు దృష్టిగోచరుండై యజ్ఞానాంధకారంబు నివర్తింపజేసి నిరతిశయ నిర్మలజ్ఞానానందంబు లొసంగి స్వకీయస్వరూపగుణ విభూతులన్నియు నతనికి సాక్షాత్కరింపంజేసి యనుగ్రహింప నప్పరాంకుశ మునీంద్రుండును గంగాప్రవాహంబు వోలిక స్వముఖ పద్మానర్గళవినిర్గళ త్పరమపావనామ్నాయ స్వరూప దివ్య ప్రబంధంబులుదాహరింప నా ప్రబంధంబులన్నియు నా క్షణంబ మధుర కవి ప్రముఖ దివ్యసూరులధికరించి నిజ శిష్యులకుం జెప్పుదురు. తదనంతరంబ యద్దేవదేవుం డమ్మాహాత్ముని గరుడవాహనంబుపై నెక్కించుకొని నిజ మందిరంబగు శ్రీ వైకుంఠ పురంబునకు విచ్చేయ ననంతరంబ కొండొక కాలంబునకద్దివ్య ప్రబంధంబుఖిలంబైన శ్రీమన్నాధ మునీంద్రుడు మరల నుద్ధరించు. మఱియు నా కృతి కొన్ని సంవత్సరంబుల కధికారి మాంద్యంబుచే నధ్యయనాధ్యాపనంబులు లేక సంకుచితంబై యున్న యంత భగవంతుడును వేత్రపాణియునగు విష్వక్సేన దేవుండు భక్తజన భాగధేయుండును త్రిదండపాణియు నగు శ్రీ రామానుజ మునీంద్రుండై యవతరించి యా ప్రబంధంబు శిష్య ప్రశిష్యముఖంబుగాఁ బ్రకాశింపం జేసి లోకంబు పాషండ బహుళంబై కుదృష్టిజనసంకులంబై వినష్ట హరి వైభవంబై మోముహ్యమానంబగుచున్న భగవంతుఁడగు బాదరాయణమునీంద్రుని తాత్పర్యంబుఁ దెలిసి తదీయ బ్రహ్మసూత్రంబులకు భాష్యం బొనర్చి మోహనంబులు నా సురంబులును గుయుక్తి పరికల్పితంబులును గుమతిసుందరంబులును వేదాంతాభాసానుసారంబులునగు నితర సిద్ధాంతంబులచే స్వరూపజ్ఞాన విస్మృతిఁ జెందినలోకంబుద్ధరించునని లక్ష్మీదేవి యానతిచ్చె మఱియును, శ్లో॥ అనన్తః ప్రథమం రూపం త్రేతాయాం లక్ష్మణ స్తథా। ద్వాపరే బలభద్రస్తు కలౌకశ్చిద్భవిష్యతి॥ ఇత్యాదినారదీయపురాణంబునందు యాదవగిరి మాహాత్మ్యోక్తక్రమంబుగా శేషుండు కృతయుగంబున ననంతాఖ్యుండై త్రేతాయుగంబున లక్ష్మణుండై ద్వాపరంబున బలభద్రుండై కలియుగంబున నొకండై యుదయించు. 'అనుక్తమన్యతోగ్రాహ్య' మనియెడు న్యాయంబునఁ బూర్వోక్త విశేషవచన ప్రామాణ్యంబుచే నతండు శ్రీ రామానుజమునీంద్రుండని గ్రహింపవలయు మఱియును, శ్లో॥ బ్రహ్మర్షేత్వం సమాసాద్యస్మృతిం సాత్త్వికసేవితామ్। భవ్యాం కురుమహాప్రాజ్ఞ స్త్వవగోత్రసముద్భవః॥ శారీరకమహాభాష్య గ్రంథకర్తా జితేంద్రియః। వేదాన్తవిత్తమః కశ్చిన్మస్కరీబ్రాహ్మణోత్తమః॥ అస్మిన్మహా భూతపురేభవిష్యతిననంశయః। తేనత్వయా

కృతావత్స్వస్మృతిస్సాత్త్వికగామినీ॥ప్రతిష్ఠాం పరమాం కీర్తిం గమిష్యతి మహీతలే॥ తస్యసంబంధినశ్శిష్యాస్సురాణామపి దుర్లభం॥ మాంప్రాప్యప్రాప్తనిర్వాణా భవిష్యంతికలౌయుగే॥ ఇత్యాదిస్కాందపురాణంబున వైష్ణవసంహితయందునందాగస్త్య సంవాదంబున శ్రీ మహాభూతపురీమాహాత్మ్యంబునందుఁ ద్రయోవింశతితమాధ్యాయోక్తక్రమంబుగా బ్రహర్షిసత్తమా నీ వామ్నాయంబు లన్నియు నరసి తెలిసి సాత్త్విక సేవితయు కళ్యాణస్వరూపిణియునగునొక స్మృతిరచియింపుము భవదీయ గోత్రంబున సర్వజ్ఞుండును జితేంద్రియుండును వేదాంత విత్తముండును మహామనస్కరియు నగునొకబ్రాహ్మణోత్తముండు శ్రీభూతపురియందు జనియించు. ఈ యర్థంబునకు సంశయంబులేదు. సాత్త్వికులకాదరణీయయగుయుష్మదీయస్మృతియతనిచేఁ బ్రఖ్యాతయై భూతలంబున శాశ్వత ప్రతిష్ఠఁజెందు కలియుగంబునఁ దదీయశిష్యప్రశిష్యు లందఱు వేల్పులకైనను దుర్లభంబగు మదీయపదంబుఁ జెంది సుఖింతురని వైవస్వతమనుపుత్రుం డగుహారీతమునీంద్రు నుద్దేశించి భగవంతుఁ డానతిచ్చె. మఱియు, శ్లో॥ కృతాదిషు ప్రజారాజన్ కలావిచ్ఛన్తిసంభవమ్। కలౌ ఖలు భవిష్యన్తి నారాయణపరాయణాః ॥ క్వచి త్క్వచిన్మహాభాగాద్రావిడేషుచ భూరిశః ॥ తామ్రపర్ణీనదీ యత్ర కృతమాలాపయస్వినీ॥ కావేరీచ మహాభాగా ప్రతీచీచ మహానదీ। యేపిబంతి కలంతాసాంమనుజామనుజేశ్వర ॥ ప్రాయోభక్తాభగవతి వాసుదేవే ఽ మలాశయాః ॥ ఇత్యాదిభాగవతంబునం దేకాదశస్కంధంబునఁ బంచమాధ్యాయోక్తక్రమంబుగాఁ గృతాదియుగంబుల ప్రజలు కలియం దుత్పత్తి నిచ్ఛయింతురు. కలియుగంబున నారాయణపరాయణులాయాదేశంబుల నొక్కొక్కచో నరుదుగా సంభవింతురు ద్రవిడదేశంబులయందు మహాత్ము లసంఖ్యాతు లుదయింతురు తామ్రపర్ణియుఁ గృతమాలయుఁ బయస్వినియు మహాభాగ యగు కావేరియుఁ బ్రతీచియు ననియెడుమహానదు లెచ్చోటం బ్రవహించుచుండు నచ్చటనమ్మహానదుల పుణ్యోదకంబులయందు స్నానపానంబు లెవ్వలొనరింతురు వారికి భగవంతుడగు వాసుదేవునియెడ నత్యంత భక్తి యుదయించునని వసుదేవునుద్దేశించి నారదమునీంద్రుండు వక్కాణించె. "సన్దిగ్ధేతువాక్యశేషాత్" అనియెడు న్యాయంబునఁ బూర్వోక్త విశేష ప్రమాణంబులచే శ్రీపరాంకుశ పరకాలనాథయామునయతీంద్రాది శ్రీ మహాభాగవతోత్తములు వారని గ్రహింపవలయు మఱియు నీదివ్య ప్రబంధాధ్యయనాదులయందు శ్రీమన్నాథ యామునయతీంద్రాది ధర్మజ్ఞసమయం బబాధితబలవత్ప్రమాణం బని తెలియుమని గురుం డావిప్రున కానతీయ నాద్విజుండును మహాత్మాయామ్నా

యంబులకుఁ బౌషపూర్ణిమాతిథియందుత్సర్జన విధియు శ్రావణపౌర్ణమాసియం దధ్యయనవిధియుం గల్గినట్లు ద్రవిడశ్రుతులకుఁ గాలనియమంబు గలదేని యా నియమంబును బూర్వోక్త ప్రపన్నోత్సవ స్వరూపంబు నానతిమ్మని యడుగ వత్సా నీ వొనర్చిన యీ ప్రశ్నంబు సమీచీనంబు దానికిఁ బ్రత్యుత్తరంబు వినుము. శ్లో॥ గీర్వాణమయవేదస్య తైషశ్రావణపర్వణోః। యథా ప్రోక్తౌ మహాప్రాజ్ఞ సముత్సర్జన సంగ్రహౌ॥ ద్రావిడశ్రుతి బంధస్య కార్తికీ మార్గశీర్షయోః। పర్వ వద్దిన యోరేవ సముత్సర్జన సంగ్రహౌ॥ ఇత్యాది వాసుదేవసంహితోక్త ప్రకారంబుగా గీర్వాణ మయవేదంబులకుఁ దైషశ్రావణ పర్వంబులయం దుత్సర్జన సంగ్రహంబులు హరిచే విధియింపంబడినట్లు కార్తిక మార్గశీర్షమాసంబుల పర్వ వద్దినంబుల యంద సముత్సర్జన సంగ్రహంబులు విష్ణువిచే విధియింపబడియెఁ దద్వివరణ క్రమం బాకర్ణింపుము. శ్లో॥ వృశ్చికేమాసి పూర్ణాయాం దీపారోపణ మాచరేత్। పరేత తత్ప్రబంధానాం సమాపన మథాచరేత్॥ రోహిణ్యాం వాసుదేవస్య వృశ్చికేమాసిపర్వణి। అర్ధమండలవేళాయాం దీపారోపణ మాచరేత్॥ తత్రైవశరకోపాదిసూక్తీనాం శాంతి మాచరేత్। యదితత్రాగ్నిభయుతే పరేద్యుస్తద్వ యంచరేత్॥ ఇత్యాద్యభియుక్త శ్రీసూక్తిక్రమంబుగా వృశ్చికమాసంబునఁ బూర్ణిమాతిథి యందైనను రోహిణీ నక్షత్రంబునందైనను మార్తండమండలం బర్ధాస్తమయంబుఁజెందుచున్నవేళ దివ్యదేశంబులయందు శ్రీహరికి దీపారోపణోత్సవంబుఁజేసి యనంతరంబ దివ్యప్రబంధంబులు నిగమింపవలయు నాతిథి కృత్తికానక్షత్ర యుక్తంబైనను మఱునాఁడు కళామాత్రంబైన శేషించియున్నను బూర్వతిథి వర్జించి యాశేష నక్షత్రదినంబునం దర్ధాస్తమయంబునదీపారోపణం బొనరించి తదనంతరంబ దివ్యప్రబంధంబులు నిగమింపవలయుఁ గావున నట్లు నిగమించి భగవదారాధనోపయోగి పాశురంబులు దక్కఁ దక్కిన పాశురంబు లుచ్చరింపక మధ్య మకాలంబు జరపి మగిడి ధనుశ్శుద్ధైకాదశియందుఁ దిరువాయ్మొళి యుపక్రమించి పదివాసరంబులు మహోత్సవ పూర్వకంబుగాఁ బ్రధానంబైన శ్రీరంగధామంబు మొదలుగాఁ గలదివ్య దేశంబులయందు భగవదాజ్ఞచే శ్రీవైష్ణవులను సంధింతురు తిరువాయ్మొళి దక్కఁ దక్కినదివ్య ప్రబంధంబులాయధ్య యనోత్సవంబునకు ముందుగాఁ బదిదినంబు లనుసంధింతు రిదియే ప్రపన్నోత్సవం బనంబడు నీయుత్సవంబు పురాతన దివ్యదేశంబులయందు నవశ్యకర్తవ్యంబు. మఱియును దివ్యదేశవ్య తిరిక్తంబు లగుతత్తద్గ్రామంబుల యందు వసియించు వైష్ణవులు పూర్వోక్త క్రమంబుగాఁ దమతమ గృహంబుల

యందుఁ బ్రబంధంబులు నిగమించి శ్రీకూరేశ గురుశిఖామణి తిరునక్షత్రంబునం దుపక్రమింతురీ ప్రబంధంబులకిదియకాలనియమంబని యద్దేశికేంద్రుం డానతియ్యా నాకర్ణించి యాతిరువేంగడముడయా నను బ్రాహ్మణుండును బరమానంద భరితాంతరంగుండై యమ్మహాదేశికుని దివ్యాంఘ్రిపద్మంబు లాశ్రయింప నయ్యార్యవర్యుం డతనికిఁ బంచసంస్కారాది సకలహితంబు లాచరించి తిరువేంగడదాసుండని దాస్యనామం బొనరించి యద్దివ్య దేశంబునందు నిన్నినంబి, యిరుందనంబి కిడందనంబి, మలమేల్‌నంబి, తిరుప్పార్‌క్కడల్‌నంబి, యనుపంచనంబులకు మంగళాశాసనంబుఁజేసి వారికి దివ్య గోపుర ప్రాకారమంటప మహానసపుష్పోద్యానాది కైంకర్యంబు లన్నియు నేర్పరించి నిత్యోత్సవాదు లన్నియు సమృద్ధంబులుగాఁ జేయ నియోగించి యవియన్నియు విమర్శింప నత్తిరువేంగడ దాసునికి భగవన్మందిరాధిపత్యం బిచ్చి శ్రీరంగ ధామంబునకు విచ్చేయం దలంచె నంత.

## చక్రధారణాదివిషయమైన శ్రుతిప్రమాణములు

తత్రాదౌ శ్రుతిః॥ పవిత్రం తే వితతం బ్రహ్మణస్పతే ప్రభుర్గాత్రాణి పర్యేషి విశ్వతః। అతప్తతనూర్నతదామో అశ్నుతే। శ్రుతా సఇద్వహంత స్తత్సమాశత। ఇతి శ్రుతిః॥ దేవపాయే విధూతేన బాహూనా సుదర్శనేన ప్రయతమానవో లోకసృష్టిం వితన్వతి బ్రాహ్మణా స్తద్వహన్తి। అగ్నినావైతప్తం ద్విభుజేధారయన్నూర్ధ్వపుణ్డ్రమాలిఖేత్। తస్మాద్ద్విరేఖం భవతి నపునరాగమనమేతి। బ్రహ్మణస్సాయుజ్యగ్ం సలోకతా మాప్నోతి। ఇతిశతపథబ్రాహ్మణే॥ సామవేదేమైత్రావరుణశాఖాయాం॥ పవిత్రమిత్యగ్నిః। అగ్నిర్వై సహస్రారః। సహస్రారో నేమిః నేమినాతప్తతనుః బ్రహ్మణ స్సాయుజ్యగ్ం సాలోక్యమాప్నోతి। ఆధర్వణవేదే॥ చక్రంబిభర్తివపుషాభితప్తం। బలం దేవానా మమితస్య విష్ణోః। సఏతినాకం దురితావిధూయ ప్రయాంతియద్యతయో వీతరాగాః॥ ఏభిర్వయమురుక్రమస్య చిహ్నై రఙ్కితాలోకేసుభగాభవామ। తద్విష్ణోః పరమంపదం యే గచ్ఛన్తి లాఞ్ఛితాః। చక్రమాదాయాగ్నౌ ప్రతాప్య బ్రాహ్మణస్య దక్షిణే బాహౌ ధారయేత్। చక్రముపవిశతి। పాఞ్చజన్య మాదాయాగ్నౌ ప్రతాప్య బ్రాహ్మణ స్యోత్తరబాహౌ ధారయేత్॥ బృహదారణ్యకే॥ నిచిక్షేపనృషణంభిద్యమానం మధ్యేబాహూమపధత్సుదర్శనం। విష్ణోరిదం భూరిదంభూరితేజః ప్రధర్షతిదివానక్తం బిభృయుస్తజ్జనాసః। బహ్వృచేబాష్కలసంహితాయాం॥ ప్రతేవిష్ణో అబ్జచక్రే పవిత్రేజన్మాంభోధింతర్తవేచర్షణీన్ద్రాః। మూలేబాహోర్దధతేన్యే పురాణాలిఙ్గాన్యఙ్గేతావకాన్యర్పయన్తి॥

ఆధర్వణే॥ అగ్నినావై హోతారః చక్రం పాఞ్చజన్యస్తుతప్తౌ ద్విభుజేధారయేత్ ॥ ఆత్మహిత మాచరేత్। ఆచార్యాయస్వముఖం ప్రపద్యేత్—తద్వైకుంఠో భవతి। పునరాగతి ర్నసాయుజ్యం సాలోక్యతా మాప్నోతి॥

అథోర్ధ్వపుణ్డ్రశ్రుతయః॥ కరవల్ల్యాం॥ ధృతోర్ధ్వపుణ్డ్రః కృతచక్రధారీ విష్ణుంపరం ధ్యాయతి యో మహాత్మా। స్వరేణ మన్త్రేణ సదాహృది స్థితం పరాత్పరం యన్మ హతో మహాంతం॥ మహోపనిషది॥ ధృతోర్ధ్వపుణ్డ్రం పరమేశితారం నారాయణం సాఙ్ఖ్యయోగాధిగమ్యం। జ్ఞాత్వా విముచ్యేత నర స్సమస్తై స్సంసారపాశై రి హచైవ విష్ణుమ్॥ ఆధర్వణే॥ హరేః పదాకృతి మాత్మనో హితాయ। మధ్యేచ్ఛిద్ర మూర్ధ్వ పుణ్డ్రంయో ధారయతి।నపరస్యప్రియో భవతి।సపుణ్యవాన్భవతి। సముక్తిమాన్భవతి॥ అథప్రణిపత్య కాత్యాయనో బ్రహ్మాణ మన్వయుజ్ఞ।అథవా భగవన్మే। కింపవిత్రాణాం పవిత్రం। కేనవా కర్మాణి సఫలాని। కిం దుష్కరం తపో మర్త్యానాం। కేనను కారణే నామృతత్వమేతి। సహోవాచ। సాధుతేను యోగశ్శృణు భోపవిత్రం సులభం సుకరం యద్విష్ణు క్షేత్రమ్। తత్రమృత్స్నాం శ్వేతా ముద్ధృతాసీత్యుద్ధరేత్। అమృతమేవ శ్వేత మృత్స్నాభవతి। తాం శుద్ధజలేన ప్రణవేనఘర్షయేత్। దేవ పితృకర్మాణ్యారభమాణః। తయానిత్య మూర్ధ్వపుణ్డ్రంబిభృయాత్। మన్త్రైః కేశ వాదీనాంచైతద్రహితం కర్మవిఫలం రక్షాంసి గృహ్ణీయుః। తదేవమభ్యుక్తం భవతి। నాసాదికేశాన్త మూర్ధ్వపుణ్డ్రం విష్ణోస్థితస్యచరణద్వ యాకృతి। ఏకాఙ్గు ళాదన్యూనః। సశ్రీ ప్రతిష్ఠాయై శ్రీర్హరిద్రాయతో హరింద్రావయతివిష్ణునావా। ఆదిత్యవర్ణే శ్రీఫలే ధారయేత్। తజ్జలేన శ్రీబీజేన సంయుజ్యతత్సూక్ష్మ రేఖాం ధారయేత్। తద్వైశాఖే హంసవర్ణే గాయత్రీ త్రిష్టుప్ఛన్దస్కే ఆత్మపరమాత్మ దైవత్యే దర్శ పూర్ణమానకే ఇష్టాపూర్త క్రియే భుక్తిముక్తి ఫలేసారేఖా శ్రీవర్ణా గాయ త్రీఛన్దః। ఆనన్ద క్రియామృతత్వ ఫలోయ మూర్ధ్వపుణ్డ్రవిధిః। ఏవం విది త్వాయో ధారయతి। సవైదికో భవతి। ససర్వకర్మార్హో భవతి। కాయికాత్పాతకా త్పూతో భవతి। విష్ణుసాయుజ్య మవాప్నోతి। యఏవం వేద। ఇత్యుపనిషత్॥ అథకాత్యాయ నేతిహోవాచ। జ్ఞానం వై పురుషో బ్రహ్మణో జాయతే। సవైబ్రాహ్మణో భవతి। వసిష్ఠః కశ్యపోత్రి ర్జమదగ్ని ర్విశ్వామిత్రోయం వ్యాసః పారాశర్యస్సన కాదియోగదా స్సద్బ్రహ్మలోకో భవతి। సానన్దలోకో భవతి। తప్తం చక్రం ద్విభుజే ధార్యమిత్యగ్ని హోత్ర ఏవ లోకో భవతి ఊర్ధ్వపుణ్డ్ర మాలిఖేత్ తస్మాద్విష్ణు రేఖం భవతి బ్రహ్మణ స్సాయుజ్యగ్ం సలోకతా మాప్నోతి॥

సీ. గురుఁడు తిరుక్కూరుం•గుడి తిరునగరియు, డాసి కన్పడుదివ్య•దేశములను
వతతసమీచీన•సకలోత్సవములఁగాఁ, జేసి శ్రీకురుకాపు•రీశుఁ డైన
శఠకోపయోగియా•జ్ఞ లభించి శ్రీరంగ, ధామమునకుఁ జని•తనమరమున
శ్రీరంగరాజేశ్వ•వఁ జేయుచు వసియింప, నప్పు డిరుంబియ•ప్పాఖ్యసూరి

తే. వరుఁడు చనుదెంచి శ్రీరంగ•పతినిగాంచి, యంతఁ గోవెలకందాడ•యణ్ణగారి
గృహమునకు నేఁగి యం దార•గించె ననుచు, వాదిభీకర గురుఁడనె•మోదమలర.

సీ. అళహియమణవాళ•యమిభూమిపతికి శ్రీ, వరదనారాయణ•గురునితోడ
నరుగుదెంచి యిరుంబి•యప్పగారు ప్రణామ, మాచరింప ననుగ్ర•హంబుఁ జేసి
యమ్మహాదేశికుఁ•డాతఁ డాకర్ణింపఁ, బరతత్త్వవిషయమై•ప్రథమ మైన
తిరువాయిమొళి కతి•దీర్ఘప్రవేశము, ఘనతరబ్రహ్మత•ర్కప్రమాణ

తే. భాసురోదారఫణితి ను•పన్యసింప, ధన్మఖోత్థసరస్వతీ•ధాటిఁ జూచి
యతఁడు హర్షించి విస్మయ•మందె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. ద్రవిడోపనిషదర్థ•తత్త్వవిత్తముఁ డితం, డన వింటి ముందిప్పు•డరసి చూడ
సకల శాస్త్రములందు•సర్వజ్ఞుఁ డనితోఁచె, ననుచునెంచియిరుంబి•యప్పయంత
నారగించుట కమ్మ•హాత్మునిచేఁ జాల, నర్థింపఁబడియు వి•జాత్మయందు
యతులయన్నములు సం•యమిపాత్రసలిలము, లనను భావ్యములఁ గృ•హాధిపతికి

తే ననెడుసామాన్యశాస్త్రార్థ•మపుడుదలఁచి, యచటనుండకతమయగ్ర•హారమునకు
వచ్చి యాత్మీయభవనముఁ•జొచ్చె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

వ. అంత. 82

సీ. నిర్మలజలముల•నీరాడి కాలోచి, తక్రియ లొనరించి•తన కభీష్ట
ధనము దైవతము సీ•తాలక్ష్మణాన్విత, పార్శ్వుఁడు నగురామ•భద్రశౌరి
నర్చపేయ నిరుంబి•యప్ప యుద్యుక్తుఁడై, తద్దివ్యమందిర•ద్వార మంచి
తలుపు లుపాయశ•తంబుచే నైనను, దెఱవఁజాలక యాది•దేవు నాత్మ

తే. యందుఁదలఁచుచునుత్తరీ•యంబుముసుఁగు, వాసినిడికొనికన్నులు•మూసిపవ్వ
ళించి నిద్రించియొకకలఁ•గాంచెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. కలలోనఁ గనఁబడి•కటివేల్పతని కిట్లు, పలికె శేషుఁడు నాదు•తొలిభవముల
నొకసారి తమ్ముఁడ•నొకసారి యన్నయు, నయి నాకు సాహాయ్య•మాచరించి

యీయుగంబునసంయ•మీన్ద్రుఁడై యుదయించిమామబావయునిష్ట•మంత్రియార్యు
డయి మద్విభూతిద్వ•యాధిపత్య మొనర్చి. యతఁ డిప్పుడస్మత్రి•యంబునలుప

తే. నవనిమణవాళయోగీంద్రుఁ•డయ్యెమగిడి. యతనియెడఁజాలనపరాధి • వయితివీవు
నర్చనీచేతఁ గొననొల్ల•ననియె ననుచు. వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

వ. అదియునుం గాక. 85

సీ. అనుతాపపడి యమ్మ•హాత్మునికడ కేఁగి. యతనిపదాబ్జము•లాశ్రయించి
ద్రవిడాగమాంతార్థ•తత్త్వమాతనికడఁ. దెలిసి వచ్చితివేని•దినదినంబు
నర్చింపఁబడియెద•ననఘ నీచే నట్లు. గాకున్న నీకు నేఁ•గామి నిక్క
మని స్వప్నగతుఁడైన•హరియతనికిఁ బల్కి. యంతర్హితుం డైన•నతఁడు లేచి

తే. హర్షవిస్మయములఁ జెంది • యాక్షణంబ. తరలి వేవేగ చని రంగ • ధామమొంది
యమ్మహాదేశికునిఁ గాంచె•నచటననుచు. వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

వ. అట్లద్దివ్యదేశంబున కేతెంచి దేవరాజాపరనామధేయుఁ డగు నిరుం బియప్పగా రవ్వరవరమునులం గనుంగొనిన తెఱం గెట్టిదనిన వర్ణించెద నద్దేవరాజార్యుం డచటి కేతెంచిన సమయంబున.

సీ. పూర్ణచంద్రుఁడు రంగ • భూపతిసేవ కి. ట్లేతెంచెనో యని • యెంచఁదగిన
సుప్రసన్నాదిత్య • సుషమావృతాత్మీయ. దివ్యమంగళమూర్తి • దేజరిల్లఁ
గాషాయపరిధాన • కౌశేయ సంవ్యాన. ములు స్వకటిస్కంధ • ముల వెలుంగఁ
బెన్నురంబునఁ బద్మ•బీజమాలిక లొప్ప. నుచితోర్ధ్వపుండ్రము•లొడలమెఱయఁ

తే. గేలుఁదమ్మిఁ ద్రి దండముఁ•గీలుకొలిపి. మధునిషూదను సేవింప•మరము వెడలి
వేడ్క మణవాళముని వచ్చె • వీధిననుచు. వాదిభీకరగురుఁడనె•మోదమలర.

వ. అప్పుడు 88

సీ. వెల్లచేమంతుల • మొల్లమి గల కోమ. లాకారసౌకుమా • ర్యం బెలర్ప
నతివళక్షస్నిగ్ధ • యజ్ఞోపవీతము. నాభిబింబము నంటి • శోభ లీనఁ
గరుణారసముఁజిల్క•కన్నులుదళుకొత్తఁ. జిఱునవ్వుమోమునఁ • జెలువుగులుకఁ
బాణిపద్మములచే • బార్శ్వస్థులగు తన. దాసచేతనులకై • దండఁ బూని

తే. యడుగుఁదమ్ములు మెల్లనఁ • బుడమి నిడుచు. వచ్చుచున్నట్టి శ్రీమణ•వాళయోగి
నొప్పుగాఁ జూచెనాయిరుం•బప్ప యనుచు. వాదిభీకరగురుఁడనె• మోదమలర.

వ. అప్పుడయ్యిరుం బియప్పగారగ్గురు పరమేషినింగాంచి మిగులఁ బ్రహర్షించి తత్స న్నిధి కేతెంచి పరమభక్తి దళుకొత్త సాష్టాంగ దండప్రణామం బాచరించికరకమ లంబులు ముకుళించి నమ్రుండై యున్న నద్దేశిక సార్వభౌముండు నిజకటాక్షవీక్షణ సుధాధార లతనిపైఁ జిలుకుచు మృదు మధురగంభీర భాషణంబులస్వాగతం బ డిగి మిగుల నాదరించి యాత్మ లాభంబునకంటె నధికం బైన లాభంబు లేదని తన తలంపులో నెంచి యమ్మహాత్మునిం దోడ్కొని మగిడి మఠంబునం బ్రవేశించి సన్నిధిస్వాములకు గోవెలకుం బనుప వారును భగవన్మందిరమునకుం జనిశ్రీరం గ నాథుని సేవించి మరలి యేతెంచి యగ్గురువరునిం గాంచి కరకమలంబులు ముకుళించి యున్న యప్పు డయ్యార్యపంక్తి నుద్దేశించి. 90

సీ. ఇప్పుడు రంగేశుఁ • డీ దృగలంకార, శాలియై యీయీ ప్ర • సాదములను
నారగించె నటంచు • నవ్వరవరయోగి, యానతియ్యఁ దదుక్తు • లాలకించి
కోవెల నట్లు గ • న్గొన్న వైష్ణవులు త, త్సర్వజ్ఞతకు నద్భు • తంబుఁ జెంది
రంత ధారకపోష • కాదు లన్నియుఁ దన, కమ్మహాత్ముని విగ్ర • హానుభవమె

తే. యనియిరుంబప్పగారాత్మ•యందుఁ దలఁచి, త్రోవనడచిన బడలిక • తొలఁగనతని
నిండు భక్తిభజించుచు • నుండె ననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

వ. తదనంతరంబ. 92

సీ. ఆ రాత్రిఁ గడపి య • హర్ముఖంబున లేచి, పరవాదిభీకర • గురువరేణ్యుఁ
డాశ్రితులను గూడి • యార్యుని పడకింటి, వాకిట నిలిచి సు • శ్లోక నీకు
సుప్రభాతం బయ్యె • సూర్యుఁడు పొడమెనా, యజ్ఞానతామిస్ర • మణఁగదయ్యె
నబ్జముల్ వికసించె • నస్మదీయహృదబ్జ, మలరదు కాంతోప • యంతృయోగి

తే. చంద్రసంశ్రితనరసు ప్ర•సన్న సూర్య, మమ్ముఁగరుణింపమేల్కొమ్ము•లెమ్మదేవ
యనుచుఁబొగడిలేచెన • య్యార్యుఁడనుచు. వాదిభీకర గురుఁడనె • మోదమలర.

సీ. స్తుతి గొని మేల్కాంచి • సుందరజామాతృ, గురుఁ డార్యపంక్తిని•శరణమొందీ
విమలపరవ్యూహ•విభవాంతరాత్మార్చ, లను దనమదిలోఁ ద • లంచి మించి
తత్త్వయాథాత్మ్యసం•దర్శనాదర్శర,హస్యత్రయం బాత్మ•యందుఁ దలఁచి
యరుణోదయపువేళ • నవగాహనముఁ జేసి, భగవదర్చ యొనర్చి • భక్తిరంగ

తే. నాథు నర్చించి శ్రీశైల•నాథనామ, మంటపంబునఁ బూర్వార్య•మధురసూక్తి
కలనమునఁగాల మొక్కింత • గడపెననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. అంతఁ గోవెల కేఁగి • యతిరాజముఖదివ్య, సూరిపదాబ్జము • లూనిమ్రొక్కి—
శ్రీరంగభర్తకు • జెన్నొప్ప మంగళా, శాసన మొనరించి • స్వమఠ మొంది
యొప్పుగా నయ్యరుం • బప్పకుఁ బంచనం, స్కారాదిహితములు • సలిపి తనదు
దివ్యసౌరభపాద • తీర్థముఁ గృప నిచ్చి, మాధ్యాహ్నికముఁ జేసి • మాధవీయ
తే. యాగమొనరించియనుయాగ•మాచరించి, తనదుతళిహ ప్రసాదమా•తనికొసంగి
యుత్సహించెను మణవాళ•యోగి యనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. అంత శ్రీశైలనా • థార్యనామకమాన్య, మహితకాలక్షేప • మంటపమున
స్థిరమృదులాసనా•సీనుఁడై ద్రవిడవే,దాంతార్థతత్త్వ మా • త్మాశ్రితులకు
బోధించుచును గొంత • ప్రొద్దుఁబుచ్చినయంత, సంధ్యఘటిల్లఁద•త్సమయభగవ
దాజ్ఞఁ జెల్లించి సా • యంతనహరిపూజ, యొనరించి వరవర • యోగివేత్ర
తే రచితరత్నసువర్ణ ప • ర్యంకతుంగ, తూలకాషాయకౌశేయ • చేలకలిత
కశిపుపై నున్నసంశ్రితు • ల్గాంచిరనుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర. 96

సీ అంత మ్రొక్కినుతించి • యతనియాజ్ఞలభించి, యాశ్రితుల్వారిండ్ల•కరిగిరంత
మంత్రరత్నార్థమే•మననము సేయుచు, హరిసుందుమదిఁ జేర్చి • యార్యవరుఁడు
శేషతల్పమునందు • శ్రీరంగపతిగతి, నిద్రించి ప్రొద్దున • నిదుర విడిచి
కాలోచితక్రియ • ల్గావించి కాలయా, పనమంటపమునందుఁ • బ్రత్యహంబు
తే. ద్రవిడవేదాంతసూక్త్యర్థ•తత్త్వమంత, నా యిరుంబప్ప కెఱిఁగింప • నతఁడుదెలిసి
యంచితంబుగ గురునిఁ బూ•జించె ననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ బహుదినంబులు మణ • వాళమామునికడ, సకలకైంకర్యము•ల్సలుపుచుండి
వచనభూషణముఖ • పరమరహస్యము, లధికరించి యిరుంబి • యప్ప గార
లార్యునియాజ్ఞ ని • జాగ్రహారమునకుఁ, జనువేళఁ దత్పదా • బ్జములయందుఁ
బ్రణమిల్ల నతనిమూ • ర్ధస్థల మాత్మాంఘ్రి, పంకజములచే న • లంకరించి
తే యాదరించి గురుద్వహుఁ•డనుప నతఁడు, తత్పదాబ్జములేమదిఁ • దంజమనుచు
నమ్మి చని యింట వసియించె•నెమ్మిననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. అంతట నొక్కనాఁ • డళహియమణవాళ, ముని రంగపతిని గ•న్గొనుట కరిగి
యప్పు డుత్తమనంబి • యవనిక మఱుఁగునం, దేకాంతభక్తిరం•గేశ్వరునకుఁ
దిరువాలవట్టము • తిరముగాఁ జేఁ బూని, యర్పించు చున్నఁదా • నంజలించి
స్వామికి మంగళా • శాసన మొనరింపగాఁ, క్షీరసంఘాత • గౌరవర్ణు

తే. నతనినానంబిగనిశ్విత్రి • యనుచుఁ దలఁచి. వేగవిచ్చేయుమనిపల్కి • వినియతండు నచట నుండక మరమున • కరిగెననుచు. వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. అంత నుత్తమనంబి • యచటినుం డేతెంచి. పలుగాఁడికడ నౌక • పలకపైని బవళింప నతనిస్వ • ప్నమునందు శ్రీరంగ. పతి గానఁబడి పాణి • పల్లవమునఁ దనపాన్పు తట్టి యీ • తండె సుమీ సౌమ్య. జామాతృముని యిది • సత్యమనిన నతఁడు ప్రబుద్ధుఁడై • యనుతాపపడి యమ్మ. హాత్మునికడ కేఁగి • యతనియంఘ్రి

తే. నలినములయందు దీర్ఘప్ర • ణామ మొదవి. నన్ను మన్నింపుమనిచాల • సన్నుతించి యతనికృపజెందితమయింటి • కరిగెననుచు. వాదిభీకరగురుఁడనె • మోదమలర.

వ. మఱియు నొక్కనాఁడయ్యాళహియ మణవాళయోగీంద్రుండు శ్రీశైలనాథాఖ్యకు భాభిదానం బగుపుంటపరత్నంబునందాశ్రితుల కామ్నాయాంతరహస్యార్థ యాథార్థ్యంబు బోధించుచుఁ గొంతప్రొద్దు జరపిన పిమ్మట నాశ్రితు లంద ఱగ్గురూత్తమునిచే నియుక్తులగుచుఁ దత్తత్కైంకర్యంబులయందాసక్తచిత్తులై యున్న యెడ నవ్వరమునీంద్రుం డాకాలక్షేపకూటక వాటంబులు మూసిగడియఁ దగిల్చి యుచితాస్తరణంబుపై నిద్రాముద్రాభిరాముండై శ్రీరంగధాముని మాడ్కి శయనించి స్వస్వరూపంబు ధరియించి యానందించు సమయంబున స్వకీయ పదాబ్జంబు లాశ్రయించిన శఠకోపకాత్తి యనియెడుయొక సత్త్వవతీలలామంబు స్వసందర్శనార్థం బేతెంచి యక్కాలయాపన కూటక వాట సంధిమార్గంబున నిజ దృష్టినిం బ్రసరింపం జేసి దశశత శిఖరాంచితంబగు రజతపర్వతంబుగతివికసిత సహస్రఫణామండల మండితకుండలీంద్రాత్మకుండై విలసిల్లుచున్న యద్దేశికాఖండలునిం జూచి డెందంబున దండివేడ్కనిండార సేవించుచున్న నతం డది యెఱింగి యథాపూర్వకంబుగా యతివిగ్రహంబుఁ గొని కవాటంబులఁ దెఱచి వెల్వడినం గనుంగొని యద్దేవియు భక్తి దళుకొత్తం బ్రణతి యొనర్చె సాంజలియైయున్న యాసాత్త్వికనుం గటాక్షించి యిక్కూటక వాటసంధుల దృష్టి నిలిపి యిస్మయం బేమి వీక్షించితి వని గురుం డడుగ మహాత్మా సాక్షాదనంత మూర్తివగు నీ యందు లేనివింత లేమి గలవని విన్నవింప నద్దేశికేంద్రుండును భవదీయభక్తి ప్రకర్షంబుచే నీ కట్లు దోఁచెం గాని యం దేమివింతలుండునని పల్కి యావృత్తాంతంబు స్వరూపజ్ఞానహీనులకుఁ దెలుపవలదనియతం డానతియ్యఁ దదీయాశ్రితులు కొంద ఱా వార్త లాలకించి యగ్గురుసార్వభౌముండు సాక్షాచ్ఛేష స్వరూపుండు గాని యతి మాత్రుండు గాఁ డని నిర్ణయించిన నా వృత్తాంతం బుపదేశపరంపరా

ప్రాప్తంబై యస్మదాది పర్యంతంబయ్యె నంతఁ గొన్ని దినంబులకుఁ దిరుపవిత్రోత్సవం బుపస్థితం బైన స్వకీయపరివార పరివృతుండై శ్రీరంగ నాథుండు నానాదేశాగతబహువిదదృక్షువైష్ణవపరివేష్టితుండై యున్న సమయంబునవరవరమునీంద్రుం డాశ్రిత వర్గంబుతోఁ దత్సన్నిధానంబున కేతెంచి మంగళాశాసనంబు సేయుచున్న నతనిం గటాక్షించి మహాత్మా నీ వస్మదాస్థానమంటపమధ్యంబున శ్రీ రంగనాథ భట్టార్యున కీయుత్తమనంబికి నీడు మఱప్పత్తారాయిరప్పడి మొదలుగాఁ గల తిరువాయ్ మొళివ్యాఖ్యానంబు లైదునుం బ్రసాదింపవలయునని యానతియ్య మహా ప్రసాదం బని భగవదాజ్ఞ శిరసావహించి యద్దేశికేంద్రుం డా క్షణంబ యుపక్రమింప నుద్యోగింప నబ్భగవంతుడును శ్రీ భూనీళా సహితుండై యనంత గరుడవిష్వక్సేనాదినిత్యసూరులతో శ్రీ పరాంకుశ పరకాలయతీంద్రాదిదివ్యసూరి వర్గంబుతో నద్దివ్యదేశంబునం గల శ్రీ మహాభాగతవ్రాతంబుతో నిజ పరిజన వ్రజంబుతో నాత్మీయ దివ్యసభామంటపంబునం దుచితాసనంబుపైఁ బేరోలగం బుండి మణవాళ మహామునుల కాచార్య పీఠంబర్పింప నా యభిజ్ఞ శిఖామణియు నయ్యాసనంబుపై స్వదేశికుండైన శ్రీశైల నాథార్యుండు సుఖాసీనుండై యున్న యట్లు భావించి యప్పీఠంబున కధఃప్రదేశంబునం గూర్చుండి శ్రీరంగనాధభట్టార్యున కాయుత్తమనంబికివి దినక్రమంబుగా నొక సంవత్సరంబున కావ్యాఖ్యానపంచకంబు వక్కాణించె నంత నుత్తరశాంతి నిమిత్తంబుగా భగవంతుం డగు శ్రీరంగక్షమాకాంతుండు తొంటిచందంబున నొడ్డోలగం బున్న సమయంబున నగ్గురు శిఖామణి విషయంబుగా నొకతని యనువిన్నవింపవలెనని శ్రీరంగనాధభట్టార్యుండు నుత్తమనంబియుఁ దలంచిరి వారి బుద్ధియందు శ్రీశైలేత్యాది శ్లోకంబు దోఁచినవారది వచించుటకుముందు శ్యామసుందర సుకుమార శరీరుండును బంచహాయన పరిమిత వయస్కుండును నజ్ఞాతకులగోత్రుండును నైనయొక వైష్ణవబాలకుం డాస్వామిసన్నిధి కేతెంచి హరిపరిజనుల చేద్వివారంబు నివారితుం డయ్యును మరలి యేతెంచి హరిపురోభాగంబున శ్రీసౌమ్యజామాతృమునుల కభిముఖంబుగా నిలిచి పాణి పల్లవంబులు ముకుళించి, శ్లో॥ శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవం। యతీన్ద్రప్రవణం వన్దేరమ్యజామాతరంమునిమ్॥ అనుచు సమాక్షరపాదబద్ధం బైన యీ పద్యం బందఱు విన మేఘగంభీరస్వరంబుతోఁ బలికి యాక్షణంబ యంతర్హితుండయ్యె నంతఁ దత్సభాస్తారు లగు శ్రీ మహాభాగవతు లంద ఱత్యాశ్చర్యంబుఁ జెంది యిద్దారకుండు నారాయణుండు గాని యన్యుండు గాఁడుతాను జిరకాలం బిమ్మహాత్మునికడ భగవద్విషయం బాక

ర్ణించి యాచార్య విషయంబుగా నీశ్లోకంబానతిచ్చెఁగాన కాంతోపయంతృమునీం
ద్రుండు భగవంతుం డైనయనంతుండు గాని పరివ్రాణ్మాత్రుండుగాఁ డనినిశ్చ
యించిరంత శ్రీరంగభర్తయు నబ్బాలక స్వరూపంబుచే నేన యీ పద్యంబువచి
యించితి నేఁటినుండి యస్మదధిష్ఠితం బైన యీ దివ్యదేశంబు మొదలుగాఁగల
యష్టోత్తర శతదివ్యదేశంబులయందు శ్రీపరాంకుశ పరకాలభట్టనాథాదిదివ్య సూరి
ప్రణీతప్రబంధాధ్యయ నాధ్యాపనాను సంధానాది కాలంబులందు ముందుగా నీప
ద్యంబు భక్తి పూర్వకంబుగా ననుసంధింపఁ దగునని యాజ్ఞాపించెనంత నబ్భగ
వదాజ్ఞవారలట్లు చెల్లించి రా శ్రీరంగ భర్తయు ననేకవిధంబుల బహుమతియొన
రించి యమ్మణవాళ మహామునులం దదీయ మఠంబునకుం బనిచె నంతకుముం
దొకము ముముక్షుచేతనుం డుత్తరదేశస్థితంబు లగు శ్రీమదయోధ్యాది పుణ్యక్షేత్రం
బులు సేవించి బదరికాశ్రమంబునకుం జనియందు భగవంతుం డగునరసహితుం
డైన నారాయణునిం బొడగాంచి యథాశక్తి వినుతించి యద్దేవ దివ్యనకశ్రాం
తంబు సకల విధకైంకర్యంబు లాచరించు చున్న నప్పుండరీకాక్షుండు సుప్ర
సన్నుండై యతని స్వప్నంబునందన్నుం గనిపించివత్సా తడవులనుండి బహు
దినంబులనన్ను సరించు చుంటి నీయభీష్టం బెఱింగింపు మనినవిని యాసాత్త్వి
కుండు దాసున కొకపరమహితం బుపదేశింపు మనిన నప్పురాణ మహర్షియు
శ్రీశైలేత్యాదిపద్యం బతని కుపదేశించిన నతం డీశ్లోక ప్రతిపాద్యం డెవ్వఁ
డనిన దక్షిణదేశస్థ దివ్యదేశంబులయం దతండు నీకుంజూపడు నద్దేశంబునకుం
జనుమనియానతిచ్చి యంతర్హితుండయ్యె నంతట నమ్మహాత్ముండు మేల్కాంచి
యద్దేవ దేవునిం దలంచుచుఁ ప్రభాతసమ యోచితకరణీయంబు లాచరించిత
ద్విష యదిదృక్ష చేనతిత్వరితగతి శ్రీ వేంకటాచలంబున కేతెంచి యందు భగవ
త్సన్నిధి భాగవతు లందఱుదివ్య ప్రబంధాను సంధానంబునకు మొదట నీశ్లోకం
బను సంబంధించుచున్న నాకర్ణించి మహాత్ములారా యీ పద్యంబునకు విషయం
బెవ్వఁ డతం డెచ్చోటనుండు నడిమేనికిం దెలియ నానతీండని ప్రార్థింపఁ గరు
ణార్ద్రచిత్తులై యీ శ్లోకంబునకు విషయంబు శ్రీరంగధామంబునందు మీకుం
జూపడు ననిన నతండు భగవత్సేవ యొనర్చి యబ్భాగవతుల వీడ్కొని చనుచు
మార్గమధ్యంబునఁ గరిగిరి మొదలగు దివ్యదేశంబులయందుఁ ప్రబంధానుసంధానాతి
కాలంబులం దాతని యను విన్నవించుచున్న నాకర్ణించుచుఁ జనిచని శ్రీరంగధామంబుఁ
జెంది యందు సప్రకారంబుగా నాశ్లోకవృత్తాంతం బంతయు నెఱింగి తత్ప్రగ
ల్భాద్యుండగు నవ్వర వరయోగీంద్రునిం గాంచి భక్తి పూర్వకంబుగా సాష్టాంది

ప్రణామం బాచరించి తత్పాదాబ్జంబు లాశ్రయింప నద్దేశిక సార్వభౌముండు సుప్రసన్నుండై కరుణాకలితకటాక్ష వీక్షణంబుల నీక్షించి యతనికిఁ బంచసంస్కారాది సకలహితంబు లొనరించె నంత సర్వకాలంబులయం దయ్యార్యున కతండు సకలవిధ కైంకర్యంబు లాచరించుచుఁ దదీయ శ్రీపాదపద్మంబులే ప్రాప్య ప్రాపకంబులని విశ్వసించి కృతార్థుండయ్యెఁ దదనంతరం బద్దేశికేంద్రుం డఖిలచేతనోజ్జీవ నార్థంబుగా శ్రీవచన భూషణ వాఖ్యానంబును బ్రపన్న సావిత్రి వాఖ్యయు నరుళాళముని ప్రణీతజ్ఞాన సారవ్యాఖ్యానంబును దత్త్వత్రయ రహస్యత్రయ వ్యాఖ్యానంబులును ముప్పత్తా రాయిరప్పడికిఁ బ్రమాణతిరట్టును భగవద్గీతలకుం దాత్పర్యదీపం బనువ్యాఖ్యానంబు నుడయవరు నిత్యంబునకు సంగ్రహంబై సువ్యక్తంబైన భగవదా రాధన క్రమంబును సకలసంప్రదాయ సంగ్రహం బైన యుపదేశరత్నమాలయుఁ దిరువాయ్ మొళినూత్తందాదియు నానతిచ్చి యనంతరం బొక్కనాఁడు యాదృచ్ఛికంబుగా మఠద్వారాజిర ప్రదేశంబున కేతెంచి తత్సమీపంబునందు శ్రీవచన భూషణదివ్య శాస్త్రం బధికరించిన వైష్ణవు లిరువురు ప్రారబ్ధకర్మ వశంబున రాగద్వేషదూషితాంతః కరణులై యొకరి నొకరు పరుష భాషణంబు లాడుచునన్యోన్య కలహాసక్తులై యున్న సమయంబున నచ్చోట రెండు విహీనజంతువులు రోష భీషణోద్ఘోషంబులు సలుపుచు నొండొరులు పెనంగుచుండఁ గనుంగొని సారమేయంబులారా మీరును వీరికరణి శ్రీవచన భూషణాధికారులరొ యట్లు గాకున్న నిట్లేల కలహించెదరని యానతియ్యవిని యావైష్ణవు లిరువురు లజ్జావనతాస్యులై యగ్గురువరునకుం బ్రణామం బాచరించి పూర్వక్రమంబుగాఁ బరస్పర మైత్రిఁ జెంది యుండి రంత నొక్కదినంబున.

సీ. తిరునామధారు లు•త్తరదేశవాసు ల, య్యార్యున కొక్కింత•యర్థ మనుప
నది చూచి తన్మూల•మంత విమర్శించి, గురుఁ డసత్తిది యని•పరిహరించె
మఠమున కొకయూర•మంచిక్షేత్రం బున్న. నది దున్ని పండించు•నంఘ్రిజాతు
లొకనాఁడు మఠములో•నొక్కెడ సొపడి, స్థలశుద్ధి గోమయ•సలిలములను
తే. జేసి చనినంత నగ్గురు•శేఖరుండు, చూచి యీతడి యే మని•సూరిజనుల
నడుగఁ దత్కారణము వారు•నుడివిరనుమ, వాదిభీకరగురుఁడనె•మోదమలర.
సీ. వారివార్తల విని•వరవరముని యంత, మఠములో నిట్టిస•మ్మర్ద మేల
యనుచు రంగేశున•కాక్షేత్ర మొసఁగి త, ద్భాండాలయమునఁ ద•త్సాధనంబు
లర్పించె మఱియొక• యహమునమదుసలి, యమ్మ యొక్కతె రాత్రి•యమ్మహాత్ముఁ
గని మ్రొక్కి తిరిగి చీఁ•కటి నొంటిఁ జనలేక, యందొక్కచోనిద్రఁ•జెందెనంతఁ

తే. బూర్వగురుసత్కథలఁగొంత•ప్రొద్దుపుచ్చి. యాశ్రితులతోడనాముస•లమ్మనపుడు
మరము వెలువడఁబనిచెన•మ్మాన్యుఁడనుచు. వాదిభీకరగురుఁడనె•మోదమలర.

సీ. దానపోషక విశే•షమున నీముదుసలి. యమ్మని ట్లతిశంక•ననుపఁ దగునె
యని కొంద ఱాశ్రితు•లనవిని ముదుసలి. యుడుతైన మ్రాకుపై•కుఱుకలేదొ
సవిరసర్పంబైన•దవ్వుల నుండెనా. ముట్టనేరదె యెట్టి•దిట్టనైన
నవి వరవరముని • యానతిచ్చిన విని. విషయసాన్నిధ్యము • విద్వదగ్ర

తే. గణ్యునకునైన మోసముఁ • గలుగఁ జేయుఁ. గాననస్మద్గురుండిట్టు • లానతిచ్చె
ననుచుఁదమలోఁదలంచిర • య్యనఘులనుచు. వాదిభీకరగురుఁడనె • మోదమలర.

శా. శ్రీమత్పానకపాటిమంగళగిరి • శ్రీనారసింహప్రియా
క్షేమప్రాపకరంగధామనిలయా • సిద్ధాంతతత్త్వత్రయా
కామక్రోధముఖారిషట్కవిజయా • కల్యాణసంపన్మయా
స్వామీ కేశవసూరిమానససర • స్వత్పూర్ణచంద్రోదయా. 105

క. వరవరమునివరహృదయ, స్ఫురదంబురుహాంబుజాప్త • భూతపురీసం
చరణా శరణాగతజన, భరణా యతిరాజ శాంతి • పరమాభరణా. 106

మాలినీవృత్తము. పరమగురుసహాయా • భక్తమద్భాగధేయా
నిరుపమగుణపూర్తీ • నిర్మలానందమూర్తీ
సరసిజదళనేత్రా • సజ్జనస్తోత్రపాత్రా
పరమపదనిదానా • భాష్యకారాభిధానా. 107

గద్యము. ఇది శ్రీభగవద్రామానుజ కరుణాకటాక్ష కలితకవితా వైభవపరవాది భయం కరాచార్యాభి మతచ్ఛాత్రా పస్తంబసూత్ర కణ్వసగోత్ర పవిత్రోభయకవిమిత్ర వేంకటకృష్ణార్యపుత్ర విబుధవైష్ణవవిధేయ కేశనామధేయ ప్రణీతంబైనయాచార్యా సూక్తిముక్తావళి యనుమహాప్రబంధంబునం దుత్తరభాగంబున శ్రీమణవాళమహామునుల తిరువవతారంబును దదీయజాతకర్మనామకరణాదిసంస్కారకీర్తనంబు నద్దేశికేంద్రుని విద్యాభ్యాసక్రమంబు, నమ్మహాత్ముని తిరుకల్యాణోత్సవంబును దత్పితృచరమ ప్రదర్శనంబు, నగ్గురువరుండు శ్రీశైలనాథార్యునాశ్రయించుటయు నమ్మణవాళమహామునికిం గుమారుం డుదయించుటయు స్వవైభవాసహిష్ణు లగుకొందఱు వైష్ణవులకు స్వకీయవిద్యాధికారవిభవం బెఱింగించుటయు స్వాచార్యసన్నిధిసంస్కృతసన్న్యాసప్రతిజ్ఞయు శ్రీశైలనాథార్యునిచరమకైంకర్య

ప్రతిపాదనంబు నద్దేశికేంద్రుండు శ్రీరంగంబునకు విచ్చేయుటయు శ్రీరంగ రాజభట్టార్యననుమతి శ్రీరంగనాథుని సేవించుటయు నాదేహపాతంబీస్థలంబున వసియింపుమని శ్రీరంగనాథుం డగ్గురున కాజ్ఞాపించుటయు నద్దేశికేంద్రుఁడు త్త మనంబిని స్వవశవర్తినిగాఁ జేసికొనుటయు శ్రీరంగరాజశౌరిచే ననుజ్ఞాతుండై శ్వేతాద్రి వృషాద్రి మొదలగుకొన్ని దివ్యదేశంబుల సేవించి శ్రీకరిగిరివరదునకు మంగళాశాసనం బొనర్చి యందుఁ గిడాంబినై నారుదేశికునిసన్నిధి శ్రీభాష్యమధిక రించుటయు నగ్గురువరుండు మగిడి శ్రీరంగంబుఁ బ్రవేశించియందుఁదురీయాశ్ర మంబుస్వీకరించుటయు భగవదాజ్ఞచే వల్లవరాయని మఠంబునందయ్యార్య వర్యుండు సుఖం బుండుటయుఁ దోతాద్రియతీంద్రుం డాదిగాఁగొందఱుదిగ్గజం బులను మఱియు ననంఖ్యాతు లగుధన్యచేతనులమ్మహాత్మ్ము నాశ్రయించుటయు విర్ధళప్పనిచే నొకపరవాదిని నిరాకరింపఁ జేయుటయుఁ బరవాదిభయంకరార్యుం డగ్గురుపురందరు నాశ్రయించుటయు నవ్వరవరమునులపు దదీయపౌత్రు లిరువు రాశ్రయించుటయు నద్దేశికేంద్రుండు తిరునగరికింజనుట యుఁదిరునారాయణపు రత్తాయి ప్రభావంబును మతదాహంబును నిజరూపప్రదర్శనంబునుగురువిప్రసంవా దంబునందుఁ బరతత్త్వనిర్ణయంబునుబాషండస్వరూపనిరూపణంబును శంఖచక్రో ర్ధ్వపుండ్రాదిభగవల్లాంఛనధారణంబునకుఁ బ్రమాణోపన్యాసంబును ద్వాదశసూ ర్యవతార రహస్య కథనంబును దదీయదివ్యప్రబంధమాహాత్మ్య వర్ణనంబునుదివ్య ప్రబంధంబుల కుత్సర్జనోపక్రమకాల నిర్ణయంబును దిరిగి గురుండు శ్రీరంగంబున కేతెంచుటయు స్వప్నదృష్టశ్రీరామానుజ శాసనంబుచే నిరుంబియప్పగారద్దేశి కేంద్రు నాశ్రయించుటయు శఠకోపక్కాత్తి యనుసాత్త్వికతదీయనిజరూపం బుసాక్షాత్కరించుటయు శ్రీశైలేశే త్యాదిపద్యోత్పత్తిక్రమంబును దదుక్తగ్రం థసంఖ్యాప్రదర్శనంబును నిహీనజంతువ్యాజంబునఁ గామక్రోధాదులు వర్జనీయం బు లని యిరువురువైష్ణవుల కగ్గురుం డుపదేశించుటయు నీషణత్రయంబు హే యం బని తెలుపుటయు విషయక్రౌర్య ప్రదర్శనంబు నన్నది చతుర్థోల్లాసము.

—o—



శ్రీమతే రామానుజాయ నమః.

# ఆచార్యసూక్తిముక్తావళి

## ఉత్తరభాగము



### పంచమోల్లాసము

మన్నారాయణపద
తామరసప్రేమభూమ • ధామసుధామా
రామానుజ యతికులను
త్రామా శ్రీవైష్ణవా • రామారామా. 1

వ. అవధరింపుము. 2

సీ. అంతట నొక్కనాఁ • డార్యుఁడొక్కఁ డలర్క, శాకము గురుభక్తి • సంగ్రహించి
యమ్మహాత్ముని శ్రీమ • హానసకృత్యముఁ, జేసెడుసాత్త్విక • చేతి కొసఁగి
చక్కఁగాఁ బక్వము • సలిపి యస్మద్గురు, స్వామి కర్పింపు మో • జనని యనిన
నాసాధ్వి యశ్రద్ధ • నట్లొనర్పక యున్న, గురుఁ డారగింపఁ గ • న్గొనియతండు
తే. శాక మాతనితళిహలో • లేక యున్నఁ, గుంది యాయమ్మ నీక్షింప • గురుఁడదేమి
యనినఁ దత్కారణముఁ జెప్పె • నాతఁడనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. అతనిసూక్తులవల్ల • ననుచిత మిది యని, తెలిసి యవ్వరవర • దేశికుండు
వైష్ణవులం దను • వర్తన ముడిగిన, యీయమ్మ తళిహను • జేయఁగూడ
దని యాఱుమాసము • లాసాత్త్వికను దిరు, మరపళ్ళిపనులందు • మానిమరలి
యనుతప్తచిత్త యౌ • నాశుభాచారకుఁ, బూర్వకైంకర్యము • బొసఁగ నొసఁగ
తే. వైష్ణవాంఘ్రిసరోజాను • వర్తనంబుఁ, దనదుమదిఁ బెన్గ గురునకుఁ • దళిహ నిత్య
మాచరించుచు నుండెన • య్యనఘయనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

వ. అయ్యవసరంబున. 5

సీ. ప్రీతి వరుఁదరుం • బెరుమాళ్ళజియ్య రా, గురుసార్వభౌముఁ గ • న్గొనఁ దలంచి

తమయూరు విడిచి స,త్వరగతి నొంటిగా, నేతెంచి యద్దేశి,కేంద్రుఁ గాంచి
ప్రణమిల్ల గురుఁడు శ్రీ,వైష్ణవసాహ్యము, వర్జించి యతఁ డిట్లు,వచ్చె ననుచు
పరిహరింప నతండు, పడియుండె నార్తితోఁ, దన్మరద్వారవి, తర్దియందు

తే. నంత మణవాళయోగీంద్రుఁ,డాఋనెలల, కతని రావించి కరుణతో,నాదరించి
వైష్ణవాచార మతనికిఁ, బలికె ననుచు, వాదిభీకరగురుఁ డనె మోద, మలర.

సీ. విషము సోఁకిన నది, వేవేగకేవల, ప్రాకృతతను వెడఁ, బాపఁ గలుగు
నావిష మైనమం,త్రౌషధమణివశ్య, మగు ధ్రువ మీవిష,యములు తమ్ము
విన్నను గన్న దా,కొన్న మన్నించినఁ, గలిసినఁ దలఁచుచుఁ,దొలఁగి యున్న
నప్రతిక్రియముగా,నాత్మస్వరూపైక, హాని నల్పను సంశ,యంబు లేదు

తే. గాన విషయవిరక్తిసు,ఖం బొసంగుఁ, జారుతరభూషణం బగు,జ్ఞానికనుచుఁ
బలికెనతనికి గురుచక్ర,వర్తి యనుచు, వాదిభీకరగురుఁ డనె, మోద మలర.

సీ. అర్థసంపద విమో, హంబున కగు విమో,హంబు నారకావహ, మగును గాన
యర్థ మనర్థాఖ్య,మదిమార మెవ్వాఁడు, వర్జించు వాఁడె పో,వైష్ణవుండు
ధర్మార్థ మైనను,దగదు ధనస్పృహ, యర్థకాంక్షాభావ, మతిసుఖంబు
కాలుంచి బురదలోఁ,గడుగుటకంటెఁ బం,కముఁ బాపి చనుట సు,ఖంబుగాదె

తే. యాశబలవద్విరోధిని,యగుటఁజేసి, దాని నిరసించువాఁడెపో,ధన్యుఁ డనుచుఁ
బలికె నతనికి గురుచక్ర,వర్తి యనుచు, వాదిభీకరగురుఁ డనె,మోద మలర.

వ. మఱియును శ్రీవైష్ణవలక్షణలక్షితు లగు భగవద్దాసులకు దాసుండనువారు విశేష ధర్మస్ఖాలిత్యంబు లేకుండ నన్ను శిక్షించిపని గొనువారును స్వేచ్ఛానుగుణంబుగాఁ గ్రయవిక్రయంబు లొనరించి నన్ను రక్షింపఁగలవారు నస్మదసాధారణ స్వాములు నని యెల్లప్పు డెవ్వాఁడు తనతలంపులోఁ దలంచుచుండువాఁడెపో బ్రహ్మవిత్తముం డణుమాత్రంబైన మహాత్ములయెడ నాచరింపంబడు ద్వేషంబనర్థావహం బగుఁ బరమపావనం బైన తదీయులకరుణాకటాక్ష వీక్షణంబు శ్రీవైష్ణవ ధర్మప్రచ్యుతుల నైనఁ బరమపవిత్రులం జేయుఁ దదీయంబగు స్వల్పతరామర్షణం బైన మహోన్నత స్థానంబువలన నిత్య సూరులనైనం బడఁగూల్చుఁదొల్లి నిత్య సూరిప్రధానుండగు శ్రీ గరుత్మంతుండు స్వల్పతమంబైన శాండిలీవిషయాపరాధంబుచే భగ్నపక్షుండై మగిడి తదనుగ్రహంబుచేఁ బక్షలాభంబుఁ గాంచి సుఖించె నని కురుసభయందుఁ బాండవదూత విన శ్రీమన్నారదుండు ధృతరాష్ట్రున కుపదేశించెనని యుద్యోగ పర్వంబునం బ్రసిద్ధంబు గాదె కావున నన్యులనే మన

వచ్చునని యనేక విధంబుల నమ్మణవాళమునీంద్రుఁడు తత్త్వార్థ బోధ మొనరింపం దెలిసి యవ్వరుందరుం బెరుమాళ్ జియ్యరును గృతార్థుండయ్యె నయ్యవసరంబున నుత్తరదేశీయుండును శ్రీవైష్ణవుండునగు ప్రభుం డొక్కనాఁడేకాంతంబున, శ్లో॥ వ్యాఘ్రీవ తిష్ఠతి జరాపరితర్జయంతీ। రోగాశ్చ శత్రవ ఇవ ప్రహరంతి దేహమ్। ఆయుః పరిస్రవతి భిన్న ఘటాదివామ్భోలోక స్తథా వ్యహిత మాచరతీతి చిత్రమ్॥ అనియెడు న్యాయంబున నెదుట గద్దియఁ బెట్టియున్న పెద్దపులిపోలిక నీమేనం గనఁబడి దినదిన ప్రవర్ధమానం బగుచు ముదిమి బెదరించుచున్న యది రోగంబులు పగతురపగిది విజృంభించి ప్రహరించుచున్న యవి భిన్నఘటోదకంబు కైవడి వాసరక్రమంబుగా నాయువు పరిక్షీణంబగుచున్న యది యిప్పటికైనను బ్రభుత్వం బవలంబించి సదసద్వివేకంబు లేక నరులకహితంబు లాచరించుచుంటి నని తనలో నాశ్చర్యంబుఁ జెంది మఱియొక కాలంబున నవ్వరవర మునీంద్రుని నిరతిశయ నిర్మలజ్ఞానానుష్ఠానంబు లాకర్ణించి యమ్మహాత్మునిం గాంచి ప్రణామం బాచరించి దేవా సకల వేదశాస్త్ర సారభూతంబైన యర్థం బొక్కటి సంగ్రహించి దాసునకుం బ్రసాదిపవలెనని ప్రార్థింప నద్దేశిక శిఖామణి యారాజు నుద్దేశించి వత్సా భగవద్దాస్యరసంబు ముఖ్యపురుషార్థంబని యెఱింగిన యధికారికిఁ గేవలభగవల్లాంఛన ధారణంబు శ్రీవైష్ణవత్వప్రాప్తికిం జాలదు కేవలభగవత్సమారాధననిష్ఠయుం జాలదు కేవలాచార్య పారతంత్ర్యముం జాలదు కేవల భాగవతానువర్తనముం జాలదింక నేమంటివేని యథోచితకైంకర్య నిరతుండై స్వకీయగృహంబునకు శంకాతంకంబులు లేక శ్రీవైష్ణవు లేతెంచి వసింప వారలకుం దాసుగ్రయ విక్రయార్హ దాసుండై యథాశక్తికైంకర్యం బొనర్చుట సకలవేదశాస్త్ర ప్రతిపాదితంబైన పరమపురుషార్థం బిట్లాచరింపఁడేని ప్రపత్తిరూప మహైశ్వర్యం బతనికిం జేకూఱదు, శ్లో॥ న్యగ్రోధబీజే వటవత్ప్రణవే శబ్దజాలవత్। సిద్ధేతదీయ శేషత్వే సర్వార్థా స్సమ్భవన్తిహి॥ అనియెడు న్యాయంబున న్యగ్రోధ బీజంబున వటవృక్షంబుమాడ్కిఁ బ్రణవంబున శబ్దజాలంబు కొలందిఁ దదీయ శేషత్వంబు సిద్ధింప సర్వార్థంబులు సిద్ధించు నిట్టి భాగవత నిష్ఠ గలవారికి వివిధంబులును విచిత్రంబులు ననంతంబులు నగుభగవ ద్విషయరహస్యంబు లన్నియుఁ దెలియవలె ననియెడు నిర్బంధంబు లేదిట్టి యనుష్ఠానంబు లేనివా రుపదేశించు జ్ఞానానుష్ఠాన ప్రతిపాదక హస్యార్థంబు లన్నియు వెలయాలుపలుకు పతివ్రతా ధర్మంబునుం బోలెనిష్ఫలంబులగు, శ్లో॥ పూజనా ద్విష్ణుభక్తానాం పురుషార్థోస్తి నతరః। తేషు తద్ద్వేషతః కిఞ్చి న్నాస్తి నాశన మాత్మనః॥ అనియెడు

న్యాయంబున శ్రీ మహాభాగత సమారాధనంబు కంటె వేఱొక పురుషార్థంబు లేదు. వారలయెడ నపచారపడుటకంటె స్వరూపనాశనంబు వేఱొకటి లేదని యుపదేశించి వీడ్కొల్ప నయ్యావని భర్తయు విశేషధర్మ శ్రవణంబుచేఁ గృతార్థుండై యమ్మణవాళ యోగీంద్రుని శ్రీ పాదపద్మంబుల సంస్మరించుచు నిజనివాసంబునకుం జని యం దక్షాంతంబు శ్రద్ధా భక్తి పూర్వకంగాఁ దదీయారాధనం బాచరించుచు సుఖించు చుండెనంత.

సీ. శ్రీ వేంకటాద్రికాం॰చీముఖ్యదివ్యదే, శములఁ గన్గొనువేడ్క॰నందడింప
సంశ్రితజనసహా॰స్రములతో వెల్వడి, యశహియమణవాళ॰యమివరుండు
హస్తిశైలము కడ॰కరుగుదేర నెఱిఁ గి, స్థలవాసు లగ్గుమ॰చక్రవర్తి
కెదురుగా నేతెంచి॰ముద మొప్ప సేవింప, నతఁడు వారి కనుగ్ర॰హంబు సల్పి

తే. స్వామి కైంకర్యములయందు॰సేమ మరసి, సంతసించుచు వారితో॰జరగి వచ్చి
శోభితం బగుకోవెలఁ॰జొచ్చె ననుచు, వాదిభీకర గురుఁడనె॰మోదమలర.

సీ. పృథురత్నకృతబలి॰పీఠముకడ మ్రొక్కి, కోవెల వలగొని॰గురువరుండు
దేవదేవునిఁ బెరుం॰దేవీనహాయునిఁ, గని మ్రొక్కి పొగడి త॰త్కరుణఁ దీర్థ
శఠకోపమాల్యప్ర॰సాదాదిబహుమతు, లంది యచ్చటనుండి॰యరుగుదెంచి
సొరిదిఁ దద్వైష్ణవు॰ల్చోటుఁజూపిన నందు, వసియించి నాల్గైదు॰వాసరములు

తే. స్వామి వైశాఖమాసోత్స॰వంబుప్రకృత, మైనమూఁడవతిరునాళ్ళ॰యందుగరుడ
గతుని వరదునిఁ గనులారఁ॰గనియెననుచు, వాదిభీకరగురుఁడనె॰మోదమలర.

సీ. శారదపూర్ణిమా॰చంద్రోపమాతప, త్రయుగంబునీడ మ॰స్తకము దనర
ధవళచామరముల॰ధన్యు లిద్దరు కేలఁ, గొని భక్తి నిరుగెలం॰కులనువీవఁ
గనకాద్రిపైఁ దోఁచు॰కాలమేఘముగతి, గరుడునిపై నొప్పు॰కరిగిరీశుఁ
గళ్యాణవరదునిఁ॰గని మ్రొక్కి యతనితోఁ, దిరువీథిఁ దిరిగి య॰ద్దివ్యసూరి

తే. గరుడసేవాఫలంబులో॰గడియఫలము, నిచ్చి గంగను గొనెవిప్రుఁ॰డెందుమందు
స్వామితో నేఁగె నామంట॰పమునకనుచు, వాదిభీకరగురుఁ డనె॰మోద మలర.

సీ. గరుడోత్సవాలోక॰కౌతూహలం బొప్ప, నాశ్రితజనులతో॰నలయిరుంబి
యప్పగా రేతెంచి॰యాత్మగురుం డైన, సుందరజామాతృ॰సూరి నవట
వెన్నునిసన్నిధిఁ॰గన్నులార భజించి, హర్షవిస్మయవివ॰శాంగుఁ డగుచు
జడునట్లు క్షణ ముండి॰సంజ్ఞ లభించి ని, జార్యునికడ నుండె॰హరిని విడిచి

తే. యంత వైయాసియుత్సవ•మైనపిదపఁ, గదలి మణవాళముని యప్ప•గారితోడ
జరగి పొడగాంచెగృధ్రపు•ష్కరిణి ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. ఆసరస్తటమునం•దలరారు చున్న శ్రీ, విజయరాఘవుఁ జూచి•వినుతి సలిపి
శ్రీఘటికాద్రినృ•సింహునిఁ గని మ్రొక్కి, యతనిసన్నిధి బహు•మతి లభించి
యప్పగారియిఱుంబి•నాయూరిచెఱు వద్రి, పైనుండి వీక్షించి•ప్రమదమొంది
రమ్య మౌవడతిర్వ•రంగ మీగ్రామము, కావేరి యీతటా•కం బటంచు

తే. రెంటి కట్లభిధానముల్•రెండు చేసి, సౌమ్యజామాతృదేశిక•సార్వభౌముఁ
డచటినుండి వృషాద్రికి•నరిగె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. తిరుపతి కేతెంచి•తిల్లగోవిందునిఁ, గని మ్రొక్కి పొగడి త•త్కరుణఁగాంచి
కపిలతీర్థముకడఁ•గాసారభూతాది, సూరులఁ బదుగురఁ•జూచి మ్రొక్కి
ముక్తుఁడు శేషాంక•మునఁ జేరుకైవడి, బలువిడి శైలంబు•పైకి నడచి
యటవీనృసింహున•కంజలిఁ జేసి ర, సాలవృక్షముకడ•సంయమీంద్రుఁ

తే. గాంచికేల్మోడ్చి స్వామిపు•ష్కరిణిఁ జెంది, యందు నీరాడివిహితకృ•త్యములొనర్చి
శ్రీవరాహుని గురుఁడు భ•జించె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర

సీ. ఆవరాహస్వామి•యాజ్ఞచేఁ గ్రమముగా, నేతెంచి శ్రీవేంక•టేశుదివ్య
మంగళమూర్తిని•మదిఁ బ్రీతి ముప్పిరి, గొనఁ గని పొగడియ•గ్గురువరుఁడు
తిరువాలవట్టము•తీర్థము శఠకోప, మభయహస్తము చంద•నాదు లంది
యాస్థలవాసులు•హరికి శ్రీకార్యని, ర్వాహకు నొక బ్రహ్మ•వాది నిచట

తే. నుంపి పొమ్మని తన్నుఁబ్రా•ర్థింపనాత్మ, శిష్యునెంబెరుమానారు•జియ్యరార్యు
నచటనుండ నియోగించి•యరిగెననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

సీ. తిరుమల దిగివచ్చి•ధృతి మీఱఁ దిల్లగో, విందరాజులను సే•వించి మించి
పుణ్యవీక్షారణ్య•మున రమ్యహృత్తాప, నాశినీతీరస•న్మందిరమున
శాలిహోత్రమునిప్ర•సన్నుని శ్రీవీర, రాఘవు సీతాభి•రాము భుజగ
రాజశయానుని•రంగు మీఱ భజించి, కైరవిణీకూల•కనకసదను

తే. రుచిరభూషాప్రకాశు శ్రీ•రుక్మిణీశుఁ, బార్థసారథి నీక్షించి•ప్రస్తుతించి
యతనికృపఁజెందిచనియెన•య్యార్యుఁడనుచు, వాదిభీకర గురుఁడనె•మోదమలర.

సీ. శ్రీమయూరపురంబుఁ•జెంది యందుమహాత్మ, మహదార్యుసేవించి•మల్లపురికిఁ
జనిభూతయోగీంద్రుఁ•గని మ్రొక్కి పొగడి మ, హీసారపురమున•కేఁగుదెంచి

భార్గవర్షికుమారు-భక్తిసారు భజించి, పొగడి యచ్చటినుండి-భూతపురికిఁ
జని యందుఁ గేశవ-స్వామికిం జేమోడ్చి, సంశయమీంద్రునిఁ జూచి-సంతసించి

తే. సన్నుతించి తదీయప్ర-సాద మొంది, కంచికేతెంచి వరదునిఁ-గాంచిమ్రొక్కి-
గురుఁడు మధురాంతకమునకు-జరిగెననుచు, వాదిభీకరగురుఁడనె-మోదమలర.

సీ. మధురాంతకమునందు-మధుకైటభారిని, గన్నులవిందుగాఁ-గని నుతించి
సంయమీంద్రునకుసం-స్కారపంచకముము, నెరియనంబియొనర్చఁ-బ్రీతినెచట
నయ మొప్ప నచటఁబ్ర-ణామముఁ గావించి, జరిగి తిరుక్కణ్ణ-పురమునందు
శౌరిరాజస్వామి-చరణాంబుజములఁ గ, న్గొని మ్రొక్కి శ్రీకుంభ-కోణమొంది

తే. యందు శేషశయానున-కంజలించి, లలితచోళోర్విదివ్యస్థ-లముల గురుఁడు
గాంచి మ్రొక్కిడియరిగెరం-గమునకనుచు, వాదిభీకరగురుఁడనె-మోదమలర.

వ. అంత గురుపురందరుండు హరిమందిరంబుఁ జొచ్చి బలిపీఠంబుకడఁ బ్రణామం బాచరించి క్రమంబుగాఁ దత్తద్దివ్యసూరి స్థానంబు లన్నియు సేవించుచుఁ బ్రదక్షిణ క్రమం బొనర్చి, శ్లో॥ ఏష బ్రహ్మప్రతిష్ఠోస్మి గ్రీష్మే శీతమివహ్రదమ్॥ అన్నయట్లు నిదాఘ కాలంబున శీతలామృత హ్రదంబుపగిది శ్రీరంగ రాజపరబ్రహ్మంబును డాసియధ్వశ్రమం బెడఁబాసి శ్రీపాణి యోగీంద్రునిగతిఁ దదీయదివ్య మంగళ విగ్రహం బాపాదమస్తకం బనుగ్రహంబుచేసి తీర్థశఠ కోపాదిబహుమతి లభించితాఁ దెచ్చి నదివ్యతరంబు లగుధవళచ్ఛత్ర చామరంబులు మొదలుగాఁగల కైంకర్యోప కరణంబు లన్నియు నద్దేవదేవునకు సమర్పించిత దాజ్ఞ వడసిమఠంబునకు విచ్చేసి యందుఁ బూర్వక్రమంబున నిజాశ్రితులఁ గూడివేదాంత వ్యాఖ్యాన వైభవసమే తుండై సుఖం బుండె నంత. ౨౦

సీ. ముందుశ్రీఘటికాద్రి-యందునిజార్యుని, యాజ్ఞఁజెందియిరుంబి-యప్పయార్యుఁ
డచటినుండి యిరుంబి-కరిగి గృహం బంది, యం దమ్మహాత్ము న-హర్నిశంబుఁ
దలచుచు మును దా ను-దార్థాపదముల, నలిపినగురుదిన-చర్య గొఱఁతఁ
జెందినఁ జూచి త-చ్ఛేష పూర్తి యొనర్చి, యది గురుసన్నిధి-కనుప నాతఁ

తే. డది కటాక్షించి హర్షించి-యార్యవిషయ, భక్తినిష్ఠాభిమానమీ-పగిదినుండ
వలదె శ్రీవైష్ణవులకని-పలికెననుచు, వాదిభీకరగురుఁడనె-మోదమలర.

వ. అప్పుడు. 22

సీ. అతనిఁ గన్గొన వేడ్క-యాత్మలో నుదయింప, నళహియమణవాళ-యతిరేణ్యుఁ

డతని రమ్మని తన హస్తాక్షరముల శ్రీ ముఖ మన్ప నంతకు ముం దతండు
వార్ధిఁ జెంగున దాఁటు వానరేంద్రుఁడ నైన, రంగరాట్పుఖవిష్ణు రథుఁడ నైన
సర్వదిక్సంచార చతురవాయువ నైన, నైతినా కాంతోప యంతృగురుని

తే సకలకాలములందుఁ గని భజింప, వచ్చు నని కోరుతఱి నొక వైష్ణవుండు
వచ్చి శ్రీముఖ మాతని కిచ్చె ననుచు, వాదిభీకరగురుఁడనె మోదమలర. 23

సీ. శ్రీముఖ మది గొని శిరమున నురమునఁ, గన్నుల నద్దుచు ఘనుఁ డిరుంబి
యప్పగా రాలిఖి తార్థ మంత గ్రహించి, హర్షాబ్ధిమగ్నుప ర్వాంగుఁ డగుచు
నాచార్యసమునిఁగా నా వైష్ణవునిఁ జూచి, యతని కర్ఘ్యాసనా ద్యర్చ సలిపి
యాశ్రితజనులతో నా సాత్త్వికునిఁ గూడి, యాక్షణంబనిజాల యంబు విడిచి

తే. వేగ చనిచని యుభయకా వేరిమధ్య, శోభితం బగురంగముఁ జొచ్చియందు
గురుని మరమునవేడ్కఁగ గ్గొనియెననుచు, వాదిభీకరగురుఁడనె మోదమలర.

సీ. అకలంకరాకాసు ధాంశుమండలమట్లు, విలసిల్లుతద్దివ్య విగ్రహంబు
ముందు తద్విశ్లేష మున జని చినతన, యార్తి దీఱ భజించి యమ్మహాత్ము
చరణాంబుజముల మస్తకమునఁ గనుఁగవ, నద్దుచుఁ దనయాత్మ యందనిలిపి
గుకుతరతద్దివ్య గోష్ఠి గన్గొని భక్తి, పూర్తి నార్యునికను మ్రోల నిలువఁ

తే. గుశలసంప్రశ్న మొనరించి గురువరేణ్యుఁ, డాదరోక్తులఁ గూర్చుండు మనివిధింప
నచటఁ గూర్చుండెనాయిరుం బప్పయనుచు, వాదిభీకరగురుఁడనె మోదమలర.

వ. అట్లిరుంబియప్పగా రాత్మాచార్యుం డగునక్కాంతో పయంతృయోగీంద్రునిఁ బ్ర త్యక్షపరదైవతంబుగా నిశ్చయించితత్సన్నిధి నెడఁబాయక యున్నయెడనొక్కనాఁ డతనికంతరంగా శ్రితుం డగువరుందరుంబెరుమాళ్ళపెళ్లై ఖండవస్త్రంబును బాద్యోదక పాత్రంబునర్పించినీ రాడనిమంత్రింప రాకామృతాంశుబింబంబుపై నొప్పునీలజలదపటలంబు వోలికశరదరవిందంబుపైఁ గదిసినయలికులంబుకొలంది నగ్గురుకుమారుని శ్రీముఖమండలంబుపైఁ జూపడుశిరోరుహసమృద్ధిఁ గటాక్షించి యమ్మణవాళమహాముని యీ దీక్ష యేమని యడుగ వరుందరుంబెరుమాళ్ పిళ్ళ యు గర్భదీక్ష యని విన్నవింప నగ్గురు శిఖామణియు విననవధరించి యీ ప్రొద్దా యుష్కర్మంబు సేయించుకొమ్మని యాజ్ఞాపింప నద్దేవరాజగురుం డాక్షణంబయ ట్లొనర్చి శ్రీకవేరకన్యా ప్రవాహంబునం దవగాహనంబుఁ జేసి ధౌతవస్త్రంబుల ధరియించి శ్రీచూర్ణ లేఖాశ్లాఘనీయాంతరాళంబులగు దవళద్వాదశోర్ధ్వపుండ్రం

బులు తత్తదుచితస్థలంబుల రచియించి తత్తత్కార్యకరణీయంబు లాచరించి యున్న సమయంబున నిరుంబినుండి యేతెంచిన వైష్ణవుండు మీకుంబుత్త్రిండుద యించి పదిదినంబు లయ్యెనని విన్నవింప నచటివా రందఱావార్తవిని శ్రీ రమ్య జామాతృయోగీంద్రుని సర్వజ్ఞత్వంబున కాశ్చర్యపడి రంత నమ్మహాత్ముం డక్కు మారున కళహియమణవాళప్పెరుమాళ్ నయనా రని నామకరణంబుఁ జేసె నిట్లు వైష్ణవు లందఱు తమతమపుత్త్రిల కాతనినామంబు గావించుటకతన శ్రీ మహా భాగవతవ్రాతంబంతయు నళహియమణవాళమునిగోత్రం బనం బరఁగె నయ్యవస రంబున 26

సీ. సాత్త్వికశాస్త్రోక్త • శాకములం దార్యుఁ, డర్థించి యెయ్యది • యారగించు
నాశాక మార్జించి • యగ్గురువరునకు, వరదనారాయణ • గురుఁ డొసంగు
నతని శిష్యులు కొంద • ఱక్షయపాత్రార్జి, తద్రవ్య మతనింటఁ • దళిహ కియ్య
నా దృష్టసంకోచ • మహాత్మునియెడఁ, గని వరవరముని • కరుణ నతని

తే. కాత్మమరమునకునున్నస్వా • స్థ్యములవలన,వచ్చుధనధాన్యములయందు•వలసినట్టు
గొనఁగుద్రవ్యము లాదర • మొప్పననుచు, వాదిభీకరగురుఁ డనె • మోదమలర.

సీ. అట్లు దృష్టాదృష్ట • యాత్ర యార్యాయత్త, మైయుండ నిర్భరుఁ • డైనవరద
నారాయణాహ్వయు • సూరీంద్రుఁ డప్పలా, రప్పిళ్ళమొదలైన • యార్యవరులఁ
గూడి శ్రీవరవర•గురుశేఖరుఁడు గోష్ఠి, సలుపుచు నా సభా,సదులయందు
భవ్యుఁ డొపగవస్తు • భట్టనాథార్యుండు, లేకున్న సంతుష్టి • లేక యతని

తే. శ్రీముఖముఁ బంచి రావించి • సిరివహించి, ఆక్కలందును జుక్కల • తేనిపగిది
నొప్పు వాగలయందు నె • ల్లప్పు డనుమ, వాదిభీకరగురుఁడనె•మోదమలర. 28

వ. అప్పుడు 29

సీ. ధీరు నిరుంబప్ప • గారిని రమ్మని, తజ్జనకుఁడు లిఖి • తంబుఁ బంప
నది చూచి కాంతోప•యంతృదేశిక చంద్రుఁ, డతనినింటికిఁజను•మనుచుఁబలుక
నతఁడుతన్నెడఁబాసి • యరుగఁజాలకయున్న, నర్చామయంబైన • యాత్మమూర్తి
స్వకపాదుకలను గా • షాయోత్తరీయముఁ, దనదర్పణము శేష • ధవళమృత్తు

తే. నిచ్చియగ్గురుఁ డాతని • నింటి కనుప, నతఁడు తమయూరికేఁగి ని,జాలయమున
నిండుమది గురుఁ దలఁచుచు • మండెననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

వ. తదనంతరంబ. 31

సీ. శ్రీశేతగిరియందు • జెన్నుగా నెలకొన్న, దైవనాయకునకు • దారనిత్య
కైంకర్య మొనరింపఁ • గాఁ దలంచి కరాబ్జ, ములు మోడ్చి వానాద్రి • మునివరేణ్యు
డడియేని కాజ్ఞ యి • మ్మని విన్నవింప, నయ్యళహియమణవాళ • యమికులేంద్రుఁ
డన్వహ మర్చింప • నతనికి రంగేశ, విగ్రహం బొక టిచ్చి వేడ్క నతని
తే. నాదరం బొప్పఁబనిచిన • నతఁడు వాన, మామలకు వేగచనియాత్మ • మరమునందు
యుక్తగోష్ఠి యొనర్చుచు • నుండెననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

వ. అంతఁ గాంతోపయంతృ గురుపురందరుం డొక్కనాఁ డాశ్రిత వ్రాత పరివృతుం డై యుండి వారి నుద్దేశించి యందఱన్ని యర్థంబు లెఱుంగుదురైనను 'తేవుమత్తరియే' ననుచు నధ్యవసించి సుస్థిర చిత్తుండై యున్న వాఁడిప్పరవస్తుగోవిందదాసరప్ప యొక్కఁడే యని యానతిచ్చి తన కనవరతారాధనీయంబైన నయళహియమణవాళ విగ్రహం బాచార్యదేవుండైన యగ్గోవింద దాసరప్పునికి నిత్యారాధనార్థంబు బొసంగి సకలవేదాంత రహస్యార్థంబు లుపదేశింప నతండు కృతార్థుండై యంత దిరువాడిప్పూరంబు ప్రస్తుతంబైన నాచ్చియారు తిరుమాళియయని ప్రసిద్ధిఁ గాంచిన శ్రీవిల్లిపుత్తూరికిం జని యచటినుండి తీర్థప్రసాదంబులఁ గొనివచ్చి యగ్గురుశిరోమణి కర్పింప నతండును సుప్రసన్నుండై శ్రీగోదాదేవికి ముఖోల్లాసంబుగా భట్టరపిరాన్ దాసుం డని యతనికిఁ దిరునామంబు గావించెనంతనమ్మహాత్ముం డత్యంత విరక్తుండై పరమప్రాప్తకైంకర్య విరోధియగు సాంసారిక సంగంబు దూరంబుగా విసర్జించి యథాశాస్త్రంబుగా సన్న్యసించి భట్టరపిరాన్ జియ్యరని తిరునామంబు లభించి యఱనిమేషం బైన నెడఁబాయఁజాలక యాచార్యసన్నిధిని వసించి సుఖించు చుండె నంత 34

సీ. చిరకాల మయ్యెను • శ్రీ శఠరారాతిని, సేవించి యని యతి • చింతఁ జేసి
రంగేశు వీడ్కొని • రమ్యజామాతృ దే, శికచంద్రుఁ డాశ్రిత • శ్రేణితోడ
నచటు వెల్వడి వేగ • యరిగి శ్రీ మధురాపు, రముఁ జెంది యం దొక • రమ్యవసతి
యందు వసింప న • య్యార్యునిమాహాత్మ్య, మాప్తుఁబు చెప్పఁగా • నాలకించి
తే. భక్తితోడ మహాబలి•బాణనాథ, రాయఁ డనువాఁడు పాండ్య ధ•రావిభుండు
వచ్చి పొడగాంచె నయ్యార్య • వశ్యుననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

వ అంత. 35

సీ. భక్తితోఁ బ్రణమిల్లి • పాండ్యభూపాలకుఁ, డమ్మహాత్మునియంఘ్రు•లాశ్రయింప
నతని కనుగ్రహ • మాచరించి గురుండు, పంచసంస్కారాది • బహుహితములఁ

గావింప నమ్మహీ॰కాంతుఁడు ధన్యుఁ డై, యార్యునాజ్ఞనిజాల॰యమున కరిగి
మఱునాఁటిప్రొద్దున ॰ మగిడి యే తెంచి య, ద్దేశికోత్తమునకు ॰ దివ్యరత్న
తే. ఖచితశిబిక సమర్పింపఁ॰గరుణ నందు, గురువరేణ్యుఁ డధిష్ఠించి॰జరుగువేళ
ముఖ్యభేర్యాదివాద్యము ॰ ల్మ్రోర సెననుచు, వాదిభీకరగురుఁడనె ॰ మోదమలర. 37

వ. అయ్యవసరంబున.

సీ. గురుభక్తివశ్యులై ॰ కొందఱు వైష్ణవు. లాందోళికాదండ ॰ మాని పూన
శరదిందుసుందర ॰ చ్ఛత్ర మార్యుఁ డొకండు. గురునిశిరంబుపై ॰ గూర్మిఁదాల్ప
నిరుగెలంకులయందు ॰ నిరువురు సాత్త్వికుల్. ధవళచామరములు ॰ తగిలి వీవ
లలితభృంగారుక ॰ లాచికారత్న పా, దుక లూని బుధులు సం ॰ తుష్టి నడవ
తే. నాడుచును బాడుచును గొంద ॰ ఱరుగుచుండి. శీతవాతహిమాదులు ॰ చెందకుండ
శిబికపైఁ గప్పిరాచ్ఛాద ॰ చేల మనుచు, వాదిభీకరగురుఁడనె ॰ మోదమలర.

వ. అప్పు డప్పాండ్య మండలేశ్వరుండగు బలిబాణనాథరాయఁడాత్మీయ పరివారంబుతో గురుని వెంటం జనుచు "నాకించి త్కుర్వత శ్శేషత్వమ్" అనియెడు న్యాయంబున స్వాచార్య విషయంబుగా యథాశక్తి కైంకర్యం బాచరింపని వానికి శేషత్వసిద్ధి లేదని తలంపులోఁ దలంచి శిబికావాహనోపయోగివేషంబు ధరించి యమ్మహాత్మునియాందోళికా దండంబుఁ బూని యోజనద్వయ పర్యంతంబు జరిగి పిదప నయ్యార్యదేవేంద్రుం డనుష్ఠానార్థంబుగా నొక నదీ తీరమునందా నృపాలుం డావేషంబుతో నగ్గురుపురందరుని సేవింప నతంను కటాక్షించి వత్సా నీ వత్యంత సుకుమార శరీరుండవు పాండ్యమహీ మండలేశ్వరుండవు కావున నిట్టి సాహస కృత్యంబు సేయ నర్హుండవు గావనివిని దేవాయ నాదికాలంబుచుండి సంసరించుచు నిప్పు డీ క్షత్రియదేహంబు లభించి రాజ్యయౌవన ధనాదిమదాంధుండనై మీఁ దెఱుంగక యున్న నన్నుద్ధరింపఁ దలంచి శ్రీరంగనాథుండు భవత్స్వరూపంబు ధరించి "పంగోరుపరి భాగీరథి" న్యాయంబున నిచటి కేతెంచి నన్నుంగృతార్థుం జేసెఁగాన యీనే నిట్టియెడ నించుకైన దాసకృత్యంబు సేయకున్న నీమేను నిరర్థకంబై చను నని యారాజు విన్నవింప నతనివినయోక్తుల కక్కజపడి సుధామధుర భాషణంబుల మిగుల నాదరించి యథోచితంబుగా బహుమతులాచరించి పనుప నన్నరదేవుండు నిజనివాసంబునకుం జని యందాచార్యాజ్ఞచేఁదదీయారాధనం బాచరించుచు శాస్త్రోక్త క్రమంబుగా రాజ్యపరిపాలనంబు సేయుచు సుఖించు చుండె నంత. 39

సీ. ఆ నదీజలములం • దవగాహనముఁ జేసి, కాలోచితక్రియ • లాచరించి
ఘనదర్భశయనమా • ర్గమున సంశ్రితులతోఁ, జని చని యాతప•శాంతిఁ జెంది
చేరువగా దొడ్డ • చింతమ్రా నీక్షించి, దానిక్రింద నొకింత • దడవు నిలిచి
శ్రమముఁ దొలంగి య • చ్చటినుండి చనువేళ, స్వాములగ్గురునకం • జలిరచించి

తే. దేవ యీమ్రాను తావక • సేవకులకు, మేలు సల్పెను దీనికి • మీర లొక్క-
సేమ మొనరింపవలెనని • చెప్పి రనుచు, వాదిభీకరగురుఁడనె• మోదమలర. 40

సీ ఆశ్రితవిజ్ఞప్తి • నంగీకరించి శ్రీ, వరవరయోగి యా • తరువు డాసి
దయచేసి తనపాణి • తలమున నమ్మహా, వృక్షము స్పృశియించె • వేడ్క- మీఱ
నే లభించు ఫలంబు • నీ కిప్పుడగునని, యానతిచ్చి యవల • కరుగ నదియు
నుమ్మాలపత్రమై • యుర్వి వాలిన నందు, జ్యోతియొక్క-టి లేచి•సురలుపొగడఁ

తే. జనియె నాకాశగతి హరి•స్థానమునకు, జ్ఞానులదిసూచిపరమ వి•స్మయముఁజెంది
మ్రొక్కి- రాసౌమ్యజామాతృ • మునులకనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

వ. మఱియును. శ్లో॥ యం యం స్పృశతి పాణిభ్యాం యంయం పశ్యతిచక్షుషా।
స్థావరాణ్యపి ముచ్యన్తే కిం పునర్బాంధవాజనాః॥ అనియెడు న్యాయంబున మ
హాత్ము లైన వారు స్థిరచరంబులయందుఁ దమపాణిపల్లవంబులచే నేయేవస్తువు
స్పృశింతురు స్వకీయ కరుణాకటాక్షంబులచే నేయే పదార్థంబు వీక్షింతు రవిస్థా
వరంబు లైనను విముక్తకంబు లగు బంధుజనులకు ముక్తికై ముతికన్యాయసిద్ధం
బగును గావున నావచనంబునకు విషయం బిమ్మహానుభావుండే యని యచ్చటి వా
రందఱు తమతమ తలంపులం దలంచి రంత. 42

సీ. గురుపురంధరుఁడు శ్రీ • కురుకాపురిని జెంది, యందు శఠారివి • వ్యాలయంబుఁ
జొచ్చి యం దాదివ్య • సూరీంద్రు నేత్రోత్స, వంబుగా సేవించి • ప్రస్తుతించి
సన్నిధితీర్థ ప్ర • సాదముల్ గైకొని, యతనియాజ్ఞ లభించి • యాదినాథ
సన్నిధానమునకుఁ • జని మ్రొక్కి- కొనియాడి, శఠకోపతీర్థ ప్ర • సాదముఖ్య

తే. బహుమతి లభించి వెల్వడి•వసతిఁ జెంది, యందు దివ్య ప్రబంధార్థ•మాశ్రితులకు
నొసఁగుచును గొన్ని మాసము•లుండెననుచు, వాదిభీకరగురుడనెమోదమలర.

సీ. వరధనుర్మాసోత్స•వంబు శ్రీరంగము. నందుఁ బ్రస్తుతమైన•యది తలంచి
యాయుత్సవముఁ జూడ•నరుగఁ జాలకపోతి, నని తన మనమున•ననుతపించి

వకుళభూషణగురు॰వరునిఁ గనొని మ్రొక్కి, తీర్థప్రసాదముల్॰ధృతి లభించి
దివ్యమౌ నొకవాళి॰తిరునామ మతనిపై. వ్రాచ్చి యవ్వర॰వరమునీంద్రుఁ
తే. డతని పీడ్కొని వెల్వడి॰యాదినాథ, హరిని గని మ్రొక్కి-యాతని॰యాజ్ఞవడసి
విల్లిపుత్తూరి కరిగెను॰వేడ్క ననుచు, వాదిభీకరగురుఁడనె, మోదమలర, 44
సీ. ఆవాళి తిరునామం బెట్టిదనినఁ దిరుక్కురుహప్పెరుమాళిత్యాది,
వ. ఆ విల్లిపుత్తూరి॰యం దమ్మహాత్ముడు, భట్టనాథునిఁ గని॰ప్రణతి సలిపి
తత్పుత్త్రియైన గో॰దాదేవియం‍ఘ్రికం, జములకు మంగళా॰శాసనంబుఁ
జేసిన నద్దేవి॰వాసి నాతనిఁ జూచి, మాయన్నయైన లక్ష్మణమునీంద్రు
న పరావతార మీ॰వని తలంచితి నంచు, బహుమతి యొనరించి॰పంచ నతఁడు
తే. వడపెరుంగోయిలుడయాను॰నఘుఁదమ్మి, కంజలించి తదీయతీ॰ర్థాదు లంది
యతని వీడ్కొని యళహరి॰కరిగెననుచు, వాదిభీకరగురుఁడనె॰మోదమలర,
సీ. ఆశ్రితజనులలో॰నళహరి తిరుమల, యందు సుందరబాహు॰హరిని జూచి
మ్రొక్కి సన్నుతిఁజేసి॰మోదకాపూపాది, భక్ష్యములను మంచి॰పాయసంబు
చక్కెరపొంగలి॰చక్కని దధ్యోద, నము పుళోగిరదోసె॰నవ్యఫలము
లర్పించి తచ్ఛేష॰మార్యులతో నారఁగించి తదాజ్ఞ లభించి గురుఁడు
తే. ధన్యజనసేవ్య మగురంగ॰ధామ మొందె, కోవెలకు నేఁగియతిరాజ॰గురునిసిరిని
హరిని గని మ్రొక్కి-మఠమున॰కరిగె ననుచు, వాదిభీకరగురుఁ డనె॰మోదమలర.
వ. అంత. 48
సీ ఘనపరాంకుశజన్మ॰కారణభూమికి, వరవరముని చన॰వస్తుజాత
మంతయు నీరస॰మయ్యె రంగమునందుఁ, దిరిగి యగ్గురుఁ డేఁగు॰దేర మరల
నెప్పటియు ట్లుండె॰నెల్లపదార్థము, లమితజమాత్రుండె యమ్మాన్యతముఁడు
భగవంతుఁడో ఫణి॰భర్తయో యాతఁడై, యవతరించెను జేత॰నావనార్థ
తే. మనుచుఁదమతమనెమ్మది॰నఖిలబుధులు, తలఁచికొలుచుచునుందురు॰దారచరితు
వరగుణాకరు నగ్గురు॰తరణి ననుచు, వాదిభీకరగురుఁ డనె॰మోదమలర.
వ. అంత నొక్కనాఁడు కాంతోపయ తృగురుండు తిరుమలయాళ్వా రని తిరునా
మంబు గల కాలక్షేపమంటపంబునం బ్రవేశించి. 50
సీ. అం దెప్పట ట్లాశ్రీ॰తావళితో గోష్ఠి, నలుపుచునుండ నా॰సమయమునను
మణవాళముని వర॰మాయింటిపను లన్ని. చక్కఁగాఁ జేయింపఁ॰జతురుఁడైన

సాత్త్వికు నొకని వి•చారించి మాకడ, కనుపుమా యనుచున•య్యమివరునకుఁ
జెన్నుగా వ్రాయించి•శ్రీముఖ మొక్కటి, యళహరితిరుమల•యప్పఁ డనుప

తే. దానిఁ గన్నుల నద్దుక•తల వహించి,చూచి పరియించి యాసివ్య•సూరియటకు
ధన్యు నొక్కనిఁ బంపింపఁ•దలఁచె ననుచు, వాదిభీకరగురుఁ డనె• మోదమలర.

వ. అగ్గురువరుం డట్లు దలంచి యగ్గోష్ఠి కాభరణభూతుండు నత్యంతవిరక్తుండునగు
యతిరాజజియ్యరును గటాక్షించి. 52

సీ. జియ్యరే నీ వింక,నెయ్య మొప్పఁగఁ జని,యళహరితిరుమల, యందు హరికి
సకలకైంకర్యముల్,సక్కఁగాఁ జేయింపు, మని విధించిన నమ్మ•హావిరక్తుఁ
డతికృతార్థుఁడ నైతి•నని సంతసించుచు, నతనికి మ్రొక్కి త•దాజ్ఞ వడసి
చని యందు వెన్నుని•పను లొనర్చుచు నుండ,వినివచ్చి పాండ్యపృ•థ్వీవిభుండు

తే. వైష్ణవుండు మహాబలి • బాణనాధ,రాయఁ డయ్యార్యుతోఁ గూడి • రంగుమీఱ
సకలకైంకర్యముల నందు•జరపు ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. దేశముల్ ద్రిమ్మరి•వాసి వైష్ణవకుమా,రకుఁ డొక్కఁ డేతెంచి•రంగపదము
నం దమ్మహాదేశి•కాగ్రణి వీక్షించి, ప్రణతిఁ గావించి త•త్పాదపద్మ
ముల నాశ్రయింప న•మ్మునిముఖ్యుఁ డతనికిఁ, బంచసంస్కారార్థ•పంచకాది
ఘనహితంబు లొనర్చి•కరిగిరి మొదలైన, దివ్యదేశముల నీ•ధీరు ననుప

తే స్వామికార్యములును వీని•వలనబాగుఁ, జెందు నెల్లప్పు డని తన•డెందమునను
దలఁచి కంచికిఁ బంచె నా•ధన్యు ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

వ. అట్లాచార్య ప్రేషితుఁ డై శ్రీరామానుజదాసదాస్య నామాభిరాముం డైన శ్రీ వైష్ణవకుమారుండు కంచి కరుగుదెంచి కరిగిరియందు దేవీసమేతుం డైనవరదునిం బొడగాంచి నమస్కరించి తదీయతీర్థ ప్రసాదాదిబహువిధాను గ్రహంబు లభించి కరిగిరి మొదలైన పదునెనిమిది దివ్యదేశంబులయందుఁ దత్తత్కాలోచిత కైంకర్యంబు లన్నియు నిర్వహించుచుండె నంతఁ గాంతోపయంతృగురువరేణ్యుం డాక్రమంబుగాఁ దిరుమల మొదలైన దివ్యదేశంబులయందుఁ గైంకర్య నిర్వాహకుల నునిచి తాను శ్రీరంగంబునందు నిత్యనివాసం బొనర్చి తత్తద్దివ్యోత్సవంబులయందు శ్రీరంగనాధునకు మంగళాశాసనంబుఁ జేయుచుఁ బ్రసన్నోత్సవంబునం 'దొన్నుంతే' వనెడు తిరువాయ్మొళిశిరప్పును సూత్తందాదిశిరప్పును బ్రతివత్సరంబును శ్రీరంగనాయకీ సమేతుండైన శ్రీరంగనాధుండు ప్రమోద

భరితాంతఃకరణుండై యారగించుభంగి సమర్పించుచు శ్రీపరాంకుశ పరకాలాది దివ్యసూరి ప్రబంధ వ్యాఖ్యానార్థంబు లన్నియు సంశ్రితులకుం దెలుపుచునుండి యక్కాలంబునందుఁ బెరియాళ్వారు తిరుమొళికిఁ బెరియవాచ్చాంబిళ్ళె యాన తిచ్చిన వ్యాఖ్యానంబు గనంబడకున్న నా ప్రబంధంబునకుఁ దా నొక వ్యాఖ్యా నంబు సేయ నిశ్చయించి శ్రీపరాంకుశ పరకాలాది దివ్యసూరి శ్రీసూక్తుల యర్థవిశేషంబులు తెలిసి వచింప సమర్థుండగు తిరుప్పాణాళ్వారుతాదర్ నయనారా ర్యుండు సమీపవర్తి యాయెనేని మనకు మంచి యగునని తలంచి శ్రీముఖం బొకటి లిఖించి పంచిన నమ్మహాత్ముండు తిరునగరియం దది తానొనర్చినతిరునంద నవనంబునందు నుండి యాశ్రీముఖంబుఁ గాంచి శిరసావహించి తదర్థంబు గ్రహించి యాక్షణంబ యచటినుండి కదలి యతిత్వరితగతి నేతెంచి శ్రీరంగధా మంబునం బ్రవేశించి యద్దేశికేంద్రునిం బొడగాంచి సాష్టాంగ ప్రణామం బాచ రించి కేలుఁదమ్ములు ముకుళించి భజించుచుండనగ్గురు శిరోమణియు నతనియధ్వ శ్రమం బంతయు నివర్తించుగతిఁ గరుణారసభరితనిజకటాక్షవీక్షణంబుల నతనిఁ గటాక్షించి సుధామధురగంభీరభాషణంబుల మిగుల నాదరించి యద్దేశికేంద్రునితోఁ గూడి మఱునాఁడు మొదలుకొని వ్యాఖ్యానం బుపక్రమించి నన్నూఱు పాశు రంబులకుఁ బూర్వవ్యాఖ్యానంబు చూపడిననది స్వకృతవ్యాఖ్యతోఁ గూర్చి యున్నంత నా గ్రంథంబు బాల్యావస్థాపన్నుం డగుకందాడనాయనార్యుండవలో కించి యం దభయప్రదరాజగురువ్యాఖ్యయం దాసక్తి విడిచి యభిరామవర యోగీంద్రుని దివ్యసూక్తు లాదరపూర్వకంబుగా సేవించి యీ నలువది పాశురం బులకుఁ దానే వ్యాఖ్యానంబు సేయకుండు టేమి యని యానతిచ్చిన నావార్త మణవాళమహాముని విన నవధరించి యతి బాల్యదశయం దిబ్బాలకున కిట్టి జ్ఞాన పరిపూర్తి యెట్లు గలిగెనని యాశ్చర్యపడి సంతుష్టాంతరంగుండై యన్నాయనా ర్యునిం గటాక్షించి వత్సా యీ రెండు వ్యాఖ్యానంబులయం దొకటి విడిచి యొక్క టాదరించుటకుం గారణం బేమి యని యడుగ నాయనార్యుండయ్యా ర్యశిఖామణి నుద్దేశించి మహాత్మా తనకుం జవి కులుకుపలుకులకుం గారణంబైన సహకార పల్లవరసంబుఁ గ్రోలుగండుంగోయిల కితరతరు పల్లవరసాస్వాదంబు నం దాసక్తి యెట్లుదయించుఁ గావున నసారం బుపేక్షించి సారతమార్థంబు గ్రహించుట సారజ్ఞకృత్యంబు గాదె కావున నా పూర్వ వ్యాఖ్యానంబుకంటె నవ్వివరణంబు మహారసజాల పరిపూర్ణంబు గావున దీనియం దీదానున కత్యాదరం బుదయించె నని విన్నవింప విని యవ్వర మునీంద్రుం డిద్దారకుం డొక యవతార

విశేషంబని తన యుల్లంబున నుల్లసిల్లి యబ్బాలకునిం గౌఁగిలించుకొని శిరం బాఘ్రాణించి సవిశేషంబుగా గటాక్షించి పూర్వోక్తక్రమంబుగాఁ బెరియాళ్వారు తిరుమొళికి సర్వజన మనోహరంబుగా వ్యాఖ్యానం బొనర్చి తిరుప్పాణాళ్వారుతా ధరనైనా రార్యునకు శ్రీలోకగురుకరసరోరుహారాధితం బగు శ్రీరంగ రాజవిగ్రహం బవతారాధనార్థం బొసంగి వీడ్కొల్పి నమ్మహాదేశికుండును నిజనివాసంబునకుం జనియె నంత. 55

సీ. తిరుమేనియందులఁ • దిరునోవు ధరియించి, యుండియు మణవాళ•యోగిచంద్రుఁ
డాచార్యహృదయ ర • హస్యమునకు వ్యాఖ్య, సలుపుచు నొకనాఁడు • శయ్యపైని
బవళించి తనపాణి • పద్మముచే వ్రాయ, వరదనారాయణ • గురుఁడు చూచి
స్వామి దేవరవా ర•శక్తులై యుండి యి, ట్లాయాసపడ నేల • యనినగురుఁడు

తే. వరదనారాయణార్య • భవత్కృపుత్త్రి. పౌత్త్రి కాదులకై శ్రమ • పడెద నిట్టు
లనుచుఁ బల్కిన హర్షించె • నాతడనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ అంత శ్రీశైల పూ•ర్ణార్యాన్వవాయుఁడు, శ్రీమంతుఁ డెట్టూరి • సింగరార్యుఁ
డఖిజనోన్నతిమాని • యనితరగతికతా, కించనత్వముల నం • గీకరించి
యవ్వరముని • నాశ్రయింప నతండు కరుణించి పంచసం • స్కార ముఖ్య
హితము లెన్నతనికి • నేర్పించి తదర్పి. తద్రవ్య మేమియుఁ • దాను గొనక

తే. తిరునగరియందు శరకోప • దివ్యసూరి, రాజదున్నతగోపుర • రచనకొఱకుఁ
బనిచె నాద్రవ్య మంతయు • భక్తిననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

సీ. ఆధనౌఘంబుచే • నత్యున్నతం బైన, గోపురంబు రచింపఁ గొఱఁతపడిన
నభిరామగుణనిధి • యాచార్య పౌత్త్రుఁడు, జియ్యరుపయనారు • నెయ్య మొప్ప
శేషపూర్తి యొనర్చి • శిఖరప్రతిష్ఠయుఁ, జేయించె శరవైరి • చిత్త మలరఁ
గురుకాపురమునందు • గోపురకైంకర్య, మంతయు నెఱవేఱె • ననుచు మేలు

తే. వార్త వినఁబడ శ్రీమణ • వాళయోగి, వరుఁడు నిజసంశ్రితులతోడ • బరమహర్ష
మొంది శ్రీరంగపదమునం • దుండె ననుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర.

వ. తదనంతరం బళహియమణవాళ యోగీంద్రుండు తన పదాబ్జంబు లాశ్రయించి యధికృత పరమార్థులై తన కశ్రాంతశుశ్రూష సేయుచున్న వానమామలజియ్యర్ పెరియ గ తిరువేంగడముని పఃవస్తు పట్టరపిరాఁజియ్యరు కోవెలకందాడయణ్ణన్

ప్రతివాదిభయంకరమణ్ణ నిరుంబియప్పా అప్పిళ్లై అప్పిళ్లారనియెడి యష్టదిగ్గజంబు లును దిరుమల యెంబెరుమానార్ జియ్యరేట్టూరి సింగరాచార్యులు మొదలుగాఁ గల మహాదేశికులచే ననవరత పరిషేవ్యమాణ చరణారవిందుండై నిజమతంబున విలసిల్లుచున్న సమయంబున శ్రీవానాద్రి యోగీంద్రుం డఖిక్షణంబైన నెడఁ బాయక యగ్గురునకు సకలవిధ కైంకర్యంబులు సలుపుచుండుఁ గందాడవరద నారాయణగురుండు యతీంద్రునకు ముదలియాండానుపోలిక నత్యంత ప్రీతివిషయ భూతుండై యుండుఁ బరవాది భయంకరాచార్యుండు భగవద్రామానుజ మునులకు శ్రీవత్సచిహ్న మిశ్రులకొలఁదిఁ బ్రతిపక్షవిక్షేపణ పూర్వకంబుగా శ్రీభాష్యంబు నకు సాహాయ్యంబాచరించుచుండుఁ బ్రతివాదిభయంకరంపేన ముదలియారణ్ణా శ్రీశఠకోపదాసుండును నప్పిళ్లైతిరుప్పాణాళ్వార్ దాసుండును దిరువాయ్మొళి మొదలగు దివ్యసూరిసూక్తులకు సహాయభూతులై యుందురు. విశేషించి య ప్పిళ్లై స్వాచార్యనియమనంబుచే నందాది ప్రబంధపంచకంబునకు దండాన్వయ పూర్వకంబుగా వ్యాఖ్యానంబొక్కటి రచియించి మఱియును యతిరాజవింశతికి సుశ్లాఘ్యంబగు వ్యాఖ్యానంబొనర్చు నప్పిళ్ళారు మఠంబునందు సకలభారంబులు వహించుకొని తళిహకుపయుక్తంబులైన పరిశుద్ధశాలి తండులంబుల సూపశాక క్షీరఘృతాదిద్రవ్యంబుల సమర్పించుచుండుఁ బట్టరపిరాణ జియ్యరెంబెరుమానారు కెంబారుగతి శ్రీపాదచ్ఛాయాపన్నుండై యాచార్యవిశ్లేషంబు సహింపలేక యత నికి సర్వకాలంబు నకలవిధ కైంకర్యంబు లాచరించుచుఁ దదీయ శ్రీపాద పద్మ యుగంబు దక్క వేఱొక దైవతంబు నెఱుంగకయుండు జియ్యరు నయనా రుడయవరులకుఁ దిరుక్కురుహప్పిరాణబిళ్ళానుగతి నమ్మణవాళమహామునుల కత్యాదరణీయుండై సమస్తసజ్జన శ్లాఘనీయుండైయుండు నిట్లు మహాత్ములచే నిరంతర నిషేవ్యమాణ చరణారవిందుం డగు నక్కాంతోపయంతృ గురుపురం దరుండు జియ్యర్నైనారునకు శ్రీభాష్యభగవద్విషయంబులు ప్రసాదింప శ్రీపర వాది భయంకరార్య వరదనారాయణ గురుపుంగవుల నియమించి స్వాశ్రితసకల చేతనోజ్జీవనరూపస్వావతార ప్రయోజనంబు గొఱఁతఁజెందకుండ సమర్థించి కృత కృత్యుండై యున్నయెడ శ్రీవైకుంఠనాథుండు గరుడవాహనారూఢుండై మేరు శిఖరంబుపైఁ గన్పడు కాలమేఘంబుమాడ్కి నమ్మహాత్ముని కనుమ్రోలఁ దన్నుం బొడసూపినఁ దదనుభవజనిత ప్రీతిపరవశుండై "యేనయేన ధాతా గచ్ఛతి కామ రూప్యనుసంచరన్" ఇత్యాది శ్రుత్యుక్తక్రమంబుగా స్థితిశయనగమనాదులయం

దతనికి సకలవిధకైంకర్యంబులు సలుప నిశ్చయించి పరమపదంబున కరుగ నిశ్చయించి తిరుమేనియందుఁ దిరునోవు ధరించి సంచరింపఁజాలక బడలియున్న యెడఁ దనలోనఁ దిరునాళ్ళ మహోత్సవంబునం దొక్కనాఁడైనఁ దిరువీధికి విచ్చేయుచున్న కస్తూరిరంగనిఁ గన్నులార నీ శరీరంబుతో సేవింపఁగలనాయని మిగుల నార్తిపడుచున్న నాసమయంబున శ్రీరంగరాజస్వామియు సకలాభరణ భూషితుండై రథారోహణంబు సేసి నిజమందిరంబు వెల్వడి యమ్మహాదేశికుని మఠద్వారదేశంబున కేతెంచి నిలిచి యతనికి సేవ ప్రసాదింప నద్దేశికేంద్రుఁడును నాశ్రితవాత్సల్యజలధియగు శ్రీరంగనాథుండు దేవీయుగాలంకృతోభయ పార్శ్వుండై గోవత్సన్యాయంబున నిచటికేతెంచి మదీయార్తి దీఱఁ దన్ను సాక్షాత్కరింపఁ జేసెనని పరమానందకందళిత హృదయారవిందుండై నిజాశ్రితులతోడంగూడి మఠద్వారాంగణంబున కేతెంచి నేత్రోత్సవంబుగా నద్దేవదేవుని సేవించి సన్నుతించి తత్సన్నిధిబహూమతి లభించి మరలి మఠంబునకు విచ్చేసి నిజావయవంబులు స్వాధీనంబులు గాకుండునట్టుల శక్తిమించఁ దత్సమయంబున మఱియొకనాఁడు శ్రీరంగభర్త తొంటిచందంబున మఠద్వారాంగణంబునకు విచ్చేయ నయ్యవసరంబునఁ బరాధీననిజగాత్ర వ్యాపారుండగుటం జేసి నిజాశ్రితులగు మహాదేశికులకై దండఁబూను కమఠంబు వెల్వడి వచ్చి యుభయదేవీ సమేతుండగు శ్రీరంగపతిని సేవించి మగిడి మఠంబుఁ జెందియున్న సన్నిధిస్వాములు కొందఱు తదీయాశక్తి ప్రకర్షంబుఁ జూచి ప్రహర్షంబుడిగి వానమామలజియ్యరు మొదలగు మహాదేశికులకుఁ దదీయనామాంకితంబగు శ్రీముఖం బనుప వార లది శిరసావహించి యతిత్వరితగతి నేతెంచి తదీయ శ్రీపాదపద్మంబులం బొడగాంచి తత్సన్నిధి నున్నయెడ నతని తిరుమేనియందుఁ దిరునోవు తనంతట శమించియుండ నది యెఱింగి శ్రీవానాద్రియోగీంద్రుం డద్దివ్యదేశ కైంకర్యత్వరచేఁ బోయి మగిడి యేతెంచెద నని విన్నవింప మణవాళమహామునియుఁ జనివేగరమ్మని యనుప నవ్వానాద్రి యతీంద్రుండు నచటినుండి యుత్తరదేశ సంచారంబునకు విచ్చేసె ననంతరంబ కొన్ని దినంబులు జరిగినపిదపఁ బూర్వక్రమంబుగా నమ్మహాత్మునికిఁ దిరునోవు వర్ధిల్లఁ బ్రాప్యత్వర మిగుల నతిశయింప నది నిమిత్తంబుగాఁ దనకుం బ్రాప్తశేషియయిన యుడయవరు తిరువడిత్తామరలయందుఁ బ్రావీణ్యమతిశయించు కతన దినక్రమంబుగా వాళియతిరాజరనియెడు పాశురంబు మొదలుగా నెంబెరుమానారు తిరువడిఘళేశరణమను పాశురంబు మధ్యంబుగా 'ఇందవరంగ' నని యెడు పాశురం బంతిమంబుగా నఱువది పాశురంబులు యతిరాజదివ్య నామాం

కితంబులుగా విన్నవింప నవి యార్తియని యొక దివ్యప్రబంధంబయ్యె నంతఁ బ్రాప్యత్వర యతిశయింప మిగుల నశక్తుండై యున్నయెడ దేశాంతరంబునుండి మేల్నాటితోడ ప్పరార్యుండును దజ్యేష్ఠభ్రాతయయిన యళహియ మణవాళ ప్పెరు మాళ్నైనారాచార్యుండును భగవత్సేవార్థంబుగా శ్రీరంగంబునకేతేరవారలను దక్షిణ మాడ తిరువీధియందుఁ బట్టరపిరాన్జియ్య రీక్షించి మీర లెచ్చటనుండి యిచ్చటికి విచ్చేసితిరి. ఇంక నెచ్చోటికిం జనియెదరని యడుగ వారలు మిగుల నానందించి సాష్టాంగప్రణామం బాచరించి తమ వృత్తాంతంబంతయు నున్నయట్లానతియ్య విన నవధరించి యమ్మహాత్ముం డి ట్లత్యంతానుకూలురగు మీరు భగవద్రామానుజా పరావతారంబగు శ్రీ మణవాళమహామునుల సేవింపవలదా యనవారలా యర్థంబు నకు సమ్మతించి యద్దేశికేంద్రునితో మఠంబున కరుగుదెంచి యక్కాంతోపయంతృ యోగీంద్రుని దివ్యశ్రీపాదపద్మంబులకు సాష్టాంగప్రణామంబు గావించియున్న వారియెడ సవిశేషకటాక్షం బొనర్చి శ్రీయతిరాజునకు విశేషాభిమానాంతర్భూతం బైన తిరునారాయణపురంబు సంస్మరించి యమ్మహాత్ముని యంతిమదశయందు సతం డానతిచ్చిన యాఋవార్తలయందు. శ్లో॥ శ్రీయాదవాద్రి వసతిం సతతం భజన్త స్సన్తో భవన్తు మమసన్తతి మూలనాథాః॥ అన్న క్రమంబుగాఁ దిరునారా యణపురమునందు నిత్యనివాసంబొనర్చు మహాత్ముల స్మత్సంతానమూలనాథు లగుదురని యుడయవ రానతిచ్చెఁ గాన మదీయులయం దాయాదవాద్రి నిత్య నివాసం బొనరింపఁగల దేశికు లెవ్వ రేర్పడుదురని యానతియ్య నత్తోడప్పా చార్యుండు కరకమలంబులు ముకుళించి స్వామీ యీ కైంకర్యంబు దాసునికిం బ్రసాదింపవలెనని ప్రార్థింప మణవాళమహామునియు మిగుల సంతసించి భగవ ద్రామానుజమునులకును మాకును బ్రియంబుగాఁ గించిత్కారపూర్వకంబుగా యతిరాజసంపత్కుమారుని సేవించి తదేక మంగళాశాసనపరుండవై నిత్యనివా సంబు సేయుచుండుమని నియమించె నయ్యవసరంబున శ్రీరామానుజ మునులకుం బ్రియశిష్యుండగు తిరుమలనల్లాను గురుని తిరువంశంబునం దవతరించిన యణ్ణ రాయచక్రవర్తి కుటుంబసహితుండై భగవత్సేవార్థంబు శ్రీరంగధామంబున కరుగు దెంచి శ్రీరంగనాధుని సేవించుచున్న నప్పుడు దేశాంతరులును దద్దేశీయులును స్థల వాసులును బెంపుగా గుంపులుగూడి వరవరయోగీంద్రుని చరమదశ సేవించి తిరిగి చనుచున్నం జూచి యణ్ణరాయచక్రవర్తి త్తిరుత్తాయారగు యాచ్చియను సాధ్వీ రత్నంబా విశేషంబు విని పుత్త్రి నుద్దేశించి యణ్ణరాయామన కీ పెరియజియ్యరు సేవ సేయవలదా యన నా చక్రవర్తియు సమ్మతించి తమ కుటుంబముతోఁ గూడ

మరంబునకుంజని పట్టరపిరాంజియ్యరు పురుషకారంబు గావింప జియ్యరు తిరువడి త్తామరలకు సాష్టాంగప్రణామంబుఁజేసి యమ్మహాత్ముని సేవించుచున్న నవ్వరవర మునికిఁ దడవులనుండి తా నంగీకరించుటకుఁ దగినవిషయంబు చూపకుండుటంజేసి దృఢతరంబుగా ముకుళంబడియున్న శ్రీపాదపద్మయుగంబు ప్రణతుండగు నా చక్ర వర్తి శిరంబుపై సాఁచియుంచ శ్రీపాదసంశ్రితులందఱు చూచి యతండు లభించిన యతిశయిత ఫలంబునకు మిగులసంతోషించి రప్పుడప్పెరియజియ్యరా చక్రవర్తిగురు నుద్దేశించి మహాత్మా నీవు పరమసాత్త్వికుండై శ్రీవేంకటేశునకు నిత్యకైంకర్యం బొన రించుచున్నయెంబెరుమానారుజియ్యరు నద్దివ్యదేశంబునకుం ద్రోహంబాచరించు శైవ శాక్తాదికుదృష్టిజనులు బాధింపకుండునట్లు రక్షించి మఱియు మన దర్శనవిషయం బుగా ననేక ప్రకారంబుల సమర్థించిన మహాప్రభావసంపన్నుండ వనిమిగుల సంత సించి తనకు దక్షిణ బాహుస్థానాపన్నుండగు శ్రీ భట్టనాథ యతీంద్రునిచే నణ్ణరా యచక్రవర్తికిని దోడప్పార్యునకు నళహియమణవాళప్పెరుమాళ్ నయనారాచా ర్యునకును బంచసంస్కారాది కలహితంబులు సేయించి వారిని దర్శన ప్రవర్తకు లగునట్లు దీర్పుమని యప్పట్టరపిరాంజియ్యరున కాజ్ఞాపించిన నమ్మహానుభావుండు ను వారియందట్లు విశేషకటాక్షం బొనరించె ననంతరం బప్పులార్ దేశికుండును జియ్యరునయనారును దదంఘ్రిపద్మంబులు సేవించి దాసులకురక్షకంబుగాభవదీయ దివ్యార్చావిగ్రహం బనుగ్రహింపు మని యపేక్షింప సమ్మతించి స్వకీయకర ధృ తంబైన దివ్య భాజనంబు తదుపాదాన ద్రవ్యంబుగాఁ గృపతో నొసంగిన వారిరు వురును రెండు విగ్రహంబులు సేవించి యథావిధిగా సంప్రోక్షణాదులంగావించి నిత్యం బర్చించి సంతోషించు చుండిరి మఱియును సన్నిధిమహాదేశికులకందఱికిని వేఱువేఱ వా రర్థించి నహితంబు లన్నియుం బ్రసాదించి నాలుగు దినంబులు నాలాయిర ప్రబంధంబు లుపక్రమించి యుత్తరశాంతి యొనర్పుండని జియ్యరు నైనారు మొదలైన దేశికేంద్రులకు నియమింప వార లట్లుపక్రమించి యను సం ధింప నా దివ్య ప్రబంధాను సంధానం బంతయు విన నవధరించి నిటల తటఘటి తాంజలి పుటుండై యగ్గురు పురందరుండు తదర్థానుభవపారవశ్యంబున నిమీలితాక్షి యుగళుం డై యున్నఁబరమాంత రంగశిష్యుండగు వరదనారాయణ గురుండు మహాత్మా యిప్పుడు మీ తిరువుళ్ళంబున నున్నయర్థం బెయ్యది యనియడుగ భగవ ద్విషయార్థరసం బున్మత్తకం బై నదని యానతిచ్చి యేకాదశితిధిజరపి మఱునాఁడు ద్వాదశితిధియం దుత్తమనంబి మొదలగు సమస్త భగవత్పరిజనులఁ బిలిపించి వారల నుద్దేశించి మహాత్ములారామదీయసర్వాప రాధంబులు క్షమింపుండని యప రాధక్షమాపణంబుఁ జేసికొనిన వారును మహానుభావుండవగు నీకొక యపరాధంబు

గలదా యని విన్నవించినఁ దిరుగను వారి నుద్దేశించి భగవన్మందిర శ్రీకార్యంబు లన్నియుఁ గొదువపడకుండ జరుపుచు శ్రీ వైష్ణవనిష్ఠ గలిగియుండుఁడని యానతిచ్చి యనంతర కాలంబున శ్రీ వైష్ణవుల నందఱ నారగింపనియోగించి వార లారగించిన పిమ్మటఁ దదీయ శ్రీపాదతీర్థంబుజ్జీవించి యపరాధ క్షమాపణంబుఁ జేసికొని యాదిత్యాస్తమయం బైనయంతఁ దత్తత్కార్యకర్మం బొనర్చి తిరువాయ్ మొళిపిళ్ళ తిరువడిగళేశరణ మని యుచ్చరించి యగ్గురు పరమేష్ఠిని ధ్యానించుచు వివశసర్వగాత్రుండై పాన్పుపైఁ బవ్వళింప శ్రీపాదసంశ్రితులందఱు సాష్టాంగ ప్రణామంబు లాచరించి బ్రహ్మవల్లియు భృగువల్లియు శూశ్వికుంబణిమహిలర్చి రాపియు మూ త్తందాదియుఁ బరమాదరంబుతో ననుసంధించుచున్న 'నాంగయిల్ పాయ్వయల్ తెన్నరంగ' నని యెడు పాశురం బంతయు విన నవధరించియంజలి పుటంబు గావించి యెంబెరుమానార్ తిరువడిఘళే శరణమని యనుసంధించి తదేకచిత్తుండై నిమీలిత నేత్రుండై యున్న యప్పుడా శ్రీరంగనాథుండు గరుడ వాహనారూఢుండై లక్ష్మీసమేతుండై తన్నుంబొడసూపఁ దదీయదివ్య మంగళ విగ్రహం బనుభవించి హార్దానుగ్రహలబ్ధంబగుమధ్య ధమనీరూపసుషుమ్నా నాడీ ద్వారంబున వెల్వడి పరమాత్ముండగు శ్రీమన్నారాయణుని మార్గసహాయంబుగా లభించి తిరునా డలంకరించె నంత భగవంతుండగు శ్రీరంగనాథుండును, "సౌమి త్రిర్మే సఖలుభగవాన్ సౌమ్యజామాతృయోగీ" అని తన మదినిదలంచి తొల్లి తిరువయోధ్యయందు శ్రీరామభద్రాత్మకుండగు తాను లక్ష్మ నెడఁబాసియొక్క వ గలు నివసించిన చందంబున శ్రీరమ్యజామాతృయోగీంద్రుని విశ్లేషించి యొక్క దిన మారగింపఁడయ్యె నంతశ్రీపాద సంశ్రితు లందఱాచార్య విశ్లేషంబు సహిం పంజాలక పెద్దయుంబ్రొద్దు దుఃఖించి రంతటఁ గొందఱు తెలివిఁ జెంది, తదీ యాంతిమదశ నంద ఱెఱింగి యుజ్జీవింప, శ్లో॥ కుమ్భం భాస్వతి యాతితత్పుతది నే పక్షే వళక్షేపరే। ద్వాదశ్యాంశ్రవణర్క్ష భాజిరుధిరోద్గార్యాఖ్య సంవత్సరే। ధీ భక్త్యాది గుణార్ణవో యతివరాధీనాఖిలాత్మస్థితి। శ్రీవైకుణ్ఠమకుణ్ఠవైభవమగా త్కాన్తోవయన్తామునిః॥ అని యీ చరమశ్లోకం బానతిచ్చిరి తదనంతరంబ య మ్మహాత్ముని చరమ కైంకర్యం బొనరింపఁ దత్పౌత్రుండై నయళహియమణవాళప్పె రుమాళ్ నైనాచార్యుండు తత్పాదాశ్రితు లగుమహాదేశికులం గూడి తిరుకావేరి కరిగి యం దవగాహనంబుఁ జేసి యలంకార తిరుమంజనఘటం బెత్తుకొని వచ్చి శ్రీమణవాళ మహామునులకుఁ బురుషసూక్తంబును మంత్రరత్నంబునను సంధించుచుఁ దిరుమంజనంబును దిరువొత్తువాడయును దిరుప్పరివట్టంబును

సమర్పించి శ్రీచూర్ణ రేఖాంకితంబులగు ద్వాదశోర్ధ్వపుండ్రములు రచించి వివిధ విచిత్ర పుష్పమాల్యంబు లలంకరించితచ్ఛేషభూత శ్వేతమృత్స్నా శ్రీచూర్ణంబులు తమ కాపద్ధనంబుగాఁ గొంత యుంచుకొని యవశిష్టం బందఱు ధరించి దివ్య సింహాసనంబుపైఁ దదీయదివ్యచరమ విగ్రహంబు విచ్చేపుచేసి తదీయాంఘ్రిపద్మ ద్వయంబు స్వశిరోభూషణంబుగా ధరించిస్వన యనమానసంబులందు నిలుపుకొని విమలచరమవిగ్రహానుభవం బొనరించుచున్న నయ్యవసరంబున శ్రీరంగ నాథుండు ధరించి విడిచిన పీతాంబరమును సురభి పుష్పమాల్యంబులును దప్త చామీకర మయం బగు పళ్ళెరంబున నుంచి శిరసావహించి యుత్తమనంబి శంఖభేరీ మృదంగ వీణావేణుపటహ కాహళాదికళ్యాణవాద్యఘోషంబులతో సమస్తభగవత్పరి చారకవ్రజంబుతో మరద్వారాంగణంబున కేతేర శ్రీపాదసంశ్రితులగు మహా దేశికు లంద ఱెదుర్కొని సాష్టాంగ ప్రణామంబులాచరించి యప్పళ్లెరం బంగీక రించి యగ్గురుపురందరుని చరమదివ్యవిగ్రహంబునకు నప్పీతాంబరంబలంకరించి యత్తుల సీపుష్పదామంబులు తిరుముడికిఁ జుట్టి భగవన్మందిర పరిచారకజను లా చార్య పురుష లేకాంగులును సాతాని వైష్ణవులును మఱియు నద్దివ్యదేశవాసులం దఱును నెంబెరుమానారును సేవింపని దుఃఖం బంతయుఁ దదవతారంబైనయి మ్మణ వాళమహామునుల సేవించుచు నెడఁబాసితి మిమ్మహాత్ముం డు తీర్థంబు ప్రసా దించి పోయెనని దుఃఖించుచు శ్రీమద్యామనమునులకుంబోలె బ్రహ్మమేధసం స్కార విధానం బంతయు యధాశాస్త్రంబుగా సమర్పించి వైష్ణవులందఱు తచర్ప ణావశిష్టంబు లగుతైల హరిద్రా చూర్ణాదులు ధరించి దివ్యాలంకారాలంకృతంబైన పుష్పక విమానంబునందు నచ్చరమ దివ్య విగ్రహంబు విచ్చేపుచేపి యమ్మహా త్ములందఱు నవ్విమానంబు భుజంబులం బూనుకొని ఛత్రచామర తాళవృంతా దులు సమర్పించుచు సమస్త కళ్యాణవాద్య ఘోషంబులతోఁ గరకమలంబులంది క్షుదండంబులు ధరించి నూత్తందాది మొదలుగా తనియలను సంధించుచు లాజ పుష్ప పుంజంబు లంతటం జల్లుచు సర్వాలం కారయుక్తం బగుతిప వీధియం దందఱు సేవించు చున్నంగొని చని యాదికేశవమంది రాంతిక తీర్థఘట్టంబున నవ్వి మానంబు డించి యతిసంస్కారవిధి యంతయు యధాన్యాయంబుగా సలిపి భూతలంబుఁ ద్రవ్వి యందుఁ దిరుప్పళ్ళి యొనర్చిరి అనంతరంబ జియ్యరు నయనారును గందా డయణ్ణన్ మొదలగు శ్రీపాదసం శ్రితులందఱు స్వశేషత్వాను గుణంబుగా క్షౌరంబు సేయించుకొని యవభృధస్నానం బాచరించి మగిడి మఠం బునకే తెంచి స్వగురు విరహితం బగుమఠంబుఁ జూచి దుఃఖించుచుఁ దదీయశ్రీ

సూక్తుల స్మరించుచుఁ దత్కల్యాణ గుణకీర్తనంబు సేయుచుఁ దద్దివ్యనామంబు
లుచ్చరించుచుఁ దద్దివ్యచరితామృతంబుఁ గ్రోలుచు నమ్మహాత్ముని విషయంబుగాఁ
జేయఁదగిన కృత్యంబులు యథావిధిగా సలిపితద్వైభవంబునకనుగుణంబుగాఁ దిరు
వధ్యయన మహోత్సవం బాచరించిరంత శ్రీరంగనాథుండు జియ్యరు నారును బిలిపించి
మిగుల నాదరించి మీకుం గులధనంబగు కాంతోప యంతృకర కమలసమారాధి
తంబైన శ్రీరంగ రాజాబిధా నార్చా విగ్రహంబును నురఁబునం జూచి సంత
సించు చుండుమని యాజ్ఞాపించి తీర్థంబును దిరుమాలయుఁ దిరుపరివట్టంబును
శ్రీ శఠకోపంబుసం బ్రసాదించి పనుప నతండు మఠంబునందు సుఖం బుండె
నది చూచి జియ్యరభిమా నాంతర్భూతు లగు వైష్ణవు లందఱు హర్షప్రకర్షంబుతో
నతని మణవాళ మహామునుల మాడ్కి ననువర్తించి సేవించుచుండిరి కోవిలకం
దాడయణ్ణ నాచార్య నియమన క్రమంబుగా నాచార్య పాత్రుండైన జియ్యర్నై
నారునకు భగవ ద్విషయంబు ప్రసాదించెననంతరంబ ప్రతివాది భయంకర మణ్ణ
నాచార్యనియ మన ప్రకారంబు జియ్యరు నయనారుకుఁ గందాడ నయనాచార్యు
నకుం శ్రీ భాష్యంబు ప్రసాదించి, శ్లో॥ శ్రీమాన్ సున్దర జామాతృమునిః పర్యాయ
భాష్యకృత్। భాష్యం వ్యాకురుతే స్వస్య స్రోతృకోటౌ మమాన్వయః॥ అనుచుఁ
దనకుఁ గర్తృత్వ త్యాగం బొనర్చెఁ బిదప సమరపుంగ వాచార్యా పరినామధేయుం
డగు పోళుం పాకత్తి పోరేత్తనయనారు మొదలైన కొందఱు దేశికులకు శ్రీభా
ష్యం బుఁ బ్రసాదించి పట్టర్పిరాన్ జియ్యరు శ్రీపాదసం శ్రితుం డగుపరవస్తు
శ్రీనివాసాచార్యునకు దిరువాయిమొళినయనారని ప్రసిద్ధి గలుగునట్లు శ్రీరామానుజ
సిద్ధాంత సంస్థాపకుండై యుండెనంత నళగియ వరదార్యుం డని ప్రసిద్ధిం
గాంచిన వాన మామల జియ్యరుత్తర దేశసంచారం బొనర్చిమగిడి యేతెంచి
జియ్యరు తిరునా డలం కరించిన వృత్తాంతంబు తిరుమల సమీపప్రదేశంబున విని
పెద్దయుం బ్రొద్దు లపించి యచటినుండి తిరుమల పైకిం జనియందుఁ గొన్ని
దినంబు లుండి మార్గశ్రమంబు దీర్చుకొని కైంకర్యంబుగా సంపాదితంబు లగు
ధనకనక వస్తు వాహనాదుల తోడంగూడ వానమామలకు విచ్చేసి యందు భగ
త్కైంకర్యం బంతయు నెఱవేర్చి తిరిగి తిరుమలకేతెంచి యందుఁ గొన్ని దివ
సంబులుండి యచటనుండి యెఱుంబి కరుగుదెంచి యచటి శుద్ధసత్త్వ మణ్ణనునకును
బోళ్ పాకత్తి పోరేత్త నయనారునకు దిరువాయిమొళి యీడు మొదలగు దివ్య
ప్రబంధ వ్యాఖ్యానంబు లన్నియుఁ బ్రసాదించి మగిడి వానమామలకు విచ్చేసి
యందు దైవనాయక స్వామికైంకర్య సామ్రాజ్యంబుతోడ భగవద్విషయాను

సంధాన సామ్రాజ్యంబు తోడసుఖించు చుండెఁ బట్టర్‌పిరాన్ జియ్యరును దిరుమలకేతెంచి యందు నివసించి యణ్ణరాయ చక్రవర్తి యళహియమణ వాళప్పెరుమాళ్ నైనార్ తోడప్పర్ మొదలుగాఁ గలయనేక శ్రీ వైష్ణవుల దర్శన ప్రవర్తకులఁగాఁ జేసి పరవస్తుయణ్ణరార్యుఁడును బరవస్తు అళహియమణవాళ జియ్యరును సత్పుత్ర సచ్ఛిష్యులుగా నభిమానించి సత్సంప్రదాయప్రవర్తకు లగునట్లు దీర్చి సకల చేతనోజ్జీవ నార్థంబుగా నంతిమోపాయనిష్ఠ యనురహస్యరత్నం బానతిచ్చి సంశ్రితజనుల నందఱను సుఖింపంజేసెనంతఁ బట్టర్ పిరాన్ జియ్యరు తిరువడిగ ళాశ్రయించిన తోడప్ప రార్యుండు నళగియమణ వాళప్పెరుమాళ్ నైనార్యుం డను స్వగురునియోగ క్రమంబుగాఁ దిరునారాయణ పురంబునకుం జని యందు యతిరాజునకును దత్సంపత్కుమారునకును దిరునారాయణ స్వామికిని దిరునందనకైంకర్యంబు మొదలుగాఁ గలయిశేష శేషకృత్యంబు లొనరించు చునందనే కాత్మలను జియ్యరభిమానాంత ర్భూతులగునట్లు దిద్దుచు నళహియమణ వాళగోత్రంబు వృద్ధిఁ బొందించుచు యతిరాజమఠంబునకుఁ బశ్చిమ భాగంబున నిత్య నివాసంబుఁ జేసి సుఖించుచుండి రంత నిరుంబిఱుప్పగారును నాచార్య విశ్లేషంబు సహింపం జాలక మిగుల నార్తుండై సద్గుణాను భవతత్పరుండై తత్సేవాభినివిష్ట చిత్తుండై గురు నెడఁబాసి సంసారంబునందు శ్రీరామభద్రు నెడఁబాసి లంకలోఁ జొరఁబడి యున్నసీ తాపిరాట్టి చందంబున దుఃఖించుచుఁ గాలనిరీక్షణంబు సల్పుచుండె నిట్లా చార్యాభిమానై కనిష్ఠులగు వీరందఱు తమ తమ పుత్ర శిష్యులకు మణవాళ మహాముని తిరువడిగ శేశరణమ్మని నమ్మియుండుఁడని యుపదేశించి యందఱను వరవరమునివర్య భృత్యులగునట్లుచేసి యళహియమణ వాళగోత్రంబు వర్ధిల్లున ట్లొనర్చి సమస్త చేతనోజ్జీవనం బొనర్చి సుఖించుచుండిరని శ్రీ వాదిభీకరగురుం డానతిచ్చె. 59

సీ. వరవరమునివర•పరమదయాకర, సరసగుణాధార•శాంతిసార
శివతాతిలక్షణ•సిద్ధాంతసంస్థాప, నాచార్య ధైర్యాద్య•హార్యవర్య
ఘనపరాంకుశపర•కాలాదిదివ్యసూ, రిప్రబంధార్థని•ర్వేశనిపుణ
చేతనాచేతన•క్షేమతాతిపదాబ్జ, బ్రహ్మవిన్మానస•పద్మపూజ్య
తే. త్వద్యశోదివ్యగుణభూషి•త ప్రబంధ, మిది భవత్కృప విద్వత్క•వీంద్రకర్ణ
మధురమగుఁగాత మోజగ•న్మాన్యయనుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.
సీ. అపగత మదమాను•లంతిమోపాయని, ష్ఠాగరిష్ఠులు సద్వి•చారపరులు
నధిగతపరమార్థు•లర్థకామానపే, క్షులు సర్వమిత్రులు•క్రోధలోభ

వర్జితాత్ములు నగు•వరవరయోగీంద్రు, భృత్యులతోఁ బొత్తు•వృద్ధి మాకు
సంభవించునుగాత•స్వగురునికృపవల్ల, సారెసారెకు వారి•చరణకమల

తే. సేవసేయుచుఁ దదితర•చింత లుడిగి, న్యస్తభరత వసించనే•యనఘుఁ డతఁడె
ధన్యతముఁడని తలఁచెదఁ•దథ్య మనుచు, వాదిభీకరగురుఁడనె•మోద మలర

వ. తదనంతరం బాభక్తానుగ్రహార్థంబు భగవంతుం డొనర్చుపరవ్యూహవిభవాంత ర్యామ్యర్చాస్వరూప భేదంబులును దదావాసస్థలంబులును మంత్ర మంత్రార్థోప దేష్టృ గురుపరంపరయు నద్దేశికేంద్రులు లీలావిభూతినలంకరించి యున్నసంవ త్సరంబుల సంఖ్యయుఁ దత్తదార్య ప్రణీతప్రబంధాభి ధానంబులును వివరించెద నెట్లన్న భూమండలంబు పద్మాకారంబై యొప్పునందు మేరుపర్వతంబు కర్ణికా కారంబై విలసిల్లు నమ్మేరుగిరికి దక్షిణ భాగంబున భారతకింపురుష హరివర్షం బులు మూఁడు నుత్తర భాగంబునందు రమ్యక హిరణ్యకురు వర్షంబులుమూఁడును బూర్వ భాగంబున భద్రాశ్వవర్షంబును బడమటిదెసఁగేతు మాలాఖ్యవర్షంబును మధ్యభాగంబునం దిలావృత వర్షంబును విలసిల్లుచుండునిట్లు నవవర్షయుక్తంబై నజంబూద్వీపం బంతటలక్షయోజన విస్తీర్ణంబై యుండు నాద్వీపంబు స్వప్రమా ణలవణజలధి పరివేష్టితంబై యుండు నప్పయోధియు, దనకు ద్విగుణ ప్రమాణం బైన సప్త వర్షాత్మకం బైన ప్లక్షద్వీపంబుచేఁ బరివృతంబై యుండు నదియు నిక్షు సముద్రంబుచే నదియుశాల్మలీద్వీపంబు చేనదియును సురాసముద్రంబుచే నాయ బ్ధియుఁ గుశద్వీపంబుచే నయ్యంత రీపంబు సర్పిస్సముద్రంబుచే నయ్యంబుధి యుఁ గ్రౌంచద్వీపంబుచే నద్దీవియుదధ్యర్ణవంబుచేనయ్యె దధియు శాకద్వీపంబుచే నాద్వీపంబును క్షీరసముద్రంబుచే నాపయః పారావారంబును వర్షద్వయ విభాజకం బును వలయాకారంబునగు మానసోత్తర పర్వతంబుతోడంగూడి యున్న పుష్కర ద్వీపంబుచే నా ద్వీపంబును శుద్ధోదక సముద్రంబుచే బరివేష్టితంబై యుండునిట్టి ద్వీపంబులన్నియు నుత్తర ద్విగుణ ప్రమాణంబులై యుండు నిట్లు సప్తద్వీ పాత్మకంబైన భూచక్రంబు ద్విగుణీకృత ప్రమాణ కాంచన భూమి పరివృతంబై యుండునబ్భూమియు లోకాలోక పర్వత పరివేష్టితంబై యుండు నయ్యద్రిరా జంబును నంధతమః పటలపల సరివలయితంబై యుండు నత్తిమిరంబును గర్భోదక పరివృతంబై యుండుఁ దదనంతరం బండక టాహంబుస్థితి వహించు నీ ప్రకారంబుగా భూమికిఁ గ్రిందట నతల వితలరసాతలతలాతలమహాతలసు తలపాతాళాఖ్యంబు లగుసప్తలోకంబు లుండు వానిక్రింద నరకంబులు వర్తించు

నవియుఁ బాపకర్ములకుఁ బాపఫలానుభవభూములై యుండునందేక వింశతిభేదభిన్నం బులగురౌరవ మహారౌరవాదినరకంబులుముఖ్యంబులువానిక్రిందగర్తోదకంబుతదనం తరం బండకటాహం బీరీతిభూమికూర్ధ్వభాగంబున లక్షయోజనంబులకుమీఁదసూర్య మండలంబుండు నదియే భువర్లోకం బనంబడు నామీఁదఁ జంద్రమండలంబు తదుపరిభాగంబున నక్షత్రబుధ శుక్రాంగారక బృహస్పతిశని సప్తఋషిమండ లంబులాపై నిధ్రువస్థానంబు సూర్యమండలంబుమొదలుగా ధ్రువలోకపర్యంతంబు స్వర్లోకం బనంబడు నీనాల్గులక్షల యోజనంబులకు పరిభాగంబునఁన గోటియోజ నోచ్ఛ్రియంబై మహర్లోకంబుండు నాలోకంబునకు ద్విగుణంబై జనలోకముండు దానికంటెఁ జతుర్గుణ మైత పోలోకంబు విలసిల్లు నాలోకంబుకంటె ద్వాదశ కోట్యుచ్ఛ్రయంబై సత్యలోకం బొప్పుఁ దదనంతరం బంధతిమిరం బామీఁద గర్తోదకం బాపై నండకటాహంబిట్లు తిర్యగూర్ధ్వ ప్రమాణంబునఁ బంచాశత్కో టియోజన విస్తీర్ణంబై భూమండలం బొప్పుచుండుఁ బ్రమాణాంతరంబుచే బుధులు గొందఱు శతకోటియోజన విస్తీర్ణం బంద్రు కోటియోజనోచ్ఛ్రాయంబై యండకటాహం బొప్పు నిట్లుచతుర్దశ భువనాత్మకంబై పంచీకృత పంచభూత లబ్ధంబై ప్రాకృతద్రవ్యాత్మకంబై దశగుణితోత్త రావరణ సప్తక పరివృతంబై యండంబు విలసిల్లు నిట్టియండంబులనంతంబు లేకకాలోదిత జలబుద్బుదంబుల కొలఁది భగవత్సంకల్పితంబులై యుండు నాయండంబు లన్నియు నతిక్రమించి విరజకవ్వల విరాజమానంబగు శ్రీవైకుంఠాఖ్యదివ్య లోకంబునందుఁ **దివ** మామణిమంటప మధ్యంబునఁ దనంత గరుడవిష్వక్సేన పరాంకుశ పరకాలాది నిత్యముక్త నిషేవ్యమాణుండై శ్రీభూనీళాది దేవీ సహాయుండై శేషపర్యంకం బుపై విలసిల్లుచున్న నారాయణుండు పరమాత్ముండు వాసుదేవ ప్రద్యుమ్నాని రుద్ధ సంకర్షణాఖ్యంబులైన వ్యూహంబులు నాలుగు నందుఁ జక్రవాక పర్వ తంబునవ్వల నంధతమః పరంబై యమృత ప్రవాహపరివేష్టితంబై యనేకదివ్య రత్నమయ గోపురప్రాకార సౌధప్రాసాదమాలికాలంకృతంబై పరమాశ్చర్య కరం బగుదివ్య లోకంబునందు నిత్యనివాసం బొనరించి తొల్లి కృష్ణార్జునులకు విప్రకుమారకుల నొసంగిన భగవంతుఁడు వ్యూహవాసుదేవుండని ప్రాజ్ఞులు పచింతురు సత్యలోకంబునందు నారాయణాశ్రమంబున నివసించు హరిప్రద్యు మ్నుండతండు ద్వారకాసృష్టి కారణుండై యుండు క్షీరసాగరంబునందు సర్వావ తారకందభూతుండైన యనిరుద్ధుండు వసియించుఁ బాతాళంబునందుసంహారకర్తయ

గుసంకర్షణుండు నాగకన్యాసహస్రపరిచరితచరణారవిందుండై సిద్ధఋషి సేవితుం డై యుండు విభవంబువలన రామకృష్ణాద్యవతారంబులు యమనియమాద్యష్టాంగాదియోగసాక్షాత్కరణీయుండై హృత్పుండరీకవర్తియగుదహరాకాశమధ్యంబునందపహతపాప్మత్వాది గుణాష్టకవిశిష్టుండైన దేవాదిదేవుండంతర్యామియనంబడు సకలమనుజనయన గోచరుండై దానచేతనుల కభిమతం బగు ద్రవ్యంబునందు జగన్మోహనదివ్యమంగళ విగ్రహవిశిష్టుండై సాన్నిధ్యం బొనరించి భగవద్భాగవతాచార్యమందిరంబులందు నివసించునారాయణుం డర్చారూపి యనంబడునా యర్చాస్థలంబులందు శ్రీపరాంకుశపరకాలాది దివ్యసూరిగాథాకథితమహావైభవంబు గల దివ్యదేశంబు లష్టోత్తరశతసంఖ్యంబులై తేజరిల్లునందు. శ్లో॥ శ్రీరఙ్గమఙ్గళమణిం కరుణానివాసం శ్రీవేఙ్కటాద్రిశిఖరాలయకాలమేఘమ్। శ్రీహస్తిశైలశిఖరోజ్జ్వలపారిజాతం శ్రీశంనమామి శిరసాయదుశైలదీపమ్॥ అను న్యాయంబునఁ బుష్పత్యాగభోగజ్ఞానమంటపసంజ్ఞలు గలకోవెల తిరుమల పెరుమాళ్ కోవెల యాదవాచలంబును ముఖ్యంబులౌదివ్యదేశంబులయందు ప్రధానంబై "కావేరీవిరజాతోయమ్" ఇత్యాది న్యాయంబునఁ బ్రత్యక్షపరమపద బగు శ్రీరంగంబునకు నిత్యనిర్వాహకుం డగు శ్రీరంగరాజస్వామి ప్రథమగురుండు శ్రీభూనీళాచతురాననాదులు తచ్ఛిష్యులు తదీయదివ్యనామంబులు:- శ్రీరంగరాజస్వామియుఁ బెరియపెరుమాళ్ నంబెరుమాళళగియమనవాళపెరుమాళ్ మున్నిలుం పిన్నిలుమళగియపెరుమాళ్ ఆభరణత్తైక్కళట్టిక్కడుక్కుంపెరుమాళ్ పదిమరు తిరునామంపాడుంపెరుమాళ్ వందవళివారాద పెరుమాళ్ మందారంకండాల్ మఱైయు బెరుమాళ్ దైవశిఖామణిప్పెరుమాళని ప్రసిద్ధంబులు. 62

శ్రీరంగశాయితనియను. శ్లో॥ తపస్యే మాసి రోహిణ్యాం తటంసహ్యాభవశ్రితమ్। శ్రీరఙ్గశాయినంవన్దేసేవితంసర్వదేశికైః॥ తత్పదాంబుజంబు లాశ్రయించినతదీయ దివ్యమహిషికి దివ్యనామంబులు -పెండుగళ్ నాచ్చియార్ శ్రీరంగనాచ్చియార్ పెరియపిరాట్టియా రిద్దేవికిం దిరువారాధనంబు పెరియపెరుమాళ్ శిష్యులనంత గరుడవిష్వక్సేనాదినిత్యసూరులు

శ్రీరంగదివ్యమహిషి తిరునక్షత్రతనియలు.

శ్లో॥ ఫాల్గునోత్తరఫల్గున్యాం సమ్భూతాం శ్రియ మాశ్రయే। విష్ణోర్దివ్యపదామ్భోజపుటకాం తత్పదాశ్రితామ్॥ శ్రీమహావిష్ణుపత్నీంచ తచ్ఛిష్యాం గుణసమ్పదామ్। సర్వ

సౌన్దర్యసంయుక్తాం భూమిదేవీం సమాశ్రయే॥నారాయణగురోఃపత్నీం తత్పాద కమలాశ్రితామ్। సర్వసంపత్సమాయుక్తా నీళాదేవీం సమాశ్రయే॥

తిరువనంతాళ్వానుక్కు-త. శ్లో॥ మకారవాచకబ్రహ్మ చానన్తగుణసంపదమ్।
నారాయణకృపాపాత్రమురగేన్ద్రంనమామ్యహమ్ ॥

పెరియతిరుపడినయనార్-త.శ్లో॥ బలవీర్యమహావేగతేజస్సద్గుణసంపదమ్।
వినతాత్మజపక్షీన్ద్రం వన్దే శ్రీహరివాహనమ్॥

శ్రీరంగనాయకచ్ఛాత్రుం డగు విష్వక్సేనునకుం దిరునామంబులు.-సేనముదలియార్ సేనాపతి సేనేశుఁడు సూత్రవతీనాథుండు వేత్రపాణియు ననుచుఁ బ్రఖ్యాతంబులు తద్దివ్యమహిషి సూత్రవతీదేవి యద్దేవునకుం దిరువారాధనంబు పెరియపెరుమాళ్ గురువు పెరియపిరాట్టియార్.

విష్వక్సేనునితిరునక్షత్రత.-శ్లో॥ తులాజ్ఞతే దినకరే పూర్వాషాఢాసముద్భవమ్।
పద్మాపదామ్బుజాసక్తం సేనాధిప మహం భజే॥

పదుగురాళ్వారు లిమ్మహాత్మున కంతేవాసు లితం డానతిచ్చిన ప్రబంధంబులు విష్వక్సేనసంహితా ప్రభృతు లయోనిజు లగుమొదటియాళ్వారులు మువ్వురును నిజ యోగమాహాత్మ్యంబుచే మూఁడువేలయిరువదియైదు సంవత్సరంబులు భూసంచారం బొనర్చి తిరుక్కోవలూరియందు వైభవంబుఁ జాలించి యర్చారూపంబు ధరించిరి.

సీ. షణ్మతప్రతిపాది,శాస్త్రపుస్తకతతి, మస్తకంబునఁ దాల్చి • మహిఁ జరింప
భక్తిసారువిఁ గని•పరమకారుణికుఁడు, మహదాఖ్యయోగి యే•మాడ్కినైన
నతని శ్రియఃపతి•కనుకూలునిఁగఁ జేయఁ, దలఁచియొక్కతటాక•తటమునందు
మునల మొక్కటి నాటి•పొనఁగ దానికి శత,చ్ఛిద్రఘటంబుతో • జీవనీయ

తే. మెత్తఁగాఁ జూచి భృగువంశ్యుఁ•డిట్టివిఫల,యత్న మేటికిఁ జేసెద•వనిననమ్మ
హాత్ముఁడిట్లని వాక్రుచ్చె•నతని కనుచు, వాదిభీకరగురుఁ డనె•మోద మలర.

సీ. రోఁకలి చిగిరించి•రుచిరపుష్పఫలంబు, లీనుటకై యత్న • మిట్లొనర్తు
నని మహదాహ్వయుఁ•డానతిచ్చిన విని, భ్రాంతుఁడా మునలము • పల్లవింపఁ
గలుగునా యనుచు భా•ర్గవముని పల్క నీ,తలపై ధరించు పు• స్తకచయంబుఁ
దత్ప్రతిపాదిత•దైవతౌఘము నీకు, మోక్ష మీనేర్చెనా•మునల మిదియుఁ

తే. బల్లవించును బుష్పించు • ఫలము లిచ్చు
ననుచు మహదాహ్వయుఁడు పల్క • నతఁడు దెలిసి
ప్రణతి సలిపెను దత్పదా•బ్జముల కనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర.

వ ఇట్లు నమస్కరించి భక్తిసారమునీంద్రుండు నిజనిర్మితగ్రంధసముదాయంబునం దనారాల్పసారసారతరార్థ ప్రతిపాదక గ్రంధంబులు పరిహరించి సారతమార్థ గ్రంధంబుఁ బరిగ్రహించి యమ్మహాత్మునకుం బ్రదక్షిణ ప్రణామంబులాచరించితదాజ్ఞ లభించి యథేచ్ఛం జనియె.

సీ. అట్లుపకారకుం•డయ్యుఁ బేయాళ్వారు, చక్రాంశభవభక్తి • సారమునికి
ముప్పదియైదేండ్లు•ముదమొప్పఁ దింత్రిణీ. కోటరమున శఠ•కోపయోగి
వరుఁడుండి హరికృప • గరుడవాహనమెక్క. హరితోడ వైకుంఠ•పురికిఁ జనియె
నఖువదేడబ్దము • లఖిలవిశేషార్థ. రతి దృఢవ్రతమహా•రాజపుత్రుఁ
తే. డైనకులశేఖరుం డిల • నధివసించె. శ్రీముకుందార్యసుత విష్ణు•చిత్తుఁ డుర్వి
నెనుబదైదబ్దములు వసి•యించెననుచు. వాదిభీకరగురుఁడనె • మోదమలర. 66

సీ. భట్టనాధునిసుత•ప్రత్యక్షపరమప•దంబగు శ్రీరంగ•ధామముననుఁ
బతియెడఁ బ్రీతిచే•సతతము వసియించు. వేంకటాద్రిని గడు•వేడ్క నుండు
నెంబెరుమానారు • కిష్టదైవత మని. కరిగిరివరదుని•కడ వసించు
విల్లిపుత్తూరు పు•ట్టిల్లని తలఁచి యా. స్థల మెడఁబాయదు • శౌరితోడ
తే. మహిని యతిరాజ సంపత్కు•మారుఁ డనుచు
యాదవాద్రీశు రామప్రి•యాభిధాను
శౌరి నెడఁబాయఁ జాల ద•శ్రాంత మనుచు
వాదిభీకరగురుఁ డనె • మోద మలర. 67

సీ. బ్రహ్మవిదగ్రణి • భక్తాంఘ్రిరేణు గు•రుం డశీత్యబ్దము • లుండె భువిని
శాలిభూకమునందు • జన్మించి నిత్యుల•యింట వర్ధిల్లి రం•గేశ్వరునకుఁ
బ్రాణభూతుఁడు తిరు•ప్పాణియోగీంద్రుఁ డ•శీతివర్షము లుండె•క్షితితలమున
జగతిఁ బంచోత్తర•శతహాయనము లుండె. గవిశిఖామణి పర•కాలయోగి
తే. యనఘచరితుండు పరకాలుఁ • డతనిమఱఁది
మఱియుఁ దచ్ఛిష్యులైనట్టి • మాన్యతముల

నెఱుకపఱచెద మే లుదయింప ననుచు
వాదిభీకరగురుఁ డనె మోద మలర. 68

వ. ఆశిష్యు లెవ్వరనిన నీర్మేల్నడప్పాన్ తాఱూదువాన్ పిన్నేయొదుంగువాన్ నిళల్
మెదిప్పానో శడైత్తంగువానను నీయేవురు మొదలైన మహాసత్త్వ సంపన్ను
లసంఖ్యులు వారల దివ్యనామంబులు సకలశుభావహంబులు 69

సీ. మధురకవిప్రాజ్ఞమౌళి నవత్యబ్దములు ధరిత్రి వసించె, మోద మలర
మహితవిష్వక్సేనమంత్రి యైనగజాస్యునంశముచే భువి నవతరించి
యొగి న్యాయతత్త్వము యోగరహస్యముఁ బురుషనిర్ణయమను భూరిశాస్త్ర
ములఁ జేసి మున్నూట ముప్పదివర్షము, లష్టాంగయోగియై యలరుచుండి

తే. చారుమాఘవళర్ష పక్షమున విష్ణు, దినమునందున శ్రీనాథ దివ్యయోగి
సుందరానందమయలోక మొందెననుచు, వాదిభీకరగురుఁడనె మోదమలర 70

సీ. శౌరిసేనాన్యంశ జాతుఁ డౌపుండరీ, కాక్షుండు నూటైదు హాయనములు
ధరణిపై వసియించె గురుహావళప్పఁ డీ, యిల నూటపదునొకం డేండ్లు యోగ
ధారణారతినుండి తనయిచ్చఁ దిరుమేను, విడిచి నిజార్యుని కడకుఁ జనియె
మేదిని శ్రీరామమిశ్రులు కుముదాంశ, జాతుఁడై నూటైదు సమములుండె

తే. యామునార్యుఁడు సింహాసనాశజాతుఁ, డవనిలోనూట యిరువదియైదువర్ష
ములు వసించి భజించెను ముక్తిననుచు, వాదిభీకరగురుఁ డనె మోద మలర.

వ. శ్రీరామమిశ్రులకు శిష్యు లాళవందారును దిరువరంగ ప్పెరుమాళరయరు నాదిగాఁ
గల దేశకోత్తము లయ్యాయమునార్య రచితంబులైన గ్రంథంబులు స్తోత్రరత్నం
బును సిద్ధిత్రయంబును గీతార్థసంగ్రహంబును నాగమప్రామాణ్యంబును జతుః
శ్లోకయు నని భవ్యనామంబులు గలిగి భూతలంబునం బ్రఖ్యాతంబులయ్యె శయి
కర్ణాంశంబున యామునాచార్యులవలన శ్రీరంగనాయకియందుఁ బింగళవర్షంబు
వైశాఖమాసంబునందు జ్యేష్ఠానక్షత్రంబునం దవతరించిన తిరువరంగప్పెరుమాళ
రయర్ పంచదశోత్తరశతసంవత్సరంబు లుర్వియందుండి నిజాచార్యపదాబ్జంబు
లొందె

తిరువరంగప్పెరుమాళరయరుత - శ్లో॥ శ్రీరామమిశ్రపదపఙ్కజచఞ్చరీక
శ్రీయామునార్యవరపుత్రమహాగుణాఢ్యమ్ ।
శ్రీరఙ్గరాజకరుణాపరిణామదత్తం
శ్రీభాష్యకారశరణం వరరఙ్గమీడే॥

వ కుముదాంశంబున శాందనూర్ పెరియనంబియజుశ్శాఖాధ్యయనసంపన్నులును భార
ద్వాజగోత్రోద్భవులును బృహచ్చరణులు నగుబ్రాహ్మణోత్తముల కులంబునం
దుదయించి నూటైదు తిరునక్షత్రంబులు లీలావిభూతియందుండి స్వాచార్యపద
పద్మంబు లభించె వీ రానతిచ్చిన గ్రంథంబు తిరుపతికోవై మముఖాంశ
సంభూతుండగు పెరియతిరుమలనంబి తొండమండలంబునఁ దిరుమలయందు శ్రీ
వేంకటేశుని వరప్రసాదంబుచే నవతరించెను. ఇమ్మహాత్ముండు తిరుమలవారి
కందఱికిఁ గూటస్థుండు శ్రీపుండరీకాంశంబునఁ దిరుక్కోటియూరునంబి పాండ్య
మండలంబున గోష్ఠీపురంబునందుఁ గాశ్యపగోత్రుండై యాశ్వలాయనసూత్రుండై
యవతరించి నూటైదు తిరునక్షత్రంబు లుర్వియందుండి యామీఁదఁ దిరునాడలంక
రించె నద్దేశికేంద్రునకుం బుత్రుండు దెర్కాళ్వార్ పుత్రిక దేవకీపిరాట్టియార్
వామనాంశంబునఁ దిరుమలైయాండా నళహరి తిరుమలయం దవతరించె
మార్ నేర్నంబి పాండ్య మండలంబున మారనేరనుగ్రామం బునం దవతరించె
శబర్య శంబునఁ దిరుక్కచ్చినంబి తొండమండలంబునఁగాంచీపురం బునకుంబూ
ర్వభాగంబునందుఁ బూనినమల్లి యనుగ్రామంబునం దవతరించి వరదుంకంత
రంగభక్తుండై పెరుమాళ్కోవెల యందునిత్యనివాసం బొనర్చివరదరాజాష్టకం
బనుస్తోత్రం బానతిచ్చె భగవంతుండగు రామానుజమునీంద్రుండు శేషాంశంబు
న శ్రీభూతపురియందు హరితసగోత్రుండు నాపస్తంబసూత్రుండును యజుశ్శా
ఖాధ్యయనసంపన్నుండును శతక్రతుదీక్షితుండు నగునాసూరికేశవార్యు నివనఁ
గాంతిమతీ దేవియందుఁ *జైత్రమాసంబున శుక్లపక్షంబునందుఁబదు మూఁడవతి
థియందుఁ బంచమీగురువారంబునం దాయుష్మాన్నామయోగంబునభద్రవాకర
ణంబునఁ గర్కాటకలగ్నంబునం దవతరించె శ్రీకృష్ణావతారంబుచే మధురా
పురంబుమాడ్కిని శ్రీరామావతారంబుచేఁ దిరువయోధ్య చందంబున నమ్మహా
త్మ్మం డవతరించుకతన శ్రీభూతపురంబు పుణ్యక్షేత్రంబై సజ్జనులకు సతతనిషేవ్యం
బయ్యె నమ్మహానుభావునకు ఇళయాళ్వారని పితృకృతం బైన తిరునామంబు తా
పాదిపంచ సంస్కార కాలంబునందు రామానుజా యని దాస్యనామంబును ని
త్యా రాధనీయం బగు శ్రీవరదరాజాఖ్య భగవద్విగ్రహంబును నాచార్య ప్రసాద
లబ్ధంబులు తుర్యాశ్రమస్వీకారానంతర కాలంబున యతిరాజ దివ్యనామంబు దేవ
రాజ ప్రసాదలబ్ధంబు లక్ష్మణమునియను తిరునామంబు తిరునరంగగురుప్రసాదల
బ్ధంబు శఠకోపపొన్నడి యను తిరునామంబు శ్రీకూరుమాలాధరగురుకరుణాలబ్ధం
బు శ్రీమద్రామాయణాధ్యయన కాలంబునందుఁ గోయిలణ్ణా ననుతిరునామంబు

శ్రీశైలపూర్ణ గురుకరుణాపలబ్ధంబు శ్రీభూతపురీశుం డను తిరునామం బాదికేశవ ప్రసాదలబ్ధంబు దేశికేంద్రుం డను తిరునామంబు శ్రీ వేంకటేశానుగ్రహప్రాప్తంబు శ్రీ రామానుజనంబి యను తిరునామంబు కురంగనగరీపూర్ణ ప్రసాదలబ్ధంబు మఱియు నిగ్గురుపురందరుండు లీలావిభూతి నలంకరించి యున్నసంవత్సరంబులు నూటయిరువది యని పెద్ద లానతిత్తురు మఱియును. 73

సీ. కంచికిఁ బూర్వభా•గమునందుఁ బురుషమం,గళ మను నొకదొడ్డ•గ్రామమునను
వాధూలగోత్రుఁ డా•పస్తంబసూత్రుఁడు ఘనయజుశ్శాఖాధి•కారియైన
శ్రీ మదనంతదీ•క్షితునకుఁ బుత్రుండు, భరతాంశుఁ డైనదా•శరధిసూరి
కందాడవారల•కందఱ కధికుఁడై, యతులరహస్యత్ర•యంబు సేసి

తే. యతఁడు రామానుజంపొన్న•డనెడినామ, మొందినూటైదువర్షము•లుర్వినుండి
గురువిపదపద్మములకడ•కరిగె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర. 74

మొదలియాండాను తిరునక్షత్రతత. శ్లో॥ మాఘేపునర్వసూజాతందశమ్యాంకృష్ణపక్షకే
ఆశ్రయేదాశరథ్యార్యంయతిరాజ పదాశ్రయమ్॥

సీ. ముందు శత్రుఘ్నాంశ•మున దాశరథిసూరి, పుత్రుఁడై యుదయించి•భూరివేద
శాస్త్రము లన్నియుఁ•జదివిసంయమిరాట్ప, దాంభోరుహద్వంద్వ•మాశ్రయించి
రమణీయభూతపు•రంబున శ్రీరంగ, ధామమునందుఁ ద్రి•దండపాణి
విగ్రహంబుల యథా•విధిగాఁ బ్రతిష్ఠించి, సకలోత్సవంబుల•సలిపి సుగుణ

తే. వార్ధికందాడయాండాను•వసుధనూఱు, నైదుసంవత్సరములుండి•యాత్మగురుని
శ్రీమదంఘ్రిసరోజము•ల్సేరె ననుచు, వాదిభీకరగురుఁడనె•మోదమలర.

కందాడయాండానుతిరునక్షత్రతనియను

శ్లో॥ కుమ్భే పునర్వసూజాతం యతిరాజపదాశ్రయమ్।
శ్రీరామానుజదాసాఖ్యం వన్దే దాశరథేస్సుతమ్॥

సీ. వరకరిగిరియెడ•బ్రహ్మదేశమునందుఁ, గూరాఖ్య మౌనగ్ర•హారమునను
సుకృతి యజుశ్శాఖ•శుభతరాపస్తంబ, సూత్రుఁడు హరిత•గోత్రుఁడైన
శ్రీయుతానంత దీ•క్షితునకుఁ బుత్రుఁ డై, యతిరాట్పదాబ్జము•లాశ్రయించి
పంచస్థలంబు ల•త్యంచితగద్యత్ర, యవ్యాఖ్య యమకర•త్నాకరంబు

తే. సలిపి క్షితి నూటయెనిమిది•సమము లుండి, రామతేజోవిరాజికూ•ర ప్రభుండు
పరమపదమున కార్యాజ్ఞ•జరిగె ననుచు, వాదిభీకరగురుఁ డనె•మోదమలర.

వ. కాశ్యపగోత్రుండును బూర్వశిఖుండును నగుగోష్ఠిపూర్ణ గురునకుం బుత్రుండును దేవకీపిరాట్టికనుజుండును నారాయణదాసాపరనామధేయుండునగు తెర్కాళ్వారు నకుం దిరువవతారస్థలంబును గోష్ఠిపురాపరనామధేయంబు నగుతిరుక్కోట్టి యూరను దివ్యదేశంబు. 76

తెర్కాళ్వారుత శ్లో॥ శ్రీ గోష్ఠిపూర్ణసత్పుత్రం యతిరాజపదాశ్రితమ్।
కశ్యపాన్వయసంభూతం నారాయణగురుం భజే॥

వ. శ్రీయామునమునులకుం బుత్రుం డగుశొట్టనంబికిం దిరువవతారస్థలంబు చోళ దేశంబున శ్రీవీరనారాయణపురం బయ్యార్యునకు జ్యేష్ఠభ్రాత తిరువరంగప్పెరు మాళరయర్ తత్పుత్రుం డెణ్ణాయ్చ్యాన్ తత్కుమారుండు పిళ్ళయప్పన్ వీరికంద ఱకు నాచార్యుం డెంబెరుమానార్ నివాసస్థలంబు శ్రీరంగంబు పిళ్ళతిరుమలనం బికిఁ దిరువవతారస్థలంబు తిరుమల తిరునక్షత్రంబు వైశాఖమాసంబున విశాఖ జనకుండు పెరియతిరుమలనంబి జనని యలమేలు మంగనాయకి యెంబెరుమానా రాచార్యుండు నడ మాచారము నివాసస్థానంబు శ్రీవేంకటాద్రి. 78

పిళ్ళతిరుమలనంబి త-శ్లో॥ వైశాఖేతు విశాఖాయాం జాతం యతివరాశ్రయమ్।
శ్రీశైల పూర్ణసత్పుత్రం శ్రీశైలార్యమహం భజే॥

మణక్కాల్ నంబితిరువడిగ శాశ్రయించినవంగి పురత్తాచ్చికి గురుం డెంబెరుమానార్ తిరువడిగ శాశ్రయించిన వంగిపురత్తునంబి తత్పుత్రుండు వంగిపురత్తాచ్చి యమ్మ హాత్మని సుతుండువంగి పురత్తాచ్చా రద్దేశికేంద్రునకు శ్రీరంగ రాజగురుండమ్మే ధావితిఃకంబునకుఁ గరిగిరీశుం డానుధీ రత్నంబునకు దేవరాజగురుం డమ్మహా త్మునకు వరదరాజ గురుం డగ్గురువరునకుఁ బెరియ తిరువేంగళా చార్యుండును సిరియతిరువేంగళా చార్యుండు ననియు నిరువురు పుత్రులుదయించిరి వారియందుఁ బెరియ తిరువేంగళాచార్యునకుం బుత్రుండు వంగిపురత్తునంబి యీ క్రమంబుగా వంగి పురత్తు నంబి తిరువంశంబు పుడమిని విస్తరించె.

ఇందుఁ గూటస్థుం డగువంగి పురత్తునంబి తిరునక్షత్రతనియను

శ్లో॥ భారద్వాజకులోద్భూతం లక్ష్మణార్య పదాశ్రయమ్॥
వన్దే వఙ్గీపురాధీశం నమ్బులార్యం కృపానిధిమ్॥

వ. వడుహనంబికిం దిరువవతారస్థలంబు మిథునసాలగ్రామంబు జనకుండు సాలగ్రా
మార్యుం డిద్దేశికేంద్రుండు దొంబదేనుతిరునక్షత్రంబు లుర్వియం దుండి నిజా
చార్య శ్రీపాదాబ్జంబులకడకుం జనియె. 79

వడుహనంబిగారితని-శ్లో॥ మాఘే పునర్వసూజాతం యతిరాజపదాశ్రయమ్।
పఞ్చమోపాయసమ్పన్న మాన్ధ్రపూర్ణ మహం భజే॥

వ. శ్రీమహాపూర్ణపుత్రుం డగుపుండరీకాక్షునకుం దిరువవతారస్థలంబు శ్రీరంగంబు
తిరునక్షత్ర మాడిమాస ముత్తరాషాఢ. 80

పుండరీకాక్షులత-శ్లో॥ ఆషాఢే చోత్తరాషాఢాజాతం యతివరాశ్రయమ్।
మహాపూర్ణగురోఃపుత్రం పుణ్డరీకాక్ష మాశ్రయే॥

వ. తిరుక్కురుహప్పిరాన్పిళానుకుఁ దిరువవతారస్థలంబు తిరునగరి శిష్యుం డెంగళా
ళ్వానాచార్యుం డెంబెరుమానార్ కూరుమాలాధరగురునకుం బుత్రుం డగుసుం
దరత్తోళుడయానునకుఁ దిరువవతారస్థలంబును నివాసస్థలంబు నళహారితిరుమల
యాచార్యుం డెంబెరుమానారు. 81

సుందరత్తోళుడయానుత-శ్లో॥చిత్రేచిత్రాసముద్భూతం మాలాధరగురోస్సుతమ్।
రామానుజార్యసచ్ఛిష్యం శ్రీసున్దరభుజం భజే॥

వ. ఎంబారు విజ్ఞానస్తుతి యనుప్రబంధం బానతిచ్చి నూటైదుతిరునక్షత్రంబులుండి
నిజార్య శ్రీపాదపద్మంబు లొందె. 82

ఎంబార్తనియను.-శ్లో॥ వైశాఖేతు విశాఖాయాం వైనతేయాంశసమ్భవమ్।
రామానుజపదచ్ఛాయం వన్దే గోవిన్దదేశికమ్॥
అశ్విన్యాం జ్యేష్ఠమాసేతు జాతం గోవిన్దదేశికమ్।
గోవిన్దార్యానుజం వన్దే యతిరాజపదాశ్రయమ్॥

వ. తిరువరంగత్తముదనార్ శ్రీరంగంబునం దవతరించి యందు నిత్యనివాసం బొనర్చి
నూటయెనిమిదితిరునక్షత్రంబు లుండి తిరునా డలంకరించెను. 38

తిరువరంగత్తముదనార్ త-శ్లో॥ శ్రీరఙ్గే మీనహస్తేచ జాతం రఙ్గార్యనన్దనమ్।
రఙ్గనాథగురుం వన్దే రామానుజపదాశ్రయమ్॥

అరుళాళప్పెరుమాళెంబెరుమానార్ తిరునక్షత్రతనియను.

శ్లో॥ కార్తికే భరణీజాతం యతీన్ద్రాశ్రయ మాశ్రయే।
జ్ఞానప్రమేయసారాభివక్తారం వరదం గురుమ్॥

అండకొండపల్లి జియ్యరు తిరునక్షత్రతనియను.

శ్లో॥ చైత్రార్ద్రాయాం సముద్భూతం రామానుజపదాశ్రయమ్।
చతురాశ్రమసంపన్నం సంయమీంద్రం నమామ్యహమ్॥

వ. శ్రీరంగరాజాభిమానపుత్రుం డగుశ్రీపరాశరభట్టారకునకు శ్రీరామప్పిళ్ళకుం దిరువవతారస్థలంబు శ్రీరంగంబాచార్యుం డెంబారు ఉపకారకుండు కూరేశుండీ శ్రీరామప్పిళ్ళకుం బుత్రుండు వాగ్విజయభట్టారకుండు తత్పుత్రుం డైనవేదవ్యాసభట్టరుశ్రీభాష్యంబునకు శ్రుతప్రకాశిక యనువ్యాఖ్యానంబు రచియించి శ్రుత ప్రకాశికాభట్టరని ప్రసిద్ధిగాంచెఁ దదీయపుత్రుండు వేదాంతాచార్యభట్టారకుం డగ్గురువరుండు క్షమాషోడశంబును శ్రీమదష్టాక్షరీదీపికయు రహస్యత్రయంబును దనిద్వయంబు నను గ్రంథంబు లొనర్చెఁ దత్పుత్రుండు శ్రీరంగరాజభట్టర్ వీరలును నూఱైదుతిరునక్షత్రంబు లివ్విభూతి నలంకరించియుండిరి. జయవర్షంబు నఁ గార్తికశుద్ధద్వాదశి 84

శ్రీరామప్పిళ్ళత.-శ్లో॥ కూరేశనన్దనం వన్దే వ్యాసాంశం రఙ్గవాసినమ్।
అనూరాధేతు వైశాఖే జాతం శ్రీరామదేశికమ్॥

వ. శ్రీపరాశరభట్టార్యుం డొనరించిన ప్రబంధంబులు శ్రీరంగరాజస్తవంబును శ్రీగుణరత్నకోశంబును సహస్రనామభాష్యంబును క్రియాదీపంబు నష్టశ్లోకియుఁ జతుశ్శ్లోకియు ద్వయశ్లోకియుఁ దనిశ్లోకియు నిమ్మహాత్మునకుం బుత్రుం డుద్దండభట్టారకుం డిమ్మనీషికిం బుత్రుండు పరాశరభట్టార్యుండు తత్పుత్రుండు శ్రీరఙ్గనాథభట్టారకుండు తదీయపుత్రుఁడు భట్టపరాశరార్యుండు తత్పుత్రుండు శ్రీరంగభట్టారకుఁడు తత్సుతుండు సుదర్శనభట్టార్యుండు తదాత్మజుండు శ్రీరంగరాజభట్టార్యుండు తదీయాత్మజుండు సాధుభట్టార్యుండు తత్పుత్రుండు పెరియ చిక్కయాచార్యుండు తత్సుతులు శ్రీరంగరాజభట్టార్యుండును బెద్దయాచార్యుండును బెద్దయాచార్యునకుఁ బుత్రులు చిక్కనాచార్యుండును శ్రీరంగరాజభట్టార్యుండును దత్పుత్రుండు తిరువేంగడభట్టార్యుండును బెరియభట్టరు తిరువడిగ ళాశ్రయించినవారు నల్లందికళ్ నారాయణజియ్యర్ కడహత్తుపిళ్ళైయమ్మణియాళ్వాఙ్ వీరశిఖామణి వల్లభరాయర్ నంబిగోవర్ధనదాసుండు మొదలగు మహాత్ములు వీరికందఱకుఁ దిరువాయిమొళి మొదలగు దివ్యప్రబంధంబులు నీడుమొదలైన వ్యాఖ్యానంబులు శ్రీభాష్యాది గ్రంథంబులు వేదాంత రహస్యంబు లన్నియుఁ బెరియభట్టార్యుం డానతిచ్చెఁ గూరనారాయణజియ్యరని వేఱొక

తిరునామంబుగల నలందిగళ్ నారాయణజియ్యరునకుం దిరువవతారస్థలంబు శ్రీరంగంబు పూర్వాశ్రమంబున జనకుం డెంబారను గురువరుండు కుమారుం డెడుత్తుకైయళగియనయనార్ నిత్యారాధనీయుండు హయగ్రీవుండు సుదర్శనో పాస్తి భారద్వాజగోత్రంబు నిత్యనివాసస్థలంబు శ్రీరంగం బిమ్మహాత్ముండానతిచ్చిన ప్రబంధంబు లుపనిషత్తులకుఁ దిరునారాయణభాష్యంబు స్తోత్రవ్యాఖ్యానంబును సుదర్శనశతకంబును బంచాయుధస్తవంబు తత్కార్తృకంబని పెద్దలానతీయఁగా నాకర్ణింతు మిద్దేశికేంద్రుం డొనర్చినకైంకర్యంబులు పార్థసారథికోవెల గరుడ మందిరంబు కరయల్శింగరికోవెల ప్రాకారంబులకు లోపల శ్రీహయగ్రీవమంది రంబు సుదర్శనమందిరం బిట్లు శ్రీరంగరాజున కంతరంగబహిరంగకైంకర్యంబు లనేకంబు లితఁడొనరించె నిద్దేశికేంద్రునిశిష్యులు తిరుక్కురుహప్పిరాన్ జియ్యర్ శేముంజియ్యర్ సుందరప్పాడియదేవన్ మొదలగు దేశికోత్తములు మఱియు నిద్దేశికేంద్రుండు నలందికళ్ నారాయణజియ్యర్ మండపంబునునడివిల్ తిరుమర పళ్ళియుంగట్టించెఁ దిరుక్కురుహప్పిరాన్ జియ్యరునకు శిష్యుండు మునిజియ్యర్.

కూరనారాయణ జియ్యరుతనియను

శ్లో॥ జ్యేష్ఠాయాం మార్గశీర్షేతు జాతం శ్రీరఙ్గపాలకమ్।
భట్టారకార్యసచ్ఛిష్యం కూరనారాయణం భజే॥

వ నంజియ్యర్ తిరునారాయణ పురసమీపగ్రామంబునం దవతరించి వేదాంతనిగ మాంతయోగి శ్రీమాధవుం డని తిరునామంబులు ధరియించి శ్రీరంగంబునం దాచా ర్యసన్నిధి నిత్య నివాసం బొనర్చి యొంబదినాయి రప్పడియుగద్యత్రయ వ్యాఖ్యా నంబు రహస్యత్రయ వ్యాఖ్యానంబు మొదలుగాఁ గలగ్రంథంబు లొనర్చెనంబిళ్ళ కుందిరువవ తారస్థలంబు నంబూరు తిరునామంబులు వరదరాజు తిరుక్కలిగి న్నదాసుండు సూక్తి మహార్ణవుండు లోకాచార్యుండు నని శ్రీరంగ నాచ్చారనియు నాండాళనియు నిరువురు భార్యలు కుమారుఁడు రామానుజా చార్యాపరనామ ధేయుఁ డగుతూ వియంబుల్ నంబిళ్ళ యనియెడు తిరునామంబు స్వగురు ప్రసాద లబ్ధంబు లోకాచార్య నామంబు కందాడతోడప్ప రొసంగె నడివిల్ తిరువీధిప్పిళ్ళ భట్టర్ సూక్తి మహార్ణవ నామధేయంబుఁ జేసె నద్దేశికేంద్రుండు తొంబదియైదు తిరునక్షత్రంబులు పుడమిపయి నుండె నంబిళ్ళ తిరువడి త్తామర లాశ్రయించిన వారు కుమారుం డగు రామానుజాచార్యుండు గందాడతోడప్పర్ నడివిల్ తిరు వీథిప్పిళ్ళభట్టర్ పెరియవాచ్చాంబిళ్ళ వడక్కు త్తిరు వీధిప్పిళ్ళైవేల్ వెట్టిపిళ్ళైయాయు

ణ్ణిమాధవప్పెరుమాళ్ పిళ్లైలోకాచార్యులు మణవాళమాముని మొదలైన పెరుమాళ్ జియ్యర్ యరుంతిరువుడయాణ్ దాసర్ వానమామలదాసర్ తిరుక్కురుగూరుదాసర్ ప్రాప్యస్థలనివాసర్ వీరు మొదలైన మహాత్ములు రామానుజాచార్యుం డొనర్చిన గ్రంథంబులు నానార్థ సంగ్రహమనియు రహస్య త్రయమనియు రెండు ప్రబంధంబులు కందాడతోడప్పరాచార్యునకుం దిరుపవతారస్థలంబును శ్రీరంగంబు జనకుండు కందాడయాండాన్ పితామహుండు ముదలియాండాన్ వాధూలగోత్రం బాపస్తంబ సూత్రంబు యజుశ్శాఖ దిరునామంబులు కందాడతోడప్పన్ పంచ వారణప్పెరుమాళ్ వారణాధీశర్ కౌమహస్తీశర్, ప్రథమగురుండు జనకుండు ద్వితీయగురుండు నంబిళ్ళ శిష్యులు కుమారిత లగుపెరియాయ్ శిత్తాయ్ ఇయా నమ్మాళ్ మొదలైన దేశికేంద్రులు.

కందాడతోడప్పగారి తనియను

శ్లో॥ ఆషాఢే పూర్వఫల్గున్యాం జాతం రామానుజాత్మజమ్।
లోకాచార్యకృపాపాత్రం తోడప్పార్య మహం భజే॥

వ, నడివిల్ తిరువీథిపిళ్ళై భట్టరునకుం దిరువవతారస్థలంబు శ్రీరంగంబు శ్రీపరాశర భట్టార్యుండు పాలకపిత తిరునామం బుద్దండభట్టార్యుండు. 87

ఉద్దండ భట్టార్యులవారి తనియను

శ్లో॥ తులాధనిష్ఠాసమ్భూతం శ్రీలోకార్యపదాశ్రయమ్।
నమామ్యుద్దణభట్టార్యం పరాశరగురోస్సుతమ్॥

వ. ఇతం డొనర్చినగ్రంథంబు శ్రీవత్సచిహ్నపంచవింశతి పిన్బళగియ పెరుమాళ్ జియ్యర్ గుణపరంపరా ప్రభావం బొనర్చె. 88

పిన్బళగియ పెరుమాళ్ జియ్యరుగారి తనియను

శ్లో॥ తులాశతభిషగ్జాతం పశ్చా త్సున్దరదేశికమ్।
జ్ఞానభక్త్యాది సుగుణరత్నాకర మహం భజే॥

వ. ఈయుణ్ణిమాధవ ప్పెరుమాళునకు నిత్యనివాసస్థలంబు శ్రీరంగం బాచార్యుండు నంబిళ్ళ. 89

ఈయుణ్ణి మాధవప్పెరుమాళ్లగారి తనియను

శ్లో॥ కార్తికే రోహిణీజాతం శ్రీలోకార్యపదాశ్రయమ్।
వన్దే శ్రీమాధవాచార్యం జ్ఞానాదిసుగుణార్ణవమ్॥

వ. నాలూరు పిళ్ళకుం దిరువవతారస్థలంబు తొండమండలంబున మేల్ పాడహం బను గ్రామంబు-కాశ్యపగోత్రము-యజుశ్శాఖ ఆశ్వలాయన సూత్రంబు తిరునామంబులు సుమనః కోలేశుండు కోలేవరాహప్పెరుమాళ్ నైనార్ రామానుజార్య దాసుండు నరుళాళర్ తిరువడియాన్నినల్ నివాసస్థలంబు పెరుమాళ్ కోవెల యాచార్యుం డీయుణ్ణిపద్మనాభగురుండు—శిష్యులు కుమారుం డగునాలూ రాచ్చాంబిళ్ళ తిరుప్పుళింగుడిజియ్య రిమ్మహాత్ముం డొనరించిన గ్రంథంబు పెరియాళ్వార్ తిరుమొళి వ్యాఖ్యానంబు-ఇద్దేశికేంద్రుండు కూరత్తాళ్వాన్ తిరువడిగ ళాశ్రయించిన నాలూరాం దిరువంశంబునం దవతరించె. 90

కోలేవరాహ ప్పెరుమాళ్ నైనారుగారి తనియను

శ్లో॥ చతుర్గ్రామకులోద్భూతం ద్రావిడబ్రహ్మ వాదినమ్।
యజ్ఞార్యవంశతిలకం శ్రీవరాహ మహం భజే॥

వ. తిరుప్పుళింగుడిజియ్య రానతిచ్చిన ప్రబంధంబు శ్రీవైష్ణవ చరితంబు, నాలూరాచ్చాంబిళ్లకుఁ దిరువవతారస్థలంబు తొండమండలంబున మేల్ పాడమ్మహమ్మను గ్రామంబు జనకుండు నాలూరపిళ్ళై తిరునామంబులు నాలూరాచ్చాంపిళ్ళై దేవరాజపిళ్ళై దేవేశుండును మేల్ పాడియాచ్చాం ళ్ళై - ఆచార్యుండు తండ్రియగు నాలూరపిళ్ళై - నివాసస్థలంబు శ్రీరంగంబు-శిష్యులు తిరునారాయణపురత్తాయ్ఇళంపిళచ్చపిళ్ళై తిరువాయి మొళిపిళ్ళై మొదలైన సూరిసత్తములు.

నాలూరాచ్చాంబిళ్ళై తనియను

శ్లో॥ భరణ్యాం మార్గశీర్షేతు జాతం యజ్ఞేశవంశజమ్।
దేవరాజగురుం వన్దే కల్యాణగుణ సాగరమ్॥

వ. తిరునారాయణ పురత్తాయికిం దిరువవతారస్థలంబు తిరునారాయణపురంబు - తిరునామంబులు తిరునారాయణ పురత్తాయి తిరుత్తాళ్ వరదదాసర్ శ్రీశానుదాసర్ దేవరాజ - రాచార్యుండు నాలూరాచ్చాంబిళ్ళై - ఇగ్గురువరుం డానతిచ్చిన గ్రంధంబు లాచార్యహృదయ వ్యాఖ్యానంబు తిరుప్పావు వ్యాఖ్యానంబు ముప్పాయిరప్పడి తిరుమాలా వ్యాఖ్యానంబును శ్రీవచనభూషణ వ్యాఖ్యానంబును ఇళంబిళచ్చపిళ్ళ నాశ్రయించిన మహాత్ములు కేశవాచార్యుండు—తిరునామంబు ద్రావిడవేదాంతదేశికుఁ డద్దేశికేంద్రుం డానతిచ్చిన ప్రబంధంబులు విరోధిపరిహారంబును గురుపరంపరా ప్రభావంబును శిరుప్పడియు—కేశవాచార్యునకు జనకుండు పెరియ

వాచ్చాంబిళ్ళై తిరువడిగ ళాశ్రయించిన శ్రీరంగాచార్యుండు—శిష్యులు కుమారుం
డగు శ్రీనివాసాచార్యుండు తమ్ముం డగుగరుడాచార్యుండు. 92

ద్రావిడవేదాంత దేశికులవారిత-శ్లో॥ శ్రీరఙ్గగురు సత్పుత్రం ధీశమాదిగుణార్ణవమ్।
కేశవాఖ్య గురుంవన్దే ద్రావిడామ్నాయ దేశికమ్॥

వ. తదనుజుం డగుగరుడాచార్యునకుం బంచసంస్కారంబులును జిల్లర ప్రబంధంబు
లొనంగినగురుం డిళంబిళచ్చపిళ్ళై తిరువాయి మొళియు భాష్యాది గ్రంథంబు
లును దత్త్వత్రయ రహస్య త్రయాదిసకల రహస్యంబులునుం బ్రసాదించిన
గురుండన్న యగుకేశవాచార్యుండు శిష్యులు శ్రీనివాసాచార్యుండు వణ్శఠగోప
జియ్యరును. శ్రీనివాసా చార్యునకుం బంచ సంస్కారంబులును దిరువాయిమొళి
మొదలగు దివ్య ప్రబంధంబులు ప్రసాదించిన యాచార్యుండు దండ్రి యగుకేశ
వాచార్యుండు. ఈడు మొదలగు వ్యాఖ్యానంబులను శ్రీ భాష్యాది గ్రంథంబులను
దత్త్వత్రయాది గ్రంథంబులు ననుగ్రహించిన దేశికుండు పినతండ్రియగు గరుడా
చార్యుండు వణ్శర కోపజియ్యరునకుం బంచ సంస్కారంబులను దిరువాయి
మొళి మొదలైన వ్యాఖ్యానంబులను దత్త్వత్రయాది రహస్యంబులు ననుగ్రహిం
చిన గురుండు కేశవాచార్య కుమారుం డగు శ్రీనివాసా చార్యుండు. శ్రీభాష్య
శ్రుత ప్రకాశికాది గ్రంధంబు లొసంగిన గురుండు ఘటికాశతకమమ్మాళ్, తిరు
వారాధనం బళహ సింగరి. నివాసస్థలం బహోబలంబు శిష్యులు శ్రీమన్నారాయణ
జియ్యర్ యతిరాజజియ్యర్ పణళ్ పాకత్తోళప్ప రాచ్చి తిరువేంగళాచార్యుండును.

శఠకోపజియ్యరు వారిత.—శ్లో॥ ప్రపద్యే నిరవద్యానాం నిషద్యాం గుణసమ్పదామ్।
శరణం భవభీతానాం శఠకోప మునీశ్వరమ్॥

వ. శ్రీమన్నారాయణ జియ్యరునకు నాచార్యుండు వణ్శఠ కోపజియ్యర్ తిరువారాధన
మళహశింగరి ఇద్దేశి కేంద్రుండానతిచ్చిన గ్రంథంబులు నారాయణ చరితంబును
బురుషార్థను ధానిధి షష్ఠి ప్రబంధంబు రహస్య జీవాతువు సంస్కృత తత్త్వత్ర
యంబును సంస్కృత రహస్యత్రయంబును స్తోత్రరాజవ్యాఖ్యానంబును శ్రుతి
రత్నాకరంబును దిరువారాధన క్రమంబును 94

శ్రీమన్నారాయణ జియ్యరు త.-శ్లో॥ శఠకోప మునీశాఙ్ఘ్రి శరణం కరుణాలయమ్।
శ్రీమన్నారాయణమునిం శ్రీమన్తం శరణంభజే॥

వ. శ్రీమన్నారాయణ మునులకు శిష్యుండు శ్రీపరాంకుశ జియ్యర్ తచ్ఛిష్యుండు
శ్రీనివాసజియ్యర్. తదీయచ్ఛాత్రుండు మణివణ్శఠకోపజియ్యర్. తదం తేవాసి

శ్రీపరాంకుశ జీయ్యర్. తద్పదాబ్జాశ్రితుం డహోబల జీయ్యర్. క్రమంబుగా నహోబలమఠ గురుపరంపరాక్రమం బిప్పటికిని బ్రసిద్ధిఁ జెందుచుండు పూర్వ శిఖుండగు పెరియ వాచ్చాంబిళ్ళకుం దిరువవతారస్థలంబు చోళమండలంబునఁ జక్కనల్లూరు తండ్రి యామునాచార్యుండు తల్లి నాచ్చారమ్మగారు. తిరునామం బుల భయప్రదరాజగురుండు శ్రీమత్కృష్ణ దేశికుండు. వాసస్థలంబు శ్రీరంగం బిమ్మనీషిపుంగవుం డానతిచ్చిన గ్రంథంబులు తిరువాయిమొళి వ్యాఖ్యాన మనిరు వత్తి నాలాయిరప్పడి మువ్వాయిర వ్యాఖ్యానంబులు పరందరహస్య వివరణం బును మాణిక్య మాలయునవరత్నమాలయు సకల ప్రమాణ తాత్పర్యంబును పకారరత్నంబును గద్యత్రయ వ్యాఖ్యానంబు నాళవందారుస్తోత్ర వ్యాఖ్యానంబు నభయప్రదానవ్యాఖ్యానంబును జరమరహస్యంబును నిగమనప్పడియు నిద్దేశికేం ద్రుని శిష్యులు స్వభాగినేయుండై తనకు దత్తపుత్రుం డగునై నారాచ్చాంబిళ్ళై పరకాలదాసుండు శ్రీరంగాచార్యుండు మొదలగు సూరిసత్తము లిద్దేశి కేంద్రుండు తొంబదియైదు తిరునక్షత్రంబులు విచ్చేసియుండె నై నారాచ్చాంబిళ్ళకుందిరువవ తారస్థలంబు చంగనల్లూరు వాసస్థలంబు శ్రీరంగం బిగ్గురుం డానతిచ్చిన గ్రంథం బులు జ్ఞానార్ణవంబును దత్త్వత్రయవివరణంబు నణుత్వపురుషకారత్వసమాధానం బును ముక్తభోగావళియును. శ్రీరంగాచార్యునకుఁ బంచసంస్కారంబులను గ్రహించిన గురుండు పెరియవాచ్చాంబిళ్ళై ఉభయవేదాంతంబులు తక్కినశాంతి గ్రంథంబులన్నియుం బ్రసాదించిన గురుండునై నారాచ్చాంబిళ్ళై పరకాల దాసునకుం బంచ సంస్కారంబులు నిత్యానుసంధానంబులు ప్రసాదించిన దేశి కుండు పెరియవాచ్చాంబిళ్ళై తిరువాయిమొళి మొదలగుదివ్య ప్రబంధంబులు నీడు మొదలగు తద్వ్యాఖ్యా నంబులును శ్రీభాష్యాది గ్రంథంబులును సకల రహస్యం బులును బ్రసాదించిన గురుండు నై నారాచ్చాంబిళ్ళై. వాసస్థలంబు శ్రీరంగం బద్దేశికేంద్రుండాన తిచ్చిన గ్రంథం బాచార్యహృదయంబునకుం బ్రథమవ్యాఖ్యా నంబు. వాదికేసరియళహియమణ వాళప్పెరుమాళ్ జీయ్యరునకుం దిరువవతార స్థలంబు దక్షిణదేశంబున బ్రహ్మదేశంబు పంచసంస్కారంబులు నిత్యానుసంధా నంబులు నొసంగినగురుండు పెరియవాచ్చాంబిళ్ళై. తిరువాయిమొళి మొదలగు దివ్యప్రబంధంబులనీడు మొదలగు వ్యాఖ్యానంబులను శ్రీభాష్యాదిగ్రంథంబులను దత్త్వత్రయాది రహస్యంబులను బ్రసాదించిన గురుండు నై నారాచ్చాంబిళ్ళై వాసస్థలంబు శ్రీరంగంబు. తిరువారాధన మళహాశింగరి. శిష్యులు ప్రమేయరత్నం బానతిచ్చిన యామునదేశికాభిదానుండగు తిరుమాలెయాండాన్ పించిన్న విల్లి

మొదలగు సాధుసత్తము లివ్విబుధేంద్రుం డానతిచ్చిన గ్రంథంబులు తిరువృత్తికిభావనతత్త్వప్రబోధిక తిరువాయి మొళికిదండాన్వయ ఘటితంబగు పన్నీరాయిరప్పడి యిరువత్తి నాలాయిరప్పడికిం బ్రమాణత్తిరట్టు నధ్యాత్మ చింతయు రహస్యత్రయవివరణంబును శ్లోకరూపంబున తిరువాయి మొళికి సంగతియుం దత్త్వదీపంబును దీపప్రకాశికయు రహస్యామృత వివరణమాలయుం దత్త్వనిరూపణంబును దత్త్వభూషణంబును భగవద్గీతలకు మణి ప్రవాళ వ్యాఖ్యానంబును గీతాసారమును ప్రతిశ్లోకమును దమిళ్ కవి ప్రబంధంబును దీపసంగ్రహంబును దత్త్వదీపసంగ్రహంబును. దిరునామంబులు వరదరాజును సుందర జామాతృమునియు వడక్కుత్తిరువీధిపిళ్ళకుం దిరువవతారస్థలంబును వాసస్థలంబును శ్రీరంగంబు కుడి ముడుంబై శ్రీవత్సగోత్రం బాపస్తంబసూత్రంబును దిరునామంబులు ద్రావిడవేదార్థదేశికుండును శ్రీకృష్ణపాదుండును కుమారులు పిళ్ళ లోకాచార్యుండు నళఘియ మణవాళప్పెరుమాళ్ నైనాచార్యుండనియు నిరువురు. ఆచార్యుడునంబిళ్ళై. శిష్యులు పిళ్ళ లోకాచార్యుండళఘియ మణవాళ ప్పెరుమాళ్ నైనార్ కూరకు లోత్తమదాసుండు మొదలగువార లిగ్గురుం డానతిచ్చిన గ్రంథం బీడు ముప్పత్తారాయిర మిద్దేశికేంద్రుండు తొంబదియేడు సంవత్సరములుండి తిరునా డలంకరించె. పిళ్ళ లోకాచార్యునకుం దిరువవతారస్థలంబు వాసస్థలంబును శ్రీరంగంబు పంచసంస్కారంబులు నిత్యాను సంధానంబులను ననుగ్రహించిన గురుండు నంబిళ్ళై తిరువాయిమొళి మొదలగు దివ్య ప్రబంధంబుల నీడు మొదలగు వ్యాఖ్యానంబులను శ్రీభాష్యాది గ్రంథంబులను బ్రసాదించిన గురుండు దండ్రియగు శ్రీకృష్ణ పాదాచార్యుండు తిరుత్తాయూర్ శ్రీరంగనాచ్చియార్ శిష్యులుతమ్ముండగు నళహియమణవాళప్పెరుమాళ్ నైనారాచార్యుండు కూరకులోత్తమ దాసుండును నాయనార్ తిరువాయిమొళిపిళ్ళై వేలంజోలై ప్పిళ్ళైమణల్ పాకత్తునంబియు మణవాళ మహామునికిం దండ్రియగు తిహాళక్కడందాన్ తిరునావుడైయపిరాన్ తాధరణ్ణారయర్ మొదలగు దేశికోత్తములు అళహియ మణవాళప్పెరుమాళ్ నైనారాచార్యునకుం దిరువవతారస్థలంబును వాసస్థలంబును శ్రీరంగంబు. తిరునామంబు రమ్యజామాతృ దేశికుండు, తిరునక్షత్రంబు మార్గ శీర్ష మాసంబున ధనిష్ఠ, పంచసంస్కారంబులు నిత్యానుసంధానంబులు నొసంగిన గురుండు తండ్రి యగు వడక్కు తిరువీథి ప్పిళ్ళై శ్రీ భాష్యాది గ్రంథంబులను శ్రుత ప్రకాశికయు రహస్యంబులును రహస్య వ్యాఖ్యానంబులు మొదలగు సకలార్థంబులం బ్రసాదించిన గురుండు నంబిళ్ళై. తిరువాయిమొళి మొదలగు దివ్య ప్రబంధంబుల నీడు మొదలగు వ్యాఖ్యానంబులనుం

ప్రసాదించిన గురుండు జ్యేష్ఠభ్రాత యగు పిళ్ళ లోకాచార్యుం డిగ్గురుపురందరుం
డానతిచ్చిన గ్రంథంబు లాచార్యహృదయంబును దిరుప్పావునకు స్వాపదేశ
వ్యాఖ్యానం బాఱాయిరమును దిరువందాదులకు వ్యాఖ్యానం బాఱాయిరముకణ్ణినుణ్
చిరుత్తాంబునకు వ్యాఖ్యానంబు నఱళిచ్చెయల్ రహస్యంబును. కూరకులోత్తమ
దాసునకుం దిరువవతారస్థలంబును వాసస్థలంబును శ్రీరంగంబు. పురశ్శిఖాన్వయం
బును దిరునక్షత్రం బాశ్వయుజమాసంబునందార్ద్ర. పంచసంస్కారంబులును
నిత్యాను సంధానంబునుం బ్రసాదించిన గురుండు వడక్కు తిరువీధి పిళ్ళై. తిరు
వాయి మొళి మొదలగు దివ్య ప్రబంధంబుల నీడు మొదలగు వ్యాఖ్యానంబులను
శ్రీ భాష్యాది గ్రంథంబులను శ్రుతప్రకాశికయునుం బ్రసాదించిన గురుండు పిళ్ళ
లోకా చార్యుండు. తత్త్వత్రయాది రహస్యంబులను గ్రహించిన గురుండళహియ
మణవాళప్పెరుమాళ్ నైనార్. శిష్యులు తిరువాయిమొళి పిళ్ళై పెరియ జియ్యరు
మొదలైన దేశికేంద్రులు వేలాంజోలై పిళ్ళ కాచార్యుండు పిళ్ళలోకాచార్యుండీడు
ను శ్రీ భాష్యాది గ్రంథంబులను దత్త్వత్రయాది రహస్యంబులను బ్రసాదించిన
గురుండళహియ మణవాళప్పెరుమాళ్ నైనారాచార్యుం డిగ్గురుం డానతిచ్చిన
గ్రథంబు సప్తగాథ. తిరువాయి మొళపిళ్ళకుం దిరువవతారస్థలంబు పాండ్యమండ
లంబునం గుంతీపురంబు. తిరునక్షత్రంబు వైశాఖమాసంబున విశాఖ. తిరునామంబు
లు తిరుమలయాళ్వారు శ్రీశైలేశుండు పంచసంస్కారంబులను దిరువాయి మొళి
మొదలగు దివ్యప్రబంధంబులనుం బ్రసాదించిన గురుండు పిళ్ల లోకాచార్యుండీడు
మొదలగు వ్యాఖ్యానంబు లొసంగిన గురుండు నాలూరాచ్చాంబిళ్ళై. శ్రీ భాష్య
శ్రుత ప్రకాశికాది ప్రబంధంబులను గ్రహించిన గురుం డళహియ మణవాళప్పెరు
మాళ్ నైనారాచార్యుండు. తత్త్వత్రయాది రహస్యంబు నాచార్యహృదయంబును
రహస్య వ్యాఖ్యానంబులన్నియుం బ్రసాదించిన గురుండు వేలాంజోలై పిళ్ళై
నివాసస్థలంబు తిరునగరి. ఇగ్గురుం డొనర్చిన కైంకర్యంబు తిరునగరిజీర్ణోద్ధారణం
బు ఇగ్గురునకం తేవాసులు పెరియజియ్యర్ నమ్మాళ్వార్ కోవిలెం బెరుమానార్
జియ్య రెంబెరుమానార్ కోయిల్ శఠకోప జియ్యర్ తత్త్వేశజియ్యర్ మొదలగు
మహాత్ములు. ఇగ్గురుండు నూటైదుతిరునక్షత్రంబులుండి తిరునాడలంకరించె. శ్రీ
మణవాళ మహామునులకుం దండ్రి తిహాళక్కిడందాన్ తిరునావుడయభిరాన్ తాథ
రణ్ణరయ్యర్ తల్లి శ్రీరంగనాచ్చియార్. తమ్ముండు తిరుమలయాళ్వారుజ్యేష్ఠభగిని
నాచ్చారమ్మ కులంబు బృహచ్చరణముకుడిగోమరము. నివాసస్థలంబు శ్రీరంగంబు.
ఆచార్యుండు తిరువాయిమొళి పిళ్ళై తత్త్వత్రయాదులగు కొన్ని రహస్యంబులు

ప్రసాదించిన గురుండు కూరకులోత్తమ దాసుండు, తిరునామంబులు పెరియ
జియ్యర్ సౌమ్యజామాతృయోగీంద్రుండు యతీంద్రప్రవణుం డళహియమణవాళ
జియ్యర్ కాంతోపయంతృ గురుండు వరవరముని రామానుజం పొన్నడిమఱియు
నిగ్గురుండు తత్త్వత్రయంబునకు రహస్యత్రయంబునకు శ్రీవచన భూషణంబునకు
నాచార్యహృదయంబునకు జ్ఞానసారప్రమేయసారంబులకుఁ బెరియాళ్వార్తిరుమొళికి
నూత్తం దాదికిని వ్యాఖ్యానంబు నీడునకుఁ బ్రమాణ తిరట్టాయిరము తత్త్వత్రయం
బునకుఁ బ్రమాణతిరట్టును శ్రీవచన భూషణంబునకుఁ బ్రమాణతిరట్టు నార్తి యను
చరమ ప్రబంధంబును యతిరాజ వింశతియు నుపదేశరత్నమాలయుఁ దిరువాయి
మొళి నూత్తందాదియుఁ దిరువారాధనక్రమంబును మొదలుగాఁగలఁ బ్రబంధంబు
లానతిచ్చి భూప్రదక్షిణం బొనర్చి యనేక దివ్యదేశంబుల జీర్ణోద్ధారణం బొనర్చి
సర్పాక్షిమ్లవృక్షాది చరాచరంబులకుం గొన్నిటికి ముక్తి యొసంగె నిద్దేశికేంద్రునకు
నీడు విన నవధరించి శ్రీరంగనాథుఁడు పెరియజియ్యరని తిరునామంబు చాత్తె
నిద్దేశికేంద్రుని తిరువడిత్తామర లాశ్రయించిన సూరిసత్తముఁ ష్టదిగ్గజము లేట్టూరి
శింగరాచార్యుండు నణ్ణరాయ చక్రవర్తియును పేనముదలియాండాన్ నాయనార్
శఠగోపదాసాఖ్యుం డగు వారి చిత్తాచ్చాన్ కందాడయప్పణ్ణా కందాడతిరుక్కోపు
రత్తునైనార్ కందాడ నారాయణప్పర్ కందాడతోడప్పర్ కందాడ అళ్వత్తవాళ్వత్త
పెరుమాళ్ తిరుప్పాణియాళ్వార్ దాసర్ వడుహనంబి అప్పావు అప్పిళ్ళై అణ్ణల్
జియ్యర్నైనార్ అళిప్పినానప్పై తిరువాళియాళ్వార్పిళ్ళై పెరియాళ్వారయ్యర్
సాధుభట్టరంబెరుమానార్ జియ్యర్ నాలూరిశఠగోపజియ్య రళహరి తిరుమల యతి
రాజజియ్యర్ కాంజిక్కుడత్తుప్పిళ్ళై కొంగిళణ్ణన్ కుళికుళత్తణ్ణన్ ఇల్లిందర నారా
యణజియ్యంగార్ కిడాంబియాచ్చాన్ తిరువచ్చ మానప్పన్ అవి యూరు పిళ్ళ
శింగప్పెరుమాళ్ అముదనార్ పెరియతోడప్పర్ తిరుబుత్తూరిల్ పెరియజియ్యంగార్
కందాడరామానుజ జియ్యంగార్ శఠగోపదాసర్ రావుమాధవరాయఁడు కొడువ
రాయఁడు భూతనాయకుండు మొదలైనవారు 95

సీ. అధికులు వారియం • దష్టదిగ్గజములం, దళహియవరదార్యుఁ • డగ్రశిష్యుఁ
డాఖ్య లభించె న • య్యార్యుఁడు వానమా, మలజియ్య రనుచు స • న్మానమలర
వరదనారాయణ • గురుఁ డట్లు జియ్యరు పొన్నడి యని పేరు • భువి లభించె
నవని నూటిరువది • యైదేండ్లు వసియించి, యస్మద్వివిధత్రాణ • మాచరింప

తే. నఖిలదివ్యస్థలముల ని • జాంశ ముంచి, లలిత మైనట్టితిరునా డ • లంకరించె
సౌమ్యజామాతృదేశిక • చంద్రుఁడనుచు, వాదిభీకరగురుఁడనె • మోదమలర. 96

శా. హారీతస్మృతివాక్ప్రకాశకరణా • యస్మద్విధోత్తారణా
సారాసారవివేకిలోకశరణా • సత్పద్ధతిస్ఫారణా
పారావారగభీరధీరహృదయా • పద్మాక్ష భక్తప్రియా
శ్రీరామానుజయోగిరాజ సదయా • క్షేమంకరస్వోదయా 97

క కాంతోపయంతృగురురా. ట్స్వాంతోల్లసదబ్జపూజ్య • చరణసరోజా
సంతతసంశ్రితచేతన, సంతోషకరా యతీంద్ర • సంయమిచంద్రా. 98

మాలినీవృత్తము. స్ఫురదుభయవిభూతీ • భూతపూర్వాగ్యసూతీ
పరుషసుగతఘాతీ • బ్రహ్మవిత్పక్షపాతీ
పరిహృతనతభీతీ • పాలితామ్నాయరీతీ
స్థిరతరగురుసీతీ • స్నిగ్ధతత్త్వానుఘాతీ 99

గద్యము. ఇది శ్రీ భగవద్రామానుజ కరుణాకటాక్ష కలితకవితా వైభవ పరవాదిభయంకరాచార్యాభిమతచ్ఛాత్రాపస్తంబసూత్ర కణ్వసగోత్ర పవిత్రోభయకవిమిత్ర వేంకట కృష్ణార్యపుత్ర విబుధవైష్ణవ విధేయ కేశవనామధేయప్రణీతంబైన యాచార్యసూక్తి ముక్తావళి యనుమహాప్రబంధంబునందుత్తర భాగంబున శ్రీవైష్ణవాను వర్తనంబు లేనివారుసహవాసయోగ్యులుగారనియును నేకాకియై దూరప్రయాణం బొనర్చువైష్ణవుండనాదరణీయుండనియు గురుండు దెల్పుటయు నుత్తరదేశీయుండగు రాజునకుం దత్త్వబోధ మొనరించుటయు వరవరమునిదివ్యదేశ సంచారంబును, నమ్మహాత్ముని చరమప్రదర్శనంబును, బంవ్యూహాది భగవత్స్వరూప ప్రదర్శనంబును, దదావాసస్థల కీర్తనంబును, మంత్రమంత్రార్థోపదేష్టృ గురుపరంపరా ప్రవచనంబును వారు లీలావిభూతి నలంకరించి యున్న సంవత్సరంబుల సంఖ్యయు, దత్తదార్య ప్రణీతగ్రంథసంఖ్యాను కీర్తనంబును నన్నదిపంచమోల్లాసము

—:o:—

శ్రీమతే రామానుజాయ నమః.



# ఆచార్యసూక్తిముక్తావళి

## ఉత్తరభాగము



### షష్ఠోల్లాసము

శ్రీవేదాంతగురూద్వహ
భావితపాదారవింద • పరమానందా
గోవిందగుణకథార్పిత
భావా యతిరాజ లోక•పావనచరితా.

వ. అవధరింపుము.

ఉ. ఆదర మొప్ప నాదురస•నాగ్రశుభాసనమధ్యవర్తి యౌ
వాదిభయంకరార్యుఁ డన•వద్యకృపాతిశయంబుచే నిఁకన్
మీఁదటిగ్రంథ మంత రస•మృష్టపదాక్షరవృత్తపద్యస
మ్మేదురభావ మొందుగతి•మే లుదయింప రచింతు నింపుగాన్.

క. తిరునగరి పరమపద మఁట, విరజానది తామ్రపర్ణి • విప్రులు సూరుల్
హరి యాదినాథుఁ డచ్యుత,గురుసైన్యపుఁ డాశరారి • గురువరుఁ డయ్యెన్.

చ. క్షితిఁ గురుకేశదేశికుఁడు • చెన్నుగ నక్కురుకాపురంబునన్
వితతయశస్కుఁ డైనయొక•విప్రశిఖామణికిం దనూజుఁ డై
సతతగురూపసక్తి శ్రుతి•శాస్త్రము లన్నియు నభ్యసించి శ్రీ
యతిపతి నాశ్రయించి నిత•మాంతయుగార్థ మెఱింగెఁ బ్రేమతోన్.

వ. తిరుక్కురుహప్పిరాన్పిళ్ళా నని పర్యాయనామంబు గలయక్కురుకేశగురుం
డాశ్రితులతో వేదాంతగోష్ఠి యొనర్చు చున్నసమయంబున. 6

మ. ధర వేదంబులు శాస్త్రముల్ చదివి యం•త న్వెంగళాళ్వాన్సుధీ
వరుఁ డర్థి న్గురుకేశదేశికుని స•ర్వజ్ఞున్ నిరీక్షించి త

చ్చరణాంభోజము లాశ్రయించి పడసె౯ • సారార్థసత్సంప్రదా
యరహస్యోభయవేదశీర్షముల న•య్యార్యప్రసాదంబునన్.

శా. వేళాధీతసమస్తవిద్యుఁ డయి స•ద్వృత్తి౯ నడాదూరియ
మ్మాళార్యుండు భవార్తు లన్ని కడఁజి•మ్మ౯ విష్ణుచిత్తాఖ్యస
న్మౌళిశ్రీపద మాశ్రయించి యుభయా•మ్నాయాంతము౯ సద్రహ
స్యాళిం దద్గురురాట్కృపం దెలిసె దూ•రాపాస్తసందేహుఁ డై.

సీ. అఖిలజీవాతువౌ•హస్త్యద్రిపతికి ముం•దవని జీవనదుఁ దే•యార్యుఁ డయ్యె
నాగురునకు జీవ•నౌషధ మేకృతి, గోష్ఠీపురీపూర్ణ•గురునియాజ్ఞ
నయ్యె నట్టికిడాంబి•యాచ్చాన్కులోదితుఁ, డయిపద్మనాభార్యుఁ•డని ప్రసిద్ధుఁ
డని రంగదేశికుఁ•డామ్నాయముల శాస్త్ర•ములను ద్రావిడవేద•ములను జదివి

తే. పరమవైదికధర్మైక•పరత నున్న, నతులచైత్రార్ద్రయం దమ్మ•హామనీషి
కనఘుఁ డైనట్టియొకపుత్రుఁ • డవతరించి, దినదినంబును వర్ధిల్లెఁ•దేజ మలర.

క. అప్పనిఁ బోలినబాలున, కొప్పుగ శ్రీరంగసూరి • యుచితదినమునం
దప్పిళ్ళా రని నామముఁ, దప్పక తాఁ జేసె విష్ణు•దాసులు మెచ్చ౯.

సీ. అర్భకుఁ డార్ద్రయం•దవతరించుటఁజేసి, రామానుజాచార్య•నామ మొసఁగి
పద్మనాభగురుండు•పంచసంస్కారముల్, నలిపి యాసుతునకు•సకలవేద
శాస్త్రముల్ ప్రీతితోఁ•జదివించి దివ్యప్ర, బంధము లన్ని యా•పగిదిఁజెప్పి
శ్రీరహస్యత్రయ • సారాదిసర్వర, హస్యము లెఱిఁగింప • నతఁడు తెలిసి

తే. యలనడాదూరియమ్మాళు•నాశ్రయించి, యతనిసన్నిధి నుభయవే•దాంతములను
జదివిపరవాదులనుదర్క•శతిజయించి, వాదిహంసాంబువాహాఖ్య• వసుధఁగనియె.

క. ఆత్రేయాన్వయభవునిఁ బ,వి్రతాపస్తంబసూత్రు•విశ్రుతశుభచా
రిత్రుని శ్రీరంగసుధీ,పుత్రుని రామానుజార్య•బుధవరుఁ దలఁతు౯

తిరుక్కురుహప్పిరాన్పిళ్లా౯ తిరునక్షత్రతనియను.

శ్లో॥ జాత మాశ్వయుజే మాసే పూర్వాషాఢాశుభర్క్షగే।
కురుకేశగురుం వన్దే యతిరాజపదాశ్రయమ్॥

తీర్థతనియను.—శ్లో॥ విఖ్యాతో యతిసార్వభౌమజలధేశ్చన్ద్రోపమత్వేన యః
శ్రీభాష్యేణ యదన్వయా స్సువిదితా శ్శ్రీవిష్ణుచిత్తాదయః।

వ్యాఖ్యాం భాష్యకృదాజ్ఞయోపనిషదాం యో ద్రావిడానాం వ్యధా
త్పూర్వం తం కురుకేశ్వరం గురువరం కారుణ్యపూర్ణం భజే॥

విష్ణుచిత్తాపరనామధేయుం డైనయెంగళాళ్వాన్ తిరునక్షత్రతనియను.

శ్లో॥ శ్రీవిష్ణుచిత్తపదపంకజసంగతాయ చేతో మమ స్పృహయతే కిమతః పరేణ।
నో చేన్మమాపి యతిశేఖరభారతీనాం భావఃకథం భవితుమర్హతివాగ్విధేయః॥

వరదాచార్యుం డని పర్యాయనామంబు గలనడాదూరియమ్మాళ్

తిరునక్షత్రతనియను.

శ్లో॥ వన్దేహం వరదార్యం తం వత్సాభిజనభూషణమ్।
భాష్యామృతప్రదానాద్యః సంజీవయతి మామపి॥

రామానుజాచార్యుం డని మఱియొకతిరునామంబు గలయప్పిళ్లార్

తిరునక్షత్రతనియను.

శ్లో॥ చైత్రార్ద్రాయాం సముత్పన్నం పద్మనాభగురోస్సుతమ్।
కవితార్కికసింహస్య గురుం రామానుజం భజే॥

ఆయన తీర్థతనియను శ్లో॥ యస్మాదస్మాభిరేతద్యతిపతికథితప్రాక్తనప్రక్రియోద్యా
త్కర్మబ్రహ్మావమర్శప్రభవబహుఫలం సార్థమగ్రాహ్యశాస్త్రమ్।
తం విష్వక్సేనవిద్యాస్థితపదవిషయస్థేయభూతం ప్రభూతం
వన్దే శ్రాత్రేయరామానుజగురు మనఘం వాదిహంసాంబువాహమ్॥

ఆ. సర్వపావనంబు • సత్యవ్రతక్షేత్ర, మచ్యుతునకు నిత్య • మాటపట్టు
నెల్లజగతిఁ బరమ • తల్లిక యనుపేరి, గాంచి యెందుఁగంచి•ఘనతమించె 13

వ. మఱియును. 14

చ. క పదము బ్రహ్మవాచకము • గావునఁ దత్పదవాద్యుఁ డబ్జయో
ని పరమపూరుషు న్నచట • నెయ్య మెలర్పఁగఁ బూజ సేసె గా
న పురము గాంచి యంచు భువ • నంబుల మించఁ బ్రసిద్ధిఁ గాంచె నం
దపగతసర్వదోష మగు • హస్తిధరాధర మొప్పె మెప్పుగాన్. 15

వ. అదియునుం గాక. 16

మ తనతోఁ బాసి విధాత ముందు హయమే• ధం బార్ప వాగ్దేవి దా
విని యష్టాదశ పూరవేగవతి యై • వీఁక న్వడి న్నవ్వీరిం

చనయాగస్థలి ముంప బ్రహ్మ వినుతిం • చం బ్రీతుఁ డౌశౌరి ప్రో
చెను సాష్టాదశమూర్తియై సవన మా • క్షేత్రంబు నేఁ దల్చెదన్. 17

క. వరవేగవతీనది కు, త్తర తీరమునం దనంత • ధన్వాహ్వాయపు
ష్కరిణీరత్నము రంజిలుఁ, గరిగిరి యత్తటమునందుఁ • గనబడుచుండున్. 18

సీ. పాండురాభ్రోపమ • స్ఫాటికమణిబద్ధ, బహువిధప్రాకార • పరివృతంబు
సూర్యచంద్రవతంస • సురుచినానారత్న, దీపితోన్నతహేమ • గోపురంబు
సుందరామృతసూక్తి • శుకపికశారికా, లాలితబాలక • ల్పద్రుమంబు
మహితమహానీల • మణిమయవేదికా, మాన్యజనాకీర్ణ • మంటపంబు

తే. సర్వకాలమహోత్సవ • సంగతంబు, భవ్యమాణిక్యసోపాన • భాసమాన
మైనకరిగిరి శిఖరమ్ము • నందు వెలయుఁ, బుణ్యకోటివిమానము • పొలుపు మీఱ.

మ. భువిఁ దన్ను న్గనుఁగొన్న వారికి నిలిం • పుల్ మెచ్చ సంసారసం
భవపాపంబులఁ బాపి సర్వశుభముల్ • భావించునప్పుణ్యకో
టి విమానంబున దేవరాజిపటికి • రేవం బెరుందేవితో
నవరత్నస్థగితాసనంబుపయి నా • నందంబుగాఁ జూపడున్. 20

క. వరవిధిమఖరచితవపా, పరిమళమిళితాధరోష్ఠ • పల్లవయుతసుం
దరతరదరహసితానన, సరసిజ శ్రీ వరదరాజ • శౌరిని దలఁతున్. 21

మ. క్రకచక్రూరభవాంతకారణము లౌ • కాంచీపురాష్టాదశ
ప్రకటశ్రీహరిమూర్తులందు మిగులన్ • రంజిల్లు దీపప్రకా
శకుఁడున్ శౌరి తదీయదివ్యమణిరా • జన్మందిర ద్వారవే
దిక చెంతన్ విలసిల్లు నొక్క తిరువీ • ధీ శ్రేష్ఠ మిం పొప్పఁగాన్. 22

సుగంధి వృత్తము. అప్రమేయవిష్ణుభక్తి • నాశ్రయించి మించి స
ద్విప్రు లందఱున్ సమస్త • వేదశాస్త్రసంహతిన్
క్షిప్ర మభ్యసించి యాత్మ • శిష్యకోటి కెప్పుడున్
సుప్రసన్నులై వచించు • చున్ వసింతు రచ్చటన్. 23

వ. మఱియును. 24

సీ. వేగవతీనదీ • విమలప్రవాహంబు, నం దవగాహన • మాచరించి
ధౌతవస్త్రములును • దర్భపవిత్రముల్, ధవళోర్ధ్వపుండ్రముల్ • దగ ధరించి
భగవదాజ్ఞారూప•పరమవైదికకర్మ•ములను దత్తత్కాల•ముల నొనర్చి
ప్రతివాదు లైనట్టి•బాహ్యకుదృష్టులఁ, దర్కప్రమాణోరు•ధాటి గెలిచి

తే. యతిమహేంద్రముఖోల్లాస మాచరించి, కనులఁ జూచుచు దీపప్రకాశకులను
విష్ణుదాస్యాభిరతు లగు విప్రవరులు, వేడ్క వసియింతు రాతిరువీధియందు.

సుగంధివృత్తము. నిండువేడ్క వేదశాస్త్రనిశ్చితార్థబుద్ధి యై
దండివాదులను జయించి, ధార్మికుల్ నుతింపఁగాఁ
బౌండరీక మాచరించి, భవ్యతన్ వసించు శ్రీ
పుండరీకదీక్షితుండు, పొల్పు మీఱ నచ్చటన్.

వ. మఱియును వడమకులంబును దూప్పిల్కుడియును విశ్వామిత్రగోత్రంబు నాప
స్తంబసూత్రంబును యజుశ్శాఖయుఁ గలిగి విలసిల్లుచున్నయట్టి పుండరీకదీక్షితు
నకు నాత్మతుల్యుం డైనయొకపుత్రుం డుదయించె నంత. 27

ఉత్సాహవృత్తము. పురుడు దీఱి దీర్ఘ మాడి, పుండరీకదీక్షితుం
డురుపవిత్రపాణి యై ధృతోర్ధ్వపుండ్రుఁ డై బుధో
త్కరముతోడ నర్హకృత్యకారి యై జగన్మనో
హర మనంతసూరినామ మాచరించెఁ బట్టికిన్.

శా. అన్నప్రాశనముఖ్యకర్మముల నాయావేళలం దప్ప కే
విన్నాణంబుగఁ జేసి బాలకునకున్, వేదంబులున్ శాస్త్రముల్
చె న్నొప్పం జదివించి పెండ్లి యొనరించెన్ బుండరీకార్యుఁ డం
చన్నారాయణపాదసేవకుల రాజద్భక్తి నర్చించుచున్.

ఉ. అంత ననంతసూరి సకలాగమశాస్త్రవిచారదక్షుఁ డై
సంతస మొందుచు న్నిఖిలశాస్త్రములం దనశిష్యకోటికిన్
సంతత ముగ్గడించుచును, శౌరిపదాబ్జములే తలంచుచుం
జింతఁ దొలంగి భాగవతసేవ యొనర్చుచు నుండె నచ్చటన్.

వ. అంత. 31

శా. పాతివ్రత్యము సత్కులంబు సిరి సౌభాగ్యంబునుం గల్గి వి
ఖ్యాతానంతమనీషిరాణ్మహిషి యై, కల్యాణచారిత్ర యౌ
తోతారమ్మ సుతుండు లేమి మది సంతోషింపకే యొక్కనాఁ
డేతెంచెన్ ఋతునీర మాడ నదికిన్, శ్రీశాంఘ్రులం దల్చుచున్.

పంచచామరవృత్తము. అనంతసూరి సన్నుతించె, నప్పు డర్థికల్పకు
న్ననంతవేదవేద్యు నార్యు, నప్రమేయవైభవు

న్ననంతభోగిరాట్ఛయాను • నద్వితీయు నచ్యుతున్
సనందనాదియోగిచిత్త•సారసార్చితున్ హరిన్.

స్రగ్విణీవృత్తము. శ్రీమహీనాయకా • క్షేమసంధాయకా
భూమిసంరక్షణా • పుండరీకేక్షణా
స్వామి శ్రీవేంకటే•శా మహాపూరుషా
ప్రేమ మొప్పార న•ర్చింతు నిన్నెప్పుడున్.

కవిరాజవిరాజితవృత్తము. సురుచిరభూషణ•సుందరవిగ్రహ•శోభిసుదర్శన•జుష్టకరా
పరమపవిత్రన•భశ్చరభూచర•భవ్యదనామత•పస్వినుతా
దురితనివారణ•ధూర్జటికారణ•దోర్బలనిర్జిత•దుష్టగణా
చిరముభవజ్జన, సేవయొనర్చుచు• పేమములందెద • శ్రీనృ [హరీ.

స్వాగతవృత్తము. వేంకటాద్రిగత•విశ్రుతధామా
పంకజాప్తకుల•పావనరామా
సంకులోగ్రరణ•శత్రువిరామా
శంక దీఱఁ గృప, సల్పు మకామా. 36

తరళవృత్తము. ఉరమునం దలమేలుమంగ మ•హోన్నతిన్ విలసిల్లఁగా
నిరుగెలంకుల భూమి నీళయు • నింపుగా వసియింపఁగాఁ
గరతలద్వయి శంఖచక్రయు•గంబు చూపకు చుండఁగా
గరుడవాహన నాదుకన్మొగిఁ • గానరమ్ము దయానిధీ.

మత్తకోకిలవృత్తము. మాలయింతిని గూడి ముందొక•మాధవుం డనువిప్రుఁ డు
ద్వేలశౌర్యమునన్ ధనౌఘముఁ•దెచ్చి భార్యకు నిచ్చియా
యాలుబిడ్డలు ద్రెళ్ళ నేడ్చుచు • నద్రి కెక్కినవాని ని
ర్వేలపాపముఁ బాపి ప్రోచిన•వేంకటేశ భజింతునిన్.

భూతిలకవృత్తము. శర్మకరా నరసింహ దైవత•సార్వభౌమ రమాసఖా
కర్మగతిన్ భవసాగరంబున, గాఢమగ్నుఁడ నైనన్
గూర్మమై మును మందరం బను•కొండ నెత్తినమాడ్కి దు
ష్కర్మముల్ సెడ నుద్ధరింపుము, శౌరి వేంకటనాయకా.

చంద్రకళావృత్తము. దీనపోషక యోగిహృదబ్జ•ధ్యేయ మహాపురుషా హరీ
భానుచంద్రులపోలిక నీస•ద్బాహురథాంగదరేంద్రముల్

కానఁ జేయవె దేవధునీప। త్కారణపాదలసద్వయిఁ
మానసాంబురుహంబున నోరా। మా భజియింతునకామతన్.

అంబురుహవృత్తము. అంబుజలోచన కంబుగళా కన। కాంబరేద్ధకటిస్థలా
శంబరజిజ్జనకా సనకాదిక। సర్వయోగివిషేవితా
బింబఫలాధర వీనికి విన్నఁకఁ । బ్రీతితోఁ గనిపింపవే
యంబరచారులు విస్మయ మందఁగ। వంజనాచలఖేలనా.

ఖచరప్లుతవృత్తము. వరద యాదవ మాధవ గోపీ। వాంఛితదా ఖరఖండనా
నరకదానవసూదన ధాత్రీ। నాయక నారదసన్నుతా
గరుడవాహన పావనలక్ష్మీ। కాంతభుజాంతర భూరిదా
తిరముగా శరణాగతరక్షా। దీక్షతఁ జూపడవే హరీ.

వ. అని యివ్విధంబున. 43

## వేదాంతాచార్యులవారి వైభవము.

త-శ్లో॥ కళఙ్కశఙ్కారహిత స్తమోనుదన్ కళానిధిః కార్తికపూర్ణిమాతిథౌ।
వివేశ త ద్విష్ణుపదం విచిత్రవా గ్విభూషితో వేఙ్కటనాథచన్ద్రమాః॥

శ్లో॥ అబ్దే సౌమ్యేచ వారే గతవతి తరణౌ వృశ్చికం కృత్తికర్క్షే
రాకాయాం వేఙ్కటేశో యతినృపతిమతం సర్వత స్థాపయిత్వా।
వేదాన్తాచార్యసూరిః కృతసకలవిధానేకదివ్యప్రబన్ధ
శ్శ్రీశైలాధీశఘణ్టాకృతివపురభజ ద్దేశికేన్ద్రో దయాళుః॥

ప్రభాకలితవృత్తము. ధరను బ్రసిద్ధుఁ డనంతసూరి య। ధామతిఁ వినుతించినన్
సరసిరుహాక్షుఁడు వేంకటేశుఁడు । సంతసించి నిజాత్మలోఁ
జరణప్రపన్నుఁ డితండు మా కని । సత్ప్రసాద మొనర్పఁగాఁ
గరుణఁ దలంచి యనంతసూరికిఁ । గన్పడెన్ మదిలో రహిన్.

శాలినీవృత్తము కన్నులనన్నొప్పెడ। గాంచుటవ్యర్థము । గాదుబుధోత్తమ। గ్రక్కననీ
కున్నతకీర్త్యభి। యుక్తశిఖామణి । యొక్కకుమారకుఁ । డుద్భవిలుం
జెన్నుగ నన్మదిఁ । జేర్పు మటంచును । జెప్పి రమాపతి । సేమ మిడం
బన్నుగఁ దత్సతి। పాలికి నేఁగెను । బాలకవేషముఁ । బన్ని యటన్,

ఆ. అతిపవిత్రవేగ•వతినీటిలో ఋతు.స్నాన మాచరించి • జరగు చున్న
వేంకటేశుఁ డంత•వేడ్కఁ దోతారమ్మ• కన్నుఁగవకు నెదుటఁ•గానఁబడియె.

వ, కనఁబడినవిధం బెట్టి దనిన. 47

సీ. నీలాళిరుచి మించి•నిగనిగ మెఱయుచు, సిగముడి శిరముపైఁ•జెన్నుగులుకఁ
జంద్రమండలమునఁ•జవిజాలుగతి ముద్దు, మోమునఁ జిఱునవ్వు•మొలకలెత్త
ద్వాదశాంగములందు•ధవళోర్ధ్వపుండ్రముల్, శ్రీచూర్ణరేఖల•సిరి వహింపఁ
బాలాశదండముఁ•బాణిపల్లవమున, దర్భపవిత్రంబుఁ•దగినవ్రేలఁ

తే. దాల్చి గళమునఁ దిరువడి•త్తావళములఁ, బరఁగ ధరియించి కైతవ•బ్రహ్మచారి
క్షితి ననంతార్యదేవికిఁ•జింత లుడుపఁ, గానఁబడియెను గన్నులఁ•కవకు నెదుట.

వ. అట్లు గన్పడి మాయామాణవకార్భకుం డాసాధ్వీరత్నంబున కి ట్లనియె. 49

సీ. అమ్మరో నీ కేల•యంతరంగమునందుఁ, జింత యి ట్లింక నీకు•సేమ మగును
వేంకటాచలముపై•వివిధకామ్యార్థము, లొనఁగెడుఫలవృక్ష•మొకటి గలదు
తత్ఫలం బిది యని•తరుణికిఁ జిఱుగంట, పగిది భాసిలుదొండ•పం డొసంగి
యీక్షణంబునఁ దిను•మిష్టము సిద్ధించు, నని పల్కె నద్దేవి•య ట్లొనర్చి

తే. మాయబాలునిఁ గనకవి•స్మయముఁజెంది, వృషగిరీశునిఁదలఁచుచు • వేశ్మ మొంది
భర్తతోఁగూడి సుఖియింపఁ•బరమకృపను, వేంకటేశుఁడుతద్గర్భ•వివర మొందె.

పృథ్వీవృత్తము.
దినక్రమముగా రహిం•దెలివి మించె నద్దేవికిం
దనూదరమహత్త్వముం•దగినరీతినిం జూపడె
న్ననంతగురుఁ డంతఁ దా•నఖిలసూరివర్గంబుతో
ఘనార్హదివసంబునన్•గరిమఁ జేసె సీమంతమున్. 51

మ. పరమాశ్చర్యపడన్ జనాళి గజగ•ర్భం బట్లు పండ్రెండువ
త్సరముల్ భాగ్యవతీలలామ మగుతో•తారమ్మ శ్రీవేంకటే
శ్వరఘంటాత్మకగర్భ మూనఁ బతి త•ద్వర్ష్మప్రభం గాంచి శ్రీ
హరి యస్మత్సుతుఁ డయ్యె నంచు మది నా•హ్లాదించె మిత్రాళితోన్. 52

శా. శాంతించెం గలిదోషముల్ పుడమి నం•చత్పుణ్యముల్ మించె నా
శాంతాశ్రాంతనిశాంతసద్యశుఁ డనం•తార్యుండు శ్రీకాంతునిన్
స్వాంతం బందుఁ దలంచు చుండె విలస•చ్చారిత్ర యాదేవికిన్
వింత న్నంశయుగైకపావనసుతా•విర్భావకాలంబునన్. 53

ఉ. క్ష్మాసుఖకారిభాద్రపద•మాసమునన్ వృషశైలనాధమా
క్ష్మాసఖతీర్థవాఃదివ•సంబున శ్రీహరిదేవతాక యౌ
భాసురతారయందు వృష•భక్షితిభృత్పతిదివ్యఘంటికో
ద్భాసితమూర్తి యాసతికిఁ•దా నుదయించెను బుత్రుఁడై యిలన్. 54

తే. విష్ణుతేజోపబృంహితు•విలసితాత్ము, బాలకునిఁ జూచి యాతండ్రి•పరమహర్ష
మంది యవగాహనస్నాన•మాచరించి, జాతకర్మోత్సవముఁ బ్రీతి•సలిపె నంత.

చ. పురిటిదినంబు లన్నియును•బొల్పమరం జనఁగా ననంతన
ద్గురుఁడును దీర్ఘమాడి పరి•తుష్టి బుధాళులతోడఁ బట్టికిం
దిరముగ వేంకటేశుఁ డని•దివ్యదరుక్రమనామధేయ మి
ద్ధరణి సుఖింపఁజేసి హరి•దాసుల కర్చ మొనర్చె నంతటన్. 56

వ. అయ్యవసరంబున "మద్భక్తోహం భవిష్యామి" అనియును "నేశస్స్వయమాగత్య" అనియుఁ బురాణవచనప్రామాణ్యంబు శ్రీశఠకోప మునీంద్రుండు భగవదంశావతీర్ణుం డనియును విష్వక్సేనాంశజాతుం డనియుబుధాళిచేనభ్యుపేక్షణీయుం డయ్యును శ్రీ వైకుంఠనాథ శ్రీపాదుకాంశజాతుం డని లోకరూఢిఁగాంచినట్లుభగవద్రామానుజ మునీంద్రుండు "ననురామావరజస్స ఏష భూయః" అనియు "విష్వక్సేనో యతిపతి రభూద్వేత్ర సారస్త్రిదణ్డః" అనియును "వవృధేవఞ్చభిరాయుధైర్మురారేః" అనియు నభియుక్త శ్రీసూక్తి ప్రామాణ్యంబున శ్రీకృష్ణా పరావతారం బనియు విష్వక్సేనాం శావతీర్ణుండనియును బంచాయుధాంశ సంభూతుండనియును లక్ష్మీ శక్తి ప్రభూతుం డనియును మహాత్ములచేత నూహింపఁబడియు శేషమూర్తి యని జగత్ప్రసిద్ధిఁ గన్నయట్లు శ్రీమద్వేద మార్గ ప్రతిష్ఠాపనాచార్యుండును సర్వతంత్ర స్వతంత్రుండును భగవద్రామానుజ సిద్ధాంత నిర్ధారణ సార్వభౌముండును నగు శ్రీ వేంకటేశగురుండును 'శ్లో॥ వేఙ్కటేశావతారోయంతద్ఘణ్టా చాథవాభవేత్। యతీన్ద్రాంశోథవేదేవమ్' ఇత్యాద్యభిజ్ఞ వచనక్రమంబుగా శ్రీ వేంకటేశాపరావతారం బనియు శ్రీరామానుజ పర్యాయావతారంబనియుఁ దద్దయుం బెద్దలచే నూహింప నర్హుం డయ్యును, 'శ్లో॥ ఉత్ప్రేక్ష తేబుధజనైరుపపత్తి భూమ్నా ఘణ్టా హరే స్సమజనిష్ట యధాత్మ నేతి' అనియు 'శ్లో॥ భాద్రపద మాసగత విమలర్క్షే వేఙ్కటమహీ తీర్థదినభూతే। ప్రాదురభవజ్జగతో దైత్యరిపు ఘణ్టావస్తా కవితార్కికకేసరి మృగేన్ద్ర గురుమూర్త్యా॥' అనియు నభియుక్త శ్రీసూక్తి క్రమంబుగా శ్రీ వేంకటేశ ఘంటావతారం బని లోకరూఢి వహించె. ఇట్లు ప్రభావసంపన్నుఁ

డైన యద్దారకునకుఁ దండ్రి యగుననంత సూరివరుండు పండ్రెండవ దినంబున జాతకర్మ నామకరణంబులను మూఁడవ నేలయందుఁ జంద్ర దర్శనంబును నాఱవ నెల నన్న ప్రాశనంబును మూఁడవ సంవత్సరంబునఁ జౌలకర్మంబును గర్భాష్ట మంబునం దుపనయనంబును దదనంతరయోగ్య కాలంబులయందు గోదావిక్రవ తాది వైదికకర్మంబు లన్నియు యథాశాస్త్రంబుగా నొనర్చె నంత. 57

ఆ. వేంకటేశసూరి•వేశ్మమునం దుండి, వేడ్కఁ దండ్రి చెప్ప•వేదములను
నిత్యసూరిభోగ్య•నిత్యానుసంధాన, ములఁ బఠించి మించె•మోద మలర. 58

వ. మఱియు నఖండకావేరీ ప్రవాహంబున జనియించి యుదీచీనా వాచీనకావేరీ ప్రవాహంబులు శ్రీరంగధామంబున కిరుపార్శ్వంబులఁ బ్రవహించుచుఁ జనిచనియేక సముద్రంబునం బ్రవేశించినట్లు సంయమీంద్రునకుం బ్రియ శిష్యుండును బ్రణతార్తిహరుం డనియు వరదార్యుం డనియుఁ దిరునామంబులు గల కిడాంబియాచ్చాన్ తదంఘ్రిసరోజాతుండు రామానుజగురుండు తత్పాదాశ్రితుండు శ్రీరంగాచార్యుం డీక్రమంబుగా నేతెంచు సమాశ్రయణ సంప్రదాయం బును యతీంద్రున కభిమానపుత్రుండు నభిమతచ్ఛాత్రుండును గురుకేశగురుండు తచ్ఛిష్యుండు శ్రీవిష్ణుచిత్తార్యుండు తదంతే వాసి వరదార్యుండని తిరునామంబు గలనడాదూరియమ్మాళ్ ప్రకారంబుగా నరుగుదెంచు గ్రంథాన్వయసం ప్రదాయంబును భగవద్రామానుజగోవింద భట్టార్య వేదాంత వేద్యాది గురుపంక్తి విశేషంబునకు నిరుగెలంకుల విలసిల్లుచు వచ్చివచ్చి యేమహాత్మునిఁ గలిసె నయ్యుభయసంప్రదాయంబులం గలిగి రామానుజార్యుం డనియు వాదిహంసాంబువాహుండనియుఁ బ్రసిద్ధుండై యాత్రేయకులకలశాబ్ధిపూర్ణ చంద్రుండై స్వమాతులుండై యొప్పునక్కిడాంబియప్పిళ్ళను నాశ్రయించి యమ్మహాత్ముని యనుగ్రహంబుచేఁ బంచసంస్కారంబులు లభించి శ్రీ వేంకటేశ గురుండు తొల్లి రామకృష్ణాభిధానుం డగునారాయణుండు సాందీపనికడ సకలవిద్య లభ్యసించినట్లు "వింశత్యబ్దే విశ్రుత నానావిద్యస్త్రింశద్వారం శ్రావితశారీరకభాష్యః" ఇత్యాద్యభియుక్త శ్రీసూక్తిక్రమంబుగా నద్దేశికేంద్రుసన్నిధిని వసించి కాణాదపాణినీయ పాతంజల పూర్వోత్తర మీమాంసాది సమస్త శాస్త్రంబులు, నాలాయిర ప్రబంధంబులు, తద్వ్యాఖ్యానంబులు, వేదాంతరహస్యంబులు, వైశ్వదేవక్రమ బు, చరమపర్వనిష్ఠ శరణాగతి, మఱియుఁ దక్కినవిద్య లన్నియు నిరువది సంవత్సరములలో నభ్యసించి ముప్పదిమాఱులు శ్రీభాష్య ప్రవచనం బొనర్చె, నమ్మహాత్మునకుం దిరువారాధనంబు శ్రీహయగ్రీవమూర్తియు శ్రీరంగరాజ దివ్య విగ్రహంబును

శ్రీపాణియోగీంద్రుండును హయగ్రీవోపాసనయు వైనతేయ సాక్షాత్కారంబును గలిగియుండు నగ్గురువరుండు వడహాలయాచార సంపన్నులగు ప్రపన్నులకుం గూటస్థుండు జ్ఞానవదగ్రేసర సార్వభౌముండును భాగవతనిష్ఠా గరిష్ఠుండును బరమ వైదిక చక్రవర్తియునై యొప్పుచుండె నప్పుడు. 59

ఉ. అంతట నొక్కనాఁడు బృహ • దామయజర్ఝరితాంగు సంతతో
ద్భ్రాంతమనస్కు దుఃఖి నొక • భాగవతుం గన్మ్రోలఁ జూచి వే
దాంతగురుండు నిండుకృప • నాతనికిన్ స్వపదాబ్జతీర్థ మొ
క్కింత యొసంగఁ ద్రాగి సుఖి • యించుచు నుండె నతం డరోగియై. 60

సీ. దీపప్రకాశక • దేవదివ్యాలయ, గోపురద్వార • సమీపమునను
స్వకభవ్యగృహబహి • ర్ద్వారాంగణస్థలి, స్తంభము నాటించి • దానిపైని
తనసర్వతంత్ర స్వ • తంత్రమహాబిరు, దాంకిత మగువిజ • యధ్వజంబుఁ
గట్టించి తనతోడఁ • గదిసి పోరెడుకవి, తార్కికగజముల • తలలు పగులఁ

తే. బ్రబలతర్కాదిసి తనఖ • పంక్తినడఁచి, క్షితిని దాఁగవితార్కిక•సింహుఁడనుచు
వాసి కెక్కెను శ్రీవేంక•టేశగురుఁడు, సంయమీంద్రపదార్పి త•స్వాంతుఁడగుచు

వ అంత నావేదాంతగురుండు కవికథక కరటిఘంటాలుంఠనాకుంఠోత్కంఠ కంఠీరవుం డయ్యును వైకుంఠ ప్రియదర్శనైకతత్పరుండు గావున ద్రవ్యార్జనంబునకై రాజదర్శనంబు సేయ నొల్లకయున్నయెడఁ దదీయులు కొంద ఱద్దేశికేంద్రునిం జూచి మహాత్మా నిత్యతదీయారాధనాభివృద్ధికై ప్రభుదర్శనంబు సేయందగునని విన్నవింప నమ్మహానుభావుండు వారల నుద్దేశించి ప్రాజ్ఞులారా. "శ్లో॥ శరీరపతనావధి ప్రభునిషేవణాపాదనా। దబిన్ధనధనంజయ ప్రశమదద్ధనం దంధనమ్। ధనంజయవివర్ధనం దనము దూఢగోవర్ధనమ్। సుసాధనమబాధనం సుమనసాం సమారాధనమ్॥' అనియెడు శ్లోకముఖంబున ధనంజయ వివర్ధనంబును సముద్ధృతగోవర్ధనంబును సుఖోపాయసాధ్యంబును రాజచోరాద్యుపద్రవరహితంబును సుమనస్క సమారాధనీయంబును నగు శ్రీకృష్ణరూప ధనంబు ధనంబుగాని శరీరపతనపర్యంతంబు ప్రభునిషేవణంబుచే నార్జితంబై సలిలేంధనజఠ రానలశమనకారణంబైన ధనంబు దంధనం బనియు, 'శ్లో॥ దురీశ్వరద్వారబహిర్వితర్ది కాదురాసికాయైరచి తోయ మంజలిః। యదంజనాభం నిరపాయమస్తి మే ధనంజయస్యన్దనభూషణం ధనమ్॥' అనియెడు పద్యముఖంబున నేకారణంబునం జేసి పుంజీభూతాంజనాభంబును నిరపాయంబును బార్థరథాభరణంబు నగుధనంబు మాపాలం గలిగి

యుండు నా కారణంబుచే దురీశ్వరఖలద్వార బహిర్వితర్దికలం గీలుకొనియెడు దురాశ కంజలి రచియింపఁబడియె ననియె ననియును. 'శ్లో॥ శిలం కి మనలం భవేదనల మౌదరం బాధితుం, పయః ప్రసృతిపూరకం కిము నధారకం సారసమ్। అయత్నమలమల్లకం పథి పటచ్చరం కచ్చరం భజన్తి విబుధాముధాప్యహహా కుక్షితః కుక్షితః॥' అనియెడు శ్లోకముఖంబుగా జఠరాగ్ని శాంతికై యుంఛశిలాదివృత్తి యేల చాలదు? ప్రసృతిపూరకం బగుసారసనీరం బేల ధారకంబుగానేరదు? మార్గమధ్యంబునం దయత్నసిద్ధంబై మలదూషితంబైన జీర్ణ వస్త్రంబు కౌపీనం బేల కాదు? విబుధు లహహా కుక్షికై కుక్షితీశ్వరుల నిరర్థకంబుగా భజియించుచుందురనియు నానతిచ్చిన విని వారును భగవత్ప్రపన్నులకు రాజసేవ సేయఁదగదని తెలిసి యమ్మహాత్మునకుఁ బ్రణమిల్లి తదాజ్ఞఁ బడసి యథేచ్ఛం జని రంత నగ్గురుశిరోమణియుఁ బరమ విరక్తుండై యక్షయపాత్ర సేయుచుండు తఱి ధన్యులగు దాసచేతనులు కొందఱు కనకరత్నగర్భంబులగుతండులంబుల నర్పింప నెఱింగి యానిస్పృహుండు రత్నంబులు ఱాళ్ళనియును గాంచనంబు కలి కాశ్రయం బనియు వానిని బరిహరించి శుద్ధంబు లగుతద్ధాన్యంబులచేఁ గాలయాపనంబు సలుపుచు భగవదంఘ్రి సరోజ హేమవ్యామోహంబునఁ దదితరసమస్త వస్తువులను దృణీకరించి నిజనివాసంబున భగవద్గుణానుభవైకతత్పరుండై సుఖంబుండె నయ్యవసరంబున. 62

మ. అతివేడ్కన్ సిరిఁ గొల్చి తత్కృపను వి • ద్యారణ్యుఁ డవ్విప్రుఁడు
న్నత రాజ్యంబు లభించి బాల్యదశ • నామ్నాయాంతసూరీంద్రుఁ డీ
క్షితి నస్మత్సహపాఠి యై శిలముచే • జీవింప రాదంచు సు
స్థితిఁ జేయన్ స్వభటాళిచేఁ బిలువఁ బం • చెన్ వేంకటాచార్యులన్. 63

వ. ఆవిద్యారణ్యప్రేషితు లగు రాజభటు లేతెంచి కాంచీపురంబుఁ గాంచియందు.

మందాక్రాంతవృత్తము. భ్రాజద్భూభృద్భటు లచటికి • న్వచ్చి యద్దేశికేంద్రున్
రాజద్వీథి న్రహిఁ గని నతుల్ • రంగుగాఁ జేసి విద్య
ద్భూజానీ మా దొర మిము నటం • దోడి తెమ్మంచు మ మ్మ
వ్యాజోక్తిన్ దా ననిచె నటకో • యార్యవిచ్చేయుమన్నన్.

వ. తద్వాక్యంబు లాకర్ణించి యగ్గురు పురందరుండు నిజమందిరంబుఁ జెందియందుఁ దనడెందంబునం దిందిరాసాన్నిధ్యంబుఁ గల్పించుకొని యాత్మగతంబున 6

స్రగ్ధరావృత్తము. ఆవిద్యారణ్యభిక్షుం • డవనికిఁ బతియై • యర్థ మీమా కొవంగన్
భావం బుం దెంచి పిల్వం • బనిచె మమ యతి • బ్రహ్మదాపానుభావం
బావిప్రుండే మెఱుంగు • న్నతనికి మనము • ర్దోషు మిప్పింతుమంచుం
బ్రావీణ్యం బొప్పు నంచ•ద్రసనఁ గనక ధా • రా స్తవం బానతిచ్చెన్.

మహాస్రగ్ధరావృత్తము. ధనధారాపాతవృష్టిన్ • దయసిరిగురియ • న్ధారణీద్రోచ్ఛ్రితం
బా• ధనరాశిన్ సూరిసంఘం • దను డిడ నృపమా • త ల్లరోష్ట్రాదిపాళిం
గొని శీఘ్రం బేఁగి యా భి•క్షునిఁ గని ధనము • ల్గుర్మి జూపించి కైకొ
మ్మనఁ జోద్యం బంది యాతం • దతని హరినిఁగా•నాత్మలోనం దలంచెన్. 68

వ. అంత.

క. వరదునియనుమతిఁ గొని యదు. గిరి కరుగుచు గురువరుండు•కృతియుతుఁడై యా
సరణిఁ దన కెదురు నుడివెడు. పరవాదులఁ దర్క-శతిని • భంగ మొనర్చెన్. 69

చ. తన విజయం బెలర్పఁ గవి • తార్కికకేసరి యట్టు లల్లనం
జనిచని కన్మొగిం గనియు • సస్యసమృద్ధుల కాటపట్టు స
జ్జనులకు వాసభూమి విల • సత్కమలాకర ముజ్జ్వలన్నదీ
వన మగుమేలునాఁట సుర • వంద్యము నయ్యదుశైలరాజమున్. 70

ఉ. అందు విశుద్ధరత్నకృత • హాటకగోపురశాలిసాల మై
సుందరహర్మ్య సౌధగృహ • శోభిత మై విబుధైకధామ మై
నందనతుల్యపుష్పగహ • న వ్రజసంవృత మై మనోజ్ఞ మై
యిందిర కాటపట్టు నయి • హెచ్చుపురంబు గురుండు గన్గొనెన్. 71

క. తిరునారాయణపుర మని. ధర విశ్రుతిఁ గాంచి విష్ణు • దాస్యరతులకుం
బరమపదం బనఁ బరగిన. పుర మది శ్రీవేంకటేశ • బుధవరుఁ డొందెన్. 92

సీ. కళ్యాణియం దవ • గాహన మొనరించి. ధౌతవస్త్రయుగంబు • దాల్చి యూర్ధ్వ
పుండ్రము ల్పండ్రెండు•పొల్పుగా ధరియించి. గురుపంక్తిఁదలచి•యగ్గురువరుండు
కాలోచితక్రియల్ • గావించువేళ నా. స్థలవాసు లందఱు • తన్నుఁ గాంచి
ప్రణమిల్ల వారిని • భగవత్స్వరూపులఁ. గా నెంచి సేవించి • గారవించి

తే యంత యతిరాజమరమున•కబ్బుధాళి. తోడఁజనుదెంచియమ్మహా•త్మునిభజించి
భవ్యతీర్థప్రసాదాది•బహుమతులను. జెంది డెందమునందు నా•నంద మొందె.

మ. యతిరాజాజ్ఞ లభించి యగ్గురువరుం • డావైష్ణవశ్రేణితో

నతిభక్తిన్ హరిమందిరాంగణము డా • యం బోయినం జూచి శ్రీ
పతికైంకర్యపరుల్ సమాల్యశఠకో • పం బార్యులం గూడి యం
చితవాద్యాగమఘోష మొప్ప నెఱవా • సిం దెచ్చి రచ్చోటికిన్. 74

క. శ్రీశుభశఠకోపముతో, వాసిగ నేతెంచు వైష్ణ • వ ప్రవరులకుం
జేసెఁ బ్రణామము వేంకట, దేశికుఁ డాశ్రితులతోడ • దేజ మలరఁగన్. 75

తే. అంత యదుశైలనాథుని • యర్చకుండు
కుసుమదామము శ్రీశఠ • కోప మియ్య
ననుగృహీతోస్మి ధన్యోస్మి • యని శిరమునఁ
దాల్చె నవి రెండు ఘంటావ • తారగురుఁడు. 76

సీ. శ్రీశఠకోపము • చెంత నాశ్రితులతో, స్థలవాసి వైష్ణవ • జనులతోడ
నల్లనల్లన చని • హరిమందిరద్వార, దేహళిఁ గడచి యా • దివ్యసూరి
బలిపీఠ మున్నచోఁ • బ్రణమిల్లి కోవెల, వలగొని ముఖమంట • పమునఁ మ్రొక్కి
యంతరాలయమునం • దఖిలేశుఁ డగు తిరు, నారాయణునిజగ•న్మాన్యదివ్య

తే. మంగళాకృతి యాపాద•మస్తకంబు, కన్నులారఁ గనుంగొని • సన్నుతించి
తీర్థశఠకోపచందనా•దికముఁజెంది, ధీరు యతిరాజసంపత్కు•మారుఁ గనియె.

శా. డాయం బోయి గురూద్వహుండు యతిరా•ట్సంపత్కుమారున్ముని
ధ్యేయున్ సాధువిధేయు నార్ద్రహృదయున్•ఢిల్లీశపుత్రీప్రియున్
మాయాయాత్తసమస్తభూతచయ శ్రీ•మత్కాయు రామప్రియున్
న్యాయం బొప్ప భజించి తీర్థశఠకో•పాదుల్ గ్రహించెన్ రహిన్. 78

సీ. అంత నయ్యదుగిరి•హరియాజ్ఞఁ దలఁ దాల్చి, తద్దేశవిమతవి•ద్వజ్జనులను
ఘనతరబ్రహ్మత•ర్కప్రమాణముల జ, యించి జయంబు చా•టించి యచట
స్వజయసూచకజయ•స్తంభముల్నాటించి, యాశ్రితులనుగూడి•యచటనుండి
తరలి శ్రీమద్రంగ ధామముకడ కేఁగి, కావేరియం దవ•గాహనంబుఁ

తే. జేసి ధవళోర్ధ్వపుండ్రము•ల్చెన్ను మీఱ, ద్వాదశస్థానములయందుఁ•దగధరించి
యార్యపంక్తిఁదలంచి వే•దాంతగురుఁడు,సమయసముచితకృత్యము•ల్సలిపెనంత.

శా. శ్రీరంగస్థలవాసిభాగవతు లా•శ్రీవేంకటేశార్యునిం
జేరం బోయి ప్రణామముల్ సలుప నా•శ్రీవేదశీర్షార్యుఁ డా
సూరిశ్రేణికి మ్రొక్కి మే లడిగి యా•సుశ్లోక సంఘంబుతో
శ్రీరంగేశు భజించి సన్నుతులఁ జే•సెన్ దేశికుల్ మెచ్చఁగాన్. 80

వ. ఆస్తోత్రక్రమం బెట్టి దవిన. 81

మత్తకోకిలవృత్తము. రంగరాజ రథాంగశంఖధ•రా విహంగతురంగ సా
రంగరాడ్వరదా త్రివిష్టప•రక్షణంబున కిచ్చటన్
రంగదచ్ఛభుజంగపుంగవ•రమ్యతల్పముపై రమా
సంగి వై పవళించుచు న్మది•సారెసారెకుఁ దల్చెదన్. 82

విచికితమాలినీవృత్తము, సరసిజభవభవముఖసుర•సతతవినుత చరణయుగా
సురుచిరశుచితరసుచరిత•సుఖకరవిజసుగుణకథా
మురహరభవహర నినుఁగను•మొగిముదమలరఁగఁ గవినా
దురితము లుడిగితి విఁక మదిఁ•దొలఁగక నెలకొనుముహరీ.

భుజంగప్రయాతవృత్తము. మహాయోగిహృత్పద్మ•మంతవ్యమూర్తీ
మహి న్నిన్నుఁ గన్గొన్న•మర్త్యుండు ధన్యుం
డహోరాత్రముల్ నీకు•భాంగంబుఁ దల్చున్
రహిన్ వాఁడు మైమావి•రంగా వి నొందున్. 84

కరిబృంహితవృత్తము. మూఁడుజగములుమూఁడుపదముల•ముందుగొలిచినవామనా
వేడు కలరఁగ నీసుచరితము•వీనులకు విన నింపు గాఁ
బాడఁగలిగినవాఁడు పుడమిని•బాతకములను జెందకే
గోడు గుడువక నీదుకరుణను,గూడి సుఖి యగు నెచ్చటన్.

తోటకవృత్తము. హరిరామముకుందద•యాజలధీ, పరమాత్మహయానన•భవ్యగుణా•
మరుదర్చితరంగర•మారమణా, వరవాయనమర్త్యుఁడ•పాపుఁడగున్.

## లయగ్రాహివృత్తము

మేలిమగమీల నగఁ•జాలువగఁ గీలుకొను•వాలుఁగనులీల గల•బాలయురమేలన్
హేల నిలనీలరత•నాలకడియాలు గల•కేలుఁగవ మాలిమిగఁ•గాలుఁదము లొత్తం
గాలఘనజాలహరి•నీలసుతమాలములఁ•గేలికొనఁ జాలురుచి•శాలితను వొప్పన్
లోలవనమాల శుచి,నీల శుభమూల ఫణి•పాలతనుదోల జగ•మేలునినుఁ గంటిన్.

## లయవిభాతివృత్తము

పరమపురుషార్థమగు•పరమపదమిచ్చుటకు పరదనినుమానినను • బరుఁడగువెయెంచన్
నరుఁడు శరణాగతిని,నరవినుత నీచరణ. సరసిజములం దొదువఁ•బరమగతిఁజేరున్

గురుకరుణ నీచరిత•గురుకథలుసారెకును, వరుస రచియింపఁగల•వరకవి సుఖించుఁగా
గురువులకునీవుతొలి•గురుఁడవనిదేశికులు, నిరతివసియింతురఁట•హరినినినుఁజూడఁగా.

శా. ఈరీతిఁగా బహుభంగులం బొగడ రం•గేశుండు హర్షించి య
ద్ధీరున్ నీ విచటన్ వసింపు మని ని•ర్దేశించి యాసూరికిం
జారుశ్రీశఠకోపతీర్థతులసీ•స్రజ్ముఖ్యసన్మానముల్
శ్రీ రంజిల్ల నొసర్ప నచ్చట వసిం•చెన్ వేంకటేశార్యుఁడున్ 89

వ. అయ్యవసరంబున నమ్మహాత్మునకు వేంకటాచార్యుం డనియును దిరువేంగడత్తానయును వేంగడత్తురవా రనియును దిరువేంగడముడయా ననియును ఘంటావతారస్వామి యనియును దూప్పిల్ప్పిళ్ళ యనియును వేంకటనాథుఁ డనియును కవితార్కిక సింహుండనియును సర్వ తంత్ర స్వతంత్రుం డనియును వేదాంతాచార్యుండనియు నిగమాంతాచార్యుం డనియును నిగమాంత దేశికుం డనియును వేదాంత దేశికుం డనియును శ్రుతిశేఖ రాచార్యుండనియు శ్రుత్యంచల గురుం డనియును నిగమమకుటసూరి యనియు నామ్నాయమకుటాచార్యుం డనియు నామ్నాయవ నాళీంద్రుం డనియును శతఘంటాక విసురత్తామణి యనియును ఘటికాసహ స్రసురత్తా మణియనియు ఘటికా సహస్ర కవీంద్రుం డనియు నాచార్య శిఖామణియనియును బరమపావనంబు లగుతిరునామంబులయ్యె నద్దేశికేంద్రు నాశ్రయించిన శ్రీ వైష్ణవులు సుకుమారుండగు నయనాచార్యుండును బ్రహ్మతంత్ర జియ్యరును వెణ్ణకూ్కత్త జియ్యరును బ్రాభాకర జియ్యరును ఘటికాశతకమమ్మా శాచార్యపుత్రుం డగుకొమాండూ రాచ్యాన్ పేరరుళాళప్పయుఁగిడాంబినయ నారాచార్యుండును గుంచపురి రామానుజాచార్యుండును గందాడ యెంబారును దిరుమల నల్లానును గోవిందచక్రవర్తి తీర్థపిళ్ళయు వేదాంతాచార్య భట్టారకుండు నెళయభట్టారకుండును బలవదబాధిత ప్రమాణాను గృహీతతదీయ తర్కధాటిచేఁ బరాజితులై తత్పాద పద్మంబులాశ్రయించి శ్రీ వైష్ణవులైన వారద్వైత సార్వభౌముండును జతుర్వేద పండితుండును విద్వజ్జన సార్వభౌముండును సర్వ విద్యాశిరోమణియు సోమేశ్వర భట్టారకుండునుగా శివాగ్విజయ భట్టారకుండును. మఱియు నిగ్గురువరుండానతిచ్చిన గ్రంథంబులు శ్రీ రహస్యత్రయసారంబును రహస్య పదవియుఁ దత్త్వ పదవియు రహస్యత్రయచుళకంబును దత్త్వ త్రయచుళకంబును రహస్య మాతృకయుఁ దత్త్వమాతృకయుఁ దిరుచిన్నమాలయు నక్కపత్తును హస్తిగిరి మాహాత్మ్యంబును మణిప్రవాళంబు నధికార

సంగ్రహపాట్టును నధికార సంగ్రహ శ్లోకంబును రహస్యంబులు ముప్పది రెండును డోలాగాధయుఁ గంతుకగాథయుఁ గుబేరాక్ష గాధయుఁ గుటికాగాథయుఁ బరిహాస గాధయు నర్థపంచకంబును శరణాగతి శతకంబును యజ్ఞోపవీత ప్రతిష్ఠయు నిజ్యాక్రమంబును మునివాహనభోగంబును సారాసారంబును విరోధి పరిహారంబును బరమపద సోపానంబును దత్త్వరత్నావళియును రహస్య రత్నావళియు రత్నావళీ హృదయంబును సంప్రదాయ పరిశుద్ధియు సంప్రదానశతకంబును అభయ ప్రదానసారంబును నుపకారసంగ్రహంబును బరమతభంగంబును నంజలి వైభవంబును బ్రబంధసారంబును వ్యూహపంచకమును నాహారనేమపాట్టును సంస్కృతం బగునాహారనియమ గ్రంథంబును వైష్ణవేష్టి విలక్షణంబును శ్రీరంగ విమానప్రభావంబును సారార్థచంద్రికయు నానందనిలయవైభవంబును బుణ్యకోటి విమానవైభవంబును జగన్నాథ స్తవంబును నాదినాథస్తవంబును లక్ష్మీనృసింహస్తవంబును దత్త్వత్రయగాధయు శతదూషణియు సర్వార్థసిద్ధియుఁ దత్త్వముక్తాకలాపంబును స్తోత్రభాష్యంబును వాక్యత్రయవివరణంబును న్యాయతిలకంబును న్యాసదశకంబును న్యాసవింశతియు భగవద్ధ్యానసోపానంబును నభీతిస్తవంబును వేంకటేశప్రపత్తియును నిగమపరిమళంబును గీతార్థసంగ్రహరక్షయును సచ్చరిత్రసంగ్రహరక్షయును బాంచరాత్రరక్షయును నిక్షేపరక్షణంబును రహస్యరక్షయు విషయవాక్యదీపికయు హరిదినతిలంబును బారమార్థస్తుతియు దేహళీశస్తుతియు వరదరాజపంచాశతియు శ్రీవేంకటేశస్తవంబును సుదర్శనాష్టకంబును నాహ్నికంబును నచ్యుతశతకంబును నధికరణసారావళియు రహస్యనవనీతంబును దత్త్వనవనీతంబును సారసంక్షేపరహస్యంబును గణ్ణినుణ్ శిరుత్తాంబు వ్యాఖ్యానంబును జంద్రికాఖండంబును న్యాససిద్ధాంజనామూథఁబును దశావతార స్తోత్రంబును మతిస్తవంబును గోదాస్తుతియు శ్రీస్తుతియు యతిరాజసప్తతియు దయాశతకంబును ద్రవిడోపనిషత్సారంబును గరుడపంచాశతియు గరుడ దండకంబును సంకల్పసూర్యోదయంబును న్యాయపరిశుద్ధియు న్యాయసిద్ధాంజనంబును గీతాసారంబును జతుశ్లోకీభాష్యంబును గద్యత్రయభాష్యంబును దత్త్వదీపికయు నద్వైతఖండనంబును దృష్టినిరసనంబును దాత్పర్యచంద్రికయుఁ బాదుకా సహస్రంబును మీమాంసాపాదుకయు మీమాంసాభాష్యంబును యాదవాభ్యుదయంబును వేదార్థసారసంగ్రహ వ్యాఖ్యానంబును హంససందేశంబును హయగ్రీవస్తోత్రంబును గోపాలవింశతియు రఘువీరగద్యయు మణిప్రవాళరూపంబగు నభయప్రదానసారంబును నష్టభుజాష్టకంబును కామాసికానృసింహాష్టకంబును

దీపప్రకాశ స్తవంబును మొదలుగాఁగల ద్రవిడసంస్కృతరూపంబు ల గునసంఖ్యే యగ్రంథంబులు. శ్లో॥ పరశ్శతంవాపి పరస్సహస్రం శ్రీవేఙ్కటాచార్యకృతాః ప్రబన్ధాఃతత్రాలమేకః ఖలుభుక్తిముక్త్యోః కార్త్స్న్యేనకస్తాన్ గణయేత్సమ స్తాన్॥ అనియెడు న్యాయంబున శ్రీవేంకటేశకవిప్రణీత ప్రబంధంబులు పరశ్శతం బులు పరస్సహస్రంబులు నందు భుక్తిముక్తులొసంగుటకు నొకటొకటియే సమ ర్థంబగు నన్నియు గణింపనెవ్వఁడు సమర్థుం డి ట్లనేకమాయావాదివిద్వాంసుల జయించి దర్శనంబు నిర్వహించుచు శ్రీరంగాది దివ్యదేశంబులందు వసియించి కాలక్షేపం బొనర్చు చుండె నద్వైతసార్వభౌమాదిమాయావాదివిద్వాంసుల జయించి వారిని వైష్ణవులనుగా నొనరించినక్రమం బెట్టి దనిన వివరించెద. 90

సీ. అద్వైతసార్వభౌ॰మాఖ్యమాయావాది, భాషించు నొక్కొ॰క • దూషణమున
కాగమాంతాచార్యు॰లార్యులు మెచ్చ నూ॰ఱేసి దూషణముల॰వాసినుడువ
గంగాప్రవాహంబు॰కరణిఁ బెంపారుత,ద్వచ్ఛవ్యవిచిత్రవా॰గ్ధాటిఁ జూచి
యక్కజపడి భయ॰మంది పరాజితుఁ, డై నయమ్మాయి త॰దంఘి కమల

తే. మాశ్రయింపగురూద్వహుఁ॰డాద్విజునకుఁ, బంచసంస్కారముల నాచ॰రించికరుణ
నర్థపంచక మెఱిఁగించి॰యాకృతిత్ర,యంబు బోధించె లోకత్ర॰యంబుమెచ్చ.

సీ. ఆశిష్యమణికి వే॰దాంతియాశ్వా నని, మహిత మౌదాస్యనా॰మం బొనర్చి
రంగుగా నాలాయి॰రప్రబంధంబులు, శ్రీరహస్యత్రయ॰సారముఖ్య
నిఖిలరహస్యముల్ • నిగమాంతయుగ్మము, నాగమాంతాచార్యు • లానతియ్య
నమ్మహాత్మునివల్ల • నట్లు విశేషశా॰స్త్రార్థము లన్నియు • నరసి తెలిసి

తే. సకలసందేహములఁబాసి॰స్వగురుచరణ, కమలముల చెంతవసియించి॰ఘనతమించి
పుడమివేదాంతియాశ్వాను॰భూరియశము,గాంచిశ్రీవైష్ణవాంఘ్రుల॰ర్చించఁగనియె

ఆ. క్షితిని మేలునాఁట॰మతిమంతుఁ డొచతు,ర్వేదపండితుండు • వేదశిఖర
గురుఁ డుపన్యసించు • గురుసప్తకక్ష్యల, కోడి మాఱుయుక్తు • లొసఁగలేక.

తే. దేవ దేవరవారి కం॰తేనివాసి, నైతి నని మ్రొక్కి తత్పద॰మాశ్రయింప
వేంకటేశార్యుఁ డాచతు॰ర్వేదకృతిని, శాస్త్రవిధివైష్ణవునిఁజేసె॰జగతిమెచ్చ.

మ. కమలాక్షాత్ముఁడు వేంకటేశ్వరకవి,క్ష్మాభర్తకక్షాత్రయిన్
క్షమ విద్వజ్జనవంచకున్ గెలిచి య॰జ్ఞానాంధు సర్వేశ్వరా
ఖ్యమతస్థాపకు మూఁడుకక్ష్యలను వ॰క్కాణించి గెల్వంగ వా
రు ముదం బొప్పఁగ నాశ్రయించిరి సుధీ॰రున్ వేంకటాచార్యునిన్.

మ. భువి సోమేశ్వరభట్టనామకుఁడు చెప్పం గత్యు లొక్కొక్కటిన్
చెవగా ముప్పదిరెండుదూషణములన్ ఛేదించు నయ్యార్యు వా
గ్దవుఁ దీతం దని యెంచి యాద్విజుఁడు సద్భక్తిన్ భవాంభోనిధి
ప్లవ మౌతత్పద మాశ్రయించె నిజరూపజ్ఞానసంసిద్ధికై.

శా. ఆకారుణ్యపయోధి సద్గురుఁడు దీవ్యత్పంచసంస్కారముల్
ఆకారత్రయ మర్థపంచకము నెయ్యం బొప్పఁ జేకూర్చి సు
శ్లోక ద్రావిడవేదగుహ్యశ్రుతులన్ జొత్తిల్లుభాష్యద్వయిన్
సాకల్యంబుగఁ జెప్పి యాద్విజున కాచారంబు దెల్పెన్ దయన్.

క. సోమేశ్వరభట్టారకు, రామానుజయోగిరాజరాద్ధాంతాతి
ప్రేమాస్పదచిత్తునిఁగా, నీమాడ్కిని జేసె వేంకటేశగురుఁ డిలన్.

సీ. ధర సర్వతంత్రస్వతంత్రుఁడు వరకవి, తార్కికసింహుం డుదారయశుఁడు
వేదాంతగురుఁ డని విని వేదశాలివా, గ్విజయభట్టాఖ్యుఁ డొవిప్రుఁ డొకఁడు
బహువిధపుస్తకభారసమేతుఁ డై, వచ్చి శ్రీరంగముఁ జొచ్చి యందు
వేంకటాచార్యుల వీక్షించి మీతోడ, వాదాహవము సల్ప వచ్చినాఁడ

తే. ననుచు వాక్రుచ్చిననువిని యమ్మహాత్ముఁ, డింటిమొగివాదివిజయార్థ మంటపమున
నమలముద్రాసనాసీనుఁడై వసించి, వాదితోడుత వేదాంతవాద మొందె.

సీ. చిన్మాత్ర మై నిర్విశేష మై నిర్గుణ, మైనబ్రహ్మము పరమార్థ మితర
మంతయు దబ్బఱ యని నిజమత మతఁ, డుగ్గడించి యనర్గళోపపత్తి
శత ముపనిషదుక్తి జాతసనాథము, తత్సాధనమును నుదాహరింప
వేదాంతగురుఁ డంత విని తదీయ గ్రంథ, మంతయుఁ దప్పక యనువదించి

తే. బలవదుపనిషదుక్తసంభావ్యమైన, బ్రహ్మతర్కసహస్రము పన్యసించి
చిదచిదీశ్వరసత్యత్వసిద్ధిపూర్వ, మతనిమత మంత ఖండించె నవని మెచ్చ. 100

వ. అక్రమం బెట్టి దనిన 101

సీ. సకలప్రమాణముల్ సవిశేషపరములు, నిర్విశేషముఁ జెప్ప నేర వెప్పు
డది గాన నిఖిలహేయప్రత్యనీకక, ల్యాణైకతాననారాయణునకు
శేషభూతము లైన చిదచిత్తు లంగముల్, సర్వముల్ నిత్యముల్ శాశ్వతములు
తద్విశిష్టార్థ బోధకము వేదౌఘంబు, గావునఁ బ్రామాణికంబు నిర్వి

తే. శేషచిన్మాత్ర మెట్లగు•జింత సేయ, నని గురుం డనెనిట్లిర్వు•రలఁతపడక
యేడహోరాత్రములు పోరి•రేకరీతి, జయపరాజయసంజ్ఞాప్ర•సక్తి లేక. 102

సీ. ఏడవరాత్రిని•మూఁడుయామములపై. నరుణోదయమున స•ర్వాత్మకుండు
వేంకటేశ్వరుఁడు శ్రీ•వేంకటాచార్యరూ• పమున నావిప్రుస్వ•ప్నమునఁ దన్నుఁ
బొడసూపి వేంకటే•శుఁడ నేను బుడమి శ్రీ• మదనంతసూరికా•త్మజుఁడ నైతి
నోరి నీయుక్తులం•దొక్కొక్కయుక్తికి, యుక్తులు వేయి నే•నుగ్గడింతుఁ

తే. గాన దేవీమనూపాస్తి•గర్వ ముడుగు. మనివచించి తిరోహితుఁ•డయ్యె నంత
నతఁడు మేల్కాంచియక్కజ•మందివెఱచి•స్నానసంధ్యాదులొనరించి•స్వాంతమునను

ఉ. వేంకటనాథదేశికుఁడు•విష్ణువు గావున నిట్టిసూరితో
నింకఁ బ్రసంగ మేటి కని•యెంచి తదాలయ మొంది యందు ని
ష్పంకత నున్నవాగ్విజయ•భట్టమనీషికి స్వప్నగమ్యుఁ డౌ
వేంకటభర్తభంగిఁ గని•పించె గురుండు ప్రసంగశాలలోన్. 104

శా. ఆవిప్రుండు ప్రసంగశాల నిగమాం•తాచార్యులం జూచి యో
దేవా శిష్యుఁడ నైతి నీ కనుచు న•ర్థిం దత్పదాబ్జద్వయిన్
భావం బొప్ప భజింప నగ్గురుఁడు సం•భావించి యచ్ఛాత్రునిన్
శ్రీ విష్ణుప్రియదాస్యతత్పరునిఁగాఁ•జేసెన్ బుధుల్ మెచ్చఁగాన్. 105

వ. అట్లక్కశివాగ్విజయ భట్టారకుండు తనయెడ సుప్రసన్నుం డగుశ్రీవేదాంతదేశికుని
యనుగ్రహంబువలనఁ బంచసంస్కారంబులు నర్థపంచకంబు నాకారత్రయంబును
లభించినాలాయిర ప్రబంధంబులు శ్రీ రహస్యత్రయసారంబు మొదలుగాఁ గలద్వా
త్రింశద్రహస్యంబులును శ్రీ భాష్యంబు నాలాయిరప్పడియు నధికరించి శ్రీమహా
భాగవత ధర్మంబు లన్నియుం దెలిసి విశేషపరిజ్ఞాన పరిబృంహితాంతః కరణుండై
కృతార్థుండై సుఖం బుండె నయ్యవసరంబున. 106

తే. రంగనాథుని వీడ్కొని•రంగ ముడిగి, దేశికేంద్రుఁడు కంచి కే•తెంచి యందుఁ
గరిగిరీశునిదీపప్ర•కాశికాది, భగవదర్చలు సేవించి•భవన మొందె. 107

వ. అంత. 108

క. వేదాంతార్యుఁడు నిత్యము, వేదాంతవచోవిచార•విలసితమతి యై
మోదించుచుఁ బరవాదుల, వాదముల జయించుచుండె•వరదుఁ డలరఁగాన్.

క. ధర నొకతఱిఁ గజ్జనకుని, తిరువధ్యయనంబునాఁడు•ధృతి వైష్ణవు లీ
గురునింటికిఁ బోవలదని, మఱుఁగున శపథించి రతని•మహిమఁ గనుటకై. 110

క. శపథముఁ జేసిన దెఱుఁగక, స్వపితృశ్రాద్ధమున గురుఁడు • స్వాముల బిలువన్
నెప మిడి రాకుండిరి వా, రపరిమితజ్ఞానజలధి • యార్యుం డటపైన్. 111

మ. సతతంబుం దన కర్చనీయచరణా • బ్జాతున్ హయగ్రీవునిన్
యతిసుత్రాముని శ్రీ శరారిముని న • య్యార్యప్రధానుండు సం
తతశిక్షాస్వర సంపదుల్లసితత • త్తన్నామమంత్రంబుల
న్నుతి భక్తిన్నుడువంగఁ గన్పడిరి వే • దాచార్యు లామూవురున్. 112

సీ. మొగలిపూరేకుల • జిగివాయగలవాఁడు, వాజివక్త్రుఁడు బ్రహ్మ • వాది యొకఁడు
సుప్రసన్నాదిత్య • సుందరశ్రీమూర్తి, ద్రావిడ బ్రహ్మైక • దాత యొకఁడు
పదునాఱువన్నెల • పసిడికాంతులవాఁడు, బ్రహ్మసూత్రార్థత • త్త్వజ్ఞుఁ డొక్కఁ
డమ్మహాత్మకునిచే • నాహూతులై వచ్చి, యర్చితులై శ్రాద్ధ • మనుభవించి

తే. దక్షిణాయుక్త తాంబూల • దానములను, జేసి శ్రీపాదతీర్థము • స్వీకరించి
వారినాద్వారమనిపియ • వార్యభక్తిఁ, బ్రక్రమమొనర్చిచేమోడ్చెఁ • బ్రాజ్ఞమౌళి.

క. అంతట నందఱుఁ గనుఁగొనఁ, నంతర్హితు లైరి వార • లచ్చట నా వే
దాంతా చార్యుల వైభవ, మంతయు వాక్రువ్వఁ దరమె•యహిపతి కైనన్.

స్రగ్ధర. శ్రీవేదాంతార్యుం డంతన్•శ్రితజనవృతుఁడై • శ్రీనిధిన్ రంగనాధున్
సేవింపం బూని కాంచీ • స్థితి విడిచి కడున్ సేమ మొప్పార నేఁగం
ద్రోవం దొక్కూరిమిట్టన్•ద్యుమణి యడఁగ నం•దున్ గురుశ్రాంతి దోఁచం
దా వర్షం బబ్బుకున్నన్•దశిహకమరమిం• దాను బస్తుండె రాత్రిన్. 115

మ. ఒకతైర్వర్ణిక వైష్ణవాలయమునం • దుద్ఘాపితద్వారవే
దిక మృద్వాస్తరణంబుపై గురుఁడు ని • ద్రింపంగ నా యింటి పె
ద్దకలన్ వేంకటభర్త దోఁచి మణి వే • త్రం బెత్తి తర్జించి మా
మక తేజోమయమూర్తి యాసుకవిస • మ్రాణ్మౌళి నీ యింటిలోన్. 116

శా. ఈ మాడ్కి న్నుపవాస మున్నఁ గుశలం • బెట్లబ్బు నీ కంచు నా
శ్రీమంతుడు వచించి కన్పడక వి • చ్చేయన్ గృహస్వామి ని
ద్రామాంద్యంబుఁ దొలంగి తిన్నెపయి వి • ద్యాముద్రితుం డైనని
ష్కాముస్ దేశిక శేషశాయి యగురుం • గస్వామిగాఁ గన్గొనెన్. 117

తే. వెఱచి వేవేగ వత్సము • విడిచి కుడిపి, సాఁడియావును బితికి యా•పాలు వేంక
టేశ గురునకు నర్పించి•యింటి పెద్ద,యారగింపుము మాస్వామి•యనుచు మ్రొక్కి.

క. కృప దళుకొ త్తఁగ దాసుని, యపరాధము లోర్చి కావ, వయ్య మహాత్మా
నెప మొక టిడి మీ తిరుగుట, కపటరహితజనులఁ బ్రోవఁ, గాదె బుధేంద్రా.

ఉ. అప్పుడు తీర్థ మాడి, గురుఁ, డంగములన్ ద్విషడూర్ధ్వపుండ్రముల్
చొప్పడఁ దీర్చి పాలు మధు, సూదన దేవున కార్యపంక్తి కిం
పొప్ప సమర్పణం బొదవి, యుక్తముగా నవి యారగించి యం
దెప్పటియట్లు నిద్ర నొక, యించుక చెందఁ బ్రభాత మేర్పడన్. 120

పద్మనాభ వృత్తము

తా సర్వతంత్ర స్వ,తంత్రుండు మేల్కాంచి,శ్రీ మద్గురు శ్రీని,జిఁతించియంతం
గాసారనీరావ, గాహంబు గావించి, కాల్యక్రియ ల్దీర్చి, కల్యాణదృష్టి
న్నాసాత్త్వికుం జూచి,యర్ఘ్యోక్తులన్నిల్పి,యచ్చోటయల్చేంది,యాయాస్థలంబుల్
వేసారకం దాఁటి,వేవేగ విచ్చేసి,ఖ్యాతుఁ డౌరంగ,విష్ణున్ భజించెన్.

చ. తరుణవయస్కుఁడైన కవి, తార్కిక సింహగురుండు భక్తితో
వరుసగ సంయమీంద్ర శఠ, వైరి ముఖార్యులఁ జూచి మ్రొక్కి యిం
దిరకుఁ బ్రణామ మార్చి జగ, తీసుఖదాయిని రంగశాయినిన్
గురుని హరిన్ భజించి శఠ, కోపముఁ దీర్థము నందెఁ బొందుగాన్. 122

భాస్కర విలసిత వృత్తము

రంగమునను హరిగేహము లెల్లన్, రంగుగఁ గని చని గురుఁ డటమీఁదన్
మంగళ తరకుశ మంజులశయ్యన్, మానితశయనుని రఘువరుఁ గాంచెన్
సంగతచలదళశాఖిశరీరున్, శాంతునిఁ దదనుజు నపట భజించెన్
అంగుగ నిజజనజాతసమేతుం, డార్యుఁడు తిరునగరికిఁ జనుదెంచెన్. 123

వ. అయ్యవసరంబున, 124

సీ. సంశ్రితజనులతో, సకలవాద్యములతో, స్వస్తిఘోషంబుతో సరససురభి
పుష్పమాల్యముల వి, భూషితంబైన శ్రీ, శఠకోప మాసత్త్వ, జలధి కెదురు
గా నాదినాథుఁడు, కరుణతోఁ బనుప న, గ్గురువరుం డాశఠ, కోపమునకుఁ
జాఁగిలఁబడి మ్రొక్కి,స్వకరాబ్జములమోడ్చి, యతినమ్రుఁడై యున్న,నర్చకుండు
తే. మహితశఠకోప కుసుమ దా,మంబులొనగఁ నతడు తలదాల్చి ధన్యోస్మి,యనివచించి
స్వామిశఠకోపసన్నిధి, జనులతోడ, నాదినాథునిసన్నిధి, కరిగి యందు. 125

తే. తామ్రపర్ణీనదీతీర • ధామగతుని, నాదినాథునిఁ గని కొని • యాడి తీర్థ
మాల్య శఠకోశముఖ బహు•మతి లభించి, శ్రీశఠారాతిసన్నిధి•జెందియందు, 126

ఉ. తల్లియుఁ దండ్రియున్ ధనము • దైవతమున్ యువతీసుతాప్తున్
ఎల్లసుఖంబులున్ యతి మ • హీంద్రుని దాసజనాళి కెద్ది సం
పుల్లసముల్లసద్వకుళ • భూషణ మెయ్యది యాశఠారి రం
జిల్లు పదాబ్జయుగ్మము భ • జించి నుతించి సుఖించె నార్యుఁడున్ 127

ఆ. మధురకవులు పుష్ప • మాల్యము తీర్థము, నియ్యఁజేసి వేంక • టేశ గురున
కాదిగురుఁడు వైష్ణ • వాన్వయకూటస్థుఁ, డాశఠారియోగి • యనియె నిట్లు. 128

సీ. ధర సర్వతంత్ర స్వ • తంత్ర మహాబిరు,దంబు నీ కగు శాశ్వ • తంబు వత్స
యతిరాజసిద్ధాంత • మఖిల దేశములందు, వృద్ధిఁ బొందింపుమా • విమలచరిత
యని విధించు శఠారి•యాజ్ఞను శిరసావ,హించి వీడ్కొని వేంక•టేశగురుఁడు
విదితరామానుజ • విజయధ్వజం బన, నల్లనల్లన సంశ్రి • తాళితోడ

తే నరిగి సిరివరమంగల • మనెడు దివ్య, దేశమున దేవనాథు ను • తించి మించి
కూర్మి మీఱఁ దిరుక్కోరుం•గుడికి జరిగి, పంచనంబులఁ గని మ్రొక్కి • ప్రస్తుతించె

ఉ. అంతటఁ దిర్వనంతనగ • రాదిక దివ్యహరిస్థలంబు ల
త్యంతరతిన్ భజించి చని • ధన్వపురంబున విష్ణుచిత్తుఁ ద
త్సంతతి యైన చూడికుడు • తం గని మ్రొక్కి వనాద్రి కేఁగి వే
దాంతగురుండు సుందర భు • జాఖ్య రమాసఖుఁ గాంచి మ్రొక్కెడెన్. 130

స్రగ్విణీవృత్తము

మాలిరుంజోలె న • న్మందిరస్వామికిం, జాలఁగా మంగళా • శాసనం బార్చి దా
సాళితోఁ గంచిక•య్యార్యుఁ డేతెంచి శ్రీ, శాలియా దేవరా•ట్పద్మ మొందె న్మహిన్.

క. తొండరడిప్పొడివాకిటఁ, బండిత మండల విభుండు • ప్రణతుం డై వే
దండ గిరివరము వలగొని, నిండుమతిన్ వరదుదేవి • నిం గన్గొనియెన్. 132

భుజంగ ప్రయాత వృత్తము

భజించెం బెరుందేవి•పాదాంబుజంబుల్, సృజించెం బ్రపంచ ప్ర•సిద్ధ స్తవంబుల్
భుజించెం బ్రసాదాది•భోగ్యంబు లార్యుం, డజాతారియద్దేవి•యాజ్ఞ న్లభించెన్.

ఉ. జ్ఞానివరేణ్యుఁ డంతఁ జని • శారదచంద్రముఖాబ్జు నత్తియూ
రా ననుశౌరినిం గని చి • రంతనతచ్ఛ్రితంబులన్ రస
శ్రీ నిలయోక్తులం బొగడి•శ్రీ శఠకోప పదాంబుముఖ్య స
న్మానముఁ జెంది హస్తిగిరి • నాథు ననాథ సనాథుఁ గన్గొనెన్ 134

## తోటక వృత్తము

కరిశైలముపై ఘన • కాలపయో, ధరమట్లు వెలుంగును • దారు హరిన్
వరదు న్ద్విరదేశ్వర•వైరిహరున్, శరణొంది నుతించెను•సౌమ్యుఁ డటన్. 135

మత్తకోకిల వృత్తము. సన్నుతింపఁ బ్రసన్నుఁ డై కరి • శైలనాథుఁడు నీకు నేఁ
జెన్ను మీఱ సుతుండ నయ్యెద • సిద్ధ మంచు వచించి దా
కొన్న సూరికిఁ దీర్థమున్ శఠ • కోపమున్ సుమదామముల్
అన్నియుం గృపఁజేసి పంచిన • నార్యుఁ డచ్చట వెల్వడెన్. 136

తే. మొదటఁదన్నుఁగటాక్షించి•మోద మొసఁగి, యలరుదీపప్రకాశకు•డాదిగాఁగ
భవకథాష్టాదశస్థాన•పతులఁ జూచి, యమ్మహాత్ముఁడు తిరుపతి•కరుగుదెంచె. 137

వ. ఇట్లగ్గురువరుండు కంచి వెల్వడి తిరువేంగడ యాత్రాతత్పరుఁడై చని చని తిరు
చ్చాణూ రను దివ్యదేశంబున. 138

ఉ. శ్రీకర మౌసువర్ణముఖ • రీతటజుష్టశుకాశ్రమంబునం
బ్రాకటపద్మ పుష్కరిణిఁ • బ్రాజ్ఞుఁడు స్నాన మొనర్చి ద్వాదశాం
గాకలితోర్ధ్వపుండ్రుఁ డయి • యబ్జకర న్నలమేలుమంగ సు
శ్రీకుని వేంకటేశుని భ • జించి చనెన్ వృషభాద్రి చెంతకున్. 139

మ. చెను మీఱం జనుదెంచి శ్రీపురములో • శ్రీతిల్ల గోవింద రా
జును సేవించి తదాజ్ఞ సత్కృతుల న • చ్చోఁ గాంచి విచ్చేసి యా
ర్యన రేంద్రుండు నిజాంఘ్రి సంశ్రితులతో • నాళ్వారితీర్థంబుఁ గ
న్గొని యందున్ మునిఁగెన్ సమంత్రకముగా • గోవిందసంతుష్టిగాన్. 140

శా. కాలార్హక్రియ లాచరించి గురుఁ డా • కాసార తీర్థంబునన్
శైలం బంఘ్రుల మట్టరా దనుచు నా • క్ష్మాధ్రంబుపై కెక్కకే
శ్రీలోలున్ హృదయాబ్జ పీఠములపైఁ • జింతించునద్దివ్య సూ
ర్యాళిన్ శ్రీ శఠజిత్కలిఘ్నముఖము • ఖ్యం బ్రీతితోఁ గన్గొనెన్. 141

తే. నమ్మయాళ్వారిసన్నిధి • నయ మెలర్ప, మోద మలరంగఁ దీర్థ ప్ర•సాదములను
బరమభక్తి లభించి వి • ద్వన్మహేంద్రుఁ, డంజనాద్రియడిప్పడి కరుగుదెంచె.

ఉ. అందు నమస్కరించి గురుఁ • డగ్గిరిపైఁ జనువేళ ముక్తుఁ డా
నందమయాఖ్యలోకమున • నాగమహీట్ఛయనంబుపైఁ జనుం
జందము డెందమందు బలు • సందడి సేయఁగ నేఁగి దివ్య మా
కందముచెంత సంయమి శి • ఖామణిం బొడగాంచి మ్రొక్కెడెన్. 143

వ. తదనంతరంబ. 144

చ. చని కనుమ్రోలఁ గాంచె గురు • చంద్రుఁడు కాంచనగోపురంబులన్
గనకవితర్దులన్ మణివి • కారమహోన్నత సౌధపంక్తులన్
ఘనతరకాలకంఠకల • కంఠశుకాకుల కల్పవృక్షముల్
వినుతయశస్క వైష్ణవుల • వీథుల నాథుని దివ్యగేహమున్. 145

సీ. నిరుపమానంద మై • నిలయవిమాన మ, ట్ల విదూరమునఁ గాంచి • యంజలించి
తిరువీథిఁ దిరిగి య • ద్దేశికుఁ డేతెంచి, స్వామిపుష్కరిణిలో•స్నాన మార్చి
పుండ్రముల్ పండ్రెండు • పొలుపారఁగా దీర్చి, కాలోచితక్రియల్•గారవించి
యచ్చోట శ్రీవరా • హస్వామి నీక్షించి కొనియాడి శ్రీశర • కోప ముఖ్య

తే. బహుమతి లభించి వేంకట • పతినివేశ, బాహ్యమణిమయగోపుర • ద్వారమునను
బసిఁడిగడపకు మ్రొక్కి లో•పలికి జరగి, స్వర్ణ బలిపీఠమున్నచోఁ•జాఁగిమ్రొక్కి.

ఆ. భవ్యరంగమంట • పమునకు జేమోడ్చి, వచ్చి మాల్య ముంచు •వాపికతను
బూఁసరులఁ జేర్చు • శాలలోపాల, బాలుఁజూచి మ్రొక్కెఁ•బ్రాజ్ఞమౌళి. 147

క. నారాయణాఖ్య శిఖరం, బారసి కని మ్రొక్కి షణ్ము • హప్పడికడ నా
ధీరుఁడు ప్రణమిలి మేయాన్, శౌరిని గని మ్రొక్కి పొగడి • చనియెనటపయిన్.

క. మానక తిరుమతపల్లిని, శ్రీనిం గని మ్రొక్కి జరగి • జితకలికలుషం
డానందనిలయనామవి, మానముఁ బొడగాంచిమ్రొక్కె•మాన్యులు మెచ్చన్.

సీ సూత్రవతీశునిఁ • జూచి మ్రొక్కెడి తొట్టి, తీర్థముఁ గ్రోలి య•ద్దేశికుండు
శ్రీభాష్యకారుల • సేవించి నృహరికి, జోహారు సేసి తా•ర్క్ష్యుని భజించి
జయవిజయులకు నం•జలి సేసి లోఁజొచ్చి, రాముని సీతాభి•రాముఁ జూచి
యొప్పు మీఱఁగ మల •యప్పను గని మ్రొక్కి, వేంకటేశునిఁగాంచి•వినుతిసలిపి

తే. తీర్థశరకోపచంద నా • దికములం ద, నంత యతిరాజుతో మల • యప్పఁడాత్మ
ధన్యకళ్యాణమంటప•స్థానమునను, బొసఁగ నొడ్డోలగంబుండె•బుధులుమెచ్చ.

సీ. యతిరాజుతో మల • యప్పఁ డగ్గురునకు, బహుమతి సేయించి • పలికె నిట్లు
జీర్ణశ్రుతప్రకా • శిక నుద్ధరించితి, వని చాల నాహ్లాద • మంది యిప్పు
డనఘ శ్రీ భాష్య సిం • హాసనాధిపతిత్వ, మిచ్చితి మది గాన • యింక నీవ
ధరణి భాష్యప్రవ • ర్తకుఁడవు గమ్మని, యతనిపై నొక పద్య • మానతిచ్చి

తే. చాలబహుమతిఁ గావించి • సాగఁబనుప, నతఁడు దిరుమలదిగివచ్చి•యచటనుండి
తిరువహీంద్రపురమ్మున•కరగియందు, దైవనాయకు సేవించి•తగ నుతించె. 151

వ. ఆ పద్యం బెయ్యది యన్న, శ్లో॥ శ్రీమాన్ వేఙ్కటనాథార్యః కవితార్కికకేసరీ। వేదాన్తాచార్యవర్యోమే సన్నిధత్తాం సదాహృది॥ ఈ శ్లోకంబు సాక్షాద్భగవన్ముఖోదితంబు గావున నుభయ ప్రపన్నుల కాదరణీయం బయ్యె. శ్లో॥ రామానుజదయాపాత్రం జ్ఞానవైరాగ్య భూషణమ్। శ్రీమద్వేఙ్కటనాథార్యం వన్దేవేదాన్త దేశికమ్। అనియెడి యీతని యను వేదాంతి దేశికుని యవతార సమాప్త్యనంతర కాలంబునందుఁ గాలమేఘ యతికల్పితం బయ్యెఁ గావునఁ బ్రపన్న జనైక దేశ నిషేవ్యం బయ్యెనిఁక శ్రుత ప్రకాశికాజీర్ణోద్ధారణక్రమం బెట్టి దనిన యథాశ్రుతంబుగా వివరించెదఁ గూరేశగురుసంతతియు శ్రీపరాశరభట్టారకుననుజుండునగు శ్రీరామపిళ్ళకుం బౌత్రుండును వాగ్విజయ భట్టారకునకుం బుత్రుండునై సుదర్శన భట్టార్యుం డనియు శ్రుత ప్రకాశికాచార్యుండనియుఁ దిరునామంబు గల శ్రీ వేదవ్యాస భట్టారకుండు శ్రీ భాష్యంబునకు శ్రుత ప్రకాశిక యని తిరునామంబు గల షట్త్రింశద్గ్రంథ బంధురం బగు వ్యాఖ్యానం బొక్కటి పట్టుటాకుల లిఖియించి తీర్చి వ్రాయం దలంచుచున్న సమయంబున. 152

మ. ఇరుపార్శ్వంబుల శ్రీధరల్ గొలువఁగా • నీరాబు వేలార్య లా
కరణిం దన్ను భజింప నొక్కపుడు రం • గ స్వామి విచ్చేసి ము
క్కరపై సింగరికోవెలన్ సకల దృ • క్సంతుష్టిఁ గావింప న
త్తఱి సేవించి యొక మ్మహర్షవశ చి • త్తం బొప్పగా నిట్లనెన్. 153

సీ స్వామి యీ వైష్ణవ•సంఘంబుతో నేను, బ్రకృతి బంధముఁ బాసి•పరమపదముఁ
జెంది ని న్నెప్పుడు • సేవింపఁగలనని, యాయమ్మ ప్రపదన • మార్చినంత
నాకస్మికంబుగా • యవనతురుష్కాది, బలము లేతెంచి యా • భాగవతుల
ధర్షింపఁ బూన వే • దవ్యాస భట్టార, కాది మహాత్ము ల • య్యవసరమున

తే. ద్రవిడ సంస్కృత రూపమౌ•దర్శనంబు, వృద్ధిఁబొందింపఁ లోకార్య•వేంకటేశ
దేశికుల వృద్ధబాలక • దేహయుతుల, నుండ నియమింపవారుండి • రొక్కచోట.

సీ. అంత రంగేశుఁ డా • యవనతురుష్కాది, బాధోపధిని భాగ • వతవరులకుఁ
బంద్రెండువేలకు • బరమపదం బిచ్చి, యాసాధ్వి ప్రపదన • మంతఁ జేసె
నంత శ్రీ వేంకటే • శార్యుఁ డభీతిస్త, వం బానతియ్య న • బ్బలయుతులకు
ననపరాధులఁ జంపు • ట న్యాయమని పర, మాత్ముఁడు దెలుప వా•రట్లుదెలిపి

తే. యనపరాధు లనాథులు • నతిభయార్తు, లైనదాసరి బాఁపల • హతి యొనర్చి
యేమి ఫలము లభించెద•మిచటనచట, ననుచు రోసి వధింపక•యరిగిరంత. 155

సీ. అంతఁ గొన్ని దినంబు • లరిగిన పిమ్మట, సాధ్వి సుదర్శనా • చార్యజనని
యే తెంచి శ్రీ వేంక • టేశార్యు నీక్షించి, ప్రాజ్ఞ మత్పుత్రుఁడు శ్రీ•భాష్యమునకు
వ్యాఖ్యయొక్కటి పట్టు • టాకులపై వ్రాసి, తీర్చి వ్రాయకమున్నె • ధీర యిట్టి
యవనాద్యుపప్లవ • వ్యాజముచే మహా, భాగవతులతోడఁ • బరమపదముఁ

తే. గాంచెఁగావున మా యింటి•కడకు వచ్చి, చూచి యా గ్రంధమంతయు•సుష్ఠుపఱచి
వృద్ధిఁ బొందింపుమనిపల్కి•వేశ్మమునకు, నమ్మహాత్మునిఁతోడుక•యరుగుదెంచి.

సీ. భూమిగుప్తము లైన•పుస్తకంబులఁ దెచ్చి, యద్దేశికున కిచ్చి•యాత్మ పౌత్రు
బాలు వేదాచార్య భట్టారకునిఁ జూపి, యితనికి శ్రీభాష్య • మీవె నుడువు
మని యప్పగింప న • య్యార్యుఁ డాయమ్మతో, నట్లొనర్చెద నని • యానతిచ్చెఁ
బ్రథమసూత్రమునకుఁ•బదివేల గ్రంధము, వ్యాఖ్యయొక్కటిముందు•వ్రాసియుంటి

తే. కూరనాథునిసత్త యీ • గురువరేణ్యుఁ, డిమ్మహాత్ముని వ్యాఖ్యపై•నింక నేను
వ్యాఖ్యసేయంగఁ దగదని•యాత్మనెంచి, నిలిపి తన టీకకావ్యాఖ్య•నే గ్రహించె.

సీ. జీర్ణశ్రుతప్రకా•శికఁ గొని గురుఁ డందుఁ, బ్రామాదికంబులఁ•బరిహరించి
చాల విమర్శించి•చక్కఁగా వ్రాయించి, యా గ్రంధమంత భా•ష్యంబుతోడ
భవ్యవేదాచార్య•భట్టరు కెఱిఁగింప, నతఁ డాత్మపుత్ర శి•ష్యాళి కొసఁగెఁ
గాన శ్రీ భాష్య సం•గతి వాదిభీకర, గురునితో వారికి•జరగదయ్యె

తే. జీర్ణమైన శ్రుత ప్రకా • శికను మగిడి, యంచితంబుగ నిట్లుద్ధ • రించుకతన
నవని శ్రీభాష్య సింహాస•నాధి పత్య, మమరెవేదాంత గురునక•వ్యాహతముగ 158

చ. ఇల నలరారున త్తిరు వ • హీంద్ర పురంబున కేఁగి యచ్చటన్
నెలకొను దైవనాయకుని • నిస్తులభక్తి భజించి తద్యశో

విలసిత మౌ_స్తవం బొకటి • వేడ్క వచించి బుధేంద్రచంద్రుఁ డా
స్థలమున నాత్మహ_స్తములఁ • ద్రవ్వె శుభోదకపూర్ణ దీర్ఘికన్. 159

ఉ. ఆసలిలాశయంబుకడ • నద్భుత మౌ తిరునందనాటవిన్
భాసుర పుష్పవృక్షముల • భవ్యము లౌతులసీవనంబులున్
దాసులతోడఁ జేసి సత • తంబు లసత్తుల సీసుగంధనా
నాసుమదామ సంఘములు • నాథున కార్యుఁ డొసంగె నచ్చటన్. 160

శా. ఆలోఁ గొన్ని దినంబు లచ్చటను వే • దాంతార్యుఁ డర్హాంబుగం
గాలంబందు సుగంధి చిత్రసుమనః • కైంకర్యమే చేసి శ్రీ
క్ష్మాలోలుండగు దైవనాయకుని కా • కైంకర్యముల్ సల్పు సు
శ్రీల స్వాముల నిల్పి తాను జని కాం • చిన్ గాంచి యందుండగాన్. 161

వ. అయ్యవసరంబున. 162

క. కోలాహలాహ్వయుం డగు, హాలాహల వైద్యుఁ డొక్కఁ • డత్యుగ్రవిష
వ్యాళములను కొని యగ్గురు, హేళిం బొడగాంచి యతని • కిట్లని పలికెన్. 163

పద్మనాభవృ. నీ సర్వతంత్ర స్వతంత్రత్వ మీమీఁద,నీవీననున్ గెల్చినెగ్గించుకొమ్మా
యోసామి నీవేదశాస్త్రాలుగావీమ,హో గ్రాహులన్నోర్వ మాయంచుఁబల్కన్
ఆసాధుదేవేంద్రుఁ డామాట లాలించి • యాత్మాలయద్వార్బహి ర్వేదియందున్
నీ సర్వశక్తిన్ననహిం జూపురా యంచు • నిర్భీతి మృద్వాసనాసీనుఁడయ్యెన్. 164

వ. అప్పుడు 165

భాస్కర విలసిత వృత్తము

దారుణవిషభుజగంబుల వాఁ డా • ధార్మిక కులసుతుఁ డగలఁగఁ బంపన్
సారెకు ముఖముల సాంద్రవిషాగ్ని • జ్వాలలు దొరుఁగగ జరగి య వెల్లన్
గారుడమణిఁ బొడగాంచిన యట్లా • కల్మషరహితునిఁ గని కనుమోలన్
బీరము దొలఁగి ఫణంబులనేలన్ • వ్రేలఁగఁబడెఁ దమకడిఁది యుడంగన్. 166

స్రగ్విణీ వృత్తము. అంతఁ గోలాహలుం • డాభుజంగాళి వి
భ్రాంతిమై నున్న ధీ • రంబు లౌమంత్రముల్
కాంతగీతాఢ్య నా • గ స్వరం బందు బల్
వింతగా నూఁదుచున్ • వేడ్కతో నాడఁగన్. 167

సుగంధి వృత్తము. మాయదారి యైనవాని • మంత్రశక్తిఁ బాము లా
ప్యాయనంబుఁ జెంది యమ్మ • హాత్ము నగ్గురూద్వహుండన్
డాయలేక ఫూత్క్రియావి • డంబమాత్ర మొంద వాఁ
డాయెడన్ స్వశక్తిఁ జూపి•యార్యమౌళి కోడియున్. 168

మహాస్రగ్ధరా వృత్తము

చని నే వింకన్ మదీయ • స్థలమున మఱియున్ • సర్వమంత్రౌషధంబుల్
గొని తీక్ష్ణక్ష్వేళదంష్ట్రిం • కుశ పరుషమహా • ఘోరదర్వీకరాళిం
జనువొప్పంబట్టి షణ్మా•సములకు మరలన్•స్వామి యేతెంతు నత్యం
బనుచుం గోలాహలుండా•యనఘ గుణనిధి•న్నార్యదేవేంద్రుఁ బల్కెన్.

ఉత్సాహవృత్తము. ఇల మహాత్ముఁ డైనవేంక•టేశసూరిపైనిఁ దాఁ
జలము మీఱఁ బంచుఘోర•సర్పసంఘముల్ కృత
ఘ్నులకుఁ జేయులగ్గులట్లు • కుంఠితంబు లై చెడన్
అలసి వాఁడు దేశ మొందె • నన్యసాధనాప్తికై. 170

సీ. మళయాళమున మణి•మంత్రమహౌషధు, లార్జించి కోలాహ•లాహ్వయుండు
మహదరణ్యములందు•మలయదర్దురసహ్య. పృథ్వీధరములందు•బిలములందు
దారుణదృగ్జ్వాల•దంష్ట్రాగ్రఫూత్కార. జిహ్వావిషంబు లౌ•జిహ్మగములఁ
బట్టి పెట్టెలఁ బెట్టి • బంధించుకొని వచ్చి. కంచియం దొకతోఁట•కడ వసించి

తే. యశుచివేళలఁ గాని యీ•యార్యవరుని, గెలువలేనని తనమదిఁ•దలఁచియంత
నమ్మహాత్మునియభ్యంజ•నావసరముఁ, దెలిసి వాకిటి కేతెంచి•పలికె నిట్లు 171

స్వాగతవృత్తము. కోరి నిన్నుఁగనఁ•గోలాహలుఁడన్, ధీర నేఁడరుగు•దెంచితి నాతో
మాఱుమాటనక•మామకవిద్యన్, బీరమొప్పఁగని•పింపఁగరమ్మా.

తోటకవృత్తము. అనివాఁడనిన•న్వినియాయనఘా•గ్రణితానమొన•ర్చినఁగాని నినుం
గననొల్లనుబొ•మ్మనఁగ్రక్కునవాఁ•డనుకూలుఁడపో•లెనునట్లరిగెన్.

స్రగ్ధరావృత్తము. అంత గ్గోలాహలుండా•యనఘునకొక కీ•డాచరింపంగ నాత్మ
స్వాంతంబం దెంచిగోప్య•స్థలి నొకసరపి•న్వాంశికంబై నక్రోవిం
గాంతం బౌవీరుగ్రోలం•గవికులపతికి•న్గర్భ మొక్కింతనొవ్వం
జింతాక్రాంతుండుగాకా•శ్రితతతికినిటుల్•శ్రీమదార్యుండుపల్కెన్.

భుజంగప్రయాత వృత్తము

అహిగ్రాహికోలాహ•లాఖ్యుండువాఁడా•గ్రహంబొప్పనెందేమి•గావించెనొక్కో
రహస్మీరు వీక్షించి•రండంచు విద్వ•న్మహేంద్రుండు పంపించి•నంబోయిరార్యుల్.

మత్తకోకిలవృత్తము. వానిఁ జూచినవారు సెప్పిన • వైష్ణవాగ్రణి వావియ
జ్ఞానకృత్య మెఱింగి తక్షకుఁ • జయ్యనం బిలిపించి యీ
ప్రమానికంబము దూటుపుచ్చుము • మాంద్య మందకవేగమం
బానతిచ్చిన వాఁడు వేడుక • న ట్లొనర్చినపిమ్మటన్ 176

మానినీవృత్తము. కన్నులమ్రంగలఁ•గంబమురంధ్రము•ఖమ్మునజాఱుద•కమ్మురుఝరుల్
పన్నుగ మేదిని•పైఁ బొరలంగవి•భర్తకుఁ గౌక్షికబాధచెడెన్
బన్నము లొందును•బాఁపడుమజ్జల•పానముచేసని•భావములో
నెన్నుచువచ్చియ•హీంద్రుఁడుసూరిమ•హేంద్రునరోగుర•హింగనియెన్.

కరిబృంహితవృత్తము. తైలమునఁ దలదర్వు లమరఁగ•దాసుఁడనుకృతిఁదట్టఁగాన్
మైలతఱియిదిమంత్రబల మతి•మందమగు గురుమౌళికిన్
హేల నిపుడు జయింతు బు•ధేంద్రుపెలువడి రమ్మనన్
లీల విమతుని లెక్కసేయక • లేచె గురుఁ డరిపీడకై. 178

కవిరాజవిరాజిత వృత్తము

కృతికవితార్కిక•కేసరియింటిమొ•గిన్ విషవైద్యు నొ•గిం గని యా
క్షితి గిఱు లేడు ర•చించి యట న్నొక•చెన్నగుపీరి ర•చించి శుభా
తతమతి శిష్యుఁడు • తైలముచేఁ దలఁ • దట్టుచు నుండఁగఁ • దా నిటకై
చతురతఁ బంపుమి • సర్పకులం బిఁక • జాంగలికాక్షరు•జాల ననన్ 179

వ. అప్పు డమ్మనీషిభాషితంబు లాకర్ణించి విషభిషగ్వరుండు రోషభీషణాకారుండై
యతితీక్ష్ణవిషంబులగు నాశీవిషంబులం బవిచె నంత. 180

శాలినీవృత్తము. పన్నుగనవ్విష•వైద్యుఁడుపంచున•భవ్యములౌ బహు•పన్నగముల్
మున్నుఖరాదిక•మూర్ఖులుశ్రీరఘు•ముఖ్యునెదుర్కొని•మూఢతచే
జన్నగతి న్గురు•చంద్రునిఁగన్గొనఁ•జయ్యన వచ్చి వె•స న్గిఱులం
జెన్నుగ దాపి గ•సిం బుసకొట్టుచుఁ•జిందఱవందఱఁ•జెందిచెడన్.

సీ. గజ్జెలు గల్లని • కాళ్ళ మ్రోయఁగ వ్రేళ్ళ నుచితమణ్యూర్మిక • లుల్లసిల్ల
నడుమున బదనికల్•బెడఁగొంద ముంజేత• ఘననవలోహంపుఁ • గడియమొప్ప

నాత్మబాహుస్థమో•హనపింఛ మసియాడఁ, దిరుమణి నుదుటను • దేజరిల్ల
సిద్ధక్రియలు కొన్ని • శిరమున మెఱయంగ, మళయాళకేరళ•మంత్రములను

తే. రాగయుతముగ నాగస్వ•రమునఁ బాడి, లయదొలంగకనాడుకో•లాహలుండు
పంచబలుపాములొక్కొ•క్కబరిని దాఁటి, మంత్రశక్తినిమరలక•మడిసెనంత.

పృథ్వీవృత్తము. అనేకవిధసర్పసం•హతులు ద్రెళ్ళఁ గోలాహలుం
డనంతరవిధాన మే • మనుచు నాత్మఁ జింతించుచున్
ఘనీభవదుపాయ మొ•క్కటి లభించి ధైర్యస్థితిన్
మనం బలరఁ జేసె న•మ్మనుజు లంద ఱీక్షింపఁగాన్.

సీ. అతిదీర్ఘదేహ మ•త్యంతతీక్ష్ణక్ష్వేళ, మతిబల మతిరోష • మతులశక్తి
గిరినాగ మిది నీదు•గిఱిగీఁత లంటక, కఱమను సాగి నీ•శిరము నిక్క
మనుచునగ్గురునికా•యహితుండికుఁడుపల్క, విడిచియాయహివెను•వెంటమంత్ర
కలితగంభీరనా•గస్వరం బూఁదుచు, నాడుచుఁ జనఁగ న•య్యహివరంబు

తే. గిఱులనంటక నెగసి య•గ్గురునిశిరముఁ, గఱువ గమకించియైదవ•గిఱికి నక్షమ
నైదుశకలములై పడె•నసువు లుడిగి, సకలమనుజులుచూచియా•శ్చర్యమంద.

ఉ. ఆయహితుండికుండు సమ•యాహిలయంబున కార్తిఁ జెందియున్
ఆయనఘప్రభావమున • కద్భుత మొందియు వెండియున్ ధృతిం
బాయక బల్కరండమునఁ • బ్రాణపదంబున నుంచి దాఁచున
త్యాయతవీర్య మల్పతను • వౌనహినిం గనిపించి యిట్లనెన్. 185

చ. ఇది మిడినాగ మియ్యహి బు•ధేంద్ర దవాగ్నిసదృగ్విషంబుఁ బం
చెద నిది నీదుప్రాణములఁ • జేద్పుఱచున్ ధ్రువ మంచుఁ బల్కె దు
ర్మదుఁడు నరేంద్రుఁ డబ్బుధపు•రందరుపాలికిఁ బోవఁ బంచ ని
ర్మదుని గురుం గనెన్ విషపు•మంటలఁ గ్రక్కుచు నాయహీంద్రమున్.

క. గిఱిగిఱికి గణిపెఁడంగము, ధరఁ దెగి పడ నైదుగిఱుల • దాఁటి జరగి యా
యురగం బాఱవగిఱిలో, దిఱదిఱఁ దిరుగంగఁ జూచి • దేశికుఁ డంతన్.

తే. గ్రుక్క ద్రిప్పకవచియించె•గురుఁడు గరుడ, దండకంబంతనాసర్ప•ఘాటియుడిగె
గరుడపంచాశతిస్తుతి•గురువరేణ్యుఁ, డానతియ్యంగ విని పన్న•గాశనుండు.

ఆ. సుప్రసన్నబాల•సూర్యున ట్లందఱ, కన్నుఁగవకు నెదుటఁ • గానఁబడుచు
మింటినుండి వచ్చి•మిడినాగమును గొని, చనియె జనులు గురువి•సంస్తుతింప.

వ. అప్పు డగ్గురుం డాకోలాహలున కిట్లనియె. 190

క. ఈలా బిరుదులు నీ కేఁక, నేలా యివి దొలఁగు మని బుధేంద్రుఁడు పలుకం
జాలావినయం బలరఁగఁ, గోలాహలుఁ డనియె నిట్లు గురుచంద్రునకున్.

సీ. వేంకటేశుండవో విహగేశ్వరుండవో, ఫణిరాజవో మర్త్య భావ మొంది
కనఁబడుచున్నావు గావున మును రామ, సౌమిత్రిరూపి యా శౌరికడకుఁ
జనుదెంచి నాగపాశవ్యథఁ బాపిన,గతి విష్ణురథుఁడు నీ కడకు వచ్చి
మిడినాగమును గొని • మింటిపై కెగసెను, గాన దేవుఁడ వీవు • కలుషరహిత

తే. యుర్వి నీమంత్రశక్తికే • నోడలేదు, గాన బిరుదము లివి నేను మాన నార్య
యనుచువాఁడనవినితీర్థ మాడిగురుఁడు, వానిబహుమతిసేయించి పనిచెఁగృపను.

తరళవృత్తము. కరిగిరీశుఁడు ము న్వరం బిడెఁ • గాన నగ్గురుమౌళికిన్
వరదునంశమునం గుమారుఁడు • వైదికాగ్రణి కంచిలో
నరులు మెచ్చ జనించి శ్రీనయ • నారుదేశిక సంజ్ఞయున్
వరదుఁ డన్తిరునామము న్గని • వాసి కెక్కె మహీస్థలిన్. 193

శా. అంతన్ రంగముఁ జెంచి యందు నిగమాం • తార్యుండు రంగేశునిన్
సంతుష్టిన్ నయనోత్సవం బలర న • శ్రాంతంబు సేవించుచున్
అంతే వాసులకున్ యతీంద్రకృత భా • ష్యార్థం బెఱింగించుచున్
శాంతు ల్మెచ్చ దినంబులన్ జరుపుచున్ • స్వస్థాత్ముఁడై యుండఁగాన్ 194

మ. జగదార్యుం డొకనాఁడు రంగపతియం • చత్సన్నిధిన్ వేంకటే
శ గురుం గన్గొని వేయి శ్లోకములచే • శౌర్యంఘ్రిమాహాత్మ్యమే
తగ నీవే మన మిర్వురం దొకర ము • ద్యత్స్రగ్ధరాముఖ్య వృ
త్తగతిం జెప్పుద మంచుఁ బల్కి విని వే • దాంతాత్మకుం డిట్లనెన్ 195

శా. స్వామీ దేవరవారు శౌరిచరణా • బ్జాత ప్రభావంబు ని
స్సీమోదారగభీర వృత్తములచేఁ • జెన్నొప్ప వర్ణింపుడీ
యీ మీ దాసుఁడు నేర్చుచున్న కరణి • న్శ్రీ రంగరాట్పాదుకా
భూమిం జెందును వేయు పద్యములచేఁ • బొల్పొంద నీరాతిరిన్. 196

ఉ. అంత జగద్గురుండు నిగ • మాంత గురూక్తుల నాలకించి యే
కాంతమునం బ్రభాత సమ • యావధిగా హరిపాద వైభవై
కాంతములైన పద్యముల • నైదుశతంబుల నానతిచ్చె వే
దాంత గురూద్వహుండు నిల • యంబున నిద్దురఁ జెంచె నంతటన్. 197

చ. సరసుఁడు రంగశౌరి తన • సన్నిధిఁ గేశవసూరిరూపియై
త్వరఁ జని నిద్రఁ గొన్న కవి • తార్కిక సింహునిఁ దట్టి లేపి యీ
వఱ కిటు లూర కుండితివి • పశ్చిమరాత్రి ఘటిల్లె నింక నేఁ
ద్వరితముగా లిఖించెద ను • దార వచింపుమి వేయిపద్యముల్. 198

క. అక్కవితార్కికకేసరి, యక్కవిత వచింపఁ గేశ • వార్యుఁడు మూఁడు
మ్మకొక్కలుగడియలో బుధు, లక్కజపడఁ బాదుకా స•హస్రము వ్రాసెన్. 199

తే. అంతఁ గేశవార్యుఁ•డంతర్హితుండైన, నార్యుఁడితఁడు స్వామి•యనుచుఁ దెలిసి
విస్మయంబుఁ జెంది • వేవేగ కావేరిఁ, దీర్థమాడఁ జనియెఁ•దెలివిమించ.

మహాస్రగ్ధరా వృత్తము

చని తీర్థం బాడి యచ్చో•సమయభగవదా•జ్ఞావిధుల్ సేసి యంతః
ఘనుఁ డామ్నాయాంతసూర్య•గ్రణి భువనగురు•క్ష్మాపతిం జూచి సాష్టాం
గనతిం గావించి యాలో•కగురునకు సమ•గ్రప్రబంధంబుఁ జూపం
గొని యాలోకార్యుండుః గ•న్గొని తనమదినం•కోచ మొక్కింత చెందెన్.

ఉ. అంతఁ దదింగింత బెఱిఁగి • యా శ్రుతిశేఖరదేశికుండు శ్రీ
కాంతునిపాదుకాద్వయము • కారికుమారకుఁ డయ్యె నగ్గురు
స్వాంత మెఱింగినట్టి గురు•చంద్రుఁ డితం డఖిలార్థవేది యీ
శాంతుఁడు సంతసించుటకుఁ • జాఁగిలిమ్రొక్కెద నంచు మ్రొక్కెడెన్.

వ. అట్లు సాష్టాంగదండప్రణామం బాచరించి, శ్లో॥ సూతే సూకరయువతి స్సుత శత మత్యన్తదుర్భగం ఝటితి।కరిణీ చిరాయసూతే సకలమహీపాలలాలితం కలభమ్॥ అనియెడి శ్లోకముఖంబున మహాత్మా సూకరయువతి యత్యంతగర్భ నిర్భాగ్యం బగుసుతశతం బతిశీఘ్రంబుగ నీనును గరితరుణి పంచ్రెండుహాయనంబులు గర్భంబు ధరియించి సకలభూపాలలాలనీయం బగుకలభంబుఁ గాంచుఁ గావున నవిచారితరమణీయం బగు మదుక్తపాదుకాసహస్రంబు విధిశివసనకాది మహాయోగీంద్రులకైన ధ్యానంబున కతిదూరంబయిన భగవత్పదారవిందయుగళంబు విషయంబుగా మీచే నానతియ్యంబడినవరసాలంక్రియాలంకృతంబై మృదుమధుర గంభీరపదగుంభితంబై మహోదారార్థ పరిపూర్ణంబై సమస్త సుశ్లోకశ్లాఘనీయంబై పంచశతశ్లోకఘటితం బగు ప్రబంధంబుతో సాటి యగునే యని మగిడి సాష్టాంగంబుగ సేవించిన జగద్గురుండును నమ్మహాత్మునిభాగవతనిష్ఠకు విస్మయం

బుఁ జెంది పరితుష్టాంతరంగుండై గ్రుచ్చి యెత్తి కౌఁగిటఁ జేర్చుకొని వత్సా నీవు రామానుజవిజయధ్వజభూతుండవై తదీయసిద్ధాంతనిర్ధారణ సార్వభౌముం డవై వేయిహాయనంబులు మనుమని యనుగ్రహించి పనుప నవ్వేదాంతాచార్యుం డును నిజనివాసంబునకుం జని సుఖం బుండె నంత. 263

మ. ధనకాంక్షన్ మును విప్రు లిద్ద రలవిద్యారణ్యులం జూచి వ
చ్చినకార్యం బెఱిఁగింప నాద్విజుఁడు వాసిన్ వేంకటేశార్యుఁ డన్
ధనవంతుం డతిదాత కంచిఁ గలఁ డాతం డిచ్చు మీ కీప్సితం
బని పంపం జన వారు గన్గొనిరి వేదాంతార్యు నాకంచిలోన్.

చ. కని నిగమాంతదేశికుని గౌరవ మొప్ప నమస్కరించునా
వినయపరక్షమామరుల వేదశిరోగురుఁ డేమికారణం
బున నిట కేఁగుదెంచితిరి పొ ల్పమరన్ వచియింపుఁ డన్న వ
చ్చినపని వార లున్నగతిఁ జెప్పి రమానుషశక్తిశాలికిన్.

వ. అట్లు గురుపురందరుం డాబ్రాహ్మణులవలనఁ దదాగమనకృత్యం బంతయు నెఱింగి వారి నుద్దేశించి, శ్లో॥ న మే పిత్రార్జితం కిఞ్చి న్నమయాచార్జితంవసు । అస్తి మే హస్తిశైలాగ్రే వస్తుపైతామహంమహత్ ॥ అనియెడి శ్లోకముఖమ్మున విప్రులారా యస్మత్తాతపాదులచే సంపాదితం బైనయర్థంబు మాకులేదు మాచేనార్జితం బగు వసుచయం బైన మాయెడం గానంబడదు పైతామహంబగు మహావస్తు వొక్కటి హస్తిశైలాగ్రంబున మాకుఁ జూపడుచున్నది కావున మీ యభీష్టంబు సిద్ధించు నని పలికి వారి నీప్రొద్దిచ్చట నుండుఁడని వియోగించి మధ్యాహ్నసమయంబునఁ గృతస్నానుండై ద్వాదశోర్ధ్వపుండ్రంబుల ధరియించితత్కాలోచిత శౌరిశాసనంబులఁ జెల్లించి భగవదారాధనంబొనరించి శ్రీహయగ్రీవముఖనిర్గతంబైన పయఃఫేనామృతం బారగించి తచ్ఛేషస్పర్శంబుచేనర్థిభాగామగుణంబుగా లబ్ధం బైన నిస్తుషచణకధాన్యసముదాయంబు హేమింపనాశుద్ధసువర్ణం బంతయు నావిప్రుల కొసంగ వా రత్యంతప్రహృష్టాంతరంగులై యమ్మహాత్మునకు సాష్టాంగప్రణామంబు లాచరించియగ్గురువరునిచే ననుజ్ఞాతులై చని విద్యారణ్యుల సముచితప్రకారంబుగాఁ గనుంగొని యద్ధనం బతనికిం గనిపించి మునీంద్రా నీయనుగ్రహంబుచే నిర్ధనంబు లభించితిమని యతనిం గొనియాడి యదేచ్ఛం జనిరంత విద్యారణ్యుండు విస్మయంబంది వేదాంతాచార్యుండు భగవదంశావతీరుం డని నిశ్చయించి యద్దేశికున కంజలి యొనర్చె నంత మఱి

యొక వాసరంబునందక్షోభ్యమునులకు నా విద్యారణ్యులకును దత్త్వమస్యాద్యు
పనిషద్వాక్యంబు భేదపరం బనియు నభేదపరంబనియును వివాదంబు ప్రసక్తం
బైన నొండొరులు బెండుపడక దండిగాఁ గొండొకదినంబులు గజగ్రహంబులు
పోరినగతి వాక్కలహకేళీకుతూహలాయమానమానసులై బహుప్రకారంబుల
యుక్తిప్రమాణంబు లుపన్యసించుచు జయాపజయంబుల నిర్ణయింపంజాలక
వేదాంతాచార్యుల మాధ్యస్థ్యంబునకు సమ్మతించి తమతమయుక్తిప్రమాణంబు
లన్నియు నమ్మహాత్మునిపాలికి లిఖియించిపంపనయ్యభిజ్ఞశిఖామణియవి యన్నియు
విమర్శించి, శ్లో॥ అసినాతత్త్వమసినాపరజీవప్రభేదినా । విద్యారణ్య మహారణ్య
మక్షోభ్య మునిరచ్ఛినత్॥ అనియెడు శ్లోకముఖంబునఁ బరమాత్మజీవాత్మలకుం
బరస్పరభేదసంపాదకంబగు 'తత్త్వమసి' యనియెడి యతని శితఖడ్గరత్నంబుచే
విద్యారణ్యమహారణ్యం బక్షోభ్యముని ఛేదించెనని వ్రాయించి వారికడ కనుప
వారు వీక్షించి పరస్పరవివాదంబు లుడిగిరి మఱియొక దినంబున గాఢాంధకారవ్యా
ప్తంబైన రాత్రిభాగంబునందు శ్రీవైష్ణవధర్మానభిజ్ఞులగు కొందఱు వైష్ణవులు తదీ
యమహావైభవంబున కసహిష్ణులై ద్వారదేశోర్ధ్వభాగంబునం దుపానహద్వ
యంబు వ్రేలఁగట్టింప భగవత్సేవ యొనర్చి మరలి యేతెంచి నిజమందిరంబుఁ
జొచ్చుసమయంబునఁ దనయుత్తమాంగంబు దగుల నెఱింగి క్షమాసారుండగు
నగ్గురువరుండు శ్లో॥ కర్మావలమ్బకాః కేచిత్కేచిత్ జ్ఞానావలమ్బకాః । వ
యన్తుహరిదాసానాం పాదరక్షావలమ్బకాః॥ అనియెడి శ్లోకముఖమ్మునఁ గొందఱు
భగవదాజ్ఞారూపవిధిచోదితంబై భగవదారాధనరూపంబై యాప్రమాణమహార
హరనుష్ఠీయమానంబైన నిత్యనైమిత్తికాదికర్మంబు మోక్షసాధనంబుగా నవలం
బింతురు కొందఱు సమస్తాజ్ఞాననివర్తకంబైనపరిశుద్ధస్వరూపజ్ఞానము ముక్తిసాధ
నంబుగా నవలంబింతురుదాసులము భగవత్సేవకుల పాదరక్షలపవర్గ నిదానంబు
గా నవలంబించెద మని యనుసంధించె నిట్లు పరిశుద్ధజ్ఞానపరిపూర్ణుండగు శ్రీవేం
కటేశగురుపురందరుండు పూర్వోక్తక్రమంబుగా నాయాకాలంబుల భగవత్సా
క్షాత్కారంబు గలిగి స్వకీయంబైనయమానుషవైభవంబు బయలుపుచ్చి సం
ప్రదాయపరంపరాప్రాప్తంబులైన యుభయవేదాంతంబులు శిష్యముఖంబుగా
ననేకావృత్తులు ప్రవచనం బొనర్చి యొక్కనాఁ డాత్మగతంబున, శ్లో॥ నిర్విష్టం
యతిసార్వభౌమవచసామావృత్తిభి ర్యౌవనం । నిర్ధూతేతరపారతన్త్ర్యనిరయా
నీతాస్సుఖం వాసరాః । అఙ్గీకృత్యసతాంప్రవృత్తిమసతాం గర్వోపినిర్వాపిత ।
శ్శేషాయుష్య విశేషదం పతిదయాదీక్షాముదీక్షామహే॥ అనియెడి శ్లోకముఖంబున

యతిచక్రవర్తి శ్రీసూక్త్యావృత్తులచే యౌవనం బనుభవింపఁబడియె భగవద్భాగవతాచార్యవ్యతిరిక్తజన విషయపారతంత్ర్యనిరయనిరసన పూర్వకంబుగా వాసరంబులు సుఖఁబుగా జరుపఁబడియె నభిజ్ఞుల యాజ్ఞా వచనంబు శిరసావహించి యసత్పురుషులగర్వ నిర్వాపణంబు చేయంబడియె నింక శేషంబగు జీవితకాలంబు శేషిదంపతులయాదీక్ష నీక్షించుచున్న వార మని యానతిచ్చి కొండొక కాలంబు జరిగిన పిమ్మటఁ దిరువవతారం బాదిగా నూటరెండు సంవత్సరంబులు లీలావిభూతి యందు వసియించి సౌమ్యహాయన సూర్యుండు వృశ్చికరాశిని బ్రవేశించిన యొక కార్తిక మాసంబునందుఁ బూర్ణిమాతిథియందు సౌమ్యవాసరంబునఁ గృత్తికా నక్షత్రంబునందు శ్రీరంగధామంబున నిజాచార్యుండగు కిడాంబియప్పిళ్ళా తిరువడిత్తామరలఁ దనమనంబునం దలఁచుచు నెంబెరుమానార్ తిరువడిగళేశరణమనుచు ననుసంధించి వైభవంబు చాలించి శ్రీ వేంకటేశ ఘంటాస్వరూపుండయ్యె నీనూట రెండు సంవత్సరంబులు తిరుమలయందు ఘంట మొరయలేదని పెద్దలానతిత్తురని వాదిభీకరగురుం డస్మదీయజిహ్వాగ్రసింహాసనాసీనుండై బోధించిన క్రమంబుగా విన్నవించితిఁ గావున క్షమాసారులగు శ్రీవైష్ణవు లస్మదీయ సాహసంబు క్షమియింపం దగుదురు. 266

సీ. వేంకటేశార్య శ్రీ • వేదాంతదేశిక, యంజనాద్రీశఘం • టావతార
తతసర్వతంత్ర స్వ • తంత్ర మహా బిరు, దాంకిత శుభవిజ • యధ్వజాఢ్య
యతి సార్వభౌమ సి • ద్ధాంత నిర్ధారణ, చతుర సంశ్రితలోక • శరణచరణ
తరుణాంబురుహ కవి • తార్కిక మత్తమా, తంగకంఠీరవ • ధన్యచరిత

తే. నీదుమాహాత్మ్య మీరీతి • నేర్చినట్టు, లుగ్గడించితి నీ సాహ • సోక్తు లన్ని
ముగ్ధబాలక భాషిత•ములుగఁ దలఁచి, సంతసించుమనోర్వ మో•సద్గుణాఢ్య. 267

వరదాచార్యు లనంబడు నయనారు దేశికుల ప్రభావము

మ. సిరి మీఱ న్నిగమాంత సూరిపదరా • జీవద్వయం బాత్మ హృ
త్సరసీజాతమునందు నిల్పి వరదా • చార్యాఖ్యుఁ దత్పుత్రకున్
వరదాంశు న్నయనారు దేశికుని వి • ద్వత్పుంగవున్ సద్గుణా
కరుఁ జేమోడ్చి తదీయ వైభవము • వక్కాణించెదం బ్రీతితోన్. 268

వ. శ్రీ హస్తిగిరీశాపరావతారంబగు వేదాంత గురుకుమారునకు హస్తి గిరీశుండనియు వరదాచార్యుం డనియు నయనారాచార్యుం డనియుఁ దిరునామంబు లయ్యె నీ మహాత్ముండు నిజ బాల్యదశయం దొక్కనాఁడు తండ్రియగు శ్రీవేదాంతాచార్యుండు

భగవంతుం డగుహయగ్రీవున కారాధనంబొనర్చి యద్దేవదేవ ప్రసాదలబ్ధపయః ఫేనరూపామృతంబుఁ దనకొసంగ నారగించుకతన నిరతిశయనిర్మలజ్ఞాన పరిపూర్ణుం డయ్యె నివ్వరదార్యునకుందండ్రియగు శ్రీవేంకటేశగురుండు పంచసంస్కారంబులను రహస్యత్రయసారంబు మొదలుగాఁ గలసకలరహస్యంబులను దిరువాయి మొళి మొదలగు దివ్యప్రబంధంబులను దద్వ్యాఖ్యానంబులన్నియు శ్రీభాష్య శ్రుతప్రకాశికాదిదర్శన గ్రంథంబు లన్నియుం బ్రసాదించె నిగ్గురు కుమారశేఖరుండును జతుష్షష్టికళాప్రవీణుండై తొండమండలంబు మొదలుగాఁ గల నానాదిగ్దేశంబులకుం జనుదెంచి యాదేశంబులం గల మాయావాదిచార్వాక బౌద్ధాది బాహ్యకుదృష్టుల జయించి యతిరాజ సిద్ధాంత విజయధ్వజుండై యష్టైశ్వర్య భోగసంపన్నుండై ప్రళయకాల ఝంఝూమారుతాచార్యుండని ప్రసిద్ధిఁ గాంచి శ్రీ రంగ ధామంబున కేతెంచి యందు దర్శనప్రవర్తకుండై యున్నసమయంబునఁ దదీయ శ్రీపాదపద్మంబు లాశ్రయించిన దేశికేంద్రు లెవ్వరన్న వివరించెద నష్టదిగ్గజంబులు ప్రతివాది భయంకరమణ్ణా పెరియకందాడయప్ప నెంబెరుమానారప్పా పెరియ శుద్ధ సత్త్వమణ్ణా జియ్యర్నైనారంతప్పా పోళిపాక్కనయనార్ కందాడప్ప నిరుంబికందాడయణ్ణా పెరియ యతిరాజ జియ్యర్ కోవిలళహియమణవాళ దాసర్ పుల్లాణిరామానుజ దాసర్ తిరునగరి శరకోప దాసర్ కణ్ణియనూర్ తిరువేంగడ దాసర్ తిరుక్కోట్టియూరివకుళాభరణ దాసర్ మాలిరుం జోలెయతిరాజ దాసర్ మొదలగు ననేక వైష్ణవులు వారలయందు పోళిప్పాక్కం నయనార్ కందాడయప్పనికి నిరుంబికందాడయణ్ణనునకుఁ బెరియయతిరాజ జియ్యరునకును భోజనపల్లి కృష్ణమాచార్యులకును దిరుక్కణ్ణపురం తిరుమలయ్యగారికి నప్పూర్ణప్పా కుమార దొడ్డయాచార్యులకును వీరల కందఱకును రహస్యత్రయ శ్రీభాష్యభగవద్విషయాది దర్శన గ్రంథంబులన్నియు బహుముఖంబుగాఁ బ్రసాదించె బ్రహ్మతంత్ర స్వతంత్ర జియ్యరు శ్రీపాదంబులు కిడాంబి తిరుమలాచార్యు లాశ్రయించిరి తత్పాదాబ్జంబులు తిరునారాయణపురత్తా యాశ్రయించె నాకిడాంబి తిరుమలయ్యంగారి కాచార్యహృదయాద్యష్టాదశ రహస్యంబులు శ్రీలోక సహోదరుండైన యళహియ మణవాళప్పెరుమాళ్ నయనారాచార్యుం డనుగ్రహించె మఱియు నవశిష్టార్థంబు లాయా సంప్రదాయంబులయందు గ్రహింపఁదగు నిట్లు పెద్దలవలన విన్న క్రమంబుగాఁ బూర్వాచార్య గ్రంథంబులవలనఁ దెలిసినంత వ్రాయంబడి యెక్షమాసారులు దీనవత్సలులు నగు శ్రీ వైష్ణవులీ దాసచేతనునిసాహసం బోర్వందగుదురు మఱియును.

సీ. యతిరాట్పదాబ్జ సం • శ్రితు లగు డెబ్బది, నలువురందు ముడుంబ • నంబి విమల
వత్సవంశామృత • వార్ధిరాకాచంద్రుఁ, డతనికులంబునం • దవతరించి
యణ్ణగా రను వైష్ణ • వాగ్రణి శ్రీనయ, నారు దేశిక పాద • నళినయుగళ
మాశ్రయించి తదద్భు • తానుగ్రహంబుచే, నఖిలసచ్ఛాస్త్రము • లభ్యసించి

తే. కంచియం దమ్మహాత్ముని • కడ వసించు, తఱిని నరసింహమిశ్రుఁడ • ద్వైతిముఖ్యుఁ
డచటి కేతెంచె నవ్వర • దార్యుతోడ, శాస్త్రవాదము సలుప నా • సక్తుఁడగుచు.

సీ. వేగవతీతీర • వితతోపవనమున, బహుపటాటోప • మొప్పంగ వసించి
వాదింప రమ్మని • వరదార్యపాలికిఁ, బ్రతివాది శిష్యులఁ • బనుపఁ జూచి
తన కతివార్ధక • దశ గాన ప్రసం, గము సేయఁగాలము • గా దటంచుఁ
దెలిసి యా నయనారు • దేశికుఁ డాత్మ శి, ష్యుల నిరీక్షింప వా • రూర కున్న

తే. నణ్ణగారమ్మహాత్ముని • యంఘ్రికమల, ములకుఁ జాగిలఁబడి మ్రొక్కి • మోదమలర
స్వామి యడియేని కాజ్ఞ యొ • సంగిరేని, వాది నోడించి జయమొంది • వత్తుననిన.

శా. ఆ వార్తన్ నయనారు దేశికవరుం • డాలించి హర్షంబుతో
నావత్సాన్వయుఁ గౌగిలించుకొని నీ • వస్మత్సమానుండ వై
యావాదిం గని గెల్చి రమ్మనుచు నె • య్యం బొప్పఁగాఁ బంపఁగా
నా విద్వత్ప్రవరుండు వేగ చని యు • ద్యానస్థలిం గన్గొనెన్. 272

వ. అయ్యవసరంబున నరసింహమిశ్రులు తన కంతరంగతముం డగునొకశిష్యు నుద్దే
శించి వత్సా మంత్ర జపంబులు మూడు విధంబులై యుండు మానసంబు నుపాం
శువు వాచికంబు ననియు నందు మానసంబు మానససాక్షాత్కారసాధనంబై
యుండు నుపాంశువశ్యాకర్షణాది ప్రయోగంబులందుఁ బ్రసిద్ధంబు వాచికంబు
మారణోచ్చాటనాది ప్రయోగంబుల కుపయుక్తంబు శబ్దంబు ప్రతిక్షణావస్థాయి
గావున శబ్దాత్మకమంత్రోపాంశువాచక జపంబు లుత్పత్తివినాశ విశిష్టంబులై జాతా
శౌచమృతాశౌచగ్రస్తంబులై నిష్ఫలంబులై చనును గావునఁ బాశమాయాంకుశ
బీజాన్వితాదిమధ్యావసానంబులైన ఫలంబులగునని పురశ్చర్యాచంద్రికాసిద్ధ
నాగార్జునతంత్రాద్యాగమగ్రంథంబులయందు ద్వాత్రింశన్నృసింహంబులు ప్రధానం
బులు-అందు నవనారసింహంబులు శ్రేష్ఠంబులం దానుష్టుభాభిధానమంత్ర రాజంబు
ముఖ్యంబు గావున గురూపదిష్టంబగు నయ్యానుష్టుభంబు పూర్వోక్తోపాంశువాచిక
జపంబులను విడిచి మంత్రదేవ ప్రకాశికోక్త ప్రకారంబుగా గంగా తీరంబునం
దేకాంతస్థలం బాశ్రయించి నియతాహారుండనై పురశ్చర్యాధికారసిద్ధ్యర్థంబు

ద్వాత్రింశత్సహస్ర సంఖ్యాకంబైన మానస జపంబు సేసి పురశ్చర్యాసిద్ధికై ద్వాత్రింశదయుత సంఖ్యాకం బగుమానసజపం బొనర్చి యనంతరంబ ప్రకృతి వియుక్తనిర్మలాత్మ స్వరూపసాక్షాత్కార పూర్వకభగవద్విషయ మానస సాక్షాత్కారహేతు భూతంబగు ద్వాత్రింశల్లక్ష సంఖ్యాకంబగుమానస జపంబుసేసి మంత్ర సిద్ధుండనై బాహ్యపీఠ పూజార్థంబుగా గురుప్రసాదలబ్ధంబగు నీనృసింహ విగ్రహంబు నిత్యం బారాధించుచుఁ గనుగ్రమోలఁ గనకపీఠంబుపై నా విగ్రహంబు నునిచి తదీయముఖారవిందంబు నేత్రోత్సవంబుగా సేవించుచు నెట్టివాదిట్టలనైన సహస్ర ముఖంబుల గ్రంథంబుపన్యసించి జయించుచున్న వాఁడ నప్పగిదిని నిప్పు డొనర్చెదననిపల్కి యొక్కకాంచన పీఠంబుపై నద్దివ్యవిగ్రహంబు నునిచి షోడశోపచారంబులఁ బూజించుచున్న సమయంబున శ్రీవత్సకులాలం కరిష్ణుం డగునిగ్గురుజిష్ణుండు తన కనుమొగిం జూపడ ననాదరపూర్వకంబుగా "ఆ కారో హ్రస్వః" అని పరిహాసోక్తి పలుక నగ్గురుశిఖామణియు నాకారంబు దీర్ఘంబుగాని హ్రస్వంబుగాదని ఛలోక్తిఁ దద్వాక్యంబు ఖండింపమగుడ నా ప్రతివాది "కాపూర్వః" అని గూఢోక్తిఁ బలుక "కాంచీపూర్ణః" అని గంభీరార్థ గుంభితం బుగాఁ బ్రత్యుత్తరం బొసంగి యయ్యనితండు ప్రబలపండితుండు గాని సామాన్యుండు గాఁడని తెలిసి బుధేంద్రా నిర్మాధ్యస్థంబైన ప్రసంగంబు సేయందగదు కావున మీకును మాకు నిద్దేవుండు సాక్షిభావం బొనర్చు నిద్దేవుని ముఖారవిందం బీక్షించుచుఁ బ్రసంగం బొనర్చెద నిద్దివ్య విగ్రహంబునకుఁ బశ్చాద్భాగంబుననుండి మీరు మాకుఁ బ్రత్యుత్తరంబుఁ జెప్పుచున్న సమయంబున నిద్దేవుండు మీ కభిముఖుం డాయెనేని మీరు నన్ను జయించిన వారలగుదురని ప్రతిజ్ఞ యొనర్చ నాయర్థంబున కమ్మహాత్ముండు సమ్మతించె నప్పు డా నృసింహమిశ్రుం డగ్గురు పురందరు నుద్దేశించి నిర్విశేషచిన్మాత్రంబగు బ్రహ్మంబు పరమార్థంబగును దదతిరిక్తం బంతయు మిథ్యాభూతం బాబ్రహ్మంబు నిర్గుణంబనిస్వ సిద్ధాంతంబుఁ దెలిపి తత్సాధనభూత ప్రమాణసహకృతంబైన తర్కసహస్రం బుపన్యసింప నా దేశికేంద్రుం డా గ్రంథం బంతయు ననాయాసంబుగా ననువదించి యా ప్రతివాది నుద్దేశించి ప్రత్యక్షాది ప్రమాణంబులన్నియు విశిష్టార్థగ్రాహకంబులుగావున నిర్విశేషంబు ప్రమాణంబు గాదని పలికి నిర్గుణవాక్యంబులన్నియు హేయగుణరాహిత్య పరంబులుగా సాధించి యద్వైతశ్రుతులన్నియు విశిష్టాద్వైతపరంబులుగా సమర్థించి నారాయణుండు పరమతత్త్వంబు దేవతిర్యఙ్మనుష్యస్థావరాదిభేద భిన్నం బగు చేత నాచేత నాత్మక పరిదృశ్య మాన ప్రపంచం బంతయుఁ దచ్ఛరీరంబని

బలవత్ప్రమాణ సహకృత బ్రహ్మతర్కసహస్రోపన్యాసంబుచే నిశ్చయింప నద్దేవదేవుం దమ్మహాత్మని కభిముఖుండయ్యె నప్పు డా ప్రతివాదియు మిగులవిస్మయంబుఁ జెంది యమ్మహానుభావుండు భగవదవతార విశేషంబుగాని మనుష్యమాత్రుండు గాఁడని తన మది నిశ్చయించుకొని సాష్టాంగ ప్రణామపూర్వకంబుగా నా భగవద్విగ్రహం బగ్గురు శిరోమణి కర్పించె నంత నద్దేశికేంద్రుండు విజయలక్ష్మీసమేతుండై యద్దివ్య విగ్రహంబు గైకొని నిజాచార్య సన్నిధికేతెంచినం జూచి యన్నయనాచార్యుండును బ్రహృష్టాంతరంగుడై తనకుం బ్రణామం బాచరించి ప్రహ్వుండై యంజలి రచియించి యున్న యబ్బుధపుంగవుని గాఢాలింగం బొనర్చి శిరంబు మూర్కొని ప్రతివాది భయంకరనే యణ్ణనే యని సంబోధించిన చిరకాలంబు దర్శనస్థాపకుండవై యుండుమని యనుగ్రహించుటంజేసి యణ్ణగారు ప్రతివాది భయంకరుండని యన్వర్థనామంబుగలవాడయ్యె నిప్పటికైనఁ దదీయాన్వవాయులందఱు తన్నామాంకితులైరి పిమ్మట నద్దేశికేంద్రుం డా నయనారాచార్యవర్యుని తిరువవతార సమాప్త్యనంతరంబు కొండొక కాలంబక్కాంచీపురంబునందు వసియించి స్వప్న సాక్షాత్కృతహస్తిగిరీశాను శాసనంబున శ్రీమణవాళమహామునుల నాశ్రయించి తత్సన్నిధిముప్పత్తారాయిరప్పడి మొదలుగాఁ గల స్వరూప గ్రంథంబులన్నియు నధికరించి తదనుగ్రహంబుచే వీధి యారవరు వారని తిరునామంబుగల బాలగోపాల విగ్రహంబుఁ దమకుం దిరువారాధనోపయుక్తంబుగా లభియించి తదవతారసమాప్త్యనంతర కాలంబునఁ గొన్ని దినంబులు శ్రీరంగధామంబునం దుండి మగిడి కాంచీపురంబున కేతెంచి నిజమందిరంబునం దుభయవేదాంత కాలక్షేపం బొనర్చుచు సుఖంబుగా నుండె నంత నొకరాత్రి యందుఁ జతుర్థయామంబున. 273

సీ. అంజనపుంజమో•హరినీలశైలమో, యనఁ జాలునీలకా•యంబువాఁడు
సజలమేఘమునందు•శంపాలతికఁబోలెఁ, గలిమిచేడియ బోరఁ•గలుగువాఁడు
కరుణారసముఁ జిల్కు•కనుదోయి గలవాఁడు, మందస్మితాస్యప•ద్మంబువాఁడు
పంచాయుధస్ఫుర•ద్బాహుశాఖలవాఁడు, రత్నకిరీటశి•రంబువాఁడు

తే. కనకగౌరాంబరము మొల•గలుగువాడు, కలితమణిభూషణాఖిలాం•గములవాఁడు
పురుషపుంగవుఁ డొక్కఁడా•గురువరునకుఁ, గనులఁ గనఁబడియొక వార్త•యని
[యెనిట్లు.

మత్తకోకిల. వాదిభీకర సూరిసత్తమ•వత్సవంశవిభూషణా
నాదునామము వేంకటాచల•నాథుఁ డండ్రు బుధుల్ మహి—

ఆదరంబుగ విన్ను మత్పురి•కార్య పిల్వఁగ వచ్చితిన్
మోద మొప్పఁగ వచ్చి శ్రీపురి•ముఖ్యవృత్తి వసింపుమా. 275

మ. అని స్వప్నంబునఁ బల్కి వేంకటవిభుం•డంతర్హితుం డైనఁ జ
య్యన మేల్కాంచి తదుక్తులం దలఁచుచున్•హర్షించి తీర్థావగా
హనసంధ్యాదు లొనర్చి శ్రీవరదరా•జానుజ్ఞచే శ్రీపురం
బునకున్ వాదిభయంకరార్యుఁడు సతీ•పుత్రాదియుక్తిం జనెన్. 276

ఉ. చని చని గృధ్రపుష్కరిణి•సన్నిధి రత్నగృహంబునన్ మహేం
ద్రనుతపదాంబుజున్ విజయ•రాఘవు లక్ష్మణజానకీయుతుం
గని వినుతించి సర్వశుభ•కారణముల్ శరకోపతీర్థముల్
గొని చని యమ్మహాత్ముఁ డను•కూలురతో ఘటికాద్రిఁ గన్గొనెన్ 277

ఉ. అంబరచుంబిచిత్రశిఖ•రాంచిత మౌఘటికాచలంబుపై
నంబరచారసిద్ధనిల•యంబుకొలంది వెలుంగురత్నరు
గ్డంబరహేమమందిరముఁ•గాంచి నమస్కృతిఁ జేసి యందు ది
వ్యం బగుకాంచనాసనము•నందు నృసింహగురున్ గనుంగొనెన్. 278

శా. శ్రీ లక్ష్మీయుతు యోగిరాజహృదయా•చింతస్వభావున్ జగ
జ్జాలోత్పత్త్యవనాదిలీలుఁ దులసీ•సౌరభ్యవత్పుష్పమా
లాలంకారభుజాంతరాళు సుగుణౌ•ఘావాలు శ్రీమర్త్యశా
ర్దూలుం జూచె గురూద్వహుండు మది సం•తోషంబు నిండారఁగన్. 279

క. పరవాదిభీకరార్యుఁడు, సరసము లగుతీర్థమాల్య•శరకోపము లా
దర మొప్పఁ గొని వృషాద్రికి, జరిగెన్ దేవీసుతాది•సహితుం డగుచున్. 280

తే. అట్లు ఘటికాద్రినరహరి•యాజ్ఞఁ బడసి, మార్గమధ్యమునందుగ్రా•మములగిరుల
నగమృగాకీర్ణవనముల•నదులఁ జూచి, సంతసించుచునేతెంచె•సద్గురుండు. 281

మ. కనియెన్ వత్సకులామృతాంబునిధిరా•కాచంద్రుఁ డద్దేశికుం
డనఘప్రాంశువిచిత్రధాతుయుతదీ•వ్యద్రత్నకూటావలో
కననిర్వాపితసర్వలోకకలుష•గ్రావంబు బ్రహ్మాదిదే
వనిషేవ్యంబు సుఖైకతానమును భా•స్వద్వేంకటాద్రీంద్రమున్. 282

శా. ఆలాతాపిపురంబుచెంతఁ గనియె•న్నావాదిభీకృద్గురుం
డాలోలభ్రమరానుభూతమకరం•దాంభోజపాళిం దరం

గాళీలోలమరాళకోకబకభ,వ్యారామముం గూలజ
వ్యాలోలద్రుమచిత్రపత్రిరుత మా,నంబాసరోరత్నముఁ. 283

పద్మనాభవృత్తము

గోదాసతిఁ గూడి క్రీడించునాతిల్లి,గోవిందరాజాఖ్యుఁ డౌస్వామి కిఁగా
నాదివ్యకాసారతీరంబున న్వైష్ణ,వాగ్రేసరుల్ సేయుపుష్పద్రుమాళిన్
ఆదూరదర్శీంద్రుఁ డీక్షించి హర్షించి,యాపుష్కరిణ్యచ్ఛతోయంబులందుఁ
యాదోగణశ్రేణి మోదింప నీరాడి,యర్ఘ్యక్రియల్ సేసి యచ్చోఁ వసింపన్.

వ. అప్పుడు. 285

సీ. అంజానాద్రీశుని,యాజ్ఞచేఁ గోవెల. యధికారి యతుల నే,కాంతజనుల
నాచార్యపురుషుల,నర్చకపరిచార, కప్రభృత్యచ్యుత,కార్యపరులఁ
దోడుక యమ్మహా,త్మునికడ కేతేర. నయ్యార్యుఁ డీక్షించి,హర్షమొంది
యతుల కేకాంతుల,కాచార్యపురుషుల. కఖిలభాగవతుల,కధికభక్తిఁ

తే. ప్రణుతిఁ గావించి వారలఁ,బ్రస్తుతించి. యాసనార్ఘ్యాదివిధులెల్ల,నాచరించి
స్వామికైంకర్యములయందు,సేమ మరసి. సంతసించెను,వారితో,స్వాంతమలర.

క. కోవెలయధికారియు వా. రావాదిభయంకరార్యు,నభియుక్తతముఁ
గోవిందరాజుకడకును. భావ మలరఁ దోడితెచ్చు,పగిది వచింతున్. 287

సీ. గజరాజవరదుని,గరుడధ్వజాంక మౌ. గజరత్న మొకటి య,గ్రమున నరుగఁ
బంచమహావాద్య,పటహకాహళశంఖ. ధీరభేరీధ్వనుల్, పెసల నెఱయ
శ్రావ్యవీణావేణు,సరసగీతరవంబు. వినువారిచెవులకు,విందు సేయఁ
బరవాదిభీకర,గురుపురందరుఁ డంత. నయ్యార్యవరులతో,నచటఁ గదలి

తే. యల్లఢిల్లీశ్వరున కల్లుఁ,డైనహరికి. జనకుఁ డైనట్టిసంయమి,చక్రవర్తి
తిల్లగోవిందరాజున,కిల్లు తొల్లి. యెందుఁ గాని చె నప్పుడి,కేఁగుదెంచె. 288

శా. ప్రాంచద్రత్నశిలాకలాపకలిత,ప్రాసాదసౌధాదులఁ
మించఁ రంజిలురాజవీధులను ధ,ర్మిష్ఠప్రజల్ దన్ను సే
వింపన్ వారి ననుగ్రహించుచును న,వ్వీధుల్ గటాక్షించుచుం
గాంచెఁ సన్నిధివీథి నార్యుఁడు సుధా,గారంబులం బ్రీతితోన్. 289

వసంతతిలకవృత్తము. శ్రీవాదిభీతికరసూరివ,రేణ్యుఁ డంతఁ
సేవించె సోమరవిమండల,శేఖరంబున్

దేవాదిదేవనిలయాంగణ•దేశవర్తిన్
గోవిందరాజమణికాంచన•గోపురంబుల. 290

క. గోపురముకడకు శ్రీశఠ, కోపం బామ్నాయవాద్య•ఘోషముతోడన్
శ్రీపురనాథునియర్చకు, లేపునఁ గొని వచ్చి రతని•కెదురుగ వేడ్కన్. 291

సీ. పరవాదిభీకర•గురుఁడు సాష్టాంగప్ర, ణామముఁ గాంచి•సేమ మలర
స్వాములసన్నిధి•శఠకోపమాల్యముల్, శిరమున ధరియించి•శ్రీబుధాళిఁ
గూడి యాశ్రీశఠ•కోపసన్నిధిమహో, త్సవపూర్వకంబుగా•జరగి వచ్చి
ఘర్మదోలామంట•పంబులనడుమను, సలిలయంత్రముఁ జూచి•సంతసించి
తే. మహితమణిమయవాహన•మంటపంబు, మాధవీయబహిస్సభా•మంటపములఁ
దప్తతపనీయగోపుర•ద్వారగతుల, వేత్రపాణులఁ జూచుచు•వేడ్కఁ జనియె.

ఆ. పసిఁడిమందిరమునఁ•బరిఢవిల్లుచునున్న, సంయమీంద్రుఁ జూచి•సాఁగిమ్రొక్కి
సంస్తుతించి తత్ప•పాదతీర్థాదుల, సంగ్రహించి జరగె•సద్గురుండు. 292

చ. వరమణిమందిరంబునను•వాసిగ దానులఁ బ్రోవఁ జూపడం
దిరుమలనంబినిం గని వి•ధేయనమస్కృతి సన్నుతించి త
చ్చరణసరోజతీర్థముఁ బ్ర•సాదముఁ గైకొని భవ్యరత్నజు
ట్పురుచిరమందిరంబునను•సూత్రవతీశునిఁ జూచి మ్రొక్కెడెన్. 294

స్రగ్ధరావృత్తము. శ్రీవిష్వక్సేనదేవున్•శ్రితజనవిపుల•క్షేమకృద్వేత్రపాణిన్
భావాతీతప్రభావున్•భవకలుషహరుం•బద్మనాభాప్తమంత్రిన్
భూవిఖ్యాతున్ మహాత్మున్•బొగడి బహుమతిం•బొంది తత్ప్రాంతభూమిం
గావించెన్ మ్రొక్కు ద్వారాం•గణమునవిబుధౌ•ఘంబుతోనార్యుఁడంతన్.

మ. సుర లిచ్చోటికి డిగ్గ నేర్పడుమహా•సోపానమార్గంబొకో
పరమాభ్రంబున కార్య్య లెక్క చనుత•ప్తస్వర్ణ నిశ్రేణియో
గరుడాకారవిశేషమో యనఁ దగున్•గారుత్మతస్తంభ మ
ద్గురుదేవేంద్రుడు చూచి సంతసిలె వై•కుంఠప్రియశ్రేణితోన్. 296

క. మణికృతబలిపీఠముకడఁ, బ్రణమిల్లి గురూద్వహుండు•భవ్యవిపశ్చి
ద్గణనుతగోదానిలయాం, గణభూమిని బ్రణతి సలిపి•కనియెఁ దదంఘ్రుల్.

శా. శ్రీదాష్టాపదవేదిమధ్యగతరా•జీవాసనంబందు స
మ్మోదం బొప్ప వసించి యాశ్రితులకున్•ముఖ్యార్థసంధాత్రి యౌ

గోదాదేవిని విష్ణుచిత్తతనయన్•గోవిందరాజప్రియం
జేదోయిన్ ముకుళించి కాంచి వినుతిం•జెం బ్రాజ్ఞుఁ డార్యాళితోన్. 298

ఆ. భట్టనాథసూరి•పట్టిని భక్తితో, భవ్యసూక్తితతిని•బ్రస్తుతించి
సద్గురుండు తీర్థ•శరకోపమూల్యముల్, చందనాదు లొంది•జరగి వచ్చె. 299

క. తిరుమట్టపళ్ళిలక్ష్మిని, బరవాదిభయంకరార్య•వరుఁ డతిభక్తిన్
హరిదాసులతోఁ బొడగని, సురుచిరముగఁ జాఁగిమ్రొక్కి• స్తుతి యొనరించెన్.

చ. పసిఁడిగృహంబునందు మణి•బద్ధవితర్ది వసించుశ్రీపరాం
కుశపరకాలముఖ్యుల ము•కుందగతాత్ముల దివ్యసూరులన్
వశగతచిత్తుఁ డైనపర•వాదిభయంకరదేశికుండు స
ఖ్యశతముతో భజించి కొని•యాడి యనుగ్రహ మొంది వెల్వడెన్. 301

వ. తదనంతరంబ. 302

సీ. మణికుట్టిమస్థల•మరకతమాణిక్య, శుంభన్మహాస్తంభ•గుంభితంబు
స్ఫాటిక ప్రస్తర•స్ఫారమహాభిత్తి, విలసితబ్రహ్మాది•విగ్రహంబు
సాంద్రవజ్రోపలా•చ్ఛాదితోపరిభాగ, శౌరివాక్పదకీర•శారికంబు
మధ్యభాగస్థచా•మరకరశక్తీద్ధ, ధర్మాధిపీఠవి•తర్దికంబు
తే. భవ్యసంధాయిలోకైక•పావనంబు, స్వామికల్యాణసమయదీ•ప్తగృహంబు
మాధవప్రియకల్యాణ•మంటపంబు, సూరిచంద్రుఁడుగనిమ్రొక్కి•చోద్యమందె.

శా. శ్రీ నారాయణమందిరంబువెనుకన్•శ్రీవైష్ణవశ్రేణితో
నానారత్నవిచిత్రకాంచనవిమా•నశ్రేష్ఠ మీక్షించి య
న్యూనప్రీతి నమస్కరించి చని యా•ర్యుం డొక్కెడం బుష్పమా
లానిర్మాణకృదార్యులన్ గనియె నా•హ్లాదంబు నిండారఁగన్. 304

వసంతతిలకావృత్తము. ఆశాంతరాళము విజాద్వత•యాభ నొప్పన్
వాసిన్ వెలుగుంచుమ లోకశి•వం బొసంగున్
వైశాఖమంటపము దగ్గఱి•పావనోర్వీ
దేశంబునందు గురుఁ డంజలిఁ•దీర్చి మించెన్. 305

క. గారుత్మతమణిమయ మగు, చారుతరాలయమునందు•సవినయుఁ డగుచున్
శౌరికనుమ్రోల నెలకొను, ధీరుని గరుడుని భజించి•దేశికుఁ డంతన్. 306

మ. అపనీతాఖిలదోష మౌమధుజిద,త్యంతప్రియాస్థానమం
టపమధ్యంబునఁ జాఁగి మ్రొక్కి కడువే,డ్కన్ ద్వారపార్శ్వంబుల
న్నపరిచ్ఛిన్నబలున్ జయున్ విజయులన్,హర్షించుచుం జూచి మ్రొ
క్కి పురోభాగమునన్ భజించె సకల,క్లేశాపహున్ శ్రీహరిన్. 307

సీ. అలఁ గాచిననాఁటి,యలఁత యంతఁ దొలంగఁ, గానలఁ బడినపె,న్గాపెసెడఁగఁ
బాండవదూత యై,పరువెత్తుశ్రమ దీఱ, గజగక్ష కేతెంచు,కష్ట ముడుగ
నాత్మకుక్షిజగంబు,లదురకుండ టకు నై, దక్షిణబాహూప,ధానుఁ డగుచు
సిరియు భూదేవియుఁ,జరణాంబుజము లొత్త, ఫణిరాజశయ్యపైఁ,బవ్వళించి

తే. యోగనిద్రాభిసక్తిచే,నున్నవానిఁ, దిల్లగోవిందరాజును,దేవదేవుఁ
జూడ్కి లలరంగ సేవించి,సూరివరుఁడు, భక్తి నంజలి గావించి,ప్రస్తుతించి

సీ. హరి సుప్రసన్నుఁ డై,యమ్మహాత్మునియను, గ్రహదృష్టి నీక్షించి,గారవించి
తిరువాలవట్టము, తీర్థము తిరుమాల, శఠకోప నుభయ హ, స్తము ప్రసాద
చందనాదిక మగు, సన్మాన మొనరించి, వీడ్కొల్ప నా బ్రహ్మ, విత్తముండు
కోవెల వెలువడి, గుడియధికారి చూ, పించిన మంచివి, వేశ మంది

తే. యందునివసించియాప్రొద్ద,హర్మ్యఖమున, లేచిగురుపంక్తిఁదలఁచికా,లోచితములఁ
దీర్చి విచ్చేసి యాళ్వారి, తీర్థమునను, జేసె నవగాహ మాశ్రిత,శ్రేణితోడ.

ఆ. ధౌతవస్త్రములను,ధరియించి విమలోర్ధ్వ. పుండ్రములనుదాల్చి,పొలుపు మీఱ
భగవదాజ్ఞ దీర్చి, పరవాదిభీకర, దేశికుండు సరసి, తీరమునను. 310

చ. పదపడి వేంకటేశపద, పద్మములే హృదయాంబుజంబులన్
సదమలయోగధారణల, సంతతముం గని సంతసించు నా
పదుగురు దివ్యసూరులను, భక్తి భజించి నిజాశ్రితాళితోఁ
గదలి రయంబుతో నరిగి, కాంచె వృషాద్రికి నెక్కుపద్ధతిన్. 311

ఆ. అర్చిరాదిదేవ, తాలయావళి మించి, ముక్తుఁ డరుగుమాడ్కి,మోద మలర
మార్గమధ్యకలిత,మంటపగోపుర, శైలములను దాఁటి,చనియె గురుఁడు. 312

మ. అటఁ గాంచెం బరవాదిభీకరగురుం,డత్యంతసౌరభ్యసు
స్ఫుటపుష్పౌఘమరందపానమదసం,జుష్టాళిసన్నాదముం
బటుశాఖాగ్రనిషిక్తకోకిలపిక,భ్రాజత్కలాలాపమున్
జటులాఘఘ్నయతీంద్రభుక్తఫలసం,జాతంబు సచ్ఛూతమున్. 313

ఉ. ఆసహకారశాఖికద•నద్భుతరత్నశిలాగృహంబులో
వాస మొనర్చి దాసుల క•వశ్యము చూపదుసంయమీంద్రునిన్
దాసులతోడ మ్రొక్కిడి ప్ర•దక్షిణపూర్వక మేఁగుదెంచి యా
శ్రీసఖుమందిరాంగణముఁ•జెంది మనీషివరుండు మ్రొక్కెడిన్. 314

తే. రథమువీథులనాలుగు•రంగుమీఁదఁ, దిరిగియేతెంచిస్వామిపు•ష్కరిణియందుఁ
బ్రాజ్ఞుఁడవగాహనముచేసి•భగవదాజ్ఞఁ, దీర్చివారాహదివ్యమం•దిరముఁజొచ్చి.

క. అం దేకకాలసముదిత, సుందరశరదిందుకోటి•సురుచిరమూర్తిన్
వందారుజనమదోరథ, మందారున్ భూవరాహు•మాన్యుఁడు గనియెన్. 316

శా. ఆదేవున్ భజియించి తీర్థశఠకో•పాంచత్ప్రసాదాదులా
మోదం బొప్ప లభించి మించి ఘృణిమ•న్మక్త్రాప్రతీహారల
క్ష్మీదం బౌమణిగోపురంబుగడపం•జేమోడ్చి వత్సాన్వయా
బ్ధ్యాదిత్యుండు గనె న్సవేదితపనీ•యశ్రీధ్వజస్తంభమున్. 317

చ. పృథుమణిబద్ధమైనబలి•పీఠముఁ గాంచి నమస్కరించి సం
ప్రథితమనోజ్ఞరత్నమును•రంగరమేశనివాస మం చిలం
బ్రథ గలమంటపంబునకు•భక్తిఁ బ్రణామము సేసి మించి శ్రీ
మధురిపుమాల్యమందిరము•మాన్యుఁడు గన్గొని మ్రొక్కెఁ బ్రీతితోన్. 318

తే. వేణునాదవినోదుని•విహితగోప, బాలలీలునిఁ గని మ్రొక్కి•ప్రస్తుతించి
పుష్పమాల్యములను జేర్చు•పుణ్యనిధుల, నందుఁబొడగాంచిచేమోడ్చె•నార్యవ [రుఁడు.

క. శౌరితిరుమాలబావికి, సూరివరుఁడు కేలు మోడ్చి•శుభకర మగుశ్రీ
నారాయణాద్రిశిఖరం, బారసి కని ప్రణతిచేసి•యవ్వలకుఁ జనెన్. 320

సీ. మాణిక్యమయ మగు•మంటపంబొక్కటి, యందుఁగళ్యాణవా•ద్యములుకొన్ని
శౌరిపద్యంబులఁ•జదివెడురత్నపం, జరమధ్యగతకీర•శారికలను
ధర్మదేవతనిజ•దర్శనంబున కిట్లు, విలసిల్లె ననఁ దగు•వృషభపతిని
దర్శనీయవిచిత్ర•ధన్యమృగంబుల, విరచితాంజలిభక్తి•విగ్రహములఁ

తే. జూచుచుఁ సంతసించుచుఁ•జోద్యపడుచు, వచ్చిచాంపేయదేహళీ•ద్వారవరము
గడచియేతెంచికాంచె నా•గారగతుని, ఘనునమేయునమేయాఖ్యుఁ•గాంచిగురుఁడు.

శా. సూర్యగ్రేసరుఁ డమ్మురాంతకునకుం•జోహారు గావించి స
ర్వార్యశ్లాఘ్యమహానసస్థరమకున్•హస్తాబ్జముల్ మోడ్చి శ్రీ

హర్మ్యస్థానము పెండ్లిమంటపము భాం•డాగారముల్ సంతతై
శ్వర్యద్యోతకభూషణాలయము లం•చద్భక్తితోఁ గన్గొనెన్ 322

క. ఆనందనిలయనామవి, మానం బీక్షించి మ్రొక్కి•మాన్యులతో స
న్మానితపరిమళవస్తు, స్థానంబుల కంజలించి•సద్గురుఁడు చనెన్ 323

మ. వరమాణిక్యసువర్ణవేశ్మమున వి•ష్వక్సేను నీక్షించి య
గ్గురువర్యుండు నమస్కరించి చని వై•కుంఠాభిషేకామృతో
త్కరరూపం బగుతొట్టితీర్థజల ము•ద్యత్పాణి యన్ద్రోణి నా
దరపూర్వంబుగఁ గ్రోలి కాంచెను యతీం•ద్రశ్రీపదాంభోజముల్. 324

తే. భాష్యకారులసన్నిధిఁ•బ్రణతి సేసి, దాశరథ్యాఖ్యపాదుకల్•దల ధరించి
సురభితీర్థముఁ గైకొని•జరగియోగ, నారసింహునిఁ గని మ్రొక్కె•సూరివరుఁడు.

క. మరకతమణిమందిరమునఁ, దిరముగ నెలకొన్న పెరియ•తిరువడినయనా
రురుగతి జితసర్పోరగ, వరుఁ దగుగరుడుండు చూడఁ•బడియె గురునిచేన్. 326

మ. అమలశ్రీముఖమంటపంబునడుమన్•సాష్టాంగదండప్రణా
మముఁ గావించి సుమేరుసారపరభీ•ష్మత్విడ్గదాపాణులన్
ద్యుమణీంద్రప్రతిహారరక్షకుల నెం•తో వేడ్క నీక్షించి త
త్కమనీయాంఘ్రుల కంజలించి నిరవ•ద్యస్వాంతుఁ డాపైఁ జనెన్ 327

వ. అట్లగ్గురుపురందరుండు విలసితవిద్రుమవికాసదేహళీద్వారశాఖాశ్లాఘనీయం బై తప్తహాటకపటుతర కవాటఘటితంబై జయవిజయ సంరక్షితంబగుమధ్యమ కక్ష్యం బతిక్రమించి మహనీయమణికుట్టిమంబును విశంకటస్ఫటి కోపలశకల సంకలితనిజ కాంతికలాపధ గద్ధగాయమానకుడ్య భాగంబును వజ్రవైదూర్యగోమేధిక పుష్యరాగేంద్రనీలాదిరత్న శిలాచ్ఛాదిత విచిత్ర ప్రభాభాసమానో పరిభాగంబునగుమందిర మధ్య రంగంబునఁ బ్రభాత సమయంబునందు సముచితైలానాగర సైంధవజంబీరరస సంయుక్తంబై భవ్యతరగవ్యనవ్యనవనీతకలితంబై సోపదంశంబగుమాత్ర ధధ్యోదనంబును హింగూజీర మరీచిమిశ్రితంబై సద్యోఘృతప్లుతంబగు ముద్గాన్నంబును మాధ్యాహ్నికాలికంబగు రామరాజావసరంబునందు ముద్గసూపాపూపాది భక్షణోపేతంబై కపిత్థకదళీర సామ్లరసభాసుర లేహ్యద్రవ్యాన్వితంబై, రామఠ జీరహరిద్రాసర్షపాదిమిళిత బహువిధతింత్రిణీరసాహోష్యద్రవ్యయుక్తంబైన శాల్యోదనంబును నిక్షురసక్షీర నీరాదిపానీయ ద్రవ్యంబులను రాత్రిపూర్వయా

మంబున మనోహర మోదకాపూపమాష చక్రాతిరసషాడబాది భక్ష్యయుతంబై బహువ్యంజ నోపేతం బగుస్నిగ్ధాన్నంబును మరీచిలవణాదిమిశ్రితంబై ఘృతప్లుతంబైన మిళహోర యనుమహా ప్రసాదంబును సైంధవసర్షపక్షోదామ్లరస సర్పిస్సమన్వితంబై కేళహోహిర యనెడు తిరునామంబుగల దివ్యప్రసాదంబును దిలచూర్ణలవణాజ్యాది సమన్వితంబై పరమభోగ్యంబైన యెళ్లోహిర యనుభవ్యోదనంబును ఘృతప్లుత గుడమిశ్ర పాయసాన్నంబును మణిఘంటికాశత ఘణఘణాయమాన ఘోషణభూషితంబుగా శ్రీ వేంకటేశు భండార స్థలంబు లీక్షించి చేమోడ్చి చనికనక కలధౌతతాల రంధ్రసముల్ల సితమణిదర్పణో దారంబగు ద్వారంబు దాఁటి సుమేరుశిఖరంబునం దిరుగు చుక్కలచక్కని క్రొక్కాఱు మెఱుఁగుదల న్మెఱయునీల నీరదంబుల తెఱంగునఁ దప్తతపనీయ మహోన్నత మణివేదికా మధ్యస్థదివ్యసింహాసనో పర్యుదంచిత కాంచన కమలకర్ణికాతలంబు నందిరుగెలంకులర మాక్షమారమణీ రత్నంబులతో నుల్లసిల్లుచు నిత్యోత్సవపక్షోత్సవమా సోత్సవ పల్లవోత్సవ పవిత్రోత్సవ కల్యాణోత్స వాద్యనేక మహోత్సవంబులు గొనన వధరించుచును మలయప్పఁ డనియును వేంకటత్తుర వారనియును దివ్య నామంబులుగల యుత్సవ భేదంబులను భజించి సీతాలక్ష్మణ సమేతుండగు శ్రీరామభద్రునకు జోహారుసేసి తత్సమీపవర్తులైన యనంతగరుడవిష్వక్సే నాది నిత్య సూరివర్గంబు సేవించి యవ్వేఁకుం జనుదెంచి భగవంతుండగు శ్రీ వేంకటేశుండు రాత్రి దేవీసమేతుండై సుఖంబుగా నిదురించు నవరత్న ఖచితకనక దోలి కాలలామంబున కంజలించి యగ్ర భాగంబునం గుల శేఖరాభి ధానమహార జతవిరాజమాన దేహళీ విశేషంబుఁగడచి గ్రీష్మాత పసంతప్తాధ్వగుం డతిశీతలాంభః పరిపూర్ణ గభీరగాంగ మహాహ్రదంబవగా హించునట్లు శ్రీ వేంకటేశాభిధాన పరబ్రహ్మంబును దాసితదీయదివ్య తేజోమయా మృతమయూఖ సమాప్యాయిత సర్వావయవుండై నిస్సమాభ్యధిక నిఖిలదృఙ్మనోహర నిత్యనిర వద్యసుందర సుకుమార తదీయ దివ్యమంగళమూర్తి దర్శనసముద్భూత మహానందకందళిత హృదయారవిందుండై నీలాద్రి శిఖరసముదిత సహస్రకిరణావరణ బాలభాస్కర మండలంబు పోలిక సురభిగంధ బంధురప్రసూన మాలికావలయ సమలంకృత రమణీయరత్న రంజితహాటకకిరీటంబుచే మెఱయు శిరస్థలంబును శమదుదిత రాకాచంద్ర సుందరవద నారవిందంబును గర్పూర సారవిరచిత ఋజురుచిరచ్ఛి ద్రోర్ధ్వపుండ్ర ఘటిత నిటలతటంబును దీర్ఘతర దివ్యాంజన రేఖాకారసవిభ్రమభ్రూ యుగంబును గమనీయ కాంచనకళి కోపమాన భాసురనాసాపుటంబును

నిజ సౌష్ఠవనిరాకృత శ్రీకారశష్కులీ సౌభాగ్యకర్ణ కలిత మహనీయమణి మనోజ్ఞ మకరకుండల మండితగండ భాగంబును గరుణారసారుణో పాంత కర్ణాంత విశ్రాంత చలన్మిళింద సుందర తత్క్షణోన్మీలిత శారదపుండరీ కాభిరామనయంబులును ప్రవాళపల్లవబింబ ఫలాద్యుపమాతీతర మాక్షమాది దివ్యమహిషీస తతసమాస్వాద్యమా నామృత ధారాధరోష్ఠంబును స్వకీయం బగుకరుణారసంబు దీనానాథ జనావనార్థంబుగా లోనడంగ యుప్పొంగి ముఖద్వారంబుచే నుద్గమించెనో యని యూహింపందగు సుందర మందస్మితంబును ప్రస్ఫురత్సహ స్రారజ్వాలామాలాతి తీవ్రంబై యుగపదుదిత బాలభాస్కరకోటి ప్రభాప్రకాశిత దశదిశావకాశంబై దనుజారిదక్షిణాంసగతంబై నిరస్త నిఖలదేవతా రాతిచక్రంబై యవక్రపరాక్రమంబైన సుదర్శన చక్రంబును వాసుదేవవామాంస సంగతంబై సపకాల సముదిత నిష్కళంకరాకా సుధాకర కోటిభాసమానంబై విష్ణుముఖమారుత పూరణోదిత నిజధ్వనిధ్వస్త దైత్యదాన వాదిదౌర్జన్యంబగు పాంచజన్యాఖ్యశంఖ రాజంబును హిరణ్మయంబై మేరుసమాన సారంబై దేవద్విషదంశనాశనైక ప్రయోజనంబై వైకుంఠవామకరా గ్రాభిస్పృష్టంబగు కౌమోదకీగదా దండంబును రక్షోసురకరినోగ్రకంఠచ్ఛే దక్షరచ్ఛోణిత దిగ్ధధారంబై పద్మాక్షవామేతర పాణిపార్శ్వస్థితంబై యొప్పునందకాభి ధానఖడ్గ రత్నంబును స్వకీయ జ్యానినాద శ్రవణమాత్ర నిర్ధూతనిఖిల దైవతచేతోభీతియై పూర్వగీర్వాణ ప్రాణనిర్వాపణచణ బాణాశని ప్రవర్షణంబగు శార్ఙ్గశరాసనంబును ప్రకటాటోపర జార్భటీ సముద్భట చటులకు టిలకరటిని శాటవికటవిశంకటోరఃక వాటపాటన పటిష్ఠకటితట ఘటితసుస్ఫుట సూర్యకరాకంబును సురభిపరిమళఘుమఘుమాయమాన తులసీదళ మిళితకమల నీలోత్పలవకుళ పాటలీవాం పేయమల్లికామాలతీ జాతీకేత కీకరవీరాదిపుష్ప దామాభిరామంబై వైజయంతీవన మాలాలంకృతంబై సుప్రసన్న సూర్యకోటిసుభగ నిస్తుల కౌస్తుభరమార మణీరత్నరంజితంబై శ్రీవత్స లక్షణలక్షితంబైన వక్షస్థలంబును భావనగ్రీవాశ్రయంబై భాస్వర కార్తస్వరకమలసం కలితంబై శుద్ధ సువర్ణ సూత్రగుభితంబై యాపాదపద్మ ప్రలంబమానంబై యొప్పుసాల గ్రామమాలి కాలలామంబును గల్పక్షయాంతర్ని క్షిప్త జగద్రక్షాదక్ష కుక్షిద్వయంబును హిరణ్యగర్భోద్భవ ప్రభవగభీరావర్తననాభి నాభిపద్మంబును గమనీయ పదాబ్జంబులు సంసార సముద్ర సంతరణైక కారణంబులనియు వీనిని విశ్వసించు ధన్యచేతనులకు విరజామృతంబు కటిదఘ్నం బనియు నుపదేశించుగతిఁ గనిపించు నభయవరద హస్తంబులును దివ్యమౌక్తిక దామో

దర బంధన కాంచన కాంచీగుణ వేష్టిత కటిస్థలంబును బాలార్క ప్రభాభాసమాన పీతాంబరా వృతరంభా స్తంభ శుంభదూరుద్వయంబును మంజుశింజితమణిమంజీర రంజితంబగుకమనీయకాహళకల మగరోప్యుపమానభక్తరక్షణై కత్వరాధురీణ జాను జంఘాంతయుగ్మంబును బహుపాత్పలాశిఫలభారాగ్ర ప్రలోపీపార్ష్ణి యుగంబును గూర్మకుత్సాపాదక ప్రపదభాసురంబును నాతామ్రకోమలాంగుళీ తలలవణిమాచ్ఛురితంబును వియద్వాహినీశంకాక రతిర్యగూర్ధ్వాధః ప్రసృత కాంతికలాపాలంకృత నక్షత్రాకార నఖముకురబింబ భూషితంబును స్థలనలినోదరద్యుతిద్యోతమాన హలకులిశాంకుశ జలజధ్వజచ్ఛత్రచామరాది శుభరేఖాంకిత పదవిలసితంబును నగుతత్క్షణోన్మీలిత శరదరవిందసుందర పాదార విందద్వంద్వంబును నేత్రోత్సవంబుగా సేవించి ప్రహృష్టాంతరంగుండై భట్టనాథ శ్రీసూక్తులచే మంగళా శాసనం బాచరించి బహుభంగులఁ గొనియాడిన సుప్రసన్నుండై భగవంతుండగు శ్రీవేంకటేశుం డమ్మహాత్ముని నిజకటాక్షవీక్షణా మృతదృష్టిం దనిపి తీర్థ శఠకోపంబులమ దిరువాలవట్టంబును శ్రీపాదరేణుచందనా భయహస్త ప్రసాదాదిబహుమతు లన్నియుం జేయించి మహాత్మా నీద్దివ్య దేశంబు నందు శరీరపతన పర్యంతంబు శిష్యపుత్రాదిసహితుండవై మద్గుణాను భవంబు సేయుచు సుఖంబుండు మని యాజ్ఞాపించె నంత నయ్యాచార్య సత్తముండుఁ ధన్యోస్మియని యనుసంధించి యభ్భగవదాజ్ఞ మహాప్రసాదం బని శిరసావహించి యద్దివ్యమందిరంబు వెలువడి వచ్చె నంత. 328

సీ. వేంకటగిరి డిగ్గి • విచ్చేసి యద్దేశికేంద్రుఁ డొక్కెడ వసి • యించె నంత
విని వచ్చి యా బ్రహ్మ • వి త్తముఁ గని మొక్కి, దేశాధిపతి వేంక • టేశు నాజ్ఞ
గోవిందరాజుల • కోవెల సన్నిధి, తిరువీధి శఠకోప • దివ్యసూరి
వర్యుని మందిర • ద్వారాంగణము చెంతఁ, గట్టించి దివ్యద • గార మొకటి

తే. దండి బ్రాహ్మణ పట్టెల•మండియంబు, ననెడు రెండూళ్ళు సర్వాగ్ర•హారములుగ
నమ్మహాత్ముని కర్పింప • నమ్మినీషి. వరుఁడు సకుటుంబుఁడై యందు•వాసమొందె.

మ. అచటన్ వాదిభయంకరాహ్వయుఁడు తపీ • యా రాధనం బాచరిం
పుచు వేదాంత యుగంబు సంశ్రితులకున్ • బోధించుచున్ నిత్యమున్
ఖచరోర్వీచర సేవ్య పాదకమలుం • గంజాక్షు సేవించుచున్
రచియించెం గృప మీఱఁ గొన్ని కృతులం • బ్రాజ్ఞేశభోగ్యంబుగాన్. 330

వ. ఆ ప్రబంధంబు లెవ్వి యన, అష్టశ్లోకీ వ్యాఖ్యానంబును వృద్ధి స్తవంబును సుప్రభాత స్తవంబును మంగళా శాసన ప్రబంధంబును జియ్యరుపడి ననుసరించి యొనర్చిన శ్లోకరూప భగవదారాధన క్రమంబు ననుచు నెఱుంగవలయు మఱియు నొక్క దివసంబునందయ్యాచార్య సత్తముండు వేదాంత కాలక్షేపం బొనరించు సమయం బునఁ గొందఱాశ్రితులు మహాత్మా శ్రీమదేకాదశీ నియమనిర్ణయంబును శ్రీజయంతీ నిర్ణయక్రమంబును ధనుర్మాస హరిపూజా విధానంబును దాసులకుం దెలియ

## ఏకాదశీనిర్ణయము

నానతిండని విన్నవింప నాకర్ణించి యద్దేశికేంద్రుండు వారల నుద్దేశించి ప్రాజ్ఞు లారా "పక్షేపక్షే ఏకాదశ్యాం నయాజయేత్ నతర్పయేత్ నశ్రాద్ధకర్మ కుర్వీత యదిమోహేనకుర్యాత్-సోగ్నిహాన పితృహాన మాతృహాచేతి" అనుచు శతపథ బ్రాహ్మణంబున శుక్ల యజుస్సునందు యాజ్ఞవల్క్యుండు పలికిన క్రమంబుగా నేకాదశియందు యాజనతర్పణశ్రాద్ధకర్మంబు లొనరింపఁగూడదు-మోహవశుఁడై చేసెనేని వాఁ డగ్ని పితృ మాతృహత్యా పాతకుండగు మఱి యీ నేకాదశీ వ్రతంబు నిత్యం బనియుఁ గామ్యం బనియుఁ రెండు విధంబులై యుండు నందు, శ్లో॥ జహ్యాద్భుక్తిద్వయం నిత్యేకామ్యేభుక్తి చతుష్టయం॥ అనియెడు న్యాయ బున నిత్యంబు ద్విభుక్తివర్జంబు-కామ్యంబు చతుర్భుక్తి వర్జంబునందు, శ్లో॥ నిత్యం సదాయావదాయుర్న కదాచి దతిక్రమేత్। నిత్య మేతద్వ్రతం రాజ౯ కర్తవ్యం సార్వవర్ణిమ్। ఉపోష్యైకాదశీ నిత్యం పక్షయోరుభయోరపి॥ అనియెడు వచన ప్రామాణ్యంబున నిత్యవ్రతంబు యావదాయుష్యం బొకప్పుడైన నతిక్రమింపవలదు నిత్యంబైన యావ్రతంబు సకలవర్ణంబులవారు సేయుందగుదురు కావున నుభయ పక్షంబుల నేకాదశియం దుపవాసంబు కర్తవ్యంబు, శ్లో॥ ఏకాదశీ సదా పుణ్యా పక్షయో రుభయోరపి॥ అనియెడు సనత్కుమార వచన ప్రామాణ్యంబున నుభయ పక్షంబులం దేకాదశీవ్రతంబు పరమ పవిత్రంబు, శ్లో॥ ఉపోష్యైకాదశీ రాజ౯ యావదాయు స్సువృత్తిభిః॥ అనియెడి యాగ్నేయ వచనంబుచే సదాచార సంపన్నులగు వారికి యావదాయుష్యం బేకాదశీవ్రతంబు ముపవస్తవ్యంబు, శ్లో॥ ఏకాదశ్యా ముపవసే న్నకదాచి దతిక్రమేత్॥ అనియెడు కాణ్వవచన ప్రామాణ్యం బుచే నేకాదశియం దుపవాసం బవశ్య కర్తవ్యం బొకప్పుడైన నా వ్రతం బతిక్ర మింపందగదు, శ్లో॥ నకరోతిహి యోమూఢ ఏకాదశ్యా ముపోషణమ్। ననరో నరకం యాతి రౌరవం తమసావృతమ్॥ అనియెడు సనత్కుమారవచన ప్రామా

ణ్యంబునం జేసి మాహాత్మ్యం డెవ్వండేని యేకాదశియం దుపవాసంబు సేయకుండు-వాఁ డంధకార పరివృతం బగు రౌరవం బను నరకంబునం బడు నింకఁ గామ్య వ్రతం బెట్టి దనిన వివరించెద. శ్లో॥ య ఇచ్ఛేద్విష్ణుసాయుజ్యం సుతం సమ్పద మాత్మనః। ఏకాదశ్యాం న భుఞ్జీత పక్షయోరుభయోరపి॥ అనుచు వైష్ణవ రహస్యంబునం జెప్పంబడిన క్రమంబుగా నెవ్వఁడేవి తనకు విష్ణుసాయుజ్యంబును బుత్రాది సకలసంపదల నిచ్ఛయించు వాఁ డుభయ పక్షంబులయం దేకాదశినాఁడు భుజియింప నర్హుండు గాఁడు—శ్లో॥ చతస్రో ఘటికాః ప్రాతరరుణోదయ ఉచ్యతే। యతీనాం స్నానకాలమస్తు గంగామ్బుసదృశః స్మృతః॥ అనియెడు భవిష్యత్పురాణోక్త క్రమంబుగా మఱియును "సప్తపంచారుణోదయః" అనియుస్మృత్యంతర వచనంబుచేఁ జతుర్ఘటికావశిష్టా పరరాత్రంబైనను ఘటికాత్రయావశిష్ట పశ్చిమ రాత్రం బైన నరుణోదయసంజ్ఞితం బగు నది యతులకుఁ బ్రసిద్ధం బగుస్నానకాలం బక్కాలంబునఁ జేయునదీతటాకాద్యవగాహనంబు గంగాస్నానసదృశంబు. శ్లో॥ దశమీవేధసంయుక్తో యదిస్యా దరుణోదయః। నైవోపోష్యం వైష్ణవేన తద్దినైకాదశీవ్రతమ్॥ అరుణోదయవేళాయాం దశమీ యది దృశ్యతే। సా విద్ధైకాదశీ నామ త్యాజ్యా విష్ణుపరాయణైః॥ అనియెడిస్మృత్యంతరవచన ప్రామాణ్యంబుచే నరుణోదయంబున దశమీవేధాక్రాంతం బాయెనేని యాయేకాదశి విద్ధైకాదశి యనంబడు వైష్ణవు లాతిథియం.దుపవసింపక మఱునాఁ డుపవాసంబు చేయఁదగు నరుణోదయవేధరహితంబగు శుద్ధైకాదశీతిథి చతుర్విధం బై యుండు నెట్లన వివరించెద నధికైకాదశి యనియు నధికద్వాదశి యనియు నుభయాధిక యనియు నవమీసంయుక్తసుపూర్వతిథి యనియును జతుర్విధంబు లగునీతిథులయం దేకాదశీవాసరంబు శుద్ధంబైనను నాతిథిఁ బరిత్యజించి ద్వాదశియం దుపవాసంబుఁ జేసి మఱునాఁడు పారణ గావింపవలయు. శ్లో॥ సంపూర్ణైకాదశీ యత్ర ద్వాదశీ వృద్ధిగామినీ। ద్వాదశ్యాముపవస్తవ్య స్త్రయోదశ్యాంతు పారణమ్॥ అనియెడు నారదోక్తక్రమంబుగా నేకాదశీతిథి సంపూర్ణంబైననుద్వాదశి వృద్ధిని జెందెనేని విష్ణుపరాయణుండు ద్వాదశియం దుపవసించి త్రయోదశియందుఁ బారణసేయవలయు. శ్లో॥ ఏకాదశీ యదా లుప్తా పరతో ద్వాదశీ భవేత్। ఉపోష్యా ద్వాదశీ తత్ర యదీచ్ఛేత్పరమాం గతిమ్॥ అనియెడు వ్యాసోక్తక్రమంబుగా నేకాదశికి లోపంబు చూపడి ద్వాదశి మిగిలియుండెనేని వైష్ణవుండు ద్వాదశియం-

దుపవసించి మఱుదినంబు పారణం బాచరించవలయు. శ్లో॥ సంపూర్ణైకాదశీ యత్ర ప్రభాతే పునరేవ సా। సర్వైరేవోత్తరాకార్యా పరతోద్వాదశీ యది॥ అని నారదోక్తక్రమంబుగా నేకాదశితిథి సంపూర్ణం బైన నుపటిదినంబున వించుకైన మిగిలియున్నను ద్వాదశియునట్టిదైనను ద్వాదశియం దుపవసించి త్రయోదశియందుఁ బారణం బాచరింపవలయు.– శ్లో॥ యే కుర్వన్తి మహీపాల శ్రాద్ధమేకాదశీదినే। త్రయస్తే నరకం యాన్తి దాతా భోక్తా విధాయకః॥ అనియెడు భాగవతబ్రహ్మకైవర్తాదిపురాణవచనప్రామాణ్యంబున నెవ్వరేని హరివాసరంబున శ్రాద్ధం బొనర్చిన దాతయు భోక్తయు విధాయకుండు నీముువ్వురు నరకంబుఁ జేరుదురు. శ్లో॥ యే ప్రయచ్ఛంతి వై దేవి శ్రాద్ధ మేకాదశీదినే। నష్టాత్మానస్తుతే మూఢాః పతన్తి నరకే ధ్రువమ్॥ అనియెడు పాద్మోక్తిక్రమంబుగా నేకాదశీదినంబునం దేనరులయిన శ్రాద్ధం బొనర్చిరేని నష్టబుద్ధు లగు నమ్మూఢజనులు నరకంబునం బడుదు రీయర్థంబు నిశ్చితంబు.– శ్లో॥ ఏకాదశ్యాం ద్విజశ్రేష్ఠ శ్శ్రాద్ధకర్మ నకారయేత్॥ కుర్యాద్యది స పాపీ స్యాద్భోక్తాచే న్నరకం వ్రజేత్॥ అనియెడు ముద్గలవచనప్రామాణ్యంబున నేకాదశియందు శ్రాద్ధకర్మం బొనర్చినవాఁడు పాపాత్ముం డగును భుజించినవాఁడు నరకంబునం బడు. శ్లో॥ మహాదోషమయం చాన్న మేకాదశ్యాంభవేద్యది। నదాతవ్యం నభోక్తవ్యం నాఘ్రాతవ్యం విశేషతః॥ అనియెడు పరాశరవచనప్రామాణ్యంబుచే నేకాదశియం దన్నంబు మహాదోషమయం బగును గావున నయ్యోదనంబు పితృదేవతల నుద్దేశించి యిడఁగూడదు తాను భుజియింపఁదగదు తదాఘ్రాణం బైన సలుపఁదగదు.– శ్లో॥ ఆద్యశ్రాద్ధం హరిదినే యది కుర్యా ద్విమోహితః। కర్తా ప్రతిగ్రహీతా చాప్యుభౌ నిరయ పాతినౌ॥ అనియెడు భారద్వాజోక్తి ప్రామాణ్యంబున హరిదినంబునం దెవ్వఁడేని విమోహితుండై యాద్యశ్రాద్ధం బొనరించు నాశ్రాద్ధకర్తయుభోక్తయు నీయిరువురు నిరయంబునం బడుదురు. శ్లో॥ అబ్దికం యస్తు కురుతే సంప్రాప్తే హరివాసరే। తచ్ఛ్రాద్ధం రాక్షసై ర్భోజ్యం శ్రాద్ధసిద్ధిర్నవిద్యతే॥ అనియెడు శుక్రవాక్యప్రామాణ్యంబున హరివాసరంబునం దాబ్దికం బెవ్వాఁ డాచరించు నాశ్రాద్ధంబు రాక్షసభోజనంబు గావి పితృభోక్తవ్యంబు గాదు గావున దానికి శ్రాద్ధసిద్ధి గలుగ నేరదు శ్లో॥ ఆద్యశ్రాద్ధం హరిదినే యది స్యాత్తం నకారయేత్। పిణ్డ మేకం ప్రదాయాథద్వాదశ్యాం శ్రాద్ధ మాచరేత్॥ అనియెడు బోధాయనోక్తక్రమంబుగా

శ్రాద్ధంబు హరిదినంబునం దాచరింపఁగూడ దద్దినంబునం దొకపిండంబు దర్భలయం దొసగి ద్వాదశియందు యథాశాస్త్రంబుగా శ్రాద్ధంబు సేయవలయు. శ్లో॥ ఆద్యశ్రాద్ధమపి త్యాజ్యం సంప్రాప్తే హరివాసరే। ప్రాయశ్చి తదాపిణ్డం పరేద్యుశ్శ్రాద్ధ మాచరేత్ ॥ అనియెడు బృహత్పరిచేతోపని ప్రామాణ్యంబునఁ బ్రాప్తం బైనహరిదినంబునం దాద్యశ్రాద్ధం బైనను విడిచి యద్దినంబునఁ గుశ కూర్చమం దొకపిండంబుఁ బెట్టి మఱునాఁ డాశ్రాద్ధకర్మంబు యథావిధిగా నాచ రింపవలయు. శ్లో॥ పితు ర్దశాహమధ్యే వా సంప్రాప్తే హరివాసరే। పిణ్డదానం న కుర్వీత నతిలోదకసత్క్రియామ్। అనియెడు కపిలసంహితోక్తి ప్రకారంబుగాఁ బితృదశాహమధ్యంబున నైనను సంప్రాప్తం బైన హరివాసరంబునందుఁ బిండదానంబును దిలోదకాదిసత్క్రియలును నరుండు సేయరాదు. శ్లో॥ అకృత్వా శ్రాద్ధనియమాన్ జలపిణ్డవివర్జితాః। జలదానవిహీనాశ్చ ప్రణష్టం వైష్ణవం పదమ్॥ అనియెడు రుక్మాంగదచరితోక్తప్రకారంబుగా నాహా శ్రాద్ధదినంబుల నేకాదశి సంప్రాప్తం బాయెనేని యందు శ్రాద్ధనియమంబులు సేయక జలపిండ వివర్జితులై జలదానవిహీనులై వైష్ణవపద ముఁ జేరరు. శ్లో॥ ఆమేనవా హిరణ్యేన శ్రాద్ధ మేకాదశీదినే। కుర్వన్నరక మాప్నోతి యావదాభూతసంప్లవమ్॥ అనియెడు కపిలసంహితోక్త ప్రకారంబుగా నేకాదశియందామ శ్రాద్ధం బైనను హిరణ్యశ్రాద్ధం బైనను జేయువాఁడు ప్రళయపర్యంతంబు నరకమొందుఁడు. శ్లో॥ వై ఖానసాద్యాగమోక్తదీక్షాయుక్తా హి వైష్ణవాః। నైవ కుర్యుర్ధ్యేయ త్సేమ హాపత్తావపి॥ అనియెడు భవిష్యత్పురాణోక్తి ప్రకారంబుగ వైఖానసాద్యా గమోక్తదీక్షాయుక్తు లగువైష్ణవులు మహాపత్తినైన ప్రాణభయంబు నందైన నేకాదశీవ్రతంబు విడువఁగూడదు. శ్లో॥ ... యథాశ్రాద్ధం మృతాహాస్తే విధీయతే। తథైవైకాదశీశ్రాద్ధం ద్వాదశ్యాం ప్రదీయతే॥ అని యెడు ... ప్రామాణ్యంబున మృతదినంబునందు ... ప్రసక్తం బైన శ్రాద్ధంబు హరిదినంబునం ... నా ప్రకా రంబుగా నేకాదశీశ్రాద్ధంబు ద్వాదశియందు విధింపఁబడు. శ్లో॥ యథా శౌచాద్విక్రశ్రాద్ధ మాశౌచాన్తే విధీయతే। తథైవైకాదశీశ్రాద్ధం తత్కుర్యాత్త దనంతరమ్॥ అనియెడు శ్రీపరాశరవచనప్రామాణ్యంబున నాశౌచంబునందుఁ బ్రసక్తం బైనమాసికశ్రాద్ధంబు మఱునాఁడు సేయవలయు. శ్లో॥ యథాశౌచ గతం శ్రాద్ధ మాశౌచాన్తే విధీయతే। తథైవైకాదశీ శ్రాద్ధంద్వాదశ్యామేవ కారయేత్॥ అనియెడు స్మృతిసంగ్రహోక్తక్రమంబుగా నాశౌచగతంబగు శ్రాద్ధం

బాశౌచాంతంబునం దేమాడ్కి విధియింపంబడు నాప్రకారంబుగా నేకాదశీ శ్రాద్ధము ద్వాదశియందు విధియింపంబడు. శ్లో॥ ఆద్యశ్రాద్ధం హరిదినే యది కుర్యాత్ప్రజాతికః। కర్తా ప్రతిగ్రహీతాచా ఉప్యుభౌ నరకగామినౌ॥ అనిభారద్వాజోక్తక్రమంబుగా సద్బ్రాహ్మణుండు హరిదినంబునందుఁ బ్రసక్తం బైన యాద్యశ్రాద్ధం బొనర్చెనేని కర్తృభోక్తలిరువురు నరకంబునం జేరుదురు. శ్లో॥ ఆబ్దికం యోహి కురుతే సంప్రాప్తే హరివాసరే। తచ్ఛ్రాద్ధ మాసురైర్భుక్తం శ్రాద్ధకర్మ వివర్జయేత్॥ అనియెడు భారద్వాజ వచనాంతర ప్రామాణ్యంబున సంప్రాప్తం బగుహరివాసరంబునం దాబ్దికం బెవ్వఁ డాచరించుఁ దచ్ఛ్రాద్ధం బాసుర భుక్తంబు గాని పితృభుక్తంబు గాదు గావున నాప్రొద్దు శ్రాద్ధంబు వర్జింపవలయు. శ్లో॥ ద్వాదశ్యా ముపవాసశ్చే చ్ఛ్రాద్ధం తత్ర వివర్జయేత్॥ పరేహని చ కర్తవ్యం తచ్చాశౌచాంతవత్ స్మృతమ్॥ అనియెడు బృహత్ప్రచేతో వచనప్రామాణ్యంబున ద్వాదశియం దుపవాసవ్రతంబు సంభవించెనేనియా శౌచమధ్యశ్రాద్ధం బాశౌచాంతంబునందుఁ జేయుచందంబున ద్వాదశియందు శ్రాద్ధంబు వర్జించి మఱునాఁడు సేయవలయు. శ్లో॥ ఏకాదశీం పరిత్యజ్య ద్వాదశ్యామేవ వైష్ణవః। కుర్యాచ్ఛ్రాద్ధాదికం కర్మ ప్రత్యబ్దంపద్మసంభవ॥ అనియెడు పాద్మసంహితావచన ప్రామాణ్యంబున వైష్ణవుఁడు ప్రతిసంవత్సరంబునం దేకాదశియందుఁ బ్రసక్తం బైన శ్రాద్ధంబు విడిచి ద్వాదశియందుఁ జేయవలయు. శ్లో॥ గ్రస్తాస్తమిత ఆదిత్యే యథా శ్రాద్ధం పరేహని। తథైవై కాదశీ శ్రాద్ధం ద్వాదశ్యామేవ కారయేత్॥ అనియెడు స్మృతిసంగ్రహవచనప్రామాణ్యంబున నాదిత్యుండు గ్రస్తాస్తమితుం డైన దినంబునందుఁ బ్రాప్తం బైన శ్రాద్ధకర్మం బేరీతి మఱునాఁడు నట్లేకాదశీశ్రాద్ధంబు ద్వాదశియందుఁ జేయవలయు. శ్లో॥ ప్రదక్షిణ మనువ్రజ్య భుఞ్జీత పితృసేవితమ్। శ్రాద్ధం కృత్వాతు యో విప్రోనభుఙ్క్తే పితృసేవితమ్। హరిరేవ నగృహ్ణాతి పితరశ్చ దివౌకసః॥ అనియెడు స్మృత్యంతరవచనప్రామాణ్యంబునం జేసి యాసీమాంతం బనుగమించి ప్రదక్షిణం బొనర్చి పితృశేషం బిష్టజనులతో శ్రాద్ధకర్త భుజింపవలయు నట్లొప్పదేని పితృదేవతలును దేవతలును నాహవిస్సు పరిగ్రహింపరు-శ్రాద్ధకర్మంబు కర్తృభోజనాంతంబు గావునని మంత్రితులభుజింపంజేసి కర్త యుపవసించెనేని యాశ్రాద్ధంబు నిరర్థకంబు—శ్లో॥ ప్రాహ్ణేదన్యాశ్చతస్రస్త్వరుణసముదయస్తత్ర వేధేదశమ్యాః కర్తవ్యో నోపవాసస్సకలమపిఫలం మోహితస్సిపర్యగృహ్ణాత్। పౌరాణిక్యాతు రుక్మాఙ్గదముఖచరితైః ప్రాప్తవత్యా పదవ్యాశుద్ధాం సిద్ధాన్తయన్తః కతిచన కృతిన స్సర్వదోజ్ఝంతివిద్ధామ్॥ అనియెడు స్మృత్యుత్తర

వచన ప్రామాణ్యంబున సూర్యోదయంబుకంటె ఘటికాచతుష్టయప్రమాణపూర్వ కాలం బరుణోదయ సంజ్ఞితం బగు నందు దశమీవేధ గలిగెనేని యా తిథి యందుపవసింపఁగూడదు ఉపవసించెనేని తత్ఫలంబు మోహినీపరిగృహీతంబు గావున నాయుపవాసంబు నిష్ఫలంబగు రుక్మాంగదముఖచరితంబులచే సంప్రాప్తం బగు పౌరాణిక పదవిచేఁ గొందఱు ప్రాజ్ఞులు శుద్ధైకాదశిని సిద్ధాంతం బొనరించుచు.

సకల ప్రాకారంబుల విద్ధైకాదశిని ద్యజించెదరు—శ్లో॥ సంకటే విషమే ప్రాప్తే దాదశ్యాం కారయే త్కథం। అద్భిస్తు పారణం కుర్యా త్పునర్భుక్తం నదోష కృత్॥ అతసీ తులసీ ధాత్రీ ద్వాదశ్యాం యస్యనోదరే। తేన భుక్తం రుదత్యన్నంకి మ్మయాదుష్కృతంకృతమ్॥ అనియెడు స్మృత్యుత్తరవచనద్వయప్రామాణ్యంబున ద్వాదశియందు సంకటవిషమాదికంబు ప్రసక్తం బాయెనేని కాలం బతీతంబు గాకుండ నీరపారణం బాచరించి తదనంతరకాలంబునందుభుజించుటదోషయుక్తం బు గాదు, ద్వాదశియం దతసియుఁ దులసియు ధాత్రియు నెవ్వనికుక్షింబడకుండుఁ దద్భుక్తాన్నంబు నే నేమిపాపంబొనర్చితినో యిట్టిపాపాత్మునికుక్షింబడితినని రోదనంబుసేయు–నిట్టిప్రమాణంబులకును—శ్లో॥ మృతాహ స్సమతి క్రమ్య చణ్డాలః కోటిజన్మసు। మాతాపిత్రోర్మృతదినం పరిత్యజ్య నరాధమః॥ యది కుర్యా దన్యదినే మహత్పాతకమాప్నుయాత్॥ ఇత్యాదివచనంబులకును బరస్పర విరోధం బుదయించుచుండినను నుభయవిధార్ష వచనంబులకుఁ బ్రామాణ్య సంపాదనార్థంబు వ్యవస్థ గల్పింపవలయు నెట్లన్నరుణోదయవేధోదయ వేధలకు వైష్ణవావైష్ణవవిషయవ్యవస్థ గారుడస్కాందపురాణ ప్రసిద్ధ యగుపగిది ద్వాదశ్యే కాదశీశ్రాద్ధకర్తృవ్యతాపరంబు లగుప్రమాణంబులకు వైష్ణవైకదేశావైష్ణవవిష యత్వవ్యవస్థపాద్మసంహితావైఖానససంగ్రహహేమాద్రిధర్మసేతుబంధనపురుషార్థ సుధానిధి సకలసంప్రదాయదీపికాది గ్రంథంబులచే నిర్ణయింపఁబడియెఁ గాన సర్వంబు సమంజసంబగు నిఁక జయంతీనిర్ణయమువర్ణించెదనెట్లన్న—శ్లో॥ అష్ట

## జయంతీనిర్ణయము

మ్యాంవా నవమ్యాంవా దశమ్యాం యదిరోహిణీ। కళామాత్రంతు యత్రాస్తే సాజ యంతీతికీర్తితా॥ అనియెడు వచనప్రామాణ్యంబున నష్టమియందైననవమియం దైనను దశమియందైనను రోహిణీనక్షత్రంబు కళామాత్రంబైన నుండెనేనియా తిథిజయంతి యనంబడు.—శ్లో॥ జయన్త్యాం సర్వయోగేషు ఋక్షమేవవిచక్షతే॥ అనియెడు వచనంబుచే, జయంతియందుఁ దిథివారయోగ కరణాదులకంటె నక్ష

త్రంబు ముఖ్యంబగును—.శ్లో॥ సప్తమీకృత్తికావిద్ధామష్టమీం రోహిణీంత్యజేత్। నవమీ దశమీ గ్రాహ్యా రోహిణీఘటికాయుతా॥ అనియెడు న్యాయంబున సప్తమీ విద్ధయైన యష్టమియుఁ గృత్తికావిద్ధయగు రోహిణి యువర్జించి నవమీతిథియైనను రోహిణీఘటి కానిత్యం బాయెనేని వైష్ణవుం డాతిథి గ్రహింపవలయు— శ్లో॥ ఏకమాసే మునిశ్రేష్ఠయదిఋక్షద్వయం భవేత్। వ్రతోపవాసదా నాదిపరేకార్యం మహత్ఫలం॥ పరేతు రోహిణీనే పూర్వం ఋక్షే సమాచరేత్॥ అన్యథాకారయేద్యస్తురాజారాష్ట్రం వినశ్యతి॥ అనియెడు న్యాయంబున నొక మాసంబునందు నక్షత్రంబులు రెండాయెనేని పరర్క్షంబునం దొనర్చిన వ్రతోపవాసదా నాదికంబు మహాఫలంబగుఁ బరదినంబు రోహిణీహీనం బాయెనేని నక్షత్రయుక్తంబగు పూర్వతిథియందు పవాసాదికం బాచరింపవలయు నెవ్వాఁడైన నట్లొనర్పఁడేని యారాజానారాష్ట్రంబును నశించు—శ్లో॥ ఏకస్మిన్ సింహమాసేతు యదిచే దష్టమీద్వయమ్। పరస్మిన్నేవ కార్యాస్యా జ్జయంతీ యదిరోహిణీ॥ నోచేత్తథా పూర్వతిథిం కారయేద్రోహిణీయుతామ్। ప్రాజాపత్యం చోభయత్రనోచేన్మృగశిరోయుతామ్॥ అష్టమీం నవమీం వాపి జయంతీం కారయే ద్బుధః॥ అనియెడు వచన ప్రామాణ్యంబున నొక సింహమాసంబునం దష్టమీద్వయంబు ప్రసక్తంబాయెనేని రోహిణీయుక్తంబైన పరతిథియందు జయంతి యాచరింపం దగుఁ బరతిథియందు నక్షత్రంబు చూపడదేని రోహిణీయుక్తంబగు పూర్వతిథియందు జయంతి నాచరింపవలయుఁ బూర్వాపరతిథులయందు రోహిణి గన్పడదేని పండితుండు మృగశిరస్సమనిత్వంబైన యష్టమియం దైనను నవమియందైనను జయంతి సేయవలయు —శ్లో॥ సింహయుక్తాష్టమీ గ్రాహ్యా ఋక్షహీనాపివా యది। పరస్మిన్నేవకార్యా స్యాన్మృగేణసహితాష్టమీ॥ అనియెడువచన ప్రామాణ్యంబున సింహయుక్తంబైన యష్టమి గ్రహింపవలయు నాతిథియందు జయంతి సేయవలయు.—శ్లో॥ ఏకస్మిన్నేవ నక్షత్రే యదిఋక్ష్వదయం భవేత్। పూర్వఋక్షం పరిత్యజ్య ఉత్తరేతు సదాచరేత్॥ అనియెడు ప్రామాణ్య వచనంబున నొక్క సంక్రమణంబునందు నక్షత్రంబులు రెండాయెనేని పూర్వఋక్షంబు వర్జించి పరర్క్షం బాచరింపవలయు— శ్లో॥ అష్టమీ రోహిణీయోగో ముహూర్తం వాదివా నిశి। ముఖ్యకాల ఇతిఖ్యాతస్తత్ర జాత స్స్వయం హరిః॥ అనియెడు వచనప్రామాణ్యంబునఁ బగటియందైనను ముహూర్త మాత్రం బష్టమీరోహిణీయోగంబు గలిగెనేని యందు హరి యవతరించెఁ గాన యది ముఖ్యకాలం బనుచుఁ బ్రఖ్యాతమయ్యె —శ్లో॥ మానద్వయేయ స్యలాభో యోగ స్తస్మిన్ దివా నిశి। నవమీరోహిణీయోగః కర్తవ్యోవైష్ణవైర్ద్విజైః॥ అనియెడు వచనప్రామాణ్యంబున శ్రావణభాద్రపద మాసంబుల

యందు దివారాత్రులయం దష్టమీ రోహిణీయోగంబు లేదాయెనేని వైష్ణవులకు నవమీరోహిణీయోగంబు కర్తవ్యంబగు.—శ్లో॥ రాత్రి యోగస్తుబలవాంస్తస్యాం జాతో జనార్దనః॥ అనియెడు న్యాయంబున రాత్రియం దష్టమీరోహిణీ యోగంబు బలవత్తర బునందు జనార్దనుం డవతరించెఁ గావున నాయోగంబు ముఖ్యంబని రంగరామానుజజీయ రంగీకరించె —శ్లో॥ జన్మనక్షత్రఘటికా సంగమస్పృగ్భవేద్యది।వృద్ధౌషష్ఠాదికాః ప్రోక్తాఃక్షయేత్రిస్స మేవతుః॥ ఇత్యాది ప్రామాణ్యంబుచే

## ఆచార్యజన్మ నక్షత్రనిర్ణయము

నాచార్యజన్మ నక్షత్రఘటిక సంగమరాల స్పర్శంబు గలిగి యుండెనేని నక్షత్రవృద్ధియందర్కాలంబున నాఱుగడియలుండవలయు నానక్షత్రంబు క్షయించెనేని యక్కాలంబున ఘటికాత్రయం బుండవలయు నక్షత్రంబునకు క్షయంబు లేక పరిపూర్తి గలిగెనేని యత్తార ఘటికాచతుష్టయం బుండవలయుఁ గావున మఱునాఁడు తిరునక్షత్రంబునిజ వృద్ధియందుఁ బండ్రెండు గడియలు క్షయంబునఁ దొమ్మిదిగడియలు పరిపూర్తియందుఁ బదిగడియలు మిగిలియుండెనే నట్టి జన్మనక్షత్రంబు ప్రపన్నుల కాచరణీయం బగు నీభగవద్భాగవత జన్మర్క్ష నిర్ణయ ప్రమాణంబులు శ్రీపాంచరాత్రాగమ ప్రసిద్ధంబులగు॥ ఇంక ధనుర్మాస హరి

## ధనుర్మాస హరిపూజావిధానము

పూజా విధానంబు ప్రమాణోపన్యాస పూర్వకంబుగా వివరించెద సావధాన చిత్తులరై వినుండు—శ్లో॥ యది చాపగతే సూర్యే స్తోత్రైస్సం బోధ్య కేశవమ్। ఉషః కాలే సమభ్యర్చ్య ముద్గాన్నంచ నివేదయేత్॥ ద్వాదశాబ్దార్చనఫలం దినేనైకేన లభ్యతే। మార్గశీర్షాఖ్య మాసేతు పూజయేచ్చ విశేషతః॥ ఉషః కాలేతు సంప్రాప్తేక వాటోద్ఘాట నంచరేత్॥ దీపానుద్దీప్య శిష్యైశ్చ దేవ దేవం నమస్యమేత్॥ ముద్గాన్నంచ నివేద్యైవ ముఖవాసం నివేదయేత్। కవాటం సుస్థిరం బధ్వా సన్ధ్యోపాసన మాచరేత్॥ ఏతన్మాసార్చ నేనైవ వత్సరార్చా ఫలం లభేత్। అయనే దక్షిణేరాత్రా వర్తతేతు దివాధివేత్॥ తథైవ తదహో రాత్రం త్రింశన్మాస ఉచ్యతే। తద్దినస్య ఉషః కాలం చాపమాసం విదుర్బుధాః॥ తస్మాత్సర్వ ప్రయత్నేన చాపమాసేదినేదినే। ఉషః కాలేతు సంప్రాప్తే బోధయిత్వా జగద్గురుమ్॥ సమభ్యర్చ్య జనోవిష్ణుం నిజదోషం వినాశయేత్। అనియెడి యానంద సంహితోక్తి ప్రకారంబుగా సూర్యుఁడు చాపగతుం డాయెనేని యమ్మాసంబునందుఁ బ్రతిదినంబునందుషః కాలంబున స్తోత్రంబులచేఁ గేశ

వుని మేలుకొలిపి యథావిధినర్చించి ముద్గాన్నంబు నివేదితంబు సేయవలయు నట్లొనర్చెనేని యేకదిన భగవదారాధనంబుచే భాగవతుండు ద్వాదశాబ్దాహస్సమారాధన ఫలంబు లభియించునట్లు మార్గశీర్ష మాసంబునందుఁ బ్రతిదినంబు పూజించెనేని విశేషఫలంబు లభించు నమ్మాస బునం దుషఃకాలంబున శిష్యసమేతుండై భగవన్మందిర కవాటోద్ఘాటనం బొనర్చి దీపంబుల నారోపించి దేవదేవు నర్పింపవలయు ముద్గాన్న నివేదనంబు సేసి లవంగకర్పూరాది పరిమళద్రవ్యమిళిత తాంబూలాది ముఖవాసనా ద్రవ్యసమర్పణంబు సేయవలయు ననంతరంబు సుస్థిరంబుగాఁ గవాటంబుల బంధించి సంధ్యోపాసనాదిభగవదాజ్ఞ వెల్లింప వలయు నేతన్మాసార్చనంబుచే సంవత్సరార్చా ఫలంబు లభియించు నుత్తరాయణదక్షిణాయనంబులు రెండును దేవతలకు నొక యహోరాత్రంబగునట్టి యహోరాత్రంబులు ముప్పది జరిగెనేని దైవతంబగు మాసంబగు నద్దేవతా దినంబున కుషఃకాలంబు ధనుర్మాసం బని పెద్ద లెఱుంగుదురు. కావునఁ జాపమాసంబునందు సర్వవిధ ప్రయత్నంబులఁ బ్రత్యుషఃకాలంబునందుఁ బూర్వోక్త క్రమంబుగా భగవదారాధనంబు సేసి [illegible] బాపవలయు-శ్లో॥ ఆషాఢాదిషుమాసేషు శయనం కార్తికాదిషు [illegible] ఉత్థాప్యశయనాద్ధరిమ్॥ సమిష్టులక్షణై స్తోత్రైర్విప్రహాంభిః [illegible] ఉషఃకాలేతు సంప్రాప్తేత్వర్చయిత్వా జనార్దనమ్॥ ఉపచారైష్షోడశభిః [illegible] నివేదయేత్॥ అనియెడు బ్రహ్మాండపురాణోక్తక్రమంబుగా నాషాఢశుద్ధ [illegible] కార్తికశుద్ధైకాదశి పర్యంతంబు భగవంతుండు పాలవెల్లియం [illegible] బుపై యోగనిద్ర యొనర్చునట్టి శ్రీమన్నారాయణుని మేలుకొలిపి ధను [illegible] సంక్రాంతిసంబైన నం దుషఃకాలంబున శయనంబువలన భగవదుత్థా [illegible] యుత్థితుండగు హరిని లక్షణలక్షితంబులగు బహుస్తోత్రంబుల [illegible] పూర్వోక్తక్రమంబుగా షోడశోపచారంబులఁ బూజించి ముద్గాన్న నివే [illegible] యవలయును,—శ్లో॥ చాపంగతే తపి స్సూర్యేప్రత్యుషస్యాన్ననిమాలితే। అర్చయేచ్ఛ జగన్నాథం యావత్పూర్వోదయాత్పురా॥ తతః ప్రదాయమయే చార్ఘ్యం ప్రక్షిప్యవైష్ణవః। గాయత్రీంచ తతో జప్త్వా ఉపతిష్ఠేత [illegible]॥ అనియెడి యాదిత్య పురాణోక్త ప్రకారంబుగా వైష్ణవుండు ధనుర్మాస బున నం దుషఃకాలంబున మేల్కాంచి కృతస్నానుండై సూర్యోదయంబుకంటెఁ బూర్వకాలంబులం దుక్త ప్రకారంబుగా శ్రీహరి నారాధించి తదనంతర బు ప్రభాత కాలంబునం దర్ఘ్య ప్రదానం బాచరించి యథాశక్తిగా

యత్రీమంత్రజపంబు సేసి సూర్యోపస్థానంబు సేయవలయు —శ్లో॥ కోదణ్డస్థే సవితరి ప్రత్యుషః పూజయేద్ధరిమ్। సహస్రాబ్దార్చనఫలం దినేనైకేన సిద్ధ్యతి॥ అనియెడు భాగవతపురాణోక్త క్రమంబుగా ధనుర్మాసంబునందుఁ బ్రత్యుషఃకాలంబున భక్తుండు విష్ణువు నారాధించెనేని యేకైకదినార్చనంబుచే వేయిహాయనంబుల శ్రియఃపతి నారాధించిన ఫలంబు లభియించు.—శ్లో॥ బ్రాహ్మే ముహూర్తే సంప్రాప్తే రవౌ ధనుషి సంస్థితే। స్నానం కృత్వా స్వసూక్తేన షోడశైరుపచారకైః॥ నగరగ్రామరక్షార్థ మర్చయిత్వా శ్రియఃపతిమ్। సహస్రవార్షికీ పూజా దినేనైకేన లభ్యతే॥ చాపస్థిత ఉషఃకాలే రవౌ ప్రతిదినం హరిమ్। స్నాత్వా గృహస్థశ్శుద్ధాత్మా సమభ్యర్చ్య నివేదయేత్॥ అనియెడు శ్రీ వైఖానసాగమోక్తప్రకారంబుగా ధనుర్మాసంబునందు బ్రాహ్మంబగు ముహూర్తంబునఁ గృతస్నానుండై భక్తుండు నగరగ్రామ రక్షార్థంబు పురుష సూక్తంబుచే షోడశోపచారంబుల శ్రియఃపతి నర్చించెనేని యేకైక దినారాధనంబుచే సహస్రవార్షిక హరిపూజా ఫలంబు లభియించు గృహస్థుఁడు ధనుర్మాసంబునం దుషఃకాలంబునఁ బ్రతిదినంబు స్నానం బొనర్చి శుద్ధాత్ముండై యుక్త ప్రకారంబుగా హరి నారాధింపవలయు. శ్లో॥ ఏకాదశ్యాం సితే పక్షే చాపే తిష్ఠతి భాస్కరే। ఉత్సవం కారయేద్ధీమాన్వేదపారాయణైస్సహ॥ అనియెడు జ్యోతిశ్శాస్త్ర ప్రసిద్ధ భాస్కరీయపారమేష్ఠ్యాది గ్రంథోక్త క్రమంబుగా మార్గశీర్ష మాసంబున శుక్లపక్షైకాదశియందు వేద పారాయణ పూర్వకంబుగా మేధావి యగువాఁడు భగవంతున కుత్సవంబు సేయవలయు. శ్లో॥ చాపే స్థిత ఉషఃకాలే రవౌ ప్రతిదినం హరిమ్। పూజయే—దిత్యాదివాసిష్ఠ వచనప్రామాణ్యంబున ధనుర్మాసంబునం దుషఃకాలంబునం బూర్వోక్తక్రమంబుగా హరిసమారాధన సేయవలయు —శ్లో॥ కోదణ్డస్థే రవౌ విప్ర స్స్నాత్వా ప్రత్యుషసి స్వయమ్। మా మ్మానాథం జగన్నాథం నిత్యం భక్తిసమన్వితః॥ ముద్గాన్నమాదరాన్మహ్యం వినివేద్య గుణోత్తరమ్।ప్రాబోధికీం సూక్తిమాలాంగోదోక్తాం ద్రావిడాకృతిమ్॥ త్రింశద్గాథాత్మికాం దివ్యాంస్తుతి రూపాం మమ ప్రియామ్। భక్తాఙ్ఘ్రిరేణువిహిత ప్రాబోధిక్యుక్తి పూర్వికామ్॥ గాథాపూర్వార్ధోత్తరార్ధ మనుసన్ధాపయే ద్రమే। నిత్యం ప్రీత్యానుసన్ధాన్త్రైర్లోకైర్మత్పరాయణైః॥ సదా తా మనుసన్ధాయ కృత్వా నిగమనం తతః। తాసు గాథాసు గోదోక్తాస్వేకైకాం ప్రత్యహం పునః॥ అనుసన్ధాయ తత్కాలే తన్మాసే పురతో మమ। తత్ప్రసాదం తతో భుక్త్వా కృతకృత్యో భవిష్యతి॥ అనియెడు శ్రీమన్నారాయణసంహితోక్త ప్రకారంబుగా ధనుర్మాసంబున విప్రుండు ప్రతిదినం బుషఃకాలంబునందు

స్నానం బాచరించి శ్రీనాథుండును జగన్నాథుండు నగు నన్ను భక్తి సమన్వితుండై పూర్వోక్త క్రమంబుగఁ యాదరపూర్వకంబుగఁ బావనత్వ భోగ్యత్వ విశిష్టంబగు ముద్గాన్నంబు నాకర్పింపవలయుఁ ద్రింశద్గాథాత్మికయు దివ్యయు ద్రవిడాకృతియు మత్ప్రియమునగు సంస్తుతిని భక్తాంఘ్రిరేణు విహితదశగాథాత్మిక ప్రబంధాను సంధాన పూర్వకంబుగా నేకైక గాథాపూర్వార్ధోత్తరార్ధంబులు మున్నడి పిన్నడిగా మత్పరాయణులగు వైష్ణవులు నిత్యంబను సంధింపవలయునట్లనుసంధించి నిగమించి ప్రత్యహంబు క్రమంబుగా నాముప్పది పాటలయందొక్కొకగాథ నాకట్టెదుట ననుసంధించి సంధ్యోపాస నాదిమదీయాజ్ఞ సెల్లించియా ప్రసాదంబు భుజియించి కృత్యకృత్యు లగుదురని శ్రీదేవి నుద్దేశించి శ్రీమన్నారాయణుం డానతిచ్చె నిట్లగ్గురూ ద్వహాం దుపన్యసింపవినియాశ్రితులుసంతసించి మహాత్మా సౌమ్యజా మాతృయోగీంద్రుండు భగవద్రామానుజ మునియపరావతారం బని వినియుండితిమి ఆ యర్థంబునందుఁ బ్రమాణంబెయ్యది యనియడుగ వారల కయార్యసత్తముండు చెప్పిన ప్రకారంబు వివరించెద నెట్లన్న. 331

### మణవాళమహామునులు రామానుజాపరావతారంబని నిరూపించుట

శ్లో॥ మన్నియోగా ద్భూతపుర్యా మహీనా మీశ్వరః కలౌ। శ్రీరామానుజ రూపేణ భవిష్యతి సతాముదే॥ విశిష్టాద్వైత సిద్ధాన్త ప్రతిపాదనతత్పరమ్। భాష్యం నిర్మాతి వేదాన్త సూత్రాణా మర్థతత్త్వవిత్॥ తదాశ్రయాస్సదావా రాస్సాత్త్వికా స్తత్త్వదర్శినః। వేదాన్తద్వయతత్త్వజ్ఞా భవిష్యన్తి గురూత్తమాః। పునర్భ విష్యతి శ్రీమాన్మన్నియోగాన్మ హీతలే। జనిష్యతి శ్రీనగర్యాం యతీన్ద్ర ప్రవణాత్మనా॥ యత్పద్యం ద్రావిడామ్నాయా ద్యరమ్యాన్తే భవిష్యతి। సఏవసౌమ్యజామా తృసంజ్ఞికస్స్యాన్మహామునిః॥ అనియెడు బ్రహ్మాండ పురాణ ప్రసిద్ధబదరికాశ్రమ మాహాత్మ్యోక్త క్రమంబుగా నస్మన్నియోగంబున శేషుండు కలియుగంబున శ్రీభూతపురియందు సత్పురుషుల సంతోషంబునకై శ్రీరామానుజ రూపంబున నవతరించు వేదాంత సూత్రార్థ తత్త్వ విత్తముఁ డగునమ్మహాత్ముండు విశిష్టాద్వైత సిద్ధాంత ప్రతిపాదన తత్పరం బగుభాష్యంబు నిర్మించుఁదదాశ్రితులు సదాచార సంపన్నులును బరమ సాత్త్వికులును దత్త్వ విత్తములును వేదాంతద్వయార్థ యాథాత్మ్య విత్తములు గాఁగలరు. శేషమూర్తి యగునయ్యతీంద్రుండు మగిడి మన్నిదేశంబునఁ బుడమిని దిరునగరియందు యతీంద్ర ప్రవణాత్మకుండై జనియించు నద్దేశి కేంద్రుని పద్యంబు ద్రావిడామ్నాయాది ప్రబంధాఖ్యయ నాధ్యాప

నంబులకు నాద్యంతంబుల భగవజ్జను లనుసంధింతు రయ్యాచార్య శ్రేష్ఠుండు సౌమ్యజామాతృ యోగీంద్ర సంజ్ఞితుండు గాఁగలడని శ్రీమన్నారాయణుండు వక్కాణించె ననియవ్వాది భీకరగురుం డానతియ్య నాకర్ణించి మిగుల సంతోషించి యద్దేశికేంద్రుని వీడ్కొని యావైష్ణవులు నిజనివాసంబులకుఁ జని రంత.

### వాదిభీకరగురుని భాగవతభక్తి

౧. శ్రీమంతుం డగువాదిభీకరగురుశ్రేష్ఠుండు శ్రీవైష్ణవ
స్తోమారాధన మాచరించుచును జేతోమోద మొప్పన్ యతి
స్వామిన్ నెమ్మది నుంచి వేదశిఖరద్వంద్వంబు శిష్యాళికిన్
సేమం బొప్ప రచించుచు న్నట వసించెన్ శ్రీశు సేవించుచున్. 336

౨. అంత ధనుర్మాస మావిర్భవించినఁ, బరవాదిభీకర గురువరుండు
నిత్యము భక్తితో నిఖిలభాగవతార్చ, నము సేయ నం దొక్కనాఁ డచటికి
వైదేశికుం డగు వైష్ణవుం డొక్కరుఁ, డరుదెంచి స్వాతంత్ర్య మలర స్నాన
శాలకుఁ జని యుష్ణ జలముల నీరాడి, వేష్టువ లేకన్న వెదకి యూర్ధ్వ

౩. భాగమున నొక్కచో [illegible] పైని నున్న, గాంచి [illegible] గట్టుకొన్న
నార్యుఁ డితనిఁ [illegible] యనఘ వస్త్ర, మన్నగారి[illegible] నతండు.

౪. అణ్ణగారియింటి పరివైష్ణవు లంద, [illegible] రట్టి సూర్యునింట
నిట్లు నన్నుఁ [illegible] డవు నీవు తొలఁగుమ[illegible] బలికె గురుని.

౫. అట్లు తద్వాక్యంబు విని గురుం డిట్లనియె.

౬. అపచారపడితి [illegible], కృపసేయు మటంచు [illegible] రుఁ డార్యుం
డుపచార మొద యాతని, నపరిశ్రమముఁ జేసి భో[illegible] దనిపెన్. 337

౭. [illegible] వైష్ణవులకున్ [illegible]
[illegible]
[illegible] బొప్ప జయించుమన్ నిగమశీ[illegible]
కరుణన్ సంశ్రితకోటికిన్ దెలుపుచుం గాలంబుఁ [illegible] మహిన్. 338

౮. [illegible] గు[illegible] దేశి[illegible]
కరణి [illegible] తారుణికుం డగుటన్ [illegible]
దరు[illegible] బంబున కుంచి [illegible]
దరవర యోగిరాజ[illegible] సద్వ్యయ మొందె భక్తితోన్. 339

## వాదిభీకరాచార్యుల వారితనియను

శ్లో॥ వేదాన్తదేశికకటాక్షవివృద్ధబోధం
కాన్తోపయంతృయమినః కరుణైకపాత్రమ్।
వత్సాన్వవాయ మనవద్యగుణై రుపేతం
భక్త్యా భజామి పరవాదిభయంకరార్యమ్॥ 340

ఉ. ఏకృతి కణ్ణగారు గుణ•వెంచఁ బితామహుఁ డేమనీషి క
స్తోకయశుం డనంతగురు•సూర్యుఁడు తండ్రి వృషాచలేశ్వరుం
డేకవి కిష్టదైవతము•నెల్లపు డానయానారుదేశిక
శ్రీకరపాదపద్మము•సేమ మెలర్ప మదిం దలంచెదన్. 341

ఉ. అనయనారు దేశిక ప•దాంఘ్రిసరోజసమాశ్రితుండు రా
మానుజదేశికేంద్రుసుతుఁ•డాపరవాదిభయంకరా ర్యస
న్మానితన ప్త యౌనిగమ•మౌళిగురూద్వహుఁ డస్మదీయమ
ర్మానమమత్వ ఘోరతిమి • ర ప్రశయోదయ భాస్కరుం డగున్.

ఆ నయవిదగ్రగణ్యు • నయనారుదేశిక, సుతుని నిగమశిఖర • సూరిశిష్య
వాదిభీకరార్యు • పదపౌత్రపౌత్రుని, వేంకటార్యు మదిని • వేడ్కఁ దలఁతు. 343

మత్తకోకిలము వాదిభీకర న ప్తృన ప్త న • వాప్తబోధప మోనిధి౯
ఆదృతాశ్రితు వేంకటార్య ప • దారవిందయు గాశ్రయు౯
మోదజుణ్ణిగ మాంతదేశిక • ముఖ్యు నా హృదయంబులో
నాదరం బమర౯ భజింతు న • హర్నిశంబు సుఖంబుగాన్. 344

సీ. పరవాదిభీకర • గురు న ప్తృ వేదాంత, దేశిక పాదాంబు • జా శ్రితుండు
తత్పౌత్రుఁ డఖి ల • ద్యా పారదృశ్వయు, నతులకల్యాణగు • ణాభిరాముఁ
డవిరతాయతితదీ • యా రాధనోభయ, వేదాంత వివరణా • విష్టచిత్తుఁ
డస్మదాచార్యుల • కతిశయితహితంబు, లాచరించు మహాత్ముఁ • డార్యవర్యుఁ

తే. డంతిమోపాయనిష్ఠా గ • తాంతరంగుఁ, డంజనాచలనాథున • కాత్మ భూతుఁ
డాగమాంతగురూద్వహుఁ•డస్మదీయ, పరమగురుఁడు కటాక్షించుఁ • గరుణనన్ను

సీ. వాదిభీకరగురు • వరన ప్తృన ప్తపౌ, త్రుఁ డ గోత్ర నేగురు • ధూర్వహుండు
శ్రీ కుమార శ్రుతి • శేఖరాచార్యన. కభిమతపుత్రుఁ డే • యార్యవరుఁడు
స్థిరత నణ్ణా వేద • శిఖర దేశిక పాద. పద్మద్విరేఫ మే • ప్రాజ్ఞమౌళి
యస్మన్ముఖంబున • నాచార్యసూక్తి ము. క్తావళి యేగురుఁ • డానతిచ్చె

తే. వత్సవంశాబ్ధిచంద్రుఁడే • నత్పహాయుఁ, డే మహాత్ముఁడు మద్ధిత • హేతువయ్యె
నట్టి మద్గురు నణ్ణగా • రాఖ్య ననఘుఁ, జిత్త మలర భజించెదఁ • జింతమావి. 346

వ. మఱియు నిమ్మహాదేశికుండు మదీయదౌరాత్మ్యంబు దలంపక నన్నంగీకరించి
సకల విహితంబు లొనరించిన తెఱం గెఱింగించెద. 347

ఏతద్గ్రంథకర్తయగు నంబూరి కేశవాచార్యుల వృత్తాంతము

సీ. శ్రీ పురుషోత్తము • శ్రీకూర్మసింహాద్రి, పతి హరిఁ జూచి యు • ప్మాక చేరి
యట బ్రహ్మచారి వే • దాంతార్యుకడ హయ, గ్రీవ మంత్ర మెఱింగి • కృష్ణకడమ
మట్టిపల్లి నృసింహ • మందిరంబునఁ బుర, శ్చర్యాంతమున శర • చ్చంద్రసదృశు
మహిత ప్రసన్నార్క • మండలగతహయ, గ్రీవులో దృష్టి వీ • క్షించి మించి

తే. యతులితాహోబలమునఁ దా • ర్క్ష్యాద్రిపైని, నొక్కనాఁడున్మనీభావ • యోగదశను
సుప్రసన్నార్క మండల • శోభిదహర, గగనరూపిని బరమాత్ముఁ • గాంచియంత. 348

సీ. అచటనుం డేతెంచి • యంజనాచలమున, స్వామిపుష్కరిణిలో • స్నాన మార్చి
తత్తదంగములందు • ధవళోర్ధ్వపుండ్రముల్, గురుపంక్తిఁ దలఁచుచుఁ • గూర్మిఁ దీర్చి
తులసీకమలబీజ • వలయముల్ ధరియించి, వడిఁ జని మైసూరి • వారి మఠము
వాకిటి తిన్నెపై • వైష్ణవార్భకునకు, శ్రీ సూక్త మతిప్రీతిఁ • జెప్పుచున్న

తే. ప్రాజ్ఞు శఠకోపదేశికు • బ్రహ్మచారి, నచట నీక్షించి ప్రణమిల్లి • నమ్మహాత్ముఁ
డస్మదీయతపోవేష • మంతఁ, జూచి సంశయించుచుఁ బలికె నీ • సఁ జిన్నన్ను 349

వ. వత్సా శంఖచక్రోర్ధ్వపుండ్రాది భగవల్లాంఛనంబుల ధరియించియు నిట్లు జటిలత్వ
శ్మశ్రులత్వకక్షపాలాజపమాలా చీరపరిధానాది తాపసలక్షణంబుల దాల్చిఁ నాఁడ
వు గావున నీవు బైరాగివా యని యద్దేశికేంద్రుం డడిగిన నేనట్టిఁ వాఁడఁ గాను
విప్రుండ నని విన్నవింప నట్లాయెనేని నీ కులగోత్రాదికంబు సవిస్తరంబుగా నుదా
హరింపుమని యగ్గురుండు మగిడి యడిగిన మహాత్మా కణ్వసగోత్రంబు నాపస్తం
బ సూత్రంబును యజుశ్శాఖయు నార్యావర్తకులంబును నంబూరి కుడియును
మంగళాద్రిక్షేత్ర వాసంబును శంఖచక్రోర్ధ్వ పుండ్రాది విష్ణులక్షణంబులు గలుగు
శ్రీరామసుధీవరునకు నప్తయు నట్టివాఁ డగు జగన్నాథ కవీంద్రునకుఁ బౌత్రుండును
దాదృగ్విధుం డైన కేశవసూరికిఁ బుత్రుండును బరవాదిభీకరనయనారాచార్య శ్రీ
పాదారవింద మరంద పానమత్తతుందిలేందిందిరపురందరుండును శ్రీలక్ష్మీనారాయ
ణార్య ప్రసాదాసాదిత శ్రీభాష్యాదిగ్రంథతత్త్వార్థానుభవ జనితమహానందకందళిత

హృదయార వించుందుమ శ్రీమంగళాద్రినృసింహ ముఖోల్లాసకరసర్వవిధకైంకర్య నిర్వాహకుండును నిత్యనిరతిశయతదీయారాధనపరుండును శ్రీశఠారిదాసాభిధాన దాస్యనామాభిరాముండును నుభయకవితాపితామహుండునునగు శ్రీవేంకటకృష్ణార్యునకు శ్రీరంగధామంబున వకుళాభరణరామానుజసంయమీంద్రుని సన్నిధి నిరువది నాల్గుహాయనంబులు గురుకులవాసంబుఁ జేసికాణాదపాణినీయపూర్వ మీమాంసాది సామాన్యశాస్త్రంబులను భయవేదాంతంబుల నష్టాదశరహస్యంబుల నధికరించి శమదమాద్యనంత కళ్యాణగుణ పరిపూర్ణుండై శ్రీపరాశరగోత్రుండగు లక్ష్మీనారాయణార్యునకు సహోదరియగు నలమేల్మంగాంబయందుఁ బుత్రుండనై జనియించినవాఁడఁ గేశవనామధేయుండ నస్మదార్యప్రసాద లబ్ధనారాయణ దాసాభిధాన దాస్యనామంబుఁ గలవాఁడ నని ప్రత్యుత్తరంబుఁ జెప్ప నా శఠకోపదేశికుం డట్టివైలక్షణ్యంబు గల నీకీవేషంబు స్వరూపవిరుద్ధంబు గాన దీని వర్జించి భగవదాచార్య సన్నిధిని స్వరూపగ్రంథంబు లధికరింపుమని మిగుల నాదరపూర్వకంబుగా ననుగ్రహించె నయ్యవసరంబున నస్మదాచార్యుండైన యణ్ణగారాచార్యుం డంజనాద్రీశునకు మంగళాశాసనం బొనర్ప విచ్చేసినం జూచి సాష్టాంగప్రణామం బాచరించి యంజలించి యద్దేశికేంద్రుని కట్టెదుట నమ్రుండనై యున్న నగ్గురువరుండు కటాక్షించి వత్సా నీవెవ్వ డవనిన నా నివాసస్థలంబు మంగళగిరి జననీజనకు లలమేల్మంగయు నంబూరి వేంకటకృష్ణార్యుండును దేవరవారాచార్యులు శ్రీరంగాది దివ్యదేశంబులన్నియు సేవించి బదరికాశ్రమంబునకుం జని యందు నివసింపఁదలఁచి జరగుచున్నవాఁడ నని విన్నవించిన విని నవధరించి సంశ్రిత వాత్సల్యజలధియగు నమ్మహాదేశికేంద్రుండు పుత్రా నీ వస్మదీయుండవై యుండియు నిట్టి స్వరూపవిరుద్ధంబైన వేషంబేలపూనితివని మగిడియడుగ నతిశంబైన మదీయ వృత్తాంతంబంతయు విన్నవించితి నంతఁ బరమకారుణికుండగు నగ్గురువరుండీ పూర్వవయస్సు విద్యాభ్యాసంబునకు సాధనంబగుఁ గావున ననంతరం బీప్సితం బగు క్షేత్రంబునకుం జని తపంబొనర్చెదవు గాని యిప్పు డస్మత్సన్నిధి స్వరూప గ్రంథంబు లధికరించుచు బాలసరస్వతులని జగతిఁ బ్రఖ్యాతుండై భగవద్రామానుజ సిద్ధాంతనిర్ధారణ సార్వభౌముండైన విద్వాన్ వీరరాఘవస్వామి సన్నిధి సామాన్య శాస్త్రంబు లధికరింపుమని నియమించినఁ దదీయ శ్రీసూక్తి మహాప్రసాదం బని వాఙ్మాత్రంబున నంగీకరించియు మన్మానసంబునకు రుచింపక కైతవభక్తిఁ దత్సన్నిధిని వసించియున్న సమయంబున శ్రీవిల్లిపుత్తూరినుండి తదీయ శ్రీపాద పద్మంబు లాశ్రయించిన వైష్ణవు లిరువు రేతెంచి సేవింప వారి ననుగ్రహించి

వారితో దాసునితో నమ్మహీసూరి వారి మండపంబుఁ బ్రవేశించి య దారాత్రి వసి యింప నప్పుడు నారాయణాద్రీశుం డద్దేశికేంద్రునకుఁ బ్రసాదంబను పస శ్రితులతో నారగించి యప్రసాదంబు దాసున కనుగ్రహించ నదియారగించి కృతార్థుండనై యమ్మఠంబున నొక్కచో నిద్రించుచున్న నవ్వరాత్రంబున మదీయ స్వప్నంబు నందు శ్రీవిల్లిపుత్తూరినుండి యేతెంచిన శ్రీవైష్ణవులయం దాళ్వారని తిరునామంబు గల శ్రీ మహాభాగవతుండు మదీయహస్తంబు గ్రహించి తోడుకవచ్చి యరు గెంకల దీపకళిక లుల్లసిల్లఁ జిత్రకంబళంబుపై క్షౌమోత్తానంబున కొరఁగి దివ్యస్రగనులేపనాంబరధరుండై సకలాభరణభూషితుండై సౌందర్య సౌకుమార్యౌ దార్యాది కల్యాణదివ్యమంగళ విగ్రహుండై మందస్మితసుందర వదనారవిందుండై యొప్పుచున్న యస్మదాచార్యులం జూపి సాష్టాంగప్రణామంబు సేయించి తదీయ శ్రీపాదపద్మయుగళంబు మదీయమస్తకంబున నాభరణంబుగ నిడి మత్కరం బద్దేశికేంద్రుని దక్షిణపాణిపల్లవంబున నుంచి మహాత్మా వీని నిమిత్తంబుగా మిగుల శ్రమపడి వీనిం బట్టి తెచ్చి మీ కర్పించితి నింక వీని విడువకుండని యప్పగించినంత మేల్కాంచి యా స్వప్నదృష్టవృత్తాంతంబున కాశ్చర్యపడుచు ధ్యానపరుండనై యున్న నన్నుం గటాక్షించి యస్మదాచార్యులు మిగులఁ జింతించుచున్నవాఁడవు విచిత్రంబగు స్వప్నంబుఁ గంటివా యేమని యడుగ నగ్గురుశిఖామణి సర్వజ్ఞత్వంబునకు విస్మయంబుఁ జెంది యా స్వప్నవృత్తాంతం బంతయు నెఱింగించినం దెలిసి దరస్మితంబొనర్చి యిట్టిదనైన మదీయ హితోపదేశంబు నీమదికి రుచియించునాయని యానతియ్య నేటఁబట్టి శ్రద్ధాభక్తిపూర్వ కంబుగ సాష్టాంగప్రణామం బాచరించినం జూచి మిగుల ననుగ్రహించి తమ తోడం దోడుకవచ్చి యనంతరం బొకసన్నివేశంబున దివ్యా[illegible]లుండనగు దాసునకు శ్రీపాదతీర్థతళిహ ప్రసాదంబులొసంగి మంత్రార్థంబులు మీఁదు తిరుప్పత్తారా యిరప్పడియు శ్రీభాష్యంబు మొదలుగాఁగల సకలగ్రంథంబులుం బ్రసాదించి సకల హితంబులుపదేశించి నగలాప్పురంబున స్వాభిమానాపర్యాప్తుండగు వేదనారా యణస్వామికైంకర్యంబు జీర్ణంబై యున్నది నీవు షడారణ్యపురాపర నామధేయం బైన యా యూరు టెంకిజని రాజద్వారంబుఁ గాచి యాకైంకర్యంబు నిర్వహింపు మని యాజ్ఞాపించిరి మహాప్రసాదంబని యాచార్యునాజ్ఞ శిరసావహించి యాషడా రణ్యపురంబునకుం జని యందుఁ గందాడభావనాచార్య శ్రీపాదపద్మాశ్రితుండగు జగన్నాథరాట్పుంగవుని మూలంబుగా నక్కైంకర్యంబు నద్దేశికేంద్రుని యనుగ్ర హంబుచే సమకూర్చికొని మగిడి యేతెంచి యా శ్రీపురియందు గోవిందరాజ మంది

తృష్ణాక్షితిస్ఫురణాభిరామ యతిసుత్రామా యఘగ్రామదు
ర్యక్ష్మాత్యంతవిరామ దూరగతహేయస్తోమ రామానుజా

క. అక్షయలోకవిదాన విచక్షణజనసార్వభౌమ, శైవాదికుదృ
క్పక్షప్రక్షేపణ యతి, లక్షణలక్షితశుభాంగ, లక్ష్మీతాపాంగా.

మాలినీవృత్తము. జనహితకరమంత్రా • సర్వతంత్రస్వతంత్రా
వనరుహదళనేత్రా • వైష్ణవాంభోజమిత్రా
వినికృతషడమిత్రా • విద్వదీడ్యోస్త్రపాత్రా
కనకరుచిరగాత్రా • కర్మవల్లీలవిత్రా.

గద్యము. ఇది శ్రీభగవద్రామానుజకరుణాకటాక్షకలితకవితావైభవ పరవాది భయంకరాచార్యాభిమతచ్ఛాత్రాపస్తంబసూత్ర కణ్వసగోత్రపవిత్రోభయకవిమిత్ర వేంకటకృష్ణార్యపుత్ర విబుధవైష్ణవవిధేయప్రణీతంబైన యాచార్యసూక్తిముక్తావళి యను మహాప్రబంధంబునం దుత్తరభాగంబున శ్రీవేదాంతదేశికప్రభావంబును దత్పుత్రచరితంబును శ్రీ వాదిభీకరగురు విజయంబు నేకాదశీనియమ నిశ్చయంబును, శ్రీజయంతీ నిర్ణయంబును, ధనుర్మాసపూజావిధానంబును నస్మదాచార్యవైభవంబు నన్నది సర్వంబును షష్ఠోల్లాసము. 356

శ్రీమతే రామానుజాయ నమః.

ఈ గ్రంథకర్తకు గురుపరంపరాప్రభావంబు బ్రసాదించిన
నెలకొండపల్లి జియ్యంగారితనియను.

శ్లో॥ రామానుజపదామ్భోజరాజహంస మహర్నిశమ్।
శ్రీరామానుజయోగీన్ద్రం వన్దే వాత్సల్యసాగరమ్॥

శ్లో॥ క్షమాసారా మహాత్మానః కవయో వైష్ణవోత్తమాః।
క్షమంతాం సాహస మిదం దాసోఽయ మితి వ స్సదా॥

ఆచార్యసూక్తిముక్తావళి
ఉత్తరభాగము
ముగిసెను.

---

శ్రీమతే రామానుజాయనమః

# ఈ గ్రంథమును గూర్చి

ఈ గ్రంథమును రచించిన కవి నంబూరి కేశవాచార్యులు. ఇతని తండ్రి వెంకటకృష్ణాచార్యులు. తల్లి యలమేల్మంగమ్మ. ఇతఁడు ప్రతివాది భయంకరాచార్యుల శిష్యుఁడు. ఇక్కవి యీ గ్రంథము తుదఁ దన వృత్తాంతమును చెప్పికొని యుండుటచే నిట దానిని దెలుపుట యనావశ్యకము. మంగళగిరితోఁ జేరిన నంబూ రితని వాసస్థలము.

ఇందుఁ బన్నిద్దఱాళ్వారులయు నిత్యసూరులయు నాచార్యవరులయు చరిత్రములు విశదముగా వర్ణింపఁబడియున్నవి. ఇది గురు పరంపరా ప్రభావము, దివ్యసూరి చరితము, ప్రపన్నామృతము, యతీంద్రప్రవణ ప్రభావము మొదలైన గ్రంథములనుఁ జక్కఁగా పరిశీలించి వ్రాయఁబడిన దని తెలియుచున్నది. మఱియు నయ్యె మహనీయులు చేతనోజ్జీవనార్థము దయాసముద్రులై యనుగ్రహించిన రహస్యార్థములును సంప్రదాయ విశేషములును వైష్ణవులకు మిక్కిలి యుపాదేయములైన యితర విషయములు పెక్కులును ప్రసక్తి వచ్చినప్పుడెల్ల మృదుమధురశైలినిఁ దేట తెల్లముగా వివరింపఁబడియున్నవి. అయ్యె విషయములను బ్రతిపాదించు నపుడు కవికిం గల పరిపూర్ణ విషయ ప్రవేశమును బరికర సమృద్ధియు వర్ణనా ప్రావీణ్యమును నధ్యవసాయ సంపత్తియు సభినివేశ ప్రాబల్యమును, పరిభాషా వైలక్ష్యమునుబట్టి చూడగా నితనికి భగవద్విషయమం దతి గాఢప్రవేశమును, భాష్యాదులందుఁ బూర్ణావగాహమును నుండుట తెలియుచే గాక నవి యత్యంత మాచార్యరుచి పరిగృహీతములై యుండుటయుఁ దేటపడుచున్నది. ఇదియే కాక యితఁడు

"దాసునకు . ...మంత్రార్థం బీడుముప్పత్తారాయిరప్పడియు శ్రీభాష్యంబు మొదలుగాఁ గల సకల గ్రంథంబులఁ బ్రసాదించి, సకల హితంబు లుపదేశించి...."

సీ. "మంగళగిరియందు మంచెళ్ల వెంకటే
శార్యుఁడు రామాయణాదు లొసఁగె
ఘనుఁడు శ్రీకౌండిన్య వేంకట నృసింహ గురుండు
ద్వారక తిరుమల వచనభూష

ణాది రహస్యార్థ మడియేని కెఱిగించె
గురువరుఁడగు నెలకొండపల్లి జియ్యరీ
దాసునకు భద్రశిఖరియందు గొఱఁతవడకుండఁ
దెలిపెను గురుపరంపరా ప్రభావార్థము."

అని నా కడపటఁ జెప్పికొని యున్నాఁడు.

వినోదార్థము కేవల కథవలె నయ్యై చరితలను, వర్ణించు మాత్ర మునకుఁ బోక ముముక్షువైష్ణవు లుజ్జీవించుటకై యిందుఁ దెలుపఁగూడినన్ని విశిష్టాద్వైత సిద్ధాంతములును, భగవత్ భాగవత విషయ సంప్రదాయ రహస్యములు, నందందు మధురమైన యౌషధమువలె, భవరోగములు వాయఁ బొందుపఱచియున్నాఁడు. ఇందొక శ్రుతిగాదు; ఒక స్మృతికాదు; ఒక శాస్త్రము పురాణము గాదు; మహత్సు బాల నారాయణ తైత్తిరీయ ఛాందోగ్య బృహదారణ్యకాదులైన యుపనిషత్తులను, వారాహ బ్రహ్మాండ మార్కండేయ నృసింహ బ్రహ్మకైవర్త స్కాంద మాత్స్య పాద్మ నార దీయ భాగవతాది పురాణములును, పాంచరాత్రాగమమును, మను పరాశర యాజ్ఞవల్క్యాది స్మృతులును, బెక్కు సంహితలును, భారతమును, ఇవి యవి యన నేల? స్వదర్శన స్థాపకములై స్వసంప్రదాయ నిరూపకము లైన సమస్త ప్రమాణ గ్రంథములను విశేషాకారమునఁ గ్రోడీకరించి శాస్త్ర పరిచయము లేనివారికిని సుబోధముగాను, అతి మనోజ్ఞముగాను స్వరుచి విశేష మకరంద ఝరిందేనియ లొలుకునట్లు దోఁచి స్వకీయా ధ్యవసాయపటిమచే స్ఫుటముగా నాటునట్లు రచించియున్నాఁడు. కాని శ్రీ వైష్ణవ సిద్ధాంత నిష్ణాతులగు శిష్టజనులకుంగూడఁ బఠన పాఠన శ్రవణ శ్రావణాదులకు మిక్కిలి యర్హ్యమని చెప్ప నొప్పియున్నది.

పాఠకులకు స్థూలదృష్టికి దీని వస్తువైలక్ష్యము గొంత తెలియుటకై స్థాలీ పులాక న్యాయమున నిందలి విషయములు గొన్ని దెలుపం దగి యున్నవి.

ఇందుఁ జక్రాంకన స్వభావము, దాని ప్రామాణ్యము, భక్తి విరక్తి స్వరూపము, శిష్యలక్షణము, ముముక్షు ప్రాణోత్క్రమణ పరమప్రాప్తి వైభవము, భాగవత లక్షణము, భాగవతాపచార క్రౌర్య ప్రదర్శనము, బ్రహ్మమేధ సంస్కార స్వరూపము, శ్రీపాదతీర్థ మాహాత్మ్య ప్రకటనము, తదీయారాధనాతిశయము, పంచమహాయజ్ఞ స్వరూపము, తిరువారాధన

క్రమము, దేవతాంతర భజన నిషేధము, దుష్టవస్తు స్వీకారదోష భూయస్త్వము, సదాచార్య పరిగ్రహ ప్రాబల్యము, ఆచార్య కైంకర్యాతిశయము, పరతత్వ నిర్ణయము, పాషండ స్వరూప నిరూపణము, శంఖ చక్రోర్ధ్వ పుండ్రాది ధారణ విషయ ప్రమాణోపన్యాసము, రుద్రాక్షి తిర్యక్పుండ్రధారణ ఖండనము, నిర్హేతుకజాయమాన భగవత్కటాక్ష వ్యతిరిక్త పుణ్యాతిశయ నిషేధము మొదలైన విశిష్ట విషయములును, జీవేశ్వర భేదము, నారాయణ పారమ్యము మొదలైన దర్శన ప్రక్రియలును మృదు మధుర గంభీరార్థపూరితములైన యాళ్వారాచార్యుల శ్రీసూక్తులతో మొల్లముగా మిక్కిలి యుల్లాసము గొలుపునట్లు గలిపియున్నాఁడు.

మఱియు శరభరూపియగు రుద్రునిచే నరసింహదేవునికిఁ బరాజయము కలిగె ననుటకు ఖండనమును, శ్రీ నారాయణుఁడు పరాత్పరుఁడై యుండియు నెల్లవారు నద్దేవు నర్చింపకుండుటకుఁ గారణంబులును, ఏకాదశీ జయంతి నిర్ణయమును, ధనుర్మాస పూజా విధానాదులును గూర్చి యనేక ప్రమాణోదహరణ పూర్వకముగాను నతి విస్తరముగాను గావించిన యుపన్యాసము లసదృశములు.

ఈ గ్రంథము పూర్వభాగము, మధ్యభాగము, ఉత్తరభాగములు అని మూడు భాగములుగా విభజింపఁబడి యున్నది. పూర్వభాగము ఆఱు ఉల్లాసములుగాను, మధ్యభాగము పండ్రెండుల్లాసములుగాను, ఉత్తర భాగము ఆఱుల్లాసములుగాను నంతర్విభాగము కలిగియున్నవి.

ఇందు రామానుజులవారి దివ్యచరితము పూర్వభాగమందలి యయిదవ యుల్లాసము మొదలుగా మధ్యభాగము కడ వరకు నావరించి గ్రంథమునం దాదాపుగా నర్ధభాగమగుచున్నది. ఇందు రామానుజాచార్యులవారి దివ్య విగ్రహ వర్ణనములును, కల్యాణగుణ వివరణములును, ఢిల్లీ యాత్రాది చర్యలును, మనోజ్ఞమైన మృదుశైలిని మిక్కిలి రసవంతముగా రచింపఁబడి యున్నవి.

మణవాల మహామునులయు, వేదాంత దేశికులయు, వైభవములును, గ్రంథాంతమున స్వపరమాచార్యులైన ప్రతివాదిభయంకరం అణ్ణంగారి వైభవమును సవిస్తరముగా వర్ణితములై యున్నవి.

ఇది శ్రీ రామానుజులవారికే యంకితము.

ఇది తఱుచుగా సీసపద్యముల చేతను వచనముల చేతను నిర్మితము. అందందు నితర వృత్తములును గనుపట్టుచున్నవి కాని యవి స్వల్పము.

ఉత్తరభాగమున కొన్ని వృత్తవిశేషములు చూపట్టుచున్నవి. సీసపు గీతము లందొక్కొక్కటను నాలవ పాదమున "వాది భీకరగురుఁడనె మోదమలర" నని యీ గ్రంథమును స్వాచార్యవక్తృకముగా నిబంధించియున్నాఁడు.

ఇది యీ కవియే 'అట్టి పరవాది భీకర గురుండీదాస చేతనుని నొక నిమిత్తముగాఁ జేసికొని యస్మదీయ జిహ్వాగ్ర సింహాసనాసీనుఁడై యాన తిచ్చిన యీ 'యాచార్య సూక్తిముక్తావళి' వక్త శ్రీవాదిభీకరుండనియు, గృతినాయకుండెంబెరుమానారనియుఁ, బ్రతిపాద్యంబు శ్రీశఠకోప పరకాల నాథయామున యతీంద్రాది పూర్వాచార్య మహాత్మ్యంబనియుఁ, దలంచి నిమిత్తభూతుండగు నాదౌరాత్మ్యంబు దలంపక మహీతలంబున శ్రీ మహా భాగవతులంద ఱీప్రబంధంబు పరిగ్రహించి సానుపరాధ చేతనుండగు నా సాహసం బోర్చి నన్ననుగ్రహింప వలయునని చెప్పికొనియున్నాఁడు. దీనంజేసి యీతని కాచార్య విషయమునంగల రుచ్యను గృహీతపార తంత్రప్రకర్షమును శ్రీ భాష్య కారుల యందుఁగల దృఢాధ్యవసాయ పూర్వక శేషత్వ వైభవమును వేనోళ్ళఁ జాటినట్లయినవి.

ఇందుఁ గొన్ని లాక్షణిక దోషములు గలవు. కాని ప్రతి పాద్య విషయమునకు గల వైలక్ష్యముం బట్టియు, నుజ్జీవకములైన తక్కిన విశేషములంబట్టియు, నాదోషము లంతగా నాదరణీయములు గావు.

ఇట్టి మహనీయ గ్రంథము మిక్కిలి పారదుష్టమై లోపలివిషయము లనేకులు దురూహములుగాను నుండుటఁ జూచి పెక్కుప్రతులం దెప్పించి మిక్కిలి ప్రయాసమునకు వెనుదీయక విశేషవ్యయమున మంచి ముద్రణముంగూర్చి సమంజసముగాను సకల శిష్టజనాం గీకారపాత్రము గాను ప్రకటింపఁ బడినది. దీనినందఱు గొని యానందింతురుగాక!

నేనీ గ్రంథమును బరిశోధించు నపుడు బుక్క పట్టణము రామానుజయ్య నాకుఁ జాలఁదోడ్పడినందులకు నేనతనియెడఁ గృతజ్ఞుడనై యున్నవాఁడను. ఇందు ప్రమాదవశమునఁ బడిన తప్పులఁ దెలుప నెల్లరును బ్రార్థితులు.

[పుణ్యశేషులు తంజనగరం దేవరాజసుధీగారు, 1911 వ సంవత్సర మున మెస్సెర్సు ఆర్. వెంకటేశ్వర అండు కంపెనీవారిచే ప్రకటింప బడిన ముద్రణకు వ్రాసిన 'ఉపోద్ఘాతము' నకు నకలు. ఈ ముద్రణ యా గ్రంథమునకు నకలు—జ. న. రు]

# ఈ గ్రంథమును గూర్చి
# యింకొక యుపోద్ఘాతము

సా॥ శ్రీ రామానుజ యోగిరాజ విహిత
స్సిద్ధాంత నిర్వాహకా!
సారోదార విశేషభూరి సదయా!
స్వామీ! జగద్రక్షకా!
శ్రీ రంగేశ్వర నిత్యదాస్య విహితా!
శ్రీ భాష్యకారా! గురూ!
శ్రీ రమ్యోజ్జ్వల నిత్యసుందర! నిను
జేమొద్దు గోదాగ్రజా!

చ॥ ఉభయ విభూతి నాయకుఁడు నుత్తమకేశవ సూరిపుత్రుడున్
శుభచరితుండుఁ బూర్వపరసూరి జనాశ్రయుఁ డున్నతోన్నతుం
డు, భవభయ ప్రదారుఁడు దృఢోజ్జ్వలచిత్తుఁడు దివ్యచేష్టుఁడుం
బ్రభువర మంత్రపూజ్యుఁడగు భాష్యగురుం డొగిఁబ్రోచుఁ గావుతన్

ఉ॥ ముద్దుమొగంబుఁ గెంజిగురుమోవి దయారసమొల్కు కన్నులున్
నిద్దపుఁజెక్కులున్ పసిఁడి నిగ్గులుదేఱెడి మేను బాగుగా
దిద్దిన యూర్ధ్వపుండ్రమును తెల్లని జన్నిదముం త్రిదండముం
దద్దయు నొప్పు చిన్ని సిగదాల్చిన మా యతిరాజు గొల్చెదన్

శ్లో॥ శ్రీ శైలాన్వయ వార్ధిశీత కిరణం। వేదాన్త యుగ్మార్థదం
దాసా స్వాబ్ధి దివాకరం శుభకరం। తత్వ త్రయార్థ ప్రదమ్
శ్రీమద్ధర్మ గురోస్సుతం నతహితం। జీవేశ భేదక్రియా
నిర్వాహ శ్రుతిసారకోవిద మహం। శ్రీ రాఘవార్యం భజే

శ్లో॥ అబ్దే నన్దన నామ్నికలితే। మాసే రవౌ కుమ్భగే
పక్షేధావళికే జగజ్జనసుతే। షష్ఠ్యాన్త పౌష్యార్క్షభే
శ్రీశైలాన్వయ ధర్మదేశిక వరా। జ్జాతం జగత్పూజితం
వందే రాఘవ దేశికోత్తమ మహం। మన్దార కల్పద్రుమమ్

శ్రీ భగవద్రామానుజ కరుణాకటాక్ష కలిత కవితావైభవ పరవాది భయంకరాభిమత చ్ఛాత్రాపస్తంబసూత్ర కణ్వసగోత్ర పవిత్రోభయ కవిమిత్ర వేంకటకృష్ణార్య పుత్రులును, విబుధ వైష్ణవ విధేయులును శ్రీమన్మంగళగిరితోఁ జేరిన నంబూరి నివాసులును, శ్రీ రామానుజ యోగీంద్రాపర నామధేయులగు నేలకొండపల్లి జియ్యంగారి శిష్యులును నగు శ్రీమత్కేశవాచార్య లనువారిచే నీ యాచార్యసూక్తి ముక్తావళి యను గ్రంథము గద్య పద్యాత్మకంబుగా రచింపబడియె. ఇందు గురు పరంపరా ప్రభావము, యతీంద్ర ప్రవణ ప్రభావము మొదలగు గ్రంథములను శిష్ట సంప్రదాయము ననుసరించి పన్నిద్దఱాళ్వారులయు తక్కిన నిత్యసూరులయు ఆచార్యకోట్లయు ప్రభావాదులు స్పష్టముగా నభివర్ణింపబడియె.

ఇది పూర్వభాగము, మధ్యమభాగము, ఉత్తరభాగము అని మూడు భాగములుగ విభజింపబడియున్నది. పూర్వభాగము ఆఱుల్లాసములుగను, మధ్యమభాగము పంద్రెండుల్లాసములుగను, ఉత్తరభాగము ఆఱుల్లాసములుగను అంతర్విభాగము చేయబడియున్నది.

శ్రీగ్రంథమునకు కృతినాయకులు శ్రీ రామానుజ సంయమీంద్రులు.

ఈ గ్రంథము మొదటి రెండుభాగములు, మూడవ భాగమందు యయిదు యుల్లాసములు కేవలము సీసపద్యములు, వచనము. వీనిచే చేయంబడ్డందున ప్రౌఢులగు పండితులకుఁ గొందఱకు నిక్కవిత్వము ఇంపు కాలేదు కాఁబోలు. భగవద్భాగవత సత్సంప్రదాయాది విషయంబు లిందుఁ జెప్పఁబడుటచే నవియన్నియు యెల్లరకు సులభ బోధ్యంబులుగ నుండుటకై యా క్రమంబును గ్రంథకర్త యవలంబించి యుండునే కాని వేఱొండుగా నుండదు. ఈ గ్రంథంబునం గవి యనాదరణంబుచే లాక్షణికంబులగు తప్పులు పొసంగియున్నది. వానికిని పైఁ జెప్పినదియే కారణం బని యూహింపవచ్చును. చెఱకునకు వంకరగుటచే జెడదు తీపి అన్నట్లు విషయ వైలక్షణ్యంబునుబట్టి యట్టివానిని నాదరింపవచ్చును.

ముందు మచిలీ బందరు సరిబిల్లి పేటయందు గాపురముండినవారును, శ్రీమదుభయ వేదాంత ప్రవర్తకేత్యాది విశేషణ విశిష్టులగు శ్రీమాన్ పురుహోళ్ళ శోభనాద్రాచార్యులవారి శిష్యులును, మదనస గోత్ర సంభూతులు నగు వెత్సా భామయ్యగారికి ధర్మపత్ని నరసమ్మగారివలన గోపాలకృష్ణమ్మ, లక్ష్మయ్య, ధర్మపురి యను ముగ్గురుపుత్రు లుద్భవించిరి. నీ మువ్వురు భాగవతాభిమానముఁ గలిగి ప్రపన్నకోటితోఁ జేరినవారు. వీరిలోఁ గనిష్ఠు లగు ధర్మపురిగారి ధర్మపత్నియగు యతిరాజమ్మగారివలన వెత్సా శేషాచలము అనం బరఁగు కొమారుఁడును, చిన్నము చూడమ్మ, నరసమ్మ, ఆత్మకూరి రామానుజమ్మ అను మూవురు కూఁతులును బుట్టిరి. అందు ఇక్ష్వాకుకుల గోత్ర సంభూతులయిన ఆత్మకూరి వేంకట నరసింహముగారి ధర్మపత్నియును, రాజమహేంద్రవరము జిల్లా కాకినాడయందుండు నామెయు, శ్రీమదుభయ వేదాంత ప్రవర్తకులును, శఠమర్షణ గోత్రజులును అగు శ్రీమాన్ తిరుమల రాఘవాచార్యులవారి తిరువడి సంబంధు లయిన ఆత్మకూరి రామానుజమ్మ, శ్రీమాన్ నల్లాని రామానుజాచార్యుల గారి తిరువడి సంబంధులును సాధు విధేయులును, చూడమ్మగారి కుమారులును అగు చిన్నం వేంకట గోపాలముగారి ప్రేరణచే అఖిల భాగవతుల కును అత్యంతోపాదేయమై సత్యా........బయి యుండెడి........ప్రదాయ గ్రంథమును సేవింపవలెననియు .......ముముక్షువులకును సమగ్రముగా గ్రంథము దొరకకుండుటయు.... ...కొద్దిపాటి గ్రంథమును భ్రమప్రమాదాది జనిక దోష భూయిష్ఠంబగుటయే కాక, పద్యములు చక్కఁగా జరగ కుండునట్టి తప్పులు మెండుగ నిండుకొని యుండుటయును బరికించి చిరకాల మతిప్రయాసము పుచ్చుకొని యనేకములు వ్రాతప్రతులను దెప్పించి యిప్పించి పరిష్కరించి ముద్రింపించునటుల చెప్పుటచే నా ప్రకారమే యీ గ్రంథమును సమగ్రముగ నతి శ్రద్ధాభక్తులతోఁ బరిశీలించి సజ్జనగోష్ఠులకు నుపయోగించునటుల ముద్రింపంబడియె.

ఈ గొప్ప గ్రంథము ముద్రించుట యిది నూతనము గాన, అక్కడక్కడ నొక ప్రతి తప్ప మాకుఁ బంపబడిన ప్రతులన్నియు కొఱఁతగా

నున్నందునను గొన్ని పొరబాటు లుండవచ్చును భ్రమప్రమాదంబులు మానవధర్మంబులు కావునను, కార్యప్రవృత్తులకుఁ గాక యితరులకుఁ బొరఁబాటు లుండవు. కావున, వాని నోర్చి మా తప్పుల మన్నించి నీటిం గలిసిన పాలను గ్రోలు హంస చందంబునఁ బ్రవర్తిల్ల సాత్వికులును. విశిష్టాద్వైత మత సిద్ధాంత ప్రవర్తకులును నగు సజ్జనుల కందఱకు నతి వినయంబుతోఁ బెక్కు వందనంబు లాచరింపబడుచున్నవి.

[ఈ ప్రతి అత్యంత ప్రాచీనమైనది ఇది ప్రథమ ముద్రణమని యుపోద్ఘాతాంతమున చెప్పబడుటచేతను, కాగితములు ముద్రణ పద్ధతినిబట్టి చూడగా, గత శతాబ్ది చివరభాగమున "చిలక ప్రెస్సు" లనబడు యంత్ర ములతో తయారించబడినట్లు కనుపించుచున్నది. కాగితములు నలిగి అక్షర ములు నశించినచోట్ల చుక్కలు పెట్టబడినవి. ఈ గ్రంథ ప్రథమ ముద్రణ శ్రీమతి ఆత్మకూరి రామానుజమ్మ, శ్రీయుత చిన్న వెంకటగోపాలంగారలని చెప్పబడినది. వీరిరువురు వైశ్య కులాలంకారులని చెప్పనొప్పును. ఇందు ప్రకటించిన రెండు యుపోద్ఘాతములవలన యీ గ్రంథ ప్రాశస్త్యము నెఱుగవచ్చును. —ప్రకటనకర్త.]

# శ్రీ జమిలి నమ్మాళ్వార్ ధర్మనిధి (రి) గుంటూరు

ఆశలు - ఆశయాలు :

1. విశ్వ సౌభ్రాతృత్వము
2. భారతీయ వర్తక వాణిజ్య సాంస్కృతిక వికాసము
3. కవి పండిత ప్రోత్సాహము - సన్మానము
4. సాంస్కృతిక, సాంకేతిక విద్యార్థి ప్రోత్సాహము
5. పుస్తక, వార్తాపత్రికల ప్రచురణ ప్రచారము
6. విశ్వసాహితీ ప్రచారము
7. మహామహుల జీవితాశయ ప్రచారము
8. వైదిక విజ్ఞాన ప్రచారము    9. ఉచిత ఉపనయనాదులు
10. వర్ధంతులు - జయంతులు    11. అన్న వస్త్ర దానము
12 ఇందుకు సంబంధించిన యితర కార్యక్రమములు.

స్థాపక వ్యవహర్త: పండిత శ్రీ జమిలి నమ్మాళ్వారు

## Sree Jamili Nammalvar Dharma Nidhi

(Reg.) GUNTUR - 3

**No 1175/31—3—60, Sub-Registrar, Guntur**

### IDEALS & OBJECTS

1. To promote International Co-operation, Friendship and Understanding by strengthening cultural connections. 2. To promote Indian Art, Culture Religion, and Trade. 3. To encourage Poets, Pundits, Writers and Artists and award prizes, scholarships and monthly allowanees to such people. 4. To organise study groups, vocational schools and colleges, seminars and melas and help students. 5. To print, publish, purchase, sell and distribute books, Pamphlets, Magazines, Newspapers, in furtherance of the objects of the Nidhi. 6. To print, publish, sell and propagate in Indian Languages the great classics of the world. 7. To propagate the teachings and ideals of Mahatma Gandhi and Amarajeevi Potti Sree Ramulu in Indian Languages. 8. To Promote the study and development of Sanskrit and Vedic knowledge among all classes of Indians. 9. To help Vysyas for education, marriage, thread marriage and other social necessities. 10. To celebrate the Jayantis and Vardhantis of great Vysyas. 11. To arrange for poor feeding on all suitable occasions. 12. To do every necessary act in this connection............

*Founder - Correspondent :*

PANDIT SRI JAMILI NAMMALVAR
Patnam Bazaar, Guntur-3.

# ప్రచురణలు

1. శ్రీ కన్యకా సుప్రభాతమ్
   పండిత శ్రీ జమిలి నమ్మాళ్వారు, గుంటూరు
   అష్టోత్తర శతనామావళి సహితమ్
   ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభవారి పోటీయందు
   బహుమతి నందుకొని, వారిచే వైశ్యుల ఆదికారిక
   గ్రంథముగా నిర్దేశింపబడినది .... రు. 0-50

2. శ్రీ కన్యకా సుప్రభాతమ్ గ్రామఫోను రికార్డులు 2 కి
   నేపథ్య గాయకుడు శ్రీమాన్ పి బి. శ్రీనివాస్‌చే
   పాడినది .. రు. 14-00

3. శ్రీ కన్యకా పురాణము
   కీ॥ శే॥ శతావధాని దోమా వెంకటస్వామి గుప్త ... రు. 10-00

4. సుప్రభాత సముచ్చయము
   (1) శ్రీ వెంకటేశ్వర (2) శ్రీ మల్లికార్జున
   (3) శ్రీ భద్రాద్రి రఘురామ (4) దశావతార
   (5) శ్రీ లక్ష్మి (6) శ్రీ మంగళాద్రి లక్ష్మీనృసింహ
   సుప్రభాతములు . రు. 0-50

5. కుసుమగుప్త
   ఏకపాత్రాభినయ నాటిక . రు. 1-00

6. పరమేశ్వరీ ప్రభావము లేక ధర్మవిజయము
   శ్రీ వాసవి కన్యక కథ—బుర్రకథ . రు. 1-00

7. గాంధి మహోపదేశమ్
   గాంధి బోధనల సారమంతయు 16 శ్లోకములలో
   ఇమడ్చబడిన గ్రంథరాజము—16 చిత్రములతో .... రు. 0-25

---

ప్రచారకులకు ప్రత్యేకమైన ధరలు

# వైశ్యధర్మ ప్రకాశికా

సంకలనమ్

బ్రహ్మశ్రీ ఆత్మూరి లక్ష్మీనృసింహ సోమయాజీ

---

ఇందు వైశ్యుల కత్యంతావసరములైన విషయములు
ధర్మములు - విధి నిషేధములు సంకలింపబడినవి

శ్రీ శంకర రామానుజ మధ్వాచార్యుల యొక్కయు
శ్రీ మద్వాసవ కన్యకా చరిత్రా సంగ్రహములు కలవు

ప్రాచీన వైశ్యవైభవము వివరింపబడినది

నూటరెండు గోత్రములు - ఋషి నామములు - సంకేత నామములు
ఇండ్ల పేరులు మొదలగునవి కలవు

దళసరి ఆఫ్‌సెట్ పేపరుమీద ఫుల్ క్యాలికోతో ముద్రణ

ప్రతి వైశ్యుని యింట యుండవలసినది

వెల రు. 12 లు

వివరములకు
శ్రీ జమిలి నమ్మాళ్వార్ ధర్మనిధి (రిజిష్టర్డు) గుంటూరు-3

# శ్రీ కన్యకాపురాణము

కర్త: కీ॥ శే॥ శతావధాని దోమా వెంకటస్వామిగుప్త

ఉన్నతస్థాయికి జెందిన ఆంధ్రప్రబంధము

వచన కధాసంగ్రహము కలది

కాగితము - అచ్చు - కూర్పు చక్కనిది

శుభకార్యములలో బంధుమిత్రులకు బహూకరించతగిన ఉత్తమ గ్రంధము

వెల: పది రూపాయలు మాత్రమే

ప్రతులకు

శ్రీ జమిలి నమ్మాళ్వార్ ధర్మనిధి (రిజిష్టర్డు) గుంటూరు-3

---



గర్తపురవాసి విష్ణుభక్తాంఘ్రిరేణు
వరపులస్త్యస గోత్రుండు; వైశ్యవరుడు
జమిలి వంశ్యుండు వైదిక సత్పధుండు
సుబ్బరామాఖ్యునేకైక సుతుడు; బుధుడు
నమ్మయాళ్వార్ ప్రకటితమ్మొనర్చె—